




ఓలేటి వేంకటరామశాస్త్రిగారు.

—:0:—

మ॥ విలసద్వర్ణగుణప్రలోభనములై విష్కాల్ ముదంబొప్ప నీ
గళసీమాభరణంబుసేయ, నిజశృంగారప్రియత్వంబునన్
జలజాక్షీమణు లుత్తమాంగములనిచ్చల్ నిర్ధరింపన్ దిగం
తలసత్సౌరభ వైభవంబులఁ బ్రమోదం బీఁగదే రాఁగదే॥

మ॥ రసహీనంబులు వర్ణగౌరవ సుదూరంబుల్ వినిర్గంధముల్
కుసుమంబుల్ గల వెన్ని యైనయును; ద్వ్యస్తాంఘ్రి క్రియావేళఁ ద
త్ప్రసవశ్రేణి నెడంగి, పోఁదోలఁచి నూత్నస్వర్ణపుష్పంబులన్
రసికానంద విధాప్రధానగుణ సంరంభంబులన్ దాల్పుమా!

మ॥ సరసీజాత విశాల నేత్రల యుదంచత్సౌళిభాగస్థితిన్
స్వరసజ్ఞప్రకరప్రమోదకర దివ్యస్రగ్జ సౌరభ్య ని
ర్భర సందర్భ విలాసభాసుర సమారంభంబులన్ దేవతా
చరణాలంకృతి నొప్పఁగన్నపుడ నీ జన్మంబు సార్థంబగున్॥


విషయసూచిక



సంపాదకుడు — చిత్రపు హనుమంతరావు

| సంపుటము ౧ | జనవరి 1927 | సంచిక ౧ |
| --- | --- | --- |

# సమర్పణము.

భారతవర్షము, విశ్వవ్యాపనశీలుఁడై చరాచరప్రపంచమునంతను విశ్వమయుఁడై "అణోరణీయాన్ మహతోమహీయాన్" గ విశ్వరూపముఁ దాల్చిన ఆనందస్వరూపియగు భగవానునికి మకుటాభరణము.

"ఆశైలాదద్రికన్యాచరణకిసలయన్యాసధన్యోపకంఠాదా రక్షోనీత సీతాముఖకమల సముల్లాసహేతోశ్చ సేతోః" అయిన భారత భూమాత పుట్టుకతోడనే పవిత్రవంతములగు గంగా యమునలకును, హిమవత్పారియాత్ర వింధ్య శ్రీశైలాదిపవిత్రమహీధరములకును కురుక్షేత్ర, నైమిశాటవి, పుష్కరతీర్థ, బదరీవన, కన్యాకుమారి మున్నగు భగవదావాసంబులకును నిలయమై మనుమాంధాతాది మహీపతులచే తొల్లి వైదికమార్గమున పరిపాలింపబడి సమస్తభూమండలమునకును నాయకమణియై విరాజిల్లెను.

శ్రీరామచంద్రుని అవతారావిర్భావమునకు మున్నే ఆదికావ్యమగు రామాయణమును రచించిన వాల్మీకి కోకిలము నేటికిని

పవిత్రమగు గోమతీతీరమునుండి నైమిశారణ్యమునందలి గహనాంతరాళము ప్రతిధ్వనించునటుల రామతారకమును గానముచేయుచుండెను.

కాశ్మీర దేశమునందలి శ్రీనగరముగను లక్ష్మీ మహాతల్లికి ప్రకృతియొసంగెడి పద్మాసీతము మఱి యే భూభాగమునందుగలదు ? ప్రాక్సముద్రముతో సంగమించెడి గంగాసాగర సంగమక్షేత్రమగు కాళీఘట్టమునందలి భద్రకాళియు పశ్చిమ క్షితిధరములకు పుట్టినిల్లగు అరేబియా అబ్ధితీరమునందలి ముంబాదేవియు, భారతలక్ష్మియొక్క భద్రతను సర్వతో భద్రముగ కాపాడుచుండెను.

ప్రాక్సముద్రతీరమున కధి దైవతము జగన్నాథుడును పశ్చిమ సముద్రతీరమున కధి దైవతమగు ద్వారకానాథుడును, వైకుంఠమున గదాదండముల ధరించిన జయ విజయులవలె-హేతల్లీ! దుర్జన భంజనోద్యుక్తములగు శంఖచక్రములను ధరియించి నీప్రాక్పశ్చిమ సరిహద్దులను గాపాడుచుండిరి.

ఆనాడు "ధర్మక్షేత్రే కురుక్షేత్రే" మధ్యమ ఆధ్యాత్మిక రథారూఢుడై పూరించిన శాత్రవ భయదనిస్వనమగు శ్రీకృష్ణభగవానుని పాంచజన్యధ్వానము నేటికిని భారతవర్షమునందేగాక సమస్త భూమండలమునందును అంతరాళము మాఱుమ్రోగునటుల భగవద్గీతార్థ ప్రతిపాదకమై ప్రతిధ్వనించుచుండెను.

ఒక్క భారతవర్షమునకేగాక సమస్త భూమండలమునకును గూడ ఆధ్యాత్మిక విద్యుల్లత ప్రసరించునటుల తోడ్పడుటకుగాను భారతలక్ష్మి తన సర్వస్వమును ఈశ్వరప్రీతిగ శ్రీ కృష్ణార్పణముగావించి సన్యాసినియై కాషాయవస్త్రములను రుద్రాక్షమాలను చేబూని ప్రాక్పశ్చిమ క్షితిధర యుగళమున రత్నాకర మహావాహినుల సంగమస్థానమగు ఆదిసేతువగు కన్యాకుమారీక్షేత్రమున కధిదేవతయై మంత్రి సింహాసనమునందధిష్ఠించి ఆధ్యాత్మిక జ్ఞానోపదేశము నార్షమగు గురువువలె ప్రబోధించుచుండెను.

హే భారతవర్షమా! నీజన్మ ధన్యము.

శ్రీకృష్ణ చరణచిహ్నాంకితంబగు నీ మేనును స్పృశించిన మానవకోటికి యిహజన్మమునందే జీవన్ముక్తి. "నాన్యః పంథా అయనాయవిద్యతే" మానవకోటికి నీ పద సమారాధనంబుకంటె వేఱొండు బ్రతుకు తెరవు గన్పట్టదు. ఓతల్లీ! హస్తినాపురమునందు యుగములు గతించినను గూడ త్రుప్పుపట్టని యినుప స్తంభమును పోతపోసిన నీ గాదిలి బిడ్డ నాగార్జునిని సిద్ధహస్తము-నైమిశారణ్యమునందు భారత రామాయణాఖ్యానంబుల గల్పించిన మహర్షిపుంగవుల జ్ఞానజ్యోతి-వారణాసీ క్షేత్రమునందు మనుజులకేగాక పశుపక్ష్యాదులకు కూడ శస్త్రచికిత్సల నొనరించిన సుశ్రుతాచార్యుని విజ్ఞానలతిక-అలగ్జాండరు దండయాత్రికుని హిమాలయముల అవలిగట్టునకు తరుమగొట్టిన రాజకంఠీరవుడు పురుషోత్తమనృపతిని శస్త్రధార-ఆగ్రా నగరమునందు తాజ్ మహాలువంటి కనకమయ సౌధమును నిర్మించిన శిల్పాచార్యుల హస్తకౌశలము-అజంతా గుహాలలో బుద్ధదేవుని యప్రతిమాన మూర్తులను పంచరంగులలో సమ్మిళితముచేసిన చిత్రకారుని లావణ్యమయకూర్చ-సంస్కృత భాగవతముకన్న మిన్నయగు శైలిలో నాంధ్రభాషయందు భాగవత సుధారసమును వర్షింపజే

సిన బొమ్మెర పోతన్న చేతియందలి యిక్షుఘంటము - శత్రుసైన్యములగుండె లవియునటుల చతురంగ బలములను బారులుగట్టి నడిపించిన కృష్ణరాయల యుద్ధకళానిపుణత - హంపీ విజయనగర సామ్రాజ్యమునందలి అంతఃపుర స్త్రీలు జలకమాడెడి చలువరాల పన్నిరు కాల్వల స్నానశాలలలోనికి తుంగభద్రా నదినుండి కల్పించిన జలనాళికల సొంపు-సొగసుగా మృదంగతాళముల జతగూర్చి నాదోపాసనజేసే త్యాగరాయల వీణె వాయింపు అన్నియు నేడు నిహృదయాంతరాళమునం దంతర్గర్భితమగుటచే నీవాసి చెడి నీ దిగంత విశ్రాంతకీర్తికి యుపయశంబు వాటిల్లుటగాని వేఱొండ గాదు.

నాగార్జునుని రససిద్ధి — శౌనకాది మహర్షుల చరిత్రయల్లిక - సుశ్రుతాచార్యులశస్త్రచికిత్సా నైపుణ్యత - ఆనాటి పురుషోత్తమ కృష్ణదేవరాయాదుల యుద్ధకౌశలము, ఆగ్రానగరమునందలి తాజ్ మహాలు యొక్క శిల్పసౌందర్యలహరి, అజంతాచిత్రరూపులయందలి లలితకళారహస్యము, హంపీ విజయనగర సామ్రాజ్యమునందు జలనాళికలను నిర్మించిన యింజనీయరింగు విజ్ఞానము, బమ్మెర పోతరాజుని బాలరసాలసాలనవపల్లవకోమలకావ్యకన్యకామణియందలి రసరాజలక్ష్మి - వాగ్గేయకారకులగు శ్రీమత్త్యాగరాజుల గానరసస్రవంతి అన్నిటిని యొక్కుమ్మడి గుదిగుచ్చి ఆవాడు క్షీరసాగరుడు క్షీరాబ్ధిశయనునికి వైజయంతీ పుష్పదామము నుపాయనముగ నొసంగినటుల, నేడు నీకంఠాభరణముగ సమర్పించెదము మా పుష్పమాలల నంగీకరింపుము.

హే భారత జననీ! నీకాలుగ కంటినిదు దనుకట్టుబయలుబడి పొరలక [illegible] బాష్పములతో [illegible] హించి మా కోర్కెల నైకొనుము [illegible]! నమోస్తు పరదైవతమ్.

ఓం తత్సత్.



# ప్రణయ జీవనము

పురిపండా అప్పలస్వామిగారు (కవితాసమితి.)

ప్రణయరసపూర్ణ చారుహాసిని, ప్రసూన
బాలికామణితో నూత్నప్రణయ గరిమ
లీలబాదలేదు భావమాలికలనెల్ల
గీతఘోషితినిఁ జూపుచుఁ గేరుకొనుచు
జగము సర్వమ్ము హర్ష సంజనితమనుచు
గంతులిడుకొంచు ముందువెనుకలనుఁ గనక
నేలయుప్పొంగిపోయెద వింతలోనె?
అళికుమారక! విను మింత కులికెదేల?
నీవు గాంచి యుప్పొంగిన పూవురాణి
నీవు కూరిమి నెఱపిన పూవురాణి
నీవు మంతన మాడిన పూవురాణి
నీవు ప్రాణంబుగా నెంచు పూవురాణి
కాలవశమున ఖరకరు కరముసోకి
ఎపుడు వసివాడిపోవునో యెవరికెఱుక?
ఎపుడు తనువుఁ దొఱంగునో యెవరికెఱుక?
ఎపుడు భూమిపై రాలునో యెవరికెఱుక?
ఎపుడు రూపఱిపోవునో యెవరికెఱుక?

* * *

అంచితానందమునఁ దేలియాడు నీవు
ప్రేమకాననమున విహరించు నీవు
భూరి సంతాపమునఁ దూలిపోయెదేమొ?
ఘన వియోగాగ్నిఁ బడి కడుఁ గనలెదేమొ!

* * *

ప్రణయజీవన మాశించువారికెల్ల
కడకు చేకూరు ఫలము దుఃఖమ్మె కాదె!!



# మృచ్ఛకటిక.

పురాణం సూరిశాస్త్రిగారు, బి. ఏ.



రూపకమును దొలుదొల్త గీర్వాణ ప్రాకృతంబుల రచించిన మహాకవి, శూద్రకుడను భూపాలుడు. ఈతడు కాళిదాసునకు పూర్వుడని కొందరు పండితోత్తము లభిప్రాయపడుచున్నారు. దరిద్రచారుదత్తమను పేరిట బరగు భాసకవికృతి నొకదాని మాతృకగ గైకొని, పెంచి, సర్వజనాహ్లాదసంజనకంబుగ మార్చి, రచించినట్లగపడును. దీనిని గీర్వాణాలంకారికు లంతగ గొనియాడకున్నను, పాశ్చాత్యపండితులపూర్వ ప్రతిభావిరాజితంబుగ నెంచుచున్నారు. హెచ్. హెచ్. విల్సను, మున్నగువారు దీని నాంగ్లభాషలోనికి గద్యపద్య సమన్వితంబుగ సంతరించి ప్రాచ్యరూపకములలో నెల్ల ప్రశస్తమగు దానిగ నుగ్గడించిరి. హిందీ, కర్ణాటకాది భారతీయదేశభాషలలో దీని యనువాదముల రచించి ప్రదర్శించుచున్నారు. తెనుగున తిరుపతివెంకటేశ కవిపుంగవు లిద్దాని సరసముగ నైజరసస్ఫూర్తి నిండు వెలుగున రాజిల్లునట్లు రచించి యాంధ్రుల కృతజ్ఞతకు బాత్రులైయున్నారు.

—(రూపక ప్రాశస్త్యము)—

మృచ్ఛకటిక భారతీయ నాటకము లన్నిటిలో బ్రదర్శనానుకూలమై సకల సామాజిక సంతోషదాయకంబై, నిరుపమానమై, యపూర్వమై పాశ్చాత్యరంగాలంకారభూతంబులగు నుత్కృష్టరూపక రత్నములతో నెన యగుచు పండితపామర జనంబులచే సమానగౌరవంబున మన్నింప దగియున్నది. ఇతర నాటకములలో నెద్దియో యొక ప్రధానరసము మొదటనుండి తుది వరకు కథాభారమును దాల్చుచుండ, నచ్చటచ్చట నలంకారలక్షణసంతృప్తికొరకు నవరసస్ఫురణ గిలికింపబడుచుండ మృచ్ఛకటికలో నవరసములు సమానప్రపత్తి నొంది యున్నవి. భాసకృతులు కోమలసద్భావభరితములై లలితపదాలంకృతములై సాధురసతుల లేతతళుకులతో, జంద్రునినావరించు పరివేషమం దగుపడెడి ముత్తెంపు వెలుగు జిలుకులతో, జెన్నొందుచు, పాఠకులకెంతయు బ్రీతికరముగ వినబడుచుండును. కాళిదాసునాటకములలో పనివడి మెరుగు వెట్టిన కావ్యశిల్ప మగుపడును. భవభూతిలో గరుణాభయానకంబు లుదారభావ విస్పష్టతతో పొంగలిడి పొర్లుచుండును. వేణీసంహార ప్రసన్న రాఘవాదులం దుద్భటపద పటిష్ఠత భారతీయ మహావీరులదండిగుండెను

జాటుచున్నది. కాని వీనియన్నిటిలో నేదో
నొక గాఢ ప్రధానమై తక్కుంగలవృత్తాం
తమును మిగ్రింగివైచును. ఈసందర్భమే మన
దేశమందాడబడు నాటకము లన్నిటి నావే
శించియున్నది. ధీరనాయకుల గైకొని వారిని
కష్టపరంపరలో దేల్చి యార్చి తుదకు ధీర
త్వముచే వారు కంటకశతంబులదాటి మిన్న
లై నిజసత్వమును సమర్థించి, యీప్సితార్థ
మును సంపాదించిన యుదంతములు భార
తీయ నాటక కవులభిమానించుచుందురు.
కథాసరళిలో గొన్ని భిన్నవ్యక్తు లగుపడి
నను వీరందరు ఆధికారిక వృత్త పరిణామము
నకే దోడ్పడుచుందురు. కథాంశము నాయి
కానాయకుల సర్వస్వమని చెప్పవచ్చును.
అందు శాకుంత లోత్తరరామచరిత్ర రత్నా
వళీ హరిశ్చంద్ర ప్రహ్లాద సావిత్రి నళాది
నాటకములు కూర్పులో నెంత సమంజస
ముగనున్నను ప్రదర్శనమం దొకింత విసు
గొందించుచుండును.

— ఫలబాహుళ్యము —

మృచ్ఛకటికలో వసంతసేనా చారు
దత్తుల ప్రణయవృత్తాంతమే యాధికార
కథాంశమయ్యెను--జూదరియై, తప్పుదారుల
నడుగుజారుచుదీనదశంజిక్కిన సంవాహకుడు
పశ్చాత్తాపమొంది బౌద్ధాశ్రమ మూని
ద్యూతక్రియా నైజమగు మనశ్చాంచల్య
మును వదలి సుస్థిరమగు భక్తి విశ్వాసము
లలవరచుకొని భూతదయాసిద్ధుడై పండితాళీ
శ్వచన ప్రాప్రకైవల్యసిద్ధుల ప్రోడయై యు
ల్లరిచిల్లరి సంగడీకులతో దిరుగనేర్చిన శ
ర్విలకు డాపత్కాలమున దనమిత్రుడగు
నార్యకుని బంధవిముక్తు గావించి గద్దియ
నెక్కించి యుదార స్నేహస్వరూపమును
ప్రకటింప గల్గుటయు, గొల్లడై పుట్టిన ఆర్య
కుడు రాజధానిలో విశ్వాసపాత్రులగు మి
త్రుల సంపాదించి వారితోడ్పాటున రాచరి
కమొంది, యిట్టి యచింతిత మహద్దశాప్రా
ప్తి గల్గిన వెనుక కష్టకాలములో చేయూత
నొసంగిన వారిని మఱువకుండుటయు, —
మొదలగు ఫలము లీనాటకములో నగప
డును. ఫలసిద్ధిచారుదత్త వసంతసేనల దొక
రిదేకాదు — సంవాహకుడు బుద్ధుడైనాడు,
శర్విలకుడు మదనిక బొందుగలిచి, తనమి
త్రుడగు ఆర్యకునకు రాచరిక మేర్పరచెను.
ఆర్యకుడు రాజ్యాభిషిక్తుడాయెను. చారుద
త్తునకు గల్గిన లాభము వసంతసేనకాదు.
కథారంభము నుండి కథాంతము వరకు
వసంతసేనవానిదే. శకారుని జీర్ణోద్యానమున
వసంతసేన ప్రాణాపాయమునకు బాలైనను,
ప్రథమ ప్రవేశమునుండి శకారునిచే దరు
మబడినను, వసంతసేనా చారుదత్తులకు
వియోగమెన్నడును కలుగలేదు. నిరపా
యముగ నిరాటంకముగ తమవలపు బొగ
రుల దీర్చుకొను నవకాశము జిక్కుటయే
వీరిశృంగారకథాంశపు పరిణామము. వియో
గము చారుదత్తునకును, నాతని గృహలక్ష్మి
కిని గల్గెను. కథాఫలితముగ జారుదత్తుని
గృహలక్ష్మిమరల నాతని చెంతజేరినది. శకా
రుడు పరమనీచుడై యబలామారకుడై శిక్షా
ర్హుడయ్యును, క్షమాఫలమొంది సంతస
మున గంతులిడగల్గెను. ఈపాత్రములన్ని
యు తోలుబొమ్మల్ల లోపభూయిష్టములై జిక్కు
లబడినను భక్తివిశ్వాస సుహృల్లక్షణాది
సద్గుణంబుల కునికిపట్లై కథాంతమున నిజస్వ
భావ ప్రభావమున సద్గతినొందియున్నారు.
నల్లురెమగురు పాత్రలకు వేశ్వేరు ఫలసిద్ధు
లమరుటయు, వీరిభిన్నవృత్తులు ప్రత్యేక

కథాంశములు నాటకాంశమున జేరియుండుటయు నీనాటకములోని ముఖ్యవిశేషము.

## — కాల్పనిక వైచిత్ర్యము —

ఇంతకన్నను గొప్పసంగతి యేమన వీరందరు నాయికా నాయకులకు సంబంధించినవారు కారు. వీరి ప్రవృత్తులు ప్రయత్నములు అధికారిక కథాసందర్భమున జనించినవికావు. దానికి తోడ్పడుటకుగాని దాని నడ్డగించుటకుగాని సంకల్పింపబడినవికావు. సంవాహకుడు, శర్విలకుడు, ఆర్యకుడు, చందనకుడు, సూతుడు, మొదలగువారెవరి గోలలో వారుండి తమతమ కార్యముల స్వయముగ నిర్వహించుటలో నధికారికవృత్తాంతమునకును, పరిణామ కళ్యాణమునకును, తలవని- తలపుగ దోడ్పాటులైరి. చారుదత్తుని మహనీయ సద్గుణములందాదరణయు, ప్రతినాయకుండగు శకారుని వెకిలిచందముల కేవగింపు తప్ప వేరొండు సామాన్యసంఘీకరణ సందర్భములింపున గానుపింపవు. అధికారిక వృత్తాంతమున కుపాంగములుగగాక, దానికి దోడ్పడునుద్దేశ్యముగాక, స్వకీయమనస్సంకల్పముల గొనసాగింపజూచు తెరవున నాచరించుచు నీప్సితార్థములం బడయుచు, నిజచారిత్ర విభ్రంశములో కూడ, సదాచార పాతిత్యములో గూడ నుదారస్వభావముల బ్రకటించుకొనుచు నాటకపాత్రలు వేర్వేరు తెరవులవర్తించి, కాకతాలీయముగ ప్రధానకథాసంతోష సమాప్తికి నిస్సంకల్పముగ దోడ్పడిరి. వసంతసేన బ్రతుకుటకు సంవాహకుని సన్న్యాసమాధారమాయెను. చారుదత్తుడు మరణదండనము తప్పించుకొని, జీవించి, భాగ్యోపేతుడై, క్రిమ్మర వెలుగొందుటకు, ఆర్యకుని రాజ్యాధికార సంప్రాప్తి హేతువాయెను. ఇందుకు శర్విలకుడాదిగాగల సంగడీడుల సుహృల్లక్షణములు సాహాయ్యభూతములాయెను. ఈకారణములచే మృచ్ఛకటిక నాటకప్రపంచములోనెల్ల కల్పనాచాతుర్యమందును, కథాపాటవమందును, నిరుపమానమైయున్నది.

## — ప్రదర్శనానుకూల్యత —

శకారునివంటి విపరీతపాత్రమెందునను గానరాదు. వాని వెకిలితనము, పిరికితనము, మేకపోతుగాంభీర్యము, కత్తిఝుళిపింపు, నీచలకులికిపాటు, నీచశృంగారమున్నగు భగినీభగభాగ్యసంభూత వైభవసహజంబులగు దుర్నయ దుర్నీతిప్రచారములన్నియు ననామాన్యముగ, ససాధారణముగ, నవ్వుబాటుల కునికిపట్టులై, చదివినవారిని జదువనేరని లేతమనస్సులను ప్రక్కలుబ్బ నవ్వింపజేయును. దొంగలొస్తారు, జూదరులొస్తారు, ముండలముతాకోరులొస్తారు, కోర్టుసీనువస్తుంది, వురిదీయడం, వాన కురియడం, మేడమీదనుండి దూకడం, సంకెళ్లు తెంచుకోడం, కన్నాలు వేయడం, డప్పులబాదడం, పాకగుళ్లు, పేదయిళ్లు, రాజభవనాలు, పాతకోటలు, వన్యానేకసమాలంకృతంబులగు విహారోద్యానములు, బండ్లు, పోలీసులు, రాజ్యాలుతల్లక్రిందులవడం, వున్నవారికి లేకుండపోవడం లేనివారికి రావడం, మైత్రేయుని ఆవలింపులు, అబ్బో! యివ్వన్ని యెంతచిత్రంగా, యెంతతమాషాగా, క్రొత్తగాషోకీగా ఒక్కచోట, ముత్యాలపేరులలో రత్నాలుపొదిగినట్లు కూర్పబడ్డాయి. రెప్పవాల్చుటకు, ఆవలించుటకు క్రీ సిగరెట్టులనైన నాస్వాదింప బయటకు

పోవుటకు, పేలాసంగుకల్పనాచాతుర్యమీనా
టకమున విలసిల్లి ప్రేక్షకులందరిని మంత్రి
నిబద్ధభుజంగంబులవలె గట్టివైచెడి నేర్పు
పెంపు లీరూపకమున నగపడుచుండును.

—♦ పాత్రస్వభావ వైపరీత్యము ♦—

ఇందలి ప్రధానపాత్రలందరిలో విరోధాభాస మగపడుచుండును. "దారిద్ర్యదోషోగుణరాసినాశీ" అని పెద్దలు చెప్పుచుండ దారిద్ర్యనిపీడితుడైన చారుదత్తుడు సంచితలపుల పుట్టయై మహోదార స్వభావసంపదలెల్లవేళల దోడ్పడుచుండ గీర్వాణరూపక నాయకులలో నిస్తులధీరుడై వాసికెక్కుచున్నాడు. తనయింట దొంగలుపడి వసంతసేనయాభరణములు దొంగిలింప, నీసంగతి తెలిసినచో యామెరత్నాలపేరును స్వీకరింపదమ సహాతో జూదములో తానుపోగొట్టుకొంటిననియు ప్రతిఫలముగ రత్నమాలికను గ్రహింపవలెననియుఁ బంపెను. శర్విలకుడు, చతుర్వేదపారంగతుడగు సప్రతిగృహీతుని పుత్రుడైయొజ్జలగొలిచియోగాది సద్విద్యలనార్జించి "సహాసన్తి చరుదన్తి చవిత్తహేతోః విశ్వాసయన్తి పురుషంనతు విశ్వసంతి, తస్మన్నరేణ కులశీలసమన్వితేవ వేశ్యాః శ్మశానసుమనాయివ వర్జనీయాః" మున్నగు ధర్మముల నెరింగియు రండకోసము దొంగతనమూని దానిలో తనయోగమహిమలు, చౌర్యక్రియా నైపుణ్యమును, వెల్లడించి మదనికా స్వాతంత్ర్య సంపాదనమునకు వలయుధనమును దొంగిలింప సాహసించెను. ఆపెమీద మోహమింతటి యస్వాభావిక కార్యనియుక్తునిగ జేయ సమర్థమైనను యిన్ని చిక్కులబడి మదనికను సంపాదించుకొనినను, మిత్రుని యాపద్వృత్తాంతమును వినినంతనే నవవధూసమాగమసౌఖ్యాలాపముల వర్జించి మిత్రావనదీక్షితుడైనచ్చెలిజేర నరిగెను. చారుదత్తుని కూర్మిచెలికాడు, మైత్రేయుడు, సదుద్దేశములతో, నారని భక్తిప్రేమలుండియు, తత్తరపాటున నవివేకియై, పెక్కుచిక్కుల దెచ్చిపెట్టుచుండెను. వసంతసేన నగలు చోరగ్రస్తమగుటకును, అధికరణుని వద్ద నిస్సంశయమగుసాక్ష్యమును చారుదత్తునకు ప్రతిపక్షముగ గూర్చుటకును, ఈతని యవివేకము అమాయకము, తొందర, ప్రేమాతిశయము కారణమైనవి. శకారుడు విటుడు. దుస్సాంగత్య కలుషితుండయ్యెను మంచి వివేకి. పెద్దచిన్నలను, యుక్తాయుక్తములెఱింగి, సదుపదేశములను నొసంగెడివాడు. ఇట్టివిరోధాభాసస్వభావము లీనాటకమున, గన్పట్టుచున్నవి.

—♦ కథాంశము ♦—

ఉజ్జయినీ పురంబున చారుదత్తుడను బ్రాహ్మణుడు దయాసత్యాదిసద్గుణాలంకృతుడు. వణిగ్వ్యాపారమున నఖండైశ్వర్యమనుభవించినవాడు. అర్థిజనంబుల కల్పవల్లి. కాలవశంబున దొలకరి జల్లుచే సన్నగిలిన యంబుదములవలె పేదయయి యిడుముల గుడుచుచుండెను. నాటకారంభమున నీతని దారిద్ర్యము, జీర్ణగృహము, పేదరికమున ననుంగు చెలికాడగు మైత్రేయుడు కూడ ఆసదప్పుటయు జూపబడినవి.

ఆయూరిలో వారాంగ నామకుట భూషణంబును, అత్యంత భాగ్యోపేతయు సుకుమార తన్వంగియునగు వసంతసేన కామోత్సవ సందర్భమందు చారుదత్తుని మనోహరాకృతిని గాంచి వాని గుణముల వీనులలర నాకర్ణించి బద్ధానురాగయయి యుండెను.

ఆయూరిరాజుయొక్క యుంపుడుకత్తెతమ్ముఁడు శకారుఁడను వాఁడు వసంతసేన పొందు నపేక్షించి యాపైఁ వేచియుండెను. వసంతసేన వీనివెకిలివలపు లంగీకరింపలేదు. మైత్రేయుఁడు బలినొసంగఁబోయెడి నిశాసమయమున వసంతసేన శకారునిచే దమరుబడి చీకటిలో నిజదాసీజనంబులు గానరాకుండిన దత్తరపడుచు దరిగానక భయార్తయై శకారుని దుండగముల నసహించుకొనుచు, తిప్పలుపడుచుండ, శకారుఁడు నిజస్వభావోచితంబున తెలివితక్కువగ నామెకు చారుదత్తుని యిల్లుచూపించెను.

వసంతసేన విటశకార సంభాషణాంశముల విని యప్పుడే బలిప్రదానమునకై రదనిక వెంటరా, దలుపు తెరచుకొని మైత్రేయుఁడు వెలువడ చారుదత్తుని యింటిలోనికి దూరెను. ఈరంగమున కథాబీజము నెలకొల్పబడినది.

—విటుఁడు, శకారుఁడు—

విటుఁడు మృచ్ఛకటిక పాత్రములలో నెల్ల సమంజసబుద్ధికిని, కావ్యధోరణికిని, నెంచదగినవాఁడు. రత్నముతో గలియక 'గాజు, రాతితో గలియునా? యని వసంతసేన కొప్పిదముగ నీతఁడు పలికిన మాట లీతనిపట్లనే వర్తించుచున్నవి. వసంతసేన చారుదత్తుని వరించినదని తెలిసినంతనే విటుఁడామెపై నత్యంతగౌరవమొంది యామెను గావదలచెను. శకారునితో జీకటిరాత్రులందు దుష్టవనితాన్వేషక సంచారమొనర్చువాఁడయ్యు నొరుల గుణముల దలచి సంతసించు వివేకి. దాని మెచ్చుకొనజాలు గుణజ్ఞుఁడు, గుణి.

గీ॥ "మందువేసంగిలోన, సమస్త జంతు
పులకు నీరిచ్చి యెండిన కొలనుపగిది,
రిక్తులకు జీవనలకు దరిద్రుఁడయ్యె,
గానిమైశ్వర్య మదమునఁగాదు చూవె"

ఇతని ప్రపంచ జ్ఞానమపారము. మర్యాదలు విటనా సాధారణము.

శకార పాత్రస్వభావము సంపూర్ణముగ జూపబడినది. రాచరికము లేని రాచపోకడలు, సంపదలేనిడంబము. ధైర్యమొదవని దుడుకుదనము, శీలనిగ్రహము లెరుగని యధికారము, నిలకడలేని యుత్సాహము, వలపు జాడలరయని మోహావర్తనము, నీతిలేని తంత్రము, పిరికితనము, క్రౌర్యము, నైచ్యము మున్నగు కాపురుషగుణంబులన్నియు, రాజనాయకుల కుండ నోపెడి దుర్గుణంబులన్నియు రాశీభూతమై శకారుని యందవతరించి, హాస్యఖేలనావైదుష్య సామ్రాజ్యమున జిందులిడినవి.

మూఁడవ రంగమున వసంతసేనా చారుదత్తుల సమావేశ మమర్చబడినది. కామదేవాలయములో మొదటి చూపున మొలకెత్తి గుణశ్రవణముచే బల్లవించిన వసంతసేనా ప్రణయ ప్రసవంబు నీరంగమున పిప్పారి రాగపూరితములై రాజిల్ల దొడగెను. సెలవుగైకొని స్వగృహంబునకేగుతరి వసంతసేన దారిలో విటశకారాదులవలన మోసమూదలంచి తన నగలను చారుదత్తున కొప్పగించి మైత్రేయ పురస్కృతయై చనెను.

రెండవయంకపు మొదటిరంగమున వసంతసేన చెలికత్తెలతో వరగుణనికరంబు నుగ్గడింపుచుండ సంవాహకుఁడు శరణు శర

ణమ్మని భయార్తుడై ప్రవేశించి తానుత్రొల్లి చారుదత్తునకు సంవాహకుడై యుపచరించి నదియు కాలక్రమంబున దుస్సంగతిచే దురోదరాను చేసుదాహుల ద్రిమ్మరి సర్వస్వమును గోల్పడి జూదరి సైదోడులచే తన్నులు తిని తరుమబడిన యుదంతమును తెలుపుకొనెను. వసంతసేన యాతని బాకీదీర్చి విడిపించి కృతార్థుని జేసెను. అంత నీతడు దుస్సాంగత్యమును వదలి బౌద్ధాశ్రమము నవలంబించెను. వసంతసేనవద్ద మదనిక యను దాసి యొకతె కలదు. ఆకాలమున దాసీలను వెలకుగొనుచుండిరి. క్రయధనమును వాపసుచేసినగాని దాసికి మరల స్వాతంత్ర్యమేర్పడదు. శార్వలికుడను బ్రాహ్మణయువకుడు మదనికను మోహించి ఆపె సేవాబంధమును విడిపించి యామెతో స్వేచ్ఛోపభోగముల ననుభవించదలచి దాస్యవిమోచనమునకు వలయుద్రవ్యమన్యథా లేజాలక నెవరింటనైన ముచ్చిలి దాని సంపాదింపబూనెను. ఈతడు రాత్రివేళ చారుదత్తుని యింట నజ్ఞానకృతంబుగ ప్రవేశించెను. ఆయిల్లు చారుదత్తునిదని ఎరుగడు. ఆసమయమున చారుదత్తుడింట లేడు. వసంతసేన విడిచివెళ్లిన ఆభరణములు మైత్రేయుని చేతికి ఒప్పగించి తాను బయటకు వెళ్ళెను. అందుచేత శకారుడు వెంబడించిన ప్రథమాంకకథ సందర్భము మొదలు శర్విలకుడు కన్నము వేసిన కథవరకు జరిగిన వృత్తాంతమంతా ఒకరాత్రిలోనే గడచెనని తలచవచ్చును. లేనియెడల ఆనగలు మైత్రేయుని యొంటి మీద నుండవు. వసంతసేనను నిజావాసమునకు భద్రముగజేర్చి తిరిగివచ్చి వెంటనే గాని, యామరునాటి యుదయమే గాని చారుదత్తుడు న్యాసద్రవ్యముల నే పెట్టెలోనో, గోతిలోనో, విభూది బుట్టలోనో భద్రపరచి యుంచును. శర్విలకుడు యిటునిటు వెదకులాడుచుండ మైత్రేయుడు తనకొప్పగించిన నగలను జాగ్రత్తగా కాపాడవలెనని తలపు అదే ఆలోచనగ పుర్రెనుగదలింప నిద్రలో కలవరించుచు దొంగయే చారుదత్తుడనుకొని నగలనాతని కందించెను. వీటిని పుచ్చుకొని శర్విలకుడు మరునాటి యుదయమో, సాయంత్రమో మదనికను కలసి దాస్యవిమోచనమూల్యమును సంగ్రహించి తెచ్చితినని చూపించెను. ఆమె వెంటనే అవి తనయేలికతొడవులుగ తెలిసికొని శర్విలకుడు వానిని చారుదత్తుని ఇంటనుండి దొంగిలించెనని చెప్పును. అందుకాతడు మిక్కిలి చింతిల్లి యుత్తరకార్యోపాయముల నడిగెను. ఈనగలను వసంతసేనవద్దకు దీసుకొనిపోయి చారుదత్తుడిమ్మన్నాడని చెప్పి యామెకర్పించమని మదనిక తెరువుజూపెను. చాటుననుండి వసంతసేన వీరి సంభాషణము వినుచుండెను. శర్విలకుడు ప్రియాభీష్టముగ చేసెను. సరసురాలగు వసంతసేన మదనికాశర్విలకుల సత్ప్రవర్తనకు సంతసిల్లి వీరి నిర్ధనప్రణయానుబంధములకు గరుణించి చమత్కారముగా "ఈనగల నెవరిచే పంపెదరో వానికి మదనికనిచ్చి గౌరవించెదనని చారుదత్తునితో చెప్పియున్నాను. గాన మదనికను నీవు గైకొను" మని సేవావిముక్తగావించి వారిరువురిని పంపివైచెను. వీరు పోవుచుండగా నార్యకుని బంధించి పాలకభూపాలుడు చెరనుంచెనను వార్త శర్విలకునకు వినబడెను. వినినంతనే మదనికపొందు విడిచి మిత్రుడగు నార్యకుని రక్షింపబరుగిడెను.

దొంగతనము జరిగిననాటి రాత్రి, మర్నాడో చారుదత్తుడు మైత్రేయుడు డొనర్చిన తప్పు తెలుసుకొని తనయింటవసంతసేన నగలు పోయినందుకు చింతించు యీ సంగతి నామె కెరుక పరచకుండ జూదములో నగల నోడితిననియు, వానికి బదులీ రత్నాలహారమును గైకొనుమనియు, తనకంఠాభరణమును మైత్రేయునికిచ్చి యా వేశ్యాలలామ కందించెను.

కొండొకనాడు వసంతసేన చారుదత్తుని యింటివద్దకు వచ్చినపుడు రదనిక యొక మనోహరాకారుడగు బాలుని నాడించుచుండెను. ఆబాలుడు దాసి యొసంగిన మట్టిబండికి (మృచ్ఛకటకము) సంతసింపక బంగరుబండి తెమ్మని పట్టుపట్టి యేడ్చుచుండెను. ఈ బాలుని చారుదత్తతనూజునిగ నెరింగి వసంతసేన తన సువర్ణాభరణముల దీసి దాసికిచ్చి గొనియింపుమనియాజ్ఞాపించెను. ఈవృత్తాంతము నాటకసవిధానములో నొక ముఖ్యాంశము కాకున్నను దీనిబట్టియే యీ ప్రకరణాభిధేయ మేర్పడినది. చారుదత్తుని కెప్పుడో కాళ్లుపిసికిన సంవాహకుని గారవించి ఋణబాధా విముక్తు గావించిన వసంతసేనకు చారుదత్తునిపైగల ప్రేమాభిమానములను ఈసందర్భమతిశయంబుగ వర్ణింపనేరము. కాని సామాన్యముగ వేశ్యలు విటజనంబుల సర్వస్వమును పీల్చి పిప్పిచేయుచుందురు. విటులు మహాధనికులను ప్రీతియున్నచో వారిని మెప్పించుకొరకు వేశ్యలు కొన్నిపట్లవారి దాసదాసీజనంబులను మన్నించి పారితోషిక మొసంగుచు వారి పిల్లలకు మోదకఫలాదుల బంపువాడుక కలదు. తాము మెచ్చించిన దాసికి పదిమడంగులు హెచ్చుగ స్వీకరించెడి యాశతో నీపని చేయుచుందురు. కాని యీయెడ చారుదత్తుడు నిరుపేదయనియు గ్రిమ్మర భాగ్యశాలియగు నాశలేదని వసంతసేన యెరుంగును. వేశ్య లితర కారణములచే నొక యువకుని జేరదీసి వానితో జిత్తసంభవక్రీడల దేలుచు ద్రవ్యార్జనకు యే సుబ్బిశెట్టినో చేరబెట్టి కాలముగడుపు సందర్భము లంతరుచుగ గోచరించును. కాని వసంతసేన యిట్టి మదనవారణోపాయముగ చారుదత్తుని వరించలేదు. కులకాంతలను వెక్కిరించు చిత్తనైర్మల్యముతో సర్వసమ్మత బుద్ధితో నాతనివరించెను. ఇట్టి నిర్మలప్రణయానుబంధమును యీ పట్టుచాటుచున్నది. అందుచేతనే మృచ్ఛకటకమును తొలగించి బంగరుబండి నొసంగిన కథాంశమును బట్టి నాటక నామమేర్పరచబడ్డది.

ఇంతలో ఒకనాడు సాయంకాలము చారుదత్తుడు తన పాతబండిలోనెక్కి యచటికో బోవుచుండెను. ఆర్యకుడు శర్విలకాది సన్మిత్ర సహాయమున బాధ విముక్తుడై తప్పించుకొని పరారగుచువచ్చి రాజభటుల వెంటదరుముగా గలనాచుకొనుటకు చారుదత్తుని బండిలో ప్రవేశించి శరణువేడెను. చారుదత్తుడు బండిరెక్కలుమూసి లోన నాడువారుండినట్లు చెప్పెను. చందనకుడు ఆబండి చారుదత్తునిదనియు నందు ఆడంగులున్నారనియు, దానిని వెదుకగూడదనియు తక్కడు రాజోద్యోగుల రావించి నిజమెరింగియు నార్యకుని యసువుల గాపాడెను. ఆర్యకుడీరీతిగ సురక్షితుడై పాలక భూజాని బారి తప్పించుకొనిపోయెను. ఈకష్టసమయములో చందనచారుదత్తు లొసగ్గిన

మేలు మరువలేదు.

శకారుడు తొల్లి కబురుపంపిన రీతిగ చారుదత్తు నెటులయిన భంగపరచి వసంత సేన పొందు గెలువవలెనని యోజించు చుండెను. ఇట్లుండ దైవవశమున నొకనాటి రేయి వసంతసేన తనయిల్లువెడలి భర్త్రని వాసమున కేగవలసినదై వానగురియుచు న్నందున చారుదత్తుని బండిలో పోవలసి వచ్చెను. ఆసమయమున బండివాడీ బండిని కొంచెము దూరముగ నిలుపుటయు, వసంత సేన వాకిట ప్రమాదవశమున శకారునిబండి వచ్చి నిలుచుటయు దటస్థించెను. చీకటి లోనిమార్పు తెలిసికొనలేక వసంతసేనపొర పాటున దానిలో కెక్కినది. బండివాడు శకారుని జీర్ణోద్యానమునకు దోలుకొనిపో యెను. వీనిపేరు సంస్థానకుడు. జీర్ణోద్యాన ములో శకారుడు విటసమేతుడై బండికొరకు గాచియుండెను. దానిలో వసంతసేనను చూచి యామెను దొల్లి దయ్యముగ నెంచి యావల రక్కసిగ దలంచి తుదకు చిరవాం ఛితయగు వేశ్యకామినిగ గుర్తించి వలపుచే ష్టల నతిశయించి లాతివారలుండిన సిగ్గుపడు నని విటసంస్థానకుల దొలగిపొమ్మని యాజ్ఞా పించి యప్పటికీ వసంతసేన యీతనిపొందు నేవగించి దవ్వున బరిభ్రమించుటచే విసిగి యామెగొంతు పిసికి పడవైచి యొంటిమీద యెండుటాకుల గప్పి నిజగృహంబున కేగెను. సంస్థానకుడు మరుగుపాటున నీఘుడంతమెల్ల గాంచుచుండెను వీనిచే మంత్రిబలగము వాటిల్లునని యెంచి శకారుడు తన రథసార థిని బంధించి తన మేడమీది గోపురాంగణ మందుంచెను. ఉంచి వెంటనే నధికారరకుల యొద్ద చారుదత్తునిపై నగలకొరకు వసంత సేనను జీర్ణోద్యానమునకు మోసగించి తెచ్చి మడియించి నగలపహరించినట్లుగ నేరము మోపి చర్యజరిపెను. చారుదత్తుని రాజ సభకు పిలిపించిరి. శకారుడు సాక్షిబల మునుగూర్చి నేరారోపణ స్థిరపరచెను. ఇం తలో మైత్రేయుడు చారుదత్తుడు రాజసభ కేగెనను వృత్తాంతమారసి యాతనినన్వే షించుచు వచ్చుటకు జేరెను. అంతకుముందు చారుదత్తుడు బంగరుబండికై వసంతసేన బాలకున కొసంగిన యాభరణములను మైత్రేయునకిచ్చి వసంతసేన కీయవలసినదిగ యేర్పరచెను. ఈనగలను చంకబెట్టుకుని వచ్చుదారిలో రాజసభజేరి యచ్చటి యన్యాయ విషాదసందర్భమున కలికిపడి తత్తరపాటున నగలమూటను జారవిడిచెను. చారుదత్తుని నేరమునుగూర్చి సంశయించు చుండిన యధికారుల కిందుమూలమున నికరంపు రుజువేర్పడినది. చారుదత్తుడు డిఫెన్సు పెట్టుకోలేదు. అధికారులు మరణ శిక్ష విధించి తలారుల కొప్పగించిరి. వారు చారుదత్తుని తిప్పిదము జాటుచు వీధులవెంట నేగుతరి శకారమందిర గోపురాంతమునుండి సంస్థానకుడీ యన్యాయ సందర్భమునుగాంచి నిక్కమెరుక పరచదలచి సంకెళ్ళుల సడలిం చుకొని క్రిందికి యురికి తలారుల వెంబడిం చెను.

ఇంతలో దొల్లి వసంతసేన శరణా మొసంగ దురోదరదుర్వ్యసనంగమును వీడి బౌద్ధాశ్రమ మవలంబించి దిగుచుండిన సంవాహకుడు విధివశంబున జీర్ణోద్యాన ములో సంచరించుచు యెండాకు ముసు గులో, గురగురలాడుచుండిన జీవునిబాడ గాంచి కదలించిజూచి వసంతసేనగ గుర్తించి

ప్రత్యుపకారమొనర్ప నవకాశ మొదవెనని సంతసించి యోషధీప్రయోగమున బ్రతికించి వెంటగొనివచ్చుచుండెను. వీరును, చారుదత్తుని మరణశిక్ష సంగతివిని వధస్థానమున కేగిరి. ఇంతలో శర్విలకుడు కొందఱు సహాయ మిత్రుల తోడ్పాటున నార్యకునితో పెద్ద తిరుగుబాటు జెలరేపి పాలక భూపాలుని రాజ్యభ్రష్టుని గావించి రాజపీఠ మెక్కెను. రాజ్యాధికారము స్వవశమైనంతనే యార్యకుడు చారుదత్తుని దుస్థితి నెరిగి శీఘ్రమే పట్టణసందేశమంపెను. అందరు కొరతకొయ్య చెంత మూగిరి. కన్నార చారుదత్తునిచావు జూడదలచి వేడుకతో వచ్చి సంబరపడుచున్న శకారుడు కూడ నచ్చటనేయుండెను.

నిజము బయటపడ్డది. ఆర్యకనరపాలుడు చారుదత్తుని విపులైశ్వర్య సంపన్నునిగ జేసెను. వసంతసేన దాదాపు పోయిన యసువులమరల బొచ్చుకొని నిరాటంకముగా విపులైశ్వర్య విరాజితుండగు సద్గుణానీకభూషణుండగు చారుదత్తునితో యథేచ్ఛాసంభోగసుఖానుభవముల దేలగలిగెను. శర్విలకుడు మజసికి గూడి రాజోద్యోగ గౌరవము ననుభవించుచు సుఖులైరి. చండాలదాసాది భృత్యకంటకంబెల్ల నెత్తువడియ 'నాబాల గోపాల మఖిలసద్బ్రాహ్మణము నానందమున మున్గి యతిశయిల్లు' మృచ్ఛకటికా ప్రదర్శనప్రకరణము ముగియుచున్నది.



# సమర్పణము.

(దుగ్గిరాల పల్లంరాజు గారు.)

(సారస్వత మిత్రమండలి)

సీ॥ లలితమోహనములౌ ♦ లతికాగ్రములందోచు । తలిరుటాకులయందు ♦ తలములందు
అలవోక పెరిగెడు ♦ మొలకలం జిగిరించు । చిగురాకులమఱుంగు ♦ చెఱంగులందు
గుమిగూడి యెదిగెడు ♦ గుజ్జుపూపొదలలే । యాకుటడ్డాలయు ♦ య్యాలలందు
చదలంటి పెరబారు ♦ శాఖలవిలసిల్లు । నెలమావి చిగురుం జ ♦ య్యెదలయందు

గీ॥ సరసదరహాస సౌవర్ణ ♦ సురభికుసుమ
గుచ్ఛములనేర్చి నీమెడం ♦ గూర్చుచుంటి
నమ్మ! శ్రీభారతీదేవి! ♦ అందుకొనుమ
పూర్ణదయతోడ నియ్యదే ♦ "పుష్పమాల"

# సెలయేరు.

సన్నిధానము సూర్యనారాయణశాస్త్రి గారు

---

గీ॥ అలలచేతుల నిఱుఁగెలంకులకునొత్తఁ
బడినరీతిఁగఁదగు చెట్లవరుసలల్ల
వానితాఁకుల గగ్గురుపాటుగొన్న
పొలుపువహియింపఁ జక్కఁగా మొగ్గదొడిగి॥

గీ॥ వాంశికనికుంజకములేల పాటపాడ
శరవణమ్ముపిల్ల నవ్వులసన్నసేయఁ
గానఁబడునట్లు తమమోఱకము తెఱంగు
దారినరికట్టి పెనురాలుబారుదీర్ప॥

గీ॥ మలయపవనాంకురములకు మనసుగదల
నడవిపువ్వులు వేణి యందలపరించి
నుఱుఁగుగందంబు నెమ్మేను మెఱయునలఁది
యంచపూఁబోండ్లతో మాటలాడుకొంచు॥

గీ॥ పక్కిపక్కిల కొదుగుచు వారికెల్లఁ
బావకప్రేమ రాజ్యంబు ధన్యజన్మఁ
జైసవేనికిఁగట్టివేయంగఁదలఁచి
యేగెదో? తెల్పఁగదె? సెలయేటిబోటి!

గీ॥ నిన్ను వాడు కవిత్వ మందిరమునందు
నిలిపి స్వాగతమర్పింతు; నేనుగవినిఁ
బ్రకృతిసౌందర్య చిత్రకళోపాసకుఁడను
సుకృతవశమున నిన్నుఁజూచుట లభించె॥



# క్రొత్త కబురులు

(సిరుగూరి జయరావు గారు, బి. యస్సి)

ఎమ్మే ప్యాసయి కాలేజీలో మాస్టరైనా నన్న మాటే గాని నాకొక్క రోజైనను మనస్స్థిమితము లేకపోయినది. ఆనాఁడు సెలవుగనుక సాయంత్రము బయలుదేఱి రామన్నపంతులింటికి వెళ్ళితిని. గదిలోఁ గిటికీవద్దఁ గూర్చొని రామన్న పంతులేదో వ్రాయుచుండగాఁ బ్రవేశించితిని.

"ఏమోయి, పంతులూ! ఒక్కనాడైనా మాయింటికి దయచేసినావు కావుకదా. నీలోకోద్ధరణ దీక్షలో మమ్ముల నందఱను మఱచిపోవలసినదేనా."

రామన్నపంతులు మొకముపైకెత్తి, నన్నుచూచి, కొంచెముగానవ్వి, తానువ్రాయుచున్న కాకితములనొక మూలకుఁద్రోసినాఁడు. తాను కూర్చొనిన కుర్చీనుండి లేచి, నన్నందులోఁ గూర్చొనమని, ప్రక్కనున్న మంచముపై దాను కూర్చొనెను. మామూలుగాఁ జాలమంది పెద్దమనుష్యులు వచ్చుచుఁ బోవుచుందురు కాని రామన్నపంతుల కశ్రద్ధ పుట్టుకతో నంటఁబట్టినది; కనుకఁ గుర్చీలు, బల్లలు, సరిగా నలంకరించుట మొదలైనవి లక్ష్యపెట్టడు. ఒకమూలనొక కుర్చీ, బల్ల; ప్రక్కనే మంచముపై నలిగిపోయిన పఱుపు, పుస్తకములు; వీనిమధ్యఁ దాను!

'పంతులూ! నీవేమి చేయుచున్నావో చెప్పవుకదా! బి. యే. ప్యాసయి మూఁడేళ్లయినది. ఉద్యోగమునకుఁ బ్రయత్నించవైతివి. పోనీ, బ్రహ్మవ్రాతలు వ్రాయుచున్నావను కొంటిమా, అందులో నొక్కటైనా ప్రచురించవు. నిన్నా బాగుపఱచుకొనవు, నీవ్రాతలతో దేశమునకా యుద్ధరింపు జేయవు. మఱి నీయుద్దేశమేమిటో తెలియకున్నది.'

పక్కుమని నవ్వినాడు రామన్న పంతులు; జవాబు చెప్పడాయెను. మంచము మీఁదనున్న యొక పుస్తకము తీసిచూడ మొదలిడినాఁడు; దానిపేరు Relativity Theory దానిని గుఱించి విన్నానుగాని, నేనెన్నడును దానిని జదువలేదు. ప్రపంచమునంతా తలక్రిందులు చేసిన సిద్ధాంతమఁట! దానివిషయమై రామన్న పంతులునే యడిగి తెలిసికొనవలెనని చాలమార్లు తలఁచియుంటిని; నేఁడవకాశము దొరకెనని సంతోషించితిని.

'రామన్నపంతులూ! నీకీపుస్తకములన్నిటిని జదువవలెనను పిచ్చియెందుకు పుట్టినదోయ్. పుణ్యమా, పురుషార్థమా?'

ఎంత పలుకరించినా పలుకఁడు మా రామన్నపంతులు. వాగినాఁ 'అభంగతరంగ

ప్రవాహము' నంటివాఁడుదు; మానము వహించెనా శివతపస్సు. ఈపని చర్యలు కొత్తవారికిఁ గోపము కలిగించక మానవు.

ఎట్లు కేలకుఁ గూసి రాగము తీసినాఁడయా రామన్న పంతులు!

'పడి రెండొకటి కాఁగ

బ్రహ్మాండ భాండంబు పగిలిపోలేదా?'

పదవికూడ కలిపినాఁడు:—

'రవీంద్రనాథుఁడు జర్మనీకి వెళ్లి యైన్‌స్టైనుతో విందారగించునాఁడోయి; నిరంకుశ కవితాగౌరవములో లోకము జయించిన రవీంద్రుఁడు- నిరంకుశ శాస్త్రప్రగల్భశ్రీముతోఁ బ్రపంచము నూటాడించిన యైన్‌స్టైను! రెండు మహాశక్తు లొక్కచోటఁ గూడిన తర్వాతఁ బ్రపంచమాఁగఁగలదా!

'పడి రెండొకటి కాఁగ

బ్రహ్మాండ భాండంబు పగిలిపోలేదా!'

పగిలిపోలేదా, పగిలిపోలేదా, లేదా, లేదా, యని మంచముమీఁదనుండి లేచి, యమూంతముగా నాచేయి నెక్కివైచెను. ఉద్రేకపూరితములైన యాతని వెఱ్ఱిచేష్టల కలవాటైన వాఁడనేగాని, యీమాటు నెక్కిన చేయిమాత్ర మిప్పటికిఁగూడ నొప్పి పెట్టుచునే యున్నది.

'ఎంత ప్రతిభావంతుఁడోయ్ మా యైన్‌స్టైను. గణితశాస్త్రములో, జ్యోతిశ్శాస్త్రములో, భౌతిక శాస్త్రములోఁ, బ్రచండ మార్తాండుఁడయ్యా మా యైన్‌స్టైను. అశేష శేముషీ శేషుఁడయ్యా మా యైన్‌స్టైను. బ్రహ్మాండ నిర్వాంత......'

బడబడమని పుస్తకములన్ని పరుపు నుట్లోఁగూడ జారి క్రిందఁబడిపోయెను. రామన్న పంతుల యుపన్యాసోద్రేకమునకుఁ పెంకుటింటి కప్పే తరువాయి! కానియింతటితో నాఁగినాఁడు. మేమిద్దఱము పుస్తకములన్నింటిని బైకెత్తితిమి

రామన్న పంతులేమేమో చదువున్నాఁడని చెప్పయునే గాని, యాతఁడు సర్వజ్ఞుఁడని నాకుబూర్తిగాఁ దెలియదు. కాని యీ పుస్తకములను సవరించుచునపుడు నాకొండె గుభేలుమన్నది. ఒకటా! రెండా!! సకలశాస్త్రములు సకలభాషలు ఆపుస్తకములలోఁ గలవు. రెలటివిటీథియరీ మొదలుకొని సబ్బుబుడగలదాఁక కుజగ్రహము మొదలు కోశవిద్యుదణువుదాఁక Electron బృదారణ్యకోపనిషత్తు మొదలుకొని కరుణాతరంగిణిదాఁక షేక్స్పియర్ మొదలుకొని బెర్నార్డుషాదాఁక వసుచరిత్రము మొదలుకొని యెంకిపాటలదాఁక వోల్టేర్ మొదలుకొని అనటోల్ ఫ్రాన్స్‌దాఁక పరాసుభాషలో ఇటలీలో, తురకములో, కన్నడములో, హిందీలో ఎన్నెన్నో పుస్తకములు!

ఇన్ని పుస్తకములను జూచుసరికి రామన్న పంతులుపై నాకుఁ గోపము హెచ్చినది. ఏమిటోయి, వెఱ్ఱివాఁడా! ఇంత గ్రంథపరిచయము కలవాఁడవు; ఆంధ్రభాషలో వ్రాసి ప్రచురింపరాదా? అనికోపముతో నంటిని

ఈమాటు చేతిలో నింకొక గ్రంథము పుచ్చుకొన్నాఁడు. దాని పేరు: ముస్సోలినీజీవితము. ఇటలీలోఁ జండశాసనుఁడైన యీముస్సోలినీ మంత్రిని గురించి కొంత తెలిసిన వాఁడనే;

ప్రవాహము' వంటివాగుడు; మౌనమువహించెనా శివతపస్సు. ఈతని చర్యలు క్రొత్తవారికిఁ గోపము కలిగింపక మానవు.

ఎట్టకేలకుఁ గూనిరాగము తీసినాఁడయా రామన్నపంతులు!

‘వడి రెండొకటి కాఁగ

బ్రహ్మాండ భాండంబు పగిలిపోలేదా?’

పెదవికూడ కదపినాఁడు:—

‘రవీంద్రనాథుఁడు జర్మనీకి వెళ్లి యైన్‌స్టైనుతో విందారగించినాఁడోయి; నిరంకుశ కవితాగౌరవమున లోకము జయించిన రవీంద్రుఁడు- నిరంకుశ శాస్త్రప్రాగల్భ్యముతోఁ బ్రపంచము నూఁటాడించిన యైన్‌స్టైను! రెండు మహాశక్తు లొక్కచోటఁ గూడిన తర్వాతఁ బ్రపంచమాఁగఁగలదా!

‘వడి రెండొకటి కాఁగ

బ్రహ్మాండ భాండంబు పగిలిపోలేదా!’

పగిలిపోలేదా, పగిలిపోలేదా, లేదా, లేదా, యని మంచముమీఁదనుండి లేచి, యమాంతముగా నాచేయి నొక్కివైచెను. ఉద్రేకపూరితములైన యాతని వెఱ్ఱిచేష్టల కలవాటైన వాఁడనేగాని, యీమారు నొక్కిన చేయిమాత్ర మిప్పటికిఁగూడ నొప్పి పెట్టుచునేయున్నది.

‘ఎంతప్రతిభావంతుఁడోయ్ మా యైన్‌స్టైను. గణితశాస్త్రములో, జ్యోతిశ్శాస్త్రములో, భౌతిక శాస్త్రములోఁ బ్రచండ మార్తాండుఁడయ్యా మా యైన్‌స్టైను. అశేష శేముషీ శేషుఁడయ్యా మా యైన్‌స్టైను. బ్రహ్మాండ నిర్వాంత......’

బడబడమని పుస్తకములన్ని పరుపుచుట్టతోఁగూడ జారి క్రిందఁబడిపోయెను. రామన్నపంతుల యుపన్యాసోద్రేకమునకుఁ బెంకులెగురలేదే తరువాయి! కానియింతటితో నాగినాఁడు. మేమిద్దఱము పుస్తకములనన్నింటిని బైకెత్తితిమి

రామన్న పంతులేవేవో చదువువాఁడని తెలియునేగాని, యాతఁడు సర్వజ్ఞుఁడని నాకుఁబూర్తిగాఁ దెలియదు. కాని యా పుస్తకములను సవరించునపుడు నాగుండె గుభేలుమన్నది. ఒకటా! రెండా!! సకలశాస్త్రములు సకలభాషలు ఆపుస్తకములలోఁ గలవు. రెలటివిటీథియరీ మొదలుకొని సబ్బుబుడగదాఁక కుజగ్రహము మొదలుకొని విద్యుదణువుదాఁక Electron బృదారణ్యకోపనిషత్తు మొదలుకొని కరుణాతరంగిణిదాక షేక్స్పియర్ మొదలుకొని బెర్నార్డుషాదాఁక వసుచరిత్రము మొదలుకొని యెంకిపాటలదాఁక వోల్టేర్ మొదలుకొని అనటోల్ ఫ్రాన్స్‌దాఁక పరాసుభాషలో ఇటలీలో, తురకములో, కన్నడములో, హిందీలో ఎన్నెన్నో పుస్తకములు!

ఇన్ని పుస్తకములను జూచుసరికి రామన్న పంతులుపై నాకుఁ గోపము హెచ్చినది. ఏమిటోయి, వెఱ్ఱివాఁడా! ఇంత గ్రంథపరిచయము కలవాఁడవు; ఆంధ్రభాషలో వ్రాసిప్రచురింపరాదా? అనికోపముతోనంటిని

ఈమాటు చేతిలో నింకొకగ్రంథము పుచ్చుకొన్నాఁడు. దాని పేరు ‘ముస్సొలిజీవితము’. ఇటలీలోఁ జండశాసనుఁడైన యీముస్సొలినీ మంత్రిని గురించి కొంత తెలిసిన వాఁడనే;

రవీంద్రనాథుఁడు ముస్సోలినితో "గూడ ప్రసంగించెనఁటు! కనుక [illegible] బ్రహ్మాండ భాండంబు" పగులగొట్టుటకై రామన్న పంతులు విజృంభించునని తెలిసి నా చేయి [illegible] ప్రమత్తి కందకుండ [illegible] కూర్చు[illegible] ని మొదలు పెట్టినాను [illegible] రామన్న పంతులు;—

" కిమపేక్ష్య ఫలం పయోధరాన్
ధ్వనతః ప్రార్థయతే మృగాధిపః?
ప్రకృతిః ఖలు సా మహీయసః
సహతేనా? న్యసమున్నతిం యయా!

ఆహా! కవియనఁగఁ గాళిదాసేనోయ్, ఉద్ధతములయిన వాక్యభావములతో, సాన దీసిన శాస్త్రిబుద్ధితో, గంభీరముగ వ్రాసినాడు స్వాతంత్ర్యదీక్ష మనసారఁ గల్గిన గదా? కవి నిజమైనకవి యగుచున్నాడు; "సహతేనాన్య సమున్నతిం!" స్వాతంత్ర్య గీతికలు పాడిన కాళిదాసుచేత నే కదా యుజ్జయిని తరించెను; అట్టి తిక్కనకవీశ్వరుని గల్గుటచేత నేకదా యాంధ్రరాజ్యము తరించెను. వీరవ్యక్తులను సృజించి, దేశోద్ధరణముఁ జేయవలెనన్నఁ గవుల ప్రోత్సాహమే కదా ప్రధానము. ఇటాలియన్ కవి యేమన్నాడు.

"లా వైటా మీా ఎకారా,
లేమోర్ ఏంకోర్ పయు,
మాపిక్ లాలిబెర్టాలిడో ఎన్నాంబి!"

" నాకు బ్రతుకుపైఁ దీపికలను; ప్రేమముపై మఱింత; కాని స్వాతంత్ర్యమునకై యీ రెంటిని దనజించెదను." ఇట్టి ప్రోత్సాహముల ప్రోవు భౌతికస్వరూపమును పొందెనాయనునట్లు ముస్సోలినీ యవతరించినాడు

ముస్సోలినీని గుఱించి ఘనప్రసంగ మారంభించిన రామన్న పంతులు నాపుట కష్టము, ఈ ధోరణిలో వైర్ లెస్ టైగును రెంటినీ [illegible] ప్రవర్తించినాను. కాని [illegible] సంగతులు తెలియుచున్న యూతతో [illegible] నిరాడంబ ప్రతిభ [illegible] గల మర్యాదతో నేను నిర్చయించు [illegible]

రామన్న పంతులు సంభాషణలన్ని యుపన్యాసములవలెనే యుండును, అంత స్వచ్ఛంద ధోరణిలో మాటలాడు రామన్న పంతులను జూచినచో గ్రామ్యవాదులందరు గడ గడలాడిపోయెదరు.

"తలఁచుకొలఁదిదుఃఖము కలిగించును కదా నిర్మూలముగ క్షయించిన ప్రాక్తన హైందవ ప్రతిభావికాసము జగము నూటాడించిన ప్రపంచచాణక్యుని చర్యలు భారత భూమినుండి యంతరించి నేటికి నిటలీలోఁ బునఃప్రత్యక్ష మగుచున్నవి! రాజతిరస్కృతుఁడైన చాణక్యుఁడు, స్వయంప్రతిభాశక్తియను చే సమానుపక్రియాదురంధరుడై దుష్టరాజులను జితప్రవధగావించి మగధరాజ్యమున నిజశక్తి స్థాపించినాడు; రాజపోషణ లేక జీవనోపాధి స్వాతంత్ర్యమునకును మర్యాదకును లోటుగాని జీవనోపాధి లేకకష్టదశలో నుండి రాజ నిర్మూలనమునకై ప్రజాసమాన స్వాతంత్ర్యమునకై కంకణము గట్టుకొని తుదకు పలుకష్టములఁ జిక్కితుదకు ఇటలీ రాజ్యమున నిరంకుశయాజమాన్యమును వహించినాడు. ముస్సోలినీ! ఎట్టిమనశ్శక్తి చేతఁ గలికాలమున నిరుపయోగమగు నట్టి మనశ్శక్తిచేత — మహాత్ముఁడు భారతమోక్షమును గల్పించ నెంచెనో యట్టి మనశ్శక్తిని క్రియాశక్తిగ మార్చివైచి ప్రపంచచాణక్యుని యుద్దండ ప్రతిభతో ముస్సోలినీ నేటికి నిటలీలోఁ జండశాసనుఁడైనాడు! మొన్న

ఈమాటు కొంత ధైర్యము చేసికొని యిట్లు ప్రశ్నించితిని.

"ఇటలీలో శాసనదార్ఢ్యము (Despotic Reign) హెచ్చినదనియు, అందుచేఁ బ్రజాస్వాతంత్ర్యమునకు భంగము వాటిల్లినదనియుఁ జెప్పుచుందురు. ఇంగ్లాండులోఁ బ్రధానమంత్రియైన బాల్డ్విను, ముస్సోలినీ క్రిందనున్న ప్రజల స్వాతంత్ర్యరాహిత్యమును గుఱించి వెక్కిరించెను. అట్టి ముస్సోలినీయొక్క చరిత్రవలన మనకేమియును లాభము లేదు. ప్రజాస్వాతంత్ర్యమునకై పాటుపడుచున్న భారతదేశమునకుఁ బ్రతిరోధమును గల్పించు ముస్సోలినీ చర్యలెందుకుఁ బనికివచ్చును?"

రామన్నపంతులు కొంత కసకరముతోఁ గొంత కోపముతో [illegible].

"ప్రజాస్వాతంత్ర్యమును భావరహితమైన యాదర్శమును పెట్టుకొనుటచేతనే మన విద్యావంతులు జాతీయస్వాతంత్ర్యమును దూరము చేసివైచి, యుభయభ్రష్టులౌచున్నారు. ఇంగ్లాండుదేశమునే యాదర్శముగా నుంచుకొన్నచో భారత రాజకీయాభ్యుదయము సున్నయగును. ప్రజాప్రభుత్వమో సార్వభౌమప్రభుత్వమో సమితిప్రభుత్వమో యేదోయొకటి తర్వాత జూచుకొనవచ్చును గాని మొట్టమొదట గావలసినది నిరాఘాటమైన జాతీయ స్వాతంత్ర్యము. ఏనాటివఱకు క్రియావిజృంభకులై మనయువకులు జాతీయ స్వాతంత్ర్యమునకై జాతీయ ప్రతిభావికాసమునకై జాతీయాదర్శప్రకటనకై పూనుకొనరో — ఏనాటి వఱకు ముస్సోలినీ స్థాపించి జయింపజేసిన ఫేసిస్టిసం (Fascism) యొక్క యుత్సాహముతో యువజనసంఘము ప్రబలదో యానాటి వఱకు భారతదేశమునకే యధోగతి పట్టును; ముమ్మాటికిని పట్టును. ప్రాణములను బిగించి లౌకికాభ్యుదయమునకు ప్రయత్నించి కేవలమాత్మార్పణోత్సుకులై ముస్సోలినీవంటి క్రియాశూరుని యాధిపత్యమున మన యువకులు నూతన శకారంభమును నెలకొల్పవలెను. ఇట్టి ప్రతిరోధములను మన దేశమునఁ దెచ్చుబాధ్యత పెద్దలయందున్నది. ఈ సమస్యారహస్యమును దెలిసికొని ముస్సోలినీ చర్యల రీతులను గ్రహించి దేశాభ్యుదయదీక్షా కంకణముఁ గట్టుకొని మనము విజృంభింపవలెను.

నేనిట్లంటిని:— "ముస్సోలినీయొక్క వ్యక్తిమాహాత్మ్యమును వర్చఃపరిణామమును మెచ్చనేగాని రవీంద్రనాథునకు ఫేసిస్టిసం మీఁద దయలేదు. ప్రజల యాత్మస్వాతంత్ర్యమునకుఁ బ్రతిబంధకమని గ్రహించెను. అట్టి తిరస్కృత్యమును నేను మనమనుభవించుచున్న శాంతియుత రాజపాలనమునకు విరుద్ధముగనున్నట్లు అగుచున్నది. నూఱు వందల సంవత్సరములు కలుషితములుపడి దగ్గి పిండారీ మొదలైన భయంకర వ్యాపారములను నిర్మూలనముఁ గావించి యరాజకమైన భారతదేశమును సరాజకమును జేసి నాగరికతను ప్రబలజేసి మన దేశమున శాంతి నెలకొల్పిన యాంగ్లపరిపాలనమునందో సక్షోభింపక కల్లోలములను నుత్పాదింపు ఫేసిసం మొదలైన భయంకరోద్యమములను సాగింప దలంచినచో భారతదేశములో నరాజకత్వము శాంతి రాహిత్యము దారిద్ర్యము, క్షామము మొదలైనవి ప్రబలవా?"

రామన్నపంతులు తీక్ష్ణమైన దృష్టి నాపైఁ బ్రసరించి, యిట్లనెను:— చెప్పెను...

"ఆహా! ప్రపంచములో నెట్టిసందర్భము నైనను బోధపఱచుకొనవచ్చును గాని, విద్యావంతులైన భారతీయుల మనస్తత్త్వము మాత్రము, అగ్రాహ్యము కదా! ఎన్ని తన్నులను దినుచున్నను 'మన కెందుకురా తగాయిదా' యని వెనుకకు జాఱుదురే; ఎంత దారిద్ర్యములకుఁ బాత్రులైనను ఉన్నదే చాలునని, జాతకఫలమని, మనస్సును శాంతి పఱచుకొనుదురే;— ఎంత యధోగతిలో నున్నను, ఆంగ్లరాజ్యనాగరికత వలనేగదా యీపాటి యౌన్నత్యమైనఁ గలిగినదని సమాధానపఱచుకొనుదురే;— ఇట్టినిష్పౌరుషమైన మానసికతత్త్వము మనరక్తనాళములలో ననర్గళముగాఁ బ్రవహించుచున్నది. అన్యదేశ చారిత్రములు మనకుఁ దెలియవు; అన్యదేశీ యోద్యమములు మన మెఱుగము. ఇన్నాళ్లు మదరాసు విశ్వవిద్యాలయము దయవలన నాంగ్లరాజ్య చారిత్రమునే నిరుపయోగముగ బట్టీపెట్టుట మన యువకులకు నలవడెనేగాని, నానా దేశచారిత్రములను నేర్చు భాగ్యము లేకపోయినది. విశ్వజనీనాదర్శములకుఁ బేరుపొందిన రామలింగారెడ్డిగారి యాజమాన్యమున ఆంధ్రవిశ్వవిద్యాలయమునకు వేఱువిధమైన విద్యాదశ లబ్బునని నమ్ముదుముగాక.

నేను రూఢిగాఁ జెప్పఁదలఁచిన దేమనఁగా— మన దేశదారిద్ర్యము, దేశనాగరికతావిహీనత, దేశవిద్యారాహిత్యము, దేశనైచ్యముఁ దెలిసికొనవలెనన్న యూరోపాశియా ఖండములలోని యితరదేశములతో సమమింపవలెను. అప్పటికిఁ బ్రస్తుత భారత దశతోఁ దృప్తిపొందుట యుక్తమా, లేక సకల నిరుత్సాహములను త్యజించి, తత్క్షణమే క్రియావిజృంభణముఁ జూపుట కర్తవ్యమా యను నది తెలిసికొందము. మొన్న మొన్ననే హిందూదేశమున సంచరించి, వెళ్లిపోయిన ఆల్డస్ హాక్స్లీ నిష్పక్షపాతముగఁ దనకుఁ దోఁచిన దానినెట్లు వ్రాసెనో చూతము." అని తనపలుపు చుట్టలో నలిగిపోయిన పత్రికను దీసెను. దానిపేరు, "నేషన్ అండ్ అథీనియమ్," అందులో Aldous Huxley వ్రాసిన 'Diary of an Eastward Journey' యనుశీర్షికనుండి యిట్లు చదివెను.

"—India is depressing as no other country I have ever known. One breathes in it not air, but dust and hopelessness. The present is unsatisfactory, the future is dubious and menacing. The forces of the West have been in occupation for upwards of a century and a half. And yet five generations of peace and settled Government have made the country, as a whole, no more prosperous than it was in the days of anarchy; according to some authorities, such as Digby, they have made it much poorer. Millions at any rate, are still admittedly without enough to eat, all their lives. Custom and ancient superstition are still almost as strong as they ever were, and after a century and a half of Westren Government, nine Indians out of ten cannot read or write, and the tenth who can detest the Europeans who taught him. The educated and politically conscious profess democratic principles; but their instincts are profoundly and theoretically, to see the country "progressing" in the Western sense of the term; but the practical am—

bition of most of them is to secure a quite job without responsibilities or risks.

Meanwhile the mountains of unnecessary labour, of erritable hardship and superfluous suffering are piled up, patiently, higher and ever higher. Millions upon millions are born and painfully live—to what end? God knows, it is hard enough to find a reason anywhere, West or East. But in India there is no conceivable answer to this question, at any rate in terms of the present existence.

Metumpsychosis had to be invented and the doctrine of Karma elaborated with a frightful logic before the serried, innumerable miseries of India could be satisfactorily accounted for "

ఈవాక్యములను వినునప్పటికి నాకు మనస్సంచలనము కలిగెను. శాస్త్రి పంతులు భావోద్రేకమునకుఁగారణమాతని యామూలవిజ్ఞానమని గ్రహించితిని. రవి యస్తమింపని యాంగ్లరాజ్యమునుండి వచ్చిన హాక్స్లీకి, ఇండియానుజూచినంతనే శోభావిహీనమై, దారిద్ర్యసంకలితమై, నిష్ప్రయోజకజీవులైన ప్రజలతో నిండినదై కానుపించెను. "పాశ్చాత్యుల ప్రభ యీ దేశములో దాఁదాపు నూటయేబదివత్సరములనుండి వెలుగుచున్నది. అయినప్పటికి నైసుతరములనుండి స్థాపింపబడిన శాంతివలన స్థిరమైన ప్రభుత్వమువలనను దేశమునకుఁ గలిగినసంపద, యరాజకపునాటికంటె నెక్కువగా లేదు. డిగ్బీవంటివారి యభిప్రాయమున మఱింత దరిద్రమైయున్నది. ఎటులనైనను, తమ బ్రతుకంతయునుఁ దినుటకుఁ జాలక లక్షలు ప్రజలు గలరు." ఈఘోరణిలో హాక్స్లీ వ్రాసినాడు.

చీఁకటిపడెను; ఇంటికిఁ బోవుటకు వేళయతిక్రమించెను. ఐన్ స్టైనును గుఱించియు, రెలటివిటీతియరీని గుఱించియు జర్చించినచో దేశాతీతమై, ప్రభుత్వాతీతమై, లోకాతీతమైన నిర్వాణ్యప్రపంచములో దిఱుగుచుండెడివారము. కాని యాకస్మికముగా ముస్సోలినీ చర్చలోనికి దిగుటచేత దేశభక్త్యుద్రేకములో నాతనియుపన్యాసము ముగియఁబడెను. ఐన్ స్టైనునుగుఱించి మఱొకమాఱు వినవలెనను నుత్సాహమును నతనికెఱింగించి, నాటికి సెలవుదీసికొని, యింటికి మఱలితిని.





# అనుధావనము

జంధ్యాల శివన్న శాస్త్రిగారు.



సీ॥ నవజపా సన్నిభంబగు ప్రాచిరాగమ్ము
వెనుక రాకాశశి వెడలుమాడ్కి
అతిసౌఖ్య సంధాయియయి పోవుఘటనను
స్మృతి తలంగక వెంబడించుపోల్కి
తొలకరి వర్షధారల వెంట ధారుణి
సురభిళోచ్ఛ్వాసమ్ము చొచ్చుపగిది
ఘనఘనాఘనము గర్జనము వెన్క మయూర
షడ్జ స్వరమ్ము తాఁ జనెడు విధము

గీ॥ అద్రిభూరి గుహాంతరాయాతసింహ
నాదమును బ్రతిరవమ్ము వెన్నాడు కరణి
నిన్ను వెన్నాడుచుంటిని నీవునటులఁ
జూచుచుండగనే యదృశ్యుండవైతి॥

గీ॥ ఏమితోఁచక కనుమూసి యెదను నిన్నె
సంస్మరింపుచు నుండఁగఁ జాలికంపు
పలుఁకు వినవచ్చె విని మొగమెత్తికనఁగఁ
బ్రక్కనే కూరుచుంటివి బళిర! నీవు॥

(పూఁదేనెనుండి)

# నేత్రజ్వాల.

ఏకాంకరూపకము.

## దృశ్యము 1.

---

దేవేంద్రుడు.

ఆచార్యా! కుసుమాస్త్రుడింకను రాకున్నవాడు. కతంబెయ్యదియో?

బృహస్పతి.

తలంచినంతనే వచ్చుచున్నాడు. వత్సా! ఎదురేగి తోడితెమ్ము.

దేవేంద్రుడు.

(ఎదురేగి) లక్ష్మీపుత్రా! స్వాగతము భవదాగమనంబున దేవతానీక మనుగ్రహింపబడినది.

(కైదండయొసగికొని తెచ్చును)

మన్మధుడు.

మహేంద్రా! చిన్ననగునన్నింత బొగడుట సరియగునా?- ఏమి? ఆచార్యులవారిక్కడనేయున్నారా? దేవగురూ! పంచాయుధుడు ప్రణమిల్లుచున్నాడు.

బృహస్పతి.

శుభమగుగాక. వత్సా! గురుజనంబుల యెడ నిరంతరము భక్తినెఱపుచుందువుగాక.

మన్మధుడు.

అనుగ్రహీతుడను. మహేంద్రా! పిలువబంచినకతము తెలియవచ్చునా?

దేవేంద్రుడు.

తెలియకున్నదా? సురానీకము దిక్కుతెన్నులేనివిపదంబోధిబడి కొట్టుకొనుచుండుట. వీరు మనుటో చనుటో నీవునిర్ణయించవలసియున్నది.

మన్మధుడు

ఏమి? సురానీకము దిక్కుతెన్నులేని విపదంబోధి బడికొట్టుకొనుచుండెనా? ఈ విషయము నేను నిర్ధారించవలసియున్నదా? నీపలుకు లేవియు నాకర్థమగుటలేదు.

దేవేంద్రుడు

అర్థమమాటకేమిగాని నీభుజాబలంబునను, నీశరసంధాన నైపుణ్యంబునను త్రింశత్కోటి దేవతల జీవితము లాధారపడియున్నవి.

మన్మధుడు

నిక్కమే? మహేంద్రా! నిక్కమే వచించుచుంటివా? నాభుజబలంబును, నాశరసంధాననైపుణ్యంబు నా దేవతల రక్షించునది? ధన్యుడను. ముమ్మాటికిని ధన్యుడను. మహేంద్రా! సావధానుడను. వేగమే వచింపుము. ఎవ్వని నాపుష్పనారాచంబులపాలు గావింపవలయునో, ఏమహాత్మునికి తపోభంగంబు గల్గింపవలయునో, ఏయోగీంద్రునకు కాంతాలాలసత్వముదు

గతిపవలయునో, ఏవిరాగికి సరాగంబుల నేర్పవలయునో, వేగమేవచింపుము. దేవతల శ్రేయోదాయకమగు కార్యనిర్వహణంబున నితడగ్నిం దుముకగలడు, కులపర్వతంబులగొని తేగలడు, వేయేల? తనుత్యాగమేనిఁ జేయగలడు.

మహేంద్రుడు.

పంచాయుధుండవగు నీవంతపనికి సమర్థుండవేగాని, ప్రస్తుతసందర్భమును వినిననించుక వెనుకంజ వేయుదువేమోయని జంకుచున్నాడను.

మన్మథుడు.

మహేంద్రా! జంకుచున్నాడవా? నేను వెనుకంజ వేయుదుననియా? సాగరదుహితా తనూజాతుండనై, పంచాయుధుండనై వలరాచగద్దియనెక్కి ననేనా? వెనుకంజవేయునది? సంకోచముమాని సత్వరము వినుపింపుము.

దేవేంద్రుడు.

మంచిది. తారకాసురుడు చెదరిపోయిన దైత్యులనొకటిగ జేర్చి ధర్మవిధ్వంసమును జేయుచున్నాడు. ఆతడింతలో నమరావతిని ముట్టడించువార్తలు వినుచున్నాము. అతని నోడింపగల దళవాయి మనవీటనొక్కండును లేకుండుట నీకు విశదమే.

మన్మథుడు.

ఇంతయెఱింగియుండియు నిన్నిపనికిఁ బురికొల్పుట పాడియే?

దేవేంద్రుడు

అదికాదు. వృత్తాంతము సాంతముగ వినుము. మహేశ్వరుడు హిమవత్పర్వతమున తపంబొనర్చుచున్నాడు. అతనిహిమాచల రాజునకొక కుమారీరత్నముగలదు. ప్రస్తుతమాబాల చంద్రశేఖరుని సేవార్థము పిత్రాదేశంబున తపోవనంబున నివసించుచున్నది. ఉరగభూషణుడామెను వివాహమాడిన మహాదేవుని వీర్యంబున నత్యద్భుత బలశాలియగు కుమారుడు జనింపగలడు. ఆతని బాసటతో దేవతానీకము దనుజుల బారద్రోలగలదు.

మన్మథుడు.

మహాదేవుని ముందటనా నాపంచాయుధత్వము? హనుమంతుని ముందట నా కుప్పిగంతులు? మహేంద్రా! నన్నిట్టి సంకటమున ముంపదగునా? ఆతపోధనునకు తపోభంగమొనర్చిన నెఱేఁగి శపించిన నేమి కావలయు?—

దేవేంద్రుడు

లక్ష్మీపుత్రా! ఏలయీ యధీరాలాపములు? నీవు కోరికొనిన పద్ధతియేగాని నేనొండనుడువలేదు. వాగ్దత్తమొనర్చి నిరాకరించుటకంటె కృపణత్వ మొండుగలదా? అదియునుంగాక నిదిసత్కార్యము. దీనదోస గుతేల నేకూరును? నీమిత్రుడు వసంతుడు నీవెంటనే వచ్చునట్లాజ్ఞాపించెద. నీమేనమామ నీకెప్పుడును సహాయముచేయుచునే యుండును. నీవు జంకబనిలేదు. తపోవనంబున కేగుట కాయత్తమగుము. (తెరపడును.)

దృశ్యము 2.

(ఏకాంతమందిరము.)

రతి.

[illegible]నా! నాకేమియో దుఃఖమగుచున్నది. వి[illegible] [illegible]యానవ [illegible]వలను.

మన్మథుడు.

ప్రియా! ఏటికిట్టి సంకోచము దేవకార్యమును నిర్వర్తించి వేగమే వత్తునుగదా?

రతి.

శరజీవుల చెట్టబట్టిన నిదియే యవస్థ. అందునను మీరు సమాన్యపు శరజీవులు గూడ గారు. మీపుష్పయుధత్వము జూచి దేవేంద్రు డేలపన్నారో పై కిరమ్మని పంపెను. ఆతడెక్కడికి నెపించిన నేమగునురో కొంచెమైన నాలోచింపరు. మీరుకూడ నాతడు చెప్పుట యే తడవుగ తగుమనని ప్రయాణము గుదురు.

మన్మథుడు.

ప్రియా! అటుగాదు పరమేశ్వరు నెది రించుటకు నేనును సందేహించుచునే యున్నాను గాని వాగ్దానముచేసి యుంటిని. అదియునుగాక నియ్యది దేవకార్యంబగుట నేయపాయమును కలుగదని తోచుచున్నది. తారకాసురుని వలన వేలుపు లెంతోయిక్కట్టులంబడనున్నారు వారలనిప్పుడు వర్జించుట సరికాదు. దేవేంద్రునంతటివాడు దేవతానీకము నీచే రక్షింప బడవలయునని ప్రార్థించిన నెట్లుత్రోసిపుచ్చగలను? ఇప్పుడు ప్రయాణమెట్లులును నిశ్చయము. నీవు చింతింపవలదు. నేను వైళంబ కార్యసాధన మొనరించివత్తును.

రతి.

అత్తగారితో చెప్పితిరా?

మన్మథుడు.

మా అమ్మతోనా? లేదుచెప్పలేదు. నీవును చెప్పవలదు. ఈప్రయాణము సంగతి తెలిసిన నామె యుపరోధించును.

రతి.

పోనిండు. నన్నుకూడ వెంటగొనిపొండు.

మన్మథుడు.

ఎక్కడకు?

రతి.

హిమాచలమునకు.

మన్మథుడు.

ప్రియా! ఏమికోరిక యిది?

రతి.

నన్నుగూడ హిమాచలంబునకు వెంట గొనిపొండు.

మన్మథుడు.

మంచిది. నీవచ్చుట నేమిచేయుదువు?

రతి.

మీ వెంటనుందును.

మన్మథుడు.

ఊహూఁ నచ్చలేదు.

రతి.

మీరుపయనమగుట నాకునునచ్చలేదు.

మన్మథుడు.

నచ్చకున్నను తప్పదని నుడివితినిగదా?

రతి.

ఇది యునట్లే.

(తెరపడును.)

---

దృశ్యము ౩.

---

(హిమాచలప్రదేశము. ఒకవనమున శివుడు తపంబొనర్చుచుండును. గౌరి యా

తని సేవానురక్తయై యుండును.)

కోయిల.

కుహూ. కుహూ.

ఎలమావి.

కలకంఠమా! స్వాగతము. ఇదే రుచ్యంబులగు పల్లవంబులఁగుత్తుక బంటిభుజింపుము. ఇదే ప్రభాతాగతమందానిలంబుల పరిచర్య నందుకొనుము. ఇదె పూసెజ్జ యమర్పబడినది. ఇందుశ్రాంతవై విశ్రమింపుము. వికసితంబులగు నీకుసుమంబుల పరిమళంబులాస్వాదింపుము. నీగానసుధారసమున నీవనంబునకు నూత్న చైతన్యమునుగూర్పుము

కోయిల.

ఎవరో గృహమేధివలె నున్నారే. (అటు చూచి) వృక్షరాజమా. నీచేయుసత్కారములకెంతయు కృతజ్ఞురాలను. ఆహా! యీ బొండుమల్లియ లెంతమనోహరముగ పూచినవి. అళిందకుమారుడింకను రాలేదే.

మధుపము (ప్రవేశించి)

అక్కా! వచ్చితిని. నీకు కొంచెము మకరందము సేకరించి తెత్తునా?

కోయిల

వలదు. తమ్ముడా ఆపూచిన బొండుమల్లెగుబురుచూడుమెట్లు వాసించుచున్నదో. అదె! రసాల శాఖకు కృష్ణసర్పమెట్లు పెనవైచుకొని తలనుక్రిందకువాల్చి వాయుభక్షణము గావించుచున్నదో! అహా! యీ వసంత మెంతమనోహరముగా నున్నది?

మధుపము.

అక్కా! నేను వెళ్లుచున్నాను.

(అని గుంయిమని ధ్వనిచేయుచుపోవును.)

దృశ్యము 4.

---

పార్వతి.

ఈవనంబున నెక్కడ జూచినను క్రొత్తసింగారము జీరాడుచున్నది. ఏమి యీవసంతశోభ? ఏమియీకలకంఠి కంఠమాధురి? ఏమి యీతుమ్మెద పిండురెక్కల రొద? విచ్చుచున్న ప్రసవగుచ్ఛంబులు, గాగుడములుకానికి సలయంబులు, మెత్తదనంబులకిక్కల ఁ పచ్చికపట్టులు—అహా! వనమంతయు నెంతలో నెంతరమణీయముగా మారినది?

ఈమహర్షి సమాధియందున్నాడు. ఈకోకిలా కూజితంబు,లీభృంగనాదము, లీవాసంతరామణీయకంబు లీ మహాత్ముని యెడ నపచారము గావించునేమో?—

మన్మథుడు.

బలే! వసంతుడు నాంది బాగుగనే జరిగించినాడు, ఇదే పార్వతి పూవులనేరుచున్నది. చంద్రశేఖరుడు సమాధియందున్నాడు. రతీదేవి లతాకుంజముననున్నది. అదిగో పార్వతి శివునివంక చూచుచున్నది. ఇదిమంచి యదను. (నారి నాకర్ణాంతము లాగివదలును.)

పార్వతి.

సమాధియందున్న శివుడుకూడ వసంతాగమనంబున తేజోవిరాజితుడై నాడు. ఏమి యీతని రూపవైభవము? ఏమి యీతని నిష్ఠాగరిష్ఠత? ఇదియపూర్వము? నాహృదయమున నెట్లోయయినదేమిచెపుమా? అదిగో! మహాదేవుడు కదలుచున్నాడు.

మన్మథుడు

(ఈశ్వరునేయబోవ చేయివడకును.) ఏమి? ఎన్నడునులేనిది చేయివణకుచున్నది? (సంధించి యమ్మువిడుచును.)

శివుడు.

ఏలకో? నేడు చిత్తంబేకాగ్రత వహింపకున్నది? (కనులు తెఱచి) అపుడేవసంతమారంభమైనది.

నూతనశోభ వనమంతయు నావరించి యున్నది.

(నిమీలితనేత్రుడై ధ్యానమొనర్చును.)

(మన్మథుడు బాణమును విడుచును. చంద్రశేఖరుడు కనుల దెఱచి యెదుటపూవు లేరుచున్న పార్వతినిగాంచి)

ఏమి? గిరికన్య వాసంతికకు తన సౌందర్యమును వర్ణించుచున్నదా? ఏమీ సారూప్యము—ఆయళిందము లీమెకురుల తమసహవాసులుగ భ్రమించిపిలుచుచున్నవి. అదే యామొగలిపొదయామె పయ్యెదచెఱగునుబట్టి యుంచుకతడవు తడయమని ప్రార్థించుచున్నది. ఆమె కేశములా తంగేడుకొమ్మకు తగులుకొనినవి. పాపమా మొగలిపొదయు తంగేడు వృక్షమును గూడ గలసి యబలయగు నామెపై నత్యాచారమును జరుపుచున్నవి. నేనేగి యామెను విడిపింతునా—

నాకేమో నేడు మనో నైశ్చల్యము లేకున్నది. (చిత్తమేకాగ్రత వహింప జేసికొన బ్రయత్నించియు) అయ్యో! పాపమా యబలగతియేమి? మోదుగును, గేడగిని నామె విడిపించుకొనగలదా?—ఏమి యీ వెఱ్ఱి? గిరికన్యతో నాకేమి సంబంధము? నాకింత మనశ్చాంచల్య మేలకలుగవలె? (ధ్యానము నభినయించి) తెలిసినది. దురాత్మా! సామాన్యులగుజడదారుల మీదవలెనే మాపైనను నీమదుకుతనమును జూపనెంచితివా? కానిమ్ము, ఫలమనుభవింతువుగాని లెమ్ము.

మన్మథుడు,

(వణకుచుచేతులు జోడించుకొని)

స్వామీ! యిందీతని యపరాధము లేశమును లేదు. ఈతడు కుమార్గుడు,

శివుడు,

కుమార్గుడా? కష్టాత్మా! మాతపోభంగకు ముంగావించుట కుమార్గమా? చేసేతంజేసిన దురాగతంబునకు ఫలమనుభవింప వలదా?

(లలాటలోచనముం దెఱువ మన్మథుడు భస్మమగును,)

రతి,

హా! పరమేశ్వరా! నానాథుని రూపుమాపితివా? రతినింక ననాథగా నుండుమని యాజ్ఞాపించితివా? కాసంత కరుణ జూపజాలకపోతివాతండ్రీ! అయ్యో! నిన్నని యేమి ప్రయోజనము?— నాయభాగ్యదేవతయిట్లుకచ్చిందివదానికి?—

నాథా! నేనువలదని వారించితినిగదా? దేవేంద్రునకు "బాసనిచ్చితి" "బాసనిచ్చితి" ననుమాటయేకాని నామాట నించుకేని చెవినిబెట్టితిరా? అయ్యో! పాపముదైవమట్లేల వినసిచ్చును. ప్రాణప్రియా! నీరతి నిట్లువిడనాడి చనందగునా? అయ్యో! యింకెక్కడి ప్రాణప్రియుడు? వసంతకుమారా! నీమిత్రుడిట్లు చెన్నుమాసి ధూళింగల యనేమి చూచుచున్నావు? నీవు, నాతడును

మహాదేవుని తపోభంగమునకు సమానులగు నుత్తరవాదు లేకదా? అసహాయకుడగు నా నాథుని దుష్టుని కోపశిఖల కెఱఁజేసి నీవు మాత్రము సంతసించుట తగునా?

సుధాకరా! నీయల్లుని నింత కాపాడజాలక పోతివా? దుష్టుని కాగ్రహము తలకెక్కునపుడు కాసంత చల్లబఱుపలేక పోతివా? తండ్రీ! నీకొమరిత వైధవ్యదుఃఖమెట్లు చూడగలవయ్యా? మీయప్పగారి నెట్లూరడింప నెంచితివి?

హా! నాథా! ఆకాలమున దేవేంద్రుని పలుకులనమ్మిగదా! యింతచెడినది, "దేవకార్యము మప్పావాటిల్లద"ని పలికితివికదా! నీప్రాణముల కాతారకాసురుడేడ దాపురమయ్యెనో సర్వజీవకోటుల రక్షింప సమర్థులగు లక్ష్మీనారాయణుల కూఁమిపుత్రుడగు నానాథునకుప్రాణములేక అవయ్యెగా...హా!

(రామశేష కవిప్రణీతము)



# నర్తకి.

త్రిపురనేని ప్రసాదరావుగారు (నవకవిమండలి.)

గీ॥ ప్రియసఖుని కంఠము నలంకరింప స్వచ్ఛ
చంద్రికలుపూయు ముగ్ధపుష్పములు తెచ్చి
గ్రుచ్చుకొనుచుంటి నానందకుసుమమాల!
సరసశృంగార నాట్యమందిరమునందు॥

గీ॥ అరవిరిసరంబు కన్నుల కద్దుకొనెడి
ఆర్ద్రదృశ్యంబులో దెరయు స్తమించె
స్వర్గసౌందర్యనిలయ యప్సరసవోలె
వివృతరంగస్థలంబున నవతరించె॥

గీ॥ నందనసుమ నస్వారభ స్యందనములు
మందమారుతంబులు నాకరందమొలికె!
కిన్నరరచించె స్వాగతకీర్తనంబు
నాందిశ్లోకంబులో మృదంగములయించె
కులుకువగలాడి గిలుకుటందెలు ధ్వనించె

గీ॥ విమలవిద్యున్నటీ నాట్యవిలసనంబు
ఔర! మెచ్చటనేర్చెనీ యభినయంబు!
ఎంతసమ్మోహనంబురా! యీవధూటి
నృత్యమాత్మ బ్రహ్మానంద నిలయమయ్యె॥

గీ॥ అంగవిన్యాసమాధుర్య మాస్వాదించి
అమృతకలకంఠ కలకంఠమాలకించి
భ్రూనటనకౌశలములోన పులకరించి
రక్తిగట్టిన దిరసార్ద్రరంగసీమ!

గీ॥ తత్క్షణంబున తన్మయత్వముభజించి
నిలువునీరయి నృత్యసన్నిధని జేరి
అప్సరస్సు మధురవదనారవింద
మని మిషదృగంచలముల జూరాడుకొంటి॥

గీ॥ ఎవ్వరోనన్ను కలకలనవ్వువారు
నాట్యసుందరియటవె శృంగారసరసి!
కాదు, కాదు! రంగమ్మున గజ్జకట్టె
నాప్రియసఖుండు సారతనాలపంట!
వికృత గద్గదస్వరము కంపించిపోయి
గాఢలజ్జాభరంబున గ్రాఁగిపోయె!

# కరవీరము.

కవిసోదరులు

పువ్వాడ శేషగిరిరావు, చోడవరపు జానకిరామయ్య గార్లు.

———:o:———

ఉ. "కమ్మనిదా? గులాబినవకమ్మ"ను చొక్కపుమేని కాంతియున్,
జిమ్మనఁగందు మార్దవము, నిన్నటిదాకను లేనిలేవు; తో
రమ్ముగ నేడు వచ్చెనవురా! కరవీరము కెంపునవ్వుగ
ర్వమ్మున నవ్వుచున్నది ప్రభాకలితంబగు నాత్మసంపదన్




ఉ. తీరులుదిద్ది చక్కటులఁదీర్చ సమర్థములైన మేనిసిం
గారములుం, బ్రవాళముల కాంతికివన్నియ వెట్టఁజాలుర
క్తారుణదీధితుల్, కవిహృదంతర భావరసాంబుపూరమున్
దీరముదాకఁజేయు రమణీయపరీమళ మీర్ష్యఁగొల్పెడిన్.

చ. "బ్రతికిన రెండునాళ్లు పరువమ్మును, సర్వజనాదరంబుఁ, బ్ర
స్తుతమగు కీర్తిసంపద, విశుద్ధచరిత్రము, నొందుటొప్పు నా
గతి; మననేల? లాఘవముఁ గైకొననేల? కుకర్మలందునన్
మతిఁజొనుపంగనేలకొక మానవునింబలె వ్యర్థజీవినై"

మ. అనివాసించెదవోటు? వాసిగను నీదా వన్నెయున్ వాసియున్
గొనబైమమ్ము నధఃకరించునను కొంచున్ బొంగెదో నింగికిన్?
గనుగోజాలవు; సత్కవీశుల యశఃకల్పప్రసూనంబు వా
డునొకో? నీబలె నేట రేపటను విద్ధ్వాంసంబు సంధిల్లగన్॥






## స్వాతంత్ర్యము.

గురువుగారూ! పరమానందాచార్యుల వారూ!

బహు దినములనుండి మీకు జాబు వ్రాయుట తటస్థించినది కాదు. నేటిదినమున చక్కని యవకాశము చిక్కుటచే వ్రాయుట తటస్థమైనది. అయ్యా! ఏమని తెల్పుదును నా మనోవ్యథ దేశమున కాధారమైన సకల జన మనోభావ సంగ్రహణానుకూలమైన సుకవిజన హృదయాహ్లాదకరమైన భాషకు, మనదేశ భాషకు, పూజ్యురాలైన యాంధ్ర భాషా యోషామణికి, మితిలేని తిప్పలు వచ్చినవి. కట్టుబాట్లు తప్పిపోవుచున్నవి. స్వాతంత్ర్యము హెచ్చినది. వక్రగతులు బయలుదేరినవి. చెట్టుచెడు కాలమునకు కుక్కమూతిపిందెలన్నట్లు భాషాకటిమయంతయు నశించు కాలము వచ్చునప్పటికి వంకరటింకర కవిత్వములు కల్లబొల్లివార్తలు లల్లాయి పదాలు మహాకావ్యములయొక్క స్థానము నలంకరింపవలయునని చూచుచున్నవి. జనసముదాయమున కంతకు విద్యాభివృద్ధి హెచ్చినప్పటికిఁ దెలివితేటలు పెచ్చుపెరిగి పోవుచున్నవి. స్వకపోలకల్పనలు మిన్నంటుచున్నవి. విజృంభణము హెచ్చుచున్నది. ఉపన్యాసములు చెలరేగుచున్నవి. క్రొత్త క్రొత్త మాసపత్రికలు పుట్టుచున్నవి. చిత్రవిచిత్ర ప్రహసనాలు. రెండణాల ప్రబంధాలు అణా కావ్యములు అర్ధణా నాటకాలు కాని ప్రహసనాలు వర్షాకాలపు చీకిలింతవలె బ్రహ్మజెముడు కంపవలె ముళ్లగ చెల్లకడనున్న గోంగిపురుగులవలె నానాటికి ప్రయాణికులయుక్కువను పేరితకులనెక్కయు చిరంజీవులంబులంకరించుచున్నవి. ఈవిషకీటకములు వృద్ధిఁజెంది కల్పతరువువలెనున్న మాతృభాషాయోషామణిని సమూలముగఁ బాడుచేయుచున్నవి. క్రిందటి ప్రయాణములో నే నొకయూరేగితిని. ఇందు భాషాసేవకులెవ్వరైనఁ గలరాయని ప్రశ్నించితిని. అందుకుఁ బ్రత్యుత్తరముగ నొక మహానుభావుఁడు అయ్యా! ఈయూరిలో భాషాపోషకసమితియను నొక సంఘము కలదు. వారందరు దృఢసంకల్పములతో నాంధ్రభాషాసేవఁజేయ సంకల్పించుకొని యున్నారు. ప్రతిశనివారము సంఘభవనమున యుపన్యాసముల నిచ్చుచుందురు. రేపు శనివారమగుటచే మీరచ్చటికేగ వచ్చును అని చెప్పెను. నేనామాటనువిని మిక్కిలి సంతసించి మరునాడు సకాలమున సంఘభవనమునకేగితిని. ఉపన్యాసకుఁడు రంగస్థలమునెక్కి యింటికప్పెగిరిపోవునట్లీవిధముగ నుపన్యసించుచుండెను. తత్సారాంశమును విన్పించుచుంటిని వినుండు.

అయ్యా! విన్నారా! భాషకట, కట్టుబాట్లట! పాణిని వ్రాసిన వ్యాకరణము

సకు ప్రయోగములు విరుద్ధముగ నున్నచో నయ్యవి గ్రామ్యములు గా వట. ఏమి యీ వెఱ్ఱి? భాషముందుపుట్టినదా? లేక వ్యాకరణము ముందుపుట్టినదా? భాషయేముందు పుట్టినది. తదనంతరము దానిని సంస్కరించుటకు వ్యాకరణశాస్త్రి మనుపేరున కొన్ని నిబంధనము లేర్పరచియున్నారు. శబ్దసముదాయమును సంస్కరించిన శాస్త్రికారులు కొంతమంది తనకంటె ముందే యున్నట్లు పాణినియే అంగీకరించియున్నాడు. కుమారస్వామి మొదలగువారు చేసిన నవ వ్యాకరణములును నేడు వాడుకలో లేకున్నను నామమాత్రముగనైన నయ్యవి ప్రసిద్ధిఁ జెందియున్నవి. దీనింబట్టి మన కట్టెకుట పండితమ్మన్యులమనుచుఁ దిరుగుచున్న వృద్ధులు చెప్పు మాతృభాషయైన సంస్కృతము పుట్టి యెంతకాలమైనదో మనపితామహులకుగూడఁ దెలియని విషయము. ఆభాషను సృష్టించిన మహాసీయులు ఆకాలపు దేశపుపరిస్థితులఁ బట్టి యాన్నికట్టు దిట్టములు నేర్పరచుకొనిరి. అప్పటికిని ఇప్పటికిని దేశకాల పాత్రములు యందు వ్యత్యాసమెంతయో కన్పట్టుచుండ నింతుకంతయైన గ్రహింపఁజాలక మన ఛాందసపు పండితులు పూర్వకాలపు కట్టుబాట్లనే మనకు ను నంటించియున్నారు. ఎంత తెల్వితక్కువ? ప్రపంచకప్రధోరణి ననుసరించి దేశకాల పాత్రములననుసరించి ధర్మములు రీతులు భాషలు ఆచారములు మారిపోవలయును. పూర్వకాలపువారివలె ఇప్పటివారి నుండమనిన మిగులకష్టము. కావున మనమింక వెనుకటి వెఱ్ఱిధోరణిని వదలి భాషనునూతనముగ సంస్కరించి సకలజనులకుననుకూలమగునట్లు ఒక్కటేభాషనుగాజేసి అందరకునుపయోగపడునట్లు చేయవలెను. గ్రాంధికభాష గ్రాంధికభాష వ్యాకరణమని గోలపెట్టక చక్కగ మనము వాడుకభాషలో నేగ్రంథములు వ్రాయవలయును. పద్యములు పాటలు మొదలగునవిగూడ వాడుకభాషలోనే వ్రాయవలయును. అప్పుడు మన భావము లందరకు సులభముగఁ దెలియును. అంతియే గాక మరియొక సంగతి కలదు. భాషయనఁగా మరేమియును లేదు. పదిమందికలసి పరస్పర భావగ్రహణానుకూలముగ సృష్టించినదే. అట్లు సృష్టించిన భాషనే వైయాకరణులు తదనుకూలముగ సంస్కరించిరి. అట్లేనేడు మనమందరము జేరి యిప్పటి కాలమున కనుకూలమైన పద్ధతిని యాంధ్రభాషను నూతనముగ వాడుక పద్ధతిలోనికి మార్చి సంస్కరించి గ్రంథములనువ్రాసినచో కొంతకాలమునకిదియే ప్రధానమైయుండును. తర్వాత దీనింబట్టియే వ్యాకరణము లేర్పడును. దీనికొక్క యుదాహరణముం దెల్పెద నాలకింపుడు.

రాయే పిల్లా! మనమిద్దారమిక్కాడ
సయ్యాట లాడుదాము! రాయేపిల్లా ఓసి!
రాయేపిల్లా॥

పత్తావంటోలె పిల్ల వత్తావుంటే కొత్తా
కోరంకిదా కొత్తావంటె! అఁ అఁ! వత్తా
వంటే! ఊఁ ఊఁ! వత్తావంటె॥

చూచితిరా! భావము లెంతసరసములో పామరులకుగూడఁ దెలియునట్లు కవిత్వమెంత తేలికగా నున్నదో? అంతియేగాని

మ్లేచ్ఛనివహనిధనే కలయసికర
వాలం! ధూమకేతు మివ కిమపికరాళం!
కేశవాధృత కల్కిశరీర! జయజగదీశహరే॥

అని యున్నట్లు మనముగూడ నిట్లే పదపద్య కవిత్వము వ్రాసినచో నిప్పటి కాలపుజనులకు మహాబధిరశంఖారావము వలె నుండును. మేమిదంతయును యోజించియే మాసభాపతిగారైన షడ్భాషా కోవిద మల్లాజోస్యుల తిక్క శంకరయ్యగారి యనుమతిమీద మేమందరమును నీభాషాపోషక సమితియను దానిని స్థాపించితిమి. కావున మీరందరును మాసంఘమున సభ్యులుగా జేరి మాయత్నమును వృద్ధికిఁ దెత్తురుగాకయని ప్రార్థించుచున్నాను. అనిచెప్పి యాయుపన్యాసకుడు క్రిందకు దిగెను. అటుపిమ్మట మరొక సభ్యుఁడు రంగస్థలమెక్కి చిత్రవిచిత్రగతుల నభినయించుచు వెనుక నవ్వుల తోట అనుమాసపత్రికలో ప్రకటించిన "బెంకిపాటల" లోనొకదాని నందుకొని పాడెను.

సూస్తానని చెప్పు బెంకితో । జాబుఁ రాస్తానని చెప్పు బెంకితో । సూడకుండనుండ లేను సుక్కలాంటి నాబెంకి ॥సూ॥

అనుపాటను తొడ బ్రద్దలగునట్లు తాళమును వాయించుచు పాడెను. సమాప్తమగునప్పటికి నామనస్సు కలంతనందుటచే నేనూరకుండఁజాలక సభాధ్యక్షునికడకేగి అయ్యా! నాకుఁగూడ కొంచెముమాటలాడుటకు సమయమిండని యడిగితిని. అందుల కాయన నీపేరేమని యడుగ స్వతంత్రుఁడనని చెప్పితిని. ఓహో!మీరు పరమానందాచార్యులవారి శిష్యులా! దీనబంధు పత్రికలో మీ వ్యాసములను చదివితిమి. రండు అని నన్నుపన్యాసపీఠము నెక్కించెను.

రంగస్థలము నెక్కినంతనే చేతఁబట్టిన పొడుముపట్టును బాగ బీల్చియొడలు ఝాడించి యిట్లుపన్యసింప మొదలిడితిని. నాయనలారా! ఆంధ్రసోదరులారా! ప్రస్తుత కాలోచిత మాధుర్య రసపూరితములైన పూర్వోక్తమైన యుపన్యాస వాక్యములు వినియున్న మీచెవులకు నావాక్యములకు కటువుగాఁదోచవచ్చును. అయినను విసువుఁజెందక నాలింతురుగాక. అయ్యలారా! శ్రోత్రపీయూషమై నూతన భావాస్పదమై మృదుమధుర రసాలంకార శోభితమై బహువిధ భావగర్భిత పదలాలిత్య సమాసఘటిత కవితాస్వరూపిణియై యలరారెడి యాంధ్రభాషకు మితిలేని తిప్పలు వచ్చినవి. అయ్యయ్యో! దేశభాషలందుఁ దెలుఁగు లెస్సయని కీర్తిని వహించిన యాంధ్రభాషను ఆంధ్రకవితా కుమారిని అలంకార విహీననుగా జేసి చేతులుకాళ్లు విరుగఁగొట్టివేయఁ దలంచుచుంటిరే బాబూ! ఆడలేక మద్దెల యోటిదన్నట్లు తొడిగికొనలేక చొక్కాచించుకొన్నట్లు సంభవమైన మహదైశ్వర్యము ననుభవింపఁజాలక వామపాదమునఁ దన్నుకొన్నట్లు సాధన సామగ్రినెదుటనుంచుకొనియు నాంధ్రగీర్వాణ భాషాపాండిత్యమును సంపాదింపఁజాలక హృదయమునకు బ్రాల్స్త్రలికను నెలకొల్పి సోమరిపోతులై యున్న మీరంతతోనైన శాంతినివహింపక ప్రాచీనపండిత పుంగవులను వ్యాకరణము వ్యాకరణములను కట్టుబొట్లనుగూడి నిందించుచున్నారే. బాబులారా! ఇదియెచ్చటనైన గలదా! సింహద్వారముఁ జేరలేనివాడు గృహాంతర్భాగ మెట్లుచేరును? పొయ్యి రాజేయలేనివాడు పాకమునెట్లు నిర్వహించును. సరళీస్వరము రానివాడు పల్లవి

నెట్లు పాడును. అక్షరజ్ఞానములేని శుంఠ గ్రంథము నెట్లు లిఖించును? చదువుకొని భాషాపాండిత్యమును సంపాదింపలేని శుంఠ మాతృభాషాస్వారస్య మెట్లుగ్రహించు చును. అయ్యయ్యో యిది యేటిఅన్యాయము మహాకవులందరును మనమేలుకొఱకై తమ గ్రంథములఁజదివి మనవంటివారందరును బాగుపడుదురను పరిశుద్ధభావముతో విపులమైన తమ భాషాపాండిత్యము నంతయు వ్యక్తీకరించి వ్రాసిన సద్గ్రంథములఁజదివి యందలి రసాస్వాదనమొనర్చి భావసంభ్రావణానుకూలమైన సాహిత్యపటిమను సంపాదించుట లేకపోగా విపరీత వ్యాఖ్యానములు కూడా మొదలుపెట్టినారా! ఏమన్నారు? ఏదియో పదిమందిచేత ఒకభాషను కల్పింపగా మఱికొంతకాలమునకు మఱియొకను దానికి వ్యాకరణమును వ్రాసిసంస్కరించెదరు గావునవారు లిఖించిన భాషతో మనకేమి. మనయిష్టమువచ్చినట్లు భాషను సంస్కరింతు మనియా మీయభిప్రాయము? ఆహాహా! ఎంతచక్కని యభిప్రాయము. భాష సృష్టింపఁబడినదను సంగతి కొంతవరకును యుక్తియుక్తమేకాని అయ్యాదికాలమున నెట్టి వారిచే సృష్టింపబడినదని చెప్పుటకు దగిన వాడెవ్వడైనగలడా? మీపితామహులకు వారి పితామహులకైన నీరహస్యము తెలిసి యుండెనా? సంస్కృతభాష దేవభాషయని వాడుచుండుట మాత్రమేమనకుఁదెలిసిన విషయము. అంతియేగాని తన్నిర్మాణకర్త నేర్పరచిన ఘనుడుభూతవర్తమానకాలముల యందెవ్వడును కన్పట్టడు. సృష్ట్యాదినేటి వరకవిచ్ఛిన్నముగ ప్రపంచమున వ్యవహరింపఁబడుచుండనలోనుండి పలుబాసలను బుట్టించి లోకవ్యాపకముఁగాంచిన మాతృభాషయైన గీర్వాణవాణితో మనకు నిమిత్త మేమి? వారికట్లుబాట్లతో మనకేమియని తిండిప్రొంచుచున్నావా? తల్లిచెప్పులనే తెగ్రింపఁ దలంచుకొనిన—నివసించు గృహమునగ్ని దగ్ధమొనర్పఁదలచిన—ఆశ్రయించిన వృక్షమునే మొదలంట నరుకఁదలంచిన—నీ సాహసము వాగతీతము. వర్ణనాతిక్రమణము. నిరంకుశము. నీవాభాషాపాండిత్యమునే సంపాదించి యింతవక్తవైతివనుసంగతినిమరచితివా? ఏకట్లుబాట్లు మంచివి కావని నీవు నిరసించితివో యాకట్లుబాట్ల నింతకుముందు నివంగీకరించి యాసాహిత్యమును గొంతవరకైన నీవలవరచుకొని యుండుటచేతనే రంగస్థలముల నెక్కి యింత వక్తృత్వమునందితివి. ఏరు దాటినతర్వాత తెప్పఁదగులవేసుకొను సంకల్పము నీకుండుట శుభప్రదము. నీయబ్బనాడు నీతాతనాడు నీముత్తాతనాడు లేని యీదుస్సంప్రదాయము నీకేల? నాయనలారా! మాతృభాషాసృష్టింగావించిన మహనీయులు వెఱ్ఱి వారుకారు. భూతభవిష్యద్వర్తమాన కాలత్రయమున నవిచ్ఛిన్నముగ దోడ్పడదగినట్లు వారుదేశమునకు మనుష్యులకు మహోపకారముజేసి యుండఁ దానింగ్రహింపజాలక ప్రాల్మలికను వహించి యాభాషారహస్యమును తద్గ్రంథసారమును గ్రోలి యానందము ననుభవించు శక్తిని సంపాదింప జాలక దానిని బరిత్యజించుటయేగాక యపక్వ తవకపు సంస్కరణముల బ్రారంభింపఁ దలచితివేమి? ముందు వెనుక లరయక లోకమును బోకులో నిరీక్షించుకొని తెంపుకొనిన నక్క సాటనక్కలకు

గూడ మీమీ పుచ్ఛములను దెగించుకొనుడని బోధించినట్లు నీవజ్ఞానివై యాగ్రంధముల నర్థముఁజేసికొనలేకపోయిన బోవుదువు గాక నీ యసమర్థతను లోకమున కేల వ్యాపింపఁజేసెదవు? సమర్థుఁడవైనచో మాతృభాషయైన గీర్వాణవాణిని దేశభాషయైన తెలుగు భాషను దేశమున వృద్ధిఁజేసి అంతరించినదానిని బునరుద్ధరించి లోకమునఁ గీర్తిని సంపాదింపుము. లేదా మిన్నకుండుము. అంతియేకాని మృదుమధుర రసోపేతమై సరసచాటూపమాద్యలంకార విరాజితమై కవుల కానందము గొల్పుచున్న యాంధ్రభాషను కుక్కలదొడ్డిగాఁ జేయుట న్యాయమా! దేశోద్ధారకరములైన మహారహస్యము లనేకములు సంస్కృతభాషలో వ్రాయబడియున్నవనియే పాశ్చాత్యఖండ స్వతంత్ర ప్రభువులందరు నాగ్రంథముల సంగ్రహించి తమదేశములకుం గొంపోయి తమవద్దనున్న రాసాయనికశాస్త్రజ్ఞులచే యందలి రహస్యములను బైటపడవేయించి తన్మూలకముగఁ దమదేశముల నైశ్వర్యవంతముగాఁజేసికొని యుండిరే. నీవు దానినొక్కమారు తలంచుకొనినచో సిగ్గుపడియుందువు. ఆ భాషాప్రభావము మన్వాది మహాత్ములా భాషలో వ్రాసిన గ్రంధముల యందెంత రాజకీయ తంత్రాది గూఢరహస్యములు మగ్నములైయున్నవో నీకు బోధపడియుండును. నేటివర కేగ్రంధములను పాతతుక్కని విసర్జించి మీరన్యదేశభాషా పాండిత్యమునఁ బ్రసిద్ధిజెందిరో యాపాత తుక్కే విదేశీయుల నాశ్రయించి వారిని లక్ష్మీప్రసన్నులఁ గావించినది. మనవా రాశ్రయించిన పరదేశభాషయే మనదేశమునకు దారిద్ర్యమును గలుగఁజేసినది. నీవు బాగుపడుటకు-నీదేశము బాగుపడుటకు— నీదేశ దారిద్ర్యమంతయు నాశనమై పోవుట కనుకూల మార్గములఁ బ్రసాదించి నిన్నను గ్రహింపఁదలచుకొనిన యాగీర్వాణరాణిని వదలి నూతన సంస్కరణములచే భాషను కుక్కలు చింపినవిస్తరిగా జేయుదలంచుచున్న నీప్రయత్నమెంతవరకు శ్లాఘ్యమో దేశమే నిర్ణయించుగాక.

అదియునుంగాక భాష యనునది దేశమందలి సర్వజన సమ్మతముగా నుండవలసియుండ నీవు స్థాపనఁ జేయదలంచుకొనిన వాడుక తెలుగు అను క్రొత్త తెలుగు బాస జనాంగీకారమును బడయుటకు మార్గమేది? ఒక్కమాటనే పలుదిశలవారు పలువిధముల నుగ్గడింతురు. మూడు దమ్మిడీలు కాని. ఇది అందరెఱింగినదే. కాని యాంధ్రదేశమందలి తూర్పు దిశవారు దానినిడబ్బుఅనిపిలిచెదరు. అక్కడవారిలోనే మరికొందరు కొత్తడబ్బు అని యందురు. పశ్చిమాంధ్రులు దానిని బొట్టుఅని పిలిచెదరు. మరియొక యుదాహరణము, మధ్యాంధ్రులు విస్తళ్ళుయని పిలుతురు. తూర్పువారు విస్తరంటలు యని చెప్పెదరు. పశ్చిమాంధ్రులు ఆకులని చెప్పెదరు. వాడువస్తాడు, అనుటకు వాడు వెళ్లిపోయి వస్తాడు అని చెప్పెదరు. ఈ విధముగ దేశరీతులబట్టి భిన్న భిన్నోచ్చారణములచే వేరు వేరు శబ్దముతే మారిపోయిన యాంధ్రభాషను అనగా వాడుక తెనుగును నీవు అందరి కర్థమగునట్లు వ్రాసెదవు. బాగుగ నాలోచించినచో ప్రాచ్యాంధ్రులు వాడు మాట మాటలకు మధ్యాంధ్రుల కర్థమే తెలియదు. వారు కక్కగట్ట అని యందురు. ఆ మాట

స్థరమే కొంతమందికి తెలియదు. ఈవిధమున సర్వ సాంకర్యమును బొందిన వాడుక తెలుగుకు. అన్నట్లు మరచితిని, నైజాము రాజ్యమందలి యాంధ్రుల తెలుగు మిక్కిలి విపరీతము. ఆయుచ్చారణ మూహలకుఁ గూడ నందదు. ఇట్టి విపరీతావస్థ యందున్న వాడుక తెలుగున నీవు గ్రంథములు వ్రాయదలంచినచో ఒక దేశపురివాజు మరియొక వైపు వారి కెట్లుస్థిరమగును? అట్లయినచో పుస్తకములు వ్రాయుటకుముందు ఆంధ్రదేశమెంత వరకున్నదో ఏయే వైపువారి మాటలెట్లుండునో ఆయా పద్ధతుల మాటలనేర్చి ముందొక కోశమును నిఘంటువును తయారుచేయవలయును. పాఠకుల కప్పుడు కొంచెము సుగమము. నాయనా! ఇంత యవస్థ నీకేల? ఉన్నదానిని ఊడగొట్టుకొననేల లేనిదానిం దెచ్చిపెట్టుకొనుట కీపాట్లేల? మహాభక్తశిఖామణియైన జయదేవకవివిరచితమైన యష్టపదులే నీకుశ్రుతికటువుగ నున్నపుడు గోంగూరపాటలు అత్త అల్లుడు సంవాదము మొదలగులల్లాయపదాలు నీవంటి భాషాపోషకునకు బ్రహ్మానందము కలుగ జేయకుండునా? బాబూ! బాగుగనాలోచించుము. నీవు ప్రగ్రామాతిక్రమణ మొనర్చి యీ యసందర్భపు సృష్టిజేసినకొలది ప్రపంచకమున నపహాస్యములకు పాల్పడుదువు. ఆంధ్రభాషాసాగరమున చక్కని కావ్యరత్నములు పుట్టవలయునుగాని యపభ్రంశోచ్చారణాపూరితములైన నత్తగుల్లలుపుట్టగూడదు. ఒకవేళపుట్టినేయనుకొనుడు. అట్లయినను రత్నముల గౌరవము రత్నములకే నత్తగుల్లలమర్యాద నత్తగుల్లలకే కావున నీవొక్కమారు మీసభాపతిగారైన తిక్కశంకరయ్య శాస్త్రిగారితోఁ గూడ యోజించి భాషాపోషకసమితిని మంచిమార్గమున బెట్టుము. నేనిట్లంటినని నాపై కినుకజెందకుము.



# ఉపహారము

శంకర నారాయణులు.

సీ॥ సిరిమించు విరజాజి ♦ సెఱవన్నెఁదిలకించి । విమలమనోజ్ఞవ ♦ ర్ణములనేర్చి
మందారమకరంద ♦ మాధుర్యమారసి । రసమయమృదుపదా ♦ ర్థములఁజేర్చి
మాలతీమల్లికా ♦ మల సౌరభములాని । సముదార నవ్యభా ♦ వములఁగూర్చి
పారిజాతోత్పల ♦ నీరజంబులఁగాంచి । కమనీయ తమచిత్ర ♦ కళలఁదేర్చి

గీ॥ పుత్రిఁగల్పించుఁజతుర ♦ "పుష్పమాల" । ఘనతరామోద మింపొందఁ ♦ గాఁగ్రహించి
మెప్పుమీఱఁగ మమ్మది ♦ వింపుమమ్మ! । కమలభవురాణి! కల్యాణి!! కమలపాణి!!! ॥




యస్. యమ్. యల్. యన్. దాసుగారు.

———:o:———

## తోయదము.

హృదయసుక్షేత్రదేవమాతృకను జనుపు
ప్రణయరసమును గురియు వర్షములు లేవు
తొలకరించుట దెప్పుడో? తోయదములు
దిశలదిగమ్రింగి ముసురులదెం దెపుడో?

మొలకలెత్తిన, యీబీజములు తనంత
పెరిగి ఫలియింపలేవు; తన్వీ? యొకింత
చలమువిడనాడుమమ్మ! వర్షములనిమ్మ!
తోయదాంగన! గికురింపదొసగు! దొసగు!

స్మృతివెలుంగుల మెరజల్లు మించుదీవ!
చంచలత్వమువాసి నశించిపోక!
శోకసంతోషదాయి! కల్లోలపడు
చీకటులనించి నన్నుకాశింపనిమ్ము

నీలమేఘమ! చల్లనినీరుగురిసి
నిండుప్రేమంబు దొలుకాడ నీవు నేను
కరముకరమునఁగీలించి కౌగిలించి
హాయినొందుదమమ్మ ప్రియశ్యామకృష్ణు
నమలభావకవోష్ణరక్తాంబువులను
*　　*　　*　　*　　*
తరలిరా నెచ్చెనోయి! కైదండనిమ్ము!

## ఈప్సితము

నేను వసియించుచున్న జగాన లేవు
భక్ష్యపానీయములు కుడువంగ ద్రావి
వాయుభక్షణ జేసిజీవనము నడప
దృఢమనస్కుడ నైన ప్రాప్తించదదియు

పాలసంద్రాన పత్రంపుడోలనెక్కి
ఊర్మిమాలిక టుయ్యాలలూపుచుండ
దరియుమా నన్ను-నన్ను ముద్దాడుదోయి
కృష్ణ! దయనిమ్ము తుత్తమురిం చుముద్దు

మురళినూదుచు శ్రీకృష్ణ ముగ్ధలోలుక
ఆలపింపుము సృష్టిరహస్యగీతి
త్వన్మనోహరగాన ప్రవాహలహరి
తానమాడుచు ద్రావుదు తనివిదీర

చెంతగూర్చుండి వీవన జేతబూని
చిత్తచాంచల్య హేతిసంఛిన్నమైన
జ్ఞానదేవత నిద్రమేల్కొంచుకొరకు
విసరుమా కృష్ణ! మధురజీవిత సులబ్ధి.






(తంగిరాల వెంకటకృష్ణయ్యగారు.)

:o:

సాయంకాలము నాలుగుగంటలైనది. అదివేసవికాలము. మంద పవమానుఁడు గోదావరీ తరంగిణి యందు చిన్నయలలపై షికారుగావించుచు రాజమహేంద్రి పురవాసులకు మిక్కిలి సంతోషము గలిగించుచుండెను. గోదావరీ తీరమున నామంద మారుత సౌఖ్యము ననుభవించుటకు నవీన నాగరికతగల స్త్రీపురుషులు నవ్యవిలాసములతో వాయుస్వీకరణము జేయుచుండిరి. నదీతీరమునగల యిసుక తిన్నెలయందు గొందఱు బాలబాలిక లిసుకరేణువులనొండురులపై నెగజిమ్ముకొనుచు సంతోషమున నాటలాడుకొనుచుండిరి. అట్టి యానంద ప్రపంచమునందుండియు నొకయువకుడు విన్నపోయిన మనస్సుతో నేమేమో యోచించుచుండెను. అతఁడే మధుసూదనుడు, మాధవరావుగారి యేకపుత్రుఁడు. మాధవరావుగారు ప్రతీతిఁజెందిన నియోగిబ్రాహ్మణుడు చాలకాలము న్యాయవాద పదవినలంకరించి తుదిదినములలో సుఖముగా భగవద్ధ్యానము గావించుకొనుచు కాలము వెళ్లబుచ్చుటకై యాతడు గోదావరీతీరమున నొకతగుమాత్రము భవనము నిర్మించుకొని యుండెను. మధుసూదనుడు మిక్కిలి చురుకుతనము కలవాడగుటచే స్కూల్ ఫయినల్ మొదటి తరగతిలో కృతార్థుడయ్యెను. ఆంగ్లవిద్యాభిలాషియగు మాధవరావుగారు తనకుమారుడుకూడ తనవలె న్యాయవాదవృత్తి నవలంబించవలయునని కోరుచుండెను. కావున నాతని మధుసూదనుని చెన్నపురికి పంపి యింటర్మీడియట్ చదివించఁదలచెను. మధుసూదను డిదివరకెన్నడును చెన్నపురి నెరుఁగని వాడగుటచే మాధవరావుగారు కుమారునివెంట నాటి రాత్రి తానుకూడ పయనమై వెళ్లుటకు నిశ్చయించుకొనినను ఆనాడు చెన్నపురికి పోవు దినమగుటచే మధుసూదనుఁడు చిన్నతనమునుండియు మెలగుచుండిన మిత్రుల నెడబాయజాలకయు, తన్నతిగారాబమునఁ బెంచు తల్లిదండ్రులను విడిచి వెడలలేకయు దిగులుజెంది విసువున గోదావరీ తరంగిణీ సైకతస్థలముల గార్యశూన్యుడై చరించుచుండెను.

కుమారుని చెన్నపురికి బంపు యత్నములన్నియు పరిపూర్ణమయ్యెను. మధుసూదనుని తల్లి కమలాంబ, చెన్నపురి కేవలము తమిళదేశము కావున తమిళదేశానుకూలములగు శాకపాకము లాంధ్రుడగు తన తనయునకు సహిష్టతగా నుండవని తలంచి, యతిగారాబమున బెరిగిన మధుసూదనున కనువైన యప్పడములను, వడియములను

వివిధవిధములైన యూరగాయలను చిన్న చిన్నరేకు పాత్రలయందు సిద్ధపరచెను. రైలునకు గొంపోవుటకై యశ్వశకటము వచ్చి వాకిటనిలచెను. కమలాంబ తానుసిద్ధ పరచిన వస్తువులనన్నిటిని బండిలో పెట్టించి తన కుమారుని దీవించి పంపెను. తండ్రి కుమారులాదేయి రైలుపై చెన్నపురిచేరిరి. మాధవరావుగారు మధుసూదనునకు ట్రిప్లికేనుయందు నొకయద్దెగది కుదిర్చి యాయనకు చిరపరచితుడును, సహాధ్యాయియునగు కల్యాణరామయ్యగారితో నా బాలుని కొంచెము కనిపెట్టియుండునట్లు చెప్పి తాను మరునాడే రాజమహేంద్రవరమునకు వచ్చెను.

మరునాడు మధుసూదనుడు కళాశాలయందు ప్రవేశించెను. అతడు ప్రతిదినమును సాహాధ్యాయులతోదిరుగుచున్నను నింటిపై బెంగపోలేదు. నగరమునకు క్రొత్తవాడైనను కొద్ది దినములలోనే కళాశాలయందు మధుసూదనునకు చాలమంది మిత్రులుదొరికిరి. ఒంటరిగా నుండుట కభ్యాసము లేనివాడగుటచే మధుసూదనుడు తనగదియందు సహాధ్యాయియగు సోమసుందరమను కుర్రవానిని జేర్చుకొనెను. కళ్యాణరామయ్యగారును ప్రతిదినమును మధుసూదనుని క్షేమసమాచారముల నరిగి పోవుచుండెడివాడు. నానాట నగరవాసము మిక్కిలి యుత్సాహకరముగా నుండుటచే మధుసూదనుడు తన స్వదేశము క్రమముగా మరచిపోయెను.

చెన్నపురి సముద్రము దరినుండుటచే చలిబాధ మిక్కుటము. అందును ధనుర్మాస సమయము. తెల్లవారుఝామునే పార్థసారథి యాలయమున శ్రావ్యమగు సన్నాయి పాట నగరవాసులకు నిద్రాభంగముగావించి వారి వారి మనోవీధిని నానందసుధను వెదజల్లుటచే బ్రజలు శయ్యాతలముల విడచి బయల్వెడలుచుండిరి. విద్యార్థులు జతలు కూడి సాగరస్నానాభిలాషులై వడివడి సముద్రమునకు పోవుచుండిరి. పూర్వానువాసినులు కోవెలదరినుండు స్వామివారి తటాకమున స్నానముజేసి చలిచే దడబడుచు నస్ఫుటములైన మంత్రపఠనములతోడను, జ్ఞానప్రబోధితమైన పాటలతోడను ఫలపుష్పాదుల పళ్ళెరముల నిడుకొని స్వామివారి కర్పించుటకై దేవళమున కరుగుచుండిరి. భక్త్యుద్బోధకమైన యాసమయమున బ్రజలు దేవళమున గుమిగూడి దైవారాధన గావించుచుండ మోహాకాంక్ష యట్లుండ మిక్కిలి పవిత్రపర్వముగా నుండుట నిశ్చయము.

మధుసూదను డరుణోదయముననే లేచి నిత్యమును గోదావరిస్నానమున కలవాటు పడినవాడగుటచే సంద్రమునకుపోయి స్నానముజేసి సోమసుందరముతో గూడ పార్థసారధి యాలయమున కరిగెను. ఆలయమున జాగంట మోతకు విరామములేదు. స్త్రీపురుష విచక్షణలేకయే జనులాలయ ప్రవేశముననే గంటను మోగించికాని లోనికి వెడలుచుండుటలేదు. మధుసూదనుడాలయము ప్రవేశించి గంటనుకొట్టబోయెను. గంట యెత్తుననుండుటచే నాచేతివిసురు ప్రక్కనున్న పదునారువత్సరముల బాలికకుతగిలెను. దేవళమునవివిధకృత్యముల గాంచుచున్న నాబాలిక తనకరమున పరపురుషస్పర్శనమగుటచే మధుసూదనునివంక

జూచెను. మధుసూదనుడును తానొనరించిన కృత్యమునకు పశ్చాత్తాపము నొందువాని వలె నామెపై చూడ్కులు ప్రసరించెను. ఇట్లా యువతీ యువకుల యన్యోన్యావలోకన మొక్కక్షణికములో నంతర్హిత మయ్యెను. కాని గూఢమైన వారిమనోసంచలన మొక విచిత్రబంధముగా వారి హృదయఫలకమున నాటుకొనినది. వారిరువురిలో నొక్కరును మాటాడలేదు. తొమ్మిదిగంటలైనది. ఆలయమునందలి జనులెల్లరు దమతమ నిలయములకు వెడలిపోవుచుండిరి. జవ్వనియు తన తోడవచ్చిన యమ్మలక్కలతో గలసి వెడలుచుండెనుగాని యామె నిమీలిత వీక్షణము నొకటి రెండుమారులు మధుసూదనునిపై ప్రసరింపకపోలేదు. మధుసూదనుడా చూపులయందలి యర్థముగ్రహింపజాలకపోయెను. తన కర్కశమైన బాహుదండ మామెకరమును స్పృశించుటచే గలిగిన కోపంపు చూపులేమోయని తలంచెను కాని యవి ప్రశాంతములు. హిమబిందువులకన్న చల్లనివిగా గురితెంచెను. జవ్వని దేవళమునుండి వెడలిపోయినది. పోవునపుడుమాత్రమెవరో యామెను సరళాయని సంబోధించుటమాత్ర మాతడాకర్ణించెను. ఆసరళాశబ్ద మాతని శ్రవణపుటముల ప్రతిధ్వనించెను. ఒక్కక్షణమామె నామోచ్చారణ యాతనికి తారకమంత్రమయ్యెను. అంతలో నాతడొకసజీవ చిత్రప్రతిమయై నిలచిపోయెను. సోమసుందరము దగ్గరకువచ్చి పిలచుటచే మరల చైతన్యమువహించెను. ఇట్టివిచిత్ర మనోసంచలనమునకు సరళయేకదా కారణము.

ఆమెసరళాదేవి. కళ్యాణరామయ్యగారికుమార్తె. కళ్యాణరామయ్యగారు నెల్లూరు బ్రాహ్మణులు తమిళదేశపు సరిహద్దులలో వసించుచున్నను నాతడుపరిశుద్ధమైన యాంధ్రుడని యచ్చటివారు చెప్పుచుందురు. ఆయన సామాన్యస్థితిపరుడు. సాలునకొక వెయ్యిరూపాయలాదాయమువచ్చు భూవసతికలదు. మగసంతతి లేదు. సరళయొక్కతియే యాతనికి కుమారుడైనను కూతురైనను. ఆతడు చిరకాలము నెల్లూరులో నుద్యోగముజేసి నేడు చెన్నపురియందు కాపురముజేయుచున్నాడు. అతని చెన్నపురి కాపురమునకు సరళయే కారణము. ఏమన సరళతల్లి సరళకు పదియవవత్సరముననే మృతినొందినది. సరళ చిన్నపిల్లయగుటచేతను వెనుకగృహభారము దిద్దు దిక్కులేకపోవుటచేతను కళ్యాణరామయ్యగారి నాతని యేబదిరెండవయేట మరల వివాహముజేసుకొనుమని మిత్రులుచెప్పిరి. గాని యాతడందుల కియ్యకొనలేదు. కొంచెము వయస్సు మీరినను కన్యాశుల్కము నపేక్షించి కొందరు కన్యాదాతలు కూడ నాతని హెచ్చరించిరి. కాని యాతడా దుర్వ్యాపారమునకు సమ్మతింపలేదు. ఆడుది లేని కాపురమాతని కఠోరమయముగా నుండుటచే యూచించి కాకినాడలోనున్న తనచెలియలకు తన్నొకమారువచ్చి చూచిపోవలసినదిగా వర్తమానమంపెను. వర్తమానమందినవెంటనే లలితాంబయన్నగారిని చూచుటకు నెల్లూరునకరుదెంచెను. తన దుర్యోగమునకు వగచుచున్న యన్నగారిని శాంతింపజేసి సరళకు పనిపాటులయందు సాయపడుచు నొకమాసముదినము లామె యచ్చటనేయుండెను. సరళకుపదకొండవయేడు వచ్చినది. ఇంటిలోసతమును కలిగెడాడపోక

లేకుండుటచే కళ్యాణరామయ్యగారామె కేమియు వివాహప్రయత్నములు చేసియుండ లేదు. లలితాంబకు మువ్వురు కుమారులు కలరు. పెద్దవానికి పదిహేనువత్సరములు. అయిదవఫారము చదువుచున్నాడు. కళ్యాణ రామయ్యగారు తనకుమార్తెను మేనల్లున కిచ్చి వివాహము జేయవలయునని బుద్ధి కలదుకాని యెక్కువ వసతిదారుడగు తన బావమరది యందులకియ్యకొనునో లేదో యను సంశయమున నూరకొనెను. తల్లిలేని పిల్లను పరాయిస్థలమునకిచ్చుట కిష్టములేక యొకనాటిపగలు భోజనాంతరమున చెలియలతో భాషించుచు నిట్లుప్రస్తావించెను.

కళ్యా:- లలితా! కృష్ణునకు వివాహము నీ వెట చేసెదరా?

లలి:- ఇంకా! ఏమియు లేదు. మొన్ననే చామర్లకోటనుండి యెవ్వరో నాలుగువేల రూపాయలు కట్నమునిచ్చి కన్యనిచ్చెదమని వచ్చినారు. మీ బావగారిప్పుడు చేయ నన్నారు. ఎన్నిసంబంధాలువచ్చినా తొందరేమి యని నిరాకరించుచున్నారు.

కళ్యా:- ఒకవేళ మనసరళను చేసుకొనుటకు చూచుచుండెనేమో?

లలి:- దానికేమిరా? మహలక్ష్మి. సాలుకు వెయ్యిరూపాయలు వచ్చును. అది యొకటి నలుసేగానా యనా నీవంశమునకు ... ...

అనికన్నులనుండి నీరుకార్చుచు తనవదినగారి యాదరణము తలపోయుచు దుఃఖించెను. స్త్రీలకు భాష్పాంకురములును, నంతర్హితము లును క్షణికములగుటచే నామె కన్నులు తుడుచుకొని యెల్లని సరళను తనకొమరునకు చేసుకొనిన యన్న సంతసించునను యోచనలేకున్నను నించుమించుగ ముదుసలియైన కళ్యాణరామయ్య తదుపరి యాస్తి యంతయు దన కొమరునకును, కోడలికినగునను తలంపుతో సంబంధము కుదిర్చెదనని పలికి యామె కాకినాడకు వెడలిపోయెను. సతీపతు లేమేమి మాట్లాడిరోగాని వివాహము స్థిరపడుటచే కళ్యాణరామయ్యగారు సరళను కృష్ణుని కొసంగి దేదీప్యమానముగా వివాహ మొనరించెను. ఈశుభకార్యముచే కళ్యాణరామయ్యగారు జాయావియోగదుఃఖమును మరచెను కాని యాతని యాపదలు గట్టెక్కలేదు. వివాహము జరిగిన సంవత్సరము దాటకమునుపే కృష్ణుడు టైఫాయిడు జ్వరముచే నిరువదిలంకణములు చేసి తుదకు పరలోకగతుడాయెను. ఇంక కళ్యాణరామయ్యగారి శోకమునకే లేదు. ఆతని యాశాలత పరిపూర్ణముగా విచ్ఛేదనము గావింపబడెను. ఈగర్భశోకముభరింపజాలక యాతడాత్మహత్య నొనరించుకొన తలంచెను. పాపము సరళగతి యేమగును? యోచించి యోచించి యాతడు నెల్లూరునందుండజాలక సుతసమేతముగా చెన్నపురి కరుదెంచెను. అధికారుల పరిచయము గలవాడగుటచే మదరాసు నగరమున నాతడు రూ 100 వేతనముపై పని నార్జించుకొనెను. నెల్లూరులోనున్న కాలమునందే సరళ కొంచెము విద్యాభ్యాసము జేసియుండుటచే నిప్పుడామెను నాలవఫారములో తండ్రి ప్రవేశపెట్టెను. సరళశ్రద్ధగా జదువుకొని క్రమముగా స్కూలుఫైనల్ క్లాసు ప్యాసయినది. ఆమె చదువు పాఠ

శాలయందు యింటరుక్లాసు లేనందున కళ్యాణ రామయ్యగారామెను క్వీన్ మేరీ కళాశాలయందు ప్రవేశపెట్టెను. ఇప్పుడుసరళ యింటర్మీడియేటు ప్రథమ సంవత్సరక్లాసు చదువుచున్నది.

పార్థసారథి యాలయమును విడచి మధుసూదనుడు తననివాసమునకరుదెంచెను కాని యాతనిమనస్సు మిక్కిలి యాందోళన పడసాగెను. ఆలయమున జరిగిన వృత్తాంత మునంతయు నాతడు మనోఫలకమున జిత్రించుచుండెను. అపరాధియగు తనయెడ నా జవ్వని యట్టిప్రశాంతమూర్తుల ప్రసరింపనేలయని యాతని వితర్కము. మోహాకతముననా? క్రోధముచేతనా? కోపమున గాదని నిరూపించుకొనెను. ఇట్టి వివిధ యాలోచనలతో నాతని కుక్షినిండియుండుటచే నాడాతడన్నము సరిగా సహిష్టత కాలేదు. మరునాడును నాతని కన్నము పైరోతపుట్టెను. తనతల్లి లేకుపాత్రిలయందు బొందుపరచినగూరగాయలుకూడ నాతనికి భోజనాపేక్షకలిగించుటలేదు. ఇట్లునాలుగు దినములగునంత కాతడన్నము పూర్తిగా త్యజించెను. అందుచే చిక్కిశల్యమై ప్రాణమాత్రావశిష్టుడై యుండెను. నాడాదివార మగుటచే గళ్యాణరామయ్యగారు మధుసూదనునిజూచుట కాతని వసతిబస కరుదెంచిరి. మధుసూదనుడాయనను గాంచి ప్రయత్నముతో లేచెను. కళ్యాణరామయ్యగారును మధుసూదను డస్వస్థుడుగా నుండు టెఱింగి ప్రసిద్ధిజెందిన డాక్టరు కృష్ణస్వామయ్యంగారివద్ద మందు తెప్పించి యిచ్చెను. గాని మనోరోగమునకు మందుకలదా? నానాటికి మధుసూదనుడు క్షీణించి శయ్యనుండి లేచుటకూడ కష్టసాధ్యముగానుండెను. వారము దినములైనను దినదినమునకు రోగ ప్రబలతయేగాని తగ్గు కానుపింపకుండుటచే గళ్యాణరామయ్య, యాతడొంటరి పాటున నుండుటచేతను తగు పరిచర్యలొనరించు వారు లేనందునను రోగము శమింపకున్నదని తలంచి యొకనాటి సాయంసమయమున బండిపై యాతనిని దన యింటికి గొనివచ్చెను.

రాత్రి తొమ్మిదిగంటలయినది. మధుసూదనునకు జ్వరతీవ్రత కొంచెముతగ్గెను. సరళ వెండిగిన్నెలో పాలుపోసుకొనియాతని మంచముకడ నిలుచుండెను. కళ్యాణరామయ్యగారు పాలుపుచ్చుకొనుమని చెప్పుట విని మధుసూదనుడు లేవయత్నించెగాని నిస్సారముగానుండుటచే లేవజాలకపోయెను. సరళ హృదయయగు సరళ యాతనిస్థితికిజాలిజెంది యాతనిశిరము తనయంకతలమునజేర్చి తన హస్తపల్లవములతో క్షీరమధారసమాతని గొంతుకలో బోసెను. ఆవేడిపాలు త్రాగుటచే మందగిలిన యాతనిజ్ఞాన నేత్రమించుక వికసించెను. ఆతడు క్షీర సుధారసమును తన గొంతులో బోసిన యా జగన్మోహిని యెవ్వరాయని తలంచెను. కట్టెదుట నాతని కెవ్వరును గాన్పింపలేదు. ఆందోళనా చిత్తముతో నాతడు కన్నులు మూసెను. వెంటనే పార్థసారథి యాలయము — తాను గంటకొట్టనుంకించుట — యువతీ యువకుల యప్రయత్న కరస్పర్శ — వినిర్మలమోహసంజనిత క్రేగంటిచూపులు — సరళా సంబోధన యాతని స్వప్నమున ప్రత్యక్షమగుటచే గలత హృదయుడై యప్రయత్నముగా సరళాయని పలువరించెను. రెండవపర్యాయము మందు నిచ్చుటకై రోగి మంచముకడనున్న సరళ

యాతనిని తట్టిలేపినను నాతడు కన్ను తెరువ కుండుటచే నాతడు తన్ను పలువరించుటకు కారణమేమై యుండెనాయని తలంచి విద్యుద్దీపికా కాంతినలన నాతనిముఖము తేరిపారి చూచెను. ఆతడామెకు పార్థసారధి యాలయమున గానుపించిన యువకుడే. చిరపరిచితుడగు రోగిని కాంచినంతనే సరళ కాహ్లాద మంకురించెను గాని యామె యద్దాని మనుగువరచి మందునొసంగుకాల మతిక్రమించుచుండుటచే మధుసూదనుని మేల్కొలిపెను. ఇట్లా యువతీయువకులు క్షణకాల మొండొరులం జూచుకొనిరి. ఆ చూపుల మధ్య యాకర్షణశక్తి మిళితమైనది. చిత్తరువువలె నిశ్చేష్టతవహించిన యా శరీరముల కించుక చైతన్యముకలిగెను. ఇంతలో తన్మయత్వము మోహవికారము- పశ్చాత్తాపము- ప్రేమ- అంకురించెను. క్షణికములో విద్యుచ్ఛక్తి మాక్కి వారిహృదయాంతరాళమున సంచలనమువహించెను. భ్రమ- వికారము - విలాసము- నొకటి వెనుక నొకటి నదీతరంగములట్లు మధుసూదనునిపై దొరలెను. ఆమెను సంబోధింప తలపుజనించెను. పార్థసారథి యాలయ వృత్తాంతము జ్ఞప్తిచేయ యత్నించెను కాని యేమియు మాట్లాడజాలకపోయెను. ఆతని కనులనుండి కన్నీరు స్రవించుచున్నది. అవి యానందబాష్పములో—పరిశ్రమబాష్పములలో. అనాలోచితముగా సరళా నన్ను క్షమించుమనెను.

సరళ మానస మానందడోలికల యందూగుచుండెను. ఎవ్వని ముఖారవిందమును వీక్షించుట కామె తలంచుచుండెనో ఎవ్వని హృదయ కేదారమున తన ప్రేమబీజమునా టనభిలషించుచుండెనో ఎవ్వరియాత్మకు తనమానసము తనప్రేమ, తన సర్వస్వము లీనముజేయ నువ్విళ్ళూరుచుండెనో యామహాపురుషుని పునర్దర్శన భాగ్యములభించుటయేగాక వదనగహ్వరమునుండి వెలువడిన నన్ను క్షమింపుమా యను పశ్చాత్తాప వాక్యములు మంత్రవాక్కులవలె నామెకు స్ఫురించెను. ఆమెశరీరమున నావిర్భవించు సంక్షోభభావ తరంగములను పశమించు కొనిం మధుసూదనా క్షమించుట కెంతమహాపరాధము గావించితివి. ఒనరించినను దానికి శిక్ష నీవు దేహదారుఢ్యత వహించినపిదప యనుభవింతువు లెమ్ము!! అని యొకచిరునవ్వునవ్వి గిరుక్కు ననిష్క్రమించెను. పండుజాబిల్లిని హసించు యా పెచిరునవ్వు రోగతత్త్వమునకు చింతామణియై యాతని బాధ కొంతయుపశమింప జేసెను.

తెల్లవారినది. మధుసూదనుని పరీక్షించుటకై కృష్ణస్వామి అయ్యంగారు వచ్చిరి. వ్యాధి కుదిరినదనియు కొంచెము చారుమెతుకులు పెట్టమనియు నయ్యరుగారు చెప్పి వెడలిపోయిరి. అయ్యరుగారి యౌషధసేవచేతనో సరళాదేవి క్షీరసుధారసముచేతనో మధుసూదనునకు రోగముకుదిరి వారముదినముల కిప్పటి జవసత్త్వములు కలిగెను. కల్యాణరామయ్యగారు మధుసూదనుని మరియొకవారము తనయింట నుండుమని చెప్పుటచే మధుసూదనుడు సరళాసహవాసమున మహానంద మగ్నుడై ప్రపంచము మరచియుండెను. సమాన వయస్కులగు వారిరువురియందును ప్రేమానుబంధము బంధితమైయున్నది. వారిరువురు నునేకతరగతిలో చదువుచుండుటచే షేక్స్పి

యన్ బైరన్ ఆర్నాల్డు మొదలగు గొప్ప గొప్ప యాంగ్లకవుల రచితములపై యొకరినిమించి యొకరు తర్కించుచుండిరి. నిదర్శనముల వెలువరించుచుండిరి. వీరి విద్యా పరిశ్రమ కళ్యాణరామయ్యగారు చూచి మహానందము నొందుచుండెడివారు.

ఒకనాడు సరళామధుసూదనులు రైనాల్డు వ్రాసిన (Soldiers Wife) సోల్జర్సు వైఫ్ అను శృంగార గ్రంధమును జదువుచు నాకవిపుంగవుని జీవితముపై చర్చించుచుండిరి. వారి వాదలనమధ్య నాడు మధుసూధనుడు వసతి గృహామునకు బోవలసిన సంగతి జ్ఞప్తికివచ్చుటచే నాతడు విషాద హృదయముతో సరళా నేను జవసత్వముల వహించి యున్నాను. నాకు విధింపవలసిన శిక్ష విధింపవాయనెను. సరళ పక్కుననవ్వి



......ఇదియే నీకు తగినశిక్ష......

తన బాహులతలచే నాతని శరీరమును బంధించి “ఇదియే నీకుతగినశిక్ష” యనెను. మధుసూదనుడానంద మహార్ణవమున జలతరంగముల నెట్లు కొట్టుకొని పోవుచుండెనో యెవ్వరూహింప జాలరు? వారి దీర్ఘాశ్లేషణసౌఖ్యము తపాలవాని కేకల మూలమున చలించెను. ఒక యుత్తరము- మాధవరావు గారి యొద్దనుండి- కళ్యాణరామయ్యగారికి- వారికి తమకుమారుని దెస జూపిన మహోపకారమునకు కృతజ్ఞత- మధుసూదనుని కళ్యాణరామయ్యగారి కోరికప్రకారమాయన యింటనే వశించుటకనుజ్ఞ ఇంకేమి కావలయును సరళ మధుసూదనుల కోరికఫలించినది. రాత్రి కళ్యాణరామయ్యగారును జాబుగాంచి సంతోషించిరి. మధుసూదనుడు సరళాసమక్షమున దేవేంద్రభోగమనుభవించుచుండెను. క్రమముగా నాయువతీ యువకులిరువురును పట్టభద్రులైరి.

కళ్యాణ రామయ్యగారు సరళా మధుసూదనులమైత్రి చూచి సరళను మధుసూదనునకిచ్చి పునర్వివాహము జేయ యత్నించెనుకాని మాధవరావుగారందులకియ్యకొనరనియసంతుష్టిజెందియూరకొనెను. కందుకూరి వీరేశలింగం పంతులుగారియాధిపత్యముక్రింద రాజమహేంద్రవరమున విధవావివాహోద్యమము జయప్రదయముగా జరుగుచుండెను. అనేకమంది సంపన్నులును విద్యాధికులును కూడ నుద్యమ పత్రిములందు సంతకముచేసిరి. పంతులుగారి మాట తీసివేయజాలక సంతకము చేసిరే కాని కార్యరంగమున దిగిన వారొక్కరును లేరు. మాధవరావుగారును తనకు కుమా

త్రిలు లేరను కారణమున సమ్మతించెనుగాని లేకున్న యతఁడెంతమాత్ర మొప్పుకొనడు. ఈవృత్తాంతమంతయు వార్తా పత్రికలపై కెక్కెను. సరళ సెలవుదినమున నాంధ్ర పత్రిక చదువుచు నావార్త తండ్రికిని మధుసూదనునకును తెలిపెను. మధుసూదను డానంద మగ్నుడై తండ్రి యుద్యమదీక్షకు సానుభూతి జూపుచు తనను విధవా వివాహముజేసుకొనుట కనుజ్ఞవేడెను. కుమారుని యుత్తరము జూచి తన బుద్ధిహీనతనిందించుకొని యేమి మాఱాడుటకు వీలులేక సమ్మతించెను. వీరేశలింగంగారి యాధిపత్యముననే సరళా మధుసూదనులకు రాజమహేంద్రవరమున మిక్కిలి వైభవముతో వివాహముజరిగెను.

---

## చిలుకా.

(బాలకవి కోగంటి దుర్గా మల్లికార్జునరావుగారు)

గూటినినుంటిని
దీటుగనేనని
సారెసారెకును
సంతసింపకుము
చిలుకా!

పొంగుటయెంత
కుంగుటయెంత
ఏరోజెట్టిదొ
ఎవఁడెఱుంగునే
చిలుకా!

మురిసిపడుచు స
మ్మోహమనెడియం
భోరాశినిబడి
మునిగిపోవకుము
చిలుకా!

తనువుపైని యా
తమినెల్లవిడి
తత్వబెఱింగి
తగవర్తిల్లుము
చిలుకా!



# పల్లెటూరుపిల్లా నాకేమిస్తావు?

:o:

కొడాలి వెంకట సుబ్బారావుగారు.

కామరాజుగడ్డ శివయోగానందరావుగారు.



అంచెలంచెలుగాను ♦ అంబరంబున బోవు
మబ్బుతునకలనీడ ♦ మసలనిత్తు
మబ్బుతునకలనీడ ♦ మలసియాడుచునిక్క
చందురుచూపుల ♦ కందనిత్తు
చందురురాకకై ♦ చక్రవాకముపాడు
విరహాకీర్తనముల ♦ వినగనిత్తు
విరహాకీర్తనలందు ♦ విశ్వంబునందెల్ల
ప్రేమామృతంబు స్ర ♦ వింపనిత్తు

ప్రేమసుధలోననన్ను చి ♦ త్రింపనిత్తు
చిత్రమందునగాంచు వి ♦ చిత్రములను,
పల్లెటూరిబాలిక ముగ్ధ ♦ భావములను,
నిన్నుబోలెడికవిని వ ♦ ర్ణింపనిత్తు॥

సీ॥ పరులదన్నుటె ప్రజా ♦ ప్రథమధర్మంబని
చెప్పెడి సస్యంపు ♦ చేలనిత్తు
పసరుపచ్చనిరూపు ♦ మిసిమిచూపెడిచేల
శోభ నీక్షించుక ♦ చూడనిత్తు
చేలకంకులమీద ♦ వ్రాలుపక్షులగుంపు
నవకంపుసిరిని క ♦ నంగనిత్తు
పక్షులదోలగా ♦ పడుచులువిసిరెడి
వడిసెలధాటి గ ♦ న్పడగనిత్తు

వడిసెలలధాటితో రస ♦ వంతముగను
అంగనలుపాడుపాట వి ♦ నంగనిత్తు

పల్లెటూరిబాలిక ముగ్ధ ♦ భావములను
నిన్ను బోలెడికవిని వ ♦ ర్ణింపనిత్తు॥

చ॥ కదుపుల మేపు నాపశుల ♦ కాపరిగుంటలుబీళ్ళలోన "నో
యదుకులభూషణా మురళి ♦ యందలితీపులజూపవేమి మా
హృదయములన్ హరింపవది ♦ యేమని" గోపికలన్న గీతికల్
పదముల బాడి దారకజ ♦ పంబొనరించుట జూడనిచ్చెదన్॥

సీ॥ మేలితావులతోడ ♦ లీలలాడెడుగాలి
జోలలతో పుష్ప ♦ మాలలొత్తు
మాలలదరిబ్రుంగ ♦ జాలంబుసల్పెడి
ఝుంఝుమ్మను మధుర గా ♦ నమ్మునిత్తు
ఝుంకార గానంపు ♦ సొంపులో తలలూపు
పచ్చనాకుల చెట్లు ♦ మెచ్చనిత్తు
చెట్లయాకులమధ్య ♦ చిలుక దంపతులాడు
ప్రేమభాషణలు వి ♦ న్పింపనిత్తు

ప్రేమభాషణమందు సం ♦ ప్రీతినిత్తు
ప్రీతితో నన్ను సతము స్మ ♦ రింపనిత్తు
పల్లెటూరి బాలిక ముగ్ధ ♦ భావములను
నిన్ను బోలెడుకవిని వ ♦ ర్ణింపనిత్తు

చ॥ గుడియల కర్రిలన్ వెనురు ♦ కోలలు కేలలబూని బాలకుల్
ముదుసలి పంటకాపులును ♦ మోదముతో నొకచోటజేరి ప్రా
గుదిత దివాకరున్ గనుచు ♦ యోపినగడ్డిని నేర్చి పుష్యమా
ఖ దినములందు సందెచలి ♦ కాగుట వింతగజూడనిచ్చెదన్

సీ॥ ప్రత్తిపంటెట్లుండి ♦ బాగున్నదాయని
తడబడు చదుగు మా ♦ తాతగారు
ప్రత్తిగింజల దీసి ♦ ప్రహ్లాద కథచెప్పి
మురియుచునుండు మా ♦ ముసలియవ్వ
దూదిపింజల పేర్చి ♦ దులిపి యేకులజేసి
ఆవిబుట్టనింపుమా ♦ అమ్మగారు

మర్గంబులో హెచ్చు ♦ తగ్గులసవరింప
నలుగడల్ తిరుగుమా ♦ నాన్నగారు

కదురుచేబూని రాటము ♦ నెదుటబెట్టి
పీబసవరించుకొనెడి మా ♦ పెద్దయక్క
గలిగి పులకింప జేయు రం ♦ గముల సొబగు
నిన్నుబోలెడి కవిని వ ♦ ర్ణింపనిత్తు

సీ॥ కుడిచేతిపెనువేళ్లు ♦ నడిపించుచక్రింపు
కమ్మనిరసము స్వ ♦ ర్గంపుగీతి
కదురుసన్నని మొన ♦ కదలగాసాగిన
పోగులక్ష్మీదేవి ♦ పుస్తెతాళ్లు
దారిద్ర్యరాక్షస ♦ సారంబు హరియింప
జలజాక్షుగొల్వ ని ♦ శ్చలసమాధి
సమతనెల్లెడలందు ♦ కొమరారగా చేసి
మనుజులపోరాపు ♦ మధ్యవర్తి

యగుచు రాజిల్లురాటంపు ♦ సొగసుగోళ్లు
భరతసౌభాగ్యలక్ష్మి ప్ర ♦ భావమందు
మునిగి దేహంబుమరచు నా ♦ మూర్తిసొబగు
నిన్నుబోలెడికవిని వ ♦ ర్ణింపనిత్తు

చ॥ పదముల కుచ్చెళుల్, జిలుగు ♦ పయ్యెదపైకుటిలాలకంబులున్
పెదవులదొండపండు రుచి, ♦ బెళ్కువిలోకన మత్తులందునం
పదలపడంతి భావముల ♦ పైచెరలాడుచు నాట్యమాడుచుం
డ, దమమువిచ్చువేళల త ♦ టకము కేగెడి యంగనాలతిన్

మ॥ వెనుకన్ మందలు వచ్చుచున్నయవిరా ♦ వేయక్కయీపక్కకున్
కనులన్ గానరు గొడ్లకాపరులు అ ♦ క్కాయిట్టురావే అవే
కనుమా తేగలు దూకుచుండె"నని కృ ♦ ష్ణాతీర్థ బాండంబులన్
వనజాక్షుల్ గొనివచ్చు చాత్రిపడుచో ♦ వర్ణింపగానిచ్చెదన్॥



# గృహప్రవేశము

పండిత

పెనుమెచ్చ సత్యనారాయణరాజుగారు.

———:0:———

౧

అన్నపూర్ణ గుడిమెళ్ళంక యల్లాగి వారి యాఁడుపడుచు. కాఁకరపర్తి పెనుమెచ్చవారి మేనగోడలు. కావున నామె కులీనతఁగూర్చి మనకుఁ బ్రశ్నమక్కఱలేదు. మతాబా తీఁగవలె బ్రకాశించుచున్న అన్నపూర్ణను తండ్రి సుబ్బరాజు తల్లి వెంకయ్యమ్మయును గాలు క్రిందఁబెట్టనీయక యల్లారుముద్దుగాఁ బెనుచుటలో ఆశ్చర్యమేమి? ప్రపంచములోఁ దండ్రికి పెద్దకొడుకు పెద్దకూఁతుర మీఁదను దల్లికి చిన్నకొడుకు చిన్నకూఁతురు మీఁదను బ్రేమమధికమని యెదరు. కాని యది యన్నపూర్ణ విషయమై గగనకుసుమమయ్యెను. నాలవ కూఁతురగు నన్నపూర్ణపై నాతని తలిదండ్రుల కంత యంత్యంతప్రేమ మేమిఁ. అక్కచెల్లెండ్రిందరిలోను అందచందములలోఁ గాని చదువు సంధ్యలలోఁగాని అన్నపూర్ణ యేపూర్ణయా యేమి. ఇంటిలో వివాహముజరుగునప్పుడు అక్కచెల్లెండ్రు ఏడుగురు అన్నదమ్ములిరువురు సంపూర్ణ పూర్ణిమా చంద్రవదనులై బంగరు శలాకులవలె మెఱయుచుండగా ఆతల్లిదండ్రులు పొందు నానందము వర్ణింప నెవరితరము. కాని యా తలిదండ్రులు సంతానమెల్ల నొక్క చోటనున్నపుడు తనివుతీర నెపుడును గాంచియుండలేదు. కారణము మరేమియు లేదు. ఎక్కడ దృష్టితగులునోయని వారికి నిరంతరము భయమే. ఒక మనుమరాలి బారసాల యగుటనో యొక కోడలిరాకనో ఒక కొమరిత వివాహంబు గావుటనో సుబ్బరాజు గృహమెల్లపుడు నిత్యకళ్యాణము పచ్చతోరణమునై కన్నుల పండువొనర్పుచుండును. రెండవ కుమార్తె యనాథయగుటచే నెడ నెడ నెప్పుడేని గొంచెము విచారమాపీతలనుభవించుచున్నను మొత్తముమీఁద దినములానందముగనే గడుపుచుండిరనవచ్చును, ధాన్యలక్ష్మి గాదెలలోను ధనలక్ష్మి యినుప పెట్టెలలోను గోలక్ష్మి కొట్టములలోన మూలుగుచుండఁగా వారికి లోపమేమి? విచారమేడ? అంత యైశ్వర్యముతోఁ దులదూఁగుచున్నను వెంకయ్యమ్మ దాస దాసీజనంబుల నెప్పుడును గసరి యెఱుఁగదు. స్త్రీ స్వాభావికమగు కోపము లేక కాదు. కోపించినచో నెప్పుడెవ్వరు నీకడుపు కాలాయని గొణగుకొందురోయని భయము.

౨

కుటుంబము పెద్దదియై యాస్తి చిన్నదగుటచే జన్మస్థానమగు పోడూరుపేడి భూపతిరాజు కృష్ణమరాజుగారు తూర్పుపోయి గొప్పధనికుడై సంవత్సరమునకు నాలుగైదు

వేల రూప్యములు ఆదాయమువచ్చు భూవసతిని సంపాదించెను. తూర్పున నాలుగు వేలరూప్యములు ఆదాయము వచ్చువాడు చక్రవర్తియని చెప్పవచ్చును. నిలువబడినచో నౌకరు, వంగి యుండిన నౌకరు, కాని పెట్టినచో నరువదియారుగురు నౌకర్లు. కృష్ణమరాజుగారు అరికాలుక్రిందఁ బెట్టుకొనంగ అష్టైశ్వర్యములు అనుభవించుచుండెను. కృష్ణమరాజుగారికి వయస్సు మీరినది, కాని పుత్రగాత్రి పూష్వంగ సుఖములేదు. వారి నీహారకర్పూరచందనములు అతనికి హృద్యములు తాపోపశమనములు ఎట్లగును. అపుత్రస్యగతిర్నాస్తి అని వేదవాక్యములు స్మరించుచుండుట చేతనో పున్నామ నరకమునుండి దాటించువాఁడనియు కులవర్ధనుఁడగు కొడుకు గానని యట్టి లాఘవము స్వర్గాసన యాలయము లయము అనియను నీతివాక్యములు విని యుండుటచేతనో కృష్ణమ రాజుగారు పుత్రప్రాప్తినిగూర్చి దీర్ఘముగా నాలోచించిరి. పన్నిద్దరు కొడుకులలో దత్తుడు ఔరసతుల్యుఁడని వినుటచే కులరూపగుణసంపన్నుండగు బాలకుని కొరకు వెదకనారంభించెను. తన సహోదరులు ఇరువురకు అన్నదమ్ములు సహజవైరులను భారవి కవివాక్యమును ప్రొక్టికల్ (Porctial) గాఁ దెలుపందలంచి వారికొడుకులను విడనాడి ఇలువడిగల కుఱ్ఱవానిని నెమకి నెమకి తుట్టతుదకు ఖండవల్లి గ్రామవాసులగు భూపతిరాజు రామగోపాల రాజుగారి కుమారుడు కోటరామచంద్రపురము కాకర్లమూడి వారి మేనల్లుడగు వేంకటపతిరాజు నుదత్తము చేసికొనెను. పెంచుకొనుటకు ముందు పెద్దలు దత్త పుత్రశోకము వద్దని సుద్దులు చెప్పినను దౌహిత్రులున్నారని యెంగియు వారిపై కృష్ణమరాజుగారు చిఱ్ఱుబుఱ్ఱుమనెడవారు. పెంచుకొనఁగానే యుపనయనము చేసి పెండ్లియొనర్చెనఁ గాని వేదోక్త కర్మకాండము నెఱిపినవాఁడు కాఁడుగదా నేఁ. తగిన సంబంధముల కొరకు నెన్ని నారంభములు తూర్పునాఁడెల్ల గాలించిరి. ఉ. ఉ. ఎక్కడను సరియయిన సంబంధము కుదురలేదు. నాలుగు యాలలకు చాలులను బంపిరి. రాజకుటుంబములలో బ్రాహ్మణులే సంబంధికులకుఁ గొప్పట యాచారము.

౩

పదునారేండ్లు వచ్చినవి అన్నపూర్ణకు. అసలేయందకత్తె దానికిదోడు నూత్న యౌవనవిజృంభణము. ఇఁకఁజూడ గన్నులుండునే. ఆమె మాటలయందు కుటిలత్వము గాని కఠినత్వము గాని లేదు. ఆగర్భశ్రీమంతురాలనని నిక్కుటయు నీల్గుటయు విఱ్ఱవీఁగుటయు నెఱుంగదు. కాని యీ గుణములన్నియుఁ జలపాదించి పగదీర్చుకొనుటకుఁ గాఁబోలు నల్లనల్లన ఆయమ కుంతలకుచంచులను నూఁగారును నితంబమును ఆశ్రయించినదే కాని విడువలేదు. అన్నపూర్ణ రూపలావణ్య సౌశీల్యములంగాంచి తల్లి వెంకయ్యమ్మయు రెండవయప్ప వెంకాంబయుఁ దమ భర్తలను గోల్పోయిన విచారములు మఱచిపోయిరి. అన్నపూర్ణమ్మయు అక్కయుఁ జూపు సహజప్రేమచే దండ్రిమాటదలఁచియే యెఱుగదు. అన్నపూర్ణకు రొంప పట్టినచో డాక్టర్లను నింటిలోఁ గాఁపురము పెట్టినగాని పెద్దన్న సూర్యనారాయణరాజు నిద్రపోయెడి

వాఁడు కాడు. చాటున నున్నను మల్లికా మాలతులు తమ పరిమళలహరిచే నెల్లర నాకర్షించునట్లుగా నెక్కడనో గోదావరి యావల మారుమూలనారికేళవనములో దివ్య భవనములో ఆ కుసుమయుంగు పిండెదైన యసూర్యంపశ్యయై పెరిగిన యన్నపూర్ణ ఆళికులంబుల నాకర్షించు నంబుజంబువలె సుకుమారమారులగు రాజకుమారుల నాకర్షింపక పోలేదు. ఏవిచారము నెఱుఁగని వెంకయ్యమ్మ వెంకాంబలు అన్నపూర్ణ వివాహ విషయమై అహోరాత్రంబులు తలపోయుచు అదికాదిది ఇదికాదది యని యూహాసౌధములపై భావతరంగములలో నల్లాడుచున్నారు. ఉండి సీమనుండి చాల సంబంధములు వచ్చినవి. సూర్యనారాయణ రాజు ఆ సంబంధములలో నేదో యొకటి చేయవలెనన్నాడు. వెంకయ్యమ్మ "నాయనా ఉండిసీమ నెంతధనమున్నను సుఖముతక్కువ లంకసీమ సంబంధమేదియైన చూడు" మన్నది వెంకాంబముఖము చిట్లించి "అమ్మా మనకు అచ్చిరాదే" అని కన్నులనీళ్లుగ్రుక్కుకొనినది "పోనీలేవే" అమ్మా అన్నది తల్లి. ఇంతలో దాసీది వచ్చి "అమ్మా తూర్పు రేవిడి నుంచి ఏరో బామ్మలెల్లిపో వచ్చినారు. పెద్ద బాబున్నారా" అన్నది. ఆమాట విని సూర్యనారాయణరాజు తొందరగా వెళ్లి కచేరీ చావడిలోనున్న యతిథికి అర్ఘ్యపాద్యాదులిచ్చి సగౌరవంబుగా నాతిథేయ సత్కారములు గావించి పిమ్మట వారిరాకకుఁ గారణము తెలిపికొన్నాఁడు. తల్లిదగ్గిరకు వెళ్ళి సంగతియంతయు జెప్పినాఁడు. తల్లి వెంకయ్యమ్మ "నాయనా చూచుచు నాచక్కని చుక్కను నాగారాలకూచిని రెండవ పెండ్లివానికి నేలాగున నీయనురా" మీ నాన్నగారు అన్నపూర్ణ అన్నపూర్ణ యనుచు ప్రాణాలువీడినారు. ముక్కుపచ్చలారని అన్నపూర్ణను ముప్పదియేండ్లవానికి ఏలాగున గట్టిపెట్టనురా? బ్రతికియుండినచో బలుసుకూరతినెదరు. ఈడుజోడు అయినవానికి ఈయవలయును గాని ఇదేమిటి ఈసంబంధము. ఏడు గోదావరుల యావల నెక్కడి రేవిడి గొనెక్కడిసంత? చాలుఁజాలు. ఊరకే సపతికొడుకు వైభవము చూచినదనెదరు చూడలేదనెదరు. ఎందులకీ తంటాలునునకు అన్నది. ఆమాటలువిని అప్పగారు మొగము ముకుళించుకొనినది. అమ్మా మీరుకూడ ఆ తెలుంగున సెలవిచ్చెదరేమి. తూర్పుసంబంధమునకు వచ్చినదేచాలు. కాళ్ళ దగ్గరకు వచ్చిన సంబంధము పోఁగొట్టుకొనరాదు. ఈడు జోడు చూచి చేసిన నాబ్రతుకేమైనది. అని కసరివేసినది. సరే అట్లయినచో మీయిష్టమన్నది తల్లి. ఏమిరా తమ్ముడూ ఏమనెదవు అన్నది వెంకాంబ. అక్కా! నాకిష్టమేనని, అమ్మామరి ఆయనతో ఖాయమేనని చెప్పనా? అని యడిగెను. సరే. పైన మీ పెద్దబావ ఉన్నారుకదా, ఆయనతోఁగూడ నాలోచించి తరువాత కబురు పంపెదనని చెప్పుము అన్నది తల్లి. "సరే" అని సూర్యనారాయణరాజు వచ్చిన బ్రాహ్మణునితోఁ తల్లిచెప్పిన సంగతులు చెప్పి పంపెను. తరువాత గొన్నాళ్ళకు సూర్యనారాయణరాజు పల్లెపాలెమువెళ్లి బావగారితో నాలోచించి రేవడి యుత్తరము వ్రాసినాడు. ఒక చక్కని ముహూర్తమున అన్నపూర్ణా వేంకటపతి రాజులకు దేవేంద్రవైభ

వముతో పాణిగ్రహణ మహోత్సవము జరిగినది.

౪

ఇప్పటికి అన్నపూర్ణ వివాహమై యైదేండ్లయినది. ముద్దుసువస్త్రములు. రకరకంబుల చీరలు ధరించుచు మూఁడుకూరలు ఆరు పిండివంటలతో భుజించుచుఁ జీకు చింత లేకుండ అన్నపూర్ణ ప్రణయసుఖములు అనుభవించుచున్నది. రెండవపెండ్లి యన్న లోప మెక్కడను గాన్పించుటలేదు. ఆమెను గాంచినవారెల్లరు

"నిత్యపాతివ్రత్య నియమ వ్రతంబున
కన్నపూర్ణాదేవి కన్నపూర్ణ"

అని కొనియాడుచుండిరి.

౫

గర్భవతియైయున్న పూర్ణ యెనిమిది మాసముల క్రిందనే పుట్టినిల్లయిన గుడిమెళ్ళంకకు వచ్చినది. వచ్చినపుడు భర్త యెట్టిలోపము లేకుండుటకై నాలుగువందల రూపాయలు ట్రంకులో వైచికూడఁ బరిచర్యలకు నలుగురు దాసీలనుగూడ బంపెను. అంతఁగొన్నాళ్ళకు అన్నపూర్ణ సుఖ ప్రసవయై యాఁడుబిడ్డను గనెను. కూఁతునకు నిలువెల్ల బంగారపు తొడుగు తొడగినారు. అరచేతులలోఁ బెట్టి యాడించుచుఁ బొద్దుపొడచినది యెరుగకుండ నెల్లరు ఉల్లాసముతో గాలము వెళ్ళబుచ్చుచుండిరి. ఇంతలో గజపతినగరమునుండి వేంకటపతి రాజుగారు ఐదువేల రూప్యములిచ్చి గజపతి నగరములో నాలుగిండ్ల భవంతిని కొన్నాడు. చక్కనియిల్లు. గృహప్రవేశము త్వరలోఁ గావలసియున్నది. కనుక నైదవ మాసములో చిరంజీవినిని పంపించవలెను. అని వ్రాసిన యుత్తరమును జూచికొని అన్నపూర్ణ పట్టరాని సంతోషముతోఁ బొంగిపోయి ఇంటఁగల యందఱితోడను అద్దెకొంపలో నుండు నవస్థతప్పినది అని యుత్తరము చదివి వినుపించి అప్పా మీరు తప్పకుండగ రావలయును జుమా. సూరేఁడన్నయ్యా మీరుకూడ రావలయును. అన్నది. ఇంతలో కరణముగారి కామక్క వచ్చి ఏమమ్మా అన్నపూర్ణా చాలా సంతోషముగా నున్నావు అన్నది. అబ్బే యేమియు లేదు. మీమనుమలు లోఁగిలి కొన్నారఁట. ఈమాసములో గృహప్రవేశములు అన్నదియన్నపూర్ణ. రేవడిలో మీయిల్లు యేమైనదమ్మా అన్నది కామక్క. ఏమిటో మీ చాదస్తము. ఏనాటి రేవడి. ఏనాటికథ. తండ్రిగారికి వారికిఁ బడకపోవుటచే రచ్చలకెక్కుట సాఁబాలువీసు సంగోరువారుపంచుకొనుట షష్టాష్టకాలు అయి మూఁడేండ్లయినది. సరి సరి అట్లైతే మీయాయన దత్తపుత్రశోకము తెచ్చినాఁడు. అన్నది కామక్క. అయ్యో. ఊరకొనుఁడు, కామక్కగారూ అన్నది అన్నపూర్ణ. అన్నపూర్ణకు గామక్కమాట అశనిపాతమువలె నాయెను. ఉస్సురస్సురనినది. చంద్రబింబమువంటి అన్నపూర్ణ మొగము చెన్నుతరిగెను. గబగబ లోనికిఁజని అమ్మా కామక్కగారు ఈలాగుననన్నారు. ముసలివారి మాటలు తగులునని పెద్దలనెదరు. అన్నపూర్ణ కంట తడిపెట్ట తల్లీ అన్నపూర్ణ అది మామూలు మాటేసమ్మా యని వెంకయ్యమ్మ కూఁతు నోదార్చెను.

౬

కార్తిక శుద్ధయేకాదశి బుధవారము

లేపనంగా దశమినాటి రాత్రికి గజపతినగరమునుండి కాంక్రరపట్టి ఖండపల్లిమీదుగా వేంకటపతిరాజు గుడిమెల్లంక చేరెను. చంద్రోదయపున నీరాకరంబువలె వెంకయ్యమ్మ సంసార సాగరము వేంకటపతిరాజు రాకంజేసి గగన వీధిని దరంగితంబగుచుండెను. ఎల్లర భోజనంబులు అయినవి. అత్తగారితోడను బావమరిది తోడను కష్టసుఖములు ముచ్చటించి వేంకటపతిరాజు శయనాగారము జేరెను.

మొలకనవ్వుల ముద్దుగులుకు నెమ్మోముతో
గొజ్జంగి విరుల క్రొల్లొప్పుతోడ,
అపరంజి మెఱుంగు టందపు మేనిచాయతో
వృత్తంపు గబ్బిపాలిండ్లతోడ
కపుర వీడ్యపుం దావిగ్రమ్ము కెమ్మోవితో
గలదు లేదను కౌనుచెలువుతోడ
కాటుక పసమీఱు కడకంటిచూడ్కితోం
గలితకపోలభాగంబుతోడ
స్వర్ణభూషణమణి చకచ్చకలతోడ
సందముగనిల్చె ముంగల నన్నపూర్ణ

పిమ్మట నిరువురు శరత్కాల కౌముదింగాంచి అగ్గలంబగు సంతసంబుమై నాగటికిం జేరియున్న పెరటిదొడ్డి లోనికిం జని తివాసిపై గూర్చుండి చదరంగ మాడుకొనుచు నడుమ నడుమ గారాల కూతురు చుబుకంబు పుణుకుచుం తొమ్మిది గంటల వరకు కాలంబు వెడలంబుచ్చియింటిసంగతులు ముచ్చటించు కొనుచుండగా నాకసంబున పేటంతమబ్బు తోతెంచెను. తళుక్కున మెఱపుమేఘముకూడ మటుమాయ మాయెను. అన్నపూర్ణ యదికని ఏమిటలంపునకు వచ్చెనో నాథా మన మిహపురము ఎప్పటికైన నా మెఱుపు మేఘములవలె లీనముగావలయును అన్నది. "చాలు" ఊరకుండుము అన్నాండు వేంకటపతిరాజు అంతలో బదునొకండుగంట లాయెను. వేంకటపతిరాజు నిద్రించెను. ముందు ప్రయాణముండుటచే అన్నపూర్ణకు నిద్దురపట్టలేదు. ఉదయమాగుగంటలకే ప్రయాణము అని యనుకొనుచు అన్నపూర్ణ యటియు నిటియు సవరించుకొనుచుండగా నే బళ్లునం దెల్లవారెను. తొందర తొందరగా భోజనములు చేసిరి.

## ౭

అన్నపూర్ణయు వేంకటపతిరాజును సూర్యనారాయణరాజు వెంకాంబయు నలుగురు దాసీలును బండ్లనెక్కినారు. అన్నపూర్ణా! పిల్లజాగ్రత యని వెంకయ్యమ్మ బండిలోనున్న పిల్లను యందిపుచ్చుకొని ముద్దు పెట్టుకొని అన్నపూర్ణా పిల్లజాగ్రత్త పిల్లజాగ్రత్త"యని తల్లిచేతికిచ్చెను. ఏడుగంటలగునప్పటికి రాజోలు రేవులో బండ్లాగినవి. యప్పటికప్పుడే "స్టీముబోటు" కూతవెట్టి బయలుదేరి సిద్ధముగానున్నది సరి. అందరును "బోటు" క్కిరి. బోటు సాగిపోవుచుండెను. కాకుల అరచుట, కొత్తకుండలతో మంగలిహాంఫు ఎదురగుట మున్నగు దుశ్శకునములు ఎన్నియో అగుచున్నను ప్రయాణము తొందరచే నెవరును బాటింపలేదుగాని అన్నపూర్ణ యేలకో యూరక యాందోళనపడుచుండెను. పైకిం జెప్పుటకుం బడుగుచున్నారని సంశయించినది. క్రమముగా స్టీముబోటు

ప్రక్కనొక పడవను కట్టుకొని నిండుచూలాలు వలె నలసగతితో నీటిమీఁద తేఁగుచు బొబ్బర్లంకలాకు దాఁటి సాయంకాలము ఆఱుగంటలు రాజమండ్రి గోదావరిని దాఁటఁజొచ్చెను. చంద్రోదయమాయెను. చంద్రకిరణముల తాఁకున అన్నపూర్ణా వదనారవిందముతోపాటు గోదావరీ స్వచ్ఛజలంబులు కూడ తళతళ మెఱయుచుండెను. రానున్న ఘోరవిపత్తును సూచించుచుఁ జంద్రుఁడు వీడు కన్నీటికణముల బుడగలో యన్నట్లు చిఱుచేపలు నీటిపై కెగవేయుచుండెను. అన్నపూర్ణ దృష్టులు వానితో మేలమాడుచుండెను. ఇంతలో గభాలున ప్రక్కను గట్టిన పడవ త్రాడు త్రెగగా నందలిజనులు కంగారుపడుచు "స్టీముబోటు" పైకెక్కిరి. హా! యేమున్నది అంతయు అల్లకల్లోలము. అంతయు నంధకారము. చంద్రుఁడు స్తంభీభూతుఁడయ్యెను. బిడ్డను బుజముపై నిడికొని నాథా అన్నది అన్నపూర్ణ. సఖీ అన్నాఁడు వేంకటపతిరాజు. పిల్లా! పిల్లా! అన్నారు వెంకాంబా సూర్యనారాయణరాజులు. అయ్యో! అయ్యో! అన్నారు దాసీలు ఒకరి చేతులొకరు పట్టుకున్నారు. అన్నపూర్ణా వేంకటపతిరాజులు ఒకరిలోనొకరు లీనమైనారు. ఏమైనారో నెవరికిఁ దెలియదు. రాత్రి పదిగంటలకు రాజమండ్రి రేవులో గృహప్రవేశము గంగాప్రవేశమయినది అని ఏడ్చుచు నొక యువకుఁడు నిలువబడ్డాఁడు.

---

## దోహదము.

(శ్రీ త్రిపురనేని చలమయ్యచౌదరిగారు)

1. ప్రౌఢకాంతలు శుభముహూర్తంబునందుఁ
బలుకు పలుకున మకరంద మొలుకుచుండఁ
బ్రేమగీతమ్ములను నాలపించునపుడు
సిగ్గు తెరవిప్పి నిన్ను వీక్షింపనైతి!

2. అక్షతలుఁ జల్లి స్వస్తి రస్తనుచుఁ బలికి
ద్విజపురోహితు లాశీర్వదించునపుడె
మామకామలహృదయ పద్మంబునందె
స్నేహబీజమ్ము లంకురించినవి చెలియ!

3. అగ్నిసాక్షిగఁ గొన్న యర్ధాంగలక్ష్మి
ముగ్ధమోహనకళ్యాణమూర్తి యనుచు
నపుడు పెండ్లిపెద్దలు ప్రస్తుతించినారొ
స్వాతిశయమున వెట్టినైపోతినపుడె

4. సరసశృంగార ముగ్ధవేషమ్ముఁ దాల్చి
సిగ్గుపొంగు చెక్కిళ్ళపైఁ జెంగలింపఁ
గ్రేఁగనులఁ దోడ నన్నుఁ గటాక్షించి తబల!
నూత్నదాంపత్య మెంతమనోహరంబు?

5. వలపు చిందిన యీ మెలప్రాయమందు
నెపుడు స్నేహపూరమ్ము నొల్కించినావొ;
భావిసౌభాగ్యలక్ష్మియే ప్రణయమూర్తి
అంచు నాహృదయ మర్పించుకొంటి

6. సరసకవితార సజ్జశేఖరుని బ్రేమ
శృంఖలంబులు విప్పి బంధించియున్న
ప్రణయినీ ముగ్ధమూర్తి; నాస్వాంతవీధి
దివ్యనర్తకి రీతి నర్తించుచుండె.

"మోహనవల్లిసుండి"





# పుష్పమాల.

శ్రీ శేషాద్రిరమణకవులు.

—:o:—

ఋషిమనఃపథముత్తరించి వెల్వడిన
నిగమగానముచే నిండారినట్టి
యాశ్రమంబులు కంటకాకీర్ణ గుల్మ
ఘట్టంబులై కనుపట్టవెచ్చోట॥

—

ఆత్మ స్వతంత్ర రక్షార్థులై నిలచి
మాతృదేశము వైరి మాంసమేదోస్థి
కలితంబొనర్చిన తెలుఁగు భూపతుల
రణరంగములు కనరావె యెచ్చోట॥

—

రణమున నొదిగిన రాజసత్తముల
చితులందు సుఖనిద్ర చెందిన యాంధ్ర
సుందరీ విశ్రాంతి మందిరసమితి
భావ దృష్టికిఁ గనుపట్టదెచ్చోట॥

—

ఆంధ్రభాషకు భారతామ్నాయమొసఁగి
ఆంధ్రజాతీయత కాయువొసంగి
ఆంధ్రతేజంబు లోనాలీనుఁడైన
భట్టనన్నయకు టుంబమ్మెకన్పడదు॥

—

అమృతాక్షరములతో నాంధ్ర భారతము
సర్వముల్ పదునేను ప్రచురించినట్టి
ప్రాజ్ఞుఁడౌ తిక్కనపైఁడి గంటంబు
కటకటా కలసెనే కాలగర్భమున॥

—

జైన భిక్షుకురీతి శాంతాశ్రమమున
జీవితంబున పూర్తి జేసి భాగవత
సంహిత వ్రాసిన సహజ పాండిత్య
మందిరం బెద్దియో మటుమాయమయ్యె॥

—

నూటొక్క రాజుల నూత్న రక్తమునఁ
దండ్రికిఁ గలనిలోఁ దర్పణమిడిన
అనపోత విభుని కీర్త్యాలవాలంబు
తెలియరాదే యాంధ్రదేశ మధ్యమున॥

—

ప్రౌఢరాయుని సభా భవనమధ్యమునఁ
గనకాభిషేకంబు గావించువేళ
శ్రీనాథ కవిరాజసింహు నీరార్పు
దీనార మొక్కటియేని కన్పడదె॥

—

కవితాలతాంగి యంకమునందుఁ బెఱిఁగి
కవితాలతాంగితోఁ గలసివర్తించి
కవితలో లీనమై కాయంబువిడిన
రాయలకథ వినరాదెయెచ్చోట॥

---

ఆత్మీయ సామ్రాజ్యమంతయు నాంధ్ర
కవుల సర్వస్వంబుగా నొనరించి
శ్రీకృష్ణరాయలు చేకొన్నకృతులు
కనఁబడవేల యెక్కటొ రెండొదక్క॥

---

ఆంధ్రశిల్పాచార్యు లాత్మీయశక్తి
బౌద్ధయుగంబునఁ బ్రకటించుకొఱకు
సనువొందనిలుపు విహారరాజములు
చెడుఁగాక, దొరుకవే చిహ్నంబులేని॥

---

ఆంధ్రజాతీయత నరసినతల్లి
కనకదుర్గాదేవి కన్నుమొరంగ
ఆంధ్రవిష్ణువు వీడె నాత్మీయ హితము,
ఏమి కానున్నదో యీ యాంధ్రలక్ష్మి

గడచిన జాతీయ గౌరవాంకములు
ధాత ప్రపంచస్థ భవనాంతరమున
నెలకొల్పినవని దే నిఖిలాంధ్రులార
బయలుసేయుఁడి మాతృపరిచర్య జేయ॥

---

మఱచిన మహనీయ మాతృబోధనల
సోదరాంధ్రులకు నుద్బోధింపవలయు
తీఱిన జాతీయ దివ్యచిహ్నములఁ
జిరతరస్థాయిగాఁ జేయఁగావలయు॥

---

చారిత్రక స్థలాంచల సీమలందు
దమయంత మొలచెను దలిరుదీనియలు
తీవెకొక్కకవిరి త్రెంచి గుచ్చుపదము
పుష్పమాలిక జగన్మోహనంబుగను.

---

ఆశీస్సు

---

ఆంధ్ర మాతృగళహస్త హారాళియందు
నీపుష్పమాలయు నింపొందుఁగాత"

---

## పుష్పమాల

నందూరి శివరావుగారు

సీ॥ తినుచున్నకసవట్టె దిగజాఱ మొదవులు । వీనులునిక్కించి వినుచునిలువ
పనులెట్టులున్న వట్టునిచి పర్వునవచ్చి । గోపికల్ చుట్టునుగూడిచూడ
సహజవైరమ్ము ప్రశంసదోపకయుంట । జంతుసంతతియొక్క చక్కమెలఁగ
నానందపారవశ్యమునఁజిత్తరువట్లు । ప్రకృతియెల్లను జడత్వమువహింప

గీ॥ నూఁదనుమటున శిఖిపింఛమూగనుంత । తరువునెక్క జగద్వశీకరణగీతి
పాడుచుండెడి వేణుగోపాలునఱుతఁ । బాలుపుమీఱుతఁజిరము మాపుష్పమాల




శ్రీమతి భూపాటి శేషమ్మగారు.

---

చిత్రవర్మయనురాజు మగధదేశమును బరిపాలింపుచు దేవేంద్రభోగములతో నొప్పుచుండెను. సుగుణభూషితుండగు నారాజునకు సద్గుణయను నొకకూతురుండెను. ఆయమ సమస్తవిద్యలయందారితేరి చక్కదనముల చుక్కయై బుద్ధివిశేషముల దన నామము సార్థకమొనర్చుచు జననీజనకుల నానందవార్ధి నోలలాడింపుచు నవయౌవనముతో నలరారుచుండెను. మగధదేశ పరిపాలకుడగు రాజసింహునకిచ్చి సద్గుణయభిమతంబున నతి మహోత్సవములతో నుద్వాహమొనర్చి సకలపరివారములతో దాసదాసీజనములతో గజతురగాది యరణములతో దనకూతు నత్తవారింటికనిపెను. సద్గుణయు నత్తవారింట కేగుదెంచినది మొదలు గృహకృత్యములజక్కగా నిర్వర్తింపుచు నత్తమామలకు సపర్యల మూలమున నానందమొనగూర్చుచు పతిని దైవముగాభావించి యడుగులకు మడుగులొసగుచు బూజించుచుండెను. భర్తయు సద్గుణవతియగు సద్గుణయందనురాగము గలిగియుండెను. ఇట్లా దంపతులు పాలును నీరమునుబోలె నన్యోన్యానురాగమున మెలంగుచుండిరి. అతిథియభ్యాగతులకు భర్తయనుమతి నర్ఘ్యపాద్యాలదు నర్పించుచు మిగుల జాగరూకతగా మెలంగుచుండెను. మనము పురాణములయందు వినుచున్న సాధ్వీమతల్లులగు సీత, దమయంతి, చంద్రమతి, మొదలగు పతివ్రతామతల్లుల దివ్యచరిత్రము లీమెయందేగలవని పురజనులు వేనోళ్ళ వినుతింపుచుండ నాసద్గుణ సద్గుణముల గాపురమొనరింపుచుండెను.

కొన్నిదినము లిటుల గడచిన పిదప వృద్ధులగు నత్తమామలు స్వర్గమునకు జనిరి. దుర్గుణములు గలవారెప్పుడును మేలులోనకీడుగూడగలదనియు దైవభక్తియు సుగుణపరంపరయుగలవారికి కష్టములు గలుగగలవనియు మన పురాణ శ్రేష్టమగు భారతమున వినుచున్నారము. ప్రత్యక్ష ప్రమాణముగా గొందరు నారీమణుల జూచుచున్నారము. సద్గుణ భర్తయగు రాజసింహుడు జ్వరబాధపీడితుడై దుర్భరావస్థయందుండ దన్నపహరింపనెంచిన దుర్మార్గులగు తురుష్క సైన్య మాకస్మికముగా నేతెంచి కోట ముట్టడించెను. ఈసంగతి సద్గుణపట్టి మనంబున మిగుల విచారించి దుఃఖింప నారంభించి యొక్కట తన దనయువివేకమును దెలిసికొని ధైర్యమవలంబించి యనారోగ్యవంతుడగు భర్తనెటులేనిగాపాడగలిగినకదా నాజన్మముసార్థకమగును. ఈవిధమున విచారమహాసాగరమున మునింగి దేలుచున్న నుద్ధరించెడి వారెవరు.

అనితలపోసి యతిభక్తి భగవన్నామము గీర్తించి సమీపమందలి ఖట్వమున దరి సేరకున్న భర్తకాయాస మొదపకుండ మెల్లన నొక కుర్చీపై బరుండఁజేసి యరాతుల కరవాలములకెరగాకుండ నేవెరవున నాపలఁ జేర్చ నగునాయని దలంపుచు వెనుకకుజూడ నలువురు తురుష్కులు భయంకరాకారముతో తన్ను సమీపింపనుండుటను జూచెను. బాల్యమున నుండి సాంగ్రామిక విద్యాపరిశ్రమ మొనర్చి యున్నదగుట జంకక యాత్మ రక్షణార్థము మొలయందుంచియున్న చంద్రాయుధము వరనుండిదీసి యవ్వారి శిరములనరికి యింకనిచ్చట నిల్చుటదగదు జాగుసేయుట నోగుఁగలుగునని దలచి వెంటనే భర్తతోగూడిన యాకుర్చీని శిరమునజేర్చుకొని నిశాసమయమగుటయు, ప్రయాణాయాసముననున్న శత్రువులు మైమఱచి నిదురించుచుండుటయు గారణములుగా నంధకారము దనకుదోడ్పాటుజూప మెల్లమెల్లగ బురోపకంఠ మతిక్రమించి రెండు క్రోశముల దూరముననున్న గొల్లపల్లియ జేరెను. ఇంతలో దెల్లవారుచుండుటచే పరులకంట బడిన శ్రమవృథాయగుటగాక ప్రమాదమూలకమగునని దలంచి చిరపరిచయురాలగు నొక గొల్లముసలి యింటికి జేర్చెను. ఆయింటి యవ్వయు సకాలమున దీనతతో దనగృహమును జేరిన సద్గుణనాదరించి ప్రేమజూపి వైద్యసహాయమున గొన్ని యౌషధముల గొనివచ్చి రాజసింహునకొసంగుచు నుపచరింపుచుండెను.

కొన్ని దినములిట్టుల గడచెను. దైవానుగ్రహమునకు నౌషధ సహాయమున రాజసింహునకు గ్రమక్రమముగా నాజ్వర బాధ యుపశమించుటయేగాక నారోగ్యము గలుగజొచ్చెను. ఆరోగ్యవంతుఁడగుచున్న భర్తనుజూచి సుగుణకుఁగలిగిన యానందమునకు మితిలేకుండెను. ఒకనాడు ముసలి యవ్వనుబిల్చి "నీవొనర్చిన సాహాయ్యమమూల్యమైనది. శత్రువులవలన గలుగు బ్రమాదమును నేని పాటింపక మమ్మాదరించి గష్టకాలమున దోడ్పడితివి. నీ మేలు మరువజాలను." అనుచు దనకంఠమునఁగల యమూల్యమగు రత్నహారమొకటి దీసి యొసంగబోయెను. కాని యాయవ్వ చేకొనక తమ పరిపాలనా విశేషమున సుఖించుచియున్న యీశరీరములు సొత్తులును దమవేగదా. అట్టి మీ సేవకు నియోగపడి కృతజ్ఞతఁ జూపింప నవకాశము చిక్కిన దదియే మహాభాగ్యముగా నానందించుచుండ నీభార మీసేవకురాలిపై వేయుటదగదని వినయ విధేయతలతోఁ బ్రార్థించెను. కాని సుగుణ యాయవ్వ ననునయించి సంతోషపూర్వకముగా నొసంగు దీనింగొనుట దగునని తెల్పుచు బలవంతముగా నాయమమెడయం దాహారమును స్వయముగనుంచెను. అయవ్వయు కృతజ్ఞతానందనము లర్పించెను.

తర్వాత సుగుణ యారోగ్యవంతుఁడైయున్న భర్తతో నికపై నిచ్చట నిలుచుట ప్రమాదమనియు నెందేని రహస్యవృత్తిని గాలయాపన మొనర్చుచు సమయమే తెంచిన శత్రుసంహార మొనర్చి సింహాసన మాక్రమించుట నగుననియు నాలోచించుచుండ భర్త పిలుపువినన య్యెను. వెంటనే భర్త సముఖమునకుఁజని విధేయతగా నిలిచియుండ యామెంజూచి సతీ! మనమింక నిటవడయ రాదు. శత్రువులకు సమీపమునున్న

యీచోటు మనకుఁబ్రమాద దాయకము. కావున స్థలాంతరమున కేగవలయుననుచు కన్నుల శ్రుధారలు దొరగుచుండ సతీ నీ వొనర్చిన సాహసము కొనియాడదగినది. అబలలబలలని పలంప జెల్లదుగదా. నా పూర్వపుణ్యపరిపాకాతిశయమున భార్యనుగావడసి ధన్యుఁడనైతిని. ప్రాణదాన మొనర్చిన నీమేలెన్నటికిని మరువదగినది కాదు. ఇంచుకతడవైన గోమాంసభక్షకులు కిరాతకులగు తురుష్కుల కరవాలముల కెరగావలసినదేగదా. ఔరా! సాహసము. నీనేర్పు వేనోళ్ళగొనియాడినను తరుగదు. అనుచు సద్గుణ ననేకవిధములగొనియాడుచు హృదయగతమై పెచ్చుపెరుగ నానందరసము వెల్లివిరియించెను. భర్తయానందమునకు పాత్రురాలనై ధన్యనైతిని గదా నాజన్మము సార్థకమైనదియని సుగుణ యాత్మఁదలంపుచు ప్రాణప్రియా! ఇందతిశయమేమియున్నది. సాధ్వినియామకముగా నొనర్పవలసిన పనులనొనర్చిన యీదాసి వినుతికిదగునా. నాయందలి ప్రేమచే నిట్లాడుచుంటిరే కాని యతిశయమేమియు గానరాదు. కాని మనయిరువురి ప్రాణములు రక్షించి మహోపకార మొనర్చినదీయువ్వ. ఈయవ్వను కొనియాడవలసి యున్నదనుచుండ సతీ! యగునుగాని ప్రస్తుతము మన మొనర్పవలసినబనియేమి. కాలాతిక్రమమునకు సమయముగాదు. నీయుద్దేశ్యమేమి?

సతీ:- రాజ్యపదభ్రష్టులమై ప్రపంచముఖమును జూచుటకు మనస్సొప్పకున్నది. ఒకవేళ మనస్సు స్థిరపఱచుకొనినను శత్రువులు మనజాడయెరింగిరేని ప్రమాదము చేకూరఁగలదు. కావున నరణ్యప్రాంతముల కేగి మానప్రాణముల సంరక్షించుకొని దైవసహాయమున బట్టబయలు పడవచ్చును. దుర్దినము లిట్లేనిలువవు. బండియాకులంబోలె చీకటి వెన్నెలలవంటి కష్టసుఖములు దేహికి సంప్రాప్తించుచుండును. సుదిన దుర్దినప్రభావమున ప్రాభవహైన్యములు గలుగుచుండ నింక విచారించు విషయము గూడనంతగాఁగానరాదు. తదుపరి దేవరచిత్తము.

పతి:- సతీ! నీయాలోచన మెంతయేని తగియున్నది. అటులేయొనర్పుట యుక్తము. కాని ప్రాణప్రియా! నాడు నీవొనర్చిన సహాయము సాహసము లెంతయేని కొనియాడఁదగియున్నవి. పలుమాఱదియే స్ఫురింపుచున్నది. గర్భవతివిగానున్న నీవరణ్యప్రాంతముల నెట్లు ప్రయాణమొనర్పఁగలవు. భయంకర మృగసమాకీర్ణమగు కాంతారమున నెటులవసింపఁగలవు. కావున బుట్టినింటికేగుట యెంతయో బాగుగనున్నది. నామాటవిని నేను వచ్చువఱకు నీవు బుట్టినింటనిలిచిన కొంతదోసఁగువాయును. నీవువచ్చినటుల నీదినములు స్థిరముగనిల్వవు గదా? వేరుభావింపక నాయభిమతమున ననుసరింపుము.

సతీ:- ప్రాణేశ్వరా! ఎంతటిమాటవచించితిరి. మీరరణ్యప్రదేశముల శ్రమలనందుచుండ నేను పుట్టినింటనుండవలయునా? ఇది సాధ్వీలక్షణమా? భర్తవెనువెంటనుండి కష్టసుఖముల

భాగస్వామియై చరించు నాజన్మము జన్మముగాని తద్వ్యతిరేకజీవన మొక జీవనమా, నాయందు సంపూర్ణ ప్రేమగలదేని యికముందైన దామట్టియుద్దేశ్యము వహింపకుఁడు. తమతోజరించు భాగ్యమీసేవకురాలికి దయచేయుఁడు. మీపాదసేవ యొనర్చుచుండుటయే నాకు పరమసౌఖ్యము, వేయేల నాశరీరమునేని విడిచెదను. గాని దేవరవారినివీడి పుట్టినింటికి జననని స్వతంత్రించి వచించినందులకు క్షమియింపఁబ్రార్థించుచున్నాను. కరుణింపుఁడు. దీనురాలి మన్నింపుఁడు. అనివచించెను.

ఈమాటలు ప్రియురాలినుండి విని రాజసింహునిహృదయ మానందకందళితమయ్యెను. ప్రియురాలిమనస్సు నొచ్చెననియెంచి ప్రియా! నిహృదయ మెఱుంగుటకట్లంటిని. ప్రాణమునకు ప్రాణమైననిన్ను విడిచినేనుమాత్ర మొక్క నిమిషమేని గడుపగలనా. మనస్ఫూర్తిగ ననుమతించుచున్నాను. ఇందనుగ్రహింప వలసినది లేశమేనిలేదు. అనివచింపుచు మరునాఁడు వేకువను బయలుదేరి సమీపమందలి యరణ్యమునఁబ్రవేశించి నందందుగల పుణ్యనదులయందు స్నానాదుల నొనర్చుచు మున్ను సీతారామలక్ష్మణులు సంచరించిన ప్రదేశములంగల చిహ్నములజూచి యానందింపుచు సీతారాముల గొనియాడుచు నీ ప్రదేశసంచార మొనర్పగలుగుటధన్యమాటగదాయని భావింపుచు ననవరతప్రయాణ మొనర్చుచు నొకపల్లియదరిజేరి. రాజసింహుఁడు దనభార్యతో నిందువసించియుండుమనియు సమీపమందలి పట్టణమునకేగి భోజనమునకుపకరించు వస్తువులగొని తెచ్చెదననియు వచించి ప్రయాణమగుచు జాగరూకతయుస పలుమాఱుదెల్పి వెడలిపోయెను. భర్తరాకకెదురుచూచుచు సుగుణ సాయంకాలమువఱకా ప్రదేశముననే వేచియుండి సాయంతనమగుటయు భర్తరాకుండుట నెమ్మనమున కుమ్మలికగదుర నతివ్యాకులతనందియేమియు దోపక యారాత్రిబైట నివసించుట ప్రమాదదాయకమని యెంచి పల్లియలోనికి బోవనెంచివేచి తనభర్త యేతెంచి దన్నుగానక బరితపించునేమోయనియు దన్నచ్చటనే జాగరూకతగా నుండవలసినదిగా నాజ్ఞయొసంగిన భర్తయుద్దేశ్యమునకు వ్యతిరేకమొనర్చిన దాననగుదునేమోయని విచారించి విచారించి మనస్సు గుదుర్చుకొని సమీపమందలి పల్లియకుచేరెను. అందొక ముసలియవ్వగానవచ్చి తనవృత్తాంతమునడుగ వర్ణించెను. వినిన యాయవ్వయు గరుణించి దనయింటికి రానలసినదనియు కార్యాంతరమున నాలశ్యమొనర్చిన భర్తయునింతలో రాగలడనియు నాదరించి బిలువనేమియు నొనర్ప నవకాశములేకుండుట దెలిసి సుగుణ యెటులోయొప్పుకొని యామెయింటికిచేరెను. అవ్వయు నార్ద్రహృదయయు ననుభవయునగుట మరునాడంతయు దనకొమారునిచే సమీపమందలి పట్టణమున వెతకించెను. కాని రాజసింహునిజాడ యేమాత్రమును దెలియమిచే నాతడిల్లుచేరి సుగుణకెఱింగించెను. మఱునాటికేని రాగలడన్నయాశతో సుగుణ నాడెటులనో గడపెను కాని యాతనిజాడయే దెలియలేదను పిడుగునంటి వార్తచే నడల

వలసినదాయెను. ఆమె యారాత్రియంతయు ముందుదానెటుల బ్రవర్తింపవలయునా యన్న యోచనతోడనేగడపి యవ్వంగాంచి భర్తసందర్శన భాగ్యము లభింపమిదాను జీవింపజాలననియు నన్వేషించుటకై జనెద ననియు నెఱింగించి విశ్వాసము మఱువనని యామెపలన సెలవంది మనుష్యసంచారమునకు దూరమై ఘోరసింహ శార్దూలాది క్రూరమృగసంచార యోగ్యమగు భయంకరాటవిని జేరి కందమూలాదు లాహారముగ పొదరింట్లు నివాసగృహములుగను వన్యమృగములు సఖీజనులుగను నొనర్చి ప్రాణప్రియుని నామమే ధ్యానము చేయుచుండెను. కాలచక్రమాగునది కాదుగదా. సూర్యుని రాకపోకలచే నామెకు నవమాసములు నిండెను. సుగుణ భయంకరారణ్యముల నివసించుటకుఁగల కారణములను పాఠకులూహించియుందురు.

సుగుణ తనగర్భమున పురుష శిశువుదయింపఁగలఁడనియు నాతని వలననేని తన భర్తృసమావేశమును సౌఖ్యవడయగలుగుదుననియు నమ్మియుండుట చేతనే ప్రాణములను ధరింప గలిగినది. ఒక్కొక మారామెకు దన ప్రాణములనుకూడ విడువ దలంపు జనించెడిది. కాని విధి నియామక మట్టిది కాకపోవచ్చును. కావుననే సాహసము వహింపజాలదయ్యెను. ఒక దినమున సుగుణకు ప్రసవ వేదనమొదవెను. భగవన్నామ స్మరణమొనర్చుచు దనకు జన్మించు సంతానమువలన నేని యిక్కట్టుల దొలగింప ననుగ్రహింపుమని శ్రీయఃపతిని పలుమారు వేడుకొనెను. సుగుణ భావిభాగ్యఫల హేతువుగా దేదీప్యమాన ప్రభతో నిరువురు బాలకులు జన్మించిరి. ఆమె యాశాలత వికసించెను. సుధాకర మండలమును బురడించు నెమ్మోములతో నాయిరువురు సుతులును సుగుణకు గన్నుల పండువు గూర్చిరి. వారిని పెంచు పనితో నిప్పుడామెకు బొత్తుగా దీరుట లేదు. బాలురు వరప్రసాదులాయనునటుల నాయారూపముల చక్కని పోషణ మొదవకున్నను సహజ సౌందర్య విలాసములతో దిన దిన ప్రవర్ధమానులగుచుండిరి. శిశుసందర్శన భాగ్యమున సుగుణకు సమస్త భాగ్యము లొదవినట్లయ్యెను. వారిపై ప్రాణములనిడికొని కంటికి రెప్పవలె గాపాడుచుండ నాబాలురు మూఁడేడులవారైరి. మొలలోతు దుఃఖమున నాభగవంతుఁడు మోకాలి బంటి సంతోష మొసగూర్చుచుండును.

బాలుర బాల్యచేష్టలానందము గొలుపసాగెను. దినములు యుగములుగా గడచునా సుగుణకిప్పుడు దినములు నిమిష మాత్రములయ్యెను. ఇటుల జరుగుచుండ నొకనాడు బాలురకిరువురకును ఫలహారము నిచ్చి నివసించు కుటీరమును వదలి సమీపమందలి గంగాప్రవాహమున స్నాన మొనర్చుటకు జనియెను. నీటియందు దిగి స్నాన మొనర్చుటకు బూనిన సుగుణకు దనభర్తతో గడచిన సౌఖ్యవిశేషములు జ్ఞాపకమునకు వచ్చెను. క్రమ క్రమముగా నెమ్మన మాలోచనా ప్రవాహమున బడి తన్మయత్వము చేకూరెను. అందుచే సుగుణ దానెచట నుండెనో యేమి చేయుచుండెనో యన్న స్మరణకూడ దప్పెను. ప్రవాహవేగమిదియే సమయమని దనలోనికి గొనిపోయినదా యననామె ప్రవాహమున బడెను.

ఆమెకు స్మరణ వచ్చెను. తన కొదవిన ప్రమాదము గ్రహించెను. ఆర్తశరణ్యా దీనబంధూ? శ్రీకృష్ణా దిక్కు లేని నాబాలుర కాపాడి నా వంశము నిలుపుము అని వచింపుచు కరములు మొగిచి పైకొని వచ్చు తరంగములచే మునుగుచు లేచుచు గొట్టుకొని పోవుచుండెను. ఈయార్తధ్వానము సమీప మందలి పుత్రులు వినిరి. తమ్ము పిలుచుటగా భావించిరి కాబోలు నాయిరువురు దోగాడుచు దప్పటడుగులు వేయుచు నా ప్రవాహపుటొడ్డునకు జేరి తమ తల్లియవస్థనుజూచుచు తరంగ మధ్యమున గన్పడిన జూచి నవ్వుచు మునిగి గానరాకున్న నేడ్చుచు బాల్యచేష్టల వర్తింపుచు నీటివైపు వ్రేళులజూపి యమ్మా యమ్మా యని పిలుచుచు దమ్ము గాంచు రాళ్ళైన కరగిపోవ నేడ్చుచుండిరి. సుగుణకు స్మరణ దప్పియుండెను. దీనబంధు వను నన్వర్థనామ విరాజమానుడగు పరమాత్ము డాయువతిలలామ నొక కంట గాపాడుచుండెనుగాబోలును. ప్రవాహమున గొట్టుకొనిపోవుచున్న సుగుణ ప్రాణములు గాపాడుటకా పరమాత్ముడు ఒకనావను గొనివచ్చె నాయనునటుల నొకా నొక నావ ప్రవాహమున కెదురు నడిపించుకొని వచ్చుచుండెను. దానియందు నల్వురు ప్రయాణికులును నావనడుపువాడును చుక్కాను పట్టువాడు నుండిరి. కర్ణధారి దూరమునందే సుగుణను చూచి ప్రవాహవేగమున నొకమనుష్యుడు గొట్టుకొని వచ్చుచుండెనని నావలోని వారికెరింగించెను వారును దూరదృష్టి కచ్చెరువందుచు జూచి మనుష్యుడుగనే నిర్దేశించి వినయవిధేయతలతో దమకరుణా రసార్ద్ర హృదయములు వెల్లడిగాగ నెటుల నేని యాపచ్చువాని సంరక్షింప గడంగుమనియు విగతజీవుడైన విడిచివేయవచ్చుననియు నటులగాసిచో ప్రాణదాన మొనర్చినవాడవగుదు వనియు నావికుని బ్రోత్సాహించివేడిరి. అతడు తననేర్పు వెలయ బ్రవాహమున వచ్చు నావ్యక్తి కెదురుగ తన నావ నాపి చూచువారచ్చెరువంద నావ్యక్తిని నావజేర్చెను. నావలోని వారెల్లరా యువతి కొదవిన యాపదకు విచారమందుచు నామెం జేరి ప్రాణములుండట దెలిసి దగు నుపచారము లొనర్చిరి. కొలదికాలములో ననే సుగుణకు స్మరణవచ్చెను, ఒకదయార్ద్రహృదయుడు మధ్యాహ్నభోజనమునకు వెంటగొని వచ్చుచున్న కొన్నిపాలను వెచ్చచేసి యామెకొసంగెను. పాలాధారము నైన స్ఫురణచే గన్నులు దెరచి దన్నుగాపాడినవారికి చేతులనుమోడ్చి నమస్కరించెను. నావికుడు విజ్ఞానసంపన్నుడగుట నాయువతినిగాంచి తల్లీ నీవెవ్వరు నీవృత్తాంతమేమి? చెప్పగలిగినచో దెల్పి మాయుల్లముల గల యమ్మలిక దీర్పుమనియెను. నీవైఖరినిజూడ పరమసాధ్వివలెనున్నావు. నీకిట్టియిక్కట్టు లెట్టులొదవినవి వచింపుమని నావలోనివారొక్కమారనిరి. అంతలకామె విశ్వససూచకముగా గరములు మొగిచి దనవృత్తాంత మామూలము దెల్పి శిశువులరణ్యమధ్యమున ప్రవాహపుటొడ్డున నెటులుండిరో యనుచు గన్నీరు నింపసాగెను. నావికుడాయువతి వృత్తాంతమును విని కలిగిన మనమున నామెం జూచి తల్లీ నీవు విచారింపకుము నిముసమాత్రములో నీశిశువులంగొని వచ్చి నిన్నుచేర్చి నీయులమట వాపెదను అనెను. ఆమాటల కత్యంతానంద హృదయయై

పలుమారు నమస్కరింపుచు ప్రాణదాతవై నాపాలిట బరమాత్మవగు నీవీమేలును గూడ చేసి దీనరక్షణ పరాయణుడవై సుకృతము సంపాదించు కొనుమనెను. నావికుఁడా నావలోని వారిలో నొక్కనివంకజూచిసాహుకారుగారూ తామీరొడ్డునదిగి యీమానిని గాపాడుచు నిలిచియుండుడు. నిమిషమాత్రమున నే శిశువులగొనివచ్చెదను. ఈసుకృతమున నీకును భాగముగలుగునని వచించి నావనుదరిచేర్చి వారినిదింపి సమీపమందలి చెట్టునకా నావనుగట్టి యతిజాగరూకుడవై రక్షింపుచుండ వలసినదిగాదెల్పి నాయువతి దనశిశువులున్నటుల దెల్పిన గురుతులు బరికింపుచు జనియెను. దుర్మార్గుడగు నావర్తకుడు పాపికుడు చూపుమేరదప్పువరకెటులో చూచుచుండి రాగాంధుడై చక్కదనముల కెక్కైన యక్కామిని దనకు దక్కనదిగా భావించి అగ్ని నాస్వాదింప నేగు శలభము వలె నిర్భయముగ నామెకు దనహృదయ మెఱింగించెను. సుగుణయు నాపదలపై నాపదలు వచ్చుచున్నను శ్రీయఃపతికరుణా విశేషమున నవి సూర్యునిగాంచిన మంచు వలె విచ్చి పోవుచుండిన విధినెరింగినదగుట ధైర్యమునువీడక చెవులుమూసికొని హరి హరీయని వచింపుచు నించుక యోచించి నావర్తకునితో నిటులబల్కెను. దీనబంధూ ప్రాణదానమొనర్చిన దమకీశరీరమునసంపూర్ణాధికారముగలదు. మీయిష్టము వచ్చినటుల బ్రవర్తింపవచ్చును గాని యిప్పుడు నేనొక వ్రతమనుష్టింపుచుంటిని. మూడు మాసములకిది పూర్తియగును. అంతవరకు నిరశనదీక్ష వహింపుచు ఫలాహారముల వర్తింపవలసియున్నది. కావున వ్రతసమాప్తియగువరకు దయచేసి వేచియుండ వలసినది. ఆన వినిన యావర్తకుడు మహదానంద పరవశుడై యామెను తనపురమునకు చేర్చునుద్దేశముతో నావనెక్కించి యందొక గదియందుంచి తాళమువేసి లంగరువదలి ప్రయాణము చేయుచుండెను.

పల్లెవాడును సుగుణ యెఱింగించిన జాడలవెంట బాలురున్నచోటి కతివేగమున నేగి సురక్షితులైన బాలురచూచి వారిని లాలించి యెత్తికొని వేవేగముగ దానుపడవను వదలిన ప్రదేశమునకువచ్చెను. కాని పడవ యచ్చట గానరాకుండుటకు వగచి. నలుప్రక్కల పరికించి దుర్మార్గుడగు నావర్తకుఁడా నాతినిహరింప నావనెక్కించుకొని పోయియుండునని యూహించెను. పల్లెవాని పరోపకార హృదయమునెంతేని కొనియాడ వలసియున్నది. ఆతడా తల్లిని బాలుర నొక్కకడచేర్చి రక్షింప జాలనైతి గదాయని దుఃఖించెనేగాని యోడ పోయినదను దుఃఖమును జెందినవాడుగాడు. ముందేమి చేయుటకును దోపని యాపల్లెవాడా శిశువులను గొనిపోయి తన పల్లెంజేర్చిభార్యకొసంగెను. పల్లెతయు భర్త్రాజ్ఞ జవదాటని దగుట నాశిశువుల గన్నపుత్రులవలె బోషించుచుండెను.

పల్లెవాడా నావంగొని పోయినవర్తకుని జాడనుగనుగొను ప్రయత్నమునునుండెను.

ఇది యిటులుండ నారాజసింహుని వర్తమానమువిచారించుదము. రాజసింహుడు సుగుణ నాపల్లియకు బైటవిడిచి యాహార వస్తువులు గొనివత్తునని పట్టణమున కేగియుండెనుగదా. అతడాపట్టణమున కేగి సుగుణయొసంగిన నగనొకటానినమ్మి కావల

లసినవస్త్రములఁగొని రాత్రియగుటయు నందలి వర్తకులు దొంగలభయము మిక్కుటముగా నున్నదని తెలిపి యీరాత్రి యిందు నిలువు మని బలవంత పెట్టుటచే విధిలేక యానాటి రాత్రి యచ్చట నాగవలసినవాఁడయ్యెను. మఱునాఁడుదయముననే బయలుదేఱి సుగుణ వదలివచ్చిన చోటునకేతెంచి చూచెను. కాని యాయమ యాప్రదేశమున గానరా కుండుటకు విచారించి తానేగిరాకుండుటచే పట్టణమున దన్ను వెతుక నేగియుండెనేమో యనితలంచి సుగుణను వెదకునెపమున దిరిగి పట్టణమునుజేరి యానాఁడెల్ల వెదకి వెదకి వేసారెను. రాజసింహుఁడు సుగుణనుజూడ వలయుననెడి కోరిక వియోగబాధ భరింప జాలనిదగుటచే తిరిగిన వీథి యేఁదిరుగుచుజూచి నచోటులనే మఱల మఱల జూచుచు వేదురు గొన్నవాని పగిది మధ్యపానివిధము తిరిగి తిరిగి సాయంతనమగుట నందలి ధర్మసత్రముఁజేరి రాత్రియంతయు నెటులో వేగించెను. సుగుణనువీడి నేటికి మూఁడుదినము లయ్యెను. జాడను దెలుపువారెవ్వరును గన్పడరైరి. చేయునదియేమియు లేకున్నను, జీవించియున్న నేనాటికేని నుభయులము దైవసంకల్పమున గలువకుందుమాఁ దైవ నిర్దేశమును దప్పింప నెవ్వనివలన నగునని దలపోయుచు బలుమాఱు హృదయమున దలంచు సుగుణావియోగ పరితాపమున మాడుచు మఱల మఱల పట్టణవీథులఁ బరి కింపుచుఁగొన్నిదినములు గడపెను.

ఆపట్టణ పరిపాలకునకుఁ బుత్రసంతానము లేదు. సంతానహీనుఁడనగు నాకిక గతియేమాయని మోదింపుచు దెన్నుగానక కృశించు నాతఁడొకనాటిరాత్రి యొకదుస్స్వప్నముఁగాంచి మేల్కని జ్యోతిర్విద్యా విశారదులరావించి దాగన్నకలను సాకల్యముగ దెల్పి తత్ఫలితమునువచింపుడనికోరెను. విద్వాంసులెల్లరది విని విచారించి యందఱు నేకకంఠముగా "సకలప్రాణహానికరమని యును, మరణము చేరువలో నున్నదనియు నెఱిగించుటయేగాక పుణ్యలోకప్రాప్తి కొనర్పఁదగిన యజ్ఞయాగాదుల నొనర్పుమనియు దానవ్రత సంతర్పణముల విప్రకోటిని దన్పుడనియు బ్రబోధించిరి. ఎల్లియోనేఁడో మరణ మాసన్నమగుట నెఱింగిన యారాజు పుణ్య కార్యముల చేయుటయేగాక దన యనంతర మున బుత్రులులేని దనరాజ్య మితరులపాల గుట జింతించి శత్రువులచే జిక్కుటకంటె ప్రజాభిమతముగ దన ప్రత్యక్షముననే మఱి యొకనికి బట్టాభిషేకము జేయదలంచి పట్టఁపుటేనుగ నలంకరించితొండమునకొక పూల దండ నొసంగి కుంభస్థలమున జలపూర్ణకలశమునుంచి వదలినచోఁ బూర్వజన్మ సుకృత వాసనా విశేషమున సంపూర్ణ జ్ఞానమున నలరారు నాగజము దగినవాని వెదకి జల కుంభముచే నభిషేకించి పుష్పహారము కంఠమున వేయుననియు నీరీతి జరుప దలపూని యుంటిననియు దన ప్రజల కెఱింగించెను. పుత్రులకన్న మిన్నగ దమ్ముబాలించు రాజు క్షేమము విచారించి నూతన ప్రభునిశ్చయమును చేయ బూనిన పద్ధతి కానందించిరి. మంత్రుల యాలోచనపై సమస్త దేశాధీశ్వరుల కీవార్త దెలియ జాటబంచెను. నియామకమైన దినమునకు రాజకుమారులెల్లరు దమతమ .యదృష్ట పరిశీలనా భావములు దీపింప నలంకారములచే జూడ నొప్పి దమ తమ పరివారములు బరివేష్టింప నియా

మకస్థలమున నిలిచియుండిరి.

రాజాజ్ఞపై మావటీండ్రు పట్టపుటేనుఁగ నలంకరించి యంబారికట్టి కుంభస్థలమున జలపూర్ణ కుంభమునుంచి పూలదండ నొకదానిని కరమున కొసంగి రాజసముఖమునకుఁ గొనివచ్చిరి. భూపాలుఁడా మదగజమును సమీపించి ముమ్మారు ప్రదక్షిణమాచరించి నమస్కరించి బద్ధాంజలియై పుత్రహీనుఁడనైన నారాజ్యమును పాలింపఁదగు మానవుని గళమున బూలహారము నలంకరించుకొని రాదగు భారము నీపైనుంచితిఁ. నీవిద్దానిని నిర్వహించి ప్రజల చేమున్నన వడసి కీర్తిగాంచుమని ప్రార్థించి వదలునటుల నాజ్ఞనొసంగెను. అంత నాగజము బజారుల వెంట మనోహరముగ మావటీని యాజ్ఞనునడచుచు గ్రామోప కంఠమున నెదురుజూచుచున్న రాజకుమారుల కడకు నదృష్ట వంతుఁడగు రాకుమారు వరింపనేతెంచు రాజ్యలక్ష్మియన వచ్చి చేరికొనెను. అందందు వెదకుచున్న రాజసింహుఁడా గుంపుఁజూచి మతిచెడియున్న వాఁడగుట నా ప్రదేశమున సుగుణ గానవచ్చునేమో యన్న యాశదీవరింపఁ దానుగూడ నారాజపుత్రుల చేరికొనెను. గజమా రాజకుమారులను నిరాకరింపుచు వచ్చి గుంపునకు బైటనిలుచుండిన రాజసింహుని సమీపించి యాతనిపైనా పూర్ణకలశమును గ్రుమ్మరించి పూలదండను గళముననుంచి తొండముతో నవలీలగ నెత్తి దనపైగూర్చుండబెట్టుకొనెను. ఇది గాంచినవారెల్ల రానందమున నొప్పిరి. కొందటీర్ష్యాపీడితులైరి. మఱికొందరు చూపుపోవనివారై దైవికముగా దనసమీపమున నేతెంచిన రాజ్యలక్ష్మిని చేకొననివాఁడుందునా? దైవబల విరాజితునిజూచి యోర్వజాలకున్న దమ యవ్యక్తతబయలు వరచి యపకీర్తి వడయుటయే ఫలముగుగాని లాభమేమాత్రము గలుగబోవదు. పైపెచ్చు చిక్కులెక్కువగును. రాజసింహునకా కరియొనర్చు చర్య యత్యాశ్చర్య మొనకూర్చెను. ముందాతఁడీ సంగతి తెలియకున్నవాఁడయినను దన్నుకూర్చి జనులాడుకొను వాక్యములు కర్ణరంధ్రములఁ బ్రవేశించుటంబట్టి తన కొదవనున్న పదవి కాతడచ్చెరువు నందుచున్నను సుగుణ గన్పడలేదను విచారము మాటిమాటికి దలనెత్తసాగెను. రాజసింహుఁడు సుగుణలేని యీ యైశ్వర్యము నిరర్థకమనియు సుగుణతో కూడి వర్తించుట లీరాజ్య ప్రాప్తికంటె నెంతయో యానంద దాయకమనియు నయ్యది చేకూరకపోయెగదా యనియు యోచింపుచుండెను కాని దైవము దనయందనుగ్రహము గలిగియున్నాఁడనియు నిట్టిశుభదినములలో సుగుణసమాగమముగూడ గొలదిలోనే దనకొనగూడక పోదనియు నూరట నందెను.

ఇంతలో నాప్రదేశమున సంసిద్ధముగనున్న మంగళవాద్యము లొక్కపెట్టుమ్రోవసాగెను. మంత్రి సామంతాదులు పరివేష్టించి వెంటనడువ మంగళవాద్యము ఘోరుకొలుప మహా వైభవమున మందగమనమున నా కరిరాజము రాజసౌధమును చేర్చెను. వృద్ధభూపాలుడును దగిన పరివారముతో ద్వారమున నారాజసింహుని బహూకరించెను. ఆనాటిరాత్రి విప్రదత్తమైన సుముహూర్తమున నంతఃపురమున నారాజుచే బెంచబడుచున్న ప్రియనీయను కన్యనిచ్చి వైవాహిక విధులు దీర్చి పట్టాభిషేకోత్సవము జరిపిరి.

రాజసింహుఁడు దన కొదవిన యైశ్వర్యాతిశయముల కానందము నాశ్చర్యముఁ గాంచుచున్నను సుగుణ జ్ఞప్తికి వచ్చుట మాన లేదు. రాజసింహుఁడు సింహాసన మధిష్ఠించి కన్నబిడ్డలకన్న మిన్నగ బ్రజలఁ గాపాడుచు మన్ననకు బాత్రుఁ డయ్యెను. శత్రురాజు లెల్ల రాజసింహ ప్రతాపాగ్ని కింధనములై లోబడి సామంతులై యాజ్ఞాపాలన మొనర్చుచు ననుగ్రహపాత్రులగుటకు బ్రయత్నింపసాగిరి. రాజసింహుఁడును సుగుణజాడ వెతకింపదలంచెను గాని యందుచే బ్రజలహృదయముల కేమి దోచునోయని శంకించి మానవలసినవాఁడయ్యెను. అయినను సుగుణ హృదయకోశమును వదలక ప్రతినిమేషమును స్ఫురణకు వచ్చుచుండెను. రాజసింహుఁ డేకప్పుడామె దనకొనర్చిన సహాయాదులును దనపైఁ జూపిన ప్రణయానంద విలాసములును స్ఫురించినప్పుడెల్ల దీర్ఘోచ్ఛ్వాసముల మూలమున హృదయగత పరితాపమును గొంత దొలగించుకొనుచు దినములు గడపుచు దీనదయాకరుఁడు నాపదోద్ధారకుఁడగు శ్రియఃపతిని బలుమారు బ్రార్థించి పూజింపుచు సుగుణను దన్నవతి కాలమున జేర్పననుగ్రహింపుమని ప్రార్థింపుచుండును. ఈవిధమున నాలైదు సంవత్సరములు గడచెను. సుగుణజాడ యేమాత్రము దొరకలేదు. కాని యామెను జాడవలయునన్న వాంఛ హృదయమును వీడలేదు. ఈకారణముచే రాజసింహునకు నాశ యెక్కుడు కాఁజొచ్చెను.

[illegible] ప్రజలహృదయము [illegible] నెఱింగి [illegible] పాలింపను నూతనప్రభుని మొదల ప్రజలకు మక్కువ యెక్కుడగుచు వచ్చెను. ఇట్లుండ నొకనాఁడా రాజసింహుఁడు నిండుకొలువున సింహాసన మధిష్ఠించి రాజకార్యాలోచనా పారాయణుఁడై యుండఁగా నొకపరిచారకుఁ డేతెంచి మ్రొక్కి రిల్లి యేలికా! ఒకానొక పల్లెవాఁ డిరువురు రాజపుత్రులం బోలు చక్కని శిశువుల వెంటనిడికొని పోవుచుండ మన గూఢచారులనుమానించి సముఖమునకుఁ గొనివచ్చి ద్వారమున నుండిరి. ఆజ్ఞయయ్యేని రాఁగలరని యెఱింగించెను. అదివిని రాజసింహుఁడు వెంటనే ప్రవేశపెట్టుమన నాపరిచారకుఁడేగి శిశువులతో బల్లెవాని సభఁ జేర్చి సెలవుపుచ్చుకొని పోయెను. రాజసింహుఁడా బాలకులఁ జూచి దనరూపము ముద్దమునఁ గాంచినటుల నచ్చొత్తినటుల నిసుమంతయేని భేదము లేకుండుటకు విచారించి నా మనోహారియగు సుగుణ నన్ను వీడునపుడు గర్భిణిగా నుండెగదా. ఈశిశువు లాయమకు గలిగి యుండరుగదా. అటుల గాకున్న నన్నుం బోలియుండుటకు గారణ మేమైయుండును. ఈబాలురఁ జూచినదాది నాహృదయమున నెక్కుడలేని ప్రేమ యుదయించు నెత్తికొని ముద్దాడ వాంఛ జనించుచున్నది. ఇందులకు గతం బేమైయుండును. అయిన పల్లెవానిని విచారించి తెలిసికొందుఁగాక యని తనహృదయమున దలంపుచు నాపల్లెవానిఁ జూచి నీ వెవరు? ఈబాలకులు నీ కెచట లభించిరి. నిజము దాచక తెల్పుమని రాజసింహుఁడు ప్రశ్నించెను. అందులకాపల్లెవాఁడు నమస్కరించి మహాప్రభో! అబద్ధమాడవలసిన యగత్యమిందేమియు లేదు. అనుచు దానుపడవ నడపుచు ప్రవాహమధ్యమున వచ్చు స్త్రీని రక్షింపుటలాదిగా పిల్లలనిచ్చుటకు జేర్చుట తుదగా నెఱింగించెను. రాజసింహుఁడదివిని యా

శ్వర్య పరమానందములు హృదయమున బెనగొన బాలురనెత్తి ముద్దాడి దనపుత్రి లనుగా నిశ్చయించి సుగుణజీవముతోనుండి నందుల కానందముజెంది పల్లివానికి బహుమతులనిచ్చి వానిని వెంటదీసికొని సుగుణను వెదకుటకుఁ బ్రయాణమయ్యెను.

పల్లెవానితో బయలువెడలిన రాజసింహుడు జాడలుదెలుసికొని ముందాతడు పడవనుగట్టివేసిన ప్రదేశమునకుఁజేరి యచ్చటగుర్తులను పరికించి పల్లెవాడు వచ్చులోగా నావర్తకుఁడు సుగుణపైగలిగిన దురుద్దేశ్యముతో బడవలంగరు వదలియుండును. సద్గుణసముద్రయగుసుగుణ యిట్టి దుర్మార్గునకు లోబడునా సమయము దప్పివచ్చినశిరఃఖండనయొనరించుటకుఁ గూడ వెనుదీయక దన మానమును సంరక్షణ జేసికొనగలదు. ఇందులకుసందేహింప వలసిన యగత్య మెంతమాత్రమును గలుగదు. అని తనలో దలపోయుచు బల్లెవానితో నాప్రవాహమున కెగువవైపున బోవుచుండగాఁ జూపుమేరనొక పడవబోవు చున్నటుల జాడగాననయ్యెను. అందుచే బల్లెవానిని తీవరించి దానతివేగముగ నాబడవను గలునబోయెను. ఆపడవయు నీవచ్చువారిని చూచెనో యేమోగాని యతివేగముగా బోవ ప్రయత్నపడు చుండెను. దైవికమును దప్పింపనెవ్వరికి సామర్థ్యము గలదు. ప్రవాహమున కెదురేగ వలసి యుండుటయు గాలి యెదురు గొట్టుచుండుటయు గారణములుగా లోనున్న వర్తకునకున్న యావేగముతో సమానముగ గాక వ్యతిరేకముగా నడచుచుండెను. అందుచేతనే రాజసింహుఁ డంతత్వరలో నాపడవను సమీపింపఁగల్గెను.

రాజసింహుఁడు పడవను సమీపించు వఱకందున్న వర్తకుఁడీ పల్లెవానిని జూచి గుర్తించి దనకు ప్రమాదముప్పతిల్లి నటుల భావించి చెడుతలంపులు గలవారికి దైవము తగుశాస్తి చేయక మానదని యూహించి నిర్విణ్ణుడై నిల్చియుండెను. పల్లెవాడు రాజసింహునితో నీకుర్మార్గునకే నేను సుగుణను వప్పగించి బాలుర గొనివచ్చుట కేగితిని. వీడేద్రోహి. పట్టుడుఁ గొట్టుడు. నరకుడు అని కలిగిన యుద్రేకము నరచుచుండ రాజసింహుడా పల్లెవానిని వారించి వాని తెలివిలేమికి విచారించి తామావర్తకునికి ద్రోహముచేయవచ్చుట నెఱిగిన సుగుణకే యపాయము నాపాదించునేమోనని దలంచి యేమియుదెలియని వానివలె పల్లెవానిని దాగియుండుమని యెరింగించి దానా వర్తకునితో అయ్యా పడవలో గూర్చుండుట కనుమతించిన సమీప గ్రామమున దిగెదననియు నడువజాల కుంటిననియు వినయ విధేయలతో దయబుట్టఁ బ్రార్థించెను. ఆవర్తకుడును విధిలేక నాతని గూర్చుండుట కనుమతినుసంగెను. ఇంతియే చాలునని యెంచిన రాజసింహుడు దిన్నగా బడవ ప్రవేశించి యొకప్రక్కను గూర్చుండి సుగుణజాడ నెటులదెలిసికొందునా ఆలోచన యేమియాయని దలపోయుచుండెను.

ఇంతలో దాళమువేసిన యొకగదిలోనుండి హీనస్వరముతో నిటులవినవచ్చెను. "ద్రౌపదీ మానరక్షణా! గజరాజవరదా!! ఆపదోద్ధారకా!!! ఆర్తత్రాణపరాయణా!!!! భక్తసంతతికొదవు నాపదలనాపి రక్షించు బరమాత్మ స్వరూపుఁడవగు నీవీదీనురాలిని గాపాడ జాగుసేయుచుంటివేల. ఎన్నివిధము

లనో మాయబుద్ధి యీదుర్మార్గుని మోసగించి నన్ను నేనుగాపాడుకొంటిని కాని యిక మీని నాప సమర్థతగానరాకున్నది. ఒక్క వ్రేటున శిరముఖండించి యావలికేగుదమా యనిన నెందులకేగెదను. దిక్కెవరు. ప్రాణప్రియుడా జాలకాలముక్రిందనే పీడెను. ఆమహనీయునిజాడ నాకు లభించు నాశకూడ లేదు. కష్టనిష్ఠూరములకెల్లకోర్చి గనిపెంచినశిశువులాదూరమైరి. వారైన బెద్దవారైనా కష్టములు దొలగింపగలరని యాశపెట్టుకొని యుంటినిగాని యదియును వమ్మైనది. ఇంక నాకుదిక్కెవరు. ఏదిచూచికొని నేనుజీవింప వలయును. జీవించి యేమిచేయవలెను. బలవన్మరణ మనిష్టదాయకమును నరకప్రాప్తమనియు నెఱింగియున్నదాన నగుట ప్రాణములను చేజేతుల దీసికొనుటకుహృదయము సమ్మతించుటలేదు. చేయునది యంతకు మున్నె లేదు. బ్రతికియుండి బ్రయోజన మంతకుమున్నె లేదు. దుర్మార్గ ప్రవర్తకుడగు నీవర్తకు యముని వీటి కతిథినిజేసి పగ సాధించి కొందమన్న నిరపరాధులగు నతని భార్యాపుత్రుల కపకారమొనర్చిన దాన నగుదును. ఘోరకార్య మొనర్పజాలను. కావున నోగంగాభవానితల్లీ!!! కొన్ని నిమేషములలో నాశరీరమును నికర్పింపనున్నాను దయతో ననుగ్రహించిసీలో జేర్చికొనుము. అని దీనముగా వేడికొనుచున్న యావలుకులు చెవియొగ్గియాలకించి సుగుణగా నిరూపించి నిశ్చయము చేసికొనుటకాగది తలుపును సమీపించి తలుపుసందులనుండిచూచి దీనాననయై యత్యంత దుఃఖమున గృశించియున్న సుగుణను దిలకింపగలైను. రాజసింహునకు బట్టజాలని దుఃఖము రాసాగెను. ధీరహృదయుఁడగు నాతడెటులో దుఃఖమను నాపికొని తాళమును వగులగొట్టి నిన్నిన్ని కష్టములపాలేసిన దురాత్ముడీతడే తగిన శిక్షనువిధించి కృతార్థపుకమ్మని వచింపుచు సమీపించి దన్నుజూచుటచే నొదవినసంతోషాతిశయమున మూర్ఛాక్రాంతయైన సుగుణను సమీపించి చేరుమాలున కన్నీటిని దుడుచుచు కాంతి విహీనయై నుసిపాతయందు జుట్టిన మాణిక్యమువలె మొదలు విరిగిన యరటిచెట్టువలె బడియున్న దన కాంతామణిపైబడి పైకొనివచ్చు దుఃఖము నాపుకొనజాలక రోదనము చేయసాగెను. ఇట్లు కొంతసేపైన తరువాత నారాజసింహుఁడు ధైర్యమువహించితాత్కాలికముగా మూర్ఛకు దేర్పదగిన శైత్యోపచారముల నొనర్చెను. ఇంతలో తేరిన సుగుణ వెఱ్ఱిచూపుల నారాజసింహునిజూచి మహానుభావా! తామెవరు. దీనురాలనగు నాకొదవిన విపత్తును దెలిసికొని కరుణించి నన్నా యాపదనుండి తరింపజేయ నేతెంచిన పరమాత్మ స్వరూపులని దలంచెదను. నిక్కమెఱింగించి నాయిక్కట్టుల దొలగింప ననుగ్రహింపుడని పాదములపైబడెను.

రాజసింహుఁడు దన్ను పరాయివానినిగాదలంచి దన యాపదను దీర్పుడని ప్రార్థించునాసుగుణను పాదములనుండి రెండుచేతుల లేవనెత్తి కన్నీరుదుడుచుచు దన్ను నా దరణ్యమున వీడుటలాది యంతవఱకు జరిగిన చరిత్రమంతయు దెల్పి యానాటికిగుపురసమావేశ పఱచిన భగవంతుని నైపుణ్యమును గొనియాడెను. భర్తృసందర్శన భాగ్యమొదవినందుల కపరిమితానందమునందు సుగుణ దనసంతాన విషయమును

దలంచి దుఃఖము నొంద రాజసింహుడు బాలురిరువురు దనకడ నుండుటను దెల్పెను. అప్పుడు సుగుణకుఁగలిగిన యానందమునకు మితిమేర లేకయుండెను. చిక్కులెన్ని యొదవినను ఆపదలెన్ని గలిగినను పరమాత్మునిదివ్యానుగ్రహ ప్రభావవిశేషమున నవియెల్ల మేళ్లుగా మారి మనలధన్యుల నొనర్చియున్నాడు. హీనకుల సంజాతుడైనను పల్లెవాడు పరోపకారపారీణుఁడు సుమాయని దనప్రాణదానమొనర్చిన బాలురఁగొనిరానేగిన పల్లెవాని దలంచెను. రాజసింహుడాతడు సేమమున ననతిదూరముననే యున్నాడు. తగురీతి మన్నింపవచ్చును లెమ్ము అనివచింపుచు నపకారుడును దురాత్ముడునైన వర్తకుడు మాత్రము శిక్షార్హుఁడు సుమా. వానిని శిక్షించువిషయమున నీయభ్యంతరమేమియునుఁ గలుగరాదు సుమాయని వచింపుచు నాతఁడెచ్చట నున్నాఁడోయని గదిని వదిలి లోనికివచ్చి చూచువఱకు రాజసింహుఁడు గది ప్రవేశించుటఁజూచి యాదుర్మార్గుఁడు భయమున నాగజాలక ప్రవాహమునదూకి యీతవచ్చినవాడగుట నొడ్డున కీదుకొనుచు బోయి యరణ్యమార్గమును బట్టి పరువెత్తుచున్నాడు. అదిగో చూడుడని పడవలోని వారొకదిక్కునకు వ్రేలుచూపసాగిరి. సుగుణ రాజసింహునిజూచి పశ్చాత్తాపతప్తుడైన యావర్తకు డపరాధమునకు దగినశిక్షగా ననిమిత్తముగా నొదవిన భయాతిరేకమున బ్రాణముల గాపాడుకొన బారిపోవుచున్నాడు. పారిపోవువానిజంపుట రాజధర్మముగాదని దేవరవారెరుంగనిది గాదుగదా యనియెను.

రాజసింహు డచ్చటినుండి పల్లకి దెప్పించి దానిపైసుగుణ నెక్కించి పట్టణమునకు బ్రయాణముచేయుచు బల్లెవానికా నావనప్పగించి సుగుణ ప్రోత్సాహముచే దనమెడనున్న ముత్యాలహారమును బారితోషికముగనిచ్చి పట్టణముజేర్చెను. సుగుణయు పురి ప్రవేశించి సుపుత్రుల గాఁగలించికొని ప్రేమ వెల్లివిరియ మాతృధర్మము నెఱపెను. రాజసింహుఁడు సుగుణను బుత్రులను గారవించుచు బెక్కుసంవత్సరములు ప్రజానురంజనముగ ధరాపాలన మొనర్చెను.



# అవతారిక

నేలటూరు అనంతాచార్యులు గారు (యువకవిమండలి.)

---

నాటి యమ్మహాగ్రంథ సందర్భమునకు
వ్రాసి రెందరో వ్యాఖ్యలు! వారిసరస
వాఙ్మధువుఁ గ్రోలినవియెన్నొ పరభృతములు
ప్రీతిపృషత పానవివశతా భరములగుచు

వాని యకళంకలలిత గీతానినాద
ములవలచు కొన్న వేమొ? యుద్యానలతలు!
ప్రతిదళమ్మొక పుటయయిప్రకృతియందె
కనఁబడుచునున్నదమ్మహా గ్రంథమచట;

అచటి కోకిలలెప్పుడు నాలపించు
నమ్మహా గ్రంథగీతల సాంగసరణి!
అచటి తరువల్లరులను మందానిలుండు
సలుపుచుండును గోష్ఠిప్రసంగములను.

అహరహంబు నచ్చోట విహారకలనఁ
జేరియుండియు నాముగ్ధ చిత్తమేమొ
నీదుమూర్తిని గనలేదు; నిస్తవమ్ముఁ
దెలియఁజాలదు విహగ గీతికలయందు;

అచటశారద యామినులవతరించి
నవిరజితదీప్తి; నాసితాంతఃప్రసక్తిఁ
జిగిరించినది నాయెద; తదాశ్రితకిసలము
లందుకొమ్మో ప్రభూ! నీకు నంజలియిదె;

నీచరణ తాడనంబుల నేర్పుచేత
క్షోదితానేక జన్మ సంక్షుభిత కిల్బి
షంబెకా! యాపథము; నన్నుఁ జనఁగనీయ
దేల? నీకాశ్రయంబైన పృథివిఁ జేర;

ప్రభు! భవన్మూర్తి దూరానఁ బరగువారు
చుండ నావీక్షణంబుల శూన్యగతశిశి
రమ్ములై నీపదాబ్జ దళమ్ములందు
జాఱయనేమొ వెన్వెన్కనే పరచుచుండు;

ఇంత నైర్ఘృణ్యమేల వహింతు! నాదు
దృక్పథముననే యట్లులయింతు వేల?
కనుమ భ్రమరించెదు త్వదంతికమున జంటి
తేనెచుక్క నుదీయమీ తిన్ననియెద!!



# దైవప్రతిఘటన.

శ్రీమతి నెమలికంటి లక్ష్మీనరసమ్మగారు (యల్. యమ్. పి. క్లాస్.)

—:0:—

౧

"బావా యేవి చామంతిపువ్వులు". అని తన మృదుకరముల జాపి శ్యామల సుందరరావుకడకు పరుగు పరుగున బోయెను. సుందరరావు మందస్మిత వదనుడై తాను భద్రముగాఁగోసి తెచ్చిన చామంతిపువ్వులను శ్యామల చిన్ని చేతులలో బోసెను. శ్యామల యాపుష్పములను గొని యమితానంద సంభరితయై చిన్ని చిన్ని మాలలు గుచ్చి యొకటి తన జడయందు తురుముకుని రెండవది సుందరరావుమెడలో వైచెను. శ్యామల సుందరరావునకు మేనమామ కుమారిక. శ్యామల తండ్రి రామచంద్రరావు. సుందరరావు తండ్రి బసవరాజు. బావమరుదులిరువు రెన్నడొక పంచనుచేరిరోగాని వారు వేరు వేరుగా మంచి మంచి పటకుటీరముల నేర్పరుచుకొని దివ్యమైన వసతుల సమకూర్చుకొనిరి. వారు వసించు నివేశనములు గ్రామమునకు చాలాదూరమున నొకవిశాల మైదానమున నిర్మింపబడి వుండుటచే నయ్యది వీక్షించు ప్రేక్షకులకు గాంధి మహాత్ముని సబర్మతీ ఆశ్రమము జ్ఞప్తికి రాకపోదు. ప్రశాంతమైన కృష్ణవేణీ శాఖలు వారిపట కుటీరములచెంత నిత్యమును ప్రవహించుచుండెను. సుందరరావు తండ్రి పూర్వకాలమువాడగుటచే నివాసమావరణ మిక్కిలి. విన్నాణముగ జేయకపోయినను శ్యామల జనకుఁడుమాత్ర మది లోటు లేకుండ జేసెను. ఇంటికి తూర్పుదిశగా నాతడొక యుద్యానవనమును నెలకొల్పెను. అందు తియ్యమామిడి, పనస, జామ, నిమ్మ, నారింజ, మొదలుగాగల ఫలవృక్షములును గులాబీ, మల్లి, చామంతి, విరజాజి, మొదలగుపుష్ప జాతులును మాలతి మాధవి లోనగాగల లతానికుంజములును, నాటి యారామమునకు వింత శోభ గలిగించెను. తోటమాలి నిరంతరము స్వచ్ఛంద జలములతో నావనమును పరిపోషించుచున్నను, శ్యామల చిన్ని హస్తములతో బోయునీరమును గ్రోలినగాని ఫలవృక్షములు కాయలదొడగవు, పూపొదలు పుష్పింపవు, లతలు ననలు పూనవు. సుందరరావు బోదులుకట్టును. శ్యామల నీరు పోయును. ఇట్లనన్య బాల్యక్రీడా విలాసముల పూపొదరిండ్ల పుష్పములు గుచ్చుచు నిసుక తిన్నెల గంతులిడుచు పక్షుల మృదుమధుర నాదము లాలించుచు వృక్షముల నెక్కుచు డాగుడుమూత లాడుచు అవ్వ చెప్పిన కట్టుకథలను నొండొరులు స్మరించుకొనుచు శ్యామలాసుందరరావులు మహానురాగమున దినములు నిమిషములుగా గడుపుచుండిరి. భుజించునపుడు శ్యామలయు సుందరరావును నొకకంచమునే భుజింపవలయును. ఎన్నడైన సుందరరావు ముందు భుజించిన శ్యామల యాపూట నన్నముతినదు. తల్లియెంత బుజ్జగించినను శ్యామల తన పట్టువదలదు. సుందరరావు శ్యామా అనిపిలచినతప్ప యా సమయమున నాబాలిక యెవరితోడ మాట్లాడదు. శ్యామల మకురుతనమునకు తల్లి

శోపించుట మేనత్తవిని యాబాలికను గొం
పోయి సుందరరావును దగ్గిరయుంచుకుని
భోజనము పెట్టుచుండెడిది.

౨

కాలము చక్రమువలె తిరిగిపోవుచుండెను. శ్యామలకు పండ్రెండవ వత్సరము వచ్చినది. ఆమెకు కొంచెము వ్యక్తత కలుగుచుండెను. అంగసౌష్టవము క్రమముగా వృద్ధియగుచుండెను. లజ్జాదేవత యామె దెస దొంగి చూచుచుండెను. పరిపూర్ణచంద్రమండలమునుహసించుముద్దుమొగము - ఆకర్ణాంత విశాలనేత్రములు- గండుతుమ్మెదపిండును నిరసించు కుంతలములు- ఆమె నవయౌవనమునకు పరిపూర్ణశోభనచిహ్నములు. ఇప్పుడు సుందరరావునకా బాలిక సాంగత్యము తగ్గెను. యెప్పుడో బావా యని యొకటిరెండుమాటలు పలుకుటయే గాని యాబోదులుకట్టుట, నీరుపోయుట వృక్షములెక్కుట యేమియునులేవు. పదమూడోయేడుకూడా వచ్చినది. శ్యామల తండ్రి కూతునకిట్టి వివాహప్రయత్నమును చేసియుండలేదు. మేనల్లునకిచ్చి వివాహము చేయవలయుననియే యాతనితలంపగుటచే యన్యథా యేమిపనియున్నది విచారింపను. అడిగిన యెప్పుకొందుమని యక్కయు బావయు యూరకొనిరి. కాని శ్యామల తండ్రికి యింటిలో పోరెక్కువాయెను. స్త్రీపోరు భరింపజాలక యా పుత్రికకు వివాహసమయము మీరుచుండెనని తలంచి యా రామచంద్రరావు బావమరదియగు బసవరాజుకడకేగి యొకనాడు తనయుద్దేశమును వెలువరించెను. సుందరరావు తండ్రి కుటుంబీకుడు. కుమాళ్లవిద్యాభివృద్ధికొరకును కుమారికల వివాహములకును నాతడు మిక్కుటమగు ధనము వ్యయపరచుటచే ఋణముల పాలయ్యెను. సుందరరావువివాహదశవచ్చునంతకు బసవరాజింట దారిద్ర్యదేవత తొంగిచూచుచుండెను. అట్టిస్థితి కలిగినను బసవరాజు తలచుకొనిన వలయు ధనము నార్జించగలసామర్థ్యములేకపోలేదు. ఈడువచ్చిన కన్యను నెట్లయిన తనపుత్రునకే నొసంగి రామచంద్రరావుయుభయఖర్చులభరించి వివాహము గావించునని బసవరాజుమనోనిశ్చయముగలవాడగుటచే వివాహప్రశ్న వచ్చునంతకు పరిపూర్ణముగా కాళ్లుచాపెను. తనవద్ద పైకము లేనికారణమున తానావత్సరమున సుందరరావునకు వివాహము చేయజాలనని చెప్పెను. ఆమాట లాలించినవెంటనే రామచంద్రరావు నిర్విణ్ణుడయ్యెను. కుమార్తెకు పదమూడవ వత్సరము. వరాన్వేషణకు కాలముచాలదు. ఎచ్చటకుపోయినను వరశుల్క మధికముగా నుండెను. వేలుకట్నమివ్వలేడు. పాపమాతడేమి చేయగలడు. కొంచెము తడవట్లె కూర్చుండి చేయునదిలేక తనగృహమునకేగెను. అతడు బావమరదితో జరపిన సంభాషణయేమియు నింటిలో చెప్పియుండలేదు. మరునాడు దాసీలమూలమునను బాలనౌకర్ల కారణమునను సంభాషణ పరివసానము బైటపడినది. రామచంద్రరావుగారియింట్లో కల్లోలమంకురించినది. స్త్రీపురుషులవన్నియువివర్ణవదనములే! కాంతాకనుగవలన్నియుకన్నీటిపూరములే! ఈవృత్తాంతమంతయు కర్ణాకర్ణిగ శ్యామల చెవులబడెను. తన తలిదండ్రుల మనోవేదన కామెయుమరపిల్లెను. బుద్ధివికాశముగల

యాబాలిక యెన్నియుద్దేశములు వడసినను తలిదండ్రుల చాటుననుండి తానేమి చేయ గలదు. వారముదినములు గడచెను. మనో రోగములచే నందరును శుష్కించుచుండిరి.

౩

రామచంద్రరావుగారిసుందరోద్యాన వనమున రసాలభూజ శాఖపై సర్వాంగ సుందరియగు నొకబాలిక విషణ్ణ హృద యముతో నధిష్ఠించియుండెను. ఆమె యే మరిపాటు విలోకించుచు నొకయువకుడా పరి సరమునుండియే తొంగిచూచుచుండెను. ఆయువతీయువకులు శ్యామలా సుందర రావులే! విషాదహృదయముతోనున్న శ్యా మలకడకు సుందరరావువచ్చెను. శ్యామల సుందరరావునుగాంచి మోమువంచి రెండు కన్నీటిబిందువులు రాల్చెను. ఆనయన పద్మ ములనుండి స్రవించిన బాష్పకణములు సుందరరావు హృదయముకలచివైచెను. డగ్గుత్తికతో సుందరరావు శ్యామా! నీకీ విచారణ కారణమేమి. నీహృదయవేదన నార్ప సంసిద్ధుడనైయున్న బావతో నీమనో రథము దెలుప తప్పులేకున్నచో దెలుపు చెల్లును అనెను. శ్యామకు వదనద్వారము నుండి మాట వెలువడలేదు ఆదీర్ఘవిచార ములోనే యామెముఖపద్మ మించుక విక సించెను. బావాయని యామెనోటినుండి వెలువడెనేకాని సిగ్గుచేతనో దుఃఖపూరిత మైన తన మనోరథము వెలువరింపజాలకనో యామె మాట్లాడలేదు. సుందరరావు శ్యామలను బుజ్జగించి తానేవిధమునైన నామెను వివాహమాడుటకు కృతనిశ్చయుడ నైతినని నమ్మపలికి యామెకుసంతసము గొల్పెను. శ్యామల సంతసించెనేకాని జనకునికి వ్యతిరేకమగు వైవాహికమెట్లు జరుగునాయని యామె యూహింపక పోలేదు. దీర్ఘాలోచనానిమగ్నులైన యాయువతీయువకులు యన్యోన్య మనో కల్లోలమంతరింపజేయుటకోయన శశాం కుడు తన శ్వేతకాంతులు దశదిశల విస్తరింప జేయుచు నభోమండలమున విరాజిల్లు చుండెను. రామచంద్రరావుపొలమునుండి యింటికి వచ్చుచు నారామమధ్యమున నిలచి శ్యామలా సుందరరావుల మనోనిశ్చయ ముల నాకర్ణించెను. అట్టి దీర్ఘతమమైన ప్రణయము సర్వదావర్ధిల్లుగాక యని యాతడు మనస్సున తలపోసి గృహములోని కింజనెను. శ్యామలా సుందరరావులును వేర్వేర తమతమనెలవుల జొచ్చిరి.

౪

రాత్రి పదిగంటలైనవి. జనవరాజు భోజనానంతరమున నిసుకతిన్నెపై తనపై వస్త్రముపరచి యందుపై కూర్చుండి పొగ చుట్టనుచుట్టి పొగపీల్చుచు నాప్రదేశమున చిన్నిచిన్ని మబ్బుతునకల విస్తరింపజేయు చుండెను. రామచంద్రరావు బావమరది కడకరుదెంచి యుభయపక్షముల భరించితానే వివాహముగావింతునని తెలిపి యొప్పించెను. మాఘశుద్ధ దశమినాడు వివాహలగ్నము నేర్పాటుచేసి వివాహము నిశ్చయింపబడెను. రామచంద్రరావు తనకున్నదానియందు కొదవచేయక యాశృంగారారామమునసే కన్నులపండువుగా వివాహమొనరించెను. శ్యామలా సుందరరావుల మనోరథము భగ వాను డనుకూలపరచెను. శరత్కాల చంద్రికవలె విరాజిల్లు శ్యామలను యుక్త వయస్సు వచ్చునంతకు తలిదండ్రి లత్తవా

రింటికనిపిరి. ఆరు నెలలసంతోషదినములా నూతనదంపతుల కరగడియగా నస్తమించెను. సుందరరావునకు నిజాంరాష్ట్రమున నుద్యోగమగుటచే శ్యామలను కొలదిదినములలో గొంపోయెదనని నువ్వబలికి వెడలెను.

నాడుండ్రాళ్లతద్దియ శ్యామలా పండుగకు నొకమైలు దూరముననున్న తన చెలియలను పిలిచికొనివచ్చుటకై వెడలెను. శ్యామల గ్రామమునకు చెలియలినివాసము నకు నొకయఖండవాహిని సంపూర్ణవైభవముతోఁబ్రవహించుచుండెను. సోదరిపై గల ప్రేమానుబంధమున నాసుకుమారి పరిసరగ్రామమునకుజని సహోదరితోడను మఱదితోడను తిరిగి వచ్చుచుండెను. అంత నాముప్వురు నాయఖండవాహిని జొచ్చిరి. దైవప్రతికూలమున శ్యామల తనగర్భమున నిలచియుండ వాహినిసహింపజాలకపోయెను. శ్యామల కడుపున నావేగముద్భవించెను. ఆప్రవాహవేగమున శ్యామల నిలువజాలక జలతరంగములలో లీనమైపోయెను. చెలియలి యార్తారావములకు పరిసరమున నున్న వారు వాహినికడ కరుదెంచిరి. కాని దైవప్రతిఘటన శ్యామల యాయఘాత జలమున నెందును కానరాలేదు. ఈయఖండవాహిని ఇంతవఱకెందఱనో తనపొట్టను పెట్టుకొనినది.






# నెలవుచీటి

ఆవంత్స వేంకట రంగారావు గారు.

"ఆప్రశాంత వసంత దినాంతమందు
సాంధ్యరాగంపు తుక్కాళి చదలునిండి
వింతగాఁగ్రింద నీట బింబించిమిగుల
నేత్రపర్వంబులౌచు కాన్పించునపుడు
నికటసుందర భూరుహ నివహమంత
నూర్మికారాజి నుయ్యాలలూగునపుడు
పొగడ పున్నాగ సంపెంగ పొన్నపూల
కమ్మ తావులతోడ సఖ్యమున మెలగి
విమల శీతల జలముతో వియ్యమంది
పిల్లగాలులు చల్లగావీచునపుడు
పవనసంస్పర్శ నానందపరవశయయి
నెమ్మినర్తాల నృత్యంబు నెరపునపుడు
శీతలారామవాటి కాసీమలందు
మల్లికాసూనములుకోసి మాలఁగట్టి
వేణికైసేయు నాయలివేణిగాంచి
పట్టనోపక నుప్పొంగు ప్రణయరక్తి
రయమునేగి బింబాధరమ్ము గొఱికి
మ్రింగనుదరమ్ములో బాధనొందుకొ నేను
బడికిగా లేను గురువరా! ప్రార్థనమ్ము
దయను సెలవీయుమయ్య వందనమునీకు".

---



# సవతితల్లి

వెంపటి నాగభూషణం.

X

కేశవయ్య వాకిట్లోకివచ్చే టప్పటికి తపాలా బంట్రోతు ఎదురుగావచ్చి ఒక వుత్తరంయిచ్చాడు. కేశవయ్య దాన్నందుకొని లోపలికెళ్లి, గదిలో బల్లమీదకూర్చుని చదవడం ప్రారంభించాడు.

ప్రియమైనబావగారికి,

మీకొమారుడైన వేణుగోపాలరావు యొక్కయు, నాకొమార్తె రాధయొక్కయు నక్షత్రాలు సరిపోయినవి. నేనుమీదగ్గరికి రెండుమూడు రోజుల్లోవస్తాను. మీరుయిష్టపడితే, పెళ్ళి త్వరగానే చెయ్యవచ్చు. ఈ సంగతి పార్వతితో చెప్పవలసింది.

ఇట్లు,

రామస్వామి.

ఇంతలో కేశవయ్య భార్యయగు పార్వతివచ్చి 'ఏమండీ' ఎన్నిసార్లు కబురంపించను. స్నానానికి తోడిన వేన్నీళ్ళుచల్లారిపోతున్నాయి. లేవండి త్వరగా' అన్నది. అంటూ బల్లమీద వున్న వుత్తరంతీసి, చదివి 'ఏమండోయ్' నేచెప్పినట్టే అయిందే. మా అన్నయ్య రామస్వామికూతుర్ని మీకొడుక్కు చేసుకోవాలి. తప్పదు. కట్నం, గిట్నం, లాంఛనాలు అవి ఏమివుండవు. యింకా నయం! నామేనకోడలు చాలా అందకత్తె మీరు అందుకే సంతోషించాలి. మీవేణుగోపాలయ్యకు అంతకంటె ఎక్కువ ఎక్కడ నుంచి వస్తుంది. పెళ్లి ఖాయమన్నమాటే. లేవండి త్వరగా' అన్నది. కేశవయ్యభార్య చెప్పినట్లే లేచి దొడ్లోకి స్నానానికివెళ్లాడు.

2

కేశవయ్యకు సుమారు అరవైఏండ్లుంటాయి. బీదకుటుంబంలో పుట్టినా, ఏదో విధంగా డబ్బుబాగానే సంపాదించాడు. దైవానుగ్రహంవల్ల ఒక కొడుకుకూడా కలిగాడు. అతడే వేణుగోపాలరావు. యితను బియ్యే చదువుతున్నాడు. అంతాబాగానే జరిగిపోయింది కాని, రెండేళ్లక్రింద కేశవయ్య భార్యా చనిపోయింది. కొడుకు పెద్దవాడైనా, కేశవయ్య రెండోవివాహం చేసుకొన్నాడు. ఈరెండో భార్యే పార్వతి. ఈమె చాలా అసాధ్యురాలు. కాపరానికి వచ్చిన కొత్తలోనే మొగుణ్ణి వంచేసింది కేశవయ్యని కీలుబొమ్మల్లే త్రిప్పుతోంది. తన మేనకోడల్ని గోపాలరావుకిచ్చి పెళ్ళి చెయ్యాలని ఈవిడఉద్దేశ్యం. అందుకోసం భర్తను చాలా నిర్బంధిస్తోంది.

3

ఒకనాడు గోపాలరావు, శంకరరావు అనేస్నేహితుడింటికి భోజనానికి వెళ్లాడు. భోజనంచేసి స్నేహితులిద్దరు సావిట్లోకివచ్చి కూర్చున్నారు. అంతలో ఒక సౌందర్యవతి తాంబూలం పళ్లెం పట్టుకొచ్చింది. ఈమెయే శంకరరావు చెల్లెలగు అనసూయ. కొద్దిరోజులక్రిందనే మెట్రిక్యులేషన్ పరీ

క్షిచ్చింది. ఇంకా వివాహం కాలేదు. పళ్లెం అక్కడపెట్టి ఆమెగిరుక్కున మళ్లీలోపలికి వెళ్ళింది. గోపాలరావు కన్నెత్తి చూశాడు. అతని మనస్సు కలవరపడ్డట్టు ముఖంలో కనిపించింది.

౪

కేశవయ్యకి గుండెల్లో దిగులుపడ్డది. భార్యమాటకి అడ్డుచెప్ప లేకుండా వున్నాడు. ఆమె అధికారం అట్లావుంది. యిటు కొడుకు బుద్ధియెరిగిన పెద్దవాడు బియ్యే పరీక్షకివెడుతాడు. వివాహం సంగతిలో కొంత అతనికే వదలివేస్తే బాగుంటుంది. ఈవ్యవహారం యిట్లావచ్చేటప్పటికి కేశవయ్యకు విచారం ఎక్కువైంది. రోజురోజూ భార్య పీడిస్తోంది. అందుకోసం, ఒకనాడు గోపాలరావుని పిల్చాడు 'నాయనా, వేణూ'అనియిక మాట్లాడలేకపోయినాడు. గోపాలరావు ధైర్యంతో ఏమిటి అంతవిచారంగా వున్నావు, కారణం ఏమిటి నాతోచెప్పు ఫరవాలేదు. చేతనైతే ఏమన్నా చేస్తాను. నీవు పెద్దవాడవైనావు' అన్నాడు. కేశవయ్య కంటనీరు పెట్టి- 'వేణూ నీతోఒక సంగతి చెప్పాలని ఎన్ని దినాలనుంచో ఆలోచిస్తున్నాను. కాని నీకు ఏమి కష్టంగా వుంటుందో అని సంశయంగావుంది. అనగానే గోపాలరావు అడ్డంవచ్చి 'నాకు కష్టంఏమిటి చెప్పు అంతా భయంలేదు' అన్నాడు. దుఃఖందిగమింగి కేశవయ్య 'వేణూ, నేను ఎగరక్కపోయి. వివాహం చేసుకున్నాను రెండోమారు కాని దీనిమూలాన యిన్నికష్టాలు ప్రాప్తమవునని నేను అనుకోలేదు. నీవుకూడా, తండ్రికి పెళ్ళి అవుతుందనే సంబరంలోనేగాని సవితల్లి వస్తుందనే సంగతి ఆలోచించకుండా నన్ను తిరిగి వివాహమాడమన్నావు. వేణూ ఏమనిచెప్పను. పార్వతి, ఏకు మేకైంది. తన మేనకోడల్ని నీకిచ్చి కట్టిపెటుతుందట. నాకదియిష్టంకాదు, ఎన్నిచెప్పినా, ఎట్లా చెప్పినా, వినదు. ఆపిల్ల అందవతికాదు. పైగా వాళ్లకుటుంబంకూడా అట్టేమంచిది కాదని చూచాయగా తెలియవచ్చింది. అందులో నీవు బి. యే. చదువుతున్నావు. సంబంధాలు దొరక్కపోవు. నాకు ఏమి చెయ్యడానికి తోచడంలేదు? అని వూరుక్కున్నాడు. వేణుగోపాలరావు తండ్రివైపు దీక్షంగాచూచి 'నాన్నా నీవు వృద్ధుడవైనావు సుఖపడవలసిన రోజుల్లో నీకిట్టి కష్టాలొస్తాయని నేనెన్నడు అనుకోలేదు. పార్వతమ్మకు ననుచూస్తే అసలే గిట్టదు. అందుకే కాబోలు ఆపిల్లనినాకు ముడివెయ్యాలని తలుస్తోంది. నీవలెనే నాకుకూడా ఈ సంబంధం ఏమాత్రం యిష్టంలేదు. నేను ప్రాయం తెలిసినవాణ్ణికనుక నావివాహం విషయంనాకు వదిలేస్తే బాగుంటుంది.' అంటూంటే కేశవయ్య 'అవును, నాయనా, అదే మంచిపని. నాకెందుకు అవస్థ. ఆవిషయం నీకేవదలివేస్తాను. నీవెట్లాచేసినానాకు సమ్మతమే” అన్నాడు.

“అయితే, నాన్నావిను. చెరువుగట్టు దగ్గర పెద్దమేడవుందే,”

“అవును, గురుమూర్తిపంతులుగారిది కాదూ, అది.” “అవును,” ఆయనకొమారుడు శంకరరావు నాక్లాసేచదువుతున్నాడు నాకు అతను ప్రాణమిత్రుడు. మరే, సి విడిచి చెప్పుచున్నాను. 'అతనికి అనసూయ అనేచెల్లెలుంది. ఈసంవత్సరం మెట్రిక్యులేషన్ పరీక్షకు వెళ్లింది. మంచి అందక

పదునాలుగు ఏండ్లుంటవి. అంతే. నీవుకనుక యిష్టపడితే."

'దానికేమి, వేణూ; కాని ఆప్లీడరిగారికూతుర్ని నీకెట్లాయిస్తారు.'

'లేదు, తండ్రీ, నాకునమ్మకంవుంది. నీవుసరేనంటే తక్కినవిషయాలన్నీ నేను చేస్తాను.

'సరేకాని, ఒకచిక్కుంది. నీవుగనుక ఆపిల్లని వివాహంచేసుకుంటే పార్వతికి కోపంవస్తుంది. అటుపైన నీవు నీ భార్య యీయింట్లో కాపురంచెయ్యడానికి ఆస్కారంవుండదు. వివాహం అయినతర్వాత నీవు విడిగా కాపురంచెయ్యి. కావలసినడబ్బు, అవినేనిస్తాను. పెండ్లికిమాత్రం నేనురాను. ఒకవేళ వచ్చానా, ఆపైన తరువాత కిష్కింధఅవుతుంది. పార్వతిచేతిలో పడలేను. కాబట్టి నేనురాకపోయినా, నీవువివాహం చేసుకోవలసింది. నాయీఆశీర్వాదములు యివేఅందుకో, శీఘ్రమే వివాహకార్యసిద్ధిరస్తు'

అని కేశవయ్య కుర్చీలో జారిగిలబడ్డాడు. గోపాలరావు కొంతతడవు ఆలోచించి 'నేను అనసూయని వివాహంచేసుకుంటే చాలాచిక్కులు వస్తాయి. నిన్ను విడిచి మరొకచోటనివసించాలి. యివన్నీ కష్టంగానేవుంటాయి, కాని, నేనుయేమీ చెయ్యలేను. అనసూయనే వివాహంచేసుకుంటాను.' అని పూర్తిచెయ్యగానే, ఎందుకో విసవిసలాడుకుంటూ పార్వతి ప్రవేశించింది. ఆవిడరాగానే గోపాలరావు గదిలోంచి బయటకువచ్చాడు. కేశవయ్య, పార్వతి ఏదోమాట్లాడుకొన్నారు.

చైత్రశుద్ధ విజయదశమినాడు తిరుపతి కొండమీద, గోపాలరావుకు, అనసూయకు వివాహంజరిగింది. ఉభయఖర్చులు గురుమూర్తిపంతులుగారే భరించారు. పెళ్లి చేసుకొని వారంతా యింటికి తిరిగివచ్చారు. ఈసంగతి వూళ్లో తెలిసింది. కేశవయ్య లోలోపల సంతోషించాడు. పార్వతికి అపరిమితకోపంవచ్చింది. ఏవిధానైనా గోపాలరావుమీద, కేశవయ్యకు కోపంతెప్పించాలని అనుకొన్నది

పెళ్ళిఅయినప్పటినుంచి గోపాలరావు అత్తవారింట్లోనే వుంటున్నాడు. ఎప్పుడైనా సాయంకాల సమయానవచ్చి తండ్రినిచూచి పోతుండేవాడు. కొడుకు, కోడలు సుఖంగా కాపురంచేస్తున్నారు గదా అని కేశవయ్యకు ఆనందంకల్గింది.

కేశవయ్య అప్పుడే స్నానంచేసి భోజనానికి కూర్చున్నారు. అన్నంవడ్డిస్తూ పార్వతి 'ఏమండోయి, మీగోపాలరావుమూలాన మనవంశానికికూడా అపరదిష్ట వస్తోంది విన్నారా' అంది

'ఆ, ఏమిటేమిటి అపరదిష్టా'

"ఏమిటేమిటా? రోజుసాయంకాలం యిద్దరూ కాలువవడ్డుకి షికారు వెళ్తారుట. ఆనవ్వులు ఆసరసల్లాపాలు వినాలిచూడాలి. ఒకరినొకరు రాచుకుంటూనే నడుస్తారట. యిద్దరు బూట్సులుకూడ వేస్తారట. మారాధ కాదనిఏమో బాపుకుందామని దీన్ని పెళ్లాడాడే? చూశారామీకేమికావాలె ఆకోట్లో పడికాలం గడుపుతారు మనవంశంపేరుకూడా పాడవుతోంది తెలిసిందా, మీయిష్టం

కేశవయ్య మాట్లాడకుండా అన్నంతిని తన గదిలోకివెళ్లి పడుకొన్నాడు

రెండురోజులయినతర్వాత, గోపాలరావుకి

తండ్రిదగ్గరనుంచి ఉత్తరం వచ్చినది. నీకు నాకు ఈదినంతో ఏమీ సంబంధము లేదు. నా ఆస్తి స్వార్జితం గనుక నీకు యేమీ భాగం లేదు. అని అందులో వ్రాసివుంది అది చూచేటప్పటికి గోపాలరావుకి ఏమీ తోచింది కాదు. తండ్రికి అంతగా కోపం వచ్చేటందుకు తానుగాని తన భార్యగాని ఏవిధమైన అవ్యక్తపు పని చేసివుండలేదు. బహుశః పార్వతమ్మ దీనికి కారకురాలేమో అని అతడనుకొన్నాడు. ఈసంగతి భార్యతో తప్ప యిక ఎవరితో చెప్పలేదు.

ఒకనెల గడిచింది. కేశవయ్యకు సంజుచూపింది. వ్యాధి కుదిరేటట్టు కనుపించలేదు. గోపాలరావు రెండుసార్లు తండ్రిని చూడ్డానికి వెడితే పార్వతి వాకిట్లోంచే త్రిప్పివేయించింది. వాళ్ళద్వారా వాళ్ళద్వారా తండ్రిసంగతి తెలుసుకుంటున్నాడు గోపాలరావు. కాని తండ్రికి ఏమీ నెమ్మదిగా లేదని విచారపడుతున్నాడు.

ఒకదినం సాయంత్రం ఎవరో వచ్చి, గోపాలరావుని అతనిభార్యని, కేశవయ్యగారు రమ్మన్నారని తెలియజేశాడు. గోపాలరావు, అనసూయ, త్వరగా బయలుదేరి కేశవయ్యగారింటికి వెళ్ళారు. వాకిట్లో ఎవ్వరడ్డుపెట్టనందున వారిద్దరు సరాసరి కేశవయ్య గదిదగ్గరకు జేరారు. లోపలికి ప్రవేశించగానే 'నాయనా' అని కేక వినబడ్డది. మృత్యుముఖమున బడుచున్న కేశవయ్య రెండుచేతులుచాచి 'వచ్చారా' అన్నాడు. అప్పుడుపార్వతి అక్కడలేదు. యిద్దరు నౌకరులుతప్ప మరెవ్వరూలేరు. 'వచ్చారా' నాబిడ్డలారా అమ్మా అనసూయా వేణూ తెలియక మిమ్మల్ని ఎంతకష్టపెట్టారా నీసవత్తల్లి పన్నుగడలని తెలిసికోలేకపోతిరా. మీరు ఎంతమంచిగా కాపురం చేయుచున్నది విని మిక్కిలి సంతసించాను. యిదిగో నాయనా విల్లుకాగితం. నా ఆస్తియంతా [illegible] నీవేకనిపెట్టు. నాకిక సెలవు. మాట్లాడలేను' యంటూ కళ్లుమూసుకొని ప్రాణాలువిడిచాడు. అంతా గొల్లుమన్నారు. పార్వతివచ్చింది, యిరుగు పొరుగువారును అంతావచ్చారు. శవాన్ని అట్టేయుంచడం ఎందుకని ఆసాయంకాలమే గోపాలరావు తతంగం అంతా జరిపాడు. చూచేవాళ్ళంతా యిన్నాళ్ళనుంచి తండ్రికి కొడుక్కి మాటల్లేవుగా ఆపాడు పార్వతిమూలంగా యిప్పుడెట్టా కలిసింది అన్నారు.

మరుదినమే పార్వతి తన మూటముల్లె సర్దుకొని పుట్టింటికి పోయింది. వేణు గోపాలరావు అనసూయ గురుమూర్తి పంతులు గృహంవిడిచి ఈ యింట్లో ప్రవేశించి సుఖముగా కాలము గడుపుచూ పార్వతమ్మకు మనోవృత్తి డబ్బు పంపుతూండేవారు.



# పుష్పమాల

తుర్లపాటి. గోవర్ధనరావుగారు.
(పారస్యత సహజము)

మంజులంబై ప్రమోద సంభరిత మయిన
ఆ పురాణోప వన్య కావ్యామృతమ్ము
చే దనరు పుష్పములన నెన్నో సేకరించి
మాలగా గ్రుచ్చితి, హీనమైన రచన
కావలెన? కానుకగా కావ్యకన్య! నీకు
ఓ కవికుమార! భావపూర్ణ మోాక లెత్తి
హృదయ కేదార సీమ రసార్ద్రిదోహ
ద మ్మొనర్చు కృషికి సంతసంపడితి, ని
దేమి వింత? పువ్వులు క్రొత్తవేమి? తేకు
మధుపులం గ్రొత్త లేమి?
సంబరము నెంద
జెప్పెదను విన్ము! ప్రాతనశించి, క్రొత్త
యౌను, ప్రకృతి ధర్మమిది సుంతైన గనక
నూతనత్వమేది యనినను దోసంగు
కలుగునా? అలంకృతులందు, నడకలందు
భావమందు, వృత్తివిధాన మందు, కవుల
యందు, విన్పడదా క్రొ? వాగర్థ మెల్ల
నేటి పోకడల వినుమ నిందఁజేయ
నేల నూఅక, ప్రసవమ్ము లేదు దలకు
దెచ్చి, కావ్యశృంగార రసమ్ము సుంత
నొలక బోసి, పరిష్కృతికి పాటుపడుచు
పుష్పమాలలు రస సరస్వతికి నిచ్చు
కవికుమారులం దిరస్కరణ సేయ
బాల్పడితె? పండితులలీల
లేదు కవికు
మార! మీ తత్త్వము దెలియ లేరు వారు
కాని నేను మీదాననే సుమండి
ఎటులఁ జెప్పిన నటుల నే నడిచి కొందు,
గణవిధేయతఁ మీకు వాక్సన్నలెంచి
ప్రియసిం బలె, తెలియని దాన గాను.
ఏమె కావ్యకుమారి, కవిత్వ తత్త్వ
మా, కవిరసజ్ఞులకు భోజ్యంబు కాని
బ్రహ్మవిద్య, యెఱుంగ లేరా! ఒకింత
శాస్త్రచోదిత విజ్ఞానస్ఫురణ,
కవి ర
సజ్ఞ! హేతూక్తిని గెల్వ జాలు వార
లేరి కవి విమర్శకులతో వింత వాద
మెందు కనిన లోకమున నందందు నింద
కలఁదు- అక్షరములు నేర్వ గడగు కవుల
పాండితియని- సీప్రతిహతఁ బగును గాత.



# కాళిదాసునిరంకుశత్వము

—(o)—

జంధ్యాల శివన్న శాస్త్రీగారు

[ దీని పూర్వభాగము ఆంధ్రసారస్వత సరస్వమునందు ప్రకటింపబడినది ]

ఛ

సంస్కృతములో కొన్ని ధాతువులకు లిట్ లకారము ముందుండగా ఆమ్ ప్రత్యయమువచ్చును. తరువాత "కృఞ్చానుప్రయుజ్యతేలిటి" అను పాణిని సూత్రముచే కృధాతువు చేర్పఁబడును. "ప్రభ్రంశయాఞ్చకార" మున్నగు రూపములిట్టివే. ఇట్టి క్రియాపదములను మూడుఖండములుగా విభజింపవచ్చును. ప్రభ్రంశయ— ఆమ్— చకార. ఈక్రియలను ప్రయోగించునపుడు వీని సిద్ధరూపము నొక్కచో వ్రాయవలయును. వీనిమధ్య మరి యితరశబ్దముండ గూడదు. ఈవిషయము కాళిదాసు ఎఱుగుననుటకు క్రింది ప్రయోగములే ప్రమాణములు.

(౧) ప్రమథముఖ వికారైర్హా సయామాసగూఢమ్।
కుమా స. ౬ ౯౫ శ్లో.

(౨) ఉమాముఖే బింబ ఫలాధరోష్ఠే
వ్యాపారయా మాసవిలోచనాని॥
కుమా. 3—౬౭

కాని రఘువంశములో పలుచోట్ల నీనియమము అతిక్రమించబడినది.

(౧) తేనాభి ఘాతరభసస్య వికృష్య పత్రీ
వన్యస్య నేత్రవివరే మహిషస్యముక్తః
నిర్భిద్య విగ్రహ మశోణిత లిప్తపుంఖ
స్తంపాతయాం ప్రథమమాస పపాతపశ్చాత్॥ ౯—౬౧

(౨) భ్రూభేద మాత్రేణ పదాన్మఘోనః
ప్రభ్రంశయాం యోనహుషంచకార
తస్యావిలాంభః పరిశుద్ధిహేతో
ర్భౌమోమునేః స్థానపరిగ్రహో౽యమ్॥
౧౩ — ౩౬

(3) ఇత్యూచివానుపహృతాభరణః క్షితీశం
శ్లాఘ్యో భవాన్ స్వజనఇత్యనుభాషితారమ్।
సంయోజయాం విధివ దాస సమేతబంధుః
కన్యామయేన కుముదః కులభూషణేన॥
౧౬—౮౬

చూడుడు. "పాతయామాస" అను పదములో పాతయాం ఆస అనుఖండముల మధ్య ప్రథమంఅను శబ్దము చేర్పఁబడినది. ఇట్లే "సంయోజయామాస"లో "విధివత్"ను. "ప్రభ్రంశయాఞ్చకార" లో "యః" "నహుషం" అను రెండుశబ్దములును చేర్పఁబడినవి. అశ్వఘోషుఁడు కాళిదాసునకు తర్వాతివాఁడు. ఈయన తన బుద్ధచరితములో కాళిదాసుని పదములను, వాక్యములను, అచ్చటచ్చట ఒకటిరెండు శ్లోకపాదములను గూడ ఎత్తి ప్రయోగించుకొనెను. పైని ప్రయోగములనుగూడ ఈయన యెట్లు అనుకరించెనో చూడుడు.

భూజాభిలాషేణ చబాహుమాన్యా
ద్దివౌక సస్తం జగృహుః ప్రవిద్ధమ్।
యథావతేనం దివి దేవసంఘా
దివ్యైర్విశేషైర్మహయాంచక్రుః॥
బుద్ధ—౬—౫౭

ఈశ్లోకములో మహయాం చక్రుః అను క్రియాపదము మధ్య "చ" చేర్పఁబడినది. మాఘ కవికాళిదాసునకు చాల ఇటీవలవాఁడు. ఆయనయు కాళిదాసుని యీవ్యవచ్ఛేదక ప్రేమ నెట్లులనుకరించెనో చూడుఁడు

భాదితః కథమపిత్రపయా స్త

క్త్యాః ప్రియం ప్రతిచిరాయ రమణ్యాః।
వారుణీ మదవిశంకవిధావి
ర్చక్షుషో౽భవదసావివరాగః॥

శిశుపాలవధ. ౧౦-౧౯

'ఆవిరభవత్' అనునది యొక పదము. ఇందలి ఆవిః, అభవత్ అను రెండుఖండములమధ్య చక్షుషః అను శబ్దముంచబడినది. మల్లినాథుఁడు దీనిని సహించలేదు. ఆయన ఈప్రయోగమును సాధువుగ సమర్థించుటమాని స్పష్టముగనిట్లు వ్రాసెను

"ఆవిర్భవోర్వ్యవధానంకవిస్వాతంత్ర్యాత్"

"ఆవిః భూ" లమధ్య వ్యవధానముంచుట కవి నిరంకుశత్వమని యర్థము. కాళిదాసుని (౧) ఉదాహరణ శ్లోకపు టీకలో మల్లినాథుఁడునిస్సంకోచముగానిట్లు వ్రాసెను

"కృఞ్చానుప్రయుజ్యతేలిటి"- ఇత్యత్ర అను శబ్దస్యావ్యవహితవిపర్యస్త ప్రయోగనివృత్త్యర్థత్వాత్- "పాతయాంప్రథమమాస"- ఇత్యపప్రయోగ ఇతిపాణినీయాః। యథాహవార్త్తికకారః- "విపర్యాసనివృత్త్యర్థాంవ్యవహితనివృత్త్యర్థంచ"

పాణిని సూత్రమందలి 'అనుప్రయుజ్యతే' యొక్క యుద్దేశము "కృ" ధాతురూపము లిట్‌లకారములో 'ఆమ్' ప్రత్యయమునంటి యుండవలెనని కాళిదాసు అట్లు చేయలేదు. కాన పాణినీయ మతానుసారము ఇది శుద్ధముగాని ప్రయోగము, అని భావము. తనమతమును బలపఱచుటకై మల్లినాథుఁడు కార్త్తికాకారుని వాక్యముకూడ నుద్ధరించెను. చరిత్రవర్ధనుఁడును తనటీకలో మల్లినాథునే యనుసరించుచు నిట్లువ్రాసెను "పాతయాంప్రథమ మాసేతివ్యవహితో౽నుప్రయోగః కవిప్రమాదః" అని దీనితరువాత కాళిదాసుని ప్రయోగమును సమర్థించుటకై పెనుగులాడు వారి పంక్తుల నుదహరించుచు నిట్లువ్రాసెను.

"యద్యప్యేవం కేచన సమాదధతే, తథాపీయం రీతిస్తువభవతి............ । అసౌ (ప్రయోగః) అసాధురేవ".

హేమాద్రియు ఇతరుల సమాధానములను విరివిగావ్రాసినను తన సమ్మతిమాత్రమిట్లేవ్రాసెను——"తేన వ్యవధానే ప్రయోగం నిరాకరోతి"। కానపైనిపుస్తులు వ్యాఖ్యాతలును కాళిదాసుని యీప్రయోగములను ప్రమాదికములనియే తలఁచుచున్నారు. ఈప్రయోగములను సాధువులు చేయఁదలఁచినవారి యుక్తులెంతయు విలక్షణములుగను అక్రమములుగ ఉన్నవి. పాపము కాళిదాసు తనప్రయోగములను శుద్ధము చేయుటకై పండితులిన్ని తంటాలు పడెదరనిస్వప్నమునను తలఁచియుండఁడు. కాళిదాసుని కాలమున ఇట్టిప్రయోగములు వ్యాకరణ సమ్మతములుగనేని పరిగణింపఁబడి యుండవలయును లేకకవి యీవిషయమున వ్యాకరణ నియమమును పాటించుట యనావశ్యకమని యేని యెంచి యుండవలయును. పైపదములందు వ్యవధానమున్నను వానియర్థము తెలిసికొనుటకేమియు బాధలేదు. కానిపాణినీయ వ్యాకరణము ననుసరించి కాళిదాసు నిరంకుశత్వ మవలంబించె ననియే పెక్కువిద్వాంసుల యాశయము.

(౬) నాయకౌచిత్యభంగము.

శివునకు పార్వతిపై ననురాగము కలిగించుటకై మన్మథుఁడు విశ్వప్రయత్నము చేసెను. పంచబాణములను కురిపించుచు తుదకాయన చిత్తముచలించెను. ఆయన సమాధినుండిలేచి చిత్తక్షోభమునకు కార

ణము వెదకుచుండ వసంతసహాయుఁడైన మన్మథ మహారాజు కర్ణాంతాకృష్యమాణ శరాసనుఁడై పొడఁగట్టెను. వెంటనే రుద్రుఁడు రౌద్రమునుదాల్చి చిచ్చుఁబఱకంటితోఁ జూడఁగా పూవిల్తుఁడు బుగ్గియయ్యెను. కుమారసంభవములో కాళిదాసు ఈప్రసంగము నిట్లు వర్ణించెను.

క్రోధం ప్రభో సంహర సంహరేతి
యావద్గిరః ఖే మరుతాంచరన్తి
తావత్సవహ్నిర్భవ నేత్రజన్మా
భస్మావశేషం మదనంచకార॥

స్వామీ! కోపింపకుఁడు కోపింపకుఁడు అని ఆకాశమున దేవతలు మొఱ వెట్టుకొనునంతలో భవుని (శివుని) నేత్రమునుండి పుట్టిన అగ్ని మన్మథుని భస్మముచేసెనని భావము. శివునకు మృడుఁడు, రుద్రుఁడు ఈశ్వరుఁడు, త్రినేత్రుఁడు, హరుఁడు, స్థాణువు మున్నగు పేళ్ళలో భవుఁడను పేరుకూడ ఒకటి. భవశబ్దము ఉత్పత్తివాచకము. దీనినే కాళిదాసు ఈశ్లోకమునఁ బ్రయోగించెను. కాని యిచ్చట ప్రసక్తి నాశనమునకుఁగాని ఉత్పత్తికిఁగాదు. కాన సంహారవాచకమగు హరశబ్దమును బ్రయోగించుటయే యిచ్చట యుచితము. అట్లుచేయకపోవుటచే ఇచ్చట నామౌచిత్యభంగము వాటిల్లెను. క్షేమేంద్ర మహాకవికూడ తన ఔచిత్య విచారచర్చలో ఈవిషయమై యిట్లు వ్రాయుచున్నాఁడు—

"అత్ర శక్రతో భగవత స్త్రినేత్రస్య స్మరశరనిపాతక్షోభే వర్ణమానే తన్నికారకోప ప్రశమాయ సంహర ప్రభో కోపమితి యావద్వచః ఖే దేవానాంచరతి తావ ద్భవనేత్రోద్భవః సవహ్నిర్మదనం భస్మరాశీకృతవా న్నిత్యుక్తే సంహారావసరే రుద్రస్య భవాభిధానమనుచితమేవ"!

సంహార సందర్భమున రుద్రునకు భవుఁడను పేరు ఉచితముకాదని భావము. విచారింపుఁడు. తల్లిదండ్రులు లోకనికి ఉదారుఁడని పేరు పెట్టిరి. పెద్దవాఁడైన పిదప వాఁడు దొంగతనము నేర్చుకొనెను. కొన్నినాళ్ళకు వాఁడొక ప్రసిద్ధచోరుఁడగుటచే జనులు వానిని చోరదాసుఁడని పిల్వసాగిరి. తుదకు వాఁడు పట్టుపడి తన చౌర్యవృత్తాంతము నంతయు వినిపించెను. ఒకానొక ఆఖ్యాయికాలేఖకుఁడు వానిచరిత్రము వ్రాయుచు చౌర్యవర్ణన సందర్భమున వానిపేరు ఉదారుఁడని వాడిన పాఠకులకు వెగటుగనుండును గదా! ఇట్టిస్థలమున చోరదాసుఁడను పేరే సార్థకముగను సరసముగను ఉండును. ఇచ్చట ప్రసంగోచితమగు నామముంచకపోవుట కాళిదాసుని నిరంకుశత్వము.

(౨) ఐతిహాసికౌచిత్య భంగము

దిలీపమహారాజు తొంబది తొమ్మిది అశ్వమేధయాగము లొనరించెను. ఇంతటితో నాయనకు సంతోషము కలుగలేదు. ఆయన నూటియొక యజ్ఞముచేసి శతక్రతువగు ఇంద్రునితో సాటికాఁగోరెను. దీనినింద్రుఁడెట్లు లోర్వఁగలఁడు? ఆయన ఈమారు విడిచిన గుఱ్ఱమును చాటుగా నపహరించెను. అశ్వరక్షకుఁడు దిలీపపుత్రుఁడగు రఘువు. ఆయన గుఱ్ఱమునుగానక చాలచింతిల్లెను. అప్పుడే యచ్చటకు వసిష్ఠుని నందినీధేనువు వచ్చెను. దానిదయచే రఘువు సర్వదర్శి అయ్యెను. అతీంద్రియ పదార్థముగూడ గోచరింపసాగెను. ఈశక్తిచే నాయన ఇంద్రుఁడు గుఱ్ఱమును గొంపోవుటను జూచెను. కాన ఇంద్రుని గద్దించుచు గుఱ్ఱము నిచ్చివేయుమని యడిగెను. దీనిపై

ఇంద్రుఁడనెను. ప్రపంచములో నూఱు యజ్ఞములను నేనొక్కఁడనే చేసితిని. ఈనాకీర్తిని నీతండ్రి నపహరింపనీయను. ఈసందర్భమున కాళిదాసు ఇంద్రునిచే చెప్పించును.

అతోఽయమశ్వః కపిలానుకారిణా
పితుస్త్వదీయస్య మయాపహారితః।
అలం ప్రయత్నేన తవాత్ర మానిధాః
పదం పదవ్యాం సగరస్య సంతతేః॥

కనుక కపిలుని అనుసరించు నేను నీ తండ్రి గుఱ్ఱమును హరించితిని. దీనిని తీసికొనుటకు నీవుచేయు యత్నము వ్యర్థము. దీనిపైవిచారింతము. కపిలసగరుల వృత్తాంత మిది. సగరుఁడు యజ్ఞాశ్వమును విడిచెను. దానినికూడ దిలీపుని గుఱ్ఱమును బలె ఇంద్రుఁడపహరించి దానిని కపిలముని యాశ్రమమునఁ గట్టివేసెను. సగరపుత్రులు దానిని వెదకి వెదకి తుదకు కపిలాశ్రమమున కట్టియున్న గుఱ్ఱమునుజూచి కపిలుఁడే దొంగయని భావించిరి. దీనిపై కపిలుఁడు కోపించి వారిని భస్మము చేసెను. ఈఆఖ్యానమును మనమున నుంచుకొని ఇంద్రుఁడు తన్ను కపిలానుకారిణా అని చెప్పికొనుట ఎంతయుక్తముగ నున్నదో చూడుఁడు. "కపిలునివంటి నేను గుఱ్ఱము నపహరించితి" ననుట కపిలునిపై సగరాశ్వచౌర్యము నారోపించుట. వాస్తవమునకు కపిలుఁడు చోరుఁడు కాఁడు. చోరుఁడు మనదేవేంద్రుఁడే. సగర సంతాన మార్గమును జ్ఞాపకముచేసి కవి ఇంద్రవచనములో కపిలుఁడు సగరసంతతిని భస్మముచేసినట్లు ఇంద్రుఁడు రఘువును వశింపఁజేయునను ధ్వనిని సూచించుట చాల బాగుగనున్నది. అవిషయమై మాకేమియు నాక్షేపములేదు. అశ్వాపసారణ సందర్భమున ఇంద్రుఁడు కపిలానుకారియని చెప్పుట బాగుగ లేదనియే మాయాక్షేపణము. సగరసంతతి భస్మమగు సంగతి యుత్తరార్థమున నున్నది. "కపిలానుకారిణామయాపహారితః" అనునది పూర్వార్థమున నున్నది. దీనికిని దానికిని సంబంధమేమి? "అపహారితః" కు 'హృతః' అని వ్యాఖ్యాతలు అర్థము వ్రాసిరి. దగ్గఱనే "కపిలానుకారిణా" అను పదముండుటచే కపిలుఁడు సగరాశ్వమును హరించినట్లు నేను నీతండ్రి యశ్వమును హరించితినను భావమువచ్చుటలేదా? మఱియు నీశ్లోకమున ఐతిహాసికౌచిత్య భంగము కూడనున్నది.

[ఖ]

వాల్మీకి రామాయణము బాలకాండము డెబ్బదవ సర్గములో దిలీపునిపుత్రుఁడు భగీరథుఁడు, భగీరథుని పుత్రుఁడు కకుత్థుఁడు, కకుత్థునిపుత్రుఁడు రఘువును, రఘువునకు పండ్రెండవ పురుషాంతరమున అజుఁడును పుట్టినట్లు వ్రాయఁబడినది. కాని రఘువంశమున దిలీపుని పుత్రుఁడు రఘువనియు, రఘునిపుత్రుఁడు అజుఁడనియు వ్రాయఁబడినది. వాల్మీకి వ్రాఁతనుబట్టి రఘువు దిలీపునికి ప్రపౌత్రుఁడు. కాని కాళిదాసు పుత్రునిగా వ్రాసెను. మఱియు పండ్రెండు పురుషాంతరముల తరువాతనున్న అజుని రఘునికిఁబుత్రునిగా వ్రాసెను. ఈభేదమునకు కారణ మేమందుము. వాల్మీకి వ్రాఁతను ప్రామాణికముగా నెంచినచో కాళిదాసు ఐతిహాసికౌచిత్య భంగ మొనర్చినవాఁడగుచున్నాఁడు.

ఈదోషమును గాజియాబాదు సంస్కృత పాఠశాలా ప్రధానోపాధ్యాయులగు

శ్రీయుత ఇందుశర్మగారు సూచించిరి.

## (౭) యతిభంగము

యతియనఁగా తెలుఁగుభాషయందుఁ బలెగాక సంస్కృతభాషలో నియమితస్థానమున పదమాగిపోవుటయైయున్నది. యతి పర్యాయవాచకములగు విశ్రమ విరామ శబ్దములీయర్థమునే సూచించును. సంస్కృత ఛ్ఛందశ్శాస్త్ర కర్తలు అముక (ఫలానా) వృత్తమునకు అముకస్థానమున యతియని నిర్ణయించిరి. ఆనియమము ననుసరించి యతిస్థానమున శబ్దమాగక చీలియున్నచో శ్రవణకటువుగా నుండును. ఒకకల్పితోదాహరణము చూడుఁడు-

సదాశ్రీసీతారా- మపదయుగళీ వందనపునీ
తచిత్తంమాంసద్గ్రం-థ కరణ పటుం విత్తవిబుధాః॥

ఇది శిఖరిణీవృత్తము. దీనికి ౧౭ అక్షరములుండును. ౬ వ అక్షరమునను తరువాత ౧౧ వ అక్షరమునను యతి యుండవలయును. ఇందుప్రథమ పాదమున 'రామ' యను శబ్దములో 'రా' వద్దపదము సమాప్తము కావలసియుండెను. అట్లుగాక శబ్దములో ఒకఖండ మివతలను రెండవ ఖండముఆవతలను పడినది. మఱియుపాదాంతమునను శబ్దము ముగియక రెండుఖండములై పునీత శబ్దములోని 'పునీ' మొదటి పాదమునను 'త' రెండవ పాదమునను నుండెను. దీనినేయతిభంగములు సంస్కృత కావ్యములలో పెక్కుస్థలములఁ గనుపట్టుచున్నవి. అయినను ఆలంకారికులు యతి భంగమును దోషముగ గణించిరి. మండనమిశ్రుఁడును శంకరాచార్యుఁడును వాదము సేయునపుడు మండనమిశ్రుని శ్లోకములందు యతి భంగము గలిగెను. అప్పుడు శంకరాచార్యుఁడిట్లనెను.

అహో ప్రకటితా జ్ఞానం యతిభంగేన భాషిణా

ఈయతిభంగదోషము కాళిదాసునికిని తప్పినదికాదు. ఇతరుల కావ్యములలో నీదోషముండిన నంత కష్టములేదు. కాని కవికులగురువగు కాళిదాసుని కావ్యములో నీదోషముండుట చాలకష్టముగ నున్నది. చూడుఁడు.

అవైమిచైనా మనఘేతికింతు
లోకాపవాదో బలవాన్మతోమే
ఛాయా హిభూమేః శశినో మలత్వే*
నారోపితా శుద్ధిమతః ప్రజాభిః

'మలత్వేన' అనునది యొకటేపదము ఇందలి 'మలత్వే' అను కొంతభాగము ఒక పాదమందును, మిగిలిన న యనుభాగమును వేరొకపాదమందును ఉన్నది. ఈశ్లోకమున యతిభంగ దోషమున్నను ఇది చాలగొప్ప శ్లోకము. ఇందుకాళిదాసు చంద్రగ్రహణమునకు వాస్తవకారణము భూచ్ఛాయ చంద్రునిపైఁ బడుటయేయని సూచించెను. దీనినిఁ బట్టి కాళిదాసును, ఆయనకు పూర్వులును చంద్రగ్రహణమున నేమియో యెఱుఁగుదురని తెలియుచున్నది.

*వాస్తవమునకు ఇది పైనికల్పితోదాహరణము వంటిగొప్పదోషముకాదు. ఇదియునించుక శ్రవణకటువుగ నున్న మాటనిజము. 'మలత్వేన' లోని 'న', చతుర్థపాదములోని 'ఆరోపితా', తోకలియుటచే సవర్ణదీర్ఘసంధివచ్చెను. శబ్దములోని రెండవఖండమునకు అచ్చుపరంబై సంధివచ్చిన యతిభంగదోషములేదని పెక్కుకవుల యాశయము. బహుశః ఈయాశయమునకు కాళిదాసువంటి మహాకవుల ప్రయోగమూలమై యుండనోపు.

(౯) పునరుక్తి.

[ క ]

తవిశ్వయే శుద్ధిమతి ప్రసూతః శుద్ధిమత్తరః।
దిలీప ఇతిరాజేందు రిందుః క్షీరనిధావివ॥

ఆపరిశుద్ధవంశమునందు మిక్కిలి పరిశుద్ధుఁడగు రాజచంద్రుఁడు క్షీరసాగరమున చంద్రుఁడట్లు జనించెను అనియర్థము. ఇచ్చట అకారణముగ రెండుమారులు ఇందు శబ్దము ప్రయోగింపఁబడినది. విశేషకారణము లేకుండుటచే వాగ్భటునిమతమున నిచ్చట పునరుక్తిదోషము వచ్చినది. మఱియు దీనినే కథితపద దోషమనియు నందురు. చెప్పిన పదమే మఱల చెప్పిన ఆదోషము వచ్చును.

[ఖ]

కాళిదాసు రఘువంశములోని శ్లోకములను కొన్నిటిని కుమారసంభవమందును, కుమారసంభవములోనివి రఘువంశమునందును ఉన్నవి ఉన్నట్లు ప్రయోగించెను. కవి తనగ్రంథములోని శ్లోకములను తన మఱియొక గ్రంథములో నుపయోగించుటలో నేమియు హానిలేదు. ఏమన అది అతనిసొత్తు. కాని ఒకపుస్తకములోనే ఒక స్థలముననే, దగ్గఱ దగ్గఱగనే ఒక శ్లోకములోని యొకపాదమును మఱియొకశ్లోకములో వాడినచో కటువుగనుండును. కాళిదాసు రఘువంశము ౧౧ వ సర్గములో నిట్లే చేసెను.

దృష్టసారమథ రుద్రకార్ముకే
వీర్యశుల్కమభివంద్య మైథిలః।
రాఘవాయ తనయామయోనిజాం
పార్థివః ప్రియమివన్య వేదయత్॥

ఇది ౪౭ వ శ్లోకముయొక్క మూడవపాదమును దీనితరువాతి ౪౮ వ శ్లోకములో ఎట్లు ఉంచెనో చూడుఁడు-

మైథిలః సపది సత్యసంగరో
రాఘవాయతనయామయోనిజామ్।
సన్నిధావ్యతి మతస్తపోనిధే
రగ్నిసాక్షిక ఇవాతి సృష్టవాన్॥

చూచితిరా? కాళిదాసునకు శబ్దములకే మేని కఱవువచ్చెనా? ఈరెండు శ్లోకముల యర్థము ఒక్కమాదిరిగ నున్నది. ఇందు ఒకటి పత్రిప్తమయియేని యుండవచ్చును. లేక లేఖకుల ప్రమాదముచే ఒకపాదము జారిపోఁగా ఎవ్వరేని ఆస్థానమున "రాఘవాయ తనయామయోనిజాం" అని శ్లోక పూర్తిచేసియేని యుండవచ్చును.

(౧౦) అధికపదత్వము.

అథోష్ట్రవా మీళతవాహితార్థం
ప్రతేశ్వరం ప్రీతమనామహర్షిః
స్పృశన్ కరేణానత పూర్వకాయం
సంప్రస్థితో వాచముదాచకౌత్సః॥

ఒంటెల మొత్తముపై ధనమువేయించినటువంటియు పూర్వకాయమును వంచినటువంటియు రఘుమహారాజునుహస్తములో స్పృశించుచు ప్రసన్నమనస్కుఁడై ప్రయాణముసేయు కౌత్సమహర్షి వాక్కును పలికెను. అని అర్థము. ఇచ్చట పలికెననిన చాలును. వాక్కును అనుట అనావశ్యకము. అముకమనుష్యుఁడు అముక (ఫలానా) మనుష్యునితో నిట్లుపలికెను అనుటయే జాతీయమగు ఫక్కి (Idiom) మాటను పలికెను. వాక్కును పలికెను అనుటజాతీయముగాదు ఈశ్లోకపువ్యాఖ్యలో మల్లినాథుఁడు ఈదోషము నెత్తుకొనలేదు. కాని హేమాద్రిచరిత్రి

వర్ధనులు ఈవిషయము నెత్తుకొనిరి. హేమాద్రివ్రాఁత చూతుము.

"విశేషణం వినావాక్యప్రయోగ శ్చింత్యః" అనఁగా విశేషణము లేకుండ వాక్యమును ప్రయోగించుట చింత్యము. "మధురాం వాచమువాచ" లేక "మనోరమాం వాచమువాచ" అనుచోటవాక్యప్రయోగ ముచితము. ఏలయన అచట వాక్యము విశేషణసహితము. కాని కాళిదాసు విశేషణము నీయకుండుటచే "వాచమువాచ" నిర్దోషము కాఁజాలదు. ఇంక చరిత్రవర్ధనుని వ్రాఁతచూతుము— "శుచిస్మితాం వాచమవోచదచ్యుతః— ఇత్యాదావయభావిశేషణం తద్వదత్రాపివాచో విశేషణాయోగాద్వాచము వాచేతిచింతనీయమ్" శుచిస్మితాం వాచమవోచదచ్యుతః— ఇదిశిశుపాలవధలోని శ్లోకపాదము. ఇందు "వాచం" అనుదానికి శుచిస్మితాం అను విశేషణ ముండుటచే నిర్దోషము * కాళిదాసునిపై శ్లోకమట్టిది కాకుండుటచే ఇందు సాహిత్యదర్పణ మతానుసారము అధికపదత్వాదోష మున్నది. విశ్వనాథకవిరాజు ఇట్లు వ్రాయుచున్నాఁడు— "అత్ర వాచమిత్యధికమ్। ఉవాచేత్యనేనైవ కృతార్థత్వాత్"।

(సశేషము)

* క్రియావిశేషణముచేతనే గతార్థమగుచుండ విశేష్యప్రయోగము వ్యర్థమని కావ్యప్రకాశకారుఁడు. "జగాదమధురాం వాచం విశదాక్షరశాలినీం। ఇత్యాదౌ క్రియా విశేషణత్వేపి వివక్షితార్థ ప్రతీతిసిద్ధౌ గతార్థస్యాపి విశేష్యస్య విశేషణదానార్థం క్వచిత్ప్రయోగః కార్యః, ఇతిసయుక్తమ్।" కావ్యప్రకాశము సప్తమోల్లాసము.

# చిత్రకళలు.

కాళూరి వెంకట నరసింగరావుగారు.

—:o:—

సీ॥ చిన్నారి యరటాకు ప్రాఁజివురాకు చెలువమ్ము
నీరెండ తేట జెన్నారునపుడు,
కన్నె కొబ్బరి రేకు కళలీను సోగవె
న్నెలలలో స్నానమ్ము సలుపునపుడు
పక్వాపవిడు దోసపండ్లు పగిలిన
ప్రియంపు కెలిపము వ్రాలునపుడు
మలయవాయువుల వెంబడిని దూరపుఁ దోట
బాదుకోకిల చెవిబడినయపుడు,

గీ॥ చల్లనగువేళ, సెలయేటి సైకతముల,
సాగిప్రసరించు కాలంబు పదీగెసిత్ర
గమ్మవిరితావిగోలు సుఖమ్మొకింత,
జూపబోలే చిత్రకళలరుచుల ఘనంబు.

# ప్రణయసాక్షాత్కారము

———:o:———

చిరువోలు కోటీశ్వరరావుగారు.

ఒంటిగా నూరిబైట గూర్చుంటి— విమల
మానసము సృష్టివైచిత్ర్యమున మునింగె—
నంతలో నంతరిక్ష మందంతనిండి
దివ్యసౌందర్యగీతంబు దిగెను భువికి

కొంచెమాలస్యమైన లేకుండ నేను
హృదయవీణ యశ్రుతిజేసి పదిలముగను
పాడసాగితి నాదివ్యభావగీతి
ఒకటివేరొంటలీనమై యొప్పులొలికె

ముకుళితంబైన ప్రేమకోరకము; మధుర
గానవీచికలల్లన గదుపుచుండ
వెంటవెంటనే రేకులవిచ్చియపుడె
పుష్పితంబయ్యె సౌగంధపూరితముగ

తన్మనోహర గర్భమధ్యముననుండి
జాలువారెను మకరందసలలిత ఝరి
తత్ప్రవాహతరంగ మధ్యమున మెరయు
నాప్రణయదేవిమూర్తి గన్నారగంటి

కన్నెగేదంగికంటెను మిన్నయైన
పుష్పమాలల నాదేవిఁబూజసేయ
హృదయపద్మంబునను ప్రతిష్ఠించుకొందు
ప్రాణసమయముగ నామెంగాపాడుకొందు.



# పయఃపతనము

శ్రీరంగము నారాయణబాబుగారు.

———:o:———

విమలగంగాస్రవంతికా వీచికలను
కలలనత్తావిభరముల గడగివైచి
అదిగో! యామినీకాంత అభ్యంగనమ్ము
చేసికాబోలు నల్లన చేరవచ్చె

విరియుతమపు ముంగురులజాల్ ధరణివ్రేల
మురిసి పరతెంచు తెరపిపయ్యెరలగముల
కాగవిడిచిన కురులు పాయలుగజేరి
చిక్కులెడలించు నామె సుస్నిగ్ధతరళ
చారునఖకోరకములవ్వె! తారకములు

పాయలెడలింపుచో నునుపట్టుజార
సిరులసరులతో నేకాంతమే మొయీరాడు
చిక్కుబడియున్న మిన్నేటిచినుకులనగ
హిమపుబిందువు లొకటొక్కటిగనుజార



# సుమ జగత్తు

శా॥ ఇది మద్రాజ్యరమా విలాసవని, నాయిచ్ఛన్ వినోదింతు; న
వ్వెద, ముద్దాడెద, కొల్లగొట్టెద. ప్రలాపింతున్, విలాపింతు, సొ
క్కెద, సోలించెద, నాటలాడెదను, సంగీతమ్ములన్ పాడెదన్,
హృదయమ్ముల్ కరగింతు, తేనియలు వర్షింపింతు హేలాగతిన్.

సీ॥ తరితీపుచేసి మేల్పరచి నీటును హొయల్ మెఱయించి అందముల్ కలుగజేసి।
కడకంటిచూపుల కలికినవ్వుల వింతనయగారముల కోర్కె బయలుచేసి
ప్రేమభరమ్ము వర్ణించుచు తీయనిపాటలుపాడి కైవసముసేసి।
జాలిదాపు దపుదవ్వు పరువులబ్రాయ సూత్రమ్ముగదల్చి దిటమ్ముసేసి।

గీ॥ తుదకునొకనాడు పొద్దుపొద్దున నె మేను।
గరగరిక సల్పి, వెసలమద్గానముఖరి।
తమ్ములొనరించి, తేమెండతళుకు పెంప।
నరుగుదెంచి యౌవనసుధలారగింతు॥

సీ॥ తొలుకారు మెఱుగులవలపించు మేనితో తలవాకిటన్ నిల్చు కలువకన్నె।
తొలుసంజకెంగొత్త దులకించు ముగ్ధమాలెనవ్వునవ్వు మల్లికుమారి।
చిరవియోగవ్యథచే పాలిపోయిన లేచెక్కులుల పాటలీసుమాంగి।
ఆమనిదొర జైత్రయాత్రకెత్తిన పతాకాకల్ప వాసంతికాశుభాంగి।

గీ॥ ఎదురెదురుచూచి నారాక కింతనంత।
విసువుజెందియు దవ్వుల ముసరుకొనిన।
నామనోహర వంశీ నినాదములకు
హృదయమధుపాత్రలప్పన మిచ్చునాకు॥

గీ॥ ఇది నాగోపీలోకం।
బిదినాబృందావనమ్ము వేసుమకన్యా।
హృదయాకర్షణ చణములు।
మదీయవంశీ మనోజ్ఞమధురస్వరముల్॥

"బంభరుడు"



# నిరుత్సాహము

---

భారతుల మార్కండేయశర్మగారు.

(యువకవిమండలి.)

---X---

పోఁ బాఱిజాఱిపోయెనల పూర్వదిశాభిముఖంబులై విభా
వరి చెలికారమందు నెఱపందగులొందిన తామసస్థితుల్;
కరము దిశావకాశముగఁ గ్రింతలు వాఱియడంగ దుఃఖనా
శరదిశ, లోఁ తెలుంగని వివర్ణరసాతల సీమలోఁ జనన్;

క్రుంగిన పశ్చిమాశవలకు న్వికసించునహః ప్రకాశమ
స్తంగతమయ్యె; శోణదరస ప్రతిబింబితలయ్యె యామినీ
ప్రాంగణవీథులెల్ల; హృదయస్థిర హాహాశయంబు లేను శా
యంగఁ దటస్థమయ్యెనకటా! యిఁక లేవొకొ తారకాఘృణుల్.

ఇరువది యేనువత్సరములేను దివాకరదివ్యకాంతి బం
ధురమహిమానుభూతసుమనోరసికుండనె యెంతయైననా
శరమునవంతరించిన ప్రభాతమునే నిఁకఁ జూచుటెట్లు? ని
త్యరజని ప్రాముకొన్నయది యద్దె తమఃపటవిద్ధవైఖరిన్.

తొందరయేని నామదిప్రియున్నమకా? మసుఁగుల్ ధరించి స్ఫు
రించినదిక్తటంబు దనుకన్ సకలంబును దానయై ప్రశాం
తందవు లేర్పరించినది; సెపిరహోఽగ్రిలలో నిశాచరా
క్రాంతములో ముడింగి వనరం బదిలింతు నపస్థలిమ్ములన్!

# భాసకవి 'ప్రతిమా' విమర్శ



———:X:———

విశ్వనాథ సత్యనారాయణగారు.

———

"భాషాసు రమ్యా గైర్వాణీ తస్యాం కావ్యం మనోహరం
తత్రాపి రూపకం రమ్యాం తత్ర భాసకవేః కృతిః"॥

భాసమహాకవి యీ నాటకమునకు 'ప్రతిమానాటకము' అని పేరు పెట్టినాడు. మొదటి రెండంకములలో శ్రీరామచంద్రుని వనవాస గమనము దశరథుని మృతియుఁ జెప్పఁబడినవి. భరతుడు తన మేనమామల యూరినుండి వచ్చుచున్నాడు. తండ్రికి మృతివార్త కబురంపించక మంత్రులు తండ్రికి జబ్బుగానున్నదని కబురంపించినారు. ఇంటికివచ్చి తండ్రికి నమస్కరించుచున్నట్లు, సోదరులెదురుగా వచ్చుచున్నట్లు తల్లులు కన్నీళ్లు కార్చుచున్నట్లు సౌమిత్రి తనవేష భాషలుచూచిపరిహసించుచున్నట్లు (అయోధ్యాప్రజల వేషభాషలును నందిగ్రామ స్థానుల వేషభాషలును భిన్నములుగాన భరతుడు నందిగ్రామమునందే చిన్నతనమునుండియు నున్నాడుగాన నతని వేషము మాటయు వల్లెయుండును గానను) దారిలో నూహించుకొనుచు సూతునితో చెప్పుచున్నాడు. దశరథుని మృతి తెలిసిన సూతుడు చెప్పనేలేదు

పితుః ప్రాణపరిత్యాగం మాతు రైశ్వర్యలుబ్ధతాం
జ్యేష్ఠభ్రాతుః ప్రవాసంచ త్రీన్ దోషాన్ కో ఽ
భిధాస్యతి"

(తండ్రిమృతి, తల్లిధనలుబ్ధత, అన్న వనవాసము, ఈమూడు దోషములను ఎవ్వడు చెప్పును) అనుకొన్నాడు సూతుడు.

ఇంతలో నొకభటుడు ప్రవేశించి "కృత్తికా విషయము ఏకనాడికావశేషము. అందుచేత రోహిణీప్రవేశమైన తరువాత కుమారుడు పురప్రవేశము చేయవలయును. అని యుపాధ్యాయులు చెప్పినా"రని విన్నవించినాడు.

భరతునకు పురప్రవేశము చేసి బంధువులను తొందరగా చూడవలెనని యున్నది. ఎంత యున్నదనగా నీమాటలువిని "బాధమేతత్. నమయా గురువచనమతిక్రాంత పూర్వం. గచ్ఛ త్వం" అన్నాడు. గురువచనాతిక్రాంతి కామిచో దక్షిణము పోవలయుననియే యున్నది.

ఆసమీపములో ప్రతిమాగృహ మున్నది. ప్రతిమాగృహ మనగా గతించిన యిక్ష్వాకురాజుల విగ్రహము లుండును. నూతనముగా మరణించిన దశరథమహారాజు ప్రతిమకూడ నప్పుడే యందమర్పఁబడినది. ప్రతిమయనగా Statue అన్నమాట. పురాణభాషామయమైన యీదినములలో మన పురాతనస్థితియే విస్మృతికివచ్చినది. Statues మునుపులేవని యనుకొనువా రెందరుందురో. ఆమాటకు తెలుగు చేయవలసినచో నేకత్రి కరణో "శిలావిగ్రహము" నో రాతిబొమ్మ యనియో యాంధ్రీకరించుదుము. కాని భాసకవిదయవలన "ప్రతిమ" యన్న సంపూర్ణార్థ

మిచ్చు శబ్దము మనలోనున్నదని తెలిసినది.

భరతుడిది ప్రతిమాగృహమని యెఱుగడు. చిన్నప్పటినుండియు మేనమామలయింటనునికి. అదియొక దేవాలయమనుకొని యందు రోహిణీ ప్రవేశము దనుక విశ్రమించుటకుఁ బ్రవేశించినాడు. ఆనాడు కౌసల్యాదులు ప్రతిమాగేహము చూడ వచ్చుట కేర్పాటు చేయబడిన దివసము. అందుచేత నది యలకబడి ముగ్గులుపెట్టబడి యలంకరింపబడినది. అదిచూచి భరతుడు ఏదోయుత్సవ మనుకున్నాఁడు. లోనికిఁబోయి ప్రతిమలనుచూచి "అహో! క్రియామాధుర్యం పాషాణానాం! అహో! భావగతిరాకృతీనాం!" అనిమెచ్చినాడు. రాతిచెక్కడమునకు గల సౌందర్యము మెచ్చుకొను విధమిది కాబోలు. 'క్రియామాధుర్యం.' 'భావగతిః' మన మీ పారిభాషిక పదములన్నియు విస్మరించి పరాయిభాషనుండి మాటలు మనకు తోచిన తెలుగులో తర్జుమా చేసి వాడుకొనుచుందుము.

తరువాత భరతుడు వానిని చూచి "దైవతోద్దిష్టానామపి మానుష విశ్వాసతా సాంప్రతిమానాం" అని యనుకొన్నాడు. ఇవి దైవతవిగ్రహము లయ్యు మనుష్యవిగ్రహములవలె నున్న వని భావము. దైవత మానుష విగ్రహముల భేదము భరతునకుఁ జక్కగాఁ దెలియును. నేటివంగ దేశీయ చిత్రకళావైఖరి భాసునకుఁ దెలిసినదే. ఇది క్రొత్తదియని చాలమంది యనుకొనుట యెందులకు? భాసునినాటి నుంచి యీశిల్ప మిట్లేయున్నది.

అచ్చట నాలుగువిగ్రహములున్నవి. ఏ దైవతములో తెలియలేదు భరతునికి. విగ్రహములకు నమస్కారముచేయబోయినాడు. ఇంతలో పూజారివచ్చి భరతుడు బ్రాహ్మణుడనుకొని క్షత్రియుల ప్రతిమలకతడు నమస్కరించకూడదనుకొని నివారించి యవి క్షత్రియప్రతిమ లని చెప్పినాడు. "క్షత్రియులా! ఎవ" రన్నాడు భరతుడు. "ఇక్ష్వాకులవి" యని సమాధానము. భరతుని యొడలు ఇక్ష్వాకు కుల శబ్దశ్రవణముచేత పులకరించినది. తరువాత వారి పేరులు వరుసగాఁ జెప్పించుకొన్నాడు. దిలీపుడు, రఘువు, అజుడు. దశరథునిదగ్గరకువచ్చినది. భరతుడు సంభ్రమముపొందినాడు. దశరథుని విగ్రహమునుగూర్చి యడుగకయే మరల మొదటినుంచి చెప్పుమన్నాడు. మరల వల్లె. దిలీపుడు, రఘువు, అజుడు.

భరతః— కిమితి, కిమితి

దేవకులికః— అయం దిలీపః, అయం రఘుః, అయమజః

పాపము భరతునకు తలతిరిగిపోయినది.

భరతః— భవంతం కించిత్ పృచ్ఛామి? ధారమాణానామపి ప్రతిమాః స్థాప్యంతే,

(నిన్నొకటి యడిగెదను. బ్రతికియున్న వారి ప్రతిమలుకూడ నిందుంచబడునా.)

దేవకులికః— నఖలు, అతిక్రాంతానామేవ.

(కాదు. చనిపోయిన వారివి మాత్రమే)

భరతుడేదో అనుచుండగనే దేవకులికుడు "స్త్రీశుల్కార్థముగా రాజ్యమును ప్రాణములు నవనిచేత విసర్జితములైనవో ఆయీ దశరథప్రతిమ నేల యడుగవు." అన్నాడు. అంతలో భరతుడు "హా! తాత!" యని మూర్ఛితుడైనాడు. తరువాత క్రమముగా మూర్ఛదేరిన భరతునకు సర్వవృత్తాంతము చెప్పఁబడినది.

లోకమున కల్పముగాఁ గనంబడునది శ్వకి అధికమైనదిగాఁ గనంబడును. లోకమున కధికమైనది కవి కల్పమైనదిగ గనబడును. ఇందుకనియే కవి లోకమున కర్థముకాడు. దశరథునిమృతి భరతునకుఁ దెలియఁజేయు వలె ననుటకు భాసుడెంత త్రిప్పలుపడినాడు. దానిమీద ప్రతిమాగృహసృష్టి. నాటకములో నొకక్రొత్తయంకము కల్పన. నాటకము పేరే అది. ఇంత విశ్వప్రయత్నము. ఆకవి భావసౌకుమార్యమట్టిది. ఈప్రతిమా నాటకమున రామాయణము అయిదుకాండముల కథయున్నది. (సుందరకాండకథలేదు) ఈనాటకమున నేడంకము లున్నవి. ఈనాటకము, ఈకథ, ఇదంతయునీతృతీయాంకముపై నాధారపడునట్లు చేసినాడు కవి.

కవి పరమసూక్ష్మదర్శి. రామాయణమంతయు భరతునిమీద నాధారపడియున్నదని భాసమహాకవి వ్యాఖ్యానము. ఈనాటకమునకు ప్రతిమానాటకమని పేరిడినకవి యుద్దేశమదియు: భరతుడు కైకేయిపొందిన వరముల కనుగుణముగా రాజ్యముస్వీకరించి యేలునయేని రామునకు నయోధ్యకేమి సంబంధము. రావణ వధానంతమున రాముని వంటి మహాభిమాని, నీతికోవిదుడు సరయువు వంకకు తిరుగడు. తరువాత కథయేలేదు. ఇక్ష్వాకువుల మర్యాదలేమి. సూర్యవంశమునందు పారంపర్య స్వామ్యము లేదు.

ఈ మహాదర్శమందే రామాయణ కథను సాగనిచ్చినవాడు, ఇక్ష్వాకుల మర్యాదను రక్షించినవాడు భారతవర్షమున ప్రాచీనాన్వర్త్యమును భావియుగ యుగాంతరముల నిలబెట్టినవాడు భరతుడు. ఈ పరమరహస్యవేత్త భాసమహాకవి.

పూర్వసంస్కృత నాటకకవు లందరును నిర్లేపయేదేనొకమహార్థప్రతిపాదనార్థమే తమ నాటకములను విరచించిరి.

ఏతాదృశమైన యీ మహావస్తువును తన నూతన కథాసంవిధానముచేత భాసుడు చిత్రముగా పోషించినాడు. నాటకమునకు కథానాయకుడు రామచంద్రుడే. వెనుక నొకసారి బ్రహ్మశ్రీ చెళ్లపిళ్ల వేంకటశాస్త్రి గారు తమ పాండవవిజయమునకు కథానాయకుడెవరని యెవరోయడుగగా పాండవులయిదుగురును కథానాయకులేనని చెప్పినట్లు జ్ఞాపకము. అట్లే యీ నాటకమునకును రామభరతలక్ష్మణులు ముగ్గురును నాయకులేమో యనిపించుచున్నది. భరతునకు రామచంద్రునకు నంతయభేదాధ్యవసాయము. రామలక్ష్మణభరతాత్మకమైనది యొకటియే, దశరథ జన్యమైన తేజస్సు.

భరతుని శీలాకృతుల దివ్యరచన వలన కవ్యుద్దిష్టమైన యీమహార్థము మిక్కిలి ప్రకాశించుచున్నది. భరతుని యీ కృతియెట్టిది! సరిగామూడుమూర్తుల రామచంద్రుడే. రామచంద్రుడేమిటి? దశరథుడే.

ప్రతిమాగృహమందు భరతుడుమూర్ఛాగతుడైయుండగా ముగ్గురు రాజభార్యలును సుమంత్రుడును ప్రవేశింతురు. సుమంత్రుడు ముందువచ్చి పడియున్న భరతుని జూచి.

భవత్యః! నఖలు నఖలు ప్రవేష్టవ్యం
అయంహిపతితః కో Z పివయస్స ఇవపార్థివః

పూజ్యురాండ్రు! రారాదు రారాదు. ఇందెవ్వరో యౌవనమందున్న దశరథమహారాజువలె పడియున్నాడు.) అని పొరపడినాడు. ఇంతలో భరతుడుమేల్కని

సుమంత్రుని జూచి. "ఆర్య"అని పిలచినాడు. సుమంత్రుడు ప్రతిమామాపమునను్న దశరథుడు తన్ను సంబోధించు చున్నాడనియను కొని "జయతుమహారాజః" అనఁబోయి "ఆహాహా స్వరసాదృశ్యం." అని తెల్లబోయెను. దశరథుడు బ్రతికియుండగా సుమంత్రుని 'ఆర్య!' అని సంబోధించెడు వాడుకాబోలు. కాబోలు నేమిటి? ఇక్ష్వాకువులంద రెవ్వరినైన నట్లే సంబుద్ధిచేతురు. దేవకులికుడు భరతునట్లే గుర్తుపట్టినది. భరతు డతనిని "ఆర్య!" అని సంబోధించగా దేవకులికుడు "ఆర్యేతి ఇక్ష్వాకు కులాలాపః ఖల్వయం. కచ్చిత్ కైకేయీపుత్రో భరతో భవాన్ నను" (ఈ "యార్య!" అనునది యిక్ష్వాకువుల మాట. మీరు కైకేయీ పుత్రులైన భరతులా? అని నాడు ఈ యిక్ష్వాకుల నాటి సాంప్రదాయములు భాసకవికెట్లు తెలియునో?

భరతుని రూపమేకాదు. స్వరము కూడ దశరథునివంటిదే? ఈస్వరరూప సాదృశ్యములకు మోసపోయొకి వారింక నిద్దరున్నారు. సీతాలక్ష్మణులు పాదుకాయాచనార్థము భరతుడు సుమంత్రునితో వనమునకుఁబోయి పర్ణశాల బయటనుండి రాముని పిలచినాడు. రాముడు లక్ష్మణుని బయటకు పొమ్మనినాడు. లక్ష్మణుడు వచ్చిచూచి.

అహో! అయ మార్యో రామః! న! న! రూపసాదృశ్యం.

(అహో! ఆర్యుడు రాముడీయన. కాదు కాదు. రూపసాదృశ్యము).

ముఖ మనుపమం త్వార్యస్యార్ధం శశాంక మనోహరం
మమ పితృ సమంపీనం వక్షః సురారి శరక్షతం
ద్యుతి పరివృతస్తే జో రాశి ర్జగత్ప్రియ దర్శనః
నరపతిరయం దేవేంద్రో వా స్వయం మధుసూదనః

(శశిరమ్యము,సాటిలేనిది యగు మాయన్నగారి మొగము రాక్షసబాణముల గాట్లమచ్చలు గల చిక్కని నాతండ్రి వక్షస్థలము కాంతివంతుడు. తేజోరాశి. లోకము చూడదగినవాడు. ఈ రాజు దేవేంద్రుడో సాక్షాత్తుగా విష్ణుమూర్తియో!)అనుకొనెను. ఈ సందేహాలంకారము వలన భరతుని పాత్రపోషణ మెంత మహత్తు తెచ్చుకున్నది. అలంకారము లిట్లుపయోగించుట సంస్కృత కవుల చేతులలోని యొక వజ్రాయుధము. లక్ష్మణుడు పొరపడుటలో గొప్పయేమున్నది? జానకియే పొరపడినది. భరతుడు వచ్చినాడని విని శ్రీరామచంద్రుడు సీతాదేవి తోడి తెమ్మన్నాడు. ఆయమ వెళ్ళి భరతునిచూచి 'హం తదో తంవేళం దాణి శిక్కిఓ అయ్యఉత్తో! ణహి ణహి । రూపసాదిస్సం' (ఆ! ఇంతలోనే బయటకువచ్చినాడార్యపుత్రుడు. కాదు కాదు. రూపసాదృశ్యము) అనుకొన్నది.

భరతః— ఆర్యే! అభివాదయే భరతోఽహమస్మి.

(ఆర్యురాలా! భరతుడను నేను నమస్కరించుచున్నాను.)

సీతా— (ఆత్మగతం) ణహిరూవం ఏవ్వ। సరజోఓ విసోవవ్వ. (రూపమేకాదు. స్వరయోగముకూడ నదే)

భరతుని నాకృతి చేత స్వరముచేత నిట్లు గాచేసి యతని భాసకవి శ్రీరామచంద్రునితో సమానశీలుని చేసినాడు. భరతుని యాత్మపరమోన్నతమైనది. కైకేయీ సముద్దిష్ట వరద్వితయవార్త విని భరతుడు తల్లినినిందించినాడు. కౌసల్య 'నాయనా! అట్లనరాదు ఆమె నీకు తల్లి' అన్నది

భరతః— ఆసీత్ పురా! నత్విదానీం! దశ భ్యతుభవతీ

సుతస్నేహం శీల సంక్రాంత దోషైః
పుత్రాస్త్యాజ్యా స్సర్వపుత్రాః క్రియంతే
లోకే౽పూర్వం స్థాపయామ్యేవ ధర్మం
భర్తృద్రోహా దస్తుమాతాప్యమాతా॥

(మునుపు తల్లి. ఇప్పుడు కాదు. మీరు మొదటి చెడ్డనడతగల కొడుకులయెడ నెయ్యము నుజ్జగించి వారిని పరిత్యజించుట చేసి లోకమునందు అనూతనమైన ధర్మమును స్థాపించుచున్నాను. భర్తృద్రోహము వలన తల్లియైనను తల్లి కాదు.) భరతుని యంతరాత్మ యిచట ఋషుల యంతరాత్మల వలె పరిముచ్ఛ్రితమై పోయినది.

భరతుడు రామునితో వనమున నే నివసింతు నన్నాడు. శ్రీరామ చంద్రుడు అది తన తండ్రి వాగ్దానమునకు లోపము చేయుటయని వారింపగా నొక్కదానికి రాముడు అనుమతియిచ్చిన నయోధ్యకు బోదు నన్నాడు భరతుడు. రాముడొప్పు కొనెను. అదియిది. పదునాల్గు సంవత్సరములైన తరువాత రాముడు మరల రాజ్యము స్వీకరించవలయును. ఈరెండువ్యవదల జాగ్రత్తతో భాసుడు నాటకమున నిమిడ్చినది. తన నాటకమంతయు దీనిపైననే యాధారపడి యున్నది మరి. రాముడు సరేనన్నాడు. భరతుడు లక్ష్మణునితో "ఆర్యా!" వింటివా? సీతతో ఆర్యురాలా వింటివా! సుమంత్రునితో "తాతా! వింటివా" అని అందరచేత వింటిమనిపించుకొన్నాడు. ఇది భరతునకు విజయము. భరతుడు పాదుకలుకూడఁబుచ్చుకున్నాడు.

రామః- (స్వగతం) హన్త భోః!
సుచిరేణాపి కాలేన యశః కించిన్మయార్జితం
అచిరేణైవ కాలేన భరతేనాద్య సంచితం.

(అయ్యో! చాలరోజులు కష్టపడి నేను సంపాదించిన కొంచెము కీర్తియును భరతుడీ కొంచెము సేపటిలో కూడబెట్టి నాడు.)

ఇది భరతునిశీలమునకు పైమెట్టు ఈరీతిగా ముక్కముక్కకు పోషించుకొనుచువచ్చిన భరతుని శీలముపై తన నాటకభారము నంతయు భాసకవియుంచి నాడనుటలో నుదర్శేమున్నది?

ఇంకనీ భరతుని దశరథమృతి శ్రవణావస్థ్రపనకు చుట్టును సంఘటించిన కథ యెట్టిదో విమర్శింపవలయును. దశరథుని మృతి భరతుడువినుట లోకసామాన్యముగా జనకుని మృతిపుత్రుడు వినుటవంటిదేనా? విశేషము కలదా?

ఇచ్చట పుత్రుని శీలము చూచినాము. అతడు లోకాతీతుడు. తండ్రికూడ లోకాతీతుడేనా? దశరథుడీనాటకమున నొక్క ద్వితీయాంకముననే వచ్చును. ఆయంకాంతముననే యామహారాజు మరణించును. రాముడు వనమేగగా బుత్రవియోగాతురుడై దశరథుడు ప్రాణాపాయస్థితిలో నున్నాడు దగ్గరనున్న కౌసల్యా సుమిత్రలకు రాజస్థితి లోనున్నాడని తెలియు లేదు. అది లోక సామాన్యమైన దుఃఖమనుకొనుచున్నారు. సుమంత్రుడు రామచంద్రుని దిగవిడుచుటకు వెళ్లినాడు. పాపము దశరథునకు రామస్మరణ తప్ప మరి యొకటి లేదు. "పుత్ర! రామ! వృద్ధం పితరం మాంపరిత్యజ్య కిము సంబద్ధేన

ధర్మేణ తే కృత్యం హాధిక్! హాధిక్! కష్టం భోః.

సూర్య ఇవ గతో రామః సూర్యం దివస ఇవ లక్ష్మణో ఽనుగతః
సూర్యదివసావసానే ఛాయేవ న దృశ్యతే సీతా!"

(నాయనా! రామ! వృద్ధుడనైన తండ్రిని నన్ను వదలిపెట్టి అసంబద్ధమైన ధర్మముతో నీకేటికి? అయ్యో! కష్టము. సూర్యునివలె రాముడు వెళ్లినాడు. సూర్యుని దినమువలె లక్ష్మణుడతనిననుసరించినాడు సూర్యదివసావసానముల యందు ఛాయవలె సీత కనంబడుట లేదు)

ఆదుఃఖములో దశరథునకు మనస్సు తక్క మిగిలిన యింద్రియములు పనిచేయుటయే లేదు. ప్రక్కనున్న కౌసల్యను "నీవెవ్వరవు" అని యడుగగా నామె "నేను అస్నిగ్ధుడైన కొడుకును గన్న తల్లి" నని జవాబు చెప్పినది. "ఓహో! సర్వజనహృదయ నయనాభిరాముడగు రామునికి జననివా? అన్నాడు 'అవును' అన్నది.

రాజా — సారవతీ ఖల్వసి! త్వయా హి ఖలు రామో గర్భేధృతః!

(నీవు సారవంతురాలవు. రాముని గర్భమునందు ధరించితివి)

ఇది దశరథుని రామచంద్రునియందలి ప్రేమ.

ఇంతలో సుమంత్రుడు వచ్చినాడు. "రామునితో కూడనా" అని యడిగినాడు దశరథుడు. "కాదు రథముతో" నన్నాడు.

రాజా — శూన్యః ప్రాప్తో యది రథో భగ్నో మమ మనోరథః
నూనం దశరథం నేతుం కాలేన ప్రేషితో రథః

(శూన్యమైన రథమే వచ్చినచో నా మనోరథము భగ్నమైనదన్నమాటయే. దశరథుని తీసుకుని వచ్చుటకు యముడు రథమును పంపించినాడేమి?)

రాజు తన మృతిని తననోటినుండియే చెప్పుకొన్నాడు. ఈ ధ్వని సర్వసంస్కృత నాటకములయందును ద్యోతకమగుచున్నది. ప్రథమాంకమందున్న వల్కల వృత్తాంతము నిట్టిదే. ఈ విషయమున సంస్కృతనాటక కవులు ఎవరి నాటకమున వారు పట్టాభిషిక్తులు. అందరికన్న గాళిదాస భవభూతులు

సుమంత్రుడు వచ్చినాడు. దశరథుడు "సీతారామలక్ష్మణులు బాగున్నారా" యని యడిగెను. సుమంత్రుడు "బాగున్నారు" అనెను. దశరథుడు "అట్లు గాదు ఒకరొకరి పేరే చెప్పి బాగున్నారు" అని చెప్పుమనెను.

సుమంత్రుడు మొదట రాముని తరువాత లక్ష్మణుని తరువాత సీతను చెప్పెను దశరథుడు, అట్లుకాదు. అది అక్రమము.

రామో వైదేహీ లక్ష్మణ ఇత్యక్రమః క్రమాం
రామలక్ష్మణయోర్మధ్యే స్థిత్వా ప్రాప్తా హి మైథిలీ
బహుదోషాణ్యరణ్యాని సనాథైవ భవిష్యతి

(రాముడు సీత లక్ష్మణుడు అని చెప్పబడుగాక. రామ లక్ష్మణుల మధ్య సీత యుండుగాక. అరణ్యములు బహుదోషములు. ఆవిడ యెప్పుడును భర్తతోగూడి యుండుగాక.)

ఇది మరల తాదృశమైన ధ్వని. పైగా

దశరధుడిట్లు కోరుట మిగులస్వభావము. ఈశ్వని రమ్యత సంస్కృతనాటక సంగీతసభా మధ్యమున నిత్యశ్రుత్యాహతమగుచుండును. ఇది సంస్కృతనాటకముల కాయువుపట్టు

సుమంత్రుడువచ్చి రాజుతో రెండు మాటలుమాటాడినాడు. రాజు స్థితిగ్రహించినాడు. "రాజు అప్రతీకారమైన దశయందున్నాడని" తక్కిన మంత్రులకు కబురంపించినాడు.

రాజింకొక రెండు మాటలుమాటాడి కైకేయికి "రాముడు వనమునకు వెళ్లినాడు. నేను చనిపోయినాను. భరతుడు పిలువబడుగాక. పాపము సఫలమగుగాక" యని కబురంపించి యాకాశమువంకఁగనినాడు.

ఆమహావసాన కాలమందు నిత్యసత్యవ్రతుడు రాజర్షి యిక్ష్వాకుకుల శిరోమణియగు దశరథమహారాజునకు పితృదేవతలం కనంబడిరి. అతనికన్నోదృష్టి పోయినది. నీళ్లు తెప్పించినాడు.

రాజా (ఆచమ్యావలోక్య)

అయమమరపతేస్సఖా దిలీపో రఘురయ
మత్రభవానజః పితా మే
కిమభిగమన కారణం భవద్భిః సహవసనే సమ
యో మమాపి తత్ర

రామ! వైదేహి! లక్ష్మణ! అహమితః పితౄణాం సకాశం గచ్ఛామి. హే; పితరః అయమయమాగచ్ఛామి (మూర్ఛయాపరావృత్తః)

(కాంచుకీయో యవనికాస్తరణం కరోతి)

సర్వే- హా హా మహారాజ! హా! హా! మహారాజ.

(నిష్క్రాంతాస్సర్వే)

రాజు- (ఆచమనము చేసిచూచి)

ఈయన యింద్రసఖుడైన దిలీపుడు. ఈయనరఘువు. ఆపూజ్యుడు నాతండ్రియైన యజుడు. మీరువచ్చిన కారణమేమి? ఓహో! నేనుగూడ మీతోఁగలసి యచట వసించు సమయమైనదా. రామ! వైదేహి! లక్ష్మణ! నేను పితరులసన్నిధికి పోవుచున్నాను. ఓపితరులారా! ఇదె ఇదెవచ్చుచున్నాను.

(మూర్ఛచేఁ తెలివి తప్పుచున్నాడు.

(కాంచుకీయుడు తెరలాగుచున్నాడు.)

అందరు- అయ్యో! మహారాజు.

(అందరు నిష్క్రమింతురు)

ఇట్టిఘట్టము సంస్కృత సారస్వతమున నింక నెక్కడను లేదు. ఇతర సారస్వతముల నుండుటకు వీలేలేదు. ఇందులోనున్న గొప్పదనము ద్యోతకమగుటకు సనాతన మతధర్మకర్మలయందు సంపూర్ణమైన విశ్వాసముండవలయును. కాదా! కావ్యరసాస్వాదన తత్పరత్వమునఁ దాత్కాలికముగ నట్టి విశ్వాసము నైన ననుభవింపవలయును

రాజునకుఁబితరులు ముగ్గురేగోచరించుటయేల? దిలీపునితండ్రి తాతలు రాలేదో? రాలేదు. ఎప్పుడును పితాళ్ళు ముగ్గురే యుందురు. పిత్రాదిత్యవసురూపులు పితృపితామహ ప్రపితామహులు. ప్రపితామహుని తండ్రికి స్వర్గపాథేయ మిచ్చి పంపింతురు. ఇక దిలీపునకు స్వర్గపాథేయ మిత్తురు. రఘ్వజ దశరధులింకఁ బితరులు రామచంద్రునకు.— సంయమితేంద్రి

యుడు రాజర్షి ప్రత్యగ్దృష్టిగల దశరథు నకు పితాళ్ళ కనంబడుటయే సనాతన ధర్మమునకంతకు ధ్వనిబీజము.

పంచమాంకమున రాముడు దశరథుని యాబ్దికము బెట్టుటకు పూర్వపుటినమునాటి రావణుని భైక్షుక వేషము తద్వృత్తాంత మంతయు వచ్చును.

భాసభవ భూతులలో నీయాస్తిక్యము మిక్కుటముగానున్నది. కాళిదాసులోను న్నది కాని యది రాచరికమునకు లోనైన నది. భవభూతి శతానందుడు తాను పురోహితుడునై యుండి రక్షించుచున్న ఇంటికొక్క నివలన నష్టము కలిగెనా "ధిగ్బ్రాహ్మణ్యం" అన్న మాట చెవులఁ బ్రతిధ్వనించుచునే యుండును.

భాసుడు మహా తపశ్శాలియై యుండ నోపు. యతికూడనేమో? జనకుని పృథ్వీరాజచరిత్ర వ్యాఖ్యానకారుడు జనరాజు. 'సోఽగ్నిరపి భాసమునేః కావ్యం విష్ణుధర్మాత్ ముఖాత్ త్యక్త్వా' అని యొచ్చటో ఒక శ్లోకవ్యాఖ్యానమున భాసునిగూర్చి వ్రాసినాడు.

తరువాత కాంచుకీయుడు యవనికలాగుచున్నాడు. రంగముమీద మృతిలాక్షణిక విరుద్ధము గాన, అందరును అయ్యో; మహారాజు అని గొల్లుమన్నారు. సరిగాఁ బ్రేక్షకోత్కర్షణ సమయమందలి యారోదన ధ్వనియిది.

భాసు డంత కు ణతశిల్పి.

భాసుని శిల్పమునకిం కొక యుదాహృతి. చతుర్థాంకమున రాముని చూచుటకు భరతుడు సుమంత్రుడు వెళ్ళినపుడు లోపలికి పోవుచు భరతుడు సుమంత్రుని రారేమి యన్నాడు.

సుమంత్రః—

అహం పశ్చాత్ ప్రవేక్ష్యామి స్వర్గం యాతే నరాధిపే విదితార్థస్య రామస్య మహత్పూర్వదర్శనం

(నేను తరువాతవచ్చెదను. రాజు చనిపోయిన తరువాత రాముని నేనిదె మొదట చూచుట)

ఈశ్లోక నాంతరార్థ ధర్మము అఖిల రామ చంద్రుడు ఈతల సుమంత్రుడు అంత చేత రసఖండమై పోయినది. భరతుని తరువాత సుమంత్రుడు కనుపించగానే గొల్లుమన్నాడు రామచంద్రుడు. ఇదిలోక సంగ్రహము. ఇదే మహాకవులయందు దేదీప్యమానముగ వెలుగునది. ఇది పాఠకుల హృదయముగరంచి రససాక్షాత్కారమిప్పించునది. దీనివలననే కవి రస సిద్ధుడగునది.

ఈశ్లోకములో కథ వెనుకబడినది. మరలఁ గవి కథ సందిపుచ్చుకొన్న పద్ధతియే శిల్పమునకుదాహృతియన్నది.

రామచంద్రునకు ముఖము శోకవారిచేతఁ గలుషితమైనది. మోము కడుగుకొనుటకు నీరమును లక్ష్మణుని తెమ్మన్నాడు రాముడు. భరతుడు తానుండగా పెద్దవాడైన లక్ష్మణు డట్లు చేయుచున్నాడనుకొన్నాడు. భరతుడు నీళ్ళు తెచ్చెను.

రాముః— (ఆచమ్య) మైథిలి; (నాటకము మొత్తముమీద రాముడు సీతను ఇంకొక రీతిగా సంబోధించిన చోటు లేదు. ఆ మైథిలి యని పిలుచుట సీతకతి యిష్టము కావలయును)

'విశీర్యతే ఖలు లక్ష్మణస్య వ్యాపారః'

(లక్ష్మణునకు పని తగ్గుచున్నది)

సీతా— అయ్యఉత్త : ణం ఏదినా పి సుస్సూసిదవ్వో (ఆర్యపుత్ర; ఇతని చేతకూడ నీవు శుశ్రూషయితవ్యుడవే) ఈమాటలో రాముడు భరతుడు వనమునందుండు నన్న యర్థము శంకించుకొని 'సుష్టు ఖల్విహ లక్ష్మణః శుశ్రూషయతు. తత్రస్థో మాం భరతః శుశ్రూషయతు (ఇందుండి లక్ష్మణుడు అందుండి భరతుడు సేవింతురుగాక అన్నాడు.

ఇది చమత్కారమయిన కథాప్రవేశము. ఇట్లు కాదేని యీ ప్రస్తావన భరతుడెట్లు తెచ్చియుండునో? అందరును మహానాగకులు అమితసుకుమారహృదయులు ఆస్వాదించఁదగినదానిని చెప్పఁజూచుట వృథా ప్రయత్నము. ఇట్లు చెప్పినచో నాటకమంతయు మరల వ్రాయవలయును.

ఆంధ్రులకు తమ భాషలో మహానాటకములింతవరకు పుట్టలేదని జిజ్ఞాస. ఆకోరిక సఫలముకావలయునన్నచో పాశ్చాత్యనాటకములపైబడి వెదకులాడుకొనుటకన్న సంస్కృతనాటకముల మర్మములు గ్రహించి యీవరవడి దిద్దుకొనుట కార్యసాఫల్యమునకగు త్రోవ.

# సాభిప్రాయ విశేషములు

ప్రవృత్తిమార్గపరాయణులగు లోక తంత్రపరాయణులు "మమమయా దురత్యయా" నుండి మఱల్పబడి గహనమగు సంసారాంధకారకూపమునుండి బయల్పడి నివృత్తికి పరమలక్ష్యమై ప్రాక్ప్రాపకమగు భగవానుని చరణ సరసీరుహముల నెటుల బొందుటకు నలవిగాదో యటులనే బ్రిటిషు సామ్రాజ్యపీఠమును సుస్థిరమగు పునాదుల పై ప్రతిష్ఠించుటకు గల్పింపబడిన మాయా మందిరములగు శాసనసభలనుండి భారతదేశమునందలి దేశనాయకులందరను దృక్పథమును మఱల్చనంతవరకును సామ్రాజ్యసౌధమునకు భారులు తీర్చిన సోపానపంక్తులుగ నమర్చబడెడరుగాని ముప్పదిమూడుకోట్ల భారతసంతానముయొక్కయు ఆర్తనాదము నాలకించి దేశక్షేమమునకును భారతజాత్యభ్యున్నతికిని తోడ్పడెడరనుట కల్ల.

ఎన్నికల కలవరము:—

భారత దేశమునందు గత:నవంబరు మాసములో జరిగిన ఎన్నికల సంగ్రామము దేశమోక్షమున కుపయోగపడుటకు మారుగ సంక్రాంతి పండుగనాటి కోడిపుంజుల పందెముల వైఖరి నభివ్యక్తమగుట గాంచినచో నేదేశభక్తుని హృదయము విషాదముచే విస్మృతి జెందదు?

శాసనసౌకను చుక్కాను పట్టుటకు ప్రభుత్వపక్షమగు మాడరేట్లు - జస్టిసువర్గములతో ప్రజాపక్షమగు కాంగ్రెసుపక్షము ఐకకంఠ్యముగ చేతులు గలిపి తాముతాగినచో మాడరేట్లు - జస్టిసువర్గము సంపూర్ణపరాజయమునందుటయే గాక ఉక్కుచట్టముతో నిర్మింపబడిన భారతసామ్రాజ్యాధిదైవతమగు బర్కిన్ హెడ్డు ప్రభువర్యుడు సైతము భారతీయుల నేషనల్ డిమాండును సఫలపఱచుటలో రేపు గౌహాతి మహాసభలో ప్రత్యక్షముగానున్న భారతమాతకు స్వాతంత్ర్య కిరీటమును శిరముపబెట్టి „చేతులార శృంగారము జేసి జూతురా!" యని భారత స్వాతంత్ర్యగీతమును భారతీయులతో గలసి గానముచేసియుండెడివాడు. ప్రజాపక్షమని పేరెన్నికగన్న కాంగ్రెసువాదులలోనే రెస్పాంసివు సహకారులు - జాతీయవాదులు స్వరాజ్యవాదులు - నోఛేంజర్లు యిండిపెండెంటు కాంగ్రెసుశాఖ - చీలికలై చీలి మాతృగర్భమును ఛేదించి తల్లిని ఆత్మహత్యచేయబూనినప్పుడు దేశములో శాంతియెక్కడ? అపరిగాంధియగు రాజేంద్రప్రసాదబాబు యొక్క నాయకత్వమున బీహారురాష్ట్రమును గౌహతీకాంగ్రెసున కధిష్టాన దైవముగ మూర్తీభవించిన శ్రీనివాసయ్యంగారి నాయకత్వమున మద్రాసురాష్ట్రమును మిన్నయని వాసిగాంచినను భారతదేశ భవిష్యద్రాజకీయవాతావరణము కారుమబ్బులచే కప్పబడియుండుటచే నాయకులలో సమరసముగాని ప్రజలలో విశ్వాసముగాని గుదురక రేపు బ్రహ్మపుత్రాతీరమునందలి గౌహతీమహాసంతరాళమునుండి ప్రతి ధ్వనించెడి

దివ్యవాణిపై శృతితంతువుల సంయోజనము చేసియుండిరి. అశరీరియగు ఆతల్లివాణి యేతీరున ప్రతిధ్వనించునోయని ముప్పదిమూడు కోట్ల భారతసంతానమును ఆనందాశ్రువులచే జననియొక్క పాదకంజముల నభిషేచనము చేయుటకు సంసిద్ధులై యుండిరి.

మంత్రివర్గము.

జాతీయాశయమును సఫలపరుపనంతవఱకును గూడ పంజాబు ఘోరములచే రక్తసిక్తమగు ప్రభుత్వకరసంస్పర్శనమును జేయజాలమని స్వరాజ్యపక్షావలంబులు ప్రతినబూనుటచే ద్వంద్వప్రభుత్వమును నడిపించెడి మంత్రివర్గమేపక్షమునకు జెందినదని ప్రశ్నించుట యసంగతమైనను, మదాసు రాష్ట్రీయులు మాత్రము ప్రజాశయముల నేమాత్రమును పాటింపక స్వప్రయోజనమే పరమలక్ష్యముగ నుంచుకొని యవినీతిమార్గముల ప్రవర్తించిన జస్టిసు మంత్రివర్గము మాత్రము పునాదులతో పెకలింపబడినందులకు సంతసమును జూపుచుండిరి.

ఆసలు బ్రిటిషు సామ్రాజ్య చిహ్నమగు యూనియన్ జాకు ధ్వజమునుండే భారతసామ్రాజ్య పీఠమును వేరుబరచి భారతదేశమునకు దేశనాయకుల అఖండ స్వాతంత్ర్యమును రేపు బ్రహ్మపుత్రానదీతీరమునందు ప్రకటింపదలచి డిశంబరు 24వ తేదిన ఓంకార స్వరూపిణియగు త్రివర్ణచిత్రిత జాతీయపతాకమును స్వాతంత్ర్య వాయుపూరితమగు భారతాకాశమునందు ధ్వజారోహణ జేయునపుడు మంత్రివర్గమునుగురించి జిజ్ఞాసచేయుట గానవిహాని నూతగొని గనని భంగిగాని వేఱొందుగాదు.

గౌహతీకాంగ్రెసు.

ఎన్నికల కలవరము పూర్తిగ శాంతించి ఓం శ్శాంతిశ్శాంతి చెప్పకముందే చరిత్రప్రసిద్ధిజెందిన పాండవక్షేత్రమగు బ్రహ్మపుత్రా నదీతీరమునందు భారతదేశ విముక్తికి గాను నలువది వత్సరములనుండియు స్వాతంత్ర్య పాంచజన్యమును పూరించిన విశుద్ధ జాతీయమూర్తి ఆవిర్భవించి దేశ స్వాతంత్ర్యమును ప్రపంచ సామ్రాజ్యములమధ్య ప్రతిధ్వనించునటుల మాఱుమ్రోయించు శుభదినము అక్షయ సంవత్సర మార్గశిర బహుళ ఆది వారమునకు సరియగు 1926 సం॥ డిశంబరు 26 తేదీ అయియున్నది.

యీ దివ్యదర్శనమును మాంసమయ నేత్రములతో దర్శించుటకుగాను భారతవీరపుత్రులేగాక పాశ్చాత్య దేశమునందలి ఖండాంతరులుగూడ యేతెంచుట శుభావహము. 1921 లో నాగపూరులో నూతనఫక్కిని నిర్మించిన భారత స్వాతంత్ర్య రథము 22 లో అహమ్మదాబాదునందును 23 లో ఆంధ్రవనియందును 24లో బెల్గామునందును 25లో గంగాతీరమగు కాన్పూరు క్షేత్రమునందును రథయాత్ర గావింపబడి నేడు ఈ స్వాతంత్ర్య రథము బ్రహ్మపుత్రా తీరమునందలి పాండవ క్షేత్రమునుండి దేశభక్తి రజ్జువులతో బంధింపబడి స్వార్థత్యాగ హస్తములతో భారవహనము చేయనున్నది. భీమార్జునులగు ఆలీ సోదరులు —— ధర్మతత్పరుడగు గాంధీ మహారాజు ధర్మరాజు——సత్యవాక్పరుడగు సత్యమూర్తి—శ్రీరంగమహారాజు పాదసేవకుడగు కె. వి. రంగస్వామి_అపరగాంధులగు బాబూ రాజేంద్రప్రసాద్_చక్రవర్తి రాజగోపాలా

చార్యులు-దేశబంధు దాసుయొక్క యాయువుపట్లగు తులసీచరణ గోస్వామి-సేన్‌గుప్త మహాశయులు-కవికోకిల సరోజనీయమ్మ-అభినవ నాగార్జునుడు ప్రఫుల్ల చంద్రరాయలు-వ్యాసమహర్షి పండిత మదనమోహన మాళవ్యా—అభినవ కృష్ణరాయలు దేశపాండ్య గంగాధరరావు—కాశ్మీర మహారాజు మోతీలాలు నెహ్రూపండితుడు-నేడు స్వరాజ్యరథయాత్రకు బయల్వెడలి హిమవత్పాద పరిసరారణ్యములయందలి పాండవ క్షేత్రమునుండి మాతృఋణవిమోచనము నొనర్చుటకుగాను భారతస్వరాజ్యరథమునకు స్వాతంత్ర్య రజ్జువులచే సారథ్యము చేయనుండిరి.

ఆనాడు పాండవక్షేత్రమునందు పాంచాలిక అక్షయ వస్త్రప్రదానమొసంగి ద్రౌపదీ మానరక్షణ మొనర్చిన శ్రీకృష్ణభగవానుడు నేడు గౌహాతీ నగరమునందలి కాంగ్రెసు సభా వేదికయందు శ్రీనివాసమూర్తిగ నావిర్భవించి భారతమాతను నిరంతర దాస్యమునుండి విముక్తత జెందునటుల ముక్తకంఠముతో స్వాతంత్ర్య పాంచజన్యమును పూరించుచు స్వరాజ్య రథసారథ్యము చేయ సన్నద్ధుడయ్యెను గనుక ముప్పదిమూడుకోట్ల భారతసంతానమును నిశ్చల హృదయులరై రథరజ్జువులను లాగుటకు కటిబద్ధులై మాతృచరణసన్నిధిని కైంకర్యము జేసి "దాస్యరసికాం భుక్త్వా సమృద్ధిం పరాం యుష్మత్పాద సరోరుహాంతర రజస్యామంబ ! !!" గండి. అందుకు వ్యతిరేకముగ ప్రవర్తించిన రథచక్రముల క్రిందబడి తుత్తునియలై భారతజాతి కల్మహత్యజేసికొని నామరూపములు లేక అనంతకాల గర్భమునందు విలయమును జెందెదరు.

భారతవర్షము-బలిపీఠము.

శ్రీకృష్ణ చరణచిహ్నాంకితంబగు హస్తినాపురమునందు అభినవ భారత భీష్మాచార్యులగు శ్రీ శ్రద్ధానంద స్వాములవారు ఆధ్యాత్మిక అంపశయ్యయందు ప్రాయోపవిష్టులై పరుండియుండ కలకురాలవంటి హృదయము గల తురకబిడ్డడు - అబ్దుల్‌రషీదు తుపాకిదెబ్బచే గుండెలకు గురిచూపి కాల్చిచంపెను. ఘోరవిద్వేష రక్తధారార్ద్రీనందక సంధానపాణియగు ఆ చక్రపాణియొక్క పదపంకజ పంజరాంతమున సమాధినిష్ఠ నల్పుటకేగిన మానస రాజహంసమో యనందగు ఆ పరమహంస భారత హృత్పద్మమునుండి అర్చిరాది మార్గమున దేవయానము నధిష్ఠించి వెడలుటచే హృదయపద్మమునుండి ప్రవహించెడి జీవశోణితమే భారత జాతికి జాతీయ చైతన్యము నొసంగెడి అమరవారుణియై వెలుంగుచుండెను.

ఇరువది శతాబ్దములకు ముందు కంటక మకుటమును ధరించి శాంతిముద్రచే ముక్తిమార్గము నుపదేశించిన జీసస్ ప్రవక్త శిలువపై తన రక్తమును ప్రపంచమోక్షమునకుగాను ధారవోసినటుల-నేడు మన జాతీయ నాయకుడు భారత జాత్యుద్ధరణమునకేగాక విశ్వ మానవకోటికినిగూడ "శాంతము లేక-సౌఖ్యము లేదు దాంతులకైన-వేదాంతులకైన" యనే తత్త్వదీపికను వెలిగించి జ్ఞానజ్యోతి నొసంగుటకుగాను యమునాతీరమునందలి భారత జాతీయ దీపాశయమునందు "త్వాంతదాపోజ్యోతి రసోమృత"మును హృదయపద్మమునుండి తైలధారావిచ్ఛిన్నముగ స్రవింపజేయు చైతన్య స్రవంతియై తేజరిల్లుచుండెను.






Edited & Published by Ch. Hanumantha Rao and Printed by Ch. Chalapati Rao, at National Press. Masulipatam.



# పుష్పమాల

సంపుటము 1 | ఫిబ్రవరి | సంచిక 2

## బ్రతుకు కథ

—(౧)—

ఓలేటి వెంకటరామశాస్త్రిగారు (శతావధాని)

కం. సిరులకు నెలవై విద్యాధర కిన్నర సిద్ధ సేవితంబై ధరణీ
ధరచక్రవర్తి హిమవద్గిరి వర మొప్పుఁ గుబేరదిగ్భాగమునన్

గీ. పృథివి ధాత్రీధరమ్ములు పెక్కులుండ నఖిలలోకమ్ములకుఁ దల్లియగు భవాని
యామహీధరునకుఁ గూఁతురై జనించె ననఁగ నాతని మహిమ మేమనఁగ వచ్చు?

చం. ఉరుమహిమాస్పదంబగుచు నొప్పెడు నగ్గిరి సార్వభౌము ను
త్తర శిఖరంబు నిర్మల సుధాధవళంబయి వెండికొండ నా
నరుదుగఁ బెక్కుయోజన సహస్రము లాక్రమణంబొనర్చి వి
స్ఫురదురు దీధితుల్ దెసలఁ బొంపిరివోవఁ జెలంగు నిచ్చలున్.

గీ. మందరంబు పయోనిధి మథితమయ్యెఁ బడయలేదయ్యె నిటు సుధాపాండిమంబు
నేనయత్నంబునం గంటి నిహిహియనుచు నదియు నిజకాంతిచే నవ్వునట్లు తోఁ

గీ. అంత, నేనుఁ దదీయ మహాతపోవిధానమున నాత్మలోఁ బ్రమోదంబుఁ జెంది
వారిచెంగట నావిర్భవంబు నొంది యభిమతవరంబు లొసఁగెద నడుగుఁ డంటి.

చం. అనుటయు సంతసించి, జలజాసనుఁ డోశశిమౌళి! నీవు నా
తనయుఁడవై జనించి ప్రియదం బొనఁగూర్పు మటంచుఁ గోరె; మ
ద్వనకితనొంది యున్న తదశం గన నెంచుటఁ జేసి యాతఁడుఁ
గనియె సపూజ్యభావము జగంబున నోధవళాయతేక్షణా.

గీ. అప్పుడు, నారాయణుండు ప్రహర్షితాత్ముఁ డగుచు నోదేవదేవ! దివ్యప్రభావ!
యేను భవదీయ శుశ్రూష నెపుడు సలుప వరముఁ గోరెదఁ గృపసేయు మలయు ననియె

కం. ఆకతన నీకు రూపున నాకర్ధశరీరమయ్యె నారాయణుఁ; డా
శ్రీకాంతుఁ డనఁగ నీవే యోకాంతా యాదిశక్తియును నీవెసుమీ?.

గీ. అంతియే కాక, నీవు జన్మాంతరమున యందు సైతము నాకు నర్ధాంగివైతి
వనిన శంకరు వచనంబు లాలకించి యద్రి యెట్లని యడిగె హిమాద్రితనయ.

సీ. అడిగిన, భర్గుఁ డిట్లనియె; నోయబ్జాతదళ విశాలాక్షి! తత్కథ వచింతు
నవధరింపుము; పూర్వమందు దక్షప్రజాపతికి నీవును దనూభవలు మఱియు
బెక్కండ్రు జనియింపఁ బ్రీతిమై నిన్ను నాకిచ్చి ధర్మాదుల కితరసుతల
నొసఁగి, కదంబడి యొక్కనాఁ డాతఁ డొక యజ్ఞ మొక్కటి దొసఁగ నాత్మ నెంచి

గీ. యామహోత్సవమునకు నాహ్వానమంపె నెలమి నల్లుండ్ర కందఱ; కేమొకాని
నన్ను నొక్కనిఁ బిలువక మిన్నకుండె నంత నీవా యయ్యతోడ నిట్లంటి వీవు.

కం. ఏమయ్యా! జన్నమునకుం బ్రేముడి నల్లుండ్ర నెల్లఁ బిలిచియుఁ బ్రమథ
స్వామిన్ భవదీయాగ్రిమ జామాతం బిలువవైతి జనకా! యనుచున్

గీ. పుత్రకపేరులఁ దాల్చు నెప్పుడును నీ మ భర్త; యాతనిఁ బిలువంగవచ్చు నెట్లు
పరమపావనమగు మహాధ్వరము నేఁ? డనుచు పలికించె భవదీయ జనకుఁ డంత.

గీ. కర్ణవిషసూచియైన యాకఠినవచన మాలకించి, యతండు పాపాత్ముఁ డకట!
యేఁ తని పుత్త్రినై యుండనేల యనుచు నలుకమై మేను దొఱఁగితి వబల! నీవు

ఆ. అదియెఱింగి, యేను నత్యంత రుషితాంతరంగమునఁ దదధ్వరమ్ము నెల్ల
నాశనమ్ముచేసినాఁడ నచ్చటిసురల్ వెఱచి బెగ్గడిల్లి విఱిగి పఱవ.

# మృచ్ఛకటికము-నామౌచిత్యము

అవ్వారి సుబ్రహ్మణ్యశాస్త్రిగారు

(శతావధాని)

---

ప్రకరణ మనుపేరు గల యీ రూపకము నం గవి పుష్కలముగ శృంగారరసమును సాధింపఁ దలఁచి నాడు. నాయికా నాయకుల యందలి రతియొక్క యుత్కృష్టత చేత నే శృంగార రసము సిద్ధించును.

ఆరతి కులాంగనలు మున్నగువారి యందు తల్లిదండ్రులు మొదలగు వారి నిర్బంధముల నపేక్షించనిదై సామాన్యల యందు ధనలిప్సతో సంబంధించనిదై యుండవలెను. దానికి సౌభాగ్యమే కారణమై యొప్పవలెను. సౌభాగ్యమన నాయిక యందు నాయక హృదయంగమత్వము ను నాయకుని యందు నాయికా హృదయంగమత్వమునై యున్నది. మఱియు స్వయముగ జనించిన ప్రణయ మహిమచే నెలకొల్పఁబడి, పారవశ్యము గలిగించెడి యా స్థాయికి గుణసంపదయే యుద్దీపన విభావము కావలెను అట్టిస్థాయిభావమే సత్కావ్య దర్పణములం బ్రతిఫలితమగుచు సహృదయ హృదయముల నావర్జన సేయఁగలిగి రస సిద్ధి యందు సమృద్ధిగ నుపకరణమగుచున్నది. ఇదిరసవిదులగు సత్కవులకు స్వారసికమైన మతము.

కాళిదాస మహాకవి

"అసాన్ సాధువిచింత్య సంయమధనాన్, ఉచ్చైః కులంచాత్మనః
త్వయ్యస్యాః కథమప్యబాంధవకృతాం, స్నేహప్రవృత్తించతాం.
సామాన్యప్రతిపత్తిపూర్వకమియందారేషుదృశ్యాత్వయా
భాగ్యా యత్తమతః పరంనఖలుతద్వాచ్యం వధూబంధుభిః॥"

అను శ్లోకమున 'అబాంధ వకృతాం' అనెడి పదముచేత నీ భావమునే సహృదయుల యెదుట నర్పించెను.

ఇక్కడ వసంతసేన యెట్టిది? కులము వలన సామాన్య నాయిక. వేశ్యల వాడలలోఁ బుట్టిన వనితల కెల్ల సాజమైన ధనలిప్స యీ వెలవెలఁదికి లేదని గ్రహింపుట కవకాశముండదు కదా ఇది గాక "విటుల పాలిటి యమదూత వేశ్యమాత" అని యొక కవిచే వర్ణింపఁ బడినట్లు ధనాంగనలకుఁ పెద్దపులి వలె తల్లియొకతే వెన్నుగాచుకొని యుండితన ధనార్జనమునకే కూతురి నుపయోగించు కొను చుండును.

అట్టి వసంతసేన చారుదత్తుని గుణములచేత నావర్జింపఁ బడి చారుదత్తునందనురాగిల్లె. అప్పుడు చారుదత్తుఁడెట్టి దశలోనున్నాడు? దురదృష్ట పరిపాకము

చేతను సహజౌదార్యము చేతను ధనహీనుఁడై యున్నాఁడు. అట్టి వాని యందు వసంతసేనకు దృఢముగఁ బ్రణయము నిలుచుట చారుదత్తుని సుభగత్వముతో పాటు వసంతసేనయొక్క యుదార ప్రకృతిని గసికతను వెల్లడించెడిని, ఆ ప్రణయ ప్రతిష్ఠయే శృంగారరససిద్ధికిఁ జాలినంత రతిపరిపుష్టిని సమగ్రముగ సమకూర్చు చున్నది.

వసంతసేన యొక్క యీ గుణానురక్తత్వమను దొడ్డ ప్రకృతిని సూచించుటకే రోహసేనుని మట్టి బండి ప్రసంగము తేఁబడినది. చూడుము. చారుదత్తుని కొడుకు రోహసేనుఁడు తండ్రి దారిద్ర్యమునం జేసి మట్టి బండితో నాడు కొనుచుండెను. అది చూచి వసంతసేన సహించలేక తన మహౌదార్యమునకు లక్షణముగ నిజ హేమాభరణముల నెల్ల నా బాలుని మట్టి బండినిండ నుంచి యింటికంపెను. చారుదత్తునితో స్నేహము గోరుచున్నది గాన నామె స్నిగ్ధహృదయము చారుదత్త తనూజుని దరిద్రత కోర్వలేక పోయెను.

పొరుగు పిల్లవాడు కొనుచుండినట్టిచారు దత్తపుత్రకుని గ్రీడించు గాక హీనముగ నేల యుండవలెననెడి పక్షపాతము వసన్తసేన కాభరణ లోభము కన్న వేయి మడుంగులుగ నుత్పన్నమైనది. దీనికి మూలమేమి! చారుదత్తుని యందలి స్నేహమే. అట్టి స్నేహము సర్వసామాన్య నాయికలవలె ధనలోభమునకు సంబంధించినది కాదు దీనం జేసియే వసంతసేనను గుణానురక్తనుగాఁ బ్రదర్శించి విశుద్ధ ప్రణయమయమగు శృంగారమును సాధింపఁ దలఁచుకొనిన కవి యాశయము నెఱవేఱుచున్నది.

సర్వస్నేహములనుమించినది వాత్సల్యమని బాణమహాకవిచెప్పెను అట్టివాత్సల్యమునీకవిచారుదత్తసుతునిజూచినప్పుడువసన్తసేనయందుఁజూపించెను. ఇదిప్రకరణనాయికయగువసన్తసేనయార్ద్రహృదయతనుచాటుచున్నది. అదియే సువిశుద్ధ ప్రణయ రసభరితమగు రూపక శృంగారమున కవలంబమైనవసన్త, సేనానురాగమును నిష్కల్మషముగఁ దెల్పుచు సామాన్య ప్రధాన నాయిక, గావచ్చునా? యను సంశయమును నివారించు చున్నది.

కాన రూపకముల కెల్లఁ బ్రాణమనఁదగిన రసమునకీ ప్రకరణమునం దీ రోహసేన ప్రసంగము వసంతసేన యొక్క సముచితానురాగ పరిపక్వ భావమును నివేదించుచు ప్రధానమగు చున్నది. అట్టి ప్రసంగమున ముఖ్యమైనది మృచ్ఛకటిక (మట్టిబండి) దానినే ప్రకరణము యొక్క పేరులోనతుకుట శూద్రక కవియొక్క రసపక్షపాతమును స్థిరపఱచుచున్నది. ఇది కవికుండవలసిన యౌచిత్యానుసంధానసామగ్రి.

ఇదిగాక పేరు చేతనే ప్రబంధమందలి కథా సారము నెల్ల సమగ్రముగఁ దెల్పవలెననునదియు నొక యాచారము కవి సత్తములలోఁ గన్పట్టెడిని. అభిజ్ఞాన శాకుంతలము ముద్రారాక్షసము మున్నగు పేరు లిట్టివే. రోహసేనుఁ డాటకు బయోగించు కొనెడి యీ మట్టిబండి కూడ చారుదత్తుని గొప్ప దారిద్ర్యయమును దాని కారణములతోఁ గూడ ప్రకటించు చున్నది ఇందలి భూతకథ యంతయు నాతని దారి

ద్రవ్యమునకుఁ గారణములైన మహోదార్యము యొక్కయు నితరదైవిక కారణముల యొక్కయు బహువిధ ప్రస్తావనలను బహు పాత్రముల ముఖమునఁ బ్రదర్శించుటచేత నే నిండి యున్నది. దీనంజేసి 'మృచ్ఛకటికము' అను నీనామ మీ ప్రకరణమునం దశేష కథావిశేషబోధక మను చున్నాము. మఱియు నీ మట్టిబండి ప్రసంగమే చారుదత్త వసంతసేనల ప్రణయబంధమును దెల్పును గాన, సొమ్ములమీది లోభమునఁ జారుదత్తుఁడే వసన్తసేనను జంపివేసెనని చారుదత్తుని మీద మోపఁబడిన నేరమునకుఁ గారణమగు చున్నది. మైత్రేయుని చంక లోనుండి పడిన సొమ్ముల ప్రస్తావన చారుదత్తుఁడు దండ్యుఁడుగా నిరూపింపఁ బడుటకు ముఖ్య హేతువు. దాని కిది యాది కారణము. మట్టిబండి ప్రసంగముచే సూచిత మగు వసంతసేన యౌదార్యమున కొక ఫలమైన శ్రమణక సాహాయ్యముచే నాయికా నాయకులు రక్షితు లగుచున్నారు.

ఇట్టి మహాత్ములు కొందఱు జయినీ పురమున నుండుటం జేసియే వీరియండ నుండు సాధువుల సాయమున సుమతి యార్యకుఁడు రాజయ్యెను. దానివలననే సంపూర్ణాధికారము చారుదత్తునకు సంక్రమించె నని ప్రసక్తానుప్రసక్తిపరంపరచే నామమే సర్వ ప్రబంధార్థ బోధనమయ్యెడి.



# ఎవనిరాకకు వేచి యెదురు చూచెదవు?

డాక్టరు. పి. వి. రమణయ్య గారు

నడిరేయి యేతెంచె నడి సందడుడిగె
రమణీయశుకపిక రావముల్ చెలఁగె
శీతాంశుకిరణముల్ సిరమైనపచ్చ
కప్రంపురాసిని కరఁగించినటుల॥
గమ్మనిహాసనల్ చిమ్ముఁ బూఁబొదలు
చలిగాలిదేహంబుఁ దొలచినట్లయ్యె
వెండిదీపము మింటవెలిఁగెడి భాతి
పుచ్చపువ్వఁను బోలెఁ బూసెవెన్నెలయు
రాజు విజృంభింపఁ బ్రజలట్లుతార
కావళివెలవెల బోవుచునుండె
అతివేగమునఁ జంద్రుఁడాకాశవీధిఁ
జెదరిన నల్లని చిన్నిమేఘముల

దాఁటిపోయెడిరీతిఁ దరలెడి మదియుఁ
జిన్నఁబోయిన మోముఁ జెదరినకురులుఁ
జెక్కిటఁ జెయిచేర్చి చింత జేయుచును
గుమ్మపుమెట్లపైఁ గూర్చుండికొమ్మ!

ఎవనిరాకకు వేచి యెదురుచూచెదవు?
మురిపెముల్ ముచ్చటల్ మూడేండ్లదనుక
హృదయసీమను నల్పి ప్రేమవల్లికల
వేరుతోఁ బెకలించి వేసినపురుషుఁ

డాకాశవీధి నిశాకరుతోడ
మెఱుగారుమేను సమీపానదాఁగి
తొంగిచూచెడిరీతిఁ దోచునే? చెలియ!

# ఇరువదేనగునది

భారతుల మార్కండేయ శర్మ గారు. (యువకవిమండలి)

—(౦)—

దివసశిరస్తటంబుబడి దీల్వడిలోయలు గొండనెత్తముల్
దివుచుఁబ్రతీక్షణంబు గణుతించెను నాయదితానురాగసం
భవచకితేక్షణంబులు ప్రపన్నములయ్యెడు, నోప్రభాతచా
రువదన! వేచియుండెద సరోజముతో నొకపాటివాఁడనై

ఈగజనీగృహాంగణము లే నడుగిడ్డ నిమేషమందునే
యేరవళుల్ బయల్వఱచె నిప్పుడు భిన్నములేదు, పైపయిం
దారయొకండునే మెఱయునా! యదిలేదు, తపర్తుమారుత
ప్రేరితభూత సంచల నభీష్మము ముజ్జగమున్న దిమ్ములన్

నాహృదయంబుమాత్రము వినాసకలంబు నిశాంధ్యముద్రిత
స్మాహృత మింక నాకుఁ గడచన్నెముసుంగుడు వడ్డవిప్రయో
గాహతి, నీసమాగమవిహారమువంకఁ బ్రతీక్షసేతురా
వే! హితకారిణి! యుదయవేళ ఘటింపవె యాభవంబునన్

ఈశరదంకురం బిరువదేనగు మాధవమంజిమల్ ప్రస
న్నాశల గుమ్మరించిన మహామహిమంబు గలట్టి దిప్పుడే
లో శరణంబు జొచ్చినది యూరకనీ హిమబిందుహాసలీ
లాశ జలంబులంగన దలంచిన దించుక నవ్వురేపటన్

అటులొక వేళనీ ప్రవిమలాగమ రేఖలు ప్రాఙ్నగోపరి
స్ఫుటనటనంబులం బొలయఁ బూనవయేని శరత్తులెన్నియో
యిటవిరహాశ్రువర్షముల నీతమసాంతరితాంబు భృద్విహా
శ్చటులత ముక్కు మూసికొనఁ జాలుదు, నీవయనుగ్రహించినన్



# శిరీషము

శ్రీ శేషాద్రిరమణకవులు.

శతావధానులు.

---

ఉ॥ అంటినఁ గందు కేసరములందుఁ బరాగము చిందువారఁ, వా
ల్గంటి సొబంగుచూపుల జగానిగ్రైవశీ శుక్లకాంతితో
నుంట సుగంధబంధురత నొప్పుట నీయెడఁగాక యెందు నే
ర్గంటినొ నవ్యకేసర శిఖారుచిభాసురమా శిరీషమా॥

ఉ॥ ఒక్కఁడఁ దెల్పునే జొకల నుజ్జ్వలమై తగునాకు పచ్చరం
గక్కజమై తలిర్పఁ జివురాకులకంటెను మార్దవంబుగాఁ
జక్కదనంబుగూర్చు నిను సర్వసుమ ప్రభువంచుఁ బల్కుచో
నిక్కమతిక్రమించుటగునే పరికింప శిరీష రాజమా॥

ఉ॥ పూవుల నైదు బాణముల పోల్కి గ్రహించెను మన్మథుండు, కెం
దావుల నీనునిన్ విడిచినన్ జగమంతయు లోనుగాదె, నీ
పావనగంధబంధురత, ప్రస్ఫుట మార్దవరూపమున్ లతాం
తావళులందు గానఁబడునా వెయిజన్మలకున్ శిరీషమా॥

ఉ॥ ఏఁగె వసంతమన్న భయమించుక లేదు ప్రసన్నగంధ సు
శ్రీగణనీయమున్ జనవశీకరణాస్త్రవనీయరూప రే
ఖాగుణ గౌరవంబులును గన్పడు నీకు సుమప్రతానమం
దే, గనరాదటంచును మదింగదు కుందుదునో శిరీషమా॥



# రూపము.

కొలచలమ కృష్ణసోమయాజులు గారు (M. A., L. T.,)

(ఇది హైదరాబాదు సిటీకాలేజిలో నుపాధ్యాయులుగానున్న "ధర్మభాస్కర" శ్రీ జయంతి సుంగయ్యపంతులుగారు ఆంగ్లమున రచియించిన "Beauty" యను చిన్ని గద్యకావ్యమున కనువాదము)

విద్వాంసునికి రూపము మౌనాంగము; గుణవంతుని నిగ్రహము; బలమునకు బలము; ఆకృతికి విక్షిప్తి; సరసునకు లలితము; జగమున కైశ్వర్యము; సత్యమునకు శూన్యము,

రూపము విరూపము చేతనే రమ్యము. విరూపము లేక రూపమునకు రూపమే లేదు. సృష్టి యందే రూపమునకు విరూపము ప్రత్యంగము. దాని శోభ దీనిచేఁ బూర్ణమగుచున్నది. ఇక సృష్టికం దనూ. సరసమగు మనసే దానికి రూపము.

సౌష్ఠవము అనగా నవయవముల పరిమాణ మొక రూపము. కాని యవయవ మేదైన నతిమాత్రమయ్యు బాగుగ నుపకరించినచో విరూపమే రూపమగుచున్నది. సాక్రటీసనినట్లు పెద్ద నోరొక రూపము. దాని ప్రయోజన మధికము. ఇచటఁ బ్రయోజనమే, రూపము. శిష్యుని యందు భక్తి రూపము; కర్మకు పందు గౌశలము; సర్వజనులందును సత్యము. బుద్ధికిఁ గర్మకుఁ గూడ బుజుత్వమే రూపము.

ఏదైని ప్రతిజ్ఞామాత్రము రిక్తకోశము వంటిది. దాని పూరణమే దానికి రూపము. కోశమునకు ధనము రూపము; ప్రతిజ్ఞకు బూరణము నూత్న మొకవింత; కనుక విరళ మది రూపము. దరిద్రులకు ధనము చిత్రము అట్లె ధనికులకు దారిద్ర్య మొంతయో చిత్రము. ఏది యెటులున్నను మన యిష్టమే మనకు రూపమను టతథ్యము.

తా వలచినదే రూపము. వాక్కునకు సత్యము రూపము; రసములకు రాగము. గృహమునకు బాలురు రూపము. వర్చస్సునకు వర్ణ మొక రూపము; కాని యది, చర్మమాత్రము. పైతోలు తోల్తనిది రంజకమే యగు; కాని లోపలి స్ఫుటములు పదార్థములగు రూపభేదములున్నవి. ఇవి ఘటనాఘటనాపటువులు

వేష మొక రూపము. వేషి, వినోది, విటుఁడు, విలాసి వీరందరిట నుత్తములు. ధనికుఁడు దరిద్రుఁడుఁ గూడఁ దమ తమ యుత్తమ వేషములే వేయుదురు. కాని చిత్రమేమనగా దరిద్రుని సంతుష్టి ధనికునికి లేదు.

తమికిఁ దారలు రూపము; తారలకుఁ జంద్రుఁడు; చంద్రునికి లక్ష్మి; ఇట్లే సరస్సు

# పడవ ప్రమాదము.

(వడ్డాది సుబ్బారాయుడుగారు.)

---

చ॥ కటకట! కన్నబిడ్డలను గన్నపుడే గడతేర్చినట్టి యా
కటికి మనంబు తాఁగ కకగారవు నీకనుకంప గల్గునే?
గుటగుటమన ముంచి తేప్పఁ బలుగుండ్రను నావలు రెంటితోడ నీ
[illegible] సార్థకంబుగను గార్తిక పూర్ణిమయందు; గౌతమీ!

ఉ॥ పాదములంటఁ గూడఁ బలుపైఁడినగల్ గల రాగోలంపు లేఁ
బైదలి, యోమ్మనం దనుము పావనితో నిలబడ్డభీతఁ, ద
త్సోదరితోనఁ బ్రాణవిభుతోడను గంపెడు సొమ్ముతోడఁ గ
ట్టా! దిగమ్రింగి; తెంతకఠినాత్మవె! రాజమహేంద్రి గౌతమీ!

ఉ॥ ఆలిని బిడ్డలన్ విడిచి, యర్థము, లాఁతివిలాతులం గటా!
కూలియు నాలి చేసికొని కూర్చుకరాఁ జనుకూటిపేదలన్
గాలునిబోలి కంపితివి క్రిమ్ములకుండఁగ; వారి పాండ్రకున్
హాలహలంబ వీవు, శిశిరామృత వాహినివయ్యు; గౌతమీ!

ఉ॥ ఆసలు రెండు, సంఘమరణార్తి కిటన్ వినవచ్చు హేతువుల్;
కాసులమీఁదఁ గాంత మరకాండ్రకు, గమ్యపదంబు వేయునా
యాసతఁ జేరవచ్చు ననునాస్థపథస్థుల, కింక నెట్టివే
దోసము లున్నవో మునకఁ దోఁపని వాపరమేష్ఠి దృష్టిలో॥

ఆ॥ వె॥ మునుఁగు వేసి మృత్యుముఖమునఁ జరియింతు
రాయు వున్నవాళ్ళ నఖిలజనులుఁ;
గాల మైననాఁడు గ్రుక్కన మునుఁగూడుఁ
దరణియాన నిండియు దారకాణ॥



# మాదన్న పంతులు.

కోలవెన్ను రామకోటీశ్వరరావుగారు బి.ఏ.బి.యల్.

---

గోలకొండ రాజ్య మంతరించుటకు పూర్వము పదమూడువత్సరములు ప్రధానామాత్య పదవి నలంకరించి, ప్రతిభాశాలియనియు, రాజనీతి విశారదుడనియు పేర్వడసిన మాదన్నగారి జీవితమునందలి ముఖ్యాంశముల నాంధ్రదేశీయుల కెరిగించుట అవసరమైయున్నది. అక్కన్న మాదన్న లాంధ్రులు కారని కొందఱి యభిప్రాయము. వీరి నిజమైన పేరులు మదన పంతు ఏకనాథపంతు అనియు, వీరు మహారాష్ట్రబ్రాహ్మణులనియు మహారాష్ట్ర పండితులు వ్రాసియున్నారు. కాని, మొగలు చరిత్రకారులును, సమకాలీనులగు పాశ్చాత్యవర్తకులును, శ్రీశివాజీ జీవితచరిత్రము వ్రాసిన గ్రంథకర్తలును, అక్కన్న, మాదన్నలను పేరులనే వాడియున్నారు. ఈ "అన్న" లేక "అయ్య" శబ్దము, ఆంధ్ర కర్ణాటులలో కానుపించునేగాని, మహారాష్ట్రులందు లేదు. ఇంతియగాక, వీరాంధ్ర బ్రాహ్మణులను ప్రతీతి మన దేశమునందు సంపూర్ణముగ వ్యాపించియున్నది. వీరిమేనల్లుడని చెప్పబడు గోపన్న, ఆంధ్రదేశస్థుడే గదా. వీరిరువురును అన్నదమ్ములగుదురా కాదా అను చర్చకూడకలదు. కాని, పైనచెప్ప బడిన చరిత్రలందంతటను వీరన్నదమ్ములనియే వర్ణింపబడినది. వీరిలో అక్కన్నగారు గోలకొండరాజ్యమునకు దండనాథుడు (సర్ లష్కర్) మొత్తముమీద సోదరునకంటె మాదన్నగారెక్కువఖ్యాతిని సంపాదించిరి. చాతుర్యము, పాండిత్యము, స్వామిభక్తి లోనగు సుగుణములీయనయందు మూర్తీభవించెనని సమకాలికులు పొగడియున్నారు. వీరిని గూర్చిన కట్టుకథలు పెక్కులు ఆంధ్రజనులలో వ్యాపించినవి. "అక్కన్న మాదన్నలు అందలాలెక్కుట" లోకోక్తిగా పరిణమించినది.

౨

## తానీషాప్రభుత్వము.

గోలకొండ ప్రభువులగు కుతుబుషాహవంశీకులలో అబూల్‌హాస్సన్ కడపటివాడు. ఇతడు రసికాగ్రేసరుడగుటచే "తానీషా" అను బిరుదునందెను. ఇతని కాలమున (క్రీ. శ. 1672-1686) రాజధాని నగరము సమస్త కళలకును నిలయమై, భారతవర్షమునందలి వివిధప్రాంతములనుండి గాయకులను, చిత్రకారులను, శిల్పులను ఆకర్షించుచుండెను. ఎచట జూచినను, వజ్రవైఢూర్యములు, రత్నకంబళములు, చీనిచీనాంబరములతో నిండియుండి, భాగ్యనగరము నామమును సార్థకమొనర్చుచుండెను. గంజాము మండలమునందలి శ్రీకాకుళము నుండి చెన్నపట్టణమువరకును గల సముద్రతీరమంతయు నీగోలకొండ సుల్తానుల రాజ్యమునచేరి యుండుటచే,

విదేశములతోడి వర్తకవ్యాపారము చక్కగ సాగుటయు, అందువలని యైశ్వర్యము వీరికి దక్కుటయు సంభవించెను. గోలకొండ వారి ప్రాపకము సంపాదించి, వారి రేవు పట్టణములలో గిడ్డంగులను కట్టుకొని వర్తకము చేసికొనుటకై వలందులు, ఆంగ్లేయులు, ఫ్రాన్సువారు సుల్తానులకును, అమాత్యులకును వెలలేని కానుకలర్పించుచుండిరి. రాజ్యాదాయము సం|| కు 275 లక్షలు. ఈ రాజ్యమునందలి వజ్రపు గనులు ఖండాంతరములందు ప్రఖ్యాతిగాంచెను.

గోలకొండ రాజ్యమిట్లు వైభవోన్నతిముగ కనుపించినను రాజ్యము నానాటికి క్షీణదశకు వచ్చుచుండెను, కొన్ని కారణములుండెను. ఉత్తరహిందూదేశ మంతయు స్వవశము చేసికొని అవిచ్ఛిన్నముగ పాలించుచుండిన ఆలంగీరు పాదుషా (ఔరంగజేబు) దక్షిణాపథములోని విజాపూర గోలకొండ రాజ్యములను నాశనము గావించుటకై యత్నించుచుండెను. తానీషా సౌమ్యుడు, రసజ్ఞుడు, కాని పరాక్రమశాలి కాడు. ఈతడు రాజ్యమునకు రాకపూర్వమే మొగలుసామ్రాజ్యముతో జరిగిన యొడంబడిక ననుసరించి, గోలకొండరాజ్యము ఢిల్లీ చక్రవర్తికి కొంతకప్పము కట్టుచును, చక్రవర్తి పక్షమున నొక రాయబారిని (ఈకాలపు బ్రిటిషు రెసిడెంటును బోలి) తమ యాస్థానములో నుంచుకొనవలసి వచ్చెను. ఈరాయబారి అనేకపర్యాయములు నిండు పేరోలగమున తానీషాను తూలనాడుచుండెను. ఎన్నటికైనను, క్రోధావేశముచే మరల నీతడు రాయబారిని అగౌరవపరచు ననియు, అందుమూలమున అడ్డము చేసి రాజ్యమును స్వాధీనము చేసికొనుటకవకాశము కలుగుననియు ఔరంగజేబు ఆలోచించెను. కాని, తానీషా పరాక్రమహీనుడగుటచే, ఎట్టియవమానములనైన భరించుచు, ఏవిధముగనైన, సామంతపదవియందైనను, రాజ్యమును నిలుపబెట్టుకొన జూచుచుండెను. నానాటికి విషయసుఖములయందాసక్తి మెండుకాగా, వాని యందే మునిగి తేలుచుండెను.

సర్దారులలో కక్షలేర్పడి కొందరు మొగలుకక్ష మవలంబించి మువ్యక్తులగుచుండిరి. భాగ్యనగరములోని సర్దారులును, వర్తకులును, ఎంతయైశ్వర్య మనుభవించినను, సామాన్యప్రజలకు తగిన శాంతిగాని, సంరక్షణముగాని లేకుండెను. రాజు స్వయముగ రాజకార్యముల గమనింపకుండుటచే, ఉద్యోగులు లంచగొండులై జనులను పీడించుచుండిరి.

3

మాదన్న వజీరగుట

తానీషా తన ఇచ్ఛవచ్చినటుల సకల భోగముల ననుభవించుచు, రాజ్యవ్యవహారముల కొంతవరకైనను చక్కబెట్టుటకు మాదన్నకు ప్రధానామాత్య పదవి నొసంగెను. అక్కన్న మాదన్నలు క్రీస్తుశకము 1666 వ సంవత్సరములో పదిరూప్యముల వేతనము మీద గోలకొండ సరదారుడగు సయ్యదుముస్తఫావద్ద షరాబుగ ప్రవేశించి, క్రమముగ వృద్ధిలోనికివచ్చి, పిదప తన యజమానియెడ ద్రోహము కావించి అతను పదచ్యుతుడైన పిమ్మట తమ ద్రోహఫలితముగ నీయున్నత పదవుల సంపాదించిరని సమకాలీనుడును వలందు దేశస్థుడును నగు "హావర్డు" వ్రాసియున్నాడు.

మాదన్నకు 'సూర్యప్రకాశరావు' అను బిరుదొసంగబడెను. మాదన్న బుద్ధిశాలి. అక్కన్న జిత్తులమారి, దుర్మార్గుడు, తెలివితేటలు తక్కువ. మాదన్న రాజ్యపరిపాలనలో ప్రధానపురుషుడయ్యెను. సుల్తాను సమస్తవ్యవహారములును మాదన్నకే వదలి తన స్వంతఖర్చుకై డెబ్బది అయిదువేలడాలర్లు (సుమారు మూడు లక్షల రూపాయలు) తీసికొనుచుండెను. మాదన్నకు పార్శీ, హిందూస్థానీ దేశభాషలలో చక్కని పాండిత్యముకలదు. అతడు రాజభోగముల ననుభవించుచుండెను. అతడెక్కిన బంగారు పల్లకీ వీధులలో వెడలునపుడు, ప్రజలందరును ఎక్కడివారక్కడ నిలచి అతని గౌరవించుచుండిరి. అతడు వలందుల నధికముగ నాదరించుచుండెను. అతని దర్శనభాగ్యము నాకనేకపర్యాయములు లభించెను" (హావర్డు),

"మాదన్న పంతులు మహానుభావుడు. బ్రాహ్మణభక్తికలవాడు. దానధర్మములయందాసక్తికలదు. తన గృహమునకువచ్చిన బ్రాహ్మణపండితుల నధికముగ గౌరవించుచుండెను. ప్రతిదినము లక్షజనులకు భోజనము పెట్టెడివాడు. వీరందరు భోజనమైన పిమ్మట గాని తాను భుజించువాడుకాడు. ఈనియమము తప్పక నెగ్గించుకొనుచుండెను."

(చిత్నీసుబఖరు)

పై వ్రాతలనుబట్టి మాదన్నగారి వైభవమును, సుగుణ సంపత్తియు స్పష్టపడగలవు. తనయెడ నసూయచెందిదనను పదభ్రష్టుని గావించుట కెందరో మహమ్మదీయ సరదారులును రాజకుటుంబములోనివారును, కనిపెట్టుకొని యుండినను, తన శక్తిసామర్థ్యములవలన వారి ప్రయత్నములన్నియు నిష్ఫలమొనర్చి జయప్రదముగ పదమూడు సంవత్సరములు రాజ్యమేలుటయే, ఈతని బుద్ధిచాకచక్యమునకు నిదర్శనముగనున్నది. సుల్తానునకును, నీతనికిని పరస్పర ప్రేమ విశ్వాసము లధికముగ నుండుటవలన కూడ అతని పరిపాలనమునకు బలము చేకూరెను.

మొగలు సామ్రాజ్యము నాశ పడకుండ గోలకొండ రాజ్యమును కాక, దక్షిణాపథమున శ్రీ శివాజీ స్థాపించిన మహారాష్ట్ర రాజ్యము అత్యున్నత దశ నందియుండెను. మత విద్వేషముల ప్రజ్వరిల్లజేసి, దక్షిణాపథ రాజ్యములను మింగివేయ నెంచుచున్న మొగలు శత్రువుల నెదుర్కొనుటకై ఈ మూడురాజ్యములును కలిసి పనిచేయవలెనని మాదన్నగారి పట్టుదల. తానీషాను, శివాజీకిని సంధి సమకూర్చుటకై తన శక్తినంతను ధారవోసెను. శివాజీ దర్బారులోని "రఘునాథనారాయణపంతు"కూడ ఇట్టియుద్దేశముతోనే, మాదన్నగారిని రహస్యముగ దర్శించుటకై గోలకొండ వచ్చెను. వీరి ప్రథమసమావేశమునుగూర్చి "చిత్నీసుబఖరు" నం దిట్లు వర్ణింపబడినది.

"భాగ్యనగర రాజ్యము శివాజీ తలపెట్టిన కర్ణాట దండయాత్రకు అభ్యంతరము కల్పింపవచ్చును. అట్లుజరుగకుండ నుభయరాజ్యములకును పొత్తు కలుపుటకై పంతు భాగ్యనగరమును సమీపించెను. అక్కన్న మాదన్నలు వజీరులై సమస్త రాజ్యాధికారమును అనుభవించుచుండిరి. వారినెట్లు కలుసుకొనుటెట్లు? మాదన్న బ్రాహ్మణ పండితుల సత్కరించునని తెలిసికొని, తానావేషమును ధరించి, మాదన్న గారు స్నానమాచరించి జపము చేసికొనుసమయమున తక్కిన బ్రాహ్మణులతోపాటు వారియింటికి వెడలెను. అక్కడ జరుగుచుండిన చర్చలలో పాల్గొని తనప్రతిభను వెల్లడించెను. మాదన్నగారు మిగులసంతసించి "అయ్యా, మీరు మహానుభావులు ఎక్కడనుండి దయచేసినారు? మీకేది కావలయునో కోరుకొనుడు" అనెను. రఘునాథుడిట్లు ప్రత్యుత్తరమిచ్చెను. "నాకు ధనమక్కరలేదు. భూములు, అగ్రహారములమీద నాకు వాంఛలేదు. మీరు సత్పురుషులు, శాస్త్రవేత్తలు, నాలుగు గడియలు తమతో అంతరంగికముగ

చెప్ప చేయఁదగిన కోరిక మాత్రమేకలదు-" అప్పుడు మాదన్న రఘునాథుని రహస్య ప్రదేశమునకు తీసికొనివెళ్లెను. రఘునాథుడిట్లు నిజస్థితి తెలియపరచెను, "నేనుయాచక బ్రాహ్మణుఁడనుకాను, శ్రీశివాజీ మహారాజు భృత్యుడను. నా పేరు రఘునాథపంతు. కర్ణాటకములో మా రాజుకు కొంత రాచకార్యములున్నవి. కావున స్వయముగా నాప్రాంతముల చూడఁదలచినాఁడు. తంజావూరికి ప్రయాణమగుచున్నాఁడు ఆతనికి అవసరమగునపుడు మీరును, మీకవసరమగునపుడాతఁడును, పరస్పరసహాయ్యము చేసికొనునట్లు మీరాజ్యముతో సంధి సమకూర్చుటకై నన్ను పంపినాఁడు. మీరు మతమునందాసక్తికలవారు. ఆమతమునుద్ధరించుటయే శ్రీశివాజీ పరమోద్దేశము. కావున మీరాతనికి తోడ్పడవలెను. మీ ప్రభువునకిట్టి గౌరవలోపమును లేకుండఁగనే, ఆతనికిని మా మహారాజునకును తమరు స్నేహము సమకూర్పవచ్చును."

"మాదన్నపంతులు రఘునాథునియెడ ప్రసన్నుఁడయ్యెను. రఘునాథుని మాటలును, వాదమును యుక్తియుక్తములని తోఁచెను. మాదన్న అదివరకే మహారాజు (శివాజీ) కీర్తి నెరింగియుండెను-రఘునాథునిగూర్చి వినియుండెను. ఇంకను అధికమైన భక్తిశ్రద్ధలతో నాతనిమాటల నాలకించి, ఆచంద్రార్కముగ తమస్నేహము వర్ధిల్లునట్లుశపథము కావించెను. ఉభయపక్షముల యాశయములును సఫలమగునటు లేర్పరచుకొనినపిమ్మట, మాదన్నగారు రఘునాథుని తనయింటనాపుకొని, ఆతనిపరివారమును (పట్టణము బయటనున్నవారిని) పిలిపించెను. శివాజీ కర్ణాటకమునకు వెడలునపుడు తానీషాను చూచునట్లు నిశ్చయింపబడెను. పిమ్మట మాదన్నగారు రఘునాథుని సగౌరవముగ వీడ్కొలిపిరి"

స్వామిభక్తిపరాయణులై, తమతమ రాజ్యముల నుద్ధరించి, మొగలుశత్రువుల నెదుర్కొన యత్నించు నీ యాంధ్రమహారాష్ట్రప్రముఖుల సమావేశమును గూర్చిచదివిన నే తెలుఁగువాని హృదయము ఉప్పొంగకుండును ?

క్రీ. శ. 1677 సంవత్సరము జనవరి నెలలో శ్రీ శివాజీ కర్ణాటక దండయాత్రకై బయలుదేరెను. తానీషాను కలుసుకొని, ఆతనివద్ద నీ దండయాత్రకు వలయు ధనమును కొంత సైన్యసహాయమును పొందుట యుండ, రెండు రాజ్యములకును స్నేహసంబంధమును దృఢపరచుటకై శివాజీ భాగ్యనగర మార్గము పట్టెను. ఆతనికి భాగ్యనగర ప్రభువును, పౌరులును నొసంగిన యద్భుత స్వాగతము నీ క్రింది విధముగ "సభాసదు" అను మహారాష్ట్రచరిత్రకారుఁడు వర్ణించియున్నాఁడు.

"శివాజీ భాగ్యనగరరాజ్యపు సరిహద్దులలో ప్రవేశించినంతనే, తనసైనికులు రైతులకెట్టికష్టమును కలిగింపకూడదని శాసించెను. తనదండు విడిసిన ప్రదేశములందెల్ల, కావలసిన పదార్థములన్నియు వెల ఇచ్చి శాంతముగతీసికొనెను. దోపిడి ఏమాత్రమును లేకుండెను. ఈపద్ధతిగ శివాజీ వచ్చుచుండెనట్లు సుల్తానువిని, అతనిసైనికుల క్రమశిక్షణకుసంతసించెను. శివాజీని గౌరవించుటకు మార్గమధ్యమున నాతనికలుసుకొనదలంచెను. కాని, శివాజీ మిగుల మర్యాదస్థుఁడగుటచే సుల్తానున కీక్రింది విధముగ కబురంపెను. 'మీరు నాకెదురుగ రాకూడదు, మీరు అన్నగారు నేను తమ్ముడను." సుల్తాను ఈ సందేశమునువిని మిగులసంతసించెను. రాజ్యమునకు సర్వాధికారులగు అక్కన్న మాదన్నగారలు— వీరే నిజమునకు ప్రభువులు—ఎదురేగి శివాజీకి స్వాగతమిచ్చి పట్టణమునకు తోడ్కొనిచనిరి. శివాజీ ముందుగ తన అశ్వసైన్యమున కంతకును బంగారు నగిషీ పనిచేసిన జీనుల నమర్చియుంచెను. సుల్తానును చూచుటకై అతఁడు శుభముహూర్తమున పట్టణమున ప్రవేశించెను.

సుల్తాను పట్టణమంతయు నలంకరింపజేసెను— రాజవీధులు, సందులు, పసుపు కుంకుమలతో కప్పబడెను— జయస్తంభములును, పతాకములు నమర్చబడెను. కోట్లకొలది ప్రజలు శివాజీని చూచుటకై మార్గమున కిరుప్రక్కల నిలుచుండిరి. స్త్రీలు ఆరతులిచ్చి గౌరవించిరి. రాజుమీద బంగారువెండి పుష్పములు వర్షింపబడెను. రాజు అంతులేని ధనమును దుస్తులను ప్రజలకు ధర్మముగ పంచిపెట్టెను. సత్వరముగ 'దాదుమహాల్' అను భవనము చేరెను. ఈవిధముగ పాదుషా (సుల్తాను) యీసందేశమంపెను. "తమరు మేడదిగి రావద్దు నేనే స్వయముగ తమదగ్గర

రాష్ట్రప్రభువగు శంభాజీయు, మరొకవైపు గోలకొండ సైన్యములును విజాపురమునకు సాయము చేయుచుండిరి. తనకు కప్పము కట్టు సామంత రాజ్యమైన గోలకొండ ఇట్లు బహిరంగముగ శత్రుపక్షమువలంబించుటచే ఔరంగజేబు ఆగ్రహపూరితుడయ్యెను. విజాపురమునకు సాయము పంపు ప్రయత్నమును సంపూర్ణముగ నాశనమైచుటకై, తన పెద్ద కుమారుడగు షాఆలమును గోలకొండను ముట్టడింప నంపెను.

గోలకొండ సైన్యములు "మాల్ఖేడు" అను మాన్యకేతము వద్ద వీరి నెదిరించి పెక్కు దినములు గోలకొండపైకి రానీయకుండ నాపగలిగెను. ఈ యుద్ధములో మాదన్న మేనల్లుడగు "యజ్ఞన్న"—ఈతనికి "రుస్తుమురావ" ను బిరుదు కలదు—మిగుల పరాక్రమముతో పోరాడి అనేక గాయముల నొందెను. కాని, చిరకాలమునుండియు దక్షిణాపథ రాజ్యముల దౌర్బల్యమునకు ముఖ్యకారణమగు నంతఃకలహమే నేడు ప్రబలమై యుండెను. గోలకొండ ప్రధానసైన్యాధ్యక్షుడగు మహమ్మదు ఇబ్రహీమునకును, అతనితరువాత నాయకుడగు షేకు మిన్హాజునకును మనస్పర్థలెక్కువై ఇబ్రహీముశత్రుపక్షమువలంబించెను. ప్రధాన నాయకు డట్లు ద్రోహి యగుటవలన సైన్యములు చెల్లాచెదరై హైదరాబాదు వైపు పారిపోయెను. మొగలు సైన్యములు నిరభ్యంతరముగ హైదరాబాదు మార్గమున వచ్చుచుండెను

రాజధాని నగరమును కాపాడుటకు ఇంకను బలువురు సేనానాయకులును, భటులును ఉండిరి. కాని తానీషా వీరిలో నెవ్వరిని నమ్మవలెనో నిశ్చయింపలేక పిరికివాడై హైదరాబాదును వదలి గోలకొండదుర్గములో దాగికొనెను. మాదన్నగారీపద్ధతి మిగులప్రమాదకరమనియు, దుర్గములో దాగుకొని ముట్టడికి లోనగుట కంటె, మారమున నున్న నొరుగంటికి పోయి నూతన సైన్యములను, నస్తుసామగ్రిని రాజ్యమునందలి సమస్తప్రాంతములనుండి స్వేచ్ఛగ సేకరించుకొనుచు, గోలకొండ దుర్గరక్షకులకు సాయమొనరించుట యుత్తమ మనియు, బోధించెను. కాని, పిరికి వందయగు తానీషాకీ పద్ధతి రుచింపలేదు.

ప్రభువు గోలకొండకు పారిపోవుటతోడనే, ప్రజలును, సరదారులును, భీతిల్లి నలుదిశల పారిపోవ జొచ్చిరి. మొగలులు హైదరాబాదు ప్రవేశింపక పూర్వమే, గోలకొండ దుర్గము ముట్టడింపకపూర్వమే దోపిడిగాండ్రు స్వేచ్ఛగ నీ భాగ్యనగరమున ప్రవేశించి కొల్లగొట్ట నారంభించిరి. మహదైశ్వర్యమునకు నిలయమైన నగరము దిక్కులేని దివాణమై, తన ధనరాసులను, దివ్యభవనములను బందిపోటువారి కప్పగించవలసిన గతిపట్టెను.

షా అలమ్ నగరమున ప్రవేశించి గోలకొండ ముట్టడి నారంభించెను. ఎట్టిషరతుల కైనను ఒప్పుకొని, సంధి చేసికొనవలెనని తానీషా వాంఛించెను. క్రమముగ వాని సరదారు లనేకులు మొగలులలో కలిసిపోయిరి. ఔరంగజేబు ఈ క్రింది షరతులనువిధించెను. 1. లోగడ బాకీలక్రింద 120 లక్షలరూప్యములిచ్చుట. 2. ఇకముందు ప్రతి సంవత్సరమునకు 10 లక్షలు చెల్లించుట. 3. మాల్ఖేడు ప్రాంతమును వదలుకొనుట. 4. అన్నిటికన్న ప్రధానముగ అక్కన్న మాదన్నలను పదచ్యుతుల కావించుట. తానీషా చేసినతప్పు మునను లన్నిటిలోను హిందూ మంత్రులకు రాజ్య మిప్పించుట యే యెక్కువ గ నౌరంగజేబుతలంచెను. కాఫరులకు

గౌరవ మొసంగిన తుచ్ఛుడని తూలనా డెను. ఈ షరతుల కంగీకరించినను, చివర వరకును మాదన్నను వదలుకొనుటకు తానీషా సంశయించుచుండెను. కాని, మహమ్మదీయ సరదారులును, జనానాలోని రాణులును, మాదన్నగారిమీద ఈర్ష్యచేతను ఆయనను చంపినచో సులభముగ సంధి సమకూడి గోలకొండరాజ్యము కొంతకాలమైనను నిలచియుండుననను నూహచేతను మాదన్నను చంపుటకు కుట్ర కావించిరి.

1686 సం॥ మార్చినెలలో నొకనాటి రాత్రి, మాదన్నగారు తానీషా సముఖము నుండి మరలివచ్చునపుడు, గోలకొండ వీధులలో అనేకమంది మహమ్మదీయ బానిసలు పైబడి పల్లకీలోనుండి లాగి వధించిరి.

ముగింపు.

మాదన్నతో పాటు అక్కన్న గారు చిత్రవధ కావింపబడిరి. "కత్తి గంటముల యందు దసమాన ప్రజ్ఞానిధి" యని పేరొందిన వీరి మేనల్లుడు రుస్తుమురావును ఇంటివరకు తరిమిచంపిరి. వీరి దివ్యహర్మ్యములను దోచుకొనిరి. అక్కన్న మాదన్నల శిరస్సులను. తానీషా రాణులు, ఔరంగజేబు శిబిరమువరకు పంపిరి. ఔరంగజేబు తృప్తినొంది, తాత్కాలికముగ సంధికావించి, గోలకొండ ముట్టడి నాపెను.

కాని, మాదన్నగారి మరణమువలననైనను, గోలకొండ రాజ్యమునకు విపత్తు తప్పలేదు. బీజపురమును జయించినవెంటనే మరల చక్రవర్తి గోలకొండపై దాడువెడలి తానీషాను ఖైదీగా గొనిపోయెను. (1686 శెప్టెంబరు) ఇంతటితో గోలకొండ రాజ్యము అంతరించెను.

ఇన్ని వత్సరము లుత్తమాధికారము వహించిన మంత్రిశేఖరుడు బలవన్మరణ మొందుచుండ, నాతని రక్షింప యత్నించినవారు కాని, దుర్మార్గులగు నాతని హంతకుల శిక్షింపనెంచినవారు కాని లేక పోవుట, మిగుల వింతగ కాన్పింపకపోదు. ఈ విషయము నంతను సమగ్రముగ పరిశీలించిన " యదునాథ సర్కారు " గారిట్లు వ్రాయుచున్నారు.

"ప్రభుత్వమునకు పశు బలమే మూలాధారమను విషయ మాయన గ్రహించలేదు. పాదుషాపట్ల తనయెడ నెంత భక్తి విశ్వాసము లున్నను, వెనుక తనకు అంతగ గొప్పసైన్యము లేనిచో, తన పదవి చంచలమనియు, అధికారము నిజమునకు బూటకమనియు, నీత డెరుగడు. చిరకాలము నుండి యనాగరికులుగా త్రొక్కబడుటచే, గోలకొండ రాజ్యపు హిందువులు ఆత్మ సంరక్షణ శక్తిని గోల్పోయిరి. తాను పదవియందున్న పది సంవత్సరములును తన ప్రజల నుద్ధరించుటకెట్టి యత్నమును మాదన్న గారు కావింపలేదు. ఈ కారణముల వలననే, నీచమగు చావు చచ్చెను. పగ తీర్చుకొనువారు లేరైరి."

మాదన్నగారు మంత్రియగుటకు పూర్వమనేకవత్సరములనుండి ఒకవైపు మొగలుల దాడివలనను, మరొక వైపున నంతఃకలహముల వలనను క్షీణదశకు వచ్చుచున్న గోలకొండ రాజ్యమును, పరాక్రమ హీనుడును చంచల చిత్తుడును నగు సుల్తాను పరిపాలన క్రింద నేదో విధముగ నిలువబెట్టుటకే మాదన్నగారి శక్తి నంతయు వినియోగింప వలసి వచ్చెను. సాధారణ స్థితిగతులందువలె, సావకాశముగ ప్రజోద్ధరణకును, తన పదవిని నిలుపదగు సైన్యమును సేకరించుటకును, ఆతడు యత్నింప వీలు లేకపోయెను.

మాదన్నను తానీషాయే చంపించెనని కొంద అభిప్రాయపడియున్నారు. అది పొరపాటు. చివరవరకును మాదన్నగారిని గౌర

వించుచునే యుండెను. ఆయనను పదవినుండి తొలగించుట కెంతమాత్రమును నిచ్ఛగింప కుండెను. సర్దారుల కుట్ర ఫలితముగ నకస్మాత్తుగ మాదన్నగారు ప్రాణముల గోల్పోయిరి.

తన శక్తి సామర్థ్యములచే దక్షిణాపథ రాజకీయరంగమునందు ప్రధాన పురుషుడని పేరొంది, తన పదవిని స్వలాభమునకై గాక, రాజ్యకళ్యాణమునకే వినియోగించిన, మాదన్నగారు భారతీయులకు చిరస్మరణీయులు. పెక్కు శతాబ్దములనుండి ఆంధ్రదేశచరిత్రకు వన్నె బెట్టిన మంత్రి పుంగవుల పరంపరలో తిమ్మరుసు తరువాత, మాదన్నగారే ప్రఖ్యాతుడు.



# రాధిక.

[ చిగురుపాలు శేషగిరిరావుగారు. ]

ఉ॥ తావులనీను చెంగలువదారుల, పూవులురాలు క్రేవలన్,
మావులనీడలన్, వికచమల్లిక లిమ్ముగబూయు చోటులన్
గోవుల దోలుచున్నడచుకొండిక లింటికి జేరువేళలన్,
రావదియేలరా, విబుధ రంజిత! వేణువునూదు కొంటకున్॥

ఉ॥ జేగురుసంజలన్, విమలశీకర సంచయ శోలికానళి
న్మూగుచు, మోడ్పుకన్గవలనున్న మరాళద్వయంపుబోలికన్
వాగుల పొంతలన్ మెరయువాలుకలో విహరించుగోరికన్
రాగ, నుపేక్షసేయదగురా? యదురాయ! కృపావిహీనతన్॥

ఉ॥ వెన్నెలరేల నీయిసుకవెట్టిన లంకల గ్రుమ్మరిల్లుచో
సన్నుతలీల నీచరణసారసముల్ కనుగందునంచునా
సన్నుసుమోహరాగము వెసన్నలదం దలపూనియుంటి నా
మన్ననబొందనేమిటికి మానితివోయి కుమారగాయకా॥






కవిసోదరులు

పువ్వాడ శేషగిరిరావు. చోడవరపు జానకిరామయ్యగార్లు.

---

"వెలమవీరులు ఱొమ్ములు విరిచి నిలువఁ
గోట దఱియంగ నెవనికి గుండెకలదు?
కలదుగాకేరు మఱలిపోఁగలరు దఱిసి
తాండ్రపాపయ ప్రాణముల్ దరలు దనుక."

అనుకొంచున్ వెలమప్రభుండు దన శస్త్రావాసమం దాయుధా
లను గైసేయుచునిల్వ రావునరపాలాధీశు డంపింపగాఁ
జనుదెంచెన్ మనుజుం' డటన్న నుడి చూచాయం జెవింజేరె; నా
తనికిన్ మోదము సంభ్రమంబుఁ జెనుపన్ ద్వారంబుచక్కన్ జనెన్.

తనవంక కరుగు దెంచెడి మనుజుని ముఖలక్షణములు మ్లానములై యుం
డినఁగని కడుఁదత్తరమందిన మది బొబ్బిలి తెఱఁగు దెలుపంగోరెన్

అడిగినఁ దాల్మిఁబాసి హృదయంబున రేగు దవాగ్నియొక్క మూ
రదరగ నిట్టులన్ బలికె "నక్కట! ఏమనిచెప్పువాఁడ, నో
నొడయడ! రామరాజు మన యూహ నెఱింగి మహోక్కదారి ము
ట్టడికి ననంతసైన్యము హుటాహుటిఁదెచ్చెను; తెచ్చినంతటన్

రంగభూజానియున్ సమరంబు నిశ్చయంబటంచును సైన్య మాయత్తపఱచి
నైన నిర్యాణ నోద్యోగ పరతఁదవిలి దుర్గరక్షణభారమ్ము తొడరిపూనె.

కొన్నిదినాలుకాచె మనకోట; నరాతులు లెక్కకెక్కువై
యున్నను—సైన్యమందుగల యోధులు నాటికి నాటికిన్ నశిం
పన్—నవలాజనంబు తమ మానధనమ్ములు దక్కవన్న శం
కన్—నవవహ్నికీలలకుఁ గాయములాహుతిఁ జేసిరొక్కటన్

పొడసూపి పైకిసాగెడి నాల్కలంబోలు నురువు మంటలు మేనియురువులార్ప
వళిమగాఁ గ్రమ్మి యంధత్వమ్ముఁ జేకూర్చు పొగపింజ రూపమ్ము పాలుపడఁగ
కణకణలాడు నెత్తురి నిప్పుకుప్పలు సౌందర్య మహిమ భస్మమ్ము సలుప
ఎడనెడ గర్జించు సడి శ్రోత్రముల దూఱి "బలిచాల" దన్న సవ్వడిని దెలుప

చితులఁదఁ గాల్పఁబడిన వంశీనినాద ములను ప్రతినాతి కాహ్వానములనొసంగ
మానరక్షణ భారానతానన యయి అగ్నిఁ జొరబడి చేసెనాత్మార్పణమ్ము.

అంతన్ వీరులు విక్రమించి పటుశౌర్యాటోప విస్రంభులై
రంతన్ భూనభముల్ దిశల్ వణఁకు వారన్ - శాత్రవానీకముల్
నంతన్ నెత్తుటఁ దోఁగ — ఘోరరణకేళీలాలసత్వమ్మునన్
స్వాంతమ్ముల్ జివురింప — భూతబలిఁ జేయున్ సాగిరొక్కుమ్మడిన్

ధరరాలెడి శిరములును దొరలాడెడి పీన్గుపెంటఁ దోఁగెడి తనువుల్
చిఱువెచ్చ నెత్తుటేఱులు కరమున్ భీకరముఁగాఁగఁ గదనము వొలిచెన్.

అది మహాభీకరమ్ము — దినాంతవేళ,
నంధకారమ్ము దిశలెల్ల నావరింపఁ
గెలన నక్కలుఁ గూయ — మార్పులుఁ జడలు
భూతగణములు కలలంపు బువ్వఁగుడుచు.

* * * * *

(సశేషము) "కవిత" నుండి



# పుష్పమాల

జంధ్యాల శివన్న శాస్త్రి గారు

మ॥ సరసంబై కకుబంత సంతత లసత్సౌరభ్య సౌభాగ్యమై
స్ఫురదుద్యత్సుమనోవికాస ఘనమై శ్రోత్రామితానంద కృ
ద్వర ధీరాళి మనోజ్ఞగీత రచనావైచిత్ర్యముల్ గల్గి యీ
ధర శోభిల్లుతఁ బుష్పమాల రసవత్కాంత ప్రదేశమ్ములన్॥




ఊటుకూరు సత్యనారాయణరావు బహద్దరు జమీందారుగారు

---

ఇదియె ప్రేమవిపంచి వాయింపుమనుచు
చేతనిడితి యానంద సంసిద్ధికొఱకు
బహుళతంత్రీమనోహరత్వమును గాంచి
వీణ మొరయింపఁబోవ, నా వ్రేళ్లు తగిలి
తీగలన్నియు తెగి శ్రుతు లాగిపోయె.
దుఃఖమె శరణ్య మయ్యెఁగదోయి నాథ!

* * * *

అవిరళానంద మాత్మ సౌధాంగణముల
పూలతోటల నిర్మింపఁ బోవ నే ని
శీథమధ్యాహ్న దివ్యనిద్రితిని నాక
అకఁగు కదలింపఁగా దీపమారిపోయె
తారకలు రాలె మేఘసంతతులు మూఁగె
దుఃఖమె శరణ్య మయ్యెఁగదోయి నాథ!

* * * *

ఎంతో ఆయాసపడి బొబ్బ లెక్కఁ గాళ్ళ
కఱకురానేల నడచి నీ కరుణావార్ధి
రత్నముల ఆసనే దేవులాడినాను
నత్తగుల్లలె కాని రత్నములు రావు,
దుఃఖమె శరణ్య మయ్యెఁగదోయి నాథ!

# ఉదధి

యామర్తి సూర్యప్రకాశరావుగారు

---

౧

గగన మను కన్య, వక్త్రవికాసములకు
యంబుధి దర్పణశ్రీల నాశ్రయింప
జేసి, బింబసాదృశ్య మీక్షించుకొనగ,
స్వచ్ఛ సాంధ్యరాగోస్మిత చకితమయ్యె!
అచటకు సఖులతోఁ గొందరరిగినారు
ప్రణయరాగాభిలాష విభ్రాంత చిత్త
లరిగినారు కొందరబల లనుసరించి
వివిధ కామ్యార్థ మితరులు వెడలినారు!
అఖిల సమ్మోద నిలయ బ్రహ్మాండవలయ
ముందు నాకేవికనిధానము ప్రభాతి!
ఆప్త సఖులు లేరు "హృదయమపహరించి
దాసు నిగజేసుకొన గల్గు తరుణి లేదు!!
నాకు నేనె యెప్పుడు గానైతి గాని
యార్ద్ర హృదయాంత రంగుండ నగుట జేసి
హర్షసాగరమందు నేనామకొందు
సరసిలోని జనమునైని జలజవిధము!
హృదయ నీరంధ్ర శోకము నెప్పుడైన
నిర్ఝరీవిధమున నశ్రునిబిడమొక్క-
సారి ప్రవహింపజేసి, విచారపంక
సంకలిత భారమునుఁగడుగఁ జాలనొక్కొ!
ఈ యధికతర భారమ్ము నెవరితోడ
చెప్పికొందును నేను నిశ్చింతగాను?
జన్మపద చిహ్నముల వెంట చావునడచు
అపరిమిత సూత్రమ్ము ధేయమ్మునాకు!

౨

సైకతస్థలి విశ్రమించంగ నేను
అంబుకణజృంభ ణాధిక్యమశ్రువిధము
వీచికలు వెదజిమ్ముచు విపులముగను
"ఉంటి నేనొక భాగ్య" నంచుదధిఁ బలికె!

* * *

నేను

ఏల నవిరళదుఃఖాగ్నికీల కోష్ణ
వృష్టిలో, దగ్ధ హృదయవై, పుత్త్రి తల్లి..
ఇట్టి ముక్తాశ్రులు విడువ నిచ్చవీకు!
ఎంతనారోగ్య శిథిలమో యెరుగ లేవె!!
దివ్యదిక్పాలకాసాధ దీప్తులన్ని
త్వద్గ్రహదయరోదనప్రతిధ్వనులతోడ
నంతిపుర కాంతలుభయ విభ్రాంతమొంద
ఏల, గంపెంప, జేయుచున్నంతువీవు?
అతిముత్యములకు నీవె నాలయమ్ము
కలిగెశ్రీదేవి జన్మమీగర్భమందు:
గంటివిష్ణుకామ్యర్థిదనా కల్పతరువు:
దేవి! ఒసగితి సుక్షీర ధేనువొకటి!
త్వద్వ్రతములగర్భమందు నుద్భవమునొందె
దేవదేవుని చేయు శ్రీచేకొనియె!
స్వచ్ఛగర్భంబునఁ బుట్టె చందమామ
తారకాధినాథుడగుచుండె నరుచుండె !!
కలదు భాగ్యమైశ్వర్యంబుఁ గలదు దేవి!
ఉదధితివి విష్ణుదేవుని ప్రాపు నీవు:
తారకాకోమలస్మితాస్యమబ్బె;
ఇంక నేడ్వంగఁ గారణమేమిఁ గలదు!

ఉదధి

జన్మపావనారహితనై జగములోన
జీవితవిధానమెట్లు నే చింతపడలి
గనుకవలయునో తెలుసుకోగలుగకుంటి
అదియె రోదనధ్వనులకు నాలయమ్ము.






ఆంధ్ర శేషగిరిరావుగారు
(సారస్వతసమాజము)

---

క్రీస్తుశకము 712 వ సంవత్సరమున మహమ్మదుకాసీము సింధుదేశముపై ఎత్తి వచ్చెను. గోమాంస భక్షకులగు మహమ్మదీయులు రాజ్యస్థాపనాశక్తితో కర్మభూమియగు హిందూదేశమున కాలిడుటకిదియే తొలిసారి. సింధుదేశాధిపతి దాహిరు రాజపుత్ర సేనలగూర్చుకొని కాసీమును నెదిరించి వీరస్వర్గ మలంకరించెను. సేనాని చనిపోవుటచే హైందవసైనికులు మహమ్మదీయులతో నిభాయించలేక పలాయనులైరి. అప్పుడు దాహిరు రాజసోదరి స్త్రీబృందముతో చిచ్చులోబడి మానము కాచుకొనెను. నాడు దాహిరురాజు సోదరి రాజపెట్టినచిచ్చు మహమ్మదీయుల విక్రమ ధాటితోబాటు సింధునదీప్రాంతమునుండి హిందూదేశమున నలుమూలలు వ్యాపించి మఱి పదిశతాబ్దములకు గాని చల్లారినది కాదు. వేదయుగమునందు యాగహవిస్సులతో తృప్తుడైన అగ్నిహోత్రుడు మహమ్మదీయ యుగమున మానధనులగుహిందూ మహిళాలలామల దేహాహుతులతో దీప్తుడైనాడు. ఆశతాబ్దములలో సేతుశీతనగరవ్యాప్తమైన భరతవర్షమున నెందఱో మానవతీమణులు, మానసంరక్షణార్థము తమ ప్రాణములను నగ్నిదేవున కాహుతినిచ్చిరి. అట్టివారిలో ఆంధ్రరమణి రాగమ్మయొకతె.

రాగమ్మ గొట్టుముక్కుల భగవానురాజు కొమార్తె. ఆమెకు రాఘవమ్మయను నామాంతరముకలదు. ఆమె పెద్దాపుర సంస్థానాధిపతియైన వత్సవాయి రాయపరాజునకు పట్టమహిషి. పెద్దాపుర సంస్థానపాలకులందు రాయపరాజు నామమువహించినవారిలో నీతడు రెండవవాడు. విక్రమాటోపములు మెఱపించి యీతడు ఉద్దండరాయపరాజు అను బిరుదమందెను. రెండవ రాయపరాజు క్రీ॥ శ॥ 1688 వ సంవత్సరములో సంస్థానాధిపత్యము వహించెను. ఆతని ధర్మపత్ని రాగమ్మయందు తిమ్మరాజు, బలభద్రరాజు, సూరపరాజు ముగ్గురుపుత్రులబడసెను అందుమూడవసూరపరాజు పాలుతాగు పసితనముననే ఇహలోకమువీడెను.

రాయపరాజు ఇరువదియైదు సంవత్సరములు రాజ్యకము చేసి క్రీ. శ. 1714 వ సంవత్సరమున దేహము చాలించెను. ఆతడు మరణించునప్పటికి తిమ్మరాజు, బలభద్రరాజులు మిక్కిలి పిన్నవారు. జ్యేష్ఠుడైన తిమ్మరాజునకే అప్పటికి పదిసంవత్సరములు నిండలేదు. అట్లగుట తల్లిరాగమ్మ తిమ్మరాజునకు బట్టాభిషేకము గావించి; తానే మంత్రి దండనాథాగ్రణుల సాయమున రాజ్యకార్యముల నిర్వర్తింపుచుండెను.

రాగమ్మ స్వయము క్షత్రియరమణి. అపై రాజకార్యధురీణ. విశేషించి రణశూరులైన మన్నెదొరలును వీరవిక్రములైన క్షత్రియసింహులును ఆమెను కొలిచియుండిరి. అట్టిచో ఆమె సంస్థానపరిపాలనము జనరంజకముగ శత్రుభయంకరముగ సాగినదని వేఱె చెప్పవలయునా? దక్షతతో రాగమ్మగారు సంస్థానవ్యవహారములను కొంతకాలము చక్కబెట్టి తిమ్మరాజు చేతికందివచ్చుట తోడనే యాతనికి యప్పజెప్పెను. తిమ్మరాజును తల్లియందలి గౌరవముచే సకలకార్యములందును ఆమె సలహాపుచ్చుకొని వ్యవహరించుచుండెను.

ఇది ఇట్లుండగా హైదరాబాదు నవాబు కమ్రుద్దీను అసఫుజా రాజమహేంద్రవరము, శ్రీకాకుళము సర్కారులకు సుబేదారుగ అన్వరుద్దీనును నియమించెను. ఆసర్కారులందలి జమీందారులు ఈయవలసిన కప్పములు బాకీపడియుండ వానిని వసూలుచేయుటకు అన్వరుద్దీను తనతాబేదారైన రుస్తుంఖానుని క్రీ॥ శ॥ 1732 లో పంపెను. రుస్తుంఖానునకు హాజీ హుస్సేను అను నామాంతరము కలదు.

రుస్తుంఖానుడిట్లు మహలక్కరు అధికారము అనగా సైన్యాధిపత్యము స్వీకరించి వచ్చుచుండగా నాతని నెటులైన రాజమహేంద్రవరము సర్కారులో కాలిడకుండ జేయవలయునని మొగలతుర్తి కలిదిండి రామరాజును, నూజవీటి సుబ్బన్నయు నేకమై సేనలకూర్చుకొని రెండు మూడు మారులేలూరువద్ద నాతనిదాకిరి; కానిపరాజితులై పలాయనులై శరణార్థులై పెద్దాపురమువచ్చి చేరిరి. ఎవిరి మహాక్రూరుడు. మాయావి, ముష్కరతురుష్కుడు. పాహాయార్థులై వచ్చినవారు ఖానునితో కదనమున ఓడి వచ్చినవారు. అట్టిచో వారికి అభయహస్తమిచ్చి చేరదీయుట కోరి యుద్ధముకొని తెచ్చుటయే. అయినను రాగమ్మ ధైర్యసాహసములు గలిగిన క్షత్రియరమణి యగుటచే నందులకు జంకక వారిని నిలవుడనెను పిఠాపుర పాలకుడైన రావు వేంకటకృష్ణారావు కూడ వీరితో కుమ్మక్కు ఆయెను. వీరందఱును ఏకమై రుస్తుంఖానుని గోదావరి దాటిరాకుండ జేయవలెనని యోచనలు చేసి బలములను కూర్చుకొని యుద్ధమునకు సిద్ధపడిరి.

ఇంతలో ఖానుడు గోదావరినిదాటి రాజమహేంద్రవరము వచ్చెను. ఒకనాటిగా గూడిన సంస్థానాధీశ్వరుల సైన్యములు 1734 వ సంవత్సరములో తురుష్క సైన్యాధిపతితో తలపడెను. ఈపట్టుకూడవిజయము రుస్తుంఖానునిదే అయినది. అప్పటను చేయునదిలేక రామరాజు, సుబ్బన్న, రావు వేంకటకృష్ణారావును తోటపల్లి మన్యములకు బారిపోయిరి.

తన్నెదిరించిన రామరాజాదులకు రాగమ్మ సైన్యసాహాయ్యము చేసెగదాయనుకొని ఖానుని మనమున జాగరితమగుచుండెను. అందులకు రాగమ్మకేదైన తగినశాస్తి చేయవలయునని రుస్తుంఖానునితలపు. పెద్దాపురసంస్థాన మప్పటికి మహమ్మదీయులకు లోబడియుండని స్వతంత్ర సంస్థానమగుటచే సర్‌లష్కరుడు నల్లేరుమీద బండిగా ఏమియు చేయలేకపోయెను. శౌర్యజీవులగు క్షత్రియులును, మన్నెదొరలును, కోటలో

అంటరాని అగ్నిహోత్రములవలె విక్రమించియుండుటచే దౌరాయించి పెద్దాపురదుర్గము ముట్టడించుటకు వీలులేదు. ఖాను ఈసంగతి సందర్భములు పర్యాలోచించుకొని వంచించి పెద్దాపురమును సాధించి స్వాధీనము చేసుకొన తలపెట్టెను. అందుకై ఆతడు రాజమహేంద్రవరమునుండి సేనల కదలించుకొని పెద్దాపురమున కరిగి పశ్చిమమున నున్న పాండవుల వారి మెట్టపై నందు విడిసి రాయభారములు నడపప్రారంభించెను.

రాగమ్మాదేవి తొలుత రుస్తుంఖానుని నమ్మలేదు. అతని రాయబారము లందలి కుటిలసంకల్ప వాసన ఆమెకు సోకినదేమో? నమ్మకము పుట్టించుటకై రుస్తుంఖానుడు తనపుత్రుడగు నూరుద్దీను హుస్సేనుఖానుని రాయబారిగా చేకొనెను. నూరుద్దీను కొంతకాలము పెద్దాపురమున వత్సవాయివారి కొలువులో నౌకరీచేసిన వాడగుటచే అతని మాటలు రాగమ్మ విశ్వసించునని రుస్తుంఖానుడు ఆలోచన చేసెను. తండ్రిస్వభావము పూర్తిగ నెఱిగిన నూరుద్దీను హుస్సేను ఆతనిని మొదట నమ్మలేదు. అందుపై రుస్తుంఖానుడు న్యాయము తప్పనని కత్తిపట్టుకొని ప్రమాణము చేసెను. అప్పుడు నూరుద్దీను హుస్సేను నమ్మి రాయబారము నడిపినాడు.

“మీసంస్థానము మిక్కిలి ప్రాచీనమైనది. ధర్మపరిపాలనకు పెట్టినది పేరు. అట్టి మీసంస్థానమును మీకు స్థిరపరచుటకు మేమెవ్వరము? ధర్మదేవతయే మీకు స్థిరపరచియున్నది. ధర్మప్రభువులగు మీ కుమారుల నొక్కసారి బేటికి పంపినచో వారి దర్శనముచేసికొని ధన్యులమగుదుము. మేముకూడ మీతో మైత్రిపాటించి సంస్థానమును స్థిరపఱచి వెడలిపోగలము.”— అని నూరుద్దీను హుస్సేను తండ్రి మాటలుగా రాగమ్మాదేవికి మనవిచేసికొనెను. నూరుద్దీను హుస్సేను ముఖమునుచూచి రుస్తుంఖానుని మాటలయందు సంపూర్ణవిశ్వాసముంచి రాగమ్మ సమ్మినబంటు అయిన చల్లా పెద్ది అనువానిని మఱియు నిరువురు మువ్వురు అనుచరులను మాత్రమే గౌరవపరివారముగ తోడిచ్చి తనకుమారులను రుస్తుంఖానుని బసకుబంపెను.

వత్సవాయి తిమ్మరాజును, బలభద్రరాజును తురుష్క శిబిరము చేరిరి. రుస్తుంఖానుడు రాజకుమారులతో ఇష్టాగోష్ఠి ప్రారంభించెను. ఇంతలో తురుష్కభటులు డేరాలోనికివచ్చి సలసల క్రాగిన నూనెలో జొన్నకంకులుముంచి వానితో రాజపుత్రులను కొట్టసాగిరి. రుస్తుంఖానుడు చల్లగ నొకప్రక్కకు నొసరిల్లెను. నూరుద్దీను ఈద్రోహముచూచి రాజపుత్రులను రక్షింప సిద్ధమగునంతలో నొక పచ్చితురక తప్తతైలమును వారిపై దిమ్మరించెను. రెప్పపాటులో రాజకుమారులు ప్రాణములు విడిచిరి. తండ్రి అసురకృత్యమునకు నూరుద్దీను కంటగించుకొనెను.

ఇదిచూచి చల్లాపెద్ది గుఱ్ఱము నెక్కి కోటలోని కుడాయించెను. రాజపుత్రుల క్రూరవధ నగరిలో తెలిసినది. అప్పుడు మానవతియైన రాగమ్మ ఇట్లని తలపోసెను “ఇక తురకలు కోటమీద పడుదురు. యుద్ధమున మనమేజయింతుమని చెప్పజాలము. మనమోడితిమేని గోమాంసభక్షకులగు తుర

కలు మన మానములు మన్నింపరు. రుస్తుంఖానుడు చిచ్చులేకనే చిముకు మచ్చరుడు. “ఉద్రేకమువరాని, శస్త్రధరులై యుద్ధావని లేని” పుత్రులనమ్మించి దొంగచాటున చంపించిన అసురుడు. అట్టివాడు ఎట్టిపనికైన ఒడికట్టును. వానితో యుద్ధమునవోడి మానభంగమున కొడిగట్టుటకంటె అసూర్యంపశ్యములైన ఈశరీరము లగ్నిహోత్రమున కాహుతిఇచ్చుటయే మనకీసమయమున విహిత ధర్మము.”

సంస్థానసేవకులలో విశ్వాసపాత్రుడైన చల్లాపెద్ది ఇది మంచిదనెను. మానభంగభీతి త్వరపెట్టి కోడండ్రును తక్కిన స్త్రీలును రాగమ్మతో అగ్నిప్రవేశమగుటకు ఉత్సాహపడిరి. రాగమ్మాదేవి ఆనతినంది చల్లాపెద్ది అంతిపురమునకు అగ్గిపెట్టెను. అంతట అగ్నిజ్వాలలు ఆకాశమంటి ఆమానవతులకు ఉత్తమలోక ప్రాప్తినొనగూర్చెను.

క్షాత్రయిళితమైన సతీత్వమునుగుబాళించు బూడిదరాసులతో నిండియున్న పెద్దాపురపుకోట రుస్తుంఖానుని కైవసమయ్యెను.

మానసంరక్షణార్థము ప్రాణములు తృణప్రాయముగ అర్పణముచేయుటలో రసపుత్రరమణులకు తెనుగుపడుచులిసుమంతయు తీసిపోవువారు కారని పెద్దాపురపుకోట ఇట్లు 1734 వ సంవత్సరములో పెద్దపెట్టున చాటినది మఱి ఇరువది సంవత్సరములకు పిమ్మట (1756 లో) బొబ్బిలికోట ఈ విషయమునే బొబ్బరించినది.

ఆంధ్రరమణీమణులనుండి.

## కవికుమారుడు

కరిపండా అప్పలస్వామి (కవితాసమితి)

జిలుగు బంగరుకాంతులఁ జిలుకరించు
కామనీయమౌ సాంధ్యరాగమ్ముఁ గాంచి
మలఁకలై వేగగిరిశృంగములను డిగ్గి
ప్రబలగతిఁ బాఱు సెలయేటిపటిమఁ గాంచి
బహుసుమసుగంధములఁగొని యహరహంబు
నాడుకొను సమీరార్భకు నడరుఁ గాంచి
మృదులమాకందకిసలయనెలమిఁ దినుచుఁ
గంతమెత్తెడు కోకిలాంగనలఁ గాంచి
కలకలారావముల మింటవలయములయి
పాఱుశుకశారికల స్నేహభంగిఁ గాంచి
గాలితాకున మెల్లనఁ గదలియాడు
లలితహరిద్వర్ణశాద్వలముఁ గాంచి
వాలముల నెత్తి గుమిఁగూడి బయలునుండి
తరలివచ్చెడు పసులమందలనుఁ గాంచి
చేతముసికోలఁగొని ముందఁ జేరినడచు
పాటకందెడు బాలగోపాలుఁ గాంచి
తెరలు తెరలుగఁగూడి యంబరపథమున
లీలవిహరించు జలదమాలికలఁ గాంచి
అతిశయమ్మున స్వీయరాజ్యమ్ము నెఱపఁ
జటులమైక్రమ్ము సంజచీఁకటులఁ గాంచి
భానుకిరణాళిఁ డాగికన్పడకయుండి
తిమిరమునఁ దోఁచు తారలతీరుఁ గాంచి
వెఱ్ఱివోలె నేమేమిభావింతువయ్య!
ముగ్ధతనువీడి మాతోడ ముచ్చటించి
కవికుమారక! యందేమికలదొ చెపుమ!

# ప్రతాపరుద్రీయము

పురాణం సూరిశాస్త్రిగారు, బి. ఏ.;

---

ఆంధ్ర చరిత్ర గాథలను నాట్యరూపమున ప్రదర్శించినచో జనసామాన్యమునకు తమ దేశవృత్తాంతము తెలియగలదు. కవులు, చిత్రకారులు, వీనియందలి రసవత్సందర్భముల గుర్తించి వర్ణింపగలరు. నాట్యరంగాన చూచినదాన్ని భావప్రపంచములో పెంచి చిత్రకారులు చిత్రించుటవల్ల మరల నాట్యాభినయమునకు, రంగవిరచనమునకు, సంస్కార మొదవును. ఈఆచారమితర దేశాలలో జరుగుచున్నది. కళలన్యోన్య సహకారమున నభివృద్ధి నొందవలెను. చారిత్రరూపక ప్రదర్శనంబున దేశాభిమాన ముజ్జ్వల విస్తరణమొందుటయే కాక, పూర్వసాంప్రదాయము లెరుకపడుటయే కాక, కావ్య చిత్రాదుల కమేయ ప్రోత్సాహ మేర్పడును. వీటివలన నాట్యకళ విచిత్ర రమ్యవైఖరుల విప్పొంద గలదు. అందుచేత ఆంధ్ర చరిత్ర మంతా నాట్యరంగాని కెక్కవలసియున్నది.

ప్రతాపరుద్రీయమును కూర్చుటలో వెంకటరాయశాస్త్రిగారు అసాధారణ ప్రతిభావిశేషాలను చూపించినారు. హిందూదేశంలో చరిత్రనాటకాలు సామాన్యంగా 1905 లో జాతీయోద్యమ మంకురించిన తరువాత యేర్పడ్డవి. ఇది చాలమట్టుకు రసపుత్రమహారాష్ట్ర వీరుల స్వాతంత్ర్య సంరక్ష కారంభములను దెల్పుచూ-సాధు పతనము, మ్లేచ్ఛ విజయము దేశస్వాతంత్ర్య నిర్మూలనము, యుద్ధములు, చావులు, బొబ్బలింతలు, దేశాభిమానభరితమైన యుపన్యాసములు మొదలగు గగ్గోలుతో నిండియున్నవి. ప్రస్తుత రాజకీయ దురవస్థల అనుభవములు పూర్వ చరిత్రగాథల కతికింపబడ్డవి. అందుచేత యివన్నీ ఒకే కత్తులో వుంటవి. ప్రతాపరుద్రీయము, జాతీయోద్యమ మంకురించుటకు చాల వెనుక కూర్చబడ్డది. పాత్రోచితమైన గ్రామ్యభాష నుపయోగించుటలో కూడ సమకాలిక సాహితీసిద్ధాంతములనతిమించి ముందంజవేసినది. వెంకటరాయశాస్త్రి, యుభయభాషా వ్యాకరణ పారంగతులయ్యూను, నిర్దుష్ట ప్రయోగకుశలురయ్యును, బహుజనంబులు చూచి, విని, బోధపరచుకొని, యానందించవలసిన రూపక కవిత్వమందు, వాడుక భాష కొప్పియుండెడి సంసపటిష్టతను గుర్తించి, బెదరక వాడియున్నారు. కథాకాలపు దేశావస్థనే వర్ణించినదిగాని, యీకాలపు భావాలను వెనక్కునెట్టి అతికించలేదు. అందలి దేశాభిమానులు తమ చర్యలచే పట్టుదలచే స్వామిభక్తిని, స్వాతంత్ర్య నిరతిని, చూపుకొనిరిగాని, వృథోపన్యాస వాగాడంబరమున దేశాభిమానము వెళ్లబుచ్చలేదు. పాత్రస్వభావాలు స్వభావసిద్ధంగా పోషింపబడ్డవిగాని నాయక నాయికా లక్షణములెన్నుట

జెప్పుకొని పెంచబడ్డవి కావు. అద్భుతమైన రాజ్యతంత్రము, పకపకలు వెలిగించు హాస్య ప్రసంగము, వేళవడుగులవలె, యల్లిక బిగువుల మర, ఒకటిగ కూర్పబడినవి. సాంఘిక మర్యాదలను దెబ్బ, నవీనరూపక పద్ధతులతో బాగుజూపుచున్నది.

ఇటీవల చరిత్రనాటకములు వ్రాసినవారు ప్రధాననాయకులకు మహోదార శీలస్వభావములను ఆపాదించియున్నారు. ప్రపంచఖ్యాతికెక్కిన కృతులలోని పాత్రలు కథాకాలంనాటి స్వభావమునొప్పుచు, లోకోత్తరముగ స్వభావేతరముగ నగుపడుదురు. శ్రీరామ హరిశ్చంద్రాదుల స్వభావంలో మనకు భక్తివిశ్వాసాలు కుదిరిపోయినవి. అభ్యాసంగా వాళ్ళని పూజిస్తాము. అంతేకాని వారిచేష్టలను, ప్రవర్తనలను, లక్ష్యమర్యాదలను, లౌకికానుభవ ప్రమాణమున విమర్శించ జాలము. ఇట్టి భక్తి విశ్వాసములు నవీన చారిత్ర వీరులపట్ల అలవరచుకొనజాలము. చరిత్రలు లౌకిక కథాంశముల విప్పి చెప్పునే కాని యలౌకిక సందర్భముల గల్పించవు. చరిత్ర నాటకాలు సాంఘికస్థితికిని లౌకిక సంసారమునకును చేరువగ నుండవలెను. ప్రతాపరుద్రీయము వీరగభీర ప్రతిజ్ఞాటోపములతో నుల్లము దల్లడింపజేయక, సాంఘిక చారిత్రిక రూపకంబుల కనువగు స్వాభావిక సామాన్యత గలిగి హాస్యరసాయన మొలికించుచున్నది. దీని సాఫల్యాన్నంటి చూస్తే ఆంధ్రులు వాడుక భాషలో జాతీయ చమత్కార మేర్పరచు ఆటల జూడ నుంకించుచున్నారని విశదమగును. రాజ్యాలు నిలుచుటకు ప్రజలందరు రాజసేవకులందరు సంకల్ప పరిశుద్ధతతో యొక ముఖమున వర్తించవలెననియు, నైకమత్యమున నెంతటి కార్యమైనా సాధింపవచ్చుననియు తెలుపుచున్నది.

ప్రతాపరుద్రీయము యీనాటి తెలుగునాటకా లన్నిటిలో మిక్కిలి ప్రేక్షణీయమై బండితపామరులను సమానంగా సంతోషపెట్టుతున్నది. ప్రతాపరుద్రుడు, యుగంధరుడు విద్యానాథుడు, చరుముకి పేరిగాడు, మల్లి, ఖుస్రూ మొదలైన మూర్తులు ఒక్కొక రొక విధమైన పాత్రస్వభావాన్ని విపరీత స్వాభావిక చాతుర్యంతో చూపుచున్నారు. ఈనాటకంలో వసతిగలవారు పెక్కు రమ్యరంగములను ప్రదర్శింపవచ్చును. నాటక భారము పలుపాత్రల మీద పలచపడి విసుగొదవకుండ నిర్వహింపబడ్డది. పాత్రస్వభావపోషణలో అసాధ్య మెక్కడా లేదు. నాయిక లరుదెంచి పలుపు తెరపుల కులుకకున్నను రక్తి కొరవడలేదు. తెలుగువారి ప్రశస్తాశయముల నన్ని విధముల దనియించుచు, లభ్యసౌఖ్యముల నతిశయించుచు, నసామాన్య రా[illegible] మొందియున్నది.

కాని, యిందులో సంధినియమాలేవి కనుపించవు. ప్రతాపరుద్రుని తురకలు యెత్తుకొని పోవుటవల్ల నాటకబీజమేర్పడ్డది. రాజును విడిపించి తెచ్చి కాకతిరాజ్యలక్ష్మి వియోగమును బాపి భద్రముగ సింహాసనారూఢుని గావించుట యిందలి ముఖ్యాంశము. నిదురలో మైమరచియుండిన రాజును వంచించి చెరగొనిన తురక సర్దారుల శిక్షించుటయు, దేశమును అరాజకము గాకుండ గాపాడుటయు, తురక సుల్తాను

నకు హిందూ తంత్రజ్ఞుల యుదారమర్యాదలను తెలియజేయుటయు, తరువాత సమస్యలైనవి. రాజును విడిపించుటకు రత్నాల వర్తకులు కారణమైరి. ఖుస్రూవల్లీల జంపించుటకు చకుముకి పాటుపడెను. రాజు, దేశములోనే యున్నాడని వెల్లడించి ముద్రికాసహాయమున వ్యవహారముల నడపించుటకు జనార్దన విద్యానాథు లల్లిన పన్నిదము తోడుపడినది. సుల్తానునకు హిందూ మర్యాదలను యుగంధరామాత్యుడు పడవలో నెరుకపరచెను. ఈనాల్గు ప్రత్యేక సమస్యలను నిర్వహించుటలో కల్పనా సౌష్ఠవము దిట్టముగ నున్నది గాని యివి యొక దానితో నొకటి సంబంధించి యుండలేదు. ముఖ్యాంశము రాజును విడిపించుట. అందుకు సాధనము రత్నాలవర్తకులు మిగిలిన కథలు యీ ప్రస్తుతాంశానికి సంబంధించలేదు, తోడ్పడలేదు. ఆకాలపు రాజనీతి చరిత్రములో రాజ్యధూర్వహులు నిర్వహించిన నాలుగు ప్రత్యేక కార్యములను పరస్పర సంబంధము లేని వానిని కూర్చినందున దృశ్యరూపమున నొక యితిహాసమును రచించినట్లైనది. సంధిసంబద్ధమైన నాటకము కాలేదు. విద్యానాథుడు ముద్దుటుంగరమును దెచ్చుటయు, పేరిగానిని గద్దెనెక్కించుటయు, ప్రధానకథాంశమగు రుద్రబంధ విముక్తికి ఏవిధంగానూ జతపడవు. అరాజకనివారణము మేమూహించిన సంగతి కాని, పాత్రసంభాషణలో తేలిన అంశము కాదు. విద్యానాథుడొనర్చిన పనిలో రాజును ఢిల్లీకి తురకలెత్తుకొని పోయిరను నిశ్చయ వృత్తాంత మొకటియె నాటకకథా విన్యాసమున కుపయోగించునదియై యున్నది ఖుస్రూ వజీరుల జపించుటకూడ ప్రధాన కథకు సహాకారమైన అవసరమైన విషయం కాదు. వాళ్ళు బ్రతికియున్ననూ రాజును తప్పించడానికి యాటంకము లేదు. శాస్త్రిగారు ఈ అతుకులన్ని తీసివేస్తే కథ చాల చిన్నదౌతుందని, స్వారస్యంగా నుండదని ఆలోచించి పెట్టారు. ఇంత అపేక్షించినా, పేరిగాడి సీను తప్ప మిగిలినవి తీసివేయుమని మేము చెప్పము.

ఈ నాటకంలో మిక్కిలి ప్రీతికరములగు పట్లు, పేరిగాడి సారాశెంబు సీను, యుగంధరామాత్యుని బిచ్చంబు బైరాగి చేష్టలు. ఇవి రెండూ కథాసంవిధానానికి తోడ్పడవు. నిష్ప్రయోజకములు, నీచ ప్రసంగ భరితములునై, పైపెచ్చు అసంభావ్యత నేర్పరచుచున్నవి. పేరిగాడు గద్దెనెక్కిన సంగతి ఆనాటి కాకతి ప్రజలెరుంగరు. తురకలు వెత్తుకొని పోయినది పేరిగానిననియు, ప్రతాపరుద్రుడు సుఖముగ నిజరాజ్యస్థానమందున్నాడనియు, జనార్దన విద్యానాథు లేర్పరచిన పుకారు కాకతిరాజ్యసంరక్షణకవసరమే! మంత్రుల జాగరూకత ప్రశంసనీయమే! కాని, పేరిగాడు మెన్నడూ కాకతిప్రజల కగుపడలేదు. రెక్కలు మూసిన పల్లకిలో గాయపడిన రాజు, రామాప్రధానుల యింటినుంచి, నిజాంతఃపురంబున కరుదెంచినట్లు చూపిరి. అప్పటినుంచి, ప్రతాపరుద్రుడు తిరిగివచ్చుదాక, రాజనామకుని యంతిపురమందే దాచియుంచిరి. సారాసెంబుసీను లోకూడ చకుముకిత్యాద్యమాత్య నియుక్త పరిజనంబులే కవిగాయక భూమికల నాల్చి యరుదెంచిరి. కాలక్షేపమైన వెనుక నీవెత్తి వెంగళప్పను బహిరంగ

సభలోకి జేరనీయకూడదని జనార్దనుడు నిశ్చయించెను. పేరిగాడి పొందిక, యోగము పట్టించుకొను పట్టుననే వెల్లడైనది కనుక వాడి సారాసెంబునీను నాటక యల్లికకు జత గాదు గనుక, ఈసందర్భాన్ని ప్రయోగించ వలసిన అవసరము లేదు. ప్రజలకు తెలియు టానికి ఎల్లితో చెప్పిన మాటలే చాలును. తా జెరగొనినది పేరిగాడని సుల్తానులకు తెలియకూడదు. తెలిస్తే, సుల్తాను ఆత్మగౌరవ సంరక్షణార్థ మీయుదంతమును గోప్యముగ నుంచి, బీజాలోపాఖ్యానములోని, జమీందారు తాబట్టినది పులిపిల్లలేయని డాబీసట్లు పైకి ప్రతాపుని చెరగొంటిమని చెప్పుకొంటూ రత్నపరీక్షా సమయానికి వాడిని వెంటగొని రాడు. లేక, రాచవేషాన మోసపుచ్చి, యిభపురంబున రాజమర్యాదలందుకొనినను అవమానముచే, ఖైదీని దండింపవచ్చును. ఈరెండు వ్యవస్థలు అనిష్టములే, కనుక ఈసంగతిని సుల్తానునకు తెలియ జేయరు. అందుచేత యీవృత్తాంతము బహిరంగంగా చూపు వలసిన అగత్యం లేదు. నాటకప్రేక్షకులు కథాకాలములతోను, కథావస్తుతోనూ తాదాత్మ్యతన్మయత్వ మొందుదురు. పొందినగాని రసగ్రహణశక్తి యేర్పడదు. ప్రేక్షక సమాజము ఆనాటి కాకతి ప్రజలగుచున్నారు. వారు యెరుగనిది వీరెరుంగకూడదు. రత్నాల పంపిణీకి యుగంధరుడు పిచ్చివాడై యిభపురంబున గంతులిడవలసిన అవసర మగుపడదు. వృథా చమత్కారం తప్ప ప్రాకృత జనరంజనంతప్ప వేరొండు ప్రయోజన మీపట్టులలో కనుపడదు.

కథాభారాన్ని నిర్వహించింది బ్రాహ్మణామాత్యులు. వీరి సత్యధర్మములగు అహింసా సత్యాములకు భంగము వాటిల్లకుండ గల్పించుటలో వెంకటరాయ శాస్త్రి యమేయకౌశల మగుపరచి యున్నారు. చకుముకి, యుగంధరుడు తాము తలచిన పని సూచిస్తూనే కార్యము సాధించారు. కథావ్యవహర్తలు తంత్రప్రయోగమున వైరిపక్షుల నొండొరులచే మడియింపజేసిరి. కాని తమ చేతుల రక్త కలుషితంబుల జేయలేదు. ఈ హాస్య ప్రసంగావిక ప్రయోజనౌచిత్యములు లేకపోగా శ్రీ శాస్త్రిగారు సమకాలికులయిన్న కవిజనంబులపై తమకున్న భావము నిందున వెల్లడించిరను మాట కూడ కలుగుచున్నది. నాటకపాత్రలన్నిటిలో చకుముకి విచిత్రముగ పోషింపబడ్డాడు. యుగంధరునకు యెక్కువ ప్రాముఖ్య మగుపడదు.

ఈనాటకంలో కథాబీజము విపరీతముగ కూర్పబడ్డది. సామాన్యంగా రూపకాలన్నిటిలో ప్రధాననాయకుల (అనగా కథాఫలితాన్ని అనుభవించే స్త్రీ పురుష పాత్రముల మనోవాక్కాయ కర్మలవలన నేర్పడి వారి పట్ల వర్తించును. ప్రధాన కథావిస్తరణము నాయికానాయకుల ప్రవృత్తుల జరుపబడును ప్రతినాయకులు వ్యతిరేకప్రచార మొనర్పుచుందురు. ఈ నాటకంలో ప్రతాపరుద్రుని తురకలు యెత్తుకొనిపోవుటవలన కాకతిరాజ్యలక్ష్మికి భూధవునకును గలిగిన వియోగమే కథాబీజము. ఇది ప్రతాపరుద్రుని గుణము వల్ల చేష్టలవల్ల జరుగలేదు. సుల్తానుకు బుద్ధి కుదిరి భావవిపర్యాసమేర్పడి అందువల్ల ప్రతాపరుద్ర బంధవిముక్తి కలుగలేదు. దీనినేర్పరచిన తురకలు రాజును చెరగొనుటతప్ప వేరొండు వ్యతిరేక వ్యవహార

మవలభించ లేదు. బంధవిముక్తుడై నిజరాజలక్ష్మిని మరల గలియుటయే కథాఫలము. ఇది ప్రతాపరుద్రుని ప్రయత్నమువల్లగాని గుణ విపర్యయము వల్లగాని సిద్ధించలేదు. రాజానుచరులు తురక లెత్తుకొనిపోయినట్టి యేమరుపాటున రాజును యెత్తుకొనివచ్చిరి. ఇందుచేత బీజస్థాపనమందుగాని, ఫలసిద్ధియందుగాని, కథావిన్యాసమందుగాని, నాయకప్రతినాయకుల స్వభావచారిత్రవికాస మేమియు నగుపడదు. తురకల అజాగ్రతను, నీచస్వభావమును ఆంధ్రుల తెలివితేటలను, సద్గుణంబులను వెలిబుచ్చునేకాని కథావిన్యాసమందు అచింతితావస్థలను, కాకతాళీయ ఫలప్రాప్తులను, మానవస్వభావవికాసములను, ప్రమాదములను, భంగపాటులను, వక్రగతులను, విరోధాభాసలను, జూపట్టదు. బీజస్థాపకులొకరు, ఫలభోక్తలింకొకరు కథార్థసంఘాతలు మరియొకరు. పాత్రప్రాధాన్యము నిర్వాహకులదే యైనది. కథలో గలిగిన సంక్షోభమంతా జనార్ధనుని తోడి ఫలప్రాప్తి కేవలము సహాయముల నాతడే సిద్ధపరచినందున నిందులో ప్రధానపాత్రము జనార్ధనమంత్రి యని చెప్పవచ్చును

ఈ రోజు మా వైపు నాట్యరంగాన ప్రతాపరుద్రీయము మొదటిస్థానము నొందినదని చెప్పవచ్చును. నేనా తేనాటి ప్రదర్శనము చూడలేదు కాని యేలూరు గ్రోటుడెండి యర్ థియేటరువారు, తెనాలి రామవిలాస సభవారు, బందరు ముత్తరాజా సుబ్బరాయ మెమోరియల్ వారు, దేశీయనాటక సమాజమువారు దీన్ని ప్రదర్శించగా చూచినాను ఇందులో ప్రత్యేక ప్రశంసార్హముగ పాత్ర నిర్వాహణము గావించిన మేటినటులు తమ తమ పాత్రలకొసగిన యాభినయ తాత్పర్యమును దిగువ విశదపరచెదను.

(సశేషము.)



# పుష్పమాలా!

శ్రీయుత పెనుమెచ్చ సత్యనారాయణ రాజుగారు

ఉ॥ ఆరినప్రేమఁగాంచి భవ-బాధిసుశంబును; తేకునెత్తఁగా
సౌరభముల్ దెసల్ పదియు-సారెకుఁజిమ్ముచు బాపురే! రసో
ద్గారమరంద బిందుయుత-దామకరాజము వైతి; మీదనీ
తీరునె నాడునాటికిని-దేజము నందుము పుష్పమాలికా!






(ఇక్కుర్తి తిరుపతిరాయఁడుగారు.)

౧

నాఁడు మహోత్కృష్టమైన పుణ్యదివసము. వైకుంఠ యేకాదశి. ధనుర్మాసము. ఆబాలగోపాల ముపవసించి భక్తిపూర్వకముగా భగవానునారాధించి సర్వజనములకును ప్రాయశ్చిత్తము జెప్పవలసిన పర్వాడి దినము. అట్టి సుదినమున మంగమాంబ వేకువనే మేల్కాంచి, అవసర కృత్యములను దీర్చుకొని స్నానార్థమై చంకనొక బిందె నిడికొని జలాశయమునకై చనియెను.

౨

ప్రపంచమింక నిద్రనుండి మేల్కాంచెనో, లేదో యని పరివీక్షించుచున్నట్లు, పద్మబాంధవుడప్పు డప్పుడే ప్రాగ్గిరాచల పైభాగమున కెక్కి తన కిరణములను భూమిపై బ్రసరింప జేయుచుండెను. మలయానిలుడు మందమంద గతుల బ్రచారము జేయుచుండెను. కాకులయార్భటులప్పు డప్పుడే యస్తమించుచుండెను. చెఱువు గట్లపై నలుదిక్కుల దట్టముగా బెరిగిన లేమావిగున్నలపై గూరుచుండి యందలిచిగురుటాకుల దనివి దీర దిని సహజ మృదుమధుర సమ్మిళితములగు తమ కంఠములను విప్పి కోయిలలు కర్ణపేయముగా గానము జేయుచుండెను. ఆ లోపలి భాగమున లోకబాంధవుని రాకచే రేకులెత్తి వికసించి విలసిల్లుచున్న నలినీసమూహము చూపఱులకు నయనానందమును గొల్పుచుండెను. ఆ రామణీయకత నవలోకించుచు యువకులు యాదవులు, వయోవృద్ధులసంఖ్యాకులు గుంపులు గుంపులుగా జేరి దంతధావనాది కృత్యములను దీర్చుకొనుచుండిరి. అట్టి సమయమున ధౌతవస్త్రధారిణియు స్వర్ణమయశరీరియు సుమంగళియు నగు నొక యువతి తటిల్లతవోలె నాజలాశయమునం బ్రవేశించి మజ్జనమాడి నిర్మలోదకమును దన బిందెనిండ నిడుకొని, అంతకు మున్నె తత్సరోవరములోని పుష్ప సంచయమును సేకరించి తెచ్చి దేవతార్చనకై యెల్లరికి బంచి యిచ్చుచున్న నొక యువకుని నోరగంటవీక్షించెను. ఆదృష్టిలో నెట్టి మహాశక్తి యుండెనో, కాని వాని సర్వాంగము లాక్షణముననే బంధించి శిలాకృతిగా నొనర్చెను. 'పుష్పములకా! పురుషప్రాప్తికా!' యని యాతడును, 'పుష్పము లడుగుదునా, అడిగిన నామనోరథ మెఱుంగునా,' యని యామెయు మోహాభయలజ్జావేశములు పైకొన నల్లలోలోన నొక్కింతసేపు వితర్కించుకొని, ఎదుటనున్న వారేమనుకొనియెదరో, యను ననుమానముతో నేమియు ననక ఎవరిదారిని వారు చూచుకొనిరి.

3

భ్రమరాచారి తూర్పుతీరమునుండి

వచ్చిన యొక యగసాలి. అతడు పూర్వదేశస్థుడైనను శోభాలతగ్రామమునకు వచ్చినది మొదలు గ్రామములోని వారెల్లరి ప్రాపకమును సంపాదించి తాను చేయు బంగారుపనియందు కొంత ధన మార్జించి కుటుంబ జీవనమునకు దగుమాత్రము భూవసతి నాయూరనే సంపాదించుకొని దానివలనను దన పనితనమువలనను సుఖముగనే జీవయాత్ర గడుపుచుండెను. దేహచ్ఛాయ కొంచెము కళంకముగా నున్నను ఇప్పటి నవనాగరికులయొక్క పాశ్చాత్య విధానములలో నతడెంతమాత్ర మేవిషయమునందును దీసిపోవువాడు కాడు. నాగరికతా విషయములలో నేవిషయము నూత్నముగ వెలువడినను అది ముందతని ముఖమునందె పరిస్ఫుట మగుచుండును. నాడు వైకుంఠ యేకాదశీ పుణ్యవాసరమున జెఱువులో దేవతార్చనకై పువ్వులు పంచి యిచ్చుచున్న దీతడే యని మున్ముందు పాఠకసోదరు లెఱుంగ గలరు. అతడా యిందువదన వీక్షణైకబంధముల నుండి విముక్తి నొందినది తడవుగా నతడనుభవించుచున్న పరితాపము సక్రమముగ వర్ణింప సామాన్యుల కగమ్యగోచరమన్న నతిశయోక్తి కాదు. అందాశ్చర్యమేమి? ఆ సుందరీమణి వదనారవిందము రాకాశశాంకునకు గళంకమాపాదించుచున్నది. ముంగురులు బంభరముల చెలువము దెగడుచున్నది. శిరోజములు చీకటిని బరిహాసించుచున్నవి. చెవులు శ్రీకారమును మఱపించుచున్నవి. నయనములు నళినీదళములను గని నవ్వుచున్నవి. చెక్కిళులు క్షౌజక్కి దర్పణంబుల దర్పమడంచుచున్నవి. చనులు చక్రవాకముల పొంగు జప్పడించుచున్నవి. కనుబొమలు ధనువులా- చూపులు తూపులా- నాసిక సంపెంగయా- మోవి దొండపండా- కరములు కలువకాడలా- నాభినతకూపమా- మధ్యమభ్రమా- జఘనములున్నత వితర్దికలా- ఊరువు లరటికంబములా- మీగాళ్లు తాబేళ్లా, యని విరించిక మువిటలోకమునకే గాక సామాన్యులకు సయితము మతిభ్రమణము గలుగజేయుచున్న నాయంగనామణీ సర్వాంగసౌష్ఠవము దిలకించిన నెవరు మోహపరవశులు గాకుందురు? పసపుకుంకుమయో లోపమైనది. కాని భువనైకమోహిని యన్న బూటకము కాజాలదు. అట్టి యెలజవ్వని మోహానురాగ, కృపాకలిత వీక్షణాలోచులగాన్కగా గొనిన మనభ్రమరాచారి యాపెకరిష్యందన క్రీడావిలాసముల దలచి దీన జేలియాడనిదే భుజించుటెట్లు? నిద్రించుటెట్లు? జీవించుటెట్లు?

౪

భానుమూర్తిగారు పెద్ద భూవసతి గలిగిన సుద్బ్రాహ్మణుడు. ఆయనకా భూములమీద సాలున కిరువది వందల రూప్యములాదాయము వచ్చుచున్నది. ఆయాదాయములో సంవత్సరమునకొక్క గవ్వయైనను నిలువజేయడు. దురాచారము లేమియును లేవు. సచ్ఛీలుడు మహాదాత. వేళకు వచ్చిన యభ్యాగతి నూరక పంపు నిర్దయుడు కాడు. ఎందరాపన్నులై వచ్చినను నొచ్చుకొనడు. ఆగ్రూరివారే యభ్యాగతివచ్చినను భానుమూర్తిగారింటనే మాపుచుండుటాచారమైనది. వారింటి నన్నసత్రమని తలచుగా నుపయోగించు పేరై

యున్నది. అట్టి పవిత్రనామమును గాంచపదా యెల్లు. అయిన నేమిసౌఖ్యము; పురుష సంతానము లేదు. కనులపండువుగా జూచి యానందించుటకు, దన వెనుక దనను దన వంశము నుద్ధరించుటకు దగిన వేరె మొ ముద్దుబిడ్డ ముద్భవించకపోయెనే యను విచారమాయనకు లేక పోలేదు. ఉండిన నేమి చేయగలడు? దైవమును బాలించ వలయును గదా! అందువలననే "బీద వారికి మితిలేని బిడ్డలుంట, లోకపతులకు సంతతిలేకయుంట" ననుచక్రపాణుల మాణిక్యశర్మగారి చంద్రికాంతలోని సాదృశ్యమును విస్మరించుకొని తద్విచారమునకు గొంత సదుపశాంతి జేకూర్చుకొనుచుండెను. ముగ్గురు కుమార్తెలు మాత్రము గలరు. ముగ్గురికిని వివాహములైనవి. వారిలో బెద్దవారిద్దఱు అత్తవారిండ్లకేగి వారి కాపురములను వారు శ్రద్ధతో దిద్దుకొనుచుండిరి. ఇక చిన్న కుమార్తె భర్తృవియోగానంతరము రజస్వలాదోషమును బాపుకొనిన దౌర్భాగ్యవతి. ఆమెయే మనభానుమూర్తికి భావోద్రేకము గలుగ జేసిన యమంగళయగు మంగమాంబ.

౫

మంగమాంబ కప్పటి కిరువదిరెండవ యేడు జరుగుచున్నది. పదునాల్గవయేటనే రజస్వలాటంకము రద్దు జేసికొనినది. యీ యేడుమిదేండ్లనుండియు నొకులగన్నెత్తి చూచిన పాపమున బోలేదు. కాని యీ కాలపు కవుల దృష్టిలో స్త్రీపురుష సంయోగసంయుత సౌందర్యకళాద్యభివర్ణనములే ప్రథమస్థానము వహించి యొలుగని వారికి నైతముత్సాహ పూరితమగు భావోద్రేకమును గలుగజేయుచుండ, యుక్తవయస్కయు, రూపసౌందర్య తారుణ్యలావణ్యాగరిగణ్యయు, విద్యావతియునగు మంగమాంబ మనోవేదనరహితయై యెట్లుండగలదు? హద్దు విడిచి తిరుగుదమన్న శాపశాప్పు జేరీతిని బయల్పడునో యని భయము. పునర్వివాహము జేయ బ్రయత్నింపుడని తండ్రితోగాని తల్లితోగాని చెప్పుట కా లజ్జావతి సాహసింపగలదా? పైగా, కందుకూరి వీరేశలింగముపంతులుగారి విధవావివాహప్రయత్నము లప్పుడే విపరీత వివాదగ్రస్థలములలోనున్నవి. అందులో అంతర్వర్ణ వివాహముల కసలే తావు లేదు. అట్టిచో మన మంగమాంబ మనోవేదన మాధవుడే తీరవలసియుండెను.

౬

భానుమూర్తిగారంతకు బూర్వము తన గారాబుపట్టియు, దన కూతుండ్రలో జిన్నదియు సుకుమారియునగు మంగమాంబ నింటనుంచుకొని తనకున్న యాపదాస్తి సాపేక్షము నుద్దేశించి యుండెను; కాని యాపె భర్తృవియోగిని యగుటతోడనే తమ్ముని కొమరుని దత్తత చేసుకొనెను. యతడంత బుద్ధిహీనుడు గాకపోయినను గడియ గడియకొక విధమగు దుస్తులను ధరించి నాయంతవాడు లేడని విఱ్ఱవీగుచు దిరుగుటలో నతడసామాన్యుడు. అయిదవ ఫారమువరకు కాంగ్లభాష నభ్యసించెను, గాని చిరునామా వ్రాయుటయైనను జేతగాదు. మోటారు నడపుటమాత్ర మతడు ముఖ్యముగా బట్టుబట్టి నేర్చుకొనిన విద్య

కాని మనమిప్పు డతని మంచి చేష్టల నెన్నుటతో కాలము బుచ్చుట అప్రస్తుతాంశము. భానుమూర్తిగా రతనికి వివాహము జేయ నిశ్చయించెను. తాను వ్యాధిగ్రస్తుడై యుండుటచే నాసుముహూర్తము బదియేను దినములకంటె వ్యవధి లేకుండ బెట్టించెను. ఈలోపల గోపాలునికి నగలు చేయించుటావశ్యకమై యుండెను. అనారోగ్యుడగుట భానుమూర్తిగారు కంసాలి యింటికి గడియ గడియకు తిరుగగలడా? తిరుగజాలడు. భీమరాచారిని బిలిచి దుకాణమును దన యింట బెట్టించెను. సమయమునకై వేచియున్న యతడు పరమానందమున వచ్చి పని జేయుచుండెను.

౭

భీమరాచారి భానుమూర్తిగారింట దుకాణమును బెట్టి నాలుగు దినములు గడచినవి. నాడైదవ దినము. పెండ్లి యెంతయో వ్యవధి లేకుండుట వలనను, తత్సంబంధమైన పనులను జక్క బెట్టుటకు తల్లికి మంగమాంబ తక్క మఱెవ్వరును దోడుపడువారు లేకపోవుటవలనను పాపమీ నాల్గు దినములనుండి మంగమాంబకు భీమరాచారికి నప్పుడప్పుడు కనుసంజ్ఞలే కాని ప్రియముగ సంభాషించుటకు వీలు చిక్కినది కాదు. నాటికింటనున్న వస్తువులతో వడియములు, అప్పడములు మున్నగునవి సిద్ధము జేసికొనిరి. సరకులకై వెళ్లిన బండి మఱుదినమునగాని రాదు. మిక్కిలి వృద్ధురాలగు మంగమాంబ తల్లి గత నాలుగు దినములనుండి విసుగు విరామము లేక కష్టపడి యుండుటచే బడలిక దీర్చుకొనుటకై యానాడు పదిగంటలకే భోజన మారగించి పరుండియుండెను. భానుమూర్తిగా రనారోగ్యముతో నేమూలనో పరుండియుండు టచారమైనది. కుమారుడు సరకులకై బండివెంట హాలాపురికి వెళ్లియుండెను. ఇక పైన మంగమాంబ కన్ని విధముల ననుకూలమైన సమయము లభించినది. మెల్ల మెల్లగా దుకాణము చెంతజేరి ముసిముసి నగవుతో "నాడు వైకుంఠ యేకాదశీ పుణ్యావసరమున బువ్వదానమును జేయుచున్నది మీరేనా?,, అని క్రీగంట దనమనోరథము వెల్లడించినది. ఔను మరుని యురుల నదగు నీదు వాలుజూపులం బరపి నన్ను నిశ్చేష్టునిగా నొనర్చిన నీరజేక్షణవు నీవేనా" యని యాతడు మందస్మిత వదనారవిందుడై మోహాంధకార మగ్నమానసుడై యుపలక్షించెను. ఆ యిద్దరి చూపులొకదానిలో నొకటి లీనమైనవి. ప్రేమైక సంభాషణములు బయల్వెడలినవి. మనోగతాభీష్టములు బహిర్గతములైనవి. ఇద్దఱి హృదయము లొక్కటియైనవి. "తలపై గొడుగులేని దానను. తలిదండ్రులు చిన్నదల గొట్టుకొందురు. లోకులు కాకులని యెఱిగియుంటిరి కదా! ఈ రహస్యమును గాపాడు భారము మీదయే" యని వినమ్రయై వెల్లడించినది మంగమాంబ.

# పుష్పమాల

శ్రీయుతులు చెలమయ్య శ్రీపాద రావులు (నవకవిమండలి)

---

చ॥ ఎటొ, యెటొ, రాకరాక హృదయేశ్వరుఁడింటికి నేగుదెంచి పు
క్కిటగల తమ్మిపెట్టునని కే నగవాయెనురాత్రి! అంతనె
క్కటి పోల యల్కమాన్పినను గ్రమ్మర నయ్యకుఁ జేర్చునంతలో
కటకట! తూర్పుదిక్కుతుద కాంతివహించె సవత్నికైవడిన్

ఉ॥ చెక్కిట పత్త్రిభంగముల చెల్వము వాయఁగ లేదు, కుల్కుజన్
జక్కవలందు చందనము జారఁగ లేద ధరంబునందు కెం
పెక్కిన తమ్మలంపుకుచి యించుకయేనియు వీడలేద హా
టక్కులమారి! యుగ్గితో? కటా పతికుత్తుఁడవో? తెల్పరాదటే?

ఉ॥ సిగ్గరి! చాలుచాలు! నను జెక్కిలి ముద్దిడవచ్చెదేల? ఛీ!
దగ్గరికైటకొంగును సడల్చెద వేటికి? మూఢ! ఎందుకీ
పగ్గెలు, రాత్రి నిద్రనెడఁబాసితి నీకయి వాడు పూలపై
మొగ్గున? షట్పదంబవుర! పొమ్మిక నీప్రియురాలిఁగూడఁగన్

ఉ॥ అల్లదె రాహు విద్యోదమ్ముం గాకుని మ్రింగఁగ వేచియుండెనీ
విల్లెడఁబాసి బైటఁజరియింపఁగఁబోయితి వేని, రోహిణీ
వల్లభువీడి యాతఁడు భవన్ముఖచంద్రుని నిక్కలంకునిన్
బెల్లుడికించుగాన, నిక వేఁగమె లోనికి నేఁగు మంగనా?

ఉ॥ సంపెఁగపూలమేను జలజంబున మోముకునాధరంబు చొ
క్కంపుఁజివుళ్ళ చేనలరు కల్వలచే గనుదోయి దంతముల్
సొంపగు మల్లెమొగ్గలనజుందు సృజించియు నీకు నేటికో
అంపపుగోతలన్ దెగని రాలమనంబొనరించె, కోమలీ!

చ॥ అలుకవహింపనైతి సతతైనను నలుకవహింపఁడా యెదు
ర్బలుఁడు శఠుండు నిద్రితుఁడు బాలుఁడు శాంతుఁడుగాఁడుగాని యో
వలినదళాక్షి! చంద్రవదనన్ జవరాలిని నన్ను గాంచి పూ
విలుతుని బారికగ్గమయి విహ్వలుఁడై చనె ముక్తకావ్యుఁడై

---

# ప్రతిజ్ఞ

వెంపటి నాగభూషణము గారు

సంక్రాంతి, భోగిపండుగ, తెల్లవారు జామునే లేచి శాంతమ్మ వాకిట్లో ముగ్గు వేస్తోంది. అప్పుడే బిందె బుజాన పెట్టుకొని ఒకస్త్రీ కాలువకు నీళ్లకు పోతూ ,ఏమి, శాంతమ్మా, ఊరు తెల్లవారకముందే పని అంతా చేసేస్తున్నావు " అన్నది. శాంతమ్మ తల పైకెత్తి చూచి ‹ఎవరు, నువ్వా, శేషమ్మ పిన్నీ, ఎవరో అనుకున్నాను. ఏమున్నదమ్మా ఎప్పుడైనా నేను చెయ్యవలసిందేగా, మరెవ్వరు వచ్చి చేస్తారు అంటూ తిరిగి ముగ్గువేయడం ప్రారంభించింది. „అయితే శాంతమ్మక్కా, ‹మాడూ, మీ అబ్బాయి పెళ్లి యీ ఏడు చేస్తారా!'

„ఆ,ఏమి చెయ్యడమోనమ్మా నిన్ననే పండగకి ఇంటికివచ్చాడు. మళ్లీ అయిదారు రోజులలో వెళ్ళాలట. పెళ్ళి మాటకదిలిస్తే విసుక్కుంటాడు. ఏమి చెయ్యడానికి తోచకుండా వుంది" అంటూ ముగ్గుపూర్తి చేసింది. శేషమ్మ దగ్గరగా వచ్చి ‹అయితే శాంతమ్మా, నువ్వుగూడా అట్టా అంటావేమి. కావలసినంత ఆస్తి వుంది. నిక్షేపంగా బ్రతుకవచ్చు. పైగా, కొడుకు ఏడాది రెండేళ్ళలో చేతికి అక్కరకు వస్తాడు. వాడి వివాహంగూడా చేశావంటే, కోడలు వచ్చి నిన్ను సుఖపెడుతుంది," అన్నది.

„ఆ, ఏమిటో పిన్నీ. పెళ్ళిపెళ్ళంటే ఎట్లా అవుతుంది. వాడు ఏదో పెంకెపట్టు పట్టి కూర్చున్నాడు. ఎవ్వరు చెప్పినా వినడు. ఏమి చెయ్యను పిన్నీ, నాకు అన్ని విధాల ముసలితనంలో వచ్చిపడ్డాయి, కష్టాలు. నీకు తీరుబడిగావున్నప్పుడు ఒక్కసారి వస్తూ, సావకాశంగా, చాలా సంగతులు మాట్లాడాలి' అని శాంతమ్మ అనగానే „అట్లాగే, వస్తాలే. అక్కయ్యా" అంటూ శేషమ్మ వెళ్ళింది.

(2)

చంద్రశేఖరం, యిప్పుడు చెన్నపట్నం గాష్ట్రీయకళాశాలలో బి. యే. పరీక్షకు చదువుతున్నాడు. తండ్రి చనిపోయి పది ఏండ్లయింది. అప్పటినుంచి తల్లే అన్ని వ్యవహారాలు చూస్తూ కొడుక్కు చదువు చెప్పిస్తోంది. శేఖరం, హాస్టలులో వుండేవాడు. తెలివిగలవాడవడంచేతనున్నూ, కొంచెం వాగ్ధోరణి కలుపుగోలుతనం, వుండడంచేతనూ, శేఖరాన్ని తక్కినవిద్యార్థులంతా గౌరవించేవారు. ఇతనికి యిరువదియేండ్లకన్న ఎక్కువవుండవు. వయస్సులో చిన్నవాడైనా ఊహాలు మెండుగా వుండేవి. చిన్నప్పుడే దేశాన్ని వుద్ధరించాలనే అభిలాష కలిగింది. తీరుబడి వున్నప్పుడల్లా దేశంలోవున్న సమస్యలన్నిటిని తర్కించేవాడు. పైగా, యితనికి మరొకస్వభావంవుంది తప్పైనా, ఒప్పైనా సరే, ఎదటివాళ్లు చెప్పినదానికి వ్యతిరిక్తంగాచెప్పి వాదించేవాడు "గోడ తెల్లగావుంది" అని ఎవరైనా అంటే అదినల్లదని గొంతుగ బొంగుపోయేవరకు వాదించేవాడు. అతడట్లా చెప్పుస్తూంటే బహుచోద్యంగావుండేది.

ఆ హాస్టలులో వున్న ఆంధ్రవిద్యార్థులంతా కలసి 'మిత్రగోష్ఠి' అనే ఒక సంఘం స్థాపించారు. ప్రతిరోజూ సాయంకాలం స్నేహితులంతా కలసి ఏదో ఒక సంగతిని గూర్చి ముచ్చటించేవారు. వీటిలో శేఖరం బాగా పాల్గొనేవాడు.

ఒక దినం శేఖరం స్నేహితుడొకడు 'నీపెళ్లి ఎప్పుడోయి' అన్నాడు. శేఖరం జవాబుచెప్పక పూర్వమే మరొకతను "శేఖరం మంచి అందకత్తెనిగాని చేసుకోడట. ఎంత [illegible] వచ్చేదట. మరి ఎట్లా అవుతుంది, [illegible] శేఖరం, [illegible] నువ్వు అన్నావు కాబట్టి [illegible] వవతినే పెళ్ళాడను. ఏదో అనాకారిని చేసుకుంటాను' అనేటప్పటికి, యిద్దరు స్నేహితులు పకపక నవ్వుతూ "శేఖరం. మేమేదో హాస్యానికి అన్నాము. నువ్వు గూడా హాస్యంగానే అన్నట్టున్నావు. ఇప్పుడిట్లాగే అంటావు, సమయం వచ్చేటప్పటికి కొండంమీద కోతికావాలె అంటావు" అన్నారు. శేఖరం తీవ్రంగా చూస్తూ 'సరే' మీరు హాస్యానికి అంటే అనవచ్చు కాని నేను నిజంగానే అన్నాను. మళ్ళీ చెప్తున్నాను వినండి. నేను అనాకారిని తప్ప నింకొకర్తెని పెండ్లిచేసుకోను, ఇదేనా ప్రతిజ్ఞ, జ్ఞాపకముంచుకోండి" అన్నాడు. 'ఈప్రతిజ్ఞ చివరదాకా నెగ్గిందా' అనుకుంటూ స్నేహితులిద్దరు వెళ్లిపోయారు.

"నాయనా శేఖరం నేచెప్పినమాట వినరా ? నన్నెందుకు దుఃఖపెడుతావు, ఎవరో పనికిమాలిన వాళ్ళతో ఏదో ప్రతిజ్ఞ చేశావనిమూర్ఖ పట్టుపడితే ఎట్లాగురా? అంటూ శాంతమ్మ కొడుకుతో భోజనం ముందర అన్నది. అతనుమాట్లాడలేదు.

"శేఖరం చిన్నప్పుడు నీతో అనుకున్నదే, వడ్డాదివారిపిల్ల, అది యిప్పుడు పెండ్లియీడుకు వచ్చింది. బహుఅందంగా వుంది. ముత్యంలాంటిపిల్ల. నువ్వు ఎరుగున్నదేగా! కట్నం కానుక అడిగినంత యిస్తారు. నువ్వేమి అభ్యంతరం చెప్పబోకు" అన్నది మళ్ళీ.

'అమ్మా నన్ను, ఆ [illegible] పలుకరించకు' అన్నదేమో, అన్నాను. నేను తిరుగను. నాప్రతిజ్ఞను నెరవేర్చుకుంటాను. అంటూ శేఖరం భోజనంపూర్తిచేసి నాలిగ్గోకివెళ్లాడు. తల్లికూడా అతన్ని వెంబడించి 'నాయనా నువ్వు [illegible] వాళ్ళతో అంటేఅన్నావు. ఫరవాలేదు వడ్డాదివారి శశిరేఖని పెళ్లిచేసుకో, నాన్నగూడా తొందరపడుతున్నారు. అది వదులుకొంటే లాభం లేదు. నేచెప్పినమాటవిను అనాకారిపిల్లను చేసుకొని ఏమిసుఖపడుతావు. ఇప్పుడన్నట్టు కాదు. తరువాత నీజీవితకాలమంతా దుఃఖపడుతావు." అన్నది.

ఇటువంటి మాటలన్నీ వినలేక శేఖరం "అమ్మా నువ్వు అధికప్రసంగం చెయ్యకు నాకు తలనొప్పివస్తుంది. నేనుచేసిన ప్రతిజ్ఞకు వ్యతిరేకముగా ప్రవర్తించను. నువ్వు ఎన్నాళ్ళైనా అనాకారిపిల్లనుచూడు, నేను వివాహం చేసుకుంటాను! అనిగట్టిగా చెప్పి ఏదోపనిమీద బయటకు వెళ్ళాడు.

శాంతమ్మ, సావిట్లో ఒత్తివత్తులు చేస్తూ కూర్చుంది. భోజనాంతరం శేషమ్మ

చూడవచ్చింది. అవిడని చూడడంతోనే శాంతమ్మ కంటతడిబెట్టి ' పిన్నీ ఏమిచెయ్యనమ్మా, విూబోటివాళ్ళంతావుండి సలహా చెప్పకపోతే ఎట్లాగమ్మా నేను ఎన్నిమాటలు చెప్పినావినలేదు, సౌందర్యముగల పిల్లని చేసుకోనే చేసుకోడుట. అనాకారిని కట్టుకుంటాడుట ! పిన్నీ, యిదిఎక్కడైనా వుందీ, నువ్వు కాస్త వాడిని మందలిస్తూ " అన్నది దీనంగా.

శేషమ్మగూడా కొంతపత్తితీసివత్తులు చేస్తూ ' అక్కయ్యా ' అని పూర్వొకని కొంతతడవు దీర్ఘంగా ఆలోచించి ' శేఖరం పట్టిపిచ్చిధోరనిపడ్డాడు. మాటపట్టింపేగాని మరేమిలేదు, నేను ఒకఉపాయంచేస్తాను. నువ్వు మాత్రం నేచెప్పినట్టు చెయ్యాలి. సాయంకాలం శేఖరం యింటికిరాగానే, " వడ్డాదివారింట్లో వంటమనిషికి, ఒకకూతురు వున్నదట. అది చాలాఅనాకారి, పోని ఆ అమ్మాయినిచూడు నీకిష్టమయితే చేసుకుందువుగాని " అనిచెప్పు తక్కినతతంగమంతా నేను నడుపుతాను చూద్దుగాని నాతెలివి " అన్నది. శేషమ్మయందు శాంతమ్మకు చాలామంచి నమ్మకముంది. అందుచేత సరే, నువ్వుచెప్పినట్లే చేస్తాను ! అన్నది.

ఉదయాన్నే, ఒకస్నేహితుడిని తీసుకొని శేఖరం పెండ్లికూతురిని చూడడానికి బయలుదేరాడు. వారిద్దరు వడ్డాదివారింటికి వచ్చారు. వాకిట్లోవారిని యింటియజమాని కలసికొని లోపలికి తీసుకువెళ్ళారు. ఆ అత్యున్నత భవనములోని అందమైన గదుల లోంచి వారు వెళ్లివెళ్లి ఒకగదిలో నిలువబడ్డారు. యజమాని వారినిద్దరిని ఒకతివాసీపైనకూర్చుండబెట్టి లోపలికి వెళ్ళారు. ఇంతలో ప్రక్కతలుపు తెరచుకొని, పన్నెండు వత్సరముల వయస్సుగల, లేబ్రాయపు సౌందర్యరాశివచ్చి వారికి ఫలహారముల నందించింది. ఆమెను చూడడంతోనే శేఖరానికి దేహంపులకరించింది. ' ఆమెతనకు లభిస్తే...అని మనస్సులో అనుకొని, ప్రతిజ్ఞకు భంగంవస్తుందని వెంటనే నాలుకకరచుకొన్నాడు కొంతసేపటికి తిరిగి ఆకన్యయేవచ్చి వీరికి తాంబూలంయిచ్చి, పన్నీరు చల్లింది. ఆసమయంలో శేఖరం ఆమెను పైనుంచి క్రిందదాకా పరిశీలించి లోలోపల ఉవ్విళ్ళూరాడు. కాని పైకిమాత్రం శేషజు! చిన్నప్పుడు ఆమె, తను తొక్కుడుబిళ్ళ ' ' జోజోపుల్ల ' ఆడిన దినాలు ఏమయినవో! ఆమెతో మాట్లాడి ఆరేండ్లయింది. అంతా కొత్తగావుంది.

మరికొంతసేపటికి, ఆకన్యక, మరొక కన్యని తనవెంటతీసుకువచ్చి వీరికి ఎదురుగా కూర్చుండబెట్టింది. శేఖరం కన్నెత్తిచూచాడు. ప్రయత్నంగా ముఖమును త్రిప్పివేశాడు. ఆపిల్లని చూడడంతోనే అతనికి ఒకవిధమైన భయంకల్గింది. అనల్లనిముఖం, లావుపెదవులు, పొడుగుపళ్ళు, పొట్టిపెండ్రుకలు, అర్ధణాఅంతబొట్టు, వంకరకాలూ, యివన్ని అతనుచూడలేకపోయినాడు. ఇంతలో ఆయజమానిగూడవచ్చి " శేఖరంగారూ, ఈమే పెండ్లికూతురు. చూడుకోండి అన్నాడు. " శేఖరం దించినముఖం పైకి ఎత్తలేదు. ప్రక్కనున్న స్నేహితుడు యితనికేసి చూస్తున్నాడు. కొంతసేపటికి శేఖరం ధైర్యంగా ' అమ్మాయీ నీపేరేమిటి ? అని అడిగాడు ' హ హ నాపేరా! వెం

కాదు కాదు వెంకమ్మా! అన్నది, ఆవధూత. పెండ్లికూతురుని యింట్లోకి పంపించారు ఆమెను వెంటబెట్టుకొనివచ్చిన సౌందర్యవతి గూడావెళ్ళింది శేఖరం వివరచూపు చూ కాడు, తరువాత యజమాని యిట్లాఅన్నాడు " శేఖరంగారూ, ఈఅమ్మాయి మాయింటి వంటకత్తెకూమార్తె వాళ్ళుబీదవాళ్ళు అవ డంచేత, ఆపిల్లపెళ్ళిగూడా నేనేచెయ్యాలసి వచ్చింది, పిల్లమీకునచ్చిందని తలుస్తాను. శేఖరం దీర్ఘాలోచనలోపడ్డాడు, ఆఅనాకారి పిల్లను కలలోనైనా ఎవ్వరుచూడకోరరు, అట్టిదీన్ని అతను ఎట్లాపెళ్ళిచేసుకోగలడు, చేసుకోకపోయినాడా, ప్రతిజ్ఞకు భంగం వస్తుంది ప్రతిజ్ఞమాట అట్లావుండగా, మరు దినంనుంచి, స్నేహితులంతా ఎగతాళి చేస్తారు, పైగా అతనిమాటలనులక్ష్యపెట్టరు. మహావిషమసమస్య సంఘటించింది, శేఖరం వివాహం ఒప్పుకోతప్పిందికాదు. ఎక్కువ కష్టంతో, సరే, అన్నాడు, స్నేహితులిద్దరు యింటికి వచ్చేశారు.

ఆరాత్రి శేఖరానికి నిద్రలేదు, తన గది తలుపు బిగించి ఒంటరిగా మేలుకొని కూర్చున్నాడు, ఏమేమో ఆలోచించాడు, కాని ఏమి చేయగలడు? ఎన్నడో నేదోమాట పట్టింపుకోసం, అనాకారిపిల్లను తప్పమరొక రిని చేసుకోనన్నమాట నిజమే! కాని అది అంతగా ఆచరణలో పెట్టవలసివచ్చే టప్ప టికి అతనికి కష్టం కల్గింది. కాని ఎట్లా తప్పించుకోగలడు? చెప్పేదొకటి, చేసేది మరొకటి. అయితే సంఘంలో అతనికి ఏమి స్థానం వుంటుంది? ఎప్పుడో పౌరుషంతో అన్న మాట కోసం, జీవితకాలం అంతా అనుభవించాలి. ఏమి పాపకర్మం!

ఆ! ఏమి పెండ్లికూతురు! మర్కటం కన్న కనాకష్టంగా వుందే! ఎట్లు? ఆమెను భార్యగా గైకొని కాపురము చేయుట, ఎట్లు? ఆమెను తోడ్కొనివచ్చినకన్యయో! వర్ణించుటెట్లు? ఒకానొక కాలమందు వారి రువురు కలసి మెలసి యాడిన దినములు మరపునకు వస్తాయా? శశిరేఖ సాక్షాత్తు శశాంకుని రేఖవలె వుంది! ఆమెయే భార్యయైతే! అయిన, వెంకమ్మను వివాహం చేసుకొంటానని మాట యిచ్చినాడే! వెంక మ్మ! అబ్బే! అది ఏమి పేరు? శశిరేఖ! హా, ముత్యములు, కెంపులు, వున్నవి, ఆపేరులో సరే అని యొప్పుకొన్నాడే ఇప్పుడు కాదం టే? ఛీ తప్పు అట్లుకాదు. ఎంతపాపము! నేనెందుకు చేసితిని. ఆప్రతిజ్ఞ, ఏమో? అప్పుడెన్ని ప్రేమానుబంధములు నన్ను బం ధించలేదు, ఆ తొందరలో వాగ్దానము చేశాను. పొరబాటు! నేను చేసినది శుద్ధ పొరబాటు. అవ్యక్తపువని. నాకర్మం నేనే అనుభవిస్తాను;

ఇట్లా అనుకొన్నాడు చంద్రశేఖరం. అతని హృదయాంతరాళంతో జరిగిన సం క్షోభం వూహించవలసిందే!

(౨)

వైశాఖమాసం. ఊళ్ళో చాలాచోట్ల పెళ్ళిళ్ళు అవుతున్నాయి. శేఖరం అంత కంతకు కృశిస్తున్నాడు: అతని పెళ్ళి యిం కారెండురోజులు మాత్రమే వుంది. వర్ధాది వారు పెళ్ళికి అద్భుతంగా పని చేస్తున్నారని అతను విన్నాడు. ఈపిచ్చిపెళ్ళికి యింత ఆర్భాటము లేకపోతే ఏమి, అనుకొన్నాడు. తన తల్లి శాంతమ్మకూడా, కావలసిన పెళ్ళి పనులన్ని చేయించింది. కాని పెళ్ళికొమార్తె

విషయం శేఖరంతో ఎవ్వరూ మాట్లాడలేదు. అతనికది ఆశ్చర్యంగానే వుంది. కాని అతనుమాత్రం ఆసంగతి ఎట్లా కదిలిస్తాడు. తలవంచుకొని పూర్తిగా వూరొకున్నాడు.

తెల్లవారు జామున మూడున్నర గంటలకు లగ్నం శేఖరం యింటికి. బంధువులు, స్నేహితులు, అంతా వచ్చి నిండిపోయినారు. కాని అతను మాత్రం ఎవరినో కలియక, ఏకాంతముగా ఒక గదిలో కూర్చున్నాడు. పెండ్లికొడుకు అట్లావున్నాడేమి అని అంతా అనుకున్నారు. తాను చూచి వలచిన పిల్లయేగా, యింకా గుబులు ఎందుకు?! అన్నారు కొందరు, కాని ఎవ్వరికీ నిజం తెలియదు. శాంతమ్మమాత్రం, కారణం మనసులో గ్రహించుకొని, మరేమి ఫరవాలేదు అనుకొంది. ఇక ఒక గంటలో చంద్రశేఖరం తన జీవితమందొక అవ్యక్తపు పని చేయవలసి వుంది.

వరుడు పల్లకిలో కూర్చున్నాడు. ఊరేగింపు ఊరి వీధులగుండా పోయి వధువారివాకిట్లో ఆగింది. పెండ్లి కొడుకుని లోపలికి తీసుకుపోయి పెండ్లి పీటలమీద కూర్చోపెట్టారు, పావిడి అంతా జనసమ్మర్దంగావుంది. నౌబతు సన్నాయి బ్యాండు బూరలు ఒక్కమారు మ్రోగినాయి. పొడుము పట్లతో బిగిసిన ముక్కులతో బ్రాహ్మణోత్తములు లాగి లాగి సామవేదము చదివారు. శేఖరం చెయ్యిపట్టుకొని పురోహితుడు వధువు మెడలో మంగళసూత్రం మూడుముళ్ళు వేయించాడు. "పుత్రపౌత్రాభివృద్ధిరస్తు. అచంద్రతారార్కం వంశాభివృద్ధిరస్తు" అన్నారుకూర్చున్న పెద్దలంతా తెరబట్ట పట్టుకున్న విప్రులు మెల్లగా తెరఎత్తారు. శేఖరం ముగ్ధుడు అయినాడు ఆశ్చర్యపడ్డాడు. తన ఎదుటనున్న వధువు ఎవ్వరు. ఆ. నిశ్చయముగా శశాంకునిబోలు శశి రేఖయే! స్వప్నమా" లేక వాస్తవమా అతడట్లా వుండగా "మీప్రతిజ్ఞ ఏమైంది అన్నది శశిరేఖ మృదుమధురముగా."



# కర్ణుని జననము.

గర్భాం అప్పారావుగారు బి. ఎ.

---

చ॥ సదయుత నాకొసంగెఁ బరిచర్యకు మెచ్చి మునీశ్వరుండు సీ
సదమలమంత్ర; మిందలి నిజం బెటులైనఁ గనుంగొనన్ వలెన్
మది నెవనిన్ దలంచి తగుమంత్రముఁ జెప్పుదునంచుఁ గాంతయున్
నిదురను జెందె నాత్మయును నిద్దుర నొందక చంచలింపఁగాన్॥

ఉ॥ అంతట శీతమంద మలయానిల మల్లన మేను సోకియా
కుంతిని మేలుకొల్పెనిదిగో నరుదెంచు దినుండటంచునా
కుంతికిఁ దెల్పు రీతిగను కొక్కొరొకో యని కోడికూసెనో
కుంతికి మేలు కల్గునని కోయని కోయిల మ్రోసెనయ్యెడన్॥

ఉ॥ నాతియు వానిమ్రుచ్చి శకునంబులె కాయని యెంచు; నిట్టి యా
చేతలు మంచి వౌనియని చేతమునందుఁ దలంచు నేటికిన్
లాతులు స్నానమాడఁగఁ జనన్ దరియా యెను యంచు వీథి ది
క్కే తలవంచి కాంచు! నట నెవ్వరు లేమికి సంతసించుచున్॥

ఉ॥ జాబిలి నవ్వు నెమ్మొగము చల్లని నీటను జక్కఁ జేసి యా
పైబహు చిత్రవాజిలుగు పావఁడ గట్టి కచంబు దువ్వి గా
రాబము మీరఁ బొట్టి తనరన్ దిలకంబు పెట్టి లక్ష్మియో
నాఁ బడి కుంతిభోజ నరనాథుని గాదిలిపట్టి వెంటనే॥

మ॥ కనియెన్ మున్ దనరాక సూర్యుని కెఱుంగన్ జేయ యత్నించునో
యన నొప్పారెను పావనాత్మ సవపుల్లాబ్జాననన్ మీన నే
త్రను శైవాలకచన్ సురత్నగుణజాతన్ సైకతశ్రోణినిన్
ఘనచక్రస్తనిఁ దానొకానొక నదీకాంతా శిరోరత్నమున్॥

చ॥ దినకరబింబమంతట నదిన్ గని సిగ్గున మోముఁ ద్రిప్పెనా
దినకరుఁ డామెఁ గాంచి తన దీర్ఘకరంబులఁ జెక్కుటద్దముల్
గొనబుగ నొక్కఁగాఁ దివురన్ గోమలి బెగ్గిలె నంత నామెతో
నినుఁడు నదీ కింత వెఱపేల యటంచును జేర్చె నక్కునన్॥

చ॥ కొడుకునుగాంచుఁగంచుకము; కొంగెకలిం బఁగనెంచు నద్దె సలీ
వడివడిఁ జూచు, సూర్యుఁగనుఁబైవలి సిగ్గుపడుఁ; గుమార! నీ
విడువవలెఁ గదా యను నవీనసురూపముఁ గాంచికులు ... న
య్యెడజడ దారి దూఱుఁ దన కేది వివేకమటంచు నెంచుచున్
ఉ॥ సారసమిత్రబింబమ! వసంతసమాన! కుమార! కర్ణ! సం
సారసముద్రమీదవలె సంతతమంచును దెల్పు రీతి నా
సారసనేత్రి పుత్రునొక చందువ నుంచియు నేటడించె ని
స్సారలు స్త్రీలు జంకుమరి - సాహసకృత్యము లాచరింపఁగాన్

# మోహతృష్ణ

దామరాజు వెంకటరమణకవిగారు (కవిమండలి)

చిన్నిచంద్రుఁడు మింటిపై చేరు వేళ
పిల్ల వెన్నెల లవనిపై వెలయు వేళ
మందమారుతమల్లన జరగు వేళ
కుహూకుహూయని కోయిలకూయు వేళ
రమణనుప్పొంగునట్టి యారామసీమ
మల్లెపొదరింటిలోపల తెల్లనైన
విమల నెలరాలనొప్పిన వేదిపైని
వేఁగూర్చుండి మురళిపై మోవినాని
సొంపునింపెడిగతిని వాయింపుచున్న
ప్రణయగీతిక మెల్లనఁబాడుచున్న
ముద్దుకృష్ణునిఁజూచి నే మోదమెసగ
పోయి కౌగిలిప్రార్థించి పూలమాల
కంఠమందున తగిలించి కౌగలించి
తళుకుఁజూపుల నేత్రముల్ బెళుకుచుండ
మోహనంబైనమూర్తిని మోమునెత్తి
ప్రక్కఁజూపుల బ్రసరించి చక్కఁజూడ
పులకరించెను దేహంబు పూర్ణముగను
చిత్తమందున భీతిచే సిగ్గుజెంది
చేరి వెనుకకు నేఁబోవ చిన్నికృష్ణు
డపుడుఁబల్కెను నన్ జూచి యతివమిన్న

నిన్నుఁగూడగ దలచి నే నిడకువచ్చి
యింపుదళుకొత్త మురళివాయించుచుంటి
సొంపునింపెడి కృతులు నీకింపుగదుర,
కాంతరో! రమ్మ"నుచు నాదుకొనఁబట్టి
చేరదీసియు దగ్గిర చెక్కిలొత్తి
ముద్దరాలవెయంచు బల్ ముద్దులుంచి
సుద్దులెన్నియో చెప్పినన్ గద్దెఁజేర్చి
మోహపుం బొమ్మమాయని ముద్దుగొమ్మ
మధురమైయొప్పునాకు నీయధరపాన
మంచు కౌగిలింతలో నిరీకించె నన్ను
అంతలో శశిమింటిపై నంత యుండె
కాంత యేకాంతవాసంబు కనగరాక
అంచుదలపోసె నేమొకో యాత్మయందు
మినుకుమినుకంచు తారకల్ మెరయుచుండె
అంధకారము లెల్లడనలముచుండె
లలితసౌరభ్య కుసుమముల్ రాలుచుండె
ప్రణయగీతిక ప్రకృతితాఁబాడుచుండె
మోహసాగరమందున మునిగియుండ
లీలగడపితి గోపాలబాలుతోడ

# నీలజాబులు

శ్రీ॥ ఉ॥ శాస్త్రిగారు ఎం.ఏ.

బ్రహ్మశ్రీ వేదమూర్తులైన శ్రీగిరి ఉమామహేశ్వరశాస్త్రి అన్నగారికి.
చెల్లెలు నీలా సుందరి అనేక నమస్కారములు.

ఉభయకుశలోపరి

అన్నా !

ఇదివరకు మీరెన్నాళ్లో గానో నాజాబులు ప్రకటింతుమనుచు నాయనుమతి యడుగుటయు నేను వలదని సగౌరవముగా తమతో మనవిచేయుటయు తటస్థించుచున్నది. ఇప్పుడు నేను తమకు నామరది రామారావు చమత్కారముగా వ్రాసిన యొక చిన్న వ్యాసమును పంపించుచున్నాను. ఇది తమరు ప్రచురించవచ్చును. దీనిని పాఠకులెట్లు చవిగొందురో చూచి నాయుత్తరములను ప్రచురించుటకు నేనను మతించవచ్చును. కావున నిది తమకడకు పంపుకొనుచున్నాను. నాయుత్తరములకన్న రామారావు ఈ వ్యాసము చాల మడుంగులు బాగుగానున్నదని నాతలంపు. నాజాబులు లోకము మెచ్చునో మెచ్చదో తెలిసికొనుటకు నిది మచ్చుముక్కయని నాయూహ. తరువాత తమ చిత్తము. ఇక్కడ అందరు క్షేమము. తమ క్షేమము వదినెగారి క్షేమము వ్రాయించ కోర్తాను.

గోనపీడు.
పుష్య బ॥ ౭ సోమవారము }

చిత్తగించవలయును.
నీల.

పూర్వాచారాలతిక్రమించి విశాల హృదయముతో ప్రపంచకమును చూడవలెనన్నచో క్రాపింగు ఆసాధనకు మొదటి మెట్టు. క్రాపింగు లేనివాడు ఇంగ్లీషు చదివియు లాభము లేదు. పూర్వకాలాలలో చూడామణి అని యుండెడిదట. అది క్రాపింగేనని నామిత్రుని యొకని యభిప్రాయము. అందుకనే నాటకాలల్లో వేషాలు వేయు వాళ్ళుందరు క్రాపింగు లేకుండ నుండరట. ఈమధ్య నాటకములో వేషము వేయుచు నొక బ్రాహ్మణకుర్రవాని తండ్రి చనిపోవుటవల్ల నతని క్రాపింగు అతని యిష్టము లేకుండగనే స్మశానముల దగ్గర నెవడో ఒక మంగలి తన కత్తి పదును చూచుకొన్నాడట. వానికోస మతడిప్పటికిని వెదకుచునేయున్నాడు. ఆపదకొండవ రోజునే అతడు చిత్రనళీయములో సుదేవుని పాత్ర ధరించవలసి వచ్చినది. అతడప్పుడు క్రాపింగు లేకుండ వేషమెట్లు వేయుటయని విచారించి చివరకొక విగ్గుతో పని జరుపుకున్నాడట అప్పటినుంచి మాగ్రామములో నందరికిని క్రాపింగంటే చూడామణి "అనే అభిప్రాయము ధృవపడినది.

మా పూర్వులందరు వంశపాయము

మీద బ్రతికిన వాళ్ళు. నన్ను ఇంగ్లీషు చదువుకొనుటకు పంపించుటకు మావాళ్ళకు భయము వేసినది క్రాపింగు పెట్టించుకొందునేమోనని. నేను బి. ఎ చదివినప్పటికి ఒక క్రాపింగు లేదు. బోడిలు లేవు. (మధ్య రెండుపాయలు పెంచి మానాన్న తిట్టగా తీసివేయించితిని). అందుకనే మాబంధువులందరు నన్నుదాహరణగా చెప్పుదురు. "వాని చూడు. ఇంగ్లీషు చదువుకుంటే మాత్రం మాలవాడికి మల్లే క్రాపింగు పెట్టాలా? అని

ఇదికాకుండ రసజ్ఞులు శృంగారవేత్తలు సౌందర్యమునకు క్రాపింగు ముఖ్యసాధనమని యుపన్యసిస్తున్నారు. కాదని యెవరయినా వారి ప్రజ్ఞాదికములు తెలియని వారు వాదించినచో దర్పణము (అద్దము) లో వారి ముఖములు ప్రతిఫలింపించి వారిని నిరుత్తరులుగా చేయుచున్నారు. వారును నీయద్దములును పరదేశములనుండి దిగుమతి యయినవే యని తెలుసుకొని యూరుకొనుచున్నారు. ప్రస్తుతము గుంఫితమగుచున్న "ఆంధ్రవిజ్ఞాన సర్వస్వము"లో "చూడామణి' అన్న శబ్దము వచ్చినపుడు దానికి క్రాపింగు "అన్నది పర్యాయపదమని యుదహరించి ప్రస్తుత నాగరక లోకము యొక్క మన్ననలకు తత్సంపాదకులు పాత్రులగుదురు గాక యని వినయపూర్వకముగా మనవిచేయుచున్నాను.

ఈ యభిప్రాయములోనున్న యాథార్థ్యము తేటతెల్లము ఋజువు చేయుచున్న యొక్క చిన్న యుదాహరణమును చెప్పెదను చిత్తగింపుడు. దివ్య పురుషులు, దేవతలు మొదలగువారు పూర్వాచార పరాయణులు నెత్తిన పెట్టుకొను గోష్పాదమంత జుట్టును వరాహపుచ్ఛమని వ్యవహరించుచున్నారు (దీనికి pig tail) పందితోక అని పేరు. పందితోక యని వ్రాసిన నాగరికుల మనస్సు నొచ్చునేమోయని దీనికి సంస్కృత నామమిచ్చినాను) ఈదివ్య పురుషులు దేవతలు, నెవరని యందురా? యూరోపాదేశీయులు. వేదములు శాస్త్రములు పురాణములు శ్వేతద్వీపవాసులు విష్ణుభక్తులని యచటనే విష్ణుమూర్తి నివసించుచుండునని చెప్పుచుండగా యూరోపా దేశీయులే వారు కారని కూడ వాదించువారు మన దేశములో జన్మింతురని నమ్ముటకు కూడ వీలు లేదు.

నూతనములును దేశాభివృద్ధి సూచకములు నగు నీసౌందర్యమునుగూర్చిన యభిప్రాయములు గ్రంథములు చెప్పకుండ పత్రికలు ఘోషించకుండ మన దేశములలో పల్లె పల్లెకు వ్యాపించి అగ్రజాతి బ్రాహ్మణుని మొదలు పంచముల వరకు సార్వజనీనముగా నాచరణలో పెట్టబడుచున్నందులకు కారణము మనదేశీయుల చురుకుదనమును తెలివి తేటలున్నవనియే నానమ్మకము. మహా ఋషులు పుట్టిన మన దేశములో ఏమాత్రము సౌందర్యగ్రహణము కలుగబోదని యెవరనుకొనగలరు? ఇది విచారించినకొలది యుచ్చజాతులు మన దేశములో నీచజాతులను తక్కువగా జూచుచున్నారన్న వాదు అయథార్థమనిపించుచున్నది. ఒక జాతి పరిణామమంతలో రాదు. చాలకాలము తీసికొనును. ఇప్పటికి మన దేశములో నన్నిజాతులవారికి బహిర్వేషము సమానముగా కుదిరినదని చెప్పవచ్చును. ఇదే క్రమక్రమముగా అత్మవరకు వ్యాపించి మనలను ప్రపంచమున

నాదర్శపురుషులనుగా చేయగలదు. ఇప్పటికే కొన్నికొన్నిచోట్ల సీమైక్యమాత్మౌ(పరకు కూడ వ్యాపించినదనుటకు సందేహము లేదు. ఇదివిశ్వమానవ సౌభ్రాతృత్వమునకు వసంత కాలము.

మొదటినుండియు క్రాపింగు అని వ్రాయుటచేత సౌచిత్యపరిమాణవేత్తలగు మనదేశీయులు ఒక్క క్రాపింగునుగూర్చియే యీవ్యాసమంతయునని పొరపాటు పడరని నాకు తెలియును. సూటులేకుండ క్రాపింగు, బూటులేకుండ సూటు నిట్టి అనౌచిత్యము సౌందర్యమెఱింగినవారు చేయునవి కావు. అనౌచిత్యమనునదిమనదేశములో కంచుకాగడావేసి వెదకినను కానరాదని మా నిశ్చితాభిప్రాయము. "ప్రమాదోధీమతామపి" అని అక్కడక్కడ నాటకరచయితలలోను పెద్దపెద్ద అభినయవేత్తలలోను చెదురుగా నున్నను మనమంత పాటించము.

కాని యీయాచరణలో నచ్చటచ్చట కొన్నిలోపములు మాత్రము కనబడుచున్నవని సన్ననిగొంతుకతో నాప్రక్క నున్నమిత్రునితో చెప్పుచున్నాను. అది యొక పెద్దతప్పుకాదు. తప్పైనను మనలో మనము చెప్పుకొనవచ్చును కదా. అదియైనను నెదటివారు వినకుండ నాయెను. ఇంతయందముగల క్రాపింగును కూడ కొందరు కొందరు పల్లెటూరి ధనవంతులు సౌందర్యవిహీనముగ చేయుచున్నారు. కాని ప్రత్యేకగౌరవములేకుండ చేయుటలేదు. కొందరు తలమీద సోపానములు చెక్కించి తాము మేడలుకలవారమని కొందరు తలమీద గిన్నెలుబోర్లించినట్లు చేయించి తాము బంగరు గిన్నెలలోగాని భోజనము చేయువారము కాదని ధ్వనించుచున్నారు. అది వారియూహలకు సంబంధించినంతవరకు బాగుగనేయుండునుగాని పట్టణములకువచ్చినపుడు కొంచెము ధ్వని శూన్యతయేర్పడుచున్నది. మాయుద్దేశ్యమేమనగా మఱల నిందులో ప్రత్యేకత లేకుండవిశ్వజనీనముగా నందరు నొక్కరీతిగా నుండవలెనని. అదియుగాక నీవిషయమున మనకు పరిపక్వతయబ్బువరకు తెల్లదొరలను ఆదర్శముగా నుంచుకొనవలెను. ఆ తెల్లదొరలు కూడ మనదేశమునకు వచ్చు రెండవరకము గాదు. అసలు ఆడంగువారి యాచారములే యచు కరణీయములు స్వచ్ఛములును

అందుచేత మనదేశీయులు అమెరికా యింగ్లాండులకు పోయినవారు బారిష్టరు మొదలగు పరీక్షలుచదివి వచ్చి వెంటనే తమ వృత్తులలో ప్రవేశించక సంవత్సరము రెండుసంవత్సరములు దేశముతిరిగి పల్లెటూళ్లలో సీమదొరల క్రాపింగులు డ్రెస్సులు ఆచారములు వీనిని గురించి యుపన్యాసములిచ్చినచో దేశమునకు చాల మేలు చేసినవారగుదురు. అట్లయినచో వారు కూడ మొగమాటము చేతనైనా వ్యాజ్యములు వచ్చినప్పుడు తమ దగ్గరకే వచ్చుచుందురు.

అసలు మనదేశమునుండి కొందరు ఉత్సాహముగల యువకులను పరిస్కాలరు షిప్పులమీద నాదేశములకు నీపనులు నేర్చుకొనుటకు పంపించినచో వారిమూలమున దేశమునకు మిక్కిలి యుపకారము జరుగును. ఇట్టిపనులు దొరతనమువారు చేయుదురని నమ్మకము పెట్టుకొనరాదు. వారి దేశములలో మనలనుగూర్చి అనాగరికులని

చెప్పువారు మననాగరికతకు వారు సాయపడెదరన్న స్వరాజ్యవాదు లెవరును విశ్వసించలేరు. అదియుగాక మనదేశపు మంగలి మహాజనులను పంపించుటయుకూడ తగదని నాయుద్దేశము. ఏలనన్నచో మనదేశపు మంగళ్ళదేహములలో తరతరములనుండి అనాగరకులైనవారి తండ్రితాతలరక్తమే ప్రవహించుచుండుటచేత వారు ఎంతశ్రమపడినను నొక్కులకొడవళ్ళవంటి కత్తులు సాఫీపడవు. ఆకత్తులకక్కులే క్రాపింగులో ననూకనపడును. ఆవేళకు వారియిండ్లదగ్గర కుండబొచ్చెలు జ్ఞాపకమువచ్చి వారవియే అందరి నెత్తినను బోర్లింతురు. ఇది మనము నవ్వవలసిన విషయముకాదు. కోపగించవలసిన విషయముకాదు. అదివారి దారిద్ర్యము వలన వచ్చిన దోషము. వారియిండ్లలో బొచ్చెలు లేకున్నయెడల వారికవి జ్ఞప్తికే రావు కనుక యీమహాకార్యార్థమై యువకులు నడుములుకట్టి వారంతటవారేవచ్చి యీదేశోపకారార్థము తాము పనిచేసెదమని చెప్పవలయును. ఇదియంతయు దేశములో సౌందర్యజ్ఞానము వృద్ధిచేయుటకు.

ఒకగొప్పభావము కోసము ఎంతమంది మానవజీవితచరిత్రలో తమ నెత్తురు లోడ్చలేదు. ఆశ్లీవీరిసాహసములును భావిభారత వర్ష జీవితచరిత్రలలో స్వర్ణమయాక్షరములతో చెక్కబడును.

పైగా సౌందర్యమనునది మనమంత చులకనగా చూడవలసినదియుంగాదు. 'యాదృశీ భావనాయస్య సిద్ధిర్భవతి తాదృశీ' అను వాక్యము పండితులకు జ్ఞాపకముచేయునంతటి అవినయములేదు. నాదగ్గర ఈమధ్య మామిత్రులొకరు వ్రాసినట్లు క్రొత్తులను పూజించిన క్రొత్తులే పుట్టుదురు. ఈ సందర్భములో బాలకృష్ణుని పూజించుటకు మాకుసందేహముకాదు కానిఅతడు నల్లనివాడని తెలిసికొన్నప్పుడు కొంచెము మనస్సుచివుక్కు మనుచున్నది. అయినను అదియంత ప్రమాదముకాదు. కొంచెము పీమసున్నపు పూతయిచ్చినచో నీదోషము పరిహారముకాకపోదు. కావున మనజాతియంతయు సౌందర్యము జాతి కావలెనన్నచో నీపైనచెప్పినయంశములన్నియు ననుష్ఠించవలెను. పూర్వాలాక్షణికులివన్నియు విచారించియే సౌందర్యము శృంగారరసమునకుద్దీపనవిభావముగా చెప్పియున్నారు రససాధనకు సౌందర్యముప్రధానము రసోవైబ్రహ్మ అని శ్రుతులు మ్రోగుచున్నవి.

ప్రస్తుతము కొందఱాధునిక కవులు సౌందర్యజ్ఞానాభివృద్ధికై పాటుపడుచున్నారని మాకు తెలియును. శబ్దములో సౌందర్యమెఱిగి ప్రయోగించుకవులీ విషయమున తమశ్రద్ధ జూపిరేని దేశమునకు మంచి రోజులువచ్చినవని చెప్పవచ్చును. అట్టివారి కార్యమంతయు నెత్తినవేసికొని పనిచేసినచో విజయము చాల సమీపములోనున్నదనియే చెప్పవలెను. కవులిట్టి కార్యములకు దగ్గరనికూడ మాకపనమ్మకములేదు. ప్రపంచకచరిత్రలో కర్మవీరులయిన కవిశిఖామణులు కొరతగాలేరు. బైరన్ (Byron) అన్న యింగ్లీషుకవి గైటె (Goete) అంతవాని చేత కవిత్వము నమెప్పువడసి గ్రీకుజాతివారు తురుష్కులచేత స్వాతంత్ర్యము గోలుపోవుచుండగా యుద్ధరంగమునకు వారిసహాయార్థముపోయినాడు. పాపముత్రోవలోనే చని

పోయినాము దైవమునకు మనమేమిచేయ గలము.

సూర్యుని దివ్వెతోఁ జూపినట్లు ఇంతప్రశస్తమైన విషయమును పదేపదే చెప్ప నక్కరలేదు. కానికొందరు భావనాశక్తి తక్కువగలవారు ప్రత్యక్షముగా రోజును జరుగుచున్న సంగతులనుండి యుదాహరణములిచ్చువరకును తృప్తిపడలేరు. వారి కోస మీక్రింది సంగతు లుదాహరించుచున్నాను.

నేనును నామిత్రుడొకడును ఒకనాటి సాయంకాలము రైలుస్టేషనుకు వెళ్ళినాము ప్లాటు ఫారంమీఁదికి పోవలెనని మాతలంపు. నాస్నేహితుడు బి. ఎల్. క్రొత్తగా పరీక్షయియవచ్చినాడు కాని మేమిద్దరమును నాగరికతలో కొంచెము వెనుకంజ. మాయిద్దరికి క్రాపింగులు లేవు. అందుచేత టిక్కట్టుకలెక్టరు మమ్ములనులోనికి పోనియ్యలేదు. ఇంతలో నొకడు క్రాపింగు నిండ వ్యాసిలైను పులుముకొని మొగమున బొట్టులేకుండ పాతసిపాయిలకోట్లు బజారులో నమ్మునవియొకటి తొడుగుకొని కాళ్ళకుపెద్దవైనబూట్లు జారిపోవుచుండగా మాటిమాటికినిలచి కాళ్ళతో తెచ్చుకొనుచూ వచ్చుచున్నాడు. వానినిచూచి టిక్కట్టుకలెక్టరు సెల్యూటు చేసి త్రోవయిచ్చినాడు. క్రాపింగులో నంతగౌరవమున్నది. ఇప్పటికైనను మా పాఠకులు మామాటలు యథార్థములని నమ్మెదరనుకొందును. అదియును గాక యెంతమంది పెద్దమనుష్యులు రైళ్ళలో ప్రయాణములు చేయునపుడు తాముకూర్చున్న బళ్లలోకి యితరులు రాకుండ నుండుటకు దొరటోపీలు దగ్గరనుంచుకొని క్రాపింగులు దువ్వుకొని కూర్చుండుటలేదు. ఇట్టి వంటిగౌరవము రైళ్ళలోమాత్రమేకాదు. ఒక నాడు నేను కాఫీహోటలులో దూరముగాఁ గూర్చున్నాను. ఇద్దరు లోపలికివచ్చినారు. ఒకడు క్రాపింగుమనిషి అతనిక్రాపింగుబొచ్చె క్రాపింగు జాతి ఒక పాత కోటు తొడుగు కొని దానిపైనఁ నెక్టై (neck tie) కట్టి చేతులో సన్నని పేపబెత్తము పుచ్చుకొని వచ్చినాడు. రెండవ ఆయన ఒక తెల్లని చొక్కా వుత్తరీయము వేసికొన్నాడు. క్రాపింగు లేదు. కాఫీ హోటలు అయ్యరు క్రాపింగు మనిషిని పెద్ద గౌరవముచేసి అతనికస్సి వెంట వెంటనే అందిచ్చి రెండవ ఆయన పిలిచినా మాట్లాడలేదు. ఇంకా యిటువంటివి అనేకములు చెప్పవచ్చును గాని నా మాటలు సరేనని నమ్మకున్న మీతో నింకను చెప్పుట యెందులకు.

ఒక రోజున శెలవులకు నేను మాయూరికి వెళ్లినాను. ఆమరునాడు ప్రొద్దున నింట్లో కూర్చుండగా మా మేన కోడలు పరుగెత్తుకొని వచ్చి 'మామయ్యా; పగటివేషా లొస్తున్నాయి' అని అరచింది, నేను వాకిటిలోకి వచ్చినాను. అది లోపలికి పోయి దోసెడు బియ్యము తీసుకొని వచ్చింది వాకిటిలోనికి వత్తునుకదా మా మేనమామ కొడుకు క్రొత్తగా ఐ, సి, యస్ (I. C. S ప్యాసయినాడు. వాడు వస్తున్నాడు. దొర టోపీయు వాడును. మామేనకోడలు నివ్వెరపోయి "అయ్యో! బాబాయి! నువ్వా! అనిబియ్యము తొందరలో క్రింద పారబోసి. మొట్టమొదట వాడు బాగుండలేదన్నదిగాని మా మేనకోడలు తరువాత దొరటోపీ బాగున్నది. వుత్తరయ్యాలు అయితే మాటి

మాటికి కొనుక్కొనవలె. టోపీ అయినచో నొకసారి కొన్న జీవితాంతరము నుండునని.

మా మేనకోడలు ఎనిమిదేళ్ళపిల్ల. "బాలవాక్యం దేముడివాక్యం" అని అంటారు కొందరు. కనుక దొరల వలెనే యుండిననే సౌందర్యమని చెప్పుటకు ప్రమాణమొదులకు. కాని యీ సౌందర్య విషయములలో మనదేశములో జరిగిన యభివృద్ధిని గురించి యించుక ముచ్చటించిగాని ముగించరాదు.

మొట్టమొదట క్రాపింగులన్నియు పక్కపాపిళ్లవే కాని యీసౌందర్యోద్యమముకూడ ప్రపంచకములోని యన్నియుద్యమములతో సమానముగ పరుగెత్తుచున్నదగుటచేత నిపుడు స్త్రీలు పురుషులతో సమానమైన స్వాతంత్ర్యము కావలెనని కోరు సమయమున పురుషుని క్రాపింగు పాపిడి తలమధ్యకు తెచ్చి వెండ్రుకలు దీర్ఘములుగా పెంచి మునుపటివలెనే దువ్వకుండ సాఫీగా వెంపలదాక దువ్వబడుచున్నవి. ఈ విషయములో చాలమంది సౌందర్యపిపాసుల చర్యలు ప్రశంసార్హములు. కాని కొందరుపూర్వాచారపరాయణలగు స్త్రీలు పురుషులతో సామ్యముకూడదనియో యాగౌరవము తమకేయుండవలెననియో తమపాపిళ్లు ప్రక్కకు మార్చినట్లు తెలియవచ్చుచున్నది. ఈసందర్భములో కొందరు చిత్రకారులను ప్రశంసింపక తప్పదు. ఏలననగా వారిపురుష చిత్రములు స్త్రీలచిత్రములవలె నుంటున్నవి. అసలు కొందరుపురుషులే స్త్రీలవలెమారుచున్నారు. వారిని పొగడుటకు మాకుశక్తి చాలదు. ఏలననిన సౌందర్యమనగా స్త్రీయము. సౌందర్యము చివరకు ప్రపంచమంతయు సౌందర్యమును వృద్ధిచేసివృద్ధిచేసి స్త్రీరూపమును దాల్చుగాతయని దీవించుచున్నాము.

తా. క.

‘ ప్రకృతిపురుషుడు ’ పురుషుడు అనుసిద్ధాంతమును ఇంతముఖ్యవిషయమును మేము తిరస్కరించుట తప్పనందుకు విచారించుచున్నాము.



# మేలుకొలుపు

కాళూరి వెంకటనరసింగరావుగారు (కవితాసమితి)

---

అదె ! యరుణోదయంబయ్యె తూరుపున
విడిన మామిడిపూవు విరజిమ్ము తావి
మలయవాయువులతో గలసివీతెంచె;
మొకరితుమ్మెద దొంగమూకలుముసరి
కొల్లపెట్టుకొని పోకుండకాపుండి
చేరెడువాని చెచ్చెరవెంటదగిలి
చెలగితర్మగవలె చెల్లెలా ! లెమ్ము
తోటలోపల నెంతతో వంతగించి
దోబూచులాడుతుందుడుకు సేతలకు
తలిరుటాకుల జీబుతావులనెల్ల
చూపింపవలె వేగసోదరీ ! లెమ్ము
పొడుపుసూర్యుని తళ్కుపూతలసొబగు
లందాలజల్లు తీరగు నగల్ చెక్కి-
కైసేయునెంతో ! యక్కజముగా మెఱయు
కొంతకాలువ నీటికొత్తతుంపురులు
ఒడ్లపూబొదలలో నొయ్యనవిఱియ
బొందు మల్లెలవ్రాలి బొసగవర్తించు
ముత్తెంపుజాలతుల్ ముద్దులాడకనె
ఇంకను నిదురింతువేలనే? యనుజ
పెరటిలోపలలేత యరటి బోదియకు
నీరొద్ది మొవ్వలో నెలకొన్న మంచు
కరగి చక్కనిచోట్ల గారెడు నపుడు
నేలవ్రాలకయమున్నె చేతులొడ్డి
దోసిళ్ల గదియింప నాసించుకతకు
దొరకిన దదియెల్ల దుసికిలిపోవ
"నాయాసమెల్ల వృథాయయ్యె" ననుచు
నొండొరు గేలిసేయుచు నాడువేళ
యరుదెంచె జుము చెల్లెలా ! లెమ్ము లెమ్ము
ఇసుకదిబ్బల బొమ్మరిళ్ళకట్టుకొని
మనబొమ్మలకు మంచి మంచి రీతులను
తగినట్లు కొత్తముస్తాబు లొనర్చి
పొరుగిండ్ల పిల్లలెల్లగ జతపరచి
కూడి వేడుక మావి గున్న నీడలను
ప్రియముగా బొమ్మల పెండ్లిండ్లుసేసి
కొనువేళ ఆటయింకను అవకుండె,
కమ్మని పెరుగు చొక్కంపు రకంపు
ఊరుగాయల తోడ నూటలూరించు
చద్దికై యమ్మ పిల్చనబిల్చివేయు ;
ఏమిలాభము అప్పుడీ వల్కగొనిన?
నిదురచాలించి వన్నెల చిన్నెలొలుక
రమ్ము ! నానవ్వుల రతనాలదొంతి ।
ఆలస్యమైననే మాడుకొగలము ?
స్నానమ్ముచేసి అచ్చంబగుమడిని
పూలుకోయగ నాన్నపోయెడు వేళ
వేచియిద్వారమును వెంటాడువేళ
పూలసజ్జకునేడ్చి పోరాడువేళ
శమియింపకీవు పంతముపట్టువేళ,
ఇచ్చినపయిపంతసించి, ఎన్నెన్నొ
మురిపెంపు, ముద్దులుమూటలుకట్టు
వచ్చియురాని, భావమునలరించు,
పలుకుల సేవాప్రశ్నలనడిగి
నన్నును నాన్నను నవ్వించువేళ,
క్రమముగా గడచునింకను నిదురించు
లెమ్ము ! మేల్కొనుము చెల్లెల ! తోచదేమి

# ఖడ్గతిక్కన

కొడాలి వెంకటసుబ్బారావు, కామరాజుగడ్డ శివయోగానందరావుగార్లు

---

౧

కదనమందున శాత్రవకంఠరక్త
వాహినీస్నానమున ఎర్రవారినాడు
విజయకాంక్షను "ఖతను" గావించినట్టి
కత్తి మొనమొక్కవోవుట గాంచినాడు
కత్తియలసటయేటికి? రేపుజయము
మనవశంబని యింటికిమరలినాడు
ధైర్యమునువీడి కాడు. నిదానముగను
గెలువలేమాయటంచును తలచినాడు.

౨

తనరాకదారిలోఁగని మ్రొక్కు కాపులు
శిరమెత్తితన్ను గాంచినది లేదు
తనవాజిడెక్కలధ్వని, విని, చని, చూచు
పిల్లలగుమి కానుపింపలేదు.
తనకయి మేఘాలదాగు భానుడు నేడు
కించిత్తు వేడితగ్గించలేదు.
"నాన్న ఎందరినేడు నరకివచ్చితిరని"
కొడుకుమామూలుగా నడుగలేదు.
స్నిగ్ధదరహాసచంద్రికాశ్రీయుతంబు,
సరససల్లాప వైభవసంయుతంబు,
ప్రియకళత్రాన నాబ్జంబు,— బయటవీధి
గుమ్మమున నైజకాంతుల జిమ్మలేదు.

3

స్నానమొనరింతు తోడుమన్నాడు నీళ్లు
సతిని, జితశౌర్యదేవతాగతిని పిలిచి

* * *

ప్రాత నులకమంచపుకుక్కిపైన చీర
నడ్డుగట్టి, నీటికడవ నచటపెట్టి,
ప్రక్కనొకపీటపై నింతపసుపుముద్ద
నుంచి, స్నానముచేయుడీ యంచుపలికి,
చాటునకుపోయి నిలబడె జలజనేత్ర.

* * *

ఆశ్చర్యపడినాడు ఆవింతగాంచి
భామినీయిదియేమి పలుకుమన్నాడు
పరిపంధిరాజన్య బలదాహకుండు
ఖడ్గతిక్కన వీరకంఠీరవుండు

* * *

"పగరకు వెన్నిచ్చినచో
నగరా మన ఆరువేలనాయకులెల్లన్
ముగురాడువారమైతిమి
పగపేటికి జలకమాడవచ్చినచోటన్"
తంత్రప్రభావ స్వతంత్రచాణక్యుని
గేలియొనర్తు రార్వేలవారు
కత్తితో గంటంబు గదియించి
కాలునిలీలమైనొంతు రార్వేలవారు
శరణాగతత్రాణ బిరుదాంకుడగుపార్థు
పేర్వెన్న నగుదు రార్వేలవారు
చక్రంబు చేనుదెంచి సమయింపనున్నను
విడువరు పట్టునార్వేలవారు
కర్ణశిబిదధీచి కల్పవృక్షంబుల
వెక్కిరింతు రారువేలవారు
ఆంధ్రమాతృగర్భమం దుద్భవించిన
వేగుజుక్కలారు వేలవారు

* * *

అట్టివారికి మర్యాదఆవహిల్లె
ఒక్కరణ భీరుకతమున తిక్కనార్య "

* * *

అని కాంతపలుకుట నంగంబువడకె
కన్నులనీర్గ్రమ్మ ఖడ్గతిక్కనకు
మారుపల్కగ నోటమాటరాకుండె
ఆలోచనామగ్నుడయ్యె నాక్షణము "

౪

" అన్నంబువేళయ్యెనయ్య రావయ్య
ఆకటితోడస్సినావయ్య బాబు "
యనుపిల్పు ఆలోచనము సేయుచున్న
తిక్కనవిని లేచిదిగ్భ్రాంతుడయ్యె।

* * *

శాకపాకాలతో, చారుతో, కొంత
అన్నంబు భుజియించి " అమ్మ తేవమ్మ
చల్ల " యంచడిగెను తల్లి తిక్కన్న॥

* * *

విరిగిపోయిన పాలు వేడితగ్గినవి
వడ్డించి తనతల్లి వదనంబు వాంచె॥

* * *

" విరిగిపోయిన పాలు వేడితగ్గినవి
ఎందులకమ్మ నేనెటుతిందునమ్మ"
అని చింతతోతల్లినడిగె తిక్కన్న

* * *

అఖిలావనిని మెప్పులందిన తెల్గు
శౌర్యదీధిస్సులు సన్నమైపోయె
సకలసస్యాలకు సత్వంబునొసగు
తుంగాభద్రాదేవి పొంగుచల్లారె
వీరమాతలమేని వెచ్చనిరక్త
మతిశైత్యముగ పాఱునయ్య మీయందు
ప్రతిలేని మీశౌర్యపటిమంబుతఱుగ
సరిలేనివీర్యంపుజ్వాలచల్లార
పాలువేడివితగ్గి పసతప్పిపోయి
విరుగుటలో నేమివింతతిక్కన్న"।

* * *

అని మందలించిన అమ్మమాటలకు
మిన్నుసర్వము తనమీదబడినట్లు
అవని బొంగరముగా నాడుచున్నట్లు
అంతరాళాన త్రా నతుకుకున్నట్లు
భ్రమియించి తిక్కన పసదప్పి లేచి
తూలుచు తల్లి పెళ్ళాలతోననియె॥

* * *

" చేసినతప్పుకు శిక్ష వేశారు
పిరికివానికిలోని బెరుకుతీర్చారు
ఆడుతనంబుతో జోడించినారు
మగవారిలో లేని మాన్యంపుచేత॥

* * *

వీరమాతలపేరు మాసిపోనీను
తెల్గులశౌర్యంబు దిగిపోవనీను
చచ్చిపొయ్యేదాక సమరంబువిడిచి
రాబోనుఅపకీర్తి తేబోనుమీకు"
అనిపల్కి తిక్కన్న అటనుండిచనియె॥

* * *

అమ్మ కన్నీటితో నాశీర్వదించె
భార్య కన్నీటితో ప్రార్థించెశివుని

* * *

మనసులో జరిగిన మంతనాలివ్వి
పైకన్నమాటల ఫలితంబు లేదు.

* * *

ఆడువారల ప్రజ్ఞ కంతు లేదనుచు
ఆడువారలప్రేమ కాది లేదనుచు
ఆడువారలతోడ గూడకయున్న
పురుషునకున్ రాతిబొమ్మకావంత
భేదంబు లేదనే పెద్దలవాక్కు

శృతితుల్యమానాల్కా! జీర్ణించిపోదా ?

*　　*　　*

అమ్మ యిల్లాలును ఆత్మజాతలును
ఆమహోజాతిలో తామండరేని
ఆడువారన్నచో నాగౌరవంబు
కాంతాకులంబన్న కడలేని ప్రేమ
స్త్రీజాతిపైనంత స్నేహభావంబు
పుట్టునేపురుషులపొట్ట పొడిచినను॥

*　　*　　*

నల్లరాతినిపిండె నాతినీరంబు!

౫

"అలసియిల్లుచేరినందుకు తగినట్టి
ఫలితమనుభవించి బయలుబడితి.
తల్లి, తన్వి, వీరధర్మంబుబోధించి
మనిపినారు, శక్తి బెనిచినారు."

*　　*　　*

అనుచుచింతించుచు చనుచుండెననికి
గంభీరహాయమెక్కి ఖడ్గతిక్కన్న

*　　*　　*

౬

అరటిపూచలవోలె నరుకుచున్నాడు
మధ్యాహ్నసూర్యుడై మాడ్చుచున్నాడు
అరిశిరాలతో బంతులాడుచున్నాడు
పీనులగుట్టలు పేర్చుచున్నాడు
తెల్గుమాతకు కీర్తి దెచ్చుచున్నాడు
మనుమసిద్ధిని నెండల్ మరువజేశాడు
నాటిభీష్మునితోడి సాటిగన్నాడు
కల్పాంతమిప్పుడే గావించుతాడు
భళిభళీ శతృలపార జేశాడు
అసిపోటులకు బక్కల్లంకుకున్నాడు
సంగ్రామదేవతా శక్తిరూపంబు
గాతోచుచున్నాడు ఖడ్గతిక్కన్న

*　　*　　*

ఎటనుండివచ్చెనోయీ పాడుకోల;
ఖడ్గతిక్కన గుండెకాయలో దిగెను?
అదియేమి కాలువయ్యా? రక్తమొక్కా?

*　　*　　*

ఆంధ్రవీరుని తేజమంతరించినదె?

*　　*　　*

నేనాబానునీగాధ చెపుతామతండ్రి
కలకాలముందు మాకధయెల్లనోళ్ల
పదజాలములతోడ పనిలేదుమాకు
భావాలతోగూడ పనిలేదుమాకు
ఆంధ్రపౌరుషముతో నంతరింపంగ
తిక్కనార్యునికథ తెలిసినంజాలు.

౭

ఆనాటితో యుద్ధమూఖరైపోయె
తిక్కన్న మృతివార్తపాక్కనల్దిశల

*　　*　　*

అభ్యంగన స్నానమాచరించింది
కురులలో విరులుంచి కొప్పుదిద్దింది
నొసటకుంకుమబొట్టు పసుపుముఖాన
కాటుకకళ్ళకు అలంకారముంచి
రక్తాంబరముల గమణితాల్చింది
పుస్తెపయ్యెదమీద పొసగించుకుంది.
మెల్లని సడలతోమేళ వించింది
అందెల రావంబు ... ... ... ...
... ... ... ఆలకించింది
"జయపతివ్రత" యనే జయలక్ష్మివాక్కు
చితికిప్రదక్షిణాల్ చేసిందిభక్తి
మృతజీవియగు నాధుముఖముచూసింది
కన్నీటిబిందువుల్ కార్చిందిరెండు
భుగభుగజ్వాలలో పుష్పంబువాడ్కి
నంతర్హితంబయ్యె నావీరమాత

*　　*　　*

తిక్కన్నతోగూడ దివికిచేరింది
దేశభక్తులలోన తిరుగుతుంటుంది

గీ॥

పితమాతలలోన వినుతికెక్కింది

*　　　*　　　*

" ఖడ్గతిక్కన కులకాంతా నమస్సు "

*　　　*　　　*

అరులకత్తులపోట్ల కందనివాడు
ఆడువారలమాట కదరిపోయాడు
కాంతతో స్వర్గంబుగాంచియున్నాడు
ఖడ్గతిక్కన తెల్గుకదనగాండీవి
ఖడ్గతిక్కన ఆంధ్రకవికీర్తనీయ
చరితుండు మాన్యుండు స్వేచ్ఛాభరతుండు

---

# ప్రకృతిసఖియ

కొత్తూరు సీతరామారావుగారు

---

మబ్బుచాల్కుదులనుడుసు మమ్ములలర,
బాలచంద్రుడు సిగమల్లె పూలమాల
లీలజెన్నొంద, మైదీవ లీలమెరపు
లేతజాబిల్లి వెలుగుమై పూతలోన
పొంగివెల్వడిచాగిలి మాతలాడ,
కలువకోరకములముద్దు లొలుకుచున్న
చిన్నచనుగవపైటలో చెన్నుమీర,
చిరుతనెలవంక సెలయేటి-తరగలందు
దోంచిమాపరుతోడదో-బూచులాడి
పైటచాటున కనకాంగి తళుకుతళ్కు-
రతిభ్రమగొల్పి కన్నులప్రీతినింప,
మారుతాహతి గడలంకొమ్మలనుజారి
నీడలంబడుచున్న చంద్రికలలోన
చీరకుచ్చెళ్ల ఫెళఫెళ్జిందులాడ,
మంచుబిందుల దేనియలొంచుచిగురు
డంబుమీరగ నధరరాగంబులీన.
నంచనడలను నొయ్యార మవతరించ,
జిలుకపలుకుల దేనియల్జిలుక, వచ్చె,
రమ్యగుణగణనిలయ! మాప్రకృతిసఖియ



# భీకరపరిణామము

నెమలికంటి లక్ష్మీనరసమ్మగారు యల్, యం, పి, క్లాసు

---

బ్రమరాంబకు వయస్సు ఎన్మిదేండ్లు. పుట్టినదామెయొక్కతెయే యగుటచే తల్లిదండ్రుల కామె పంచప్రాణములలో నొక్క ప్రాణము. మేలిమిబంగారుగాజులు, రవ్వల పతకములు, డాలరుగొలుసులు ముంజేతి కంకణములు ముక్కరను మురిపెంపు నగలు నామెకుచేయించిరి. ఉన్నవారిబిడ్డ తల్లిదండ్రులకొక్కతియె కూతురు. ఆబాలిక కేమితక్కువ. ఆబాలికకున్న పట్టుపరికిణీలు, ఓణీలు లెక్కయేలేదు. మక్కానుంచి మజ్లిన్ వచ్చుచుండిన, సూరతునుంచి సిల్కులు వచ్చుచుండిన ప్రసాదరావుగారు వెనుకముందు చూడక యెంతపైకమైన వెచ్చించి బ్రమరాంబకు తెప్పించిపెట్టుచుండెడివారు. బ్రమరాంబ తల్లి కమలాంబగారు హూణభాషాజ్ఞానసమన్వితయగుటచే ఆంగ్లపార్సీవేషముల యందమితమైన ప్రేమకలదు. ఒకనాడు బ్రమరాంబ జూలియట్ యగును. ఒకనాడు మేరీమహారాణియగును. ఒకనాడు రజీయా బీగమగును మరియొకనాడు పద్మినీదేవి యగును. ఇట్లు వివిధశతాబ్దములయందు హిందూమహమ్మదీయ యాంగ్లజాతులలో నుచ్చదశ నొందిన సౌందర్యవిలాసవతుల వేషముల నూహించి యాక్రమముగా దనకూతును నలంకరించుచుండెడిది. ఒకనాడు బ్రమరాంబ బాలకృష్ణవేషముతోనుండ ప్రసాదరావుగారు వీధిగుమ్మము నెక్కిచూచునంతకు నాసీలమేఘచ్ఛాయ యాశిరమునందలి మయూరపింఛము నాయెదయందలి రవ్వలపతకము, నాచేతులయందలి పిల్లనగ్రోవి యాచిరుపాదములందలి చిరుతగజ్జలు, నాయోరచూపు, నాపదతాండవము, నామురళీనాదము, కని సాక్షాత్తు విష్ణుమూర్తి బాలకృష్ణుడై భక్తపాలనకై తనగృహము జొచ్చెనని యుద్దేశించి హృదయమున భక్తిభావనలుద్భవించ హే! పరాత్పరా! రమామనోహరా! పాహిమాం పాహిమాం అని సాష్టాంగదండప్రణామము లాచరించెనట. తండ్రి యలికిడివిని కిలకిల నవ్వుచు బ్రమరాంబయు, భర్త్రాగమమువిని మందస్మితయై కమలాంబగారును ప్రసాదరావుగారి బాసటనిలచిరి. ప్రసాదరావుగారు కుమార్తె కృత్రిమవేషమున కాశ్చర్యమును పొందియును దనయజ్ఞానమునకు పరిభవమునొందినట్లు తలచి భార్యనేమియు ననజాలక కూతునిపై గద్దించిరి. బ్రమరాంబబిక్కముఖము వైచికొని నిలుచుండ కమలాంబగారు కూతును నక్కున జేర్చుకొని భర్తతో ,, ఎందుకండీ కోపము? బాలలయందు వృద్ధులయందు భగవంతుడుండునంటారు మెచ్చుటకే యది కృష్ణవేషము వేసుకున్నది. దానిలోనైక్యమైన భగవన్మూర్తికి మీరు నమస్కరించారు. తప్పేమిలేదులెండి" అని శాంతింపజేసినది కమలాంబ.

ఇట్లల్లారుముద్దుగా కూతును పెంచుచుండ నొకనాటి రేయి భార్యాభర్తలు పట్టుపరుపుపై పండుకొని బ్రమరాంబ యేండ్లు లెక్కించిరి. "వైశాఖబహుళ యేకాదశితో

నమ్మాయికి ఎన్మిదేండ్లు వెళ్లి తొమ్మిదవయేడు వస్తుంది "అష్టవర్షాభవేత్ కన్యా" యని వేదాలు ఘోషిస్తున్నాయి. కన్యాదానం చేసి యీ లోకములో నుండే పితాళ్ళను తరింపజేదా మనుకొంటిని. రెండు నెలలుకూడ గడువు లేదు ఎలాపిల్లను వివాహం చేసేది అన్నాడు ప్రసాదరావు. కన్యాదానము చేయవలననే తలంపు కలిగిన ప్రసాదరావుగారికి పిల్లదాని ఎన్మిదవయేట చేయుటయే ముఖ్యమని బుద్ధి పుట్టినది. అందుచే నాతడా రాత్రియంతయు నిద్రింపనేలేదు. తన భావోద్రేకము కలిగి నపుడెల్ల భార్యను లేపుచు మాచిరాజువారి సంబంధము చూచుదమా? పెమ్మరాజువారి సంబంధము చూచుదమా యని పెద్దగొడవ పెంచి రాత్రియంతయు జాగరణము చేసిరి. తెంపులేక మనస్సున నాందోళనము కలుగుటచే ప్రసాదరావుగారు పది గంటలకే భోజనము చేసి తిథి వారనక్షత్రము చూచుకొని జ్యోశ్యులు వెంకటావధానుల పిలిచి వివాహ సంబంధముల విషయమై విచారించుచుండెను. ఎన్ని సంబంధములు చూచినా యాయన కేమియు నచ్చినవి కావు. చదువు చూచిన భూవసతి లేదు. భూవసతి చూచిన చదువు లేదు. ఎక్కడనైన రెండును కలిగిన బాలుడు కనబడినను నాతనికి శరీర సౌందర్యము లేదు. కొరత లేని తనకు పుత్రసంతతి లేనందున తన యాస్తి నొసంగి యల్లుని యిల్లరికము పెట్టుకొనెదమని యాలోచించి నను పిల్లను ముద్దు ముచ్చటలు తీరవని కమలాంబగారు సమ్మతించుట లేదు. రాజమహేంద్రవరంలో చదువుచున్న మంత్రిప్రగడవారి కుఱ్ఱవాడు సాలుకు పదిపుట్ల ధాన్యం వచ్చు వసతిగలదని విని ప్రసాదరావుగారు రాత్రి కుఱ్ఱవానిని చూచి వచ్చుటకు రాజమహేంద్రవరము ప్రయాణమైరి. మొగవారు సంబంధమునకు వెళ్లి మంచి చెడ్డలు విచారింపరు గనుక తానుకూడ వెళ్లి పెళ్లికుమారుని చూచిన బాగుండునని కమలాంబకు కోరిక కలదు గాని తన యభిప్రాయము తెలిపిన భర్త సమ్మతింపడని యామెకు తెలియును. ఆ కారణముచే అమ్మాయిగీత యెట్లుండెనో యట్లగునని యనుకొని యూరకుండెను కమలాంబ.

ప్రసాదరావుగారు రాజమహేంద్రవరము వెళ్లి ప్రకాశరావును చూచిరి. కుఱ్ఱవాడు చక్కగాను నందముగా నుండెను. చదువు సంధ్యలలో గూడ చురుకుగలవాడు ఫిఫ్తుఫారం చదువుతున్నాడు. సంబంధము బాగానేయున్నదని సరిపుచ్చుకొని ప్రకాశరావు తండ్రితో మాట్లాడుద మనుకొని యిన్నీసుపేటలో నున్న వారి యింటికి వెళ్ళెను. ప్రకాశరావు తండ్రి కృష్ణారావుగారు తాలూకా గుమాస్తా గనుక రాత్రి పగలు విరామము లేకుండా కట్టలు ముందు వేసుకొని వ్రాసికొనుచున్నాడు. ఎవ్వరో పెద్దమనిషి వచ్చినాడని కుర్చీ వేసి కూర్చునమన్నాడు కృష్ణారావు. ప్రకాశరావు వియ్యమొందవచ్చి కుర్చీయెందులకని వాకిట్లో దగ్గరకి దసీ చాపమీద కూర్చుండిరి. తమ యూరు నివాసము వృత్తి తెలుపుకున్న తరువాత ప్రకాశరావు వివాహ కార్య నివేదనమున కుపక్రమించినాడు. వెయ్యిన్నూట పదహారులు కట్నము వెండి చెంబులు వెండి కంచము లిచ్చెదమనిరి. కృష్ణారావుగారును ప్లీడరుగా

రితో వియ్యమొందవచ్చునను కదాయుని సమ్మతించినారు నవీన నాగరికతా సాంప్రదాయప్రకారము కుఱ్ఱవానికి పెళ్లికుమార్తెను చూపించుటకై ప్రకాశరావును బాపట్లకు తీసికొని పోయిరి. ప్రకాశరావు భ్రమరాంబ ముద్దు ముఖము వీక్షించెను. ఆరోజున భ్రమరాంబ మోహినీ వేషము ధరించి రాజిల్లుచుండెను. అమృత కలశము గరిటతప్ప తదితర నవలావణ్య విలాసములామె యందు మూర్తీభవించి యుండెను. అట్టె యోరచూపులతో నొకరి నొకరు చూచుకొనిరి. కమలాంబగారు కూడ అల్లుడు ఎఱ్ఱనివాడే దొరకినాడని సంతోషించిరి. ఇంతలో జోస్యుల వెంకటావధానులు వచ్చి ముహూర్తముల బెట్టిరి. "చైత్రశుద్ధ నవమీ లగ్నము బాగున్నది ఆలగ్నానికి అబ్బాయికి అమ్మాయికి తారాచంద్రబలముకూడ కుదిరింది. దివ్యంగావివాహము చెయ్యవచ్చునన్నాడు" వెంకటావధానులు. సరేనన్నారు. కమలాంబగారు పెళ్ళి ప్రయత్నములకై విఘ్నేశ్వరునకు ఉండ్రాళ్ళు పోసిరి. ఇరుగు పొరుగమ్మలక్కలువచ్చి పసుపులు కుంకుములు పెట్టిరి. జోరుగాపని సాగుచున్నది. డబ్బులేనివారు గనక నాఆలక్ష్యముగుటకు. ప్రసాదరావుగారు వివిధదేశముల నుంచి కావలసిన వివాహోపకరణములు తెప్పించిరి. చలువపందిళ్ళు వేసిరి. చాందినీకి బుడ్లు తగిలించిరి. బంధువుల కాహ్వాన పత్రికలు వ్రాసిరి. సమస్తమైన పనులు సమాప్తమైనవి. ఏల్లి పెళ్ళిసుముహూర్తము. వచ్చేబంధువులను రైలువద్దనుంచి గొనివచ్చుటకు మోటారు బస్సులుకావు. గుర్రపుబళ్ళు కావు. లెక్కలేకుండతిరుగుచుండెను.

ప్రసాదరావుగారు గృహపార్శ్వప్రదేశ పుష్పోద్యానవనమున సతీసమేతులై కూర్చుండి యుండెను. మందపవమానుడు గంధవాహుడను సార్థకనామధేయుడై వివాహయత్న సంజనిత పరిశ్రమ ముపశమించునటుల మెల్లమెల్లన సుగంధపరిమళముల వెదజల్లుచుండెను. ఆసమయమున భ్రమరాంబ యొక యుత్తరము గొనివచ్చి తండ్రికొసంగెను. ప్రసాదరావుగారుల్లాసముతో భార్యతో భాషించుచు జాబును చదువనారంభించెను. అందిట్లుండెను.

మహారాజశ్రీ ప్రసాదరావుగారికి—

ఆర్యసాంప్రదాయము ననుసరించి మీకు మాకును బుషుల కలయిక కలిగినందున వివాహసంబంధమునకు విముఖులమైతిమి.

ఇట్లు,

కృష్ణారావు.

ఆజాబు చదివిన వెంటనే ప్రసాదరావుగారికి మాట రాలేదు. వైభవముగా కుమార్తె వివాహము జేయుట కప్పటికి నాలుగువేల రూప్యముల వెచ్చించి యుండుటచే నాతని కేమిచేయుటకును మనస్సు పాలుపోకుండెను. కమలాంబగారు నొకకొంత తడవునకు తెప్పిరిల్లి ఏమేమో భాషించుచు యింటిలోనికి పోయిరి.

చేసిన యత్నములన్నియు నిష్ఫలములగు నని యాదంపతు లాలోచించి కమలాంబగారి పెదతండ్రి మనుమడగు పదియారు వర్షములు ప్రాయముగల యొక యువకున కొసంగి వివాహము కావించిరి రెండు సంవత్సరములు గడచినది. పిన్న వయస్సు

గలవారైనను భ్రమరాంబా ప్రకాశరావుల ప్రథమ సమావేశ మిప్పటికిని వారి హృదయాంతరాళమున జ్యోతివలె వెలుంగుచు నేయుండెను. భ్రమరాంబకు యుక్తవయస్సు వచ్చినది. కాని పునఃస్సంధానము కాలేదు. తత్కార్య నిర్వహణకై తల్లిదండ్రులు లగ్నము పెట్టించిరి. ఆసమాచారము భ్రమరాంబ చెవుల సోకినది. సంతోషమునకు మారాము ముఖపద్మమున విషాద దేవత తాండవమాడుచుండెను. అన్నము తినదు, భూషణముల వహింపదు. చీనిచీనాంబరముల ధరింపదు. ఒక యోగిని మాడ్కి, యొకకష్ట విధము నహోరాత్రములు యోచనా నిమగ్నయైయుండెను. బాపట్ల పురమున ప్రథమాంధ్ర మహాజన సభ కొండా వెంకటప్పయ్యగారి యాధిపత్యమున మహావైభవముగా జరుగునని కరపత్రములు పంచి పెట్టబడెను. విద్యా సమన్విత యగు కమలాంబ మహిళా సభ యందధ్యక్షత వహించుటచే విషయ నిర్ధారణ సభకు నాడుపోవలసియుండెను. భ్రమరాంబ హృదయమున నావేగమతిశయిల్లుచున్నను శమించుకొని తల్లితో గూడ నాడు వెడలుటకు సంసిద్ధురాలయి యుండెను.

సుమారు 10 గంటలయినది. నాడు సభాభవనమున విషయనిర్ధారకవర్గము క్రమముగా సమావేశమగుచున్నది. ఆంధ్రనాయకులు హాంధ్రప్రేమికులు మహిళా మణులు దేశదేశములనుండి వాడవాడల నుండి దిగుచుండిరి. నాడు బాపట్ల మిక్కిలి జనసంకీర్ణమై చూపరుల కాహ్లాదము గొల్పుట యతిశయోక్తి కాదు. వివిధప్రాంతముల వారికి వారి వారి కనుగుణ్యములగు వసతుల నేర్పరచిరి.

భ్రమరాంబయు కమలాంబ గారును పెందలకడ భుజించి సభావేదికరుగుచుండిరి. త్రోవమధ్యను కమలాంబ గారికి పిఠాపురము వారి వసతి బసకు బోవ బుద్ధిపొడమెను. ఆబసయందె రాజమహేంద్రవాసులు కూడ విడిసియుండిరి. కమలాంబగారు పీఠికాపుర వాసినియు, సంఘసంస్కర్త్రియునగు శ్రీమతి కొటికలపూడి సీతమ్మగారిని దర్శింప తనకుమారికతో ముచ్చటించెను. కుమారికయు విద్యావంతురాలును, దేశాభిమానియు నగు ప్రకాశరావుకూడ నాంధ్రమహాసభకు వచ్చియుండునని తలంచి యా సుకుమారుని నొకమారు చూడ వచ్చునని తలంచెను. స్త్రీయైన తాను పరపురుషుని చూచుటపాప కార్యముగ నూహించెను. తాను తలచిన వరుడు తనకు లభింపనందులకు దురపిల్లెను. హిందువులట్టి బాల్య నెంతయు నిరసించెను. బాల్యవివాహధర్మముల దూషించెను. ఏమి యొనరించి యేమి లాభము కాలము మీరిపోయి నది. తనకిష్టము లేని పురుషునకామె యాజన్మదాసియై మెలగవలసి యున్నది. హా! విధిసంకల్పము దుర్ఘటముకదా? ఆనవకుసుమశరీరకోమలహృదయము విషాదవహ్నిం బడి పరితపింపవలసినదేనా? ఇట్టి ప్రఫుల్లచంద్రముఖులెందరు తమ కయిష్టులగు విభులవడసి బాల్యవివాహ దుష్కారకార్యవిధానమున ఘోరవిషానలమున కుములగ పోవుచున్నారో?

పది గంటలయినది. కమలాంబ పీఠికాపురవాసుల బసయందు కొటికలపూడి సీతమ్మగారితో ప్రసంగించుచుండెను. కల్మషమైన సరియని భ్రమరవీథి వాకిట నిలచి ప్రకాశరావు వదన చంద్రమండలముదృగ్గోచర

మగనాయుని తలచెను. వసతిగృహ మునకు ప్రాంతమునున్న లతానికుంజములు, మాధవీలతయల్లికలు తియ్యమామిడిగున్నల యంతర్భాగములు, మల్లెప్రోదెలమధ్య స్థలములు, నామెనేత్రయుగ్మముజొచ్చి వెదకుచున్నవి. కాని యామె కనువగు పదార్థమేమియు గానరాలేక, ఆమె యొకనిట్టూర్పు నిగిడ్చినది. కనుగొనలనుండి రెండు మూడశ్రుబిందువులుకూడ వెడలినవి. సర్వమును నిరామయము—దుఃఖతరంగములామె హృదయమునకే పరిహసించుచుండెను. సంఘోద్ధారకులని బారెడు మూరెడు బిరుదులతో, హైందవాచార సంస్కర్తలని సపర్యలతో, పోషింపబడి, భూషింపబడి, పీఠాధిపతులై, మతపరిపాలకులైన యీ మహాచార్యప్రచారకులొక్కరైన బాల్యవివాహ విషకీటకములను మొదలంట ఛేదించ ప్రజాలకపోయిరేయని యింక నేమేమో భావవికల్పనలు మానసమున నుబుకుచుండెను. జలప్రవాహమునపడి కొట్టుకొనిపోవు వ్యక్తి గడ్డిపరకతో తరించెదనని తలంచినట్లు, విలోకనమాత్రమున నాదన మనోవ్రేకము నాపుకొనజూచు నాయబల శీలతనమునకు మనము శిరసింతుమా! పరిహసింతుమా. అల్లో యొక్క క్షణికము కూర్చుండి యాయబల తన నిమీలితనేత్రముల భగవానుని చిత్రపటమువైపునకు బరపెను. అదియేమి వైచిత్రమో మొగులుగప్పిన చంద్రికచందమున మనోరేకమున నన్నెదిరి యుండిన నెమ్మోము క్షణికములో శరత్కాల చంద్రబింబము వయ్యెను. తనువు సం... పారవశ్యమున చలించెను. హృదయమున నావేగముద్భవించెను క్షణికముక్రింద దుఃఖపూరితమై యంధకార బంధురమయిన జగమిప్పుడు స్వర్గతుల్యమయ్యెను.

ఎందువలన? ఏ మహాపురుషుని తన హృదయ పీఠమున నెలకొల్పి యనారతమును యీతని నామాక్షరముల తారకమంత్రముగా జపించుచుండెనో ఏయువకుని వివాహమాడ నభిలషించి దైవప్రతికూలముగలచే నన్నాహారములకూడ పరిత్యజించుచుండెనో? ఏ పురుషుని మనోవాక్కాయ కర్మల తన సర్వస్వముగా దలంచి యింతదనుక వసతి గృహాపసరమున నన్వేషించుచుండెనో యా ప్రకాశరావు పున్నమనాటి నిండుచందురుని నెమ్మోముతో మాధవీలతాసౌభాగ్యము విలోకించుచుండ నామె దృక్పథమున బడెనని వేరు చెప్పనేల?

ప్రకాశరావు నేత్రయుగ్మమును నామెపయి ప్రసరింపకపోలేదు. ఇర్వురి చూపులు వారివారి హృత్కమలముల బాధింపకపోలేదు. ఒండొరులు మెల్లమెల్లగా భయసంభ్రమములతో నొకపొదరింటి మాటున చేరిరి. సరస దరహాస చంద్రికలు తేజరిల్ల వారి ముద్దుమొగము మేఘాచ్ఛాదితమయ్యెను. ప్రకాశరావు డగ్గుత్తికతో బ్రమరా! గుర్తింతివా? అనెను.

భ్రమః—మహాభాగా గుర్తించుటయే కాదు నీయుత్తరక్షణమున బాల్యవిద్య... మునుండి నిన్ను ప్రేమించితినో యప్పుడే నాహృదయము నీతో నైక్యమయినది. హృదయమున నిన్ను ... వివాహమాడినట్లే యనని భావించితిని... కాని మనకు ... లాచార ... మతోతురోసి మన సాంగత్యము ... టకలపి మన మనోరథము భగ్న మొ... భగ... మనపు నిర్దాక్షిణ్యవి ... మన పెద్దలు

పర్యవసానము వినిన బ్రిటిషు శరీర ముడికి పోవుచుండెను. తాను శత్రుసంహారమునకు శ్రీకున్న మహిషాసురమర్దనియగునునాయని యోచించెను. రంగస్థలమునందు ఎక్కి యార్యసాంప్రదాయములకు, సనాతన ధర్మములను ఖండించి తనయనోభిప్రాయము వెలివేర్చుకొనుటకు యోచించెను. కాని యంతసాహసమునకు తాను పూనుకొన జాలకపోయెను అంతరాత్మయందు గలతన కోరిక యీజన్మయందు నిష్ఫలమని తలంచెను. ఆరాత్రి బ్రిటిషరకు తీవ్రమైన జ్వరము వచ్చినది. జ్వరతీవ్రత యెక్కువైనకొలది, సహభాగా ముందుజన్మయందైనను సమావేశముస్థిరమగుగాకయని పలువరించుచుండెను. ప్రసాదరావుగారు గొప్పగొప్పడాక్టర్లను పిలిపించి ఔషధసేవ చేయించెనుగాని యామెయాత్మ భగవానునిలో లీనమైపోయినది.

— ... —

## " తొలంగిపొమ్మిప్పటికైన దోసకారి ! "

కో బ భా స్క ర రా వు గా రు

సీ॥ వెన్నువేయుచు తలవన్ను పైకులగొన్ని గిట్టించి నీపొట్టఁబెట్టినావు
చిన్నారిపొన్నారి చిఱుతపాపల నాటపాటలనుండి త్రోపాడినావు
కలకలలాడు చిల్కల గోరువంకల నీడలేకుండ జెండాడినావు
బీదసాదలకు సంపదవార్ధము పనిపాట్లు లేకుండఁ ద్రొవ్వాడినావు॥

తే॥గీ॥ వర్తకంబాగె వ్యవహారవర్తనములు రాకపోకలమఱియుఁ జీకాకుపఱచి
నావు వర్షనూ! సిగ్గులేదే సహింప, దొలంగిపొమ్మిప్పటికినైన దోసకారి!

సీ॥ చదువు సంధ్యయును తోప కిదేమిపాపమో గదయందు విద్యార్థి గణమువగవ
బేహారములుచెడె నాహారవస్తువుల్ ప్రియమయ్యె జనులు కంపించుచుండ!
పదినాళ్ళ దానబాబు చుపల్యాసుల సేద్యగాండ్రందఱు చింతనొంద
కూలినాలిని చేసుకొని బ్రతికెడివారమంచు పాటకజాతి కించనొంద

తే॥గీ॥ వర్షమా! నాలజనికానివలన ప్రజకు ప్రజలనోటనుబడితివి పొమ్మిపొమ్మ
వెటువు పిలెన నీకిక గొటుకీరె తొలంగిపొమ్మిప్పటికైన దోసకారి!

సీ॥ ఇల్లుఁగడలగ నీలేమిలేదని యున్న పశులనుచాలించుకొనుచునొకండు
మొత్తుచున్నదిపాన పొలమేలయుంచును గొడ్లనుదొడ్లకు గూర్చునొకండు
అమ్మ! తోచుటయలే దదిచేయునిదిచేయుమని చిరితింతుల గినునొకండు
శయనించి తలనొప్పి చలి బద్ధకంబంచు తనదుప్పటిని కప్పుకొనునొకండు

# ప్రేటాక్—అమ్మాయ్.

సిరుగూరి జయరావుగారు, బి. యస్సి.

బాలవాణి భోగముపిల్ల కాదు; చాందిని పేటలో నాంధ్రగ్రంథాలయము. అసలుపేరు బాలవాణీ విలాస గ్రంథాలయము; ముద్దుపేరు బాలవాణి.

బాలవాణి యెంతమట్టునకు భోగముపిల్లో, అంత మట్టునకే కోదండపాణి విట శిఖామణి. అంతకు మించి కాసంతైనను గోదండపాణికి రసిక చిహ్నాలు లేవు. ఖద్దరు బట్టలు, మోటైన బుఱ్ఱ, చేతిలోఁ జందాపుస్తకము— ఈ కోదండపాణికి బాలవాణిపై మోజు వర్ణింపఁ దరముకాదు. రేయనకఁ బగలనక బాలవాణినే కనిపెట్టుకొని యుండును; బాలవాణి కొఱకెంత కష్టపడియైనను చందాలు వసూలు చేయుచునే యుండును. బాలవాణి మాట తలచెనా, బువ్వక్కఱలేదు, బట్టక్కఱలేదు, ఊరెల్లా తిరిగి చందాలు వసూలు చేయక తప్పదు.

కోదండపాణి యప్పడప్పుడు నావద్దకు వచ్చుచుండుట కలదు; వచ్చెనా స్థిరబంధము— ఒక్కయడుగైనా కదలడు. ఘంటలకొలఁది మాటలాడుచునే కూర్చొనును. కడకు మొగమోటము విడచి పొమ్మనుదాక పోఁడు.

నాఁడు సాయంత్రము కోదండపాణి నావద్దకు వచ్చి బాలవాణీ నిలయములో నొక యుపన్యాస మీయవలసినదని బలవంతము చేయసాగెను. ఎన్ని విధముల యత్నించినను నన్ను విడువక బదే పదే బలవంతము చేయఁదొడగెను. ఈ నడుమ మా నిలయ ముపన్యాసములకు మొగము వాచినది. కనుక నేదో యొక యుపన్యాస మేవిషయముపైనైనను, ఏవిధముననైనను, ఈయక "తప్ప" దని చెప్పెను.

ఎట్టకేలకీ చిక్కులోనుండి తప్పించుకొనుటకు నా కొక్క దారి దొరకెను. తటాలున మా రామన్న పంతులు జ్ఞాపకమునకు వచ్చెను. సకల విషయ విజ్ఞాతయైన రామన్న పంతులు ఘుడియ వ్యవధియైనను లేకుండ నుపన్యాస మీయఁగోరినంతనే యీయఁగల చాకచక్యములు కలవాఁడని నాకుఁ దెలియును. కాని సాధారణముగా నాలోచనా సంసక్తుఁడు కనుక నుపన్యాసము లిచ్చుట, వ్యాసములు ప్రచురించుట మొదలైన వానితో జోక్యము చేసికొనడు. ఈ కారణము వలనను, నిరుద్యోగియు నిరాడంబరుండు నగుట చేతను, ఇతని విషయమై నిలయకార్యదర్శులకు విశేషించి తెలియదు. కనుక నితని నాహ్వానించుట యరుదు.

రామన్న పంతులును గుఱించి కోదండపాణికిఁ గొంత తెలియజేసి, యతని నాహ్వానింపుమని చెప్పి యతనిని బంపివైచితిని.

మేడమీఁదఁ బచారు చేయుచుంటిని. చల్లని పిల్లగాలి వీచుటచే హాయిగా నుండెను. పశ్చిమ దిక్కున నెఱ్ఱని ఛాయలును వానితోఁ జెలగాటము లాడు నీలనీరదములును గన్నులకు నిర్వర్ణనీయానందము నొసంగుచుండెను.

పట్టణ వాసులమైన మాకుఁ బ్రకృతి సౌందర్యముల రసము ననుభవించుట పర్వదినము. పగలంతయును గళాశాలలోనే గడచిపోవును. రాత్రి యింటిలో నేదోయొక గొడవ తప్పదు. ఏకాంతమున నిర్మల మానసముతోఁ బ్రకృతి మాహాత్మ్యమును ధ్యానించుట కలిగెనా నాఁడు పర్వదినమే.

అనంతమైన యాకాశము— అగాధమైన నీలిమ. ఈ యాకాశముపై రాచుకొని సూర్యుఁడు నిష్క్రమించుచున్నాఁడు. పశ్చిమ దిశ నాఁడు మిగుల రామణీయకముగా నుండెను. ఇట్టి ప్రకృతి ప్రతిమకుఁ బ్రతిధ్వనించిన మనస్సుతో నే కవీశ్వరుఁడైనను గాని రాగము తీసెనా యని తలఁచితిని. అల్లసాని పెద్దన్న జ్ఞాపకమునకు వచ్చెను. మాటలు నోరు వెడలి వచ్చునట్లుగా జదివితిని.

"తరుణి ననన్య కాంత నతి
దారుణ పుష్పశిలీముఖ వ్యథా
భర వివశాంగి నంగభవు
బారికి నగ్గముసేసి, క్రూరుఁడై
యరిగె మహీసురాధముఁ డ
హంకృతితో నని రోషభీషణ
స్ఫురణ వహించెనో యన న
భోమణి దాల్చెఁగషాయదీధితిన్॥

నా మనస్సరణిలోని వాద్యనాదముతో నీ పద్యము మేళవింపలేదు. అనంతమై, యాద్యంత రహితమైన యాకాశముతో ఇంత యాకాశముపై రివ్వున నెగిరి మాయమైపోవు మార్తాండబింబముతో— నిశ్శబ్దమైన మహాప్రకృతితో మేళవించుటకీపద్యము— చాలలేదు. "ప్రాంచద్భూషణ బాహుమూల రుచుల తోఁ" గులుకులాడుచు, అమాయకుఁడైన లేతబాపని "యధరంబాశించి" నిరాశయైన "యనన్యకాంత" కొఱకై యఖిల ప్రపంచకర్మవిధాతయైన లోక బాంధవుఁడు సానుభూతి చూపినాఁడనుట యప్పటి నా యాలోచనా పరంపరలతో మేళవింపలేదు. అఖండ ప్రకృతికి సామ్యము జూపుటకై యఖండ జీవన ప్రపంచమును తేవలెను గాని, యింతటి మహా జీవనలోకములోని యొక్క వరూధిని మోహవిలాసము నకై ఇంత ప్రపంచికోచ్ఛలనము గలిగించుట బాగు లేదు. ప్రపంచిక నాటకములోనికి నాద్య ప్రవే శము చేయు కన్యకాదు. యౌవన సరస్సులో నీదు లాడిన ప్రౌఢకాంత; చమత్కారములు తెలిసిన "యనన్యకాంత" పుష్పశిలీముఖుని బాణములెంత దారుణములైనను గాయములకు వాఁడైన యోధురాలు. గనుక ఓర్చుకొనఁగలదు. లేదా చెలికత్తె లుండనే యున్నారు.

"గాలెంట వోయమ్మ! దూళెంట వోయమ్మ!
ఇరుగు పొరుగోరంత యిరగబడినారంట!
......
యీపూది వొక తెట్టె! యీపిరొక తె తట్టె!
నీళ్లు సిలికే దొక తె! సిలిసి సూసేదొక తె!"

స్వప్న పరీతములో బెదరిన "యెంకికే"—"పట్టి మా యిల్లాలికే"—"యిరుగు పొరుగోరంత" "ఓలమ్మ ఓలమ్మ" యని యుపచారములు చేసినపుడు, "ననవిల్తు శాస్త్రంబు మిగుల నావర్తించు పని వెన్నతోఁడఁ బెట్టిన" సురాంగన కనుక మఱింత నాగరక రీతు లతో గళావిలసనములతో శృంగార రస ప్రావీణ్య ముతో, శీతోపచారములు జరుగనున్నవి. కనుక వరూధిని పాటునకు మార్తాండుని రోష మనవసరము.

ఇన్ని విమర్శనలకును, విచికిత్సలకును, నా మన స్సప్పుడు చోటీయ లేదు. కేవల మాపద్యము నచ్చ లేదను సాంకేతము నా హృదయమును జొచ్చినది.

అనశ్వరకీర్తి ధురంధరుఁడు, కాళిదాసు, జ్ఞప్తికి వచ్చెను.

"యాత్యేకతో స్తశిఖరంపతి రోషధీనాం,
ఆవిష్కృతోరుణ పురస్సర ఏకతోర్కః;
తేజోద్వయస్య యుగపద్వ్యసనోదయాభ్యాం
లోకో నియమ్యత ఇవాత్మదశాన్తరేషు॥"

ఊహా ప్రపంచములోఁ గుప్పించి నాట్యమాడు నీశానులైన మహాకవుల కావ్యములు ప్రకృతికిఁ బ్రతి సృష్టులు. వ్యసనోదయములు సమకాల వ్యవస్థితము లను న్యాయమును ప్రకృతిలో సూర్యచంద్రుల యుద యాస్తమయములకుఁ బోల్చినాఁడు. ధనము, ఋణము నేక కాలస్థితము లగుట ప్రకృతిశాస్త్ర న్యాయము. ఎంత ధనమో, అంత ఋణము; ఎంత ఋణమో, అంత ధనము. ధనఋణముల సమస్థితి (Equilibrium of the positive and the negative quantities) ప్రకృతికి నైజగుణము. పరమాణువులోనికి వితర్కిం చినను, అఖిల నక్షత్ర సమన్విత బ్రహ్మాండ గోళ మును విమర్శించినను, ఈ సిద్ధాంతము రూఢమని రామన్నపంతులు చాలమారులు నాతోఁ జెప్పెను— ఈ సిద్ధాంతమును వ్యసనాభ్యుదయములలోఁ జూచి, సూర్యచంద్రులలోఁ బ్రతిఫలించుట వర్ణించిన సూక్ష్మ బుద్ధి కాళిదాసు!

సూర్యోదయము వర్ణించిన యీ పద్యము నాకుఁ గావలసినది కాదు; ఆలోచించితిని; పరచాయ చేసితిని. కడకుఁ దట్టినది. పెద్దన్న కాదు, కాళిదాసు కాదు. రత్నాల కుప్పలతో ఘనతర మందిరము నిర్మించి, కన్నుల మిరుమిట్లు జేసిన రామరాజ భూషణుఁడు చూపించినాఁడు. హరిశ్చంద్రుఁడేమై పోయెనో, నళ సార్వభౌముఁడేమైపోయెనో కాని, వారి నిరువురి నఁ జదాడ్రసిన భాస్కరుఁడు ప్రత్యక్షమైనాఁడు:—

“జనియించెన్ బహు పద్మినీ రుచులలో
సంధించె సాహస్రి కాం
చన గౌరద్యుతులన్, వహించె వివిధా
శావ్యాప్తి, నత్యంత రా
గ నిరూఢిన్ దుదముట్టి వెన్కనపరా
గప్రక్రియన్ బూని మే
లనఁగన్నట్టు గషాయితాంబరయుతుం
డై భాస్కరుండయ్యెడన్.

“ భాస్కరుని ” జీవన యాత్ర —భాస్కరుని లోకయాత్ర-ఉప మితములగుటే చాలుఁ గవీంద్రుని ప్రతిభ నెగ్గించుటకు ! ఇంతేకాక శ్లేషమూలకముగ సాటి తెచ్చుట రామరాజ భూషణుని యద్వితీయ ప్రతిభ ! !

మఱల మఱల నీ పద్యమును జదువుచున్న కొలఁది, యనేక సుందర భావములు మనస్సరణిలో వేవేగముగా నడచి పోవుచుండెను. మనస్సులో నూతన దీపిక వెలిగింపఁబడి నట్లాయెను. మానవుఁడు జనియించినది మొదలుకొని యెన్ని యత్నములను పన్నుచుండును; ఎన్ని కార్యములఁ దలంచును, ఎంత “వివిధాశావ్యాప్తి ” వహించును. ఇంత సుడిగాలి రేచుటే కాని, కడకు “ నపరాగప్రక్రియంబూని ” “ కషాయితాంబర యుతుండై ” నిష్క్రమించును కదా ! ఈ పరిణామచక్రమే భాస్కరుని విషయమునఁ బ్రతి దినము నొక్క వేగమునఁ దిరుగు చున్నది— ఈచక్రమే ప్రతి మానవుని జీవితమును ద్రిప్పుచున్నది.

... ... ...

మెల్ల మెల్లగా నంధకార మావరింపఁ దొడగినది. ఉన్నట్టులే యుండి భాస్కరుఁడు మాయమైపోయెను. ఒక్కటొక్కటిగఁ జుక్క లాకాశముపైఁ బొడసూప సాగెను. కొంతసేపటికి నంబర మంతయు లెక్క లేనన్ని నక్షత్రములతో నింపఁబడెను.

“ లెక్క లేనన్ని నక్షత్రములు ”! ఆకాశము వంకఁ జూచు నప్పుడు “ కంటికిఁ గనుపించు ” నక్షత్రములు లెక్కలేనివా ?— లక్షలా, కోటులా— అనంతములా ? కుర్చీలోఁ గూర్చొని యాలోచించితిని; కొన్నాళ్ల క్రిందట నేనును, రామన్న పంతులును, అచ్చటఁ గూర్చొని మాట్లాడు చుండగా మాయింటిలోఁ గాపురమున్న వారి బాలుఁడొకఁడు, పదునొకండు వత్సరముల వాఁడు— మాధవరావు— నావద్దకు వచ్చెను. ఏవో ప్రశ్నలు నన్నడుగు చుండుట యతని కలవాటు, అదినమున నిట్లడిగెను.

“ ఇక్కడ! గూర్చొని యాకాశములోని నక్షత్రము లన్నిటిని లెక్క పెట్టినచో బాగుండును కదా ? ” అనెను. వానినిఁ జూచి నవ్వితిని. “ నక్షత్రము లనంతము లోయ్ ! వానిని లెక్కఁబెట్టుట సముద్రములోని నీటి చుక్కలను లెక్కఁబెట్టుట వంటిది ”—అంటిని. మాధవరావు మాట్లాడక కూర్చొనెను. ఇంతలో నన్నయభట్టు జ్ఞాపకమునకు రాఁగాఁ బ్రకృతి యొక్క యనంత మాహాత్మ్యమును గ్రహించితి ననుకొని, సగర్వముగా, రామన్న పంతులు విను నట్లు చదివితిని.

“అమలిన తారకా సముదయంబుల నెన్నను
సర్వవేద శా
స్త్రముల యశేష సారము ముదంబునఁ
బొందను, బుద్ధిబాహువి
క్రమమున దుర్గమార్థజల గౌరవ
భారత భారతీసము
ద్రము దరియంగ నీదను విధాతృన
కైనను బోల శక్యమే”

రామన్న పంతులు నన్నుచూచెను. “మన నెత్తిపై నున్నవి నాలుగు వేల యెనిమిదివందల నక్షత్రము లోయ్ !” అనెను.

ఉన్నట్టులే యుండి యులికిపడితిని ; “4,800” నక్షత్రములు ! లక్షలు, కోటులు—ఇంతేకాక, ఉట్టినుండి నాకలోకమున కెగిరినట్లు, లక్షలు, కోటు లనుండి యనంతమునకు—నేను లెక్క వేయుచుండగా 4,800 ! రామన్న పంతులు హాస్యము చేయుచున్నాడా ?

చిఱునవ్వు నవ్వి రామన్న పంతులిట్లనెను. “మనము కంటితో జూడగల నక్షత్రములు, మన నెత్తిమీద రమారమి 4,800 ; “అమెరికా అర్ధగోళము” వంక రమారమి 4,800. దూరదర్శిని (Telescope) నుండి చూచినచో, ఆకాశములో మఱి 20,000 కనబడుచున్నవి.”

ఈ లెక్కల నెట్లు వేసిరనగా ఫొటోగ్రాఫుల మూలముగా భౌతిక శాస్త్రజ్ఞులు తెలిసికొనిరని కొంచెము విపులముగా వర్ణించెను. ఆకాశమునంతయు

గొన్ని భాగములుగ విభజించి, యా భాగములకు ఫొటో తీసి, యొక్కొక్క ఫొటోలో నెన్ని చుక్కలున్నవో లెక్కపెట్టినచో నీ సంఖ్య వెల్లడి యయ్యెనట!

మనకు గనబడునవి, భూగోళముపై బూర్తిగ నావరించినవి, 9600 నక్షత్రములు. ఇంతేకాక, ఆధునిక దూరదర్శినులతో జూడగలుగునవి 20,000. ఈ దూరదర్శినులకు గూడ నగపడనివి, అతి దూరమున నున్న నక్షత్రములు, లెక్కకు మీఱి, యనంతములుగ నుండును కాబోలు నని రామన్నపంతులతో నంటిని.

"మన ప్రపంచములోని నక్షత్రము లనంతములు కావోయి! అవి సాంతములే!" యని రామన్నపంతులు చెప్పెను.

రామన్నపంతులు జ్ఞానమునకు నంతము లేదు కాబోలు! విషయములు తెలిసికొన్న కొలంది నా సందేహములు మాసిపోవునని నేను తలంచుచుండగా అధునాతన నూతన విషయములను జెప్పుచు, అనుమానములను మఱింత పెంచుచు, మనస్సు నాందోళన పెట్టుట రామన్న పంతులు చేయుపని.

"మన ప్రపంచమనంగా భూగోళమా" యని కోపముతో నంటిని.

"కా" దనెను రామన్నపంతులు.

"తెలిసినదిలే; గ్రహ సమన్వితమైన సూర్యలోకమని నీ యుద్దేశము. (The solar system.) నేను చెప్పునది దానిని గుఱించి కాదు. అఖిల నక్షత్రములు ననంతమనుచున్నాను" అంటిని.

"ఱెక్కలు కట్టుకొని, యిక్కడనుండి పైకి నూటిగా నెగిరినచో నెక్కడకు బోవుదు" వని రామన్నపంతులనెను.

పక్కున నవ్వి, "స్వర్గలోకమున," కంటిని? కాని రామన్నపంతులేదో సంగతిని గుఱించి సవితర్కముగా జెప్పుట కిట్లడిగె నని గ్రహించితిని; "ఇక్కడనుండి తిన్నగా నెగిరినచో సూర్యమండలము దాటి నక్షత్రములను దాటి, వానిపై నక్షత్రములను దాటి, నక్షత్రములపై నక్షత్రములు, నక్షత్రములపై నక్షత్రములు దాటి యనంతమునకు బోవుచునే యుందు నంటిని.
"Towards Infinity"

"అట్లు కాద" నెను" రామన్నపంతులు. "అట్లు సూటిగ బోయినచో గొంతకాలమైన తరువాత వేనవేలు వత్సరములైన తర్వాత తిరిగి బయలుదేరిన చోటునకే వత్తువ" నెను.

కొంతసేపాలోచించితిని. "యూహ తెలిసినదోయ్ రామన్నపంతులూ! ఱెక్కలు కట్టుకొని పైకి పోయినను, గ్రిందకుం బోయినను, అనంతమునకే పోవుచుందుము. ఊపర్యనంతమును (Upper. Infinity) అధోనంతమును (Lower Infinity) ఒక్కచోటం గలియునని నీ యుద్దేశము. కాని నీవు తప్పు చెప్పితివి. ఇక్కడనుండి సూటిగా నెగిరినచో వేనవేలు వత్సరములలో బయలుదేరిన చోటునకే వత్తుమంటివి. అట్లు కానేరదు. అనంతాకాశమున నెగిరి తిరిగి వచ్చుటకు అనంతకాలము పట్టును" అంటిని.

నాకీ సంగతులలో విశేషించి ప్రవేశము లేదు. కళాశాలలోం జరిత్ర పండితుండను కనుక బ్రకృతి శాస్త్రముల సూక్ష్మ సిద్ధాంతములు నాకుం గష్టము; కాని నా బుద్ధికిం దోచినంతమట్టునకు స్థూల సిద్ధాంతములను విమర్శించుచుందును; అదియును రామన్నపంతుల సహవాసము వలన నాకు లభించినది.

రామన్నపంతు లిట్లనెను:—"నీ యుద్దేశము సరి కాదు. ఇచ్చటనుంచి యెగిరినచో ననంతకాలము మక్కఱలేదు. వేనవేలు వత్సరములలోనే యిక్కడకుం దిరిగి వత్తువు. దీనికిం గారణ మేమనంగా—ఇక్కడనుంచి యెగిరినప్పుడు నీవు పోవునది యనంతమునకుం గాదు. మన ప్రపంచము, అనేక నక్షత్రములతో (అనంత నక్షత్రములు కాదు సుమా) అనేక నక్షత్రములతోం గూడిన మన ప్రపంచము, ఒక సాంతప్రపంచము. (Finite world). ఈ ప్రపంచము చతుష్పరిమాణయుతము (Four Dimensional) ఈ ప్రపంచమొక, అధిగోళము, (Hyper-Sphere) ఒక చీమ భూగోళము మీంద సూటిగా నడచినచో వేనవేలు వత్సరములైన తర్వాత బయలుదేరిన చోటునకే వచ్చును. మనుష్యుండు చీమకన్నను గొప్పవాడు. కనుక, స్టీమరెక్కినచో గొన్ని నెలలలో భూమిని తిరుగుచున్నాడు. ఇట్లే, మనము సూటిగా బయలుదేరినచో, ఆకాశము పైకిం బోయి, వేనవేలు వత్సరములైన తర్వాత నీ యధిగోళమును చుట్టు తిరిగి బయలుదేరిన చోటునకే రాంగలము."

నేనంటిని:—"ఈ వింత సిద్ధాంత మెక్కడిది? ఇట్టి వెఱ్ఱి సూత్రముల నెవరు పన్నిరి. దీని కవసరమేమైన నున్నదా?"

రామన్నపంతులు:—ఐన్ స్టైయిను యొక్క రెలిటివిటీ సిద్ధాంత మీ "చతుష్పరిమాణ ప్రపంచ" సిద్ధాంతము నాధారము చేసికొన్నది, ఈ రెలిటివిటీ సిద్ధాంతము భౌతిక శాస్త్రమునకు నవీనముగ నూతనాలంబన మై యున్నది. కొన్ని వత్సరములు వెనుక సిద్ధాంతమును వెక్కిరింపులకు బాలైనను, నేటికి "ఐన్ స్టైయిను" సిద్ధాంతము రూఢిగాఁ బ్రబలినది.

ఇట్టి సంగతులను గుఱించి రామన్నపంతులు నాతో మాట్లాడెను. మనయొక్క పరిమిత సంఖ్యాకమైన (Finite) ప్రపంచము "అర్ధగోళ" మనియూ—ఈ "అర్ధగోళము" యొక్క పరిణామములను "ఐన్ స్టైయిను" గుణించి యుండెననియు రామన్నపంతులు చెప్పెను. మన భౌతిక శాస్త్రమునకు, మన విజ్ఞానమునకు, లొంగునది యీ పరిమిత ప్రపంచము. ఈ పరిమిత "అర్ధగోళ" ప్రపంచమున కవ్వల మఱియెన్ని యేనియు,—"అనంతములే కావచ్చును"—ప్రపంచము లుండవచ్చును.

నాటి రామన్నపంతుల సంభాషణ లన్నియు, నక్షత్రములను జూచునప్పటికి జ్ఞాపకము వచ్చెను. చీకటి దట్టముగా గ్రమ్మ దొడగెను. అచ్చట డాబామీఁద నొక దీపము పెట్టుకొని, కొన్ని కాగితములను జూచుచుంటిని. నిశ్శబ్దమైన యా స్థలము—నిరామయమైన యనంతాకాశము—చేతిలో గలము. కవితా మరుదంకురములు కివయుచు నొండొంటితోడ గలచిన మానసోత్సవ సంతోషము తోరంబవుటయు నేదేని వ్రాయ నాశ జనించెన్, మొదలు పెట్టితిని.

"ఘనతరాజ్ఞాన తిమిరముల్ కనుల పొఱలు
కాఁగ, నాయందు నీ వున్న కబురు మఱచి;
చూచి యెఱుగని భయములు తోచుచుండఁ,
గనులుమూసిన బెడిదంపుఁ గలలు కదుఱ,
బెదరి, యాకాశ వారాశి నెదురఁగాంచి,
యందుఁ దళుకొత్తు నొకచుక్క నరసినాను"

వెక్కిరింతల నన్నేకసక్కె మాడు
ఫక్కి నయ్యది యపహసింపంగ నేల ?
తుంటరి తనంబుతోఁ బొరుగింటి కత్తె
తన యుబుసు నెత్తుకుంపిన నను దలంచి
యిట్లు చిఱునవ్వు నవ్వుట కేమి కతమొ ?

మనసులోఁ బౌరుషపుఁ జిచ్చు మంటలెగయ
బట్టరాకున్న కోపాహి బ్రాఁకులిడగఁ
బండ్లఁ బిగఁబట్టి పిడికిలిపట్టి యంటిఁ:-

"బొట్టిరాకాసి ! నీ సిగ్గు బొగ్గుసేసి
నవ్వెదేఁటికి నిలువెల్ల నన్నుఁ జూచి"
చుక్క, అట్లన్నతోడనే "పక్కు" మనుచు
గట్టిగా నవ్వి, తక్షణంబట్టె మాయ
మాయెఁ జిఱుమబ్బు తెరలుతన్నలమికొనగ.

ఇక్కడను విసుగు పుట్టెను. చుక్కను మబ్బుతెరలో మాయముచేసి వైచితిని.

"కవితా మరుదంకురములు" వీచినట్లే మాయమై పోవును. కవితా ఝంఝా మారుతములు వీచినప్పుడు స్థిరములుఁగా గొంత సేపుండి, మహా ప్రబంధముల నంతరించుటకుఁ దోడ్పడును గాని, మరుదంకురముల శక్తిచేత సంచలితమైన మనోడోలిక వేగముగా సమస్థితికి వచ్చును. అందులకే షెల్లీ చెప్పెను గదా—'When composition, begins, inspiration ends.—(Essay on the Defence of poetry Shelly.)

కొంత సేపటికి భోజనముచేసి, మఱునాడు సెలవు దినము గనుకఁ గళాశాలలోఁ జెప్పుటకై పాఠమేదియు జదువుకొను నవసరము లేకపోవుటచే మాధవరావుతోఁ గొంతసేపు నానా విషయములను గుఱించి, మాట్లాడి, తర్వాత నిద్రపోతిని.

నిజముగాఁ గోదండపాణి వింత మనుష్యుడే ! నిన్న సాయంత్రము రామన్నపంతుల నద్దకుఁ బంపి యుంటిని గదా; అప్పుడే యెన్ని పనులను ముగించెనో! తెల్లవాఱిన తోడనే లేచితినో లేదో, అప్పుడే యొక ప్రకటన కాగితమును మాధవరావు నాకుఁ జూపించెను:—

# బాలవాణీ నిలయము.

—(౦)—

చాందినీ పేట,

---

నేఁటి సాయంత్రము నాలుగు ఘంటలకు బాలవాణీ నిలయమున మ॥ రా॥ రా॥ శ్రీ రామన్న పంతులుగారు “ప్రొటోకాల్ అమ్మాయ్” మీఁద నుపన్యసించెదరు. అందఱు విచ్చేయఁ బ్రార్థితులు.

19—12—1926
హైదరాన్ ప్రెస్సులో ముద్రితము.

కార్యదర్శి,
కోదండపాణి.

అధ్యక్షుని పేరు వ్రాయలేదు. కోదండపాణి మిక్కిలి సాహసికుఁడు; ఆవేళ కే పెద్ద మనుష్యునో తెచ్చి యగ్రాసనమునఁ గూర్చుండఁ బెట్టగలడు.

నాడంతయుఁ జీనాదేశ చరిత్ర చదువుచుఁ గూర్చుంటిని. కళాశాలలో నుపన్యసించునది యాంగ్లదేశ చరిత్రయు, హిందూదేశ చరిత్రయు నైనప్పటికి, నా యభిప్రాయము చొప్పునఁ బ్రాపంచిక చరిత్ర కంతయు నేకోద్దేశము కలదు కనుక నీ యైక్యతను పాటించి, గ్రహించి, పఠింపఁ జేయుటే మేలని యెంచితిని. కేవలము తారీఖులు; పేరులు, యుద్ధములు, రాజులు, వారి సంసారపు గొడవలు, వీనితో బాలురను కష్టపెట్టుట నాకు చేతకాదు. ఇట్టి చరిత్ర నిష్ప్రయోజకము. పరీక్షార్థము బట్టీ పెట్టుటే కాని, బుద్ధి వికాసమునకై యిది తోడ్పడదు. భూగోళము పూర్వకాలమున నగ్నిగోళమై యుండి, తరువాతఁ జల్లబడి, యనేక వేల సంవత్సరముల తరువాత జీవన నిలయమై, యప్పటినుండి వేనవేలు సంవత్సరము లభ్యుదయము (evolution) ఎట్లు చెందెనో, తరువాతఁ బ్రపంచములో సాంఘిక పరిస్థితు లెట్లు పొడసూపెనో, తరువాత నార్థిక రాజకీయ పరిణామము లెట్లుండెనో, తరువాత మతప్రచారము లెట్లు జరిగెనో, తరువాత నే మేమి మార్పులు కలిగెనో వీని నన్నిటిని బ్రాపంచిక సూత్రములుగ గ్రహించి పఠింపఁ జేయుట నాపని. ప్రస్తుతము “ఇంగ్లాండు చరిత్రలో క్రాంవెల్ శాసకత్వము (Cromwellian Regime) చెప్పుచున్నాను. కాని, ఇట్టి విషయము నే యింగ్లాండులో నెప్పుడో జరిగిన యుదంతము వలెఁ జెప్పుటకు మారు, ప్రపంచములోని యన్ని దేశములలోను ప్రజా ప్రభుత్వమునకై కల్లోలములు జరిగెనా, వాని వెన్నంటి శాసక నిరంకుశత్వము స్థాపింపఁబడెనా యను చర్చను నేనిప్పుడు విమర్శించుచున్నాను. “ప్రజా ప్రభుత్వ స్థాపనము, శాసక నిరంకుశత్వ పునరాగమము” (The establishment of Republics and their reversal to Despotic Regimes) అను విశాల విషయములోఁ గ్రాంవెల్ శాసకత్వము నొక భాగముగా నుంచి యుపన్యసింప నెంచితిని. ఇంగ్లాండులోఁ గ్రాంవెల్, ఫ్రాన్స్‌లో నెపోలియన్, రష్యాలో లెనిన్, జినోవీఫ్, ట్రాట్స్కీ, ఇటలీలో ముస్సోలినీ, గ్రీసులోఁ బాంగొలాస్, స్పెయిన్‌లో డిరివైరా, చీనాలో చ్యాంగ్‌సోలిన్, ఫెంగ్‌యూస్యాంగ్ మొదలైన యుద్ధనాయకులు—వీరందఱును ప్రజాప్రభుత్వ సంస్థాపనానంతరము చండశాసకులైరి. ఈ విషయమును ప్రజా మనస్తత్వ శాస్త్రముతో సంబంధించి నట్లుగాఁ జేసి, చెప్ప నుంకించినాను. ఇందుకై చీనాదేశపు టాధునిక చరిత్ర చదువుచున్నాను.

మా కళాశాల ప్రిన్సిపాలుగారు కడు వృద్ధులు; వీరిది పురాణ సాంప్రదాయము; గిబ్బన్ వ్రాసిన

సోమక రాజ్యచరిత్ర (ఏడు భాగములు) ఒక్కొక్కగా నొప్పజెప్పఁ గలరు. వీరు పట్టభద్రులు కాలేదు. కాని సోమక రాజ్యమును గురించి పెద్ద వ్యాసమును వ్రాయుటచే జర్మనీ దేశములోను "డాక్టర్ ఆఫ్ ఫిలాసఫీ" యను పట్టానిచ్చిరి. వీరికి నా పద్ధతిని జూచినచో నొడలుమంట. వారి చేతిలో లేదు కాని, లేనిచో నన్ను పనిలోనుండి తొలగఁ జేయుటకైన నుంకితురు. నేను వీరిని లక్ష్యపెట్టుట లేదు; కొలఁది కాలములోనే స్వతంత్రముగా నొక విశ్వ విద్యాలయమును స్థాపింప నెంచినాను; భద్రాచలమున కివ్వల, గోదావరీ తీరమున నొక గ్రామము కలదు. అచ్చటి దృశ్యము వర్ణనాతీతము. అచ్చట నాయభిప్రాయముల కనువగు నట్లును, రామన్న పంతులు సలహా ప్రకారమును, విశ్వ విద్యాలయమును నిర్మించెదను.

ఒకమూల నాంధ్ర విశ్వ విద్యాలయము ధనసాహాయ్యమును కోరుచుండగా నేనెక్కడ విశ్వవిద్యాలయమును స్థాపింతునని నవ్వెదరేమో! కాని యిది స్వప్నము కాదు, నిజము; ముమ్మాటికిని నిజము. విశ్వ విద్యాలయమనగా సత్రము భోజనమువలెఁ ద్రోవపోవువానికి నెల్ల జెవిటి వానికి శంఖము నూదినట్లు, కళాశాలలో, గూర్చుండఁ బెట్టి, చిత్తుకాగితముల నుండి నాలుగు ముక్కలను నూరిపోసి, పరీక్షలో లాటరీ వేయుట కాదు. దేశోద్ధరణ దీక్షాబద్ధుడైన రామన్న పంతులు చూపిన దారివేఱు. ఆంధ్ర దేశమునకై, హిందూ దేశమునకై, నిజమైన విద్యఁ గఱచినవారు కొందఱుండి తీరవలెను. ఆ నాఁటికిఁ గాని దేశ మభ్యుదయమును జెంద నేరదు. వీరి సంఖ్య యత్యల్పమైనను దేశమునకు మేలే కాని కీడుకాదు. దేశము లోని విద్యావంతుల గుణము ప్రధానము కాని సంఖ్యకాదు. దీనిని గురించి నేను వ్రాసిన గ్రంధము తరువాత బ్రచురించెదను.

మధ్యాహ్నము నప్పటికి గదిలోఁ గుర్చీలో గూర్చొని యాలోచించుచుండగాఁ జావడిలో స్త్రీలు సంభాషించుచున్నట్లు వినఁబడెను. అందు రెండు గదులలో నేనున్నాను; ఒంటరిగా నుంటచేఁ గాలేజి హాస్టలు నుండి భోజనము వచ్చుచుండును. తక్కిన యింటిలో సుబ్బారావుగారు కాపురమున్నారు. ఈయన పింఛను పుచ్చుకొనిన డిప్యూటీ కలెక్టరుగారు. ఈయనకు నలుగురు పుత్రులు; వీరిలో రెండవవాఁడు మాధవరావు. మొదటివాఁడు కలకత్తాలో బి. యే. తరగతిలోఁ జదువుచున్నాడు.

"ఏమండోయ్ లక్ష్మమ్మగారూ; ఇంత వేగం వచ్చారు. ఇంకా మూఁడు ఘంటలైనా కాలేదే; ఇంత తొందరా?"-కంఠస్వరము వలన నీమె సుబ్బారావుగారి కొమార్తె యగు సుందరమ్మగా గ్రహించితిని.

"ఏమిటోనమ్మా! ఇంటిలో తోఁచుట లేదు. బాలవాణీ నిలయంలో సంగీతసభ ఉందని తెలిసింది. ఏదో కాలక్షేపం అవుతుంది. ఇక్కడ కాస్సేపు బాతాఖానీకొట్టి తరువాత అక్కడికి వెళ్దాం అని"

తటాలున నాకాశ్చర్య మాయెను. బాలవాణిలో సంగీత సభా? వీరు ప్రకటన పత్రికను తప్పగాఁ జదివిరా, లేక చదువనే లేదా?

లక్ష్మమ్మగారు:- ఏమమ్మా సుందరమ్మా! ఈ అమ్మాయి సరస్వతీ బాయమ్మకంటే బాగా పాడుతుందా, ఏ దేశందో ఆపిల్ల! ఆవిడ పేరేమిటి?

సుందరమ్మ:- గుజరాతీది కాఁబోలు! ప్రోటాన్ అమ్మాయిట! సైతాన్ అమ్మాయ్ అంటే బాగుండును

ఈ మాటలను వినుచున్న కొలది నాకు నవ్వు వచ్చుచుండెను. రామన్న పంతులు చర్చించు విషయము ప్రోటాన్ను గురించి. ఇది పరమాణువులోని కేంద్ర మండలము. కవితారుచి కలవాఁడు గనుక, సామాన్య ప్రజలకు బోధపడునట్లు, కవితా మాధుర్యముతోఁ గలుపుటకై ఆ యుపన్యాసమునకుఁ బ్రోటాన్ అమ్మాయ్ అని పేరు పెట్టినాడు కాఁబోలు. కాని యీ స్త్రీలు సరస్వతీ బాయమ్మ వలెనే జగద్విదితురాలైన గాయకురాలెవ్వతెయో వచ్చెనని కాబోలు ననుకొనుచున్నారు.

లక్ష్మమ్మ:- దానితోకూడా ఎవరో ఒకాయన వస్తాడట. దాని మొగుడా?

సుందరమ్మ:- నాకెవరూ చెప్పలేదే ఆసంగతి.

లక్ష్మమ్మ:- ఏమో! మొగుడు కాదు కాఁబోలు; ఫిడేలు వాయించే వాఁడేమో. రామన్న పంతులుట! తెలుగు వాడి లాగున్నాడు.

సుందరమ్మ:- (నవ్వుచు) మాయింట్లో కాపురం ఉన్న మాష్టరుగారి స్నేహితుడై యున్నాడు. ఆయన పేరూ రామన్న పంతులే. పనిపాటలు లేకుండా ఇంట్లో కూర్చున్నాడు సంగీతాలకి బయలుదేరాడేమో అని హేళనగాఁ బలికెను.

సుందరమ్మ:- ఏమండోయ్ వచ్చారూ! మీరు సభకేనాంటండి వెంకమ్మగారూ,

ఇంతలో నొక పొరుగింటి స్త్రీ వచ్చెను కాబోలు.

వెంకమ్మ:— ఈవాళ భోగంమేళం ఉందికాదూ, బాల వాణీ నిలయంలో,

నాకు నవ్వు మరింత వచ్చుచుండెను. ఇటువంటి పట్టణములో, ప్రకటనలు సక్రమముగా బయలువెడలు కాలములో, ఇట్టి యవకతవక లెట్లు సంభవించెనో యెఱుగకుంటిని.

లక్ష్మమ్మ:— అబ్బే భోగంమేళం కాదు. పాట కచ్చేరి! గుజరాతీ అమ్మాయ్ యొంత్తో వచ్చింది.

ఈ సభ కింకొక వ్యక్తి చేరెను. వీరి సంభాషణలను విని, గట్టిగా నవ్వి, నవ్వి, నవ్వి, ఇట్లు చెప్పెను:—

"భోగం మేళం కాదు; పాట కచ్చేరి కాదు! రామన్న పంతులు 'ప్రోటాణ్ అమ్మాయ్' అని ఒక ఉపన్యాసం ఇస్తాట్ట.

తక్కిన వారందఱు నంగీకరించినట్లు వారి మౌనము తెలిపెను. ఈ నూతన స్త్రీకి నిజము తెలిసినది కాఁబోలు ననుకొను చుండగా నామె యిట్లనెను.

"ఏదో భాషాసంబంధమైన ఉపన్యాసం కాబోలు. ఈ మధ్య ఇలాంటి ఉపన్యాసాలకి కొదువే లేదు. రొంకిపాటలని, సీతి పాటలని వీళ్ళూ వాళ్ళూ రాయడం, దాన్ని ఖండించే ఉపన్యాసాలు. దాన్ని పూజించే ఉపన్యాసాలు! ఇప్పుడీ తగాదా మొదలెట్టాడు కాబోలు! ప్రోటాణ్ అమ్మాయి పద్యాలు—వీన్ని పూజిస్తాడో, దండిస్తాడో ఈ రామన్న పంతులు."

ఇదొక ధోరణి. ఈమెకు సంగతి పూర్తిగా దెలియలేదు. ఇదేదో భాషా విషయికోపన్యాస మని యూహించినది.

వీరిట్లు మాట్లాడుచుఁ గొంతసేపటికి నిలయమునకు వెడలిపోయిరి. నేనును లేచి, సైకిలెక్కి, బయలుదేరి, నిలయమునకు బోయితిని. కోదండపాణి యొక్క ప్రకటన నైపుణ్యముచే సభ క్రిక్కిరిసి యుండెను. ఉపన్యాస మని యెఱిగి వచ్చినవారు కొందఱు. పాటకచేరీ యని యనుకొని వచ్చినవారు కొందఱు, భోగంమేళమని యనుకొని వచ్చిన వారు కొందఱు— ఏమియు ననుకొనక వచ్చినవారు కొందరు!

ఇంతలో రామన్న పంతులు వచ్చెను, అతని వెంట నొక పెద్ద పెట్టె వచ్చెను. అదేమిటో యూహించుకొనలేక నేనుండగా దానిని నౌఖరులు తెఱచి, అందులో నుండి యొక గ్రామఫోను తీసిరి. రామన్న పంతులు గ్రామఫో నెందుకు తెచ్చెనో నాకర్థము కాలేదు. అతని చర్యలు వింతగా నుండునని చెప్పియుంటిని కదా.

కోదండపాణి నావద్దకు వచ్చి యధ్యక్షత వహింపుమనెను. హఠాత్తుగా నిట్లు కోరుట నాకు గొంచెము కష్టమాయెను. కాని, రామన్న పంతులు తనతో, నన్నధ్యక్షునిగఁ జేయుమని చెప్పెననియు నితరులను నియమింప వద్దనియుఁ గోరెనట. కనుక నన్నంగీకరింపజేసి, అధ్యక్షత వహింపఁ జేసెను. ఆసనమును వహించి, యిట్లు చెప్పితిని.

, ఆర్యులారా! నాకీ మర్యాద నొనరించి నందులకు మిక్కిలి యానందించి, నాకృతజ్ఞతను తెలియఁ జేయుచున్నాను. నేటి యుపన్యాసకులైన మ॥ రా॥ శ్రీ రామన్న పంతులుగారు వివిధ శాస్త్ర విజ్ఞానులు. సనాతనాధునాతన జ్ఞాన సంపన్నులు. ఆలోచనా తత్పరులు. ఇట్టివారు మిక్కిలి నవీనమైన పరమాణు చర్చలను దెలిసికొని, ప్రోటానును గురించి ప్రజాబాహుళ్యమున కనువగున ట్లుపన్యసింప నేతెంచుట మన సుకృతఫలము. వారి నుపన్యసింప గోరుచున్నాను.

రామన్న పంతులు నవ్వుచు లేచెను:—ఇట్లు చెప్పెను.

అగ్రాసనాధిపా! ఆర్యులారా! నేను వక్తను గాను. కాని యాధునిక కాలములో వక్తృత్వ మవసరము లేదు. యంత్రమే వక్త. యంత్రమే యుపన్యాసకుడు. ఇదిగో ఈ గ్రామఫోను చెప్పు మాటలను విని, యానందింపవలసినదని ప్రార్థించుచున్నాను. అని, గ్రామఫోనులో ప్లేటు పెట్టి, పాడించెను.

"రచ్చకీడ్చినారో" నన్ను
రవ్వపెట్టినారో"

1 "నలుగురి లోపల సుళువగు రీతుల
మెలగుద మనుకొంటి—
కలత లేక నా నిలయము నందున
నిలచితి ననుకొంటి" రచ్చ...రవ్వ

2 "తాతల నాటికి వేదపూరుషులు
తలచిరి ననుగొంత—

పడ(తియని యెత్తిగి, కడుగారవమున
విడచిరి వారంత"- రచ్చ...రవ్వ

3. ముద్దులొలుకు నా మోహన రుచులను
ముదిపెముతో దాచి
ముత్తెపు హారము లొత్తిన గృహమున
ముదిసెద ననుకొంటి- రచ్చ...రవ్వ

4. చుట్టు కావలిగఁ దిఱుగుచు నాతోఁ
జుట్టము లున్నారు;
గట్టి ధైర్యమునఁ బెఱవారల వే
నెట్టెద మన్నారు- రచ్చ...రవ్వ

5. తర శరమ్ములకుఁ దఱలిన గృహమున
వఱలుచు నేనుంటి,
నేటికి దొంగలతోటి కలుగు నీ
పాటు తెలియకుంటి,- రచ్చ...రవ్వ

6. గ్రీకు దేశమున, జోకుచేసి, జే
మాక్రిటస్సు వలచె,
వాఁకిటి తలుపుల దాఁక వచ్చి, ప
కాకి తిఱిగి పోయె- రచ్చ...రవ్వ

7. ఆంగ్లదేశమున, యౌవన మదమున,
డాల్టను నను దలఁచె;
వాని దొఱగి, నా వ్రీత ఫలములచే
బ్రీతికితి నిందాఁక- రచ్చ...రవ్వ

8. వీరలందఱును వీఁటి వఱకు నను
వేటాడిరి గాక,
ఇంటి లోపలకి నిట్టులఁ జొఱఁబడి
కంటగింపలేదు,- రచ్చ...రవ్వ

9. తమ తమ నెలవులఁ దమ చెలియలతోఁ
దలపు లుడిగెనేమో?
పాపము లెఱుఁగని భవ్య కన్య నను
జట్టనేమి ఫలమో?- రచ్చ...రవ్వ

10. రూథరు పోర్డట, రూకు వీక్షణుఁడు,
కూర్రనారసము లేసె;
చుట్టము లొక రొక రట్టె కూలిరిఁ
నెట్టులుండఁ గలనో- రచ్చ...రవ్వ

11. కోపను హేగను పట్టణమందునఁ
గోపుఁడు నీల్స్‌భోర్యూ,
గుట్టుగ నుంచిన గృహ రహస్యముల
బట్టబయలు జేసె- రచ్చ...రవ్వ

12. నేనుకూడ నున్నానటంచును, జ
పానులోని వాఁడు,
కేకలిడుచు "నాగాకా" గట్టిగ
పీక నొక్కినాడు- రచ్చ...రవ్వ

13. కానివేళ, సైతానువోలె, వైం
స్టైను దొర యెదిర్చె-
నూతుల, గోతులఁ, బాతిన ముల్లెల
వాతఁ గొనుట నేర్చె- రవ్వ...రచ్చ

ఇట్లనుచుఁ దటాలున గొంతుక యడ్డుపడినట్లు కెవ్వున కేకవైచెను. గ్రామఫోనాఁగిపోయెను.

రామన్న పంతులు లేచియిట్లనెను:- "సభాసదులారా! పోర్టాౙ్-అమ్మాయ్ మూర్ఛపోవు నవస్థకుఁ బ్రస్తుత శాస్త్రపరిశోధనము వృద్ధిపొందినది. ఇంక పోర్టాౙ్-అమ్మాయిని బలి యిచ్చుటే తరవాయి కాఁబోలు! నాకు వేఱుపని యున్నది. సెలవీయుఁడు" అని వేగముగా నిష్క్రమించెను.

నాకీతని చర్యను జూచుసరికి నాశ్చర్యమయ్యెను; కొంచెము సిగ్గు కూడ జనించెను. ఇట్టి మహాసభలో నితడిట్లేటికి నడచుకొనెనో? నేను లేచి యిట్లంటిని:-

"సభ్యులారా! రామన్న పంతులుగారు పాట మూలకముగాఁ బరమాణు శాస్త్రమును బోధపఱచుటే కాదుకదా, వారి చర్య కూడఁ గవితారీతి ననుసరించి నది. ఈ పాటల పూర్ణార్థము చెప్పుటకు నాకు భౌతిక శాస్త్రము తెలియదు, కాని కొంత తెలియు

చెప్పుచున్నాను; మన భూమిలోపల మనకుఁ దెలిసినంతవఱకు సూర్యునిలోను, నక్షత్రములలోను కూడ అనంత పదార్థములు కలవు. ఈ పదార్థముల నన్నింటిని సృజించిన విశ్వకర్త, వీనిని సృజించుటకు 92 వివిధ వస్తువులను చేతిలోఁ దీసికొనెను. ఆర్యులారా! విశ్వ ప్రపంచము అనంతప్రపంచము– అఖండ ప్రపంచము – కాని వడ్రంగివాఁడు ఒక్క కర్రతో గుర్చీలు, బల్లలు, దూలములు, రైలుబండీలు–మొదలుగా గోటాను కోటులు పదార్థముల నెట్లు సృజించునో, మన్నుతో గుమ్మరివాఁడు లక్షవస్తువుల నెట్లు నిర్మించునో– అట్లే మన యావత్ప్రపంచమును నిర్మించుటకు 92 వస్తువులు చాలినవి. ఈ తొంబది రెంటిని ప్రాథమికములు, (Elements) అనెదరు. వీనిలో నే రెండో మూడో, నాలుగో, పదో–తీసికొని వానితో మన విశ్వములోని పదార్థములను సృజించెను. ఉదజని (Hydrogen)–అమ్లజని–(Oxygen) ఈ రెంటితో నీళ్ళు నిర్మింపబడెను. సోడియము (Sodium) హరితము (Chlorin) కలసినచో నుప్పు, బొగ్గు, (Carbon) అమ్లజని, ఉదజని, ఒక్కొక్కప్పుడు నత్రజని– వీనితో, వీనియొక్క పాళ్ళు, మార్చి చెట్లలోను, జంతువులలోను గల సకల వస్తువులను నిర్మించెను. ఈ సంగతిని రసాయన వేత్తలు చెప్పిరి.

అయ్యా! ఇటీవల వఱకు ప్రపంచములోని సృష్టికంతకును ఆధారములీ 92 ప్రాథమికములని తలచిరి. నేఁడో! ఒక గొప్ప విశేషము తెలిసినది! అది యేమనగా నీ 92 వస్తువులకు నాధారము రెండే! అవి, ప్రధానాణువు (Proton) విద్యుదణువు (electron). ఒక ప్రధానాణువీ 92 ప్రాథమికములలోను గలదు. కాని, ఈ 92 ప్రాథమికములకును భేదమేమనగా—ఈ ప్రధానాణువు (ప్రోటాన్) చుట్టును తిరుగు విద్యుదణువుల సంఖ్య. వరుసగా, మొదటి ప్రాథమికములో నొకటి, రెండవదానిలో రెండు, మూడవ దానిలో మూడు, 92 వ దానిలో 92—ఇట్లున్నవి. సూర్యుని చుట్టును గ్రహములు తిరుగుచున్నట్లు, ప్రోటాన్ చుట్టును విద్యుదణువులు (ఎలెక్ట్రానులు) తిరుగు చున్నవి.

ఆహా! ఎంత చిత్రము! ప్రపంచములోని విశ్వ సృష్టికి నాధారములు రెండే—ప్రోటాను, ఎలెక్ట్రాను! ఈ రెండునుగూడ నిజముగా నొక్క పదార్థము యొక్క ద్వివిధ రీతులే యని ముందు తెలియఁ గల దేమో!

సభ్యులారా! ఈ సంగతులను గూర్చి చెప్పినచో నమితానంద కరముగా నుండును. కాని మీరు కొంచెము కష్టపడి, శ్రద్ధ వహింపవలెను. శ్రద్ధ లేనిచో నివన్నియు మీకసహ్యముగా దోపవచ్చును:—

"పనివడి నారికేళ పరిపాకముఁ జవియై బట్ట
హర్షుని కవితాను గుంభనలు, సోమరి పో
తులు కొంద ఱయ్యతానని కొనియాడ నేఱ
రవి యట్టిద; లే జవరాలు చెక్కుగీటిన పస
వల్పు బాలకుఁడు డెందమునన్
గలగంగ నేర్చునే?"

చూచినారా, శ్రీనాథుఁడేమన్నాఁడో! విజ్ఞాన విషయములో గూడ, మీరు సోమరిపోతులైతే బాలకుల వలె నుంటిరా! ఆధునాతన శాస్త్రకామిని, లే జవరాలు, చెక్కు గీటినను మీ డెందములు "కలగంగ నేఱవు." కాని, శ్రద్ధవహించి, శ్రద్ధావయః పరిపాకమును బొందినచో—ఆనందో బ్రహ్మము సిద్ధించును. కనుక రామన్న పంతులు వంటి వారు, పాటల మూలముగను, గ్రామఫోను మూలముగను, కవిత్వము మూలముగను, ఆధునాతన విజ్ఞాన విషయములను—కఠిన నారికేళమును బగులగొట్టి, గుజ్జుతీసి, బెల్లముతో గలిపినట్లు—ఇచ్చునపుడు, మీరు గ్రహించినచో—విజ్ఞాన విస్తీర్ణముచే పాశ్చాత్యులు జగజ్జేగీయమాన ప్రతిభతో, శక్తితో, విజయ ధ్వజమును పైకెత్తి, రవి యస్తమింపని రాజ్యము నేలుటకై యుంకించినారో, అట్టి విజ్ఞాన విస్తీర్ణతను మీరుకూడ బొంది, దేశాభ్యుదయమును కలుగ జేయుదురు," అని సభ చాలించితిని.






మేడేపల్లి వెంకట రమణాచార్యులు గారు.

చ॥ మది నిను విస్మరించి ధనమత్తులు మానవులంగ నా సుహృ
త్సదన సుతాది సంగ సుఖ సంతతి నిత్యమటంచు సంసృతిన్
వదలఁగ జాల రిట్టిడుల బట్టి గ్రసించెద వంతకుండనై
స్వదగతి మూషకంబుల భుజంగము చాడ్పునఁ బార్థసారథీ !

ఉ॥ ఎవ్వి సుమంగళావహము లెల్ల జగంబుల కెవ్వి యాశ్రయం
బెవ్వి సుయోగి హృత్కమల మెప్పుడు పాయకయుండు ధ్యేయమై
యెవ్వి పురాణ వాక్సరిష దీడ్యములై వెలుఁగొందు నట్టి నీ
మవ్వపు పాదపద్మములు మానుగఁ గొల్చెదఁ బార్థసారథీ !

ఉ॥ క్షుద్రుల కెట్టి ప్రీతి సమకూరునో దుర్విషయానుభూతి ని
ర్నిద్రిత నీ పదాంబుజము నిత్యము గొల్చెడు నాకు నట్టి య
చ్ఛిద్ర ముదంబు నాహృదయ సీమ ననారతముండఁ జేయవే
రుద్రముఖా మరస్తుత సరోరుహలోచన పార్థసారథీ !

చ॥ తలప సమర్థుఁ డొక్కఁడిల దా నశిపించు సువర్ణ కాకణీ
స్థలముల నొక్కగవ్వనిడి సర్వ జగద్వ్యవహార సాధనం
బలవడునట్లై చేతనుల నాత్మపదంబున గూర్తు విచ్చతో
నలఘు భవాబ్ధినైన నతిదక్షుఁడ వన్నిటఁ బార్థసారథీ !

చ॥ జలగత మీన సంతతికి జాలదటంచు జలంబులిచ్చు వా
రలవలె భక్తకర్మఠ విరక్తులఁ గావఁగ జూతువీవు పా
పుల కవతంసమైన ననుఁబ్రోచుట నీకది గొప్ప జాంగల
స్థలమునఁ గాదె పేయ జలదానము సల్పుట పార్థసారథీ !

చ॥ జిత నిఖిలావనీతల విజృంభిత నిష్ప్రతి ఘాత శాసనో
న్నతి నీ సమాన వైభవ సనాథత రాజిలునాఁడె పో భవ
ద్వితత దురంతకాలకృత విక్రియ విట్క్రిమి భస్మసంజ్ఞఁడై
వితయగునన్న గాదు మది వితయొకింతయుఁ బార్థసారథీ !

చ॥ సరసిజనాభ నా మదిని సంతతమీవు వసింపఁ బాపముల్
చోరనగు నేమదద్విరద సూదనుఁడైన మృగేంద్రుఁడుండ వా
నరములు భంగపచ్చునె వనంబు జగంబెటు కప్పఁ జీకటుల్
తరణి కరద్యుతుల్వోలుఁగ దానవభంజక పార్థసారథీ !
చ॥ భవదమలాంఘ్రి పంకరుహ భవ్యరజఃకణ పూతులొల్ల ర
ర్ణవ పరివేష్టితాఖిల ధరావల యాధిపతిత్వమున్న న
ర్భవమును నేవగించెదరు బ్రహ్మపదంబుఁ దృణీకరింతురి దృ
క్కృపముల లోకమేలుట నీ సారతఁ జూతురు పార్థసారథీ !
చ॥ తలపఁగ మేలు వాయు సఖ దారుణ కీలపరీత వేశ్మ న
స్థలిత నివాస మబ్జదళ కాంత విలోచన లేశమైన నిం
దలపక సంతసంబు సుతదార ధనాది విమక్త బుద్ధి వి
హ్వాలులగు వారితోడ సహవాసము కంటెను బార్థసారథీ !
చ॥ కరగత తోత్రమశ్వఖురగాఢ సముద్ధత ధూళిజాల ధూ
సర శుభగాత్ర మంబురుహ సన్నిభ నేత్రము నీలకుంతలో
త్కరీ నట నాంచితార్ధహిమ ధామ సమీకృత ఫాలమైన నీ
సర రథసూత విభ్రమము నాకు శరణ్యము పార్థసారథీ !
ఉ॥ పంకజనేత్ర భక్తజన పాప లతాళిలవిత్రపద్మ భూ
శంకర వాసవాదిసుర సంస్తవనీయ చరిత్రనద్ధ స
త్కంకట గాత్రబాహు పరిపాగ్ర సముద్ధృతిగోత్ర భక్త మ
ద్రంకర నామ మంత్రము నిరాత్తరు చైత్రమ పార్థసారథీ !
చ॥ కరగతదీప్ర చక్ర రుచి ఖండిత హైళ మయూఖ జాల మం
బర చరలోచనామృతము భండనభూగత పార్థవోత్తమో
త్కర పరలోక దాన ధృతకంకణమై విలసిల్లు నీరమో
ద్ధుర సుర నిమ్నగా సుతీ వధోద్యత వేషము పార్థసారథీ !
చ॥ కమల సరోనివిష్టమగు గ్రాహము పట్టిన డస్సియా గజేం
ద్రము నను గావుమంచు ఘనరావముతో నుతియించి పిల్వగా
కిమితివి మోహ సంభ్రమ వికీర్ణ పరిభ్రమదంబు జా మహీ
క్రమము పురఃప్రధావి దధికారి భటోత్కర సావిదల్లము
ఖమ సురబృంద మర్భ పథ సంగత సంస్తుపీ దభ్రచారిప
ర్గము ప్రతిపిద్ధ పాదుకమ కల్పిత పల్యయనాధిరూఢతా
తుర్యము దుత్రదత్త ధూత భుజకాండ చమూతపినాథమైన నీ
విమలగ జావనత్వరకు వేయి నమస్సులు పార్థసారథీ !

(పార్థసారథి శతకమునుండి)

# కాళిదాసుని నిరంకుశత్వము.

జంధ్యాల శివన్నశాస్త్రిగారు



(౧౧) శ్రుతికటుత్వము శబ్దముగాని వాక్యముగాని వినుటకింపుగనుండనిచో శ్రుతికటుత్వ దోషమందురు. కుమారసంభవము ౩వ సర్గలో

౧ వ శ్లోకము:—

శ్లో॥ తద్గచ్ఛసిద్ధ్యైకురు దేవకార్య
మర్థోయ మర్థాంతరభావ్య ఏవ
అపేక్షతే ప్రత్యయమంగలబ్ధ్యై
బీజాంకురః ప్రాగుదయాదివాంభః॥

ఇందు 'సిద్ధ్యై' 'లబ్ధ్యై' లోని 'ధ్యై' 'బ్ధ్యై' అను నక్షరములు శ్రుతికటువుగనున్నవి. వీని నుచ్చరించు నపుడు చెవులకు కష్టముగ నుండును. కావ్యరసికులగు సహృదయులే దీనికి ప్రమాణము. ఇతరులు దీని నంగీకరింతురో లేదో చెప్పఁజాలము. వారిమాటప్రామాణికము కాదు. కావ్యప్రకాశకారుఁడుమున్నగు పండితు లెందఱో ఈ దోషము నుదహరించియుండిరి. కొన్ని ప్రతులందు ఈ శ్లోకము మూడవ పాదము 'అపేక్షతే ప్రత్యయముత్తమంత్వాం" అనుపాఠాంతరమునుగలదు. ఈ పాఠమున 'లబ్ధ్యై' అను శ్రుతికటుత్వ దోషముండదు. ఈదోషమును వారించుటకే ఈపాఠము నెవ్వరేని యిట్లు దిద్దియుందురు. కాళిదాసుని కావ్యములందిట్టి పాఠాంతరముల నర్వాచీనులుచేసియుందురని పండితు లెందఱో నమ్ముచున్నారు. మల్లినాథుఁడును దీని నంగీకరించెనని వెనుక నొక్కచో తెలిపియుంటిమి.

ఈవ్యాసము చాలపెరుగుచుండుటచే కావ్య ప్రకాశము, సాహిత్య దర్పణము, కావ్యానుశాసనము మున్నగు గ్రంథములందు చూపింపఁబడిన దోషములలో కొన్నిటినే దిగువ నుదాహరించుచు ఈవ్యాసమును ముగించెదము.

(౧౨) జుగుప్సావ్యంజకము.

మనీషితాస్సంతి గృహేషు దేవతా
స్తపః క్వ వత్సే క్వ చ తావకం వపుః
పదం సహేత భ్రమరస్య పేలవం
శిరీషపుష్పం నపునః పతత్రిణః॥ కుమా. ౫–౪

ఈశ్లోకమున పేలవ, శబ్దము జుగుప్సావ్యంజకము.

(౧౩) గ్రామ్య భావవ్యంజకము

తస్యాః ప్రవిష్టానతనాభి రంధ్రం
రరాజతన్వీ నవరోమరాజిః
నీవిమతీత్య సితేతరస్య
తన్మేఖలా మధ్యమణేరివార్చిః॥ కుమా– ౧–౩౮

కావ్యానుశాసనకారుఁడగు వాగ్భటుఁడు ఇందలి 'మధ్యమణే' శబ్దము గ్రామ్య భావమును సూచింపుచున్నదని వ్రాసెను. ఈశ్లోకమందు మఱియొక విషయముకూడ విచారింపఁదగినది. ఇందు ప్రథమ పాదాదియందు 'తస్యాః' అను శబ్దముచేతనే ఆమెయొక్క అనుసంధము కలుగుచుండగా చతుర్థ పాదాదియందు మఱల నాయర్థమేగల 'తత్' శబ్దమును బ్రయోగించుట యనావశ్యకము. అదిలేకున్నను అన్వయమున కేమియు బాధలేదు. గనుకనే వ్యాఖ్యాతయగు మల్లినాథుఁడు "తస్యా ఇత్యనువృత్తౌ పునస్తచ్ఛబ్దోపాదానం వాక్యాంతరత్వాత్సోఢవ్యం" అని వ్రాసెను. అనఁగా తచ్ఛబ్దము రెండవ వాక్యముననున్నదిగాన ఎట్లో సరిపుచ్చుకొనవచ్చునని యర్థము.

(౧౪) అవిమృష్టవిధేయాంశము

[ క ]

ప్రాధాన్య మీయవలసిన విషయము నకు ప్రాధాన్య మీయక చెప్పఁదగినది చెప్పి వేయుటచే అవిమృష్టవిధేయాంశ దోషము సంభవించుచున్నది. విధేయమగు నంశ మును నతిస్పష్టముగ నిరూపింపనిచో కావ్య శాస్త్రజ్ఞులు ఈదోషము నాపాదించెదరు.

ప్రస్తాం నితంబాదవలంబమానా
పునః పునః కేసర పుష్ప కాంచీం।
న్యాసీకృతాం స్థాన విదాస్మరేణ
ద్వితీయ మౌర్వీమివ కార్ముకస్య॥
కుమార ౩-౫౫

పార్వతీదేవియొక్క పుష్పమేఖలావర్ణ నము, ఆమె మొలనూలు మన్మథుఁడు పని గల్గినపుడు మరల తీసికొనుతలంపుతో కుదువ యుంచిన రెండవనారివలెనుండెనని భావము. ఇందు మౌర్వి ప్రధానముగాదు. దాని ద్వితీ యత్వమే ప్రధానము. కాన "ద్వితీయ మౌర్వీం" అనుటకు బదులుగ "మౌర్వీం ద్వితీయాం" అనుటయే యుచితము. ఇవ శబ్దము 'మౌర్వీం' శబ్దమునుగాక "ద్వితీయాం" శబ్దమును అనుబంధించి యుండవలసినది. అట్లుగాలేదు. గాన నిచ్చట అవిమృష్టవిధే యాంశ దోషముపుట్టెను. కావ్యప్రకాశమం దును కావ్యానుశాసనమందును పైనిపాఠమే గలదు. కాని నిర్ణయసాగర ప్రెస్సునందుముద్రిత మగు ప్రతిలో "మౌర్వీం ద్వితీయామివ" అను పాఠమేయున్నది. ఈపాఠమే ప్రాచీన మగుచో కావ్యప్రకాశకారాదులుఁ దద్దోష మునుచూపించియుండరు. గాన అర్వాచీనులు దీనిని దిద్దియుందురని తోఁచుచున్నది.

[ ఖ ]

వపుర్విరూపాక్ష మలక్ష్యజన్మతా
దిగంబరత్వేన నివేదితం వసు।
వరేషు యద్బాల మృగాక్షి మృగ్యతే
తదస్తి కింవ్యస్త మపి త్రిలోచనే॥
కుమార ౫-౭౨

బ్రహ్మచారి వేషమును ధరించిన శివుఁడు పార్వతితో శివునినిందించుచు నిట్లు చెప్పెను. రూపముచూతమా మూఁడుకన్నులు. ఇంక జన్మముసంగతి తెలియనేతెలియదు. దిగం బరుఁడగుటచేతనే ఆయన ధనికత్వము వెల్లడి యగుచున్నది. ఓబాల మృగాక్షీ! వరునకు విచారింపదగిన లక్షణములలో నొక్కటేని ముక్కంటియందు గనంబడుచున్నదా? అని భావము. ఇందు పండితుల విమర్శనమునకు గురిఅయినది, 'అలక్ష్య జన్మతా' అను పదము. వరుని జన్మముసంగతి తెలిసినను తెలియకున్నను అదియొకగొప్ప విషయము గాదు. తనకన్యకై వరుని నన్వేషించు తండ్రి వరుని తండ్రియెవ్వఁడో, తల్లియెవ్వతెయో, కులమెట్టిదియోయని వరుని యుత్పత్తి విషయ మే విచారించునుగాని వరుని జన్మవిషయము గాదు. కాళిదాసుగూడ శంకరుని ముఖ మున నతని యుత్పత్తి విషయము చెప్పించిన బాగుగ నుండెడిది. కాని అట్లు చేయింప లేదు. గాన నిందు నవిమృష్టవిధేయాం శమను దోషము కలుగుచున్నది. ఇదిచాల సూక్ష్మవిషయమయ్యును మమ్మటభట్టు కాళి దాసును విడువలేదు. 'అలక్ష్య జన్మతా' అనుచోట 'అలక్షితాజనిః' అని యుండుచో నీదోషము వాటిల్లెడిదికాదు. ఇట్టిదోషముల కంటె ఈ వ్యాసారంభమునఁ జూపిన దోషములు గొప్పవి. మహాకవులగ్రంథములందలి ఈ స్వల్పదోషములను గూడ అలంకారికులు విడువలేదు.

(౧౫) నిహతార్థత్వము

ఒక్కొక్క శబ్దమునకు రెండేసి

జేసి యర్థములుండును. అందులో కొన్ని ప్రసిద్ధములు కొన్ని అప్రసిద్ధములు నుండును. అతిప్రసిద్ధమగు నర్థమును విడిచి అప్రసిద్ధార్థమందే యేదేని శబ్దము ప్రయోగింపఁబడు నో దానిని నిహతార్థత్వదోషమందురు.

> యశ్చాప్సరోవిభ్రమమండనానాం
> సంపాదయిత్రీం శిఖరైర్బిభర్తి।
> బలాహకచ్ఛేద విభక్తరాగా
> మకాల సంధ్యామివ ధాతుమత్తాం॥

ఇది హిమాలయ వర్ణనము. సిందూరాదిగైరిక ద్రవ్యములఁ దాల్చుటచే హిమాలయము ధాతుమంతమయ్యెను. 'ఈధాతుమాన్' శబ్దమునకు భావార్థక ప్రత్యయము చేర్చుటచే 'ధాతుమత్తా' అనురూపమేర్పడెను. మత్తశబ్దముయొక్క స్త్రీలింగరూపముగూడ 'మత్తా' అనియుండును. ఉన్మత్తార్థమందే ఇది అధిక ప్రసిద్ధము. ఈశబ్దము చెవినిపడుటతోడనే ఈయర్థమే స్ఫురించును. కాని కవ్యభిప్రేతమగు నర్థము ఇదిగాదు. గాన ఇందు నిహతార్థత్వ దోషముగలిగెను.

క్రమభంగము

[క]

భగ్నప్రక్రమమనియు అక్రమమనియు సంస్కృతాలంకారికులు రెండు దోషములుగ విభజించిరి. ఈ రెంటికిని విశేష భేదములేమిచే క్రమభంగమను పేర రెంటిని ఒక శీర్షిక క్రిందనే వ్రాయుదుము.

అభిజ్ఞాన శాకుంతలములోని యొక శ్లోకము--

> గాహంతాం మహిషానిపానసలిలం శృంగై ర్ముహుస్తాడితం।
> ఛాయా బద్ధకదంబకం మృగకులం రోమంథ మభ్యస్యతు।
> విశ్రబ్ధైః క్రియతాం వరాహపతిభిర్ముస్తాక్షతిః పల్వలే।
> విశ్రామం లభతా మిదంచ శిథిలజ్యాబంధ మస్మద్ధనుః॥

(౧) ఎనుములు నీటిలోఁ జొచ్చుగాక
(౨) లేళ్ళు చెట్లనీడను నెమరువేయునుగాక
(౩) వరాహములచే తుంగముస్తలు త్రవ్వఁబడుగాక
(౪) నాధనువును విశ్రాంతిని పొందుగాక

ఈ శ్లోకమందలి ప్రథమ ద్వితీయ చతుర్థ చరణములందలి కారకరచన యొక విధముగను, తృతీయచరణమందలి కారకరచనయొక విధముగను ఉండుటచే కారకక్రమమునకు భంగము గలిగెనుగాన భగ్నప్రక్రమదోషము వాటిల్లెను.

[ఖ]

శంకరుని పతిగాఁ గోరి పార్వతి ఘోరతపస్సు చేసెను. శంకరుడు ఆమెను పరీక్షించుటకై బ్రహ్మచారి రూపమున వచ్చి శంకరునియందనేక దోషములను జూపించెను. ఇట్టి అమంగళ వేషధారియగు శివునివివాహము మాడ తలంపు మానుమనెను.

దీనిపై పార్వతి చెప్పును——

> విపత్ప్రతీకార పరేణమంగళం
> నిషేవ్యతే భూతి సముత్సుకేనవా।
> జగచ్ఛరణ్యస్య నిరాశిషస్సతః
> కిమేభిరాశోపహతాత్మ వృత్తిభిః॥

భావార్థము——విపత్తికి ప్రతిక్రియగోరువాఁడును, ఐశ్వర్యాభిలాషియు మంగళద్రవ్యములను సేవించుగాని లోకశరణ్యుఁడును నిష్కాముఁడునగు మహాత్మునకు తృష్ణాదూషితమగు అంతఃకరణముగల నీ మంగళ ద్రవ్యములతో నేమి ప్రయోజనము?

ఈశ్లోకము మొదటి పాదమున కాళిదాసు ఏకవచనాత్మకమగు మంగళశబ్దమును ప్రయోగించి చతుర్థపాదమున దానికి మారుగ 'ఏభిః' యను బహువచనాత్మక సర్వనామమును ప్రయోగించెను. దీనిచే క్రమభంగదోషముగలుగుచున్నది. మరి నాథుఁడు

ఈశ్లోకమునకు వ్యాఖ్యవ్రాయుచు మంగళ శబ్దము జాతివాచకమని యీదోషము నెటులో వారింపఁ బ్రయత్నించెను.

[౪]

శంకరుఁడు పార్వతితపమునకు మెచ్చుకొని ఆమెను వివాహమాడుట కంగీకరించెను. పార్వతితనతండ్రియగు హిమవంతుని యనుమతినిపొంది తన్ను వివాహమాడుమని కోరెను. శివుఁడందులకు సమ్మతించి సప్తర్షులను మధ్యవర్తులుగా నియమించి హిమవంతునికడకంపెను. వారు సంబంధము నిశ్చయముచేసికొని మరల శివునియొద్దకు వచ్చిరి. ఈవిషయమున కాళిదాసు చెప్పుచున్నాఁడు—

తేహిమాలయమామంత్ర్య పునః ప్రేక్ష్య చశూలినం
సిద్ధంచాస్మైని వేద్యార్థం తద్విసృష్టాః ఖముద్యయుః॥

హిమవంతునితో సంభాషించి మరల శివునికడకువచ్చి ఆపని చక్కబడెనని చెప్పి సప్తర్షులు ఆయనచే విడువబడి ఆకాశమునకెగిరిపోయిరనిభావము. ఇందు ‘అస్మై’ ఈ శివునికొఱకు అనివెంటనే తద్విసృష్టాః ఆశివునిచే విడువఁబడినవారై, అనుటచే సర్వనామ విషయకమగు భగ్నప్రక్రమదోషముకలుగుచున్నది. దేశభాషలయందు ఇట్టి వ్యవహారమును గాంచు చుంటిమి గాని సంస్కృత సాహిత్యవేత్తలు దీనినిదోషముగనేభావించిరి. ఏతచ్ఛబ్దమునకును తచ్ఛబ్దమునకును ఇటుల సాంకర్యముచేయఁ గిట్టదు.

[౫]

ద్వయంగతం సంప్రతి శోచనీయతాం
సమాగమ ప్రార్థనయాపి నాకినః
కలాచసా కాంతిమతీ కలావత
స్త్వమస్య లోకస్యచ నేత్రకౌముదీ॥
కుమార ౫—౭౧

భావార్థము—శివుని సమాగమమును గోరి రెండు వస్తువులు శోచనీయావస్థనుబొందినవి. ఒకటి చంద్రకళయును రెండవది నీవు (పార్వతియును).

ఇందు ‘కలా’ శబ్దము తరువాత ‘చ’ వచ్చెను. అటులనే ‘త్వం’ తరువాతకూడ నుండవలసినది. అటులఁగాక ‘లోకస్య’ తరువాత ప్రయోగింపఁబడెను. గాన అలంకారికుల మతముననిందు అక్రమ దోషము.

(ఉపసంహారము)

ఈవ్యాసమందు చూపఁబడినదోషములలో ఒకటి రెండు దక్క అన్నియు రఘువంశకుమార సంభవములందలివే. ఇందలి పెక్కుదోషములను ప్రాచీన వ్యాఖ్యాతలును అలంకార శాస్త్రలేఖకులును తమ తమ గ్రంథములందు ఉల్లేఖించియుండిరి. మహాకవుల గ్రంథములందుగూడ దోషములుండుననియు వానిని చూపుటకుప్రతివారికి స్వాతంత్ర్యము గలదనియు తెలియఁజేయుటయే మాలేఖకు ప్రయోజనము. నెరసుల రిన మాత్రమున మహాకవుల పట్ల నపచారము గావించిన వారమని గాని భక్తి శ్రద్ధలు లేవనిగాని భావింపఁ గూడదు. పైగా ఇట్టి శల్యపరీక్షచే వారి కీర్తి యుజ్జ్వలమగుననియే మాయభిప్రాయము. ప్రమాదము గల్గు మాత్రమున పండితుఁడు కాదనుటకు వీలులేదు. ‘ప్రమాదోధీమతామపి’ అను వాక్యమున కొకరు ధీమంతులకే ప్రమాదమని యర్థము చెప్పిరి. కాళిదాసునియెడభక్తిభావమునమేమెవ్వరికిని తీసిపోమని విన్నవించుచు నీవ్యాసమును విరమించుచున్నాము.



# విరహోత్కంఠ

* ( భావగుచ్ఛము )

ఆవంత్స వేంకట రంగారావుగారు సీనియర్ బి. ఏ.

సీ॥ వర్షబిందువులు పల్లవములపై లలిజాలు
వారగ నీ యశ్రుధారలంచు
ప్రసవమర్ఘ్యనివేడి వాడఁగ విరహాగ్ని
బొగిలిన నీ ముద్దు మొగమటంచు
తరుశాఖ కిసలయాంతర సీమకోకిల
పలుక నీ శ్రావ్యమౌ పిలుపటంచు
తొలికి గుట్టలజారి సెలయేరు రొదసేయ
నాసతో నీదు నిశ్వాసమంచు

గీ॥ అనిలహతి జంట తీవ లుయ్యాలలూఁగ
నన్ను దరిఁజేరఁ బిలుచు నీ నవకకరయు
గళ మటంచును నెంచి యువ్విళుల నూఁగి
నిన్నుగానక దుఃఖించి యన్న మిన్న!

గీ॥ వాతహతి క్రింది కురలిన పారిజాత
ప్రసవరాజమ్ము కమ్మగా పరిమళింప
తావకీన శిరోవిచ్యుతకు సుమమ్మ
టంచు దానిని నొదల నుంచుకొంటి॥

సీ॥ వాతేరితాశ్వత్థ పర్ణ నిస్వానమ్ము
భామినీ! నీదు చప్పటు లటంచు
నీల నీరదమాల నిహిత విద్యుల్లేఖ
నేణాక్షి! నీమ ఒడ్డాణమంచు

---

* ఈ "భావగుచ్ఛము" "భారతి"లోను "ఆంధ్ర భారతి"లోను ప్రకటింపబడుచున్నది. సెప్టెంబరు భారతిలో "గాలిగొల్లి"డను శీర్షికక్రింద ప్రకటింపబడిన పద్య మీ భావగుచ్ఛములోనిదే. పాఠక మహాశయుల కుపయోగార్థమైక్రింద నీనాలుగు వాక్యములు చేర్చియున్నాడను.

ఛాయవాసిన ప్రత్యూషంపుచంద్రికాకాంతి
సతివరో! నీదరహాసమంచు
పరిపక్వదాడిమీ ఫలబీజ సంతతి
పొలతిరో! నీదుకెంపులెయటంచు

గీ॥ హరిత వర్ణంపు చివురుదొంతరలనుండి
మొగుడబోవుచు కోకిలనగుటవించు
తరుణ వసలత్రాక్షి సలయాంతరవిలీన
నౌచు ననుగాంచి హాసియించితంచు దలచి॥

గీ॥ పిచ్చియెత్తినవాఁడు నావిపినసీమ
తిరిగిరమ్యమా పూవు టోవరులచెంత
కంచుకమ్మొండు పడియుంటగాంచి నీదు
మదనలేఖంచు భ్రమియించి మదిని తుదకు॥

ఉ॥ మొన్నటిరేయినీవు తరుపూగము నీడల విశ్రమించి యొ
న్నెన్నొ విధాల భీతహరిణేక్షణ! చింతలగుంది కుంది యా
పన్నతనూర్చు పుణ్యపరిపాకవశమ్మున నిన్నుగంటి త
త్సన్నుతశీత భూమి ధరసానువులన్ విహరింపవచ్చుచున్



# ఇండియన్ సైన్సు కాంగ్రెస్.

అయ్యగారి రామమూర్తిగారు బి. ఏ. యల్. టి.



ఇండియన్ సైన్సు యొక్క పదునాలుగవ సమావేశము ఈ సంవత్సరము జనవరి 3వ తేదీని లాహోరునందు జయప్రదముగా జరిగెను. పంజాబు గవర్నరగు సర్. మాల్కోమ్ హైలీగారతి యుత్సాహముతో సభను ప్రారంభించుచు సభాధ్యక్షుడగు బోసుగారి విషయమై కడు శ్లాఘనీయముగా ప్రశంసించిరి. బోసుగారు ముఖ్యముగా వృక్షశాస్త్రమునందు ప్రపంచము నంతకును ఆశ్చర్యమునుకొల్పు నూతనసంగతులను కనిపెట్టిరి. వీరి శాస్త్రపరిజ్ఞానము, అద్భుతమైనభావకల్పన, గొప్ప పరిశోధనాశక్తి, కార్య దీక్ష మున్నగునవి కడుంగడు ప్రశంసనీయములు. అనేక సారులు ఖండాంతరములకు బోయి, తాము కనిపెట్టిన నూతన విషయముల ననేక నగరములందు గొప్ప శాస్త్రజ్ఞులకు ప్రదర్శించి, అందరియొక్క మెప్పు నేక గ్రీవముగ బడసి, భారతదేశమును పాశ్చాత్యుల దృక్పథమున మహోన్నతికి దెచ్చిరి.

వీరికి మొదటినుంచియు దేశభక్తి, దేశగౌరవము ప్రాణముకన్న నెక్కువ. పాశ్చాత్యులకు భారతీయులన్న, భౌతికశాస్త్ర విషయములందు నిపుణత లేనివారనియు, పరిశోధనాశక్తి మున్నగునవి మిక్కిలి తక్కువనియు, ఆధ్యాత్మిక తలంపులందు మున్నలయి యుందురనియు, మరికొన్ని నిరసనభావము లుండెడివి. కాని బోసుగారత్యద్భుతమైన యనేక సంవత్సరముల కృషిచే, శాస్త్ర జ్ఞానము ఏదేశముయొక్క సంపూర్ణ సొక్కుగాదనియు, భారతీయులు ప్రాపంచికశాస్త్రములయందు, నిర్మల భావకల్పనలయందు గొప్పపరిశోధనాశక్తి మొదలగు వాటియందు మరేదేశస్థులకును తీసిపోరనియు; అంతియకాక భారతీయులే ముఖ్యముగా నిట్టి పనులకు స్వభావసిద్ధముగ తగియున్నారనియు, లోకమునకు విశదీకరించిరి.

భారతదేశమందలి నిరుద్యోగసమస్య బోసుగారి హృదయమును వేధించుచున్నది. యూరోపునందుకంటెను యీ సమస్య యిండియా యందెక్కుడు తీవ్రత జెందుటకు దేశముయొక్కయార్థిక దురవస్థయే వీరు సూచించినకారణము. వీరి ఖండాంతర ప్రయాణములయందు డెన్మార్కు నార్వే దేశములలో దారిద్ర్యమనునది కనుపడలేదు. ఇట్టి వింతకు కారణ మేమన యా దేశస్థుల శాస్త్రజ్ఞానమే. అందుచే వారి దేశమునందలి భాగ్యవసతు లన్నిటిని పూర్తిగ నుపయోగించుకొనుచున్నారు. మనకట్లుగాక నెలజీతపు టుద్యోగము, వ్యవసాయము ముఖ్య జీవనోపాధులై యున్నవి. గొప్ప ఖండమువలె నున్న భారతదేశమున ఎప్పుడును ప్రజలకు వ్యవసాయము పరిశ్రమలును నవి రెండునూ యుండవలెను. అనిశ్చయ వర్షపాతమును నమ్ముకొని, వ్యవసాయము మీదనే పూర్తిగ నాధార పడకూడదు. మన దేశమున ఖనిజవసతుల నుపయోగించి, పరిశ్రమల పెంపొందజేయుటకపరిమితమైన వీలుగలవు. యూనివర్సిటీ కళాశాలలు ప్రతి సంవత్సరము శాస్త్రములందారితేరి, దేశమునకు మంచి యాస్తియని చెప్పుకొనదగిన యువకుల నెందరినో తయారు జేయుచున్నవి. కాని వీరి కుపయోగమైన సంస్థలేమియు ప్రస్తుతము లేవు.

నిరుద్యోగమువలన వచ్చు నపాయమును పాలకులు దూరదృష్టిచే గమనించి, తయారైన యువకులను దేశ అనుపయోగ వసతులను, దేశ లాభమునకైయుపయోగింపవలెను: దీనికై కొరకు ధనమును దేశము భాగ్యవంతము జేయుటకును భారతీయుల శక్తిసామర్థ్యములకు దగిన యవకాశములు కల్పించుటకును సద్వినియోగ పరచునెడల భారతదేశ మట్టి ఖర్చును భరించును. భారతీయులును, ఆంగ్లేయులును యన్యోన్యగౌరవము పెంపొంద, కలసి మెలసి, గొప్పకార్యములు జేయుటకుగూడ మంచి యవకాశములు గలవు.

ఇదివరలో చలనములేని మొక్క యొక్క జీవ నిర్మాణమును, బహు సంచలనము గల జంతువుయొక్క జీవ నిర్మాణమును, వేర్వేరని పరిగణించుచుండెడివారు. ఇది మిక్కిలి తప్పుఅభిప్రాయము. ఇట్టి అనాధారములైన తప్పు అభిప్రాయములు వృక్షనిర్మాణ జ్ఞానమును పెరుగనీయక చాలకాలము స్తంభింపచేసినవి. బోసుగారు విస్తార పరిశీలనా ఫలితమువలన చెట్ల ప్రాణము జంతుప్రాణము ముఖ్యాంశములందొక్కటేయని నిరూపించుచున్నారు. ఇట్టినిర్ధారణ మిక్కిలి ప్రాముఖ్యమైనది. దీనిననుసరించి, యింతవరకునులేని యుత్సాహము

పురిణోత్పన్న జంతువుల జీవనిర్మాణముయొక్క లోతును క్లుప్తమైన మొక్కలజీవనిర్మాణజ్ఞానముచే గ్రహింప వచ్చును. బోసుగారి కృషివలన, శరీర, వ్యవసాయ వైద్యమానసిక శాస్త్రములయందు గొప్ప జ్ఞాన విస్తీర్ణతను పొందవీలుకలుగుచున్నది.

లోపలినుండియు వెలుపలినుండియు ఉద్రేకింపబడినప్పుడు మొక్కయెట్లు ప్రవర్తించునో స్వయముగ జూపు గొప్ప సున్నితమైన, సూక్ష్మ గ్రాహ్యములగు యంత్రములను గూడ బోసుగారు కనిపట్టి గారడీవాని వలె వృక్షములందలి వింతలను జూపుచున్నారు. ఇట్టి యంత్రసాధనములేక యింతవరకునుయితరశాస్త్రజ్ఞులు మొక్కరూపము నాధారము చేసుకొని దాని చర్యలను నిర్ణయించుచుండెడివారు. ఇదిగొప్పతప్పు. ఒకపని నెరవేర్చుటకవయవము ఏర్పడినదికాని, అవయవములచే క్రియావిధానము నిర్మింపబడుటలేదు. కనుక మనకు అవయవము యొక్క క్రియావిధానము కావలెనుగాని, దానిరూపసంబంధమేమియులేదు.

కొన్ని మొక్కలు పురుగులను జంపితినును. వీటియాకులపై చేతులవంటి కొన్నిభాగము లొకవిధమైన జిగురు పదార్థమును విడుచును. పురుగు వ్రాలినప్పుడు జిగురునందు చిక్కుకొని కొట్టుకొనుచుండగా, ఆకులపైనున్న చేతులు పురుగుపైవంగి దానినిపోకుండ గట్టిగాపట్టుకొనును. అంతనా పురుగు జిగురునందు కరగి మొక్కకాహారమగుచున్నది. జంతువులకు లోపలముడతలుపడియున్న పొట్టకును, మొక్కలయందు క్లుప్తమై వెలుపలనున్న పొట్టకును గలభేదమును జూపుట కింతకన్న వింత గొల్పునదేదియులేదు. మరొక జాతిమొక్కయందు ఆకుయొక్క రెండుసగములు తెరచుకొన్న నోటివలెయుండును. పురుగు వాలినవెంటనే యీనోరుముడుచుకొని పురుగును ద్రవసహాయ్యమున జంపితినును. మరికొన్నిమొక్కలయందు దాదాపుగా జంతువులపొట్టనుబోలు సంచివంటి పొట్టయుండును. కనుక సృష్టియందుచిత్రము వైవ్యత్యాసము చూపలేని నూతనరూపము లుద్భవించుటయేగాక, వేర్వేరు జీవాధార పనులను జేయుటకు తగినసాధనములుగూడ వృద్ధియగుచుండును. పూర్వకాలమునందు మోటవైనఅసామర్థ్యములైన యవయవములు రానురానుజీవనావసరములబట్టి సూక్ష్మచతురతా సామర్థ్యములను పొందియున్నవి. ఇట్టిమార్పుల నన్నిటిని తెలిసికొనుటకు వృక్షప్రపంచము మంచియవకాశముల నిచ్చుచున్నది. చేయవలసిన పనులను బట్టి యవయవములు తగిన మార్పుజెందుచుండును.

జీవచర్యయం దెంతయును మొక్క జంతువును నిరూపించుచున్నారు. వాటిలో ముఖ్యమైనవి (1) కండరపదార్థములు ముడుచుకొనుట (2) హృదయము యొక్క అనిచ్ఛాశ్చలనము (3) నరములద్వారాస్ఫురణ ప్రచారముజరుగుట. జంతువులయందుజరుగు నీమూడు ముఖ్యపనులును మొక్కలయం దతిక్లుప్తముగా జరుగుచుండుటచే, వీటినిబట్టి జంతువులయొక్క క్లిష్ట చర్యలను మనము గ్రహింప గలుగుచున్నది.

జంతువులందు కండరము లతిత్వరగా ముడుచుకొనును వీటిలో మాంసాహారులగు పిల్లి మొదలగు వాటికి కండరములు చురుకుగా ముడుచుకొనును. పశువులందీ చురుకు తక్కువ. పక్షులలో డేగ మొదలగు మాంసాహారి పక్షులకు రెక్కల కండరముల చురుకెక్కువ. కోడి మొదలగు పక్షుల యందీ చురుకు తక్కువ. ఆవిధముగనే మొక్కలయందు కూడ కండరమును పోలిన పదార్థముగలదు. నిద్రగన్నేరుమొక్క మిక్కిలి చురుకైనది. మనిషియలుకుడు తగులగనే దానియాకులు ముడుచుకొనును. చిక్కుడులో చురుకు లేదు. దీనికి కారణము చురుకైన ప్రాణులయందు 'ప్రోటోప్లాస్మ్' అను జీవాధార పదార్థమందు చురుకు నిచ్చు పదార్థములు ఎక్కువగ నుండుటయే యని బోసుగారు కనిపెట్టిరి.

చెట్లయందుకూడ, జంతువులయందు హృదయచలనము వంటి స్వతశ్చలనము కలదు. బోసుగారు అనేక విధములగు విషములను ప్రతిక్రియలను మొక్కలకు నెక్కించి జంతువులయందు వలెనే ఏమియు భేదము లేక మొక్కల యొక్క హృదయ చలనము కూడ మార్పుచెందునని కనిపెట్టిరి. జంతువులలో హృదయ మెట్లు రక్త ప్రసరణ కలుగ జేయుచున్నదో యట్లే చెట్లసారము కూడ కొన్ని కండర పదార్థముల వంటివి గుండెకాయ వలె కొట్టుకొనుటచే ప్రసరించుచున్నది. ఈ సారము కాడవెంబడి ప్రసరించునప్పుడు కల్గు నాడీ చలనములను రికార్డుచేయుటకు బోసుగారు 'వృక్షస్పర్శిని' (plant feeler) యను నొక గొప్ప యంత్రమును కనిపెట్టిరి, నాడి ప్రవహించినప్పుడెల్లను, సారము పైకివచ్చుటచే కాడ యతిసూక్ష్మ వ్యాకోచమును బొందును (విరివిచెందును). వెంటనే యాకాడ మరల యథాస్థితిని పొందుచుండును. ఈ ప్రకారముగా కాడయందగు నాడీచలనము వలన కలిగిన విస్తీర్ణతయం దతిసూక్ష్మ మార్పులను యీ 'వృక్షస్పర్శని' యంత్రము 50,00000 రెట్లు పెద్దవిగా జేసి మనకొక తెరపై వెలుతురు చుక్క కదలికవలన తెలియునటుల చేయును. నాడిమందము చేయుమందు నేదైన చెట్టునకిచ్చినప్పుడు యీవెలుతురు చుక్క ఎడ

కొట్టుకొనునప్పుడు వెలుతురు చుక్క కుడివైపునకు జరుగును. ఈ చుక్కయొక్క చలనమువలనప్రాణము యొక్క వృద్ధి క్షయములను బోసుగారు మానవుల సామాన్య దృష్టికి మొదటిసారి చూపెట్టిరి. అనేక మత్తు పదార్థములను తాగించుబాము విషమును బోసుగారు చెట్లకిచ్చి చూచిరి. జంతువులలో నివి యెట్టి మార్పులు కలుగజేయునో యట్లే భేదమేమియు లేక. మొక్కలయందు కూడ కలుగజేయుచున్నవి. గరళము మోతాదుగా నిచ్చినప్పుడు చెట్టునందు కూడ మనుష్యునందు వలెనే యతియుత్సాహము కన్పడెను. చచ్చుచున్న మొక్కకు గరళము యింజక్షను యివ్వగా నాడి యందు సుగుణముకన్పడెను.

చెట్లయొక్క నరములస్ఫురణము గురించి యింతకుమున్ను శోధనలన్నియు మిక్కిలి మోటుగ జేయబడును. బోసుగారి శోధనలన్నియు కడు సున్నితములును నిజమునిచ్చునవిగనున్నవి. చెట్లయందు కూడ జంతువులయందువలె నరములుగలవని చూపబడినది. అంతేగాక యీ నరములయొక్క స్ఫురణశక్తి వాటియందలి యణువుల స్థితిని బట్టికూడ యుండునని కనిపెట్టిరి. ఈ యణువుల స్థితిని మార్చి మనము నరముల స్ఫురణతను యెక్కువతక్కువలుగాయిష్టమువచ్చినట్లు బయటనుంచి మార్పగలము. మనలో మనోనిగ్రహముచే కూడ యీ పనిని సులభముగజేయవచ్చును. యోగాభ్యాసము వలన నీ మనోబలము వృద్ధియై యింద్రియములకు (నరములస్ఫురణకును)జయించవచ్చునని శోధన పూర్వకముగ బోసుగారు వెల్లడించుచున్నారు. ఎప్పుడయితే మనోబలమునకు యింద్రియములు స్వాధీనమగునో మన మనుభవించు బాహ్య ప్రపంచమంతయు నూతనయర్థమునిచ్చును. మరియు నింద్రియములను జయించిన మన యిష్టమువచ్చినప్పుడే బాహ్యప్రపంచము ననుభవింతుము, అవసరము లేనప్పుడు యీ ప్రపంచ గోడలను త్రోసివేయవచ్చును వృక్షము మొదలు జంతువు వరకు జీవమెట్లు క్రమముగా ఔన్నత్యమును జెంది తుట్టతుదకు మానవునియందు బాహ్య ప్రపంచమును మనోబలముచే జయించి యాధ్యాత్మిక రాజ్యవైభవము నెట్లను భవించునో బోసుగారు మనకు వివరముగ కన్నెదుట నిరూపించుచున్నారు.

## తెమ్మెర.

[ యస్. యం. యల్. యన్. దాస్‌గారు. ]

కమ్మతెమ్మెరనైనసఖా! మనోజ్ఞ
తరుణ పుష్పమ్ములందు నెత్తావితోడ
కలసి మసలుదు నీపిల్చు గాలిలోన.

* * * * * * * *

విశ్వమోహన గీతికా వేణునాద
మునకు నుపయుక్తపడెదుచో మురిసిపోదు.

# తూలికోత్కర్షము.

[శ్రీయుతులు శంకరనారాయణులు]

(సారస్వతమిత్రిసంఘాలి)

కం॥ శ్రీవాణిన్ గీర్వాణిన్ సేవింపఁగ బూనినావుఁ శ్రేయము కలమా!
దేవేరి కొలువుఁజేరగ భావాంబర వీథులరసిఁ పరుగిడుమింకన్

కం॥ కలమా! కవితార సమయ కలశాబ్ధింజిలికి సుధలఁ గైకొను సంప
ద్విలసనములు నీ గతులం దలవడియెను నీదుజన్మ సార్థకమయ్యెన్

సీ॥ వ్యాస వాల్మీకాది వరసంయమీంద్రుల బహువల్లికలందుఁ బట్టుపడెనొ?
బాణమయూరాదిఁ పావనచరితుల హస్తపల్లవములఁ నలవడియెనొ?
కాళిదాసిత్యాదిఁ ఘనకీర్తికాయుల శయసరోజంబులఁ సాధ్యపడెనొ?
భారవిమున్నగుఁ భవ్యయశోధన కరమంజరులయందుఁ నెఱుకపడెనొ?

మఱియునే కవిరాజశేఖరుల దివ్య హస్తపల్లవాగ్రంబులఁ నచ్చెనిదియొ?
కీర్తిమూర్తుల నతురాఁ కృతులఁజేసి నెలయు ఘనశక్తి నీకెట్లు గలిగెనదియొ?

కం॥ నన్నయ తిక్కన యెఱ్ఱన మున్నగు సన్నుతినిగన్నఁ పూజ్యతముల, చే
సన్నలయందో? మఱిపోతన్న హృదయమందో? సోముఁ ధామమునందో?

సీ॥ అలపెద్దనామాత్యుఁ నరచేతి లతికవై, యల్లిక జిగిబిగిఁ నందినావు
ముక్కుతిమ్మనవర్యుఁ ముంజేతి చిలుకవై, ముద్దుపల్కులతోడఁ మురిసినావు
ధూర్జటికవిచంద్రుఁ దోర్లతాంతంబవై, యతులితమాధురిఁ నలరినావు
పింగళి సూరన కెంగేలి బొమ్మవై శ్లేషాదిభూషలఁ జెలఁగినావు

తావకీనాద్వితీయప్రభావగతుల నాంధ్రకవిశేఖరులదివ్యఁ హస్తపల్ల
వాగ్రసీమలఁ దాండవమాడినావు తూలికా! యెంత ధన్యాత్మురాలవమ్మ

# వామహస్తోద్ధారక సంఘము

చింతా దీక్షితులు గారు.

---

మంగయ్య ఉద్యోగము పోవడమునకు అనేకమంది అనేక కారణాలు చెప్పారు. లక్షణమైన గవర్నమెంటు ఉద్యోగం పోవడమంటే సామాన్యము కాదు. ఉద్యోగముతో పాటు అధికారమూ జీతమూ కూడా పోయినట్లేగదా. అంతకంటె ముఖ్యమైన సంగతి - నిలవజీతాన్ని మించిన డబ్బు దోసిళ్లాది డబ్బుకూడా పోవడము తటస్థించినది. ఆ కారణముచేత మంగయ్య ఉద్యోగము పోవడాన్ని గురించి అతని మిత్రులలో కలవరం పుట్టిందంటే ఆశ్చర్యము లేదు.

వారు చెప్పిన కారణాలలో ఒకటి ఏమిటంటే- ఒకనాడు ఒక తెల్లదొర ఆఫీసు తనిఖీ చేయడానికి వచ్చాడు. మంగయ్య ఆయన దర్శనం చేసుకొన్నాడు. వారిద్దరికీ జరిగిన సంభాషణలో మంగయ్య మాది గోదావరిజిల్లా అని చెప్పినట్లూ దొర "గోధావరిజిల్లా ఏ ఊరు? అని అడిగినట్లూ, "గోధావరి" కాదు గోదావరి అని తప్పు దిద్దినట్లూ తన తప్పు సవరించుకోకుండా తెల్లదొర "గొడారీజిల్లా" కాదా అని ముఖంఎర్రజేసినట్లూ, "గోడారీ" కాదు గోదావరి, అని మంగయ్య మళ్ళీ చెప్పినట్లూ దానిమీద దొర కోపం పట్టలేక, శ్వేతప్రభుత్వ గౌరవమును నిలవబెట్టే ఉత్సాహంతో మల్లసంప్రదాయ సిద్ధముగా చేతులను సవరించుకున్నట్లూ, తరువాత మంగయ్య శరీరమాద్యంఖలు ధర్మసాధన మను వాక్యమును జ్ఞాపకము చేసికొని, పారిపోయినట్లూ, మరనాడు ఉద్యోగము పోయినట్లూ కొందరు చెప్పుచున్నారు. కాని నిజమైన కారణ మదికాదు. అంటే అది ఒకటేకాదు. మంగయ్యపైని అధికారం చలాయించే అధికారి పరంపరలో ఒక పూర్వాచార పరాయణుడైన నల్లదొర ఉన్నాడు. ఆ నల్లదొర దగ్గరకు మంగయ్య కాగితాలు దస్కతు చేయించుకోవడానికి వెళ్ళుచూ ఉండేవాడు. ప్రతిరోజూను, ఎన్నిమార్లు వద్దని చెప్పినా మంగయ్య ఎడమచేతితో కాగితాలు అధికారికి అందించేవాడు. ఆరీతిగా చేయడం తప్పని అధికారి ఎన్నిమార్లు మందలించినా అలవాటుచొప్పున మళ్ళీ మళ్ళీ ఎడమ చేతితోనే కాగితాలు అందించేవాడు. అధికారికి కోపంవచ్చి, మంగయ్య అవిధేయతతో మెలగుతూ ఉంటాడని పైఉద్యోగస్థులకు వ్రాసినాడు. అవిధేయత ఒక కారణమూ, గోదావరీ చర్చ ఒక కారణమూ - ఈరెండు కారణాలూ మంగయ్య ఉద్యోగమును పోగొట్టినవి.

మంగయ్య ఉద్యోగము పోవడమునకు ఎడమచెయ్యి కారణమైనదన్న సంగతి ఎడమ చేతులలో పాక్కింది. ఎడమచేతులు చేసే కార్యాలన్నీ నీచములని ప్రజలు గ్రహించుచున్నట్లు అవి గ్రహించినవి. కొంతకాలానికి ఎడమచేతులన్నింటికీ ప్రబోధం కలిగింది. వెలుగులో పడ్డవి, కుడిచేతులు చేసే పనులుగౌరవాస్పదములన్న సంగతికూడా అవి

ని ఆచారముకూడా ఆరీతిగానే ఉన్నదనీ, పూర్వాచారములను మీరి సంచరించడము సంఘమున కనర్థదాయకమనీ, కలికాలప్రభావమువల్ల యిట్టి ఆందోళనలు సంఘములో పుట్టుచున్నవని ఇంతకీ కుడిచేతులు ఎడమ చేతులకు అపకారము చేస్తూఉన్నవని చెప్పిన హేతువులు హేతువులుకావని, ఎడమ చేతులకూ కుడిచేతులకూ సమానమైన హక్కులున్నదని ఇంకా ఏమేమో చెప్పినవి.

చేసే ప్రతిపనికీ కుడి ఎడమ చేతులు ఉపయోగపడుచున్నవనికూడా అవి చెప్పినవి. భోజనము చేసేటప్పుడు మంచినీళ్ళు త్రాగుటకు ఎడమచేతులే ఉపయోగపడుచున్నవి. దెబ్బ కొట్టుటకు కుడిచేతులెంత అవసరమో ఎడమచేతులుకూడ అంత అవసరమే. చిత్తరువులు వ్రాయుటకు కుంచె కుడిచేతిలో ఉంటే రంగుల పలక ఎడమచేతిలోనే ఉంటుంది. ఇంక వ్రాతవిషయములో ఎడమ చేయి కాగితం పట్టుకొంటేనేగాని కుడిచేయి వ్రాయనేలేదు. చదువు విషయమై ఎడమ చేతులు అబద్ధములను వ్రాసినవి. ఎడమ చేతుల వాదమంతా అబద్ధములతోనూ హేత్వాభాసలతోనూ నిండియున్నది. చదువుకొనేటప్పుడు ఎడమచేతులే పుస్తకమును పట్టుకొనుచున్నవి కాని కుడిచేతులు కావు. కుడిచేతులు పత్రములు తిరగ వేయుటకు మాత్రముపయోగించుచున్నవి. ఇంక ఎడమచేతికి ప్రాముఖ్యమున్న యితర విషయములు ఆలోచిద్దాము. పెండ్లిండ్లలో ఎడమచేతితోనే తాను ప్రేమించిన వధువు కుడిహస్తమును పట్టుకొనుచున్నాడు వరుడు. అర్ధనారీశ్వరుడగు శివుడు తన ఎడమభాగమును జగజ్జనని యగు పార్వతికి పంచి యిచ్చాడు. ఇంక దేవతావిగ్రహాల్లో కుడి ఎడమ భేదం లేనేలేదు. ఒక చెయ్యి అభయహస్తం ఒక చెయ్యి వరదహస్తం. ఇత్యాదిగా ఉంటున్నది. ఎన్నిశిల్పాలు చూచినా ఎడమచేతులకు కుడిచేతులు అనాదరణ చేస్తూన్నట్లులేదు. మాయాప్రపంచాన్ని కల్పించుకొని చేయని అపచారములు కుడి చేతులు తమకు చేస్తూన్నట్లు అవి ప్రకటించుకొనుచున్నవి. దానివల్ల వాటికేమి ఉపయోగమో తెలియదు. తెల్లవాళ్ళతో జట్టుకట్టి దెబ్బ సంపాదించుకోవాలంటే ఇతరమార్గములు లేవా? ఇక గోకుకోవడం సంగతి. న్యాయానికి రెండుచేతులూ గోకుకోవడానికి పనికివస్తూనే వున్నవి. అందులో ముఖ్యముగా ఎడమవేపు దురదకు కుడిచేతులూ కుడివేపుదురదకు ఎడమచేతులూ ఉపయోగపడుతూనే ఉన్నవి. కుడిచేతికి దురదపెట్టితే కుడిచేతులే గోకుకోవడము లేదుకదా? అంతెందుకు గోకుకోవడమనేది ఘన కార్యముక్రింద భావించుకొన్నట్లయితే ఆ ఘనకార్యమును ఎడమచేతులు చెయ్యడానికి ఏమీ ఆక్షేపణలేదు.

వీణవాయించేటప్పుడు, పిల్లంగ్రోవి ఊదేటప్పుడు, కుడిచేతులెంత ఉపయోగపడుచున్నవో ఎడమచేతులుకూడా అంత ఉపయోగపడుచున్నవనే సంగతి ఎడమచేతులు మరచిపోవడము ఎట్టిచిత్తవృత్తి తెలియచేస్తున్నదో ప్రాజ్ఞులు గ్రహించకపోరు".

ఈరీతిగా ఖండనము వ్రాస్తే దానికి ప్రతిగా ఎడమచేతులన్నీ 'వామహస్తోద్ధారక సంఘవాద ఖండనమండనము' అనే పేరుతో వేరొక వ్యాసమును వ్రాసి ప్రకటించినవి. వధువును ఎడమ వేపుపెట్టుట ఎడమచేతుల

గౌరవమునకు కాదనీ, స్త్రీలుసంఘములో నీచస్థానమును ఆక్రమిస్తున్నారు కాబట్టి నీచమైన ఎడమచేతిక్రిందనే వారిని పెట్టటము తటస్థించినదనీ ఇంక మానవుడుచేయు ప్రతి కార్యములోనూ ప్రాముఖ్యత కుడిచేతులకే గాని ఎడమచేతులకు లేదనీ, కుడిచేతుల వాదమంతా స్వవచన వ్యాఘాతాలతో నిండి యున్నదనీ ఎడమచేతులన్నీ మేల్కొని కుడిచేతుల దుర్నయములనూ దుర్మార్గములను అరికట్టితేనేగాని సంఘము బాగుపడదనీ, స్వరాజ్యమురాదనీ వ్రాసుకొన్నవి.

వీరివాదము ఈరీతిగా ఉంటూండగా పులిమీద పుట్రన్నట్లు దేశమంతటా అనేకసంఘములు బయలుదేరినవి. అందులో ముఖ్యముగా చెప్పతగ్గవి "అంగుళీసంఘములు" స్వశాఖాభివృద్ధినీ, స్వశాఖోత్కృష్టతనూ సూచించుటకై ఈ అంగుళీసంఘములు స్థాపింపబడ్డవి.

అంగుష్ఠాంగుళీసంఘము తామే పెద్దలమని లోకమునకు చాటుటకు స్థాపింపబడ్డది. అన్ని వేళ్ళకంటె అవి పెద్దవికాబట్టిన్నీ, బొటనవేళ్ళు లేనిదే ఏవస్తువునూ పట్టుకొనుటకు వీలులేదు కాబట్టిన్నీ వాటికే ఆధిక్యతఉన్నదని వాటివాదము.

తర్జన్యాంగుళీసంఘము తామే గొప్పవారమని ప్రకటించుకొనుటకేర్పడ్డది. నిర్దేశించుటకు దేనిని చూపవలసివచ్చినా తమ సహాయములేనిదే జరగదు. కాబట్టి వాటికి ఆధిక్యతకలదు అని వాటివాదము. మధ్యమాంగుళీసంఘము పొడుగునుబట్టి ఆధిక్యత కోరుచున్నది.

అనామికసంఘమువారు తమకు అనామకులమని శత్రువులు పేరుపెట్టి అన్యాయముచేసినారనీ, తామే బంగారమెప్పుడూ ధరించవలసిన మైశ్వర్యవంతులనీ కావున తమకే ఆధిక్యముండవలెననీ వాదించుచున్నది.

కనిష్ఠికాంగుళీసంఘమువారు తమ్మ అందరూ కడవారిగాచూచి తమకు తగని పేరుపెట్టినారనీ, తాము అల్పులు కాబట్టి తమకే ఆధిక్యమీయవలసినదనీ వాదించుచున్నవి. ఈ అంగుళీసంఘములు తమలో తాము పోరాడుకొనుటయేగాక వామహస్తములతోనూ దక్షిణహస్తములతోనూ హోరాహోరీ పోరాడుటకు రణరంగమునకు దిగినవి.

స్థితిగతులీ రీతిగా నుండగా మిగిలిన తెగలకుకూడా ప్రబోధము కలిగించి, నేత్రోద్ధారక సంఘము, ఉదరోద్ధారకసంఘము, పాదప్రబోధ సంఘము, శిరోపరక్షణీసంఘము యిత్యాది సంఘము లనేకములు బయలుదేరి తమతమ సంఘములను బాగుచేయు ఉద్దేశ్యముతో పనిచేయుచున్నవి, కాని యీసంఘములు అధ్యక్షోపాల నెన్నుకొనడము యిత్యాదిపనులతోను సాలుసాలుకు కొన్నితీర్మానములను ప్యాసుచేసుకొనడముతోను తృప్తి పొందినవి. వామహస్తోద్ధారకసంఘముమాత్రముచాలా పట్టుదలతో పనిచేసినది. కుడిచేతులపనులన్నీ ఎడమచేతులు చేయడము మొదలుపెట్టినవి. కుడిచేతులను నిర్లక్ష్యముచేసి ఏపనీ వాటికిలేకుండాచేస్తే అవికృశించిపోవుననీ ఆపైని అన్నిపనులూ తామే చేసుకోవచ్చుననీ ఎడమచేతులు భావించినవి. ఇక ముందునుంచి ఎడమచేతులన్నీ తమ పేర్లను మార్చుకొని కుడిచేతులనే పేర్లుపెట్టుకోవలె

వనే తీర్మానములుకూడా సభలలో చర్చకు వచ్చినవి. కొన్ని ఎడమచేతులు కుడిచేతులను పేరుతోనే వ్యవహరింపబడడంకూడా తటస్థించింది.

కుడిచేతులు పని లేకపోవడంవల్ల విశ్రాంతి తీసుకోవడం మొదలుపెట్టినవి.

సంఘములు క్రొత్తగాస్థాపించినకాలములో ఎడమచేతి చిటికినవేలూ అణమికా కలసి కలం పుచ్చుకొని వ్రాతలు వ్రాయడం నేర్చుకొన్నవి. కాని ఆకలం క్రమక్రమంగా బొటనవ్రేలు సమీపానికి వస్తూ ఉన్నది. కొంతకాలానికి కుడిచేతిలోనికి కూడా రావచ్చునని ఈమధ్య క్రొత్తగా స్థాపించిన వరాహమిహిర జ్యోతిషాలయమువారు ప్రకటించినారు.

ప్రస్తుత పరిస్థితులనుబట్టి భవిష్యత్తు ఏలాగ ఉంటుందో నిర్ణయించడము కష్టము. కాని ప్రస్తుతము దీని పర్యవసానమేమిటంటే మంగయ్యకు మంచి ఉద్యోగము దొరికినది. పూర్వమువలెనే దోసిళ్ళాది డబ్బు గడించుకొంటున్నాడు.

పనిపాటలులేని కవులకూ వ్యాసకర్తలకూ నవలా కారులకూ కథలకూ ఎడమచేతినిండా వ్రాయడానికి పనిదొరికింది.

# సూర్యోదయము

అయల సోమయాజుల అన్నపూర్ణయ్యగారు

సీ॥ కొక్కరో కోయనుచు గోళ్లు కూయదొడగ
ధవళకాంతులు తుహినాద్రి దనరజొచ్చె
వెలవెలనుబోయె దారకల్ వెలుగులేక
కలను మేల్గాంచి వృతుముల్ కదలదొడగ
స్నానజపముల భూసురుల్ సమలజరిపి
పీడిపోయిన జటలతో విరులబోంట్లు
జారిపోయిన పైటలన్ సద్దుకొనుచు
భర్తదరినుంచి మేల్గాంచె బనులజేయ
శుకపికములును గూసెను సుందరముగ
ధవళకాంతులు మాయమై దర్పమొప్ప
రంగు బంగారు కెంజాయ రంగుమీరె
మెరయుచుండెను గరికపై మేలిమంచు
భాస్కరుడను కారాగార భటుడుయపుడు
పద్మమున నొప్పుఖైదున బందుకొనిన
తుమ్మెదను బిల్వనొప్పెడు దొంగనతడు
విడుచుండె కిరణమను బీగమునను

# సాభిప్రాయములు

## భారతీయుల పారతంత్ర్యము.

మొన్న మొన్న జరిగిన ఐరోపామహాసంగ్రామమున నూపిరిసలుపక పోరిన యలసటయైనను భారతసైనికులకు తీరలేదు. సందర్భములనుబట్టి అప్పటిలో భారతదేశ దాస్యవిముక్తి సంభవించునేమో యని నెంచి దేశీయనాయకులేకగ్రీవముగ తనుధన మనస్సమర్పణంబు జేసి పాలకుల మెప్పు గడింపనెంచిరి.

కాని కాలచక్రము తిరిగిపోవుచున్నది. నాయకులకును ప్రజలకును నాటివిశ్వాసము పోయినది. నేడు ప్రభుత్వమువారు భారతీయులకు స్వాతంత్ర్యము నిత్తురను యాసకలవారు కనుపింపరు. దీనికి కారణమాశాభంగమే. కేవలము స్వాతంత్ర్యనిరోధమే కాక భారతదేశ ప్రజలకును, ప్రజాప్రతినిధులకును, సహింపరాని యవమానములను సంఘటించిన దనునమ్మిక పెక్కురకుకలదు.

ఇట్టి పరిస్థితులలో తలచూపినదీ చీనాకలవరము. చీనాదేశీయులీ దుస్థితిని చూచుచున్నవారగుటచే స్వాతంత్ర్యమును కోల్పడిన తాముకూడ నిట్టి నైచ్యమునే యనుభవింపవలయునని భయపడికాబోలు చీనాప్రభుత్వము కన్నుతెఱచినది. అచ్చటి కలవరమునణచుటకై భారతీయపటాలములు పంపబడుచున్నవి. ఏ స్వాతంత్ర్యముకొఱకై అర్ధశతాబ్దమునుండియు భారతీయులు పోరాడుచున్నారో, ఏస్వాతంత్ర్యము లేక నేడు పరిశ్రమలును వాణిజ్యమును మూలబడినవో ఏస్వాతంత్ర్యము ప్రస్తుతము భారతజాతి భూలోకస్వర్గసుఖముగా పరిగణించుచున్నదో, అట్టి నిష్కంటక జాతీయరాజ్యపాలనావిధానమున కడ్డుతగులు పరదేశీయుల చీనావారు పొమ్మనుట సమంజసము కాదని ఎవ్వరును చెప్పుటలేదు. అట్టి స్వాతంత్ర్యనిరోధమునకు సహాయము చేయుటకు భారతీయులు పంపబడుట నిశ్చయింపబడినదని పెక్కురాందోళించుచున్నారు. ఒకజాతియొక్క స్వాతంత్ర్యనిర్మూలనమునకు- అట్టి స్వాతంత్ర్యమునే నిరంతరముకోరు- మఱియొకజాతి సహాయభూతము కావలసిన దుర్గతి వట్టినదని ధీమంతులు చింతించుచున్నారు. భారతీయులకిట్టి యకార్యకరణమం దెంతమాత్రమును నిచ్చలేదు. కాని సార్వభౌమునాజ్ఞ నెరవేర్చవలెను.

## మహాత్ముని పర్యటనము.

మహాత్మునికి గోండియాలోను తుంసూరులోను భాండారులోను నాగపూరులోను విరివిగ విరాళములు సమర్పింపబడినట్లు తెలియుచున్నది.

గాంధిమహాత్ము డేప్రిలుమాసమున నాంధ్రదేశమున కరుగుదెంచును. ఆంధ్రదేశమును, దేశీయసోదరులయందలి జాతీయతేజమును, మహాత్ముడెట్లు సత్కరించునో చూడవలసియున్నది. తోడి రాష్ట్రములకు దాతృత్వమునను త్యాగమునను తీసిపోకుండునట్లాంధ్రరాష్ట్రము ప్రవర్తింప వలసి

యున్నది. ఆంధ్రసోదరులు తప్పక జాతిమత వైషమ్యముల విసర్జించి యేకగ్రీవముగ మహాత్ముని పూనికకుఁ జేయూతనొసంగ ముందంజవేయుదురుగాక.

నాయకులు.

అమెరికావారు భారతవర్ష స్వాతంత్ర్యమునకెంతో ధనము నిచ్చెదమని చెప్పిరి. మహాత్ముడు వారి సహాయ్యమును స్వీకరింపదలచుకొనలేదు. భారతజాతికి, అంతస్థమైన తేజముకొనే స్వరాజ్యసంపాదనముపకరించునని మహాత్ముని యాశయము. కాలము పరిపక్వమగునప్పటికి స్వాతంత్ర్యము భారతీయులకు తప్పక రాగలదని మహాత్ముడు విశ్వసించుచున్నాడు.

హిందూమహమ్మదీయ విరోధమును గూర్చి మహాత్ముడు మిక్కిలి చింతించుచున్నాడు. హిందువులు మహమ్మదీయులు భారత సోదరులు. ఇట్టివారి కన్యోన్యములగు మతవైషమ్యములకు మహాత్ముని హృదయము పరితపించుచున్నది.

ఈశ్వరునిపై భారము వైచి హిందూ మహమ్మదీయైకమత్యముఁ బ్రార్థించుచున్నాడు. భగవంతుడు దక్క యిట్టి సంఘటనము నొరులు సమకూర్పఁజాలరని యాతని విశ్వాసము. భారతక్షేమంకరుడు మహాత్ముని యాశయముల సఫలీకృతంబుల జేయుగాక.

మౌలానా మహమ్మదాలీగారు దేశీయసైనికులను చీనాదేశమునకు పంపు రైలుబండ్ల కడ్డముగ పండుకొందుమని వాక్రుచ్చియున్నారు. ఏ భారతసైనికుడు దేశీయనాయకుల రుధిరపాత మొనరించి చీనాస్వాతంత్ర్యనిర్మూలనార్థము పోగలడు? ప్రభుత్వమువారు క్లిష్టమగు నీపరిస్థితులలో భారతీయులను చీనాదేశము పంపకుండుటయే మంచిది.

---

త్రాగుడు—మాంసాహారము

రాయపేటలో గడచిన జనవరి 14 వ తారీఖున దక్షిణ యిండియా జనోపకారక సంఘములవారి యాజమాన్యము క్రింద డాక్టరు ఆచార్యగారు త్రాగుడు మాంసాహారము వలన కలుగు కష్టములను గురించియు పన్యసించిరి. అధ్యక్షులగు డాక్టరు సో[illegible] వెంకట్రావుగారు మాంసాహారము యుష్ణదేశీయులగు మనకు పనికిరాదనియు, పిల్లలకు అసలే వలదనియు, మాంస సంబంధములైన టానిక్‌ల నుపయోగించుట వలన దేహమునకు నిజముగ బలము నివ్వకపోవుటయేగాక, బలక్షీణత్వము కొంతకాలమునకు సంభవించుననియు, అందుచే వాటిని తీవ్రముగ నిషేధింపవలెననియు జెప్పిరి.

డాక్టరు ఆచార్యగారిట్లనిరి. త్రాగుడు అలవాటొక జబ్బు. దీనివలన ననేకమంది గొప్పవారు అనుకొనని కష్టములపాలై, మెంటల్ హాస్పత్రులలోనికిని, సివిల్ జైళ్లలోనికిని పోవుట మిక్కిలి త్వరితముగను సులభముగను ప్రాప్తమగుచున్నది. ఈయలవాటు అనేక మహనీయుల జీవితము ధ్వంసముచేసినది. నేటి మానవసంఘముయొక్క పరమశత్రువు త్రాగుడే. దేహమునందలి యుత్సాహమును తగ్గించి కండరములను నాశనము చేయును. శరీరమునకు వేడి జనింపచేయుశక్తిని తగ్గించును. రోగము నెదుర్కొను శక్తి దేహమునకు త్రాగుడువలన క్షీణించును. అందువలన జనులు గ్రహణి కలరా మొదలగు జాడ్యములకు నెక్కువగా

బలియగుచున్నారు. ఈత్రాగుడు పిశాచమును నిర్మూలము చేయకున్నయెడల ఏజాతిగాని యభివృద్ధి జెందనేరదు. గొప్పశాస్త్రజ్ఞులు మాంసాహారమువలన ఆయువు క్షీణించునని చెప్పుచున్నారు. భారతీయుల యాహారమున దేహపుష్టికి కావలసిన పదార్థము లన్నియు గలవు. అందుచే తక్కిన దేశస్థులు మనవలెనే శాకాహారులై చాలకాలము జీవించి జీవితమునింకను బాగుగ నుపయోగించ ప్రయత్నించుచున్నారు.

ఈయుపన్యాసము నందలి సత్యమును గురించి ఎక్కువగా జెప్ప నవసరములేదు. గొప్పవారిసంగతి నటుంచి కూలినాలిచేసి జీవించు బీదప్రజలలో నీపాడుయలవాటు చేయుచున్న నాశనమునకు మితిలేకున్నది. నిరంతర దాస్యము అజ్ఞానాంధకారము ఎడతెగని దారిద్ర్యము మొదలగు ననర్థములన్నియు చాలమట్టుకుత్రాగుడు వలనకలుగుచున్నది. దీనిని నిర్మూలముచేసి దేశోన్నతికి దోడ్పడెదరుగాక.

## ప్రదేశమునందలి పాశ్చాత్యవిద్య

సర్. బి. పుల్లర్ గారు 'టైమ్సు' పత్రికలో నిట్లు వ్రాయుచున్నారు.

ఈవిద్యయొక్క ఫలితములు నాశనకరముగానున్నవి. యేలయన పాశ్చాత్య విద్యజ్ఞానాభివృద్ధి యను నదొక్కదానినే పోషించుచున్నది. విద్యయన జ్ఞాన సంపాదన, మంచిచెడ్డలు తెలుసుకొనుట మాత్రమే కాదు. సుగుణసంపత్తిని వృద్ధిచేయుటకూడ విద్యయొక్క విధియే. కొందరు మానసిక శాస్త్రజ్ఞులు సుగుణసంపత్తియన ప్రవర్తన యని పొరబాటుగా నూహించుచున్నారు. సుగుణ సంపత్తియనునది ముఖ్యముగా బుద్ధి, మనస్సులయొక్క సంయోగఫలితము. మనస్సు అనగా సర్వాలంకారమై, దివ్యమైన భావోద్దేశ్యములయొక్క మనకుగల ఆదరణతోగూడిన యభిప్రాయములే. ఇట్టియభిప్రాయములే మన జీవితముయొక్క గొప్ప ఆదేశములు. ఈఆదేశములలో మిక్కిలి ప్రాముఖ్యమైనది మనోనిగ్రహము లేక స్వార్థరాహిత్యము. దీనిని గలిగియున్నప్పుడే మానవుడు మృగములనుండి వేరుజెంది ప్రకాశించుచున్నాడు. ఈగుణమే జాతులయొక్క ఔన్నత్యమునకు మూలాధారము. భారతీయుల మనస్సునకు యింతకన్న అనుకూలమైనట్టిదియు, ఆదరణీయమైనట్టిదియు నగు గుణము మఱొకటి లేదు. అయినప్పటికిని దీనిని భారతీయుల పాఠశాలలో నేర్పుట లేదు.

* * *

న్యాయము, దయ, ధైర్యము, ఔదార్యము మొదలగునవికూడ జీవితముయొక్క ముఖ్యాదేశములే. వీటినన్నిటియు శ్రద్ధతో భారతీయుల బాలురయందు భోధించుటవేరు. అందుకు కారణమేమన యివి యన్నియును మతసంబంధములని తలంచుటయే మతద్వేషమున్నచోట, మతవిషయమైన యేసంగతియును బోధించుట కష్టముగదా!

మఱొక విధమగు యాదేశములు కూడ మానవులకు గలవు. పై జెప్పినట్టివి భావోద్దేశములుగాక బాహ్యవస్తువులతోను

జనులతోను సంబంధించియున్నవి. అవి రాజభక్తి, దేశభక్తి మున్నగునవి. ఇవికూడ విద్యావిధానమునందు వెనుకబడినవి. కారణమేమన నివి రాజకీయ భావముల నుద్రేపించునవనుకొనవచ్చును. అట్లయిన పైచెప్పిన భావోద్దేశముల బోధించుట కేమియు నాక్షేపణ లేదు. వీటిని కట్టుదిట్టముగ బోధించినయెడల పాశ్చాత్య విద్యాఫలితము భారతదేశమున మిక్కిలి మేలుగానుండెడిది.

మన విద్యావిధానమందలి ముఖ్యలోపములను సర్ పుల్లన్ గారు బాగుగా వెల్లడించిరి. సాధారణముగా మనపాఠశాలలందు సుగుణసంపత్తిని పెంపొందచేయు బోధన లేనేలేదని చెప్పవచ్చును. ఉన్నను నిర్జీవమై నామమాత్రముగా నున్నది. నేడుమన బడులయందు దేశభక్తులు, మహాత్యాగులు, మతోద్ధారకులు మున్నగు వారి చరిత్రలు బాలుర మనస్సుల నాకర్షించి, గొప్పయాదేశముల పురిగొల్పినచో అప్పుడే నిజమగు దేశాభ్యుదయమగును. ప్రస్తుతము మన దేశమందున్న యనర్థములన్నియు, కీర్తిదాయకములగు యాధర్మభావములు బాలుర మనస్సునందంకురింపజేసినచో, కొలది కాలములోనే తొలగును. నూటికి 70, 90 మార్కుల నేదో విధముగా సంపాదించుటయే బాలురకు ముఖ్యాదర్శముగా నున్నప్పుడు, విద్యావిధానము దేశోన్నతికెట్లు దోడ్పడును! దేశీయులు, విద్యాధికారులు యీసంగతిని తీవ్రముగ గమనించెదరు గాక!

# వింతలు వార్తలు

### శరీరములోని పనులు బయస్కోపులో జూపించుట.

శరీరములోనున్న యవయవములు, గుండెకాయ, మొదలగునవి చేయు పనులను రాంట్జన్ కిరణముల (X Ray) ఫోటోగ్రాఫులు యిదివరకే తీయుచున్నారు. ఇప్పుడున్ననో గ్లాస్గొవు బ్రిటీషు శాస్త్రజ్ఞులు అవయవములను సినీమా ఫిల్ములుగా మార్చి చూపించుచున్నారని తెలియుచున్నది. గుత్తి, చేయి, పేగులు, మోచేయి, వీటియొక్క పటములను సినీమా ఫిల్ములుగా దీసియున్నారు హృదయముయొక్క చలనములను సినీమాలో జూపింప సిద్ధముగ నున్నారు. వైద్య విద్యార్థులకును, సర్జనులకును యీపని మిక్కిలి లాభకరముగ నుండును.

### 2 లండను - న్యూయార్కు వైర్లెస్ టెలిఫోను.

లండనునుంచి, అమెరికాలోని న్యూయార్కు పట్టణముకు వైర్లెస్ టెలిఫోను వేయబడి, జనవరి 7 తేదీనుంచి ప్రజలయుపయోగమునకై వాడబడుచున్నది. ఈసర్వీసు మిక్కిలి సంతుష్టిగా పనిచేయుచున్నదని చెప్పుచున్నారు. మాటలన్నియు మొత్తముమీద సంతుష్టిగావినబడుచున్నది మొదటిరోజునే 27 పిలుపులు వచ్చినవి. మరునటి దినమునుంచి సుమారు 60 పిలుపులగుచున్నవి. వర్తకపు సంగతులుకూడ ఈటెలిఫోనుద్వారా ఎక్కువగా జరుగుచున్నవి. ఒక అరగంట మాట్లాడినందుకు పౌ 150లు చార్జీ చేయబడినది

3. వేడినీళ్ళ యూటలు.

హాంగేరీదేశములో, బుడాపెస్టు పట్టణమున కడుగుభాగమున యనేక వేడినీళ్ళయూటలు గలవు. బస్తీలోని యిండ్లను వెచ్చచేయగా నుంచుటకీ యూటల నుపయోగించు చున్నారు.

4 విద్యుచ్ఛక్తి.

ఒక రష్యాదేశపు యింజనీరు విద్యుచ్ఛక్తి బేటరీ నొకదానిని చేయుట కనిపెట్టెను. ఇది జేబులో నిముడుటయేగాక 10 రోజుల వరకు మోటారు బండిని నడుపుటకు తగినంత శక్తిని నిలిపియుంచును.

5 బొగ్గులోనుండి చమురు మొదలగునవి తీయుట.

రసాయనశాస్త్రజ్ఞుడొకడు రాతినిబొగ్గునుండి మిక్కిలి యుపయోగకరమైన పదార్థములను తయారుచేయుట కనిపెట్టెను. 500 టన్నుల బొగ్గులోనుండి 2000 గాలనుల పెట్రోలు, 6500 గాలనుల కిర్సనాయిలు, 3000 గాలనుల లూబ్రికేటింగు ఆయిలు, 12000 పౌనుల మైనము, 4500 పౌనుల తారు, 12000 పౌనుల గంధకము మొదలయినవి తీయగా నింకను 374 టన్నులు పొగరానిబొగ్గు మిగులును ఈబొగ్గు మామూలుబొగ్గుకంటె మంచి వేడినిచ్చును.

—(•)—



టాజిమహాల్.

# విజ్ఞప్తి.

ఆంధ్రావనియందు భాషాపత్రికలనేకము లున్నను మఱియొకటి ప్రచురించుటకు బుద్ధిపాడమువుటచే దివ్యమైన భాషాపుష్పముల సేకరించి మాలగా సమకూర్చుచుంటిమి. సేకరించిన ప్రథమసంచికయందలి పుష్పము లాంధ్రదేశముననేగాక యాసేతుహిమాచల పర్యంతమైన భారతవర్షమునగల యాంధ్రసోదరుల, తమ మనోహరసౌరభముచే నాకర్షించెననుట యెల్లరకును విదితము. తగిన చిత్రములు పొందుపరచి సర్వజనమనోరంజనము జేయ, సలిపిన మాకృషి ఫలితమునకు రాలేదు. అందుకు కారణము మత్స్యపుఃపత్రికా ప్రచురణకర్హమైన స్థలముకాని పోపుట చేత. సచిత్రమని సార్థకనామము నొసరించుటకై మార్చినెలయందు ప్రచురింపబడు పత్రిక యుత్తరవాదికాగలదు. కొందఱు విద్యార్థులగు వ్యాసరచయితలీ పత్రిక గ్రామ్యభాషా ప్రధానమా గ్రాంధిక భాషాప్రధానమాయని మమ్ము ప్రశ్నించుచుండిరి. ఉభయభాషాపోషకత్వము వహించిన యీపత్రిక గ్రామ్య గ్రాంధిక వ్యాధుల కనువైనదని వేరుచెప్పనక్కరలేదు. భాషాభిమానమునను, పత్రికాదరమునను యింతవరకు చెన్నపురిరాజధానియందు వివిధప్రాంతముల యందలి ప్రఖ్యాతివడసిన విద్యార్థులు తమ నిరుపమాన కవితాసౌరభ్యమీపుష్ప మాలయందు సమకూర్చినందులకు వారలకెంతయు కృతజ్ఞులము. పూజ్యులగు భాషా పోషకులెల్లరు తమ యమూల్యవ్యాసములను నీపత్రికయందు ప్రచరించి యాంధ్రుల యజ్ఞానాంధకారమును బాపుదురుగాకయని ప్రార్థించుచున్నాము. సంపన్నులును, భాషాభిమానులును నీపత్రికకు రాజపోషకులై, పోషకులై చందాదారులైయీపుష్పమాల యాచంద్రార్కము కమ్మతావులనాంధ్రావని వెదజల్లునట్లు ప్రోత్సాహింతురుగాకయని కోరుచున్నాము.

వ్యాసకర్తలు తమతమ వ్యాసములప్రతినెలయు 15 వ తారీకులోపుననే పంపప్రార్థితులు.

సంపాదకులు.

# పత్రికాస్వీకారము.

ఈ క్రింది గ్రంథములను కృతజ్ఞతతో నందుకొంటిమి.

సుజాత.

మాసపత్రిక చక్కని గ్లేజుకాగితములపై నలుబది పుటలుకలిగి ప్రచురింపబడుచున్నది. ఇందు లలితకళలు, కథలు ఖండకావ్యములు, వ్యాసములు విద్యాధికులచే పొందుపరుపబడియున్నది. ఇందు మాడపాటి హనుమంతరావు సిరుగూరి హనుమంతరావు రాయప్రోలు సుబ్బారావుగార్లు మున్నగు సభాషా సేవకులచే నలంకరింపబడుచున్నది. ఇందు వేణుగానలోలుడైన శ్రీకృష్ణుని త్రివర్ణచిత్రము ముద్దుమూట కట్టుచున్నది. మహమ్మదీయ భాషాప్రాధాన్యమైన నిజాంరాష్ట్రవాసులేగాక యాంధ్రదేశమున నెల్లవారును నీపత్రిక చిరకాలము వర్ధిల్లునట్లు చేయూతనొసంగుదురుగాక. సంవత్సరచందా రు 3. వలయువారు సంపాదకుడు సుజాత టూప్రుబజారు హైదరాబాదు అని వ్రాయవలయును.

లలిత.

విజయనగరమున వెలువడు మాసపత్రిక, రాయలు పరిమాణమున రఫ్ కాగితముపై నలుబది పుటలుకలిగి ప్రచురింపబడుచున్నది. ఇందు కావ్యములు, కథలు పద్యగద్యవ్యాసములు ప్రఖ్యాతి చెందిన విద్వాంసులచే పొందుపరుపబడుచున్నవి. సంవత్సర చందా రు 3_0_0 లు వలయువారు లలితా కార్యస్థానము విజయనగరము అని వ్రాయవలెను.

గంధర్వ.

విజయనగరమున స్థాపింపబడిన సాంఘిక మాసపత్రిక. ఇందు చిత్రకళలు, సంఘసంస్కరణ వ్యాసములు మిక్కుటముగా గలవు. 42 పుటలుగలిగి రఫ్ కాగితములపై ప్రచురింపబడుచున్నది సంవత్సర చందా రు 1_0_0.

భారతకథానిధి.

కడపజిల్లా ప్రొద్దుటూరున స్థాపింపబడిన మాసపత్రిక ఇందు మనోహరమైన కథలు, స్త్రీపురుషులకుకూడ నుపయుక్తమగునటుల ప్రచురింపబడుచున్నవి. సంవత్సరచందా 1_8_0

మధువు.

ఇయ్యది శ్రీయుతులు త్రిపురనేని చలమయ్య ప్రసాదులచే రచియింపబడిన చక్కని ఖండకావ్యముల సంపుటము. నవీన రంగమున వెలువడుచున్న భావకవిత్వమింతయు మిక్కుటముగా పొందుపరుపబడి పాఠకుల రంజింపజేయుచున్నది. వెల 0 8_0 వలయువారు కింగుబాండుకో బెజవాడ అని వ్రాయుడు

రాజేశ్వరి :—

సాంఘిక నవల, నెల్లూరు కళాశాల ప్రిన్సిపాల్ గారైన మహారాజశ్రీ రాయసం వెంకటశివుడు M. A. L. T. గారి రచితము ఇందు గృహకల్లోలములును, ప్రమాదములును ప్రమోదవిమర్శనములును మిక్కిలి యందముగా వర్ణింపబడినవి. చక్కని సులభశైలిలో స్త్రీపురుషులకు పఠనోచితమై నీతిదాయకమైయున్నది దీని వెల అణాలు 8

అందఱకు నుచితముగా పంపబడును.




ఈగ్రంథమునందు శరీరవ్యాయామ విషయము లు సంపూర్ణముగా చర్చింపబడినవి. ఇందు నాయొక్కయు, నాశిష్యులయొక్క, పెక్కు పద్ధతులను సూచించు ఛాయా పటములుగూడ కలవు. దీనిని సమగ్రముగ పఠించితిరేని నావ్యాయామ పద్ధతి మీకు బాగుగ బోధపడగలదు. ప్రతి భారతీయునకు దీని జదివిన మాత్రమున నూతనోత్సాహ మును శరీర వ్యాయామాసక్తియు కలిగితీరును. తపాలా ఖర్చుకు మాత్రము రు 0-2-0 రెండణాలు పంపితిరేని యీగ్రంథము వెంటనే పంపబడును.

ప్రొఫెసర్ యం. వి. కృష్ణారావు,
అఖిలభారతీయ శరీర వ్యాయామ మార్గదర్శి
పోస్టు బసవాన్‌గుడి. బెంగుళూరు. (సిటి)

# ఉద్యోగము లేదని విచారమెందుకు ?

స్వతంత్ర జీవనము నేర్చుకొనుము! 8 అణాల బిళ్ళలను పంపిన యెడల యీ క్రింది పరిశ్రమలకు అనుభవముచే సరిచూడబడిన ప్రక్రియలను వెంటనే పంపెదము. తయారు చేయు విధానము వివరముగ పంపుదుము. కరస్పాండెన్సుద్వారా సర్వము నేర్పబడును.

(1) నూలుబట్టలకు అనేక రంగులు వేయుట— ప్రింటుచేయుట.
(2) ఫొటోగ్రాఫు తీయుట.
(3) అద్దములకు కళాయి వేయుట.
(4) ఎలక్ట్రిక్ బేటరీలను తయారు చేయుట; గృహములయం దుపయోగించుట మొదలగునవి.
(5) సిరప్‌లను తయారుచేయుట.

వీటికి కావలసిన రసాయనములు వగైరా సరసమైన ధరలకు మావద్దనే దొరకును.

**Apply to**

**A. N. RAO & Co Masulipatam**

Vol. I No. 3
Mar.

# నీరాజనము

3649

కవిసోదరులు

పువ్వాడ శేషగిరిరావు, చోడవరపు జానకిరామయ్యగార్లు.

ఇవి నిత్యంబు మనఃప్రమోద కరణీయోచ్ఛ్రాయ ప్రవర్ధిల్లుమా
కవితోద్యాన లతావితానముల నీకై పూచెఁ గాంబోలు మా
ధవు వాసంతిక స్నిగ్ధయామ తటీ చైతన్యంబు ప్రేరేచగా
నివాళించెడి యీసుమాళికలతోయీ? బాలగోపాలకా!

నవకములు సెడవు, మాయవు. భువి నుండెడి పూలవోలెఁ వాలియవు; నూత్నా
ననము స్రవించుచు నిరతము భవదీయ హృదంతరమున బ్రమోదముఁ గురియున్

పరిమళంబుల, సౌందర్య గరిమ, నవక
ములను, నొండొరు గడచుచుఁ దళుకు లీను
మేని కాంతుల సాటి జగాన లేవి
కరణి ప్రేమోర్మిల గర్వంబు నెఱపుఁ గంటె

కమ్మతావులు నాల్గువంకలకు నలము
కొనియె — నీవింత జాగుఁ జేసిన నెటోయి?
జాలు వారెడి పూఁదేనె జార నీక
సేకరింపుము పుడిసిట నోకుమార!

"కవిత" నుండి



# పుష్పమాల

సంపుటము · 1 | మార్చి | సంచిక 3

## కృతఘ్నత

—*—

సన్నిధానము సూర్యనారాయణశాస్త్రిగారు

మ॥ నిను దర్శింపనె నీయొసంగు కనులన్ నీయన్యముం జూచుచుం
టిని నిన్నే నిలుపంగ నిచ్చిన మదిన్ నీభిన్నముల్ నిల్పుచుం
టిని నీపూజకె యిడ్డ హస్తయుగముల్ నీలాఁతిఁ బూజింపఁగా
వినియోగించి కృతఘ్నతన్ నెఱపితిన్ విశ్వేశ! మన్నింపుమా!

మ॥ నినుఁ బాడంగనె నాకు నేర్పితివి వీణెన్ దానిపై నొక్కకీ
ర్తనమేనిన్ నినుఁగూర్చి పాడియెఱుఁగన్ శ్రావ్యంబుగా నీకు; దే
వ! నితాంతంబు దురాశమై నిటునటుం బర్వెత్తుదున్ నీదు ద
ర్శనముల్ రోసి; కృతఘ్నతన్ నెఱపితిన్ విశ్వేశ! మన్నింపుమా!

గీ॥ నీసమక్షంబునకు రాఁగ నేను వెఱతుఁ బ్రభువుడాయంగఁ గొంకు నేరస్థుఁడట్లు
నీపరోక్షంబునందున నిలువఁ వెఱతు మనవి సనవులు విను దయామతి యెవండు?

# మేఘము

అవ్వారి సుబ్రహ్మణ్యశాస్త్రిగారు (శతావధాని)

—

శ్రీదైవారం దటిల్ల        నీచెంతన్, సరోజాక్షులా
మోదంబొప్పంజరించు చుందురచటన్, బూజ్యేంద్ర చాపంబు నీ
మీదన్ రాజిలు, నచ్చటన్ బ్రతికృతుల్ మెప్పించు, రత్నాల ప్రా
సాదంబుల్ నిను బోలు టబ్బురమె? యెంచన్ బ్రావృషేణ్యాభ్రమా!

మ॥ పరకీయోచ్చ తరస్థితిం గని సహింపంజాల కీర్ష్యాప్తి నం
బర చారిన్ నిను దాకఁగానె గిరియున్ భగ్న ప్రయత్నంబులై
శరభంబుల్ తలక్రిందుగాఁ బడి యొడల్ శైథిల్యమందన్ భవ
త్కర్కశావృష్టిని వీక్ష్యమానము లగుంగా ప్రావృషేణ్యాభ్రమా!

చ॥ రవి యుదయించు నప్పుడు కరంబుల కడ్డముగాఁగ నుంచినన్,
జవమున నాతఁడున్ సరసిజమ్మను నెమ్మొగమందునన్ హిమాం
బువులను నస్రముం దుడుచు పొంచె సరోజిని జేరవచ్చు వా
డవుట నసూయ గాంచఁ గలఁ డుల్లొనరింపకు ప్రావృడభ్రమా!

మ॥ కనకాబ్జంబు లెసంగు మానస మహాకాసారనీరంబు లా
ని నిలింపద్రుమ వల్లవాంశుకములన్ నీగాడ్పు లాడింపఁ గ్రొ
బ్బున నైరావణ దన్తికిన్ ముఖ పటామోదంబుఁ గల్పించి, ప్రీ
తి నటింపన్ విహరించె దొక్కొ! రజతాద్రిన్ బ్రావృషేణ్యాభ్రమా!

ఉ॥ అచ్చఁపు మంగళాకృతుల నంబర వీథిఁ జరించు నిన్ను లో
మెచ్చుచుఁ బాంథ భామినులు మిక్కిలి యక్కఱ దోపఁ జిక్కఁగా
వచ్చి మొగమ్ము గమ్ముకొను వాలికముంగురులన్ మరల్చుచున్
గ్రిచ్చులు మీటఁ గాంతు రదిగా సుభగత్వము ప్రావృడభ్రమా!

— —

# కవితా ప్రశంస

వడ్డాది సుబ్బారాయుడు గారు

చ॥ నవరసస్పృష్టిఁ జేసి వదనంబులవాఁడును దీర్చు, రూఢ మా
వివిధములైన భావములు వెల్లడిసేయుఁ, బ్రబోధమిచ్చి కన్
గవఁ దెఱపున్, బఱంబు విడఁగా నగు నందియముం దొలంచు, న
త్కవి రవిభాతి; నాతఁడెటుఁ గల్గఁడు, చీఁకటి కాదె యాకడన్?

క॥ దేవుని సృష్టివిలాసము । కోవిదుఁడగు కవి గ్రహించి కొనియాడుఁ గృతిన్
మావుల చైత్రవికాసము । కోవెల కని చెవులు సొగియఁగోయని కూయున్

క॥ కవి గాని పురుషుఁకంటెం । గవి కష్టసుఖంబు లెఱుఁగఁగలుగుం జుమీ, యా
వివరించి తెలిపినపుడను । భవమున, గాఢాలిఁగాని భామిని సరిగా।

క॥ చూలాలితనముఁ, బిదపను । బాలెంతతనంబుఁ దెచ్చి, ప్రసవశ్రమముం,
దూలించి, కందు తల్లిం । దేల్చు సుఖాంబుధి గృతియుఁ గవి నట్లే॥

మ॥ ఉదధిప్రాయనియోగి నోత్రిఖుని గర్భోద్భూత సద్రత్నముల్
గద, యాంధ్రప్రసవిఁ దిక్కనాది సుకృతుల్, తన్నన్నయాఖ్యుండు కో
విదుఁ డాపోతన; బాలకన్న నతసిన్ వేనోళులున్; భారతీ
వదనాస్రిప్లుతనోదనకుమ ఘృణాపాసుండతుల దల్పుఁడే?

ఉ॥ భారతి పారవేశను, బ్రభావతి పెండ్లిఁ బఱచు సప్పమున్,
గోరిక లూరకూరుఁ గద కొమ్మనతిక్కన, సూరనాగనన్,
నారల నాఁటినార లలవారల రూపులు పేటు నిల్పమిన్,
నీరసు గీఱగాదు నవి, నెమ్మగి కుమ్మలికం ఘటించెనుక్.

మ॥ పలికింపుం దను రామభద్రుఁడనుచున్ భాషించుఁ బోతన్న; య
ప్పలుకుం దప్పక నమ్మఁగావలయు; యావజ్జీవముం దీప్రమా
సళుపుం బెట్టిన కించనత్వ దురవస్థన్ మ్రాఁగుచున్నుండు, ని
శ్చలుఁడై పల్కఁగలండె భావరసభూమా భాసురోద్గ్రంథమున్?

# పుష్పమాల

ఉ॥ ఒక్కని శైలిఁ భావములు చక్కనివే కథకట్టు దీపినన్
మిక్కిలి పారవశ్యము, నమేయసుఖం బగు భారతంబునన్;
ఒక్కటి సత్కవీంద్రులకు దాఁకి; తపఃఫల మాంధ్రభూమికిం;
దిక్కన జీవనౌషధము తెల్గున; కిట వేయు నేటికిన్?

తే॥గీ॥ ఇభముఖప్రభవాహు లిర్వుర, నేకచిత్రముగ లిఖించిన, మెచ్చరే యచ్చినేర్పు?
రాఘవార్థంబుఁ బాండవార్థంబు, నొక్క కబ్బమునఁ గూర్చు కవిప్రజ్ఞ కాదె శ్లాఘ్య

శా॥ కాయంబుల్ విడియున్, నిజాంకురములః కాయంబులో, మేలుపా
ధ్యాయుల్ పోలెను మంచి సెబ్బరలః విద్యాబుద్ధులున్నేర్పి, ముం
దీకాలోకములన్ సుఖింపఁ బథంబే వారు చూపింతురో
యాయయ్యల్ కవు, లక్ష్మలర్చితులుగా, నాచంద్రతారార్కమున్"

("శ్రీవసురాయ చాటు ప్రబంధము" నుండి)

# సమర్పణము

భారతుల మార్కండేయశర్మగారు

ఆమెలతా మధురమ్ముల యాఁకితమ్ము
లీగృహాంగణ పుష్పము లేరి తెచ్చి
మాలకట్టించి ప్రణవ కుమారహస్త
ము గళిబట్టితి వెవ్వరినో యజింప
నానయించిన తరుణ మందార శోభ
నిదె సమర్పింతు నీపత్రిఫుల్లేక్షణముల
కెమట దీర్ఘాబ్దములు ప్రయాణించి సేక
రించినట్టిది సార్థక్య మిరవుగొల్పు

# భాసకవి "స్వప్న వాసవదత్త" విమర్శన

## విద్వన్మణి శిష్టా నరసింహ శాస్త్రి గారు

మహాకవి భాసుఁడు కాళిదాసాదులకు ప్రాచీనుఁడు. ఇతను బహునాటకములనురచించిన విద్వద్వతంసుఁడు. ఇతను కేరళదేశ వాసియని కొందఱందురు. దీనినటులనుటకు బలదేవునాదిని నాందిలో స్తుతించుట, ద్రవిడ, కేరళ భాషలయందుగల నాటకములఁ గానబడుచున్నది. ఆ మర్యాద నతనంగీకరించెను. క్రీ. శ. రెండవశతాబ్దమున నీతఁడున్నట్లు కొందఱును, నీతని నాటకములం దార్ష ప్రయోగములుండుటచే పాణినికంటె పూర్వుఁడని కొందఱు, భరతముని ప్రణీత నాటక లక్షణముల నతిక్రమించుటచే భరత మహర్షికంటె పూర్వుఁడని కొందఱు ఇట్లు పలుదెఱంగుల భిన్నాభిప్రాయములు గలిగి యుండిరి. ఇందు మొదటి సిద్ధాంతమునకు తగు ప్రమాణములు గలవు.

ఈ కవి భాషానైపుణిలో కాళిదాసునకు సరియనందగు. కాని భాసకవి ప్రణీత నాటక విలోకన సంజనితవైదగ్ధ్యతచే కాళిదాసుని శాకుంతల ప్రముఖనాటకముల నంత ముద్దుగా వ్రాసెనని చెప్పతగియున్నది. మఱియు నీనాటక ప్రథమాంకమున యౌగంధరాయణుఁడను యుదయన మంత్రి తన రాజభక్తిని, తన నీతినైపుణ్యమును, నతినిపుణతతోఁ గనబరచెను. అదెట్లన:—

కథాసంగ్రహము — ప్రద్యోతనుఁడను సార్వభౌముని ప్రియపుత్రి వాసవదత్త. ఇతని సామంతరాజు వత్సరాజు (ఉదయనుఁడు) బహుచతుర కళాకోవిదుఁడు. గజహృదయవేది. ఘనవైణికుఁడు. ఇతనికి వాసవదత్తనిచ్చినచో వాసవదత్తకుంగల సౌందర్యలావణ్య వైదుషీప్రభృతులు సార్థకంబగునని ప్రద్యోతనుడచుకొనెను. కాని యదియట్లు సంభవింప దుర్లభమాయెను. తుదకుదయనుని నొకమిషచే గజయూధపుల తనవీణాగానముచే నాకర్షింపుచున్న తఱి నొక కృత్రిమగజమును గల్పించి యేకాకినిఁ జేసి బందీగా తెచ్చి ప్రద్యోతనుండు తన కారాగారమున నతనినుంచి తనప్రియపుత్రియగు వాసవదత్తకు వీణనుపదేశించమని నియమించెను. అట్లుండఁ వారిరువురు కొలఁది కాలములోనే పరస్పరానురక్తులైరి. పిమ్మట వాసవదత్త తన తండ్రి యనుమతి బడయకయే యుదయనునిచే యుజ్జయినికిం దేబడెను. అచ్చట మహోత్సవమున పరిణయమైరి. వారిరువురియనురాగబంధము వర్ణనాతీతము. ఇట్లుండ వాసవదత్తయందనురక్తుండగు ఱేని గని యౌగంధరాయణుడు పరిపంథులచే ఱేని రాజ్యమాక్రమింపబడుట కవకాశముచు జూచి చేసిన చమత్కృతి యేమన కార్యాంతరమున తనయధీనముచేసిన వాసవదత్తను తనగ్రామమున నుంచి గ్రామమునుఁ గాల్చి యందు వాసవదత్తయు దగ్ధమైనట్లు కింవదంతి పుట్టించెను. దీనికి ఫలమేమన పద్మావతిని ఉదయనునకు

నొనగూర్చి మగధరాజుతో బాంధవ్యమును బడసి తత్సహాయముచే నుదయనరిపువినాశనము చేయుట. ఇందుకు కారణము కేవలమీ యుదయనునిచే బలవంతుఁడగు శత్రువు రోడింపఁబడఁడనియు, నిరతిశయానురాగము గల వాసవదత్త బ్రతికియున్నదన్నచో నుదయనుఁడు పద్మావతీ పరిణయమునకీయ కొనఁడనియును.

పిదప మారువేషమున యోగంధరాయణులు తపోవనమున తనతల్లిఁగనవచ్చిన పద్మావతికి వాసవదత్తనర్పించి "ఈమె నాతోబుట్టువు, సన్మార్గవర్తిని, నీమెను వృత్తశీలములనతిశ్రద్ధతో సంరక్షించి నేనడిగినప్పుడు తిరిగి నాకొసంగవలె"నని యోగంధరాయణుఁడు పద్మావతికొసఁగుట. పిదపనుదయనుఁడు వాసవదత్త మృతిచెందెననినిశ్చయపరుచుకొని రుమణ్వాతుఁడను ద్వితీయమంత్రిచే పద్మావతీపరిణయబద్ధచేతస్కుండై యంతకు పూర్వమే తన సంబంధ మపేక్షించుచున్న మగధరాజునకు వార్తనంపి పద్మావతిని బెండ్లియాడెను. వివాహమున తన నర్మసచివునిచే కొంత ప్రసంగము నడపంబడి వాసవదత్తతో కలిసియొక గదియందున్న పద్మావతి వినుచుండ "ఓ వత్సరాజ! పూర్వము వాసవదత్తయందు గాఢానురక్తుండవుగదా, యిప్పుడు పద్మావతిని పరిణయంబాడితి, వీరియిద్దరిలో నీకత్యంత ప్రియ యెవరని యతిపరిచయముచే ప్రశ్నింప "వాసవదత్త ప్రియతమ" యని చెప్పెను. అది విని వాసవదత్తమనంబున పరమానంద మొందెను. అమూల్యస్వభావయగు పద్మావతి యీసుఁజెందక రాజునకు గల ప్రేమాతిశయంబు నభినందించెను. ఇట్లుండ నొకదినంబున పద్మావతికి శిరోవేదన వచ్చెను. అందుచే నామె యుద్యానవన ప్రాంగణమున నున్న యొకసౌధాంతరమ్మున నున్నదని విని యుదయనుఁడటకేగి యామె యందు లేనందున యామె పరున్న శయ్య యందు పరుండెను. అప్పుడే వాసవదత్త తన యనుంగు చెలికివాటిల్లిన యస్వస్థత విని యామె నారాధింపబూని యాసౌధంబునకే చనుదెంచెను. అందునశయ్యయందు ముసుఁగిడి పరుండి నిద్రించుచున్న యుదయనుని పద్మావతి యనుకొని యాశయ్యందే తాను కూర్చుండి యామెతో ముచ్చటింపదొడఁగెను. ప్రత్యుత్తరమీయనందున పద్మావతి కేమి తోచునోయని యామెను గాఢముగ కౌగలించి అమ్మా శరీరము స్వస్థమా యని యడిగెను. అప్పుడు వత్సరాజు స్వప్నమున "హా వాసవదత్తా ఎటనుంటివి" యని కలవరింప సాగెను. రాజు వాసవదత్తయని యెఱుగకున్నను నతనికిం గల ప్రేమాతిశయంబుల వాసవదత్తపై కలువరించుచుండ కాకతాళీయన్యాయముచే నచటికేతెంచిన వాసవదత్త రాజునకు తనయందుగల ప్రేమాతిశయంబుల దెలిసికొని యతను రాజనియు, పద్మావతి కాదనియు నచట తానుండ దగదనియు లేచి వెళ్ళబోవుచుండ వాసవదత్త హస్తమును బట్టి యా నిద్రయందే యెటకేగెదవని నివారింప నామె దానిం సరకుగొనక తనగృహంబున కేగెను. ఉదయన రాజ్యము మగధరాజ్యముచే సంరక్షింపబడి రిపుజయానంతరము పద్మావతీ సహితుండగు నుదయనుని దర్శించి "నాతోబుట్టువు నిమ్ము" ని యోగంధరాయణుఁడు పద్మావతి నడిగెను. ఆమె తన వాగ్దానానుసారము తిరిగి వాసవదత్తను యోగంధరాయణునకిచ్చెను. అప్పుడు యదార్థముగు

వాసవదత్తను రాజుచూచి శంకించుచుండ యౌగంధరాయణుడు ప్రభువునకు తానుచేసిన కౌటిల్యనీతిని చెప్పి వాసవదత్త నర్పించెను. అప్పుడు రాజునకు గలిగిన యానందమునకు పరిమితిలేక యౌగంధరాయణుని బుద్ధి కుశలతకుమెచ్చి రుమణ్వతుని మంత్రి రహస్య సంరక్షణను స్తుతించి తనకు నీవృత్తాంతము చెల్పనందుకు నాతనిని మందలించి వాసవదత్తా పద్మావతులతో యుజ్జయినీరాజ్యమును జక్కగ పరిపాలించెను.

ఉదయనుడు

ఉదయనుడు ధీరోదాత్తుడు. వైణికుడ సాధారణ ప్రజ్ఞచే దనగాననైపుణిచే గజయూథముల నాకర్షించెడు శక్తి యాతనికి గలదు. రసికాగ్రగణ్యుండనుట కనన్యసామాన్యమగు వాసవదత్తానురాగమే తార్కాణము. ఇతడు విదూషకునితో

పంచేషుర్మదవేయదా కథమయం షట్పశర

పాతితః

అని మన్మథునియొక్క పంచశరములు వాసవదత్తాను రాగమునకే యుపయోగింపగా నీపద్మావతియను రాగమున కారవ బాణ మెక్కడనుండి తెచ్చెనని చెప్పెనుమఱియు విదూషకుడు పద్మావతీ వాసవదత్తలలో నీకు గల తారతమ్యమేమని యడుగగా

స్మరామ్యవంత్యాధిపతే సుతాయాః ప్రస్థానకాలే స్వజనం స్మరంత్యా బాష్పం ప్రవృత్తం నయనాంత లగ్నం స్నేహాన్మమైవోరసి పాతితాయా

అని వాసవదత్తాగమన కాలంబున గలిగిన యామెయొక్క భావ పరిణామమును స్మరించి స్వగతానురాగముచే స్నిగ్ధురాలగు నామెయందే గాఢానురక్తుం డగుటచే నీతనికి పద్మావతీ పరిణయము ప్రసంబార్థమని తోచుచున్నది. కాన నేకపత్నీవ్రతుడని చెప్పదగు. నీతడు శత్రువులచే జయింపబడుట పరాక్రమ హీనతచేగాదు. రాజ్యాల్పతచే. ఇందుకు యౌగంధరాయణుని కౌటిల్యనీతియే విజయహేతువు. పద్మావతీ పరిణయహేతువు. వారి కీతని యందుగల విశ్వాస ప్రేమాతిశయంబులు గణనీయములే. కానను దయుని సుగుణ సత్ప్రవర్తనాదికము కథా నాయకుండగుటకు తగియున్నది.

వాసవదత్త

వాసవదత్తయందు నిరుపమానమగు సౌందర్యమె గాక భర్తృవిశ్వాసాస్పదమగు ప్రేమ శకుంతలా ప్రభృతులయందు వలెనున్న దనుటకురాజు విదూషకునితో

పద్మావతీ బహుమతామమయద్య పిరూపశీల మాధుర్యైః వాసవదత్తాబద్ధంన తతావన్మే మనోహరతి

విదూషకుడు కూడా వాసవదత్తామే బహుమతా యని చెప్పెను. ఈమె తన సపత్నీ దుఃఖమును ననుభర్వకయే తనలో నాటిత్తో రాజు పరకీయు డయ్యెగదాయని విషణ్ణురాలాయెను. కాని యట్టియసూయ మాత్రము పద్మావతియందు చూపలేదు. తానుభర్తను ప్రేమించిన విషయములోనే మియు లోటులేదు.

పద్మావతి

ఈమె యోగ్యశ్రీమంతురాలు ధర్మప్రియ. బుష్యాశ్రమంబును చేరినంతలో బుషులకు బహుమతములగు దానముల నొసంగించుట యుక్తమని యామె తనయొక్క యభిప్రాయమును వెల్లడించెను. అట్లే

సమస్తదానముల జేసెను. అందు యౌగంధరాయణుడు "ధీరాకస్యాయన్ద్రష్ట ధర్మశ్రీచారశక్తాచారిత్రం రక్షితుంమేభగిన్యా"యని తనతోబుట్టువు యొక్క చారిత్రము రక్షణ చేయుచు గొంతకాలము నీయొద్దనుంచి నేనడిగినప్పుడు తిరిగి యివ్వుమనెను. అది దుర్ఘటమని యెంచి

"దుఃఖన్యాసస్యరక్షణం"

అనగా దాచి యిచ్చుట కష్టమని యనుకొని యౌగంధరాయణుడు

"ప్రథమ ముద్ఘోష్యకః కి మిచ్ఛతీత్యుక్తవిందానం విచారయితుం

అనగా మొదట నెవడే మడిగితే యనిచ్చెదనని పద్మావతి ప్రతిజ్ఞమిప్పుడు విఫలమగునా యనిన తోడనే వాసవదత్తను దాచి యిచ్చుటకొప్పుకొనెను. దీనిచే సత్యప్రతిజ్ఞురాలని చెప్పక తప్పదు విదూషకుడు పద్మావతిని గూర్చి సౌందర్యవతి గుణవతి తనకు కుక్షినిండ నన్నము పెట్టునదని చెప్పెను. రాజు.

కామం ధీర స్వభావేయం స్త్రీస్వభా వస్తు కాతరః

అని యీ పద్మావతి ధీరస్వభావు రాలనియు. సామాన్యముగా స్త్రీలకు భయస్వభావమనియు తలచుకొని యున్నాడు. మరియు పద్మావతి, రాజు వాసవదత్తను గూర్చి దుఃఖించినకాలములో నాయన దుఃఖోపశాంతికై చేసిన యుపచారములలో నేత్రప్రక్షాళనోదకములు నశ్రుపాత శాంతికై యొసంగినపుడు జరిగిన సంగతి. దీనిచే నామె ధైర్యము విశదము.

"రూపశ్రియం సముదితాం గుణతశ్చిత్తాం"

అని పద్మావతి సుగుణములను రాజే గణుతించెను.

యౌగంధరాయణుడు

ఇతను యుగంధరుని వంటి వాడు యౌగంధరాయణుని యొక్క చమత్కారనీతి రహస్యగోపనము భావి ఫలప్రాప్తికై తగు యత్నము, సామోపాయముల జనవశీకరణము మంత్రశక్తులవలన కుశలతయు నమాత్యస్థానమునకు తగినస్థితిని బోధించు చున్నవి. ఇతను ప్రచ్ఛన్న వేషమున పద్మావతి యున్న తపోవనమును ప్రవేశించినను

"కోయభోనివృతం తపోవనమిదం గ్రామీకరోత్యాజ్ఞయ"

యని యంతఃపుర పాలకుడు మహారాజస్త్రీలున్నచోటి కెవరూ రాగూడదని బహిరంగముగా చెప్పినప్పుడిట్లు తనపూర్వపు మంత్రిధర్మమున తపోవనమును గ్రామము చేయుట తగదని నిరూపించెను. తనకు వాసవదత్త యందుగల వాత్సల్యమును గూడ నిట్లు ప్రకటించెను.

"భుక్తోత్సుకమేవమివ యోధవత్యనాత్ర చింతాకార్య"

ఇట్టి రాజస్త్రీ సన్మానమహాగౌరవాధికము నీచేతననుభవింపబడి యిప్పుడు పరిత్యజింపబడినది గాన నందులకు చింతవలదు.

"చక్రారపంక్తిరి వ గచ్ఛతిభాగ్యపంక్తిః"

దీనిచే పరేంగితజ్ఞత్వము సమయోచిత కార్యకారిత్వము నిందుదృశ్యములు. ఈతని యాలోచనముసొంపు చూచినచో

"పద్మావతీ నరపతేర్మహిషీ భవిత్రి"

అని పద్మావతి వత్సరాజునకు భార్యగాగలదని తనయభిప్రాయఫలమును హాస్తా

మూలకముగా నిర్ణయించినాడు. వాసవదత్తను పద్మావతియందుంచుటలో యౌగంధరాయణుని బుద్ధి కుశలతకడురమణీయము. అదెట్టిదనిన బహుసుగుణశీల పతివ్రతాశిరోమణి, భర్తృవత్సలయగు వాసవదత్త పట్టమహిషి. యామెను తన యధీనత జేసుకొని గ్రామ దహనమిషచే నామెను తన సన్నిధియందుం చుకొనుట వత్సరాజుకు వేరొకవిధముగ తోచినచో తాను రాజద్రోహినినియు, నితరమైన యింకొకచోటనుంచిన వాసవదత్తయందు రాజునకవిశ్వాసము కలుగుననియు వాసవదత్తయందు రాజునకుగల ప్రేమ వాసవదత్త ప్రత్యక్షముగా ననుభవించ వలయుననియు పద్మావతీమహౌదార్యము రాజునకు ప్రకటింపచేయవలయు ననియు, యౌగంధరాయణుడు యోచించి వాసనదత్తను పద్మావతికి నర్పించెను. రాజు చివరక మాత్యునిట్లుస్తుతించెను.

"మిథ్యోన్మాదైశ్చయు నాద్యైశ్చశా
స్త్రదృష్టైశ్చ, పత్రైః భవద్యత్నైఃఖలువ
యం పద్యమునా సముద్రితా"

కవినైపుణి కవిప్రస్తావనను బహుచమత్కృతి తోక్లుప్తముగా వ్రాసెను. నాందిలో సూత్రార్థసూత్యను చిత్రముగా నింపెను అంకములను క్లుప్తీకరించెను. అర్థగౌరవమును పద్యవాక్యములలో ప్రౌఢత్వమును స్థాపించెను. పాత్రప్రవేశమును కథానుగుణముగ వచించుటతో పద్మావతి వనప్రదేశమునందు వాసనదత్త యౌగంధరాయణుల సమాగముచుననే కథాసంధిని కూర్చనకూర్పుకడ రమ్యము. గ్రామదహనమున వాసవదత్త యౌగంధరాయణులు నశించినారను కింవదంతిని తాను నాటకమున విశదీకరించుటకుగా బ్రహ్మచారిని నొకని నియోగించెను. ఈ బ్రహ్మచారి వృత్తాంతముచే తన కపటోద్యోగమునంతయు సాంగోపాంగముగా బహిరంగపరచినట్లు కథాక్రమమును నడిపెను. ఇందు కనిపించుగల యితివృత్తనైపుణ్యము కాళిదాసుకు మార్గప్రదమగుచున్నది. మరియు వాసవదత్త వత్సరాజు ప్రేమకు పాత్రురాలని చెప్పుట యీకవి మహోద్యోగము. అతడు వాసవదత్తావీణాదర్శనముకూడా నిరూపించియున్నాడు. ఇంతకు సపత్నుల నిద్దరికీ సమావేశమును కలుగచేసి నాయకునికి దక్షిణత్వము స్థాపించి కథను బహుచమత్కృతిగ సందర్భానంతర కథాసమన్వయ పురస్సరముగా నాటకమును రచించిన యీకవి తనయూహలచే నెంతగౌరవమును సంపాదించినది యాధునిక కవులు శిక్షాప్రమచే గ్రహింతురుగాక!

వస్తువు

ఈకథను కథాసరిత్సాగరములోనుండి గ్రహింపబడినది ఈకవి షుమారేబది నాటకములదాక రచించెను.

శైలి

ఈశయ్యజూడగా కాళిదాస, దండి, భవభూతులు కూడ యిట్టి శయ్యలో రచింపలేదనట్లు పొడకట్టుచున్నది. ఉపమాద్యలంకార చమత్కృతులాయా సందర్భములందు మాధుర్యప్రసాదాది గుణ, రచన, వైశికి భారవి, ప్రభృతి వ్యక్తిచమత్కృతి "రీతిరాత్మా కావ్యస్య" యను భోజునిసిద్ధాంతమును కవివాక్య మనుసరించుచున్నది.

# వసంతగానము

### చలమయ్య ప్రసాదు గార్లు

ఉ॥ రారవసంత! మావిచివురాకుల కొంగులు జీరులాడఁగ
ర్పూరపరాగ సమ్మిళిత పుష్పరసంబులు సంగ్రహించి శృం
గార రసాధిదేవత యనన్ వనలక్ష్మి యలంకరించెరా
హారతి పళ్లెరంబు మధురాధర రాగము పల్లవింపఁగన్

ఉ॥ పాడుమటంచు నావలపు జంగరుకోయిల పల్కరింపగా
రాఁడువసంతుడే పడుచు ప్రియపుఁదీయ తనంబులొల్కుపూ
బోఁడి కవుంగిటన్ బెనగి పువ్వులరంగడు జంటితేనెఝూం
రాడుచుచుండెనో తెలియదక్కట యీపవడంపు సంజలన్

ఉ॥ కన్నెగులాబిరాణి నవకంపు బెడంగుల లీనమయ్యెనో
క్రొన్నన వింటివాని యనుగున్ జెలికాఁడల పూలపల్లకీ
వన్నెల కోడెగాడెచట స్వైరవిహారము సల్పుచుండెనో
న్నుల గానరాడు కడకన్నులతో మధులొల్కిపోవఁగన్

ఉ॥ పాండురగండ పాళికలపై విరిమల్లెలు పూయనాథుఁడై
దండ గ్రహించి మల్లెపువ్వదండల నీయగలేక ఖిన్నుఁడై
యుండి కళావిలాసముల నొల్లరు లేజవరాండ్రు నీవురా
కూఁడిన నమ్మచెల్ల పువ్వటోనగులందుము చిందువందునే?

ఉ॥ భీత మనస్కులై తుహినవీథులలో బులకింప మాంగళ
స్నాతకులైన యీపడుచు జంటల మోహన సౌఖ్యడోలను
జ్ఞాతలనూపి యాశిశిరయోధుఁడు దృశ్యతనొందె నీవహో
వా తెరపై నటింపనవ్వు బంతులురా వదియేల మాధవా!

ఉ॥ నూతన యౌవ నాంకమున నోములునోచిన ప్రౌఢదంపతుల్
శీత సమీరనాథుని భజించి భజించి గడించి రవ్యయా
ద్వైత సుఖానుభూతి పరతత్త్వము గాంచిరి నీవహోపరం
జ్యోతిఖిధాన నన్నుదయజూడగ రావదియేల? మాధవా!

# ప్రపంచ వార్తలు

## స్వతంత్రుడు

పరమానందాచార్యులవారు పరమ వేత్తలు, బ్రాహ్మణ్యులు, కాని తగినయశస్సును మాత్రము స్వీకరింపఁజాలక పోయెను కారణమేమో తెలియునా? ఆయన యీకాలమునకుఁ బనికివచ్చు మనిషికాదు. అందుచే నిప్పటికాలపు గౌరవపు పద్ధతులా మాహాత్మ్యునకు దెలియవు. ఆయన పండితుఁడు. రఘువంశము మొదలు సమస్తాలంకారిక గ్రంథపర్యంతము నాయన జిహ్వాగ్రమునఁ దాండవం బొనర్చుచుండును సమస్తకావ్యనిఘంటుపురాణ ఇతిహాసాది గ్రంథసామగ్రియంతయుఁ దలంచినప్పుడాయనకుఁ గన్నులు గట్టినట్లుండును. శ్లోకము సమన్వయించి పాఠముఁజెప్పుటకు బూనుకొనినచో బాలాతుఁడైనఁ దప్పుపట్టజాలఁడు. వ్యాకరణమునకుఁ బతంజలి, తర్కమునకు గౌతముఁడు, సాహిత్యమునకు సరస్వతి. కాని యేమిలాభము యీకాలమునఁ బండితుఁడని పిలుచుట కివియేమియుఁబనికిరావు. అవన్నియుఁ బాతతుక్కు, పనికిమాలిన పురాణము ప్రాచీనఛాందసులు వ్రాసిన పరమాసహ్యమార్గములు. తలతిక్క వెఱ్ఱిమొఱ్ఱిమాటలు ఎనుగు బొదుగులేని పిచ్చిఖోరణి. దీనివలన నేమిలాభము. ఎవ్వరైన నొకరు ఏమండోయి మీరు పరమానందాచార్యుల వారి నెఱుఁగుదురాయని యడిగినచో మేమెఱుంగము చెప్పుదురు కారణమేమి? నిరాఘాట వచః పరిపాక విజృంభిత నిరోష్ఠ్యపన్యాసములచే జనులు నాకర్షించుచున్నాడా! నిరుపమాన వాగ్వైఖరీసముపేత దివ్యకవితాతుష్ట్యాదూతృల విజృంభించుచున్నాడా! లేకలోకోత్తర భావగర్భితములైన భావగీతములను వ్రాసి మాసపత్రికల నింపగలడా! కాముకకాముకీ జన మోహావల్లికాలవిత్రములైన నిరంతర విజృంభితమోహోన్మాదరస పూరితములైన నవ్య భావోదయములైన కర్తృకరణ క్రియాశూన్యములైన నవీన గోచరములైన ప్రేమగీతములను ప్రణయ మాలికలనేమైన వ్రాసి విద్వజ్జన కల్లోలమొనర్పఁగలిగినాడా సమస్తాంధ్రావనిని గగ్గోలు పెట్టజాలిన సరసహాస్యోపమాన సంభరితములైన లచ్చిపాటలో టెంకిపాటలో తోటకూరపాటలో వ్రాసి విమర్శకశిఖామణుల కందరకు జుట్టుజుట్టు ముడులవుబెట్ట గలిగెనా? ఏమిప్రాధాన్యమున్నదని యీయన నెఱుంగవలయునని యడుగుదురు. అందుచే పరమానందాచార్యుఁడు స్వయముగ నెచ్చటికిబోవక తనస్థానమందుండియే కొలఁదిమంది శిష్యులను దయారుజేసెను. అందులో సుప్రసిద్ధుఁడైన స్వతంత్రుడు ఆచార్యులవారి ప్రీతిపాత్రుడు స్వవిషయమందెన్నడును పరాధీనుడుకాడు. మంచి లోకానుభవముగలవాడు. మహాపండితజన సముఖమందైన స్వాభిప్రాయ ప్రకటనమందు వెనుకదీయువాడని పాపసవంతుడు. ప్రపంచకవిషయములను పక్షపాతశూన్యుఁడై విమర్శించి వ్యక్తి

రేక పథావలంబు లెంతవెకసక్కెమాడుచున్నను లెక్కింపక సరకు సేయక గుణనిర్ధారణసేయగల మహాప్రజ్ఞాశాలి. అతనికి దేశాటనమన్నను దేశాచారధర్మ విమర్శనమన్నను మహాప్రీతి. అందుచే నిరంతరము పట్టణములయందే నివసించుచుండును. అందలి విశేషము లాచార్యులవారికి పత్రికాముఖమున వ్రాసి పంపుచుండును. ఆచార్యపరమానందులవారికి ప్రపంచవార్తలన్న మిక్కిలి సంతోషము. అందులో స్వతంత్రుని యుపన్యాసములన్న చెవిగోసుకొనును. అతని యుపన్యాసములకన్న దురాచారమేఘపటలికి మహావాయువ్యాస్త్రము. లోకజ్ఞానమునకాదర్శము. సాంఘిక కల్పనాతరంగములకు చెలియలికట్ట. గ్రామ్యవాదులకు దుర్నిరీక్షము ధర్మేతరలోక తంత్రసృష్టికర్తలకు సమ్మోహనాస్త్రము. అందుచే పెక్కుమంది పూర్వాచార పరాయణులే యాతని మిగుల మెచ్చుకొనుచుందురు. ఇదంతయు వ్రాయుటయేటికని యందురేమో? ప్రపంచవార్తలను జదువ వఁదలంచిన పాఠకులకు మా ఆచార్యపరమానందులవారియొక్కయు స్వతంత్రునియొక్కయు పరిచయము గల్గించుటావశ్యకమని తోఁచుటచే నీయుపోద్ఘాతమంతయు వ్రాయవలసివచ్చినది.

ఆచార్యులవారును శిష్యమండలియును స్వతంత్రుని జాబున కెదురుచూచుచుండిరి. చాలాదినములనుండి యతనివద్దనుండి జాబులేదు. ఏమాయెనని యనుకొనుచుండగనే చేతనొకమాసపత్రికను బట్టుకుని విద్యార్థియొకఁడా చోటునకువచ్చెను. తక్కిన శిష్యులందరిది వేమియని యడిగిరి. ఇది యొక నూతనమాసపత్రిక భాషాపోషణము జేయుటకై విడుచుకొని దేశముమీఁదఁబడినది గంతులువేయుచున్నది. ఇందుమున స్వతంత్రుని యుపన్యాసము ముద్రింపబడి యుండుటచేకొని వచ్చితిని అనిచెప్పెను. ఆమాటనువిని మిగిలిన వారందరుఁగలసి జపన యత్నింపనేనే చదువుదునని చెప్పి ప్రారంభించెను.

విన్నారా! ఇప్పుడు సంక్రమణ పురుషుని చూపు నాటకాలమీద ఉన్నది. కవులెల్లరు కవిత్వములను మాని నాటకాల విమర్శనములకు పాటుపడుచుండుటచేవారి యదృష్టమిప్పుడు గురుచండాల యోగమున నున్నది. శనిసప్తమ స్థానమును వదలి పదునాలిగింట ప్రవేశించుటచే పత్రికలలో మాసపత్రికలలో సారస్వతమందిరములలో గ్రంథాలయములలో నాటకపు పాకలలో, నట సంఘములలో కవుల గ్రంథములలో విమర్శకుల హృదయములలో, చివరకు కాఫీహోటళ్లలో, వర్తకుల కయిలకట్టలలో కడకు కల్లుపాకలలో గూడ నొకచోటని యేమి విశ్వమంతయు నాటక విమర్శనములతో నిండిపోయినది. వెఱ్ఱివాని పెండ్లాము వాడకెల్ల వదినెగారన్నట్లు నాటకంకళ పండితజనోదాసీనమును సహించలేక దేశముమీదికి వచ్చునప్పటికి ప్రతివాడును తనకిష్టము వచ్చినట్లు సాగదీయుచున్నాడు. కనపడిన చోటులలోనెల్ల వచించుచు పరవళ్ళు ద్రొక్కుచున్నాడు. వ్యాసములు పైవ్యాసములను వ్రాసి పత్రికాధిపతుల భారమును తగ్గించుచున్నాడు. అచ్చుపడివచ్చిన ప్రతి నాటకముపైనను విమర్శనమును వ్రాయుచున్నాడు. కనపడిననటుల దగ్గిరదనపాండిత్యమును పామ్మనువరకు నిలుపబడి వెల్ల

డించుచున్నాడు. మూలబడియున్న నాటక కళ కీనాటికింత వైభవము ఇంతమహోన్నతదశ ఇంతగౌరవస్థానము ఇంత యలంకార పరిపాక దుర్విపాకము ఇంత జన కంటకము కాదు కాదు జనసంస్మరణము కలుగుట దైవసంకల్పముగాక వేరేమున్నది ? ఈశ్వర సంకల్పమీ విషయమునం బ్రతివానియందును బ్రకాశించుటం జేసి యేనాటకపు మొగమెఱుగని వాడు అలంకార శాస్త్రానభిజ్ఞుడు మాతృభాషా విహీనుడు. పాత్రతాపాత్రత కూడ దెలియని యజ్ఞానికూడ నాటకములపైనను నటులపైనను విమర్శనములను వ్రాయ సాహసించుచున్నాడు. ఒహోహో యేమి వైపరీత్యము ? కాదా మరి యేనకేనాప్యుపాయేన ప్రసిద్ధః పురుషో భవ అన్నట్లు మహా కల్లోలములోనే యేదియో నాలుగుముక్కలు వ్రాసి యే పత్రికకో బంపించి భాషాసమితియని యో ఆంధ్రరత్నాకరియని యో చివరనొకతోకం దగిలించుకొనిన గాని నలుగురిలో నడుమకు ముగ్గురిలో ముందునకు వచ్చుటకువీలులేదు. ఈకలిద్వారపు పాజీలో యీ మహావాతావరణములో యీ తుపానులో యీ మహాసంక్షోభములో బడి వందలకొలది నాటకములు బుద్బుదప్రాయములగుచున్నది. పాత్రౌచితియు రసప్రధానము భావగాంభీర్యము భాషాపటిమ లక్షణానుకూలము నైతికపారమార్థిక ధర్మముల కాదర్శప్రాయము మొదలగు [illegible]మము లిప్పటినాటకములకక్కరలేదు. నాటకగ్రంథకర్తలు యెవరికివారే యమునాతీరే యిది వేదాంతంబండీ అన్నట్లు సర్వతంత్రస్వతంత్రులు సహజ పాండిత్యసంశోభితులు సహకార [illegible]రసగులు సర్వంకష ప్రజ్ఞాసంశోభితులు నిరాఘాట స్వతంత్ర వాక్యరచనానిర్ణేతలు నిరంతర నాటకరంగాభిమానులు యెవరికివారే తమయభిప్రాయమే సర్వోత్తమమని సభారంగమున బల్లగుద్ది వాదింపగలఘనులు. ఇట్లు ప్రపంచకమందు గాలిలోంగదలు పరమాణువులవలె నెవరికివారే విమర్శకులు ఎవరికివారే నాటకకర్తలు అసంఖ్యాకులుగ బ్రకాశించుచుండ నింక జెప్పవలసినదేమున్నది ? ఎన్ని నాటకములజదివినను ఎందరి యుపన్యాసములవిన్నను ఎన్ని విమర్శనములను బఠించినను సంశయ విచ్ఛేదముకాలేదు. నాటకరంగమనసేమో యెట్లుండవలయునో తెలియలేదు. రూపకమును సృష్టించిన వారియభిప్రాయమేమో బోధపడలేదు. మున్ముందు నాటకముల వ్రాయనున్నగ్రంథకర్తలకు రూపక నిర్మాణమెట్లుండవలయునో స్థిరపరుపబడలేదు. కొందరు వచనప్రధానులు కొందరు గ్రామ్యభాషావాదులు మరికొందరు సంగీతప్రధానులు కొందరికన్నియుంగావలయును. ఇంక విషయనిర్ధారణమెట్లు తేలును ?

ఈవిధముగా నాటక ప్రకరణమను చర్మ పాంచాలికా ఖేలనము జరుగుచుండనే కట్టెదుటనున్న ప్రేక్షకుల కన్నులు మిరుమిట్లు గొలుపునట్లు. ఆంధ్రనాటక పరిషత్తు అను శీర్షికతో గ్రంథారిగాని ప్రదర్శన మారంభమైనది. ప్రదర్శనమున అత్తమ్మకు బదులుగా నాటక లక్ష్మినాయికయామ అల్లుడు నను నిరువురు పురుషపాత్రలకు బదులుగా వచన నాటకాభిమాని గద్యపద్యగీతాత్మక నాటకాభిమానియను పురుషులు నాయకులు. ఈముగ్గురితోడను పురమందిరాంతర్భాగమున జగత్ప్రభు నిర్మిత చర్మ

పాంచాలికా ఖేలన రంగస్థలమున బొమ్మలాట ప్రారంభమైనది. ఈబొమ్మలాట ఆరుపూటలు జరిగినది. అనేకమంది సూత్రధారులై పాల్గొనిరి. లెక్కకు మించిన యుపన్యాసములు జరిగినవి. చివరదినమున విషయ నిర్ధారణసభ ప్రారంభమున నాటకమున కక్కరవచ్చు విషయమేమో తెలియకున్నను ఆంధ్రనాటక పరిషత్తు అన నర్థమేమి? ఆంధ్రదేశ స్థిత నాటక పరిషత్తు అనునది మధ్యను పదలోప సమాసమా లేక షష్ఠి తత్పురుషయా కర్మధారయ సమాసమా అనువిషయమున దీవ్రమైన చర్చజరిగెను అందరును తలకొక విధముగ బల్కిరి. దానితో వాదప్రతి వాదములు మెండయ్యెను. ఇదియంతయు జూడగా చిన్నప్పుడు మానాయనమ్మ చెప్పినకథ జ్ఞప్తికి వచ్చినది. అదేమందు రేమో యిటువినుండు.

అవివేకపు మహారాజు గారి వద్ద అజ్ఞానుడనుమంత్రియొకడుండెను. ఒకరోజున పంచాంగపు బ్రాహ్మణుడువచ్చి రాజుగారిం జూచి అయ్యా! తమరుచెప్పినట్లు బజారులోనికేగి అమావాస్యను గొనివచ్చుచుంటిని. గాని మధ్యత్రోవలో నయ్యది పట్టుతప్పించుకొని కొండగుహలో దూరెనని చెప్పెను. వెంటనే రాజుగారు లేచి మంత్రిగారికి రాజ్యమప్పగించి అరణ్యమునకేగి కొండను ద్రవ్వించి యమావాస్యను బయటికీడ్చియు ప్రియత్నములో నుండగా నొకనాడు సేవకుడువచ్చి రాజుగారికి నమస్కరించెను. రాజుగారు ఇంటివద్ద నందరుమా కుశలమా యని అడిగిరి. సేవకుడిట్లు చెప్పెను. అయ్యా తమరువెళ్ళిన తరువాత అమ్మగారికి పాముకరిచింది. మంత్రిగారు విషము తలకెక్కునేమోయని అమ్మగారి తలకాయకోసి ఉట్టిమీదపెట్టెను. విషము పోయినతరువాత అతికించినను తల అతికినది కాదు రాణిగారు చనిపోయినారు. అమ్మగారిని బైట దహనము చేయుట మంచిదికాదని మంత్రిగారు మేడలోనే చితిపేర్పించినారు. అందుచే మేడంతయు దగులబడెను. అందుచే దాని నార్పుటకై పెద్దచెరువుకట్ట తెగకొట్టినారు. నీరంతయు ఊరిపైకి వచ్చినవి. ఇంతవరకు చెప్పునప్పటికి రాజుగారికి పెద్దసంశయము తోచినది. ఏమందురా? ఈవల భార్యపోవుట మేడ అంటుకొనుట ఊరంతయు జలమయమగుటటుండగా చెరువుకట్ట తెగగొట్టితిరిగదా చెరువులో చేపలేమైపోయెనని ప్రశ్నించెను. అతి వివేకమంతుడైన యాభృత్య శిఖామణి వెంటనే అయ్యా చేపలు చెట్లెక్కెనని సమాధానము చెప్పెనట.

విన్నారా! అట్లనే నాటకరంగము నెట్లు సంస్కరింపవలయునో నాటకము లెట్లు వ్రాయవలయునో యను విషయము తేలకున్నను నాటకకళ నేవిధముగా బ్రవర్తిల్ల జేసినచో దేశమునకట క్షేమదాయకమగునో యనువిషయము తేలక పోయినను ఆంధ్రనాటక పరిషత్తు అనునదేసమాసమను విషయము మాత్రము తీవ్రముగ జర్చించబడినది

వారిలో నొక మహాపురుషుడు లేచి అయ్యా ప్రస్తుతదేశకాల పాత్రముల ననుసరించి యాంధ్రభాషానాటక పరిషత్తు అనియే అర్థము. ఇచ్చట సంస్కృతనాటకములకు బ్రసక్తిలేదు. కారణమేమన రంగస్థలమున బ్రదర్శింపబడునవి తెలుగు నాటకములే

గాని గీర్వాణ నాటకములు కావు. నాటకములు ఎప్పుడును దేశకాలపాత్రముల ననుసరించి యుండవలయును. గీర్వాణ నాటకగ్రంథ కర్తలందరును వారివారి కాలముల కనుగుణ్యముగ వ్రాసియున్నారు. కావున వానికిచ్చట ప్రసక్తిలేదు. కావున ఆంధ్రభాషా నాటకము లనియే చెప్పవలయునని నిర్ధారణజేసెను.

సభలోనుండి యెవ్వరో ఇప్పటి కవులలో నిర్దుష్టముగ నాటకములను వ్రాయగలిన వారెవ్వరని కేకవైచిరి.

అందుల కా మహాత్ముడు మరల లేచి అయ్యా కాళిదాసంత వానికి "గలదు తప్పు" అనునట్లు ప్రపంచమున తప్పులేని కవియే లేడు. ఇంతమాత్రము లోపములు గీర్వాణ నాటక గ్రంథకర్తల కృతుల యందును లేకపోలేదు. అని చెప్పెను. సభలోనున్న యొకశాస్త్రిగారా మాటను విని నాయనా! బుద్ధిమంతుడవు. బృహస్పతికి పెద్దన్నగారవు కాబోలు లేకున్న నిట్టి యుక్తి యెవ్వరికి దోచును? వారి కావ్యముల జదివి భాషాజ్ఞానమును సంపాదించితివి. వారి నాటకములఁ జదివి యలంకార విశేషము రంగనిర్మాణము పాత్రల ప్రవేశము మొదలగు విషయములను నేర్చుకొంటివి. ఇప్పుడు నాలుగు గీతపద్యములు వ్రాయుట వచ్చునప్పటికి వారి నాటకములలో మాత్రము తప్పులుండవా? మాకన్న వారియెక్కువ యేమి యని తీండ్రించుచున్నావా? అదియునుంగాక వారు దేశకాల పాత్రముల కనుకూలముగ నాటకముల వ్రాయలేదని యనుచున్నావు. నాయనా? ఎప్పటికైనను జీరస్థాయిగా నిలుచునవి వారినాటకములే గాని నీవు వ్రాసిన వసంతము నేను వ్రాసిన బ్రహ్మచెముడు మొదలైన నాటకములు నిల్చునవికావు. కావున నాప్రసంగమును గట్టిపెట్టుము. అని మందలించెను.

ఇక్కడికీ ప్రసంగము అనేకవాద ప్రతివాదములతో క్రోధపూరిత పూత్కార హస్తపాదవిన్యాస సంఘట్టనములతో అర్ధాంగీకార సూచక శిరఃకంపనములతో అన్యోన్య పరిహాసములతో ముగిసెను. అటుపిమ్మట ప్రతి వత్సరమీ సమావేశ కార్యభారమును నడుపుట కొక కార్యనిర్వాహక సంఘము కావలయును గనుక సభ్యుల కార్యదర్శుల ఎన్నికలు జరిగెను. అటుపిమ్మట పరిషత్కార్య క్రమము ముగిసెను. బాబూ చిత్తగించినారా! ఆలులేదు చూలులేదు కొమరునిపేరు సోమలింగము అనునట్లు ఈసమావేశమెందుల కేర్పడినదో ముందు రాబోవు సమావేశము నాటికి జరుపదగిన కార్యక్రమమేదో యను విషయ నిర్ధారణము గాలేదు. సభమాత్రము ముగిసెను. ఇంతలో నొక పురుషుడు చేతను కరపత్రముల కట్టను జంకనిడుకొని యాస్థలమునకు వచ్చి పంచిపెట్ట నారంభించెను. నాకును ఒక కాగితము అందినది. అందిట్లుదహరింపబడి యుండెను. చూడదగిన నాటకరాత్రి రామదాసు నాటకము అత్యద్భుత నాట్యమండలి వారిచే నాటకపరిషత్సంఘము వారి యాధిపత్యముక్రింద ప్రదర్శింపబడును రామదాసు నటమత్తేభ వీరసింహ బిరుదాంకితులును ది వండర్‌ఫుల్ ఆంధ్రపిలెండరు అని పేరెన్నికగన్న యస్ పి దేశ్ గారు ధరింతురు కబీరు ఆంధ్ర నాట్యరంగ విచ్ఛేదిక దివ్యాలంకార బిరుదాంకితులును ఆంధ్రఅధోముఖ

బాలగంధర్వులని ప్రసిద్ధిచెందిన టిపి సరవయ్యగారు ధరింతురు.

ఆనోటీసును చదివినతోడనే నాకును నాటకప్రదర్శన కుతూహలము కలిగినది. ఆహా అంతభాగ్యమెప్పుడు కలుగును. నటులాసుప్రసిద్ధులు చరిత్రమా మహాభక్తశిఖామణియైన రామదాసుయొక్క దివ్యకథ కవియా నిరుపమానకవితాధారాసంపన్నుడు ప్రోత్సాహకులా అత్యద్భుత విమర్శకులని, జగద్విఖ్యాతిగన్న నాటకపరిషత్సంఘము. ఇంకనేమి చెప్పవలయును ? మంచి తరుణము మించిపోవునని వారే సెలవిచ్చియున్నారు అని తలంచుకొనుచు వీధిలోనికి వచ్చుసరికి ముందుతప్పెటలు వినబడెను. ఈ డప్పులేవచ్చె నాయనియనుకొనుచుండగనే వానివెనుక సింగిసింగడను పేరుగల రెండు పెద్దబుట్టిబొమ్మలను ఇర్వురు ధరించి వాద్యానుగుణ్యమైన గమనవైఖరులను జూపుచుండిరి. మరికొంచెము వెనుకకేగునప్పటికి ఒకభోగముమేళము దాని ముందు బాండుఅనుపేరుగల విచిత్రాంగ్లేయ వాద్యసమ్మేళనము బండిపైనెక్కి స్వరసమ్మేళనముచే శ్రవణభిన్నము జేయుచుండెను. అన్నింటికంటె వెనుక నొకశకటము వచ్చుచున్నది. ఇంతవరకే వాద్యము లన్నియు నేటికో నాకర్థముకాలేదు. వెనుకజూడ శుభకార్యలక్షణము లేమియుగానరాలేదు. పరిక్రించిచూడగా నావెనుక బండిలో శుభ్రవస్త్రధారుడును వలయాకృత ఖండితకేశుడును శకలీకృత కార్పాసకూర్పాసధరుడునగు పురుషుడొకడు వికృతోష్ణీషమును ధరించి కాగితములను పంచిపెట్టుచుండెను శకటమున కిరుప్రక్కల రెండు పెద్ద పెద్దబల్లలపై

అత్యద్భుత నాట్యమండలి
రామదాసు

అని పెద్దఅక్షరములతో వ్రాయబడియుండెను ఓహో ఈయాడంబరమంతయు నాటకప్రదర్శన ప్రకటనముగా బోలునని యింటికేగితిని బాబూ చిత్తగించినారా ఈయూరికింతతో నాకు సెలవా సంగీసచో దీని తరువాత బయలువెడలు సంచికలో రామదాసు నాటక ప్రదర్శనముం గూర్చియు మరి కొన్ని యితరాభిప్రాయములను గూర్చియు మీకుం దెలియఁజేసెదను



# వేణీభంగము

## విశ్వనాథ సత్యనారాయణగారు

(ఒక మిత్రుని గృహమున నాశువుగాచెప్పబడినది)

అది రాజసూయ మహాయాగ పుణ్యావభృధవేళఁ దడిసి పెంపెసగు వేణి
ద్రుపద భూపతి యజ్ఞధూమంబు వెఁబడి బాహిరిల్లిన చలద్భ్రమరవేణి
అతిరహఃకేళి మహావీరు డగు ధనంజయుని హస్తస్పర్శ సాగువేణి
అతి దివ్యకుసుమమాలాతిమంజుల మనోహరము, నల్లని త్రాచునైన వేణి

ఈ మహాదుష్టు డది యశే యింతమంది కూరుచుండిన సభలోనఁ గొంకులేక
తగుదునని ఘాతయోగ్యహస్తమున లాగి తారుచున్నాడు గురుసన్నిధానమందు

ఇతడేమి కులవృద్ధు సతి నేకవస్త్ర సంసత్తున కీడ్చి కేశములు పట్టి
లాగగాఁ జూచి బేల విధాన కన్నులు లేని వాని విధాన హీనుడైన
వాని విధాన నెవర కొక్క మాటయు లేకుండ మూన మలీమసుండు
కూరుచున్నా డని కోరి నిందించి రెల్లరు బాహ్లికుని భీష్ము— తరుణ వెఱిగి

అన్న కనుసన్న దుర్గర్వ మతిశయించు దర్పమున యువరాజు హస్తంబుజూచి
ఒక యమూహ్య దుర్వర్తన మొనరఁజేయ బోనగ వృకోదరుడు క్రోధమూర్తి
యగుచు.

తన చెంతన్ గజతుండవైఖరి గదాదండంబు దీపింప బో
రన నేత్రాంతవమన్మహాగ్రికలితోష్ణానేక రక్తాంశువుల్
ఘనమై క్రమ్మగ లేలిహాన వచన నగ్రింబైన పెన్మూర్తితో
గనుగొన్నన్ యమసూతి కంటితుద యాజ్ఞంబెట్టె శాంతాకృతిన్.

కని యతిదీనమైన గతిఁ గన్నుల నీరము వెట్టి చూచె న
గ్రజుడు వృకోదరున్ హృదయ శోకము లోపల కోప మెంతయున్
మునుకలు వెట్ట వాడుపడిపోయిన తామర రేకు లట్లుగా
దన కనుదోయి భూమిపయిఁ దార్చె వృకోదరుఁడు క్రమంబునన్.

ఆరీతి సభలోన నతి శోకమూర్తిఁ బాంచాలి వివస్త్రగా సలుపనెంచ
దుశ్శాసనుడు మహాధూర్తుండు కులగురుద్రోహియు పాపకర్ముడు కుటిలుడు
ఒకరైనఁ గాదన రొకరైన నిదియేమి పాడియటంచు జెప్పరు— ధనాధి
కుండు చేసిన చేతకును నాను గాదని చెప్పఁగలాడు దా క్షితిని గలడె

ఆది మహాద్రోహాముని సురలెవ్వరైన మింట ఘోషించుచున్నారొ మెరసి దివ్య
మైన జ్యోతిస్సు వెల్గునో - ఆరిపోవు నొక్కవేళకుఁ గొడిగట్టుచున్నదేమొ !

వారు దిగంతమ్ముల ధరణిపాలుర నోంచి మహాప్రతాప రో
చీ రుచిరాకృతిన్ మిగుల జేవురు దీపిక లెత్తినారటే
తీరని కాంతులన్ గళితతేజులు ఘోరతమశ్ఛటాముఖాం
భోరుహులై పృథాసుతులు మోసము పొంది రిదేలొ పండితుల్

తన విలోచనముల తనరు వైశాల్యంబు మించు శోకమునఁ గుదించుకొనియె
తపమూర్తిలో ధగద్ధగితమౌ తేజంబు కలిత బాష్పప్లుష్టమలిన మయ్యె
తన యవయవముల దనరారు దర్పంబు జ్వరహీన మగు గతి సాగిపోయె
మూఁడు లోకముల నిమ్ముగ నానవెట్టు నిక్కోన్నతి యొకమూల నొదిగిపోయె?

దించుకొనిపోయె నేల యుధిష్ఠిరాఖ్య యిదియ యేటి మున్నువుండి యసమానమైన
దిగ్దిగంతాంతరముల సంధిల్లిపేర్చుకొన్న శాత్రవ ధృతి నార్పుకొన్న దోయి?

ఒకడె కా! లక్క యింటికి జిచ్చు ముట్టింప భుజమున మోచి సముద్ధరించె
ఒకడె కా! బకుని నెమ్ములు నెమ్ముగాఁ జీల్చి సంధిసంధికి మధ్యఁ జావమోచె
ఒకడె కా! చండ బాహుగ్రదండధ్వస్త ఘనకృత హైడింబజీవయష్టి
ఒకడె గా! యెవని పేరికి భయంపడి ధార్తరాష్ట్రులు దూషితాత్రసులైరి

ఆ వృకోదరు డీనాడు స్వాత్మ లంకఁ దాఁటి గాంభీర్యరేఖ నిర్ధూతమైన
దలనికు కద్రొక్క బకుకోడె తాత్రిమునాని సంగమాంగమ్ము కదలకిట్లు భ్రమించు!

అటఁ గృష్ణుడట వీరుడట హితుడట! యూర ఎంత హైన్యంబు తానేచుకొనియె
విజయలక్ష్మి మహావేశ పరిష్వంగ రమ్యంబు వాని యురంబు నేడు
గళిత తేజోరాశి కరణి గన్పట్టు నేలా! యెంత మట్ట వేళావిపాక
మిత డొక్కపెట్టున నత్త్రిప మత్స్యనామకయంత్రి భేదన చకితమైన

దృష్టి పరపినవాడు పరింపఁబడియెఁ జో జగంబులు! నేడు విభూతిలేక
తాఁటి విప్పావులేక నూకకంట నగ్ని చల్లనడినట్టి శంకరు చాయఁదోచు.

అతి సాహసమున కుదాహరణంబులు మేలి యందాల దేహాలవారు
మాద్రీమహాదేవి మధుర గర్భంబున బండించు కొన్న కాల్పంటచేలు
ఆజాను దీర్ఘ బాహారమ్య వక్షులు పాత్రిక్యకాన సీరజదృగంతు
లమృత మూర్తులు మనోహర చారుకోదండ గంభీరహస్తులు కాంతియుతులు

పిరకే కవల్ తమ యెఱ్ఱపెదవులందు పంటినొక్కుల రక్త మేర్పడుపబడక
దృగుదిత క్రోధవహ్నులు, దృగ్నిరుద్ధ క్రోధవహ్నులు నెంత విఘూర్ణులైరి!

ఇవి యైన సందర్భములు నీ నవ భంగ తరంగ మెడలినన్ ఘటితం బే
యవుబో! లోకము కట్టగ చివికి తడిసి జీర్ణ జీర్ణ శిథిలంబె యగున్.

ఈ మహా శుశుక్షణి బడి యెంతదాక ప్రాణములు నిలబెట్టుకో యతన మింక
జేయుదురో! ధార్తరాష్ట్రులిస్సీ యటంచు వనరి పోయిరి చూడవచ్చిన జనంబు.

ఈ యెడఁ బాండవాగ్ని గగిలించెను ద్రౌపది యున్న యా సభన్
మాయురె! రాజరాజు సుకుమారత చూపు విలాస మేచు కం
దోయి సగంబు మూయుచుఁ గనుల్ రసికత్వము వెల్లడించు గం
డే యమదండ రీతి భ్రుకుటిన్ నటియించును భీమసేనుడున్.

ఒక్కటి సద్దు కల్గక, ముహూర్తమారుద్ధ సభాజనోగ్ర స
మ్యక్కృత దీర్ఘ నిశ్వసితమై, యిది లెల్లెడఁ గ్రమ్ముకొన్న యే
మొక్క నిశాంత వేళఁ జటులోగ్ర తరంగ నినాదమై కడుం
బ్రాక్కెడు నీరరాశి వలె పో! సభ భీకరమయ్యె నయ్యెడన్.

అప్పుడు రాజరాజు మధురాకృతి మిత్రుని గన్గొఁ బిల్చి యో
యప్ప! విలాసినీమణి సుహా యిది యన్న విధాన కన్ తుదన్
విప్పి గనుకింత మూసెఁ గనిపించెను వైఖరి యాజ్ఞసేనికిన్
రొప్పుచు భీమసేనుడు విరూపవిలోచను డగ్గి కాంచెనున్.

అది కని దంష్ట తాడిత మహా భుజగాకృతి, రోష భీషణో
న్మద భయదాకృతిన్ గనుల తమ్ముల కెంపుల గుంపు నిండుకోఁ
బొదలిన ధర్మసూతి కను మోసల పెంజడిఁ బంచు నాజ్ఞనొ
ప్పిదముగ వెంటవెంటఁ దలపించిన దాతనికిన్ మనస్సులో.

తన సింహాసన మందు నోరగిలి నేత్రాంబుల్ విలాసంపు సొం
పున దీపింపఁగఁ గౌరవేశ్వరుడు నిర్ఘృల్యుల్కఁ బాంచాలి పై
పునరున్ దృష్టి నిగుడ్చి దక్షిణకరంబున్ సాచి రమ్మంచు న
ల్లన సన్నం బొనరించె నూరుతటి మెల్లం దాకుచున్ గోళులన్

అది చూచె దూరమున నస్మదమూర్తి వృకోదరుండు మత్తాహిత ని
ర్మథన కళాచణ భీషణ గదాకలిత హస్తవన్మ గంభీరుండున్.

తన విలోచనములు చలత్తారకలును రౌద్ర రేఖా నిరూఢి సంరక్తములుగ
బలికె నీగతి సభలోని వారికెల్ల గుండెలో నెత్తురుల కాల్వ కూడుగట్ట.

ఇదె రిపులోక భీకరమహీశము నేను ప్రతిజ్ఞచేసెదన్
మదమున మాకుటుంబినిని మామక మూరువు నెక్కుమంచు నే
యధముడు సన్నచేసెఁ గలితాస్మదుదారకరాగ్రవర్తి యీ
గద మొనచేఁ దదూరువును ఖండితముం బొనరింతు నాజిలో.

రక్షోభీకరు నన్నుజూచి ధరణీరాజుల్ భయంబందఁ ద
త్కుక్షిం బ్రేవులు వెల్లగించి సమరక్షోణిన్ విజృంభించు ర
క్తాక్షున్ నన్నునుజూచి యేడ్చెదరులే కానిమ్ము కౌరవ్య లీ
వీక్షాక్రోధ భయంకరాకృతి సమర్థింపంగ నెట్లోర్తురో.

అస్మద్బాహు విలోల భీమగదా వ్యాపార పారీణు నన్
విస్మేరాంబుజ నేత్రి త్రైసురలు సంవీక్షించి యానంద ది
వ్యస్మేరాకృతులౌదు రప్పుడుగదన్నా! కౌరవుల్ నేటి యీ
యస్మద్ద్వేషకృతిం దలంచుకొని భీతాత్ముల్ విరోదించుటల్.

ఇది ప్రళయాతిభీకర మహీశము నాదు ప్రతిజ్ఞ యీగతిన్
విదితముగాగఁ జేయన గవీశతహత్య పొనర్చినట్లగున్
మదమున ధర్మసూతి యొకమాటకుఁ దప్పినవాడనౌదు శ్రీ
ప్రదునగు కృష్ణదేవు పదపద్మములన్ భజియించనట్లగున్

అని యీరీతిఁ బ్రతిజ్ఞచేసి చకిత వ్యాలోలనేత్రుండు నం
తన దూష్ణీంకృతినుండె భీముడు సభన్ దద్భీకరోక్తిధ్వనిన్
విని వృద్ధావనినాథు డెంతయు భయావేశంబునన్ బుత్రకున్
దనచెంతన్ బిలిపించి యేమి సభవార్తల్ చెప్పరా నావుడున్.

సదమల నీతిసార గుణసార విశారదమూర్తి యంతలో
విదురుడు పల్కె నీపగిది వేదుఱువొందిన నీకుమారకుల్
మదమున నింతలింతలుగ మార్చిరి శాంతమువైన యీసభా
సదనము నీకునుం గనులు చాలవు వీనులు చాలవా! నృపా?

కావలెనేని చెప్పెదను గాని యొకించుక విన్ము భూమిపా!
ద్రౌపదిఁ జూచి నీ సుతుడు తోరముగాఁ దన యూరు వెక్కరా
రావని సన్నచేసె నది రంజితమూర్తి వృకోదరుండు క్రో

ధావిలనేత్రుఁడై కని రయంబున దాను ప్రతిజ్ఞ చేసెనున్.

రణమున నిక్కొడుకు తొడను తన గదచే పిఱుగబొడిచి తజ్జనితాస్ర
ఘన వాహిని మునుక లిడెద నని భీషణవాక్యుఁ డయ్యె నవనీపాలా.

అని వచింపుచుఁగావిరి మహాభయకంపిత దేహయష్టియై
కనుగొనలందు బాష్పములు గ్రమ్మఁగ వృద్ధ ధరాధినాథుఁ డం
తన యిదియో యకార్యమని తానొక ఘోషవానర్తి గాని యూ
తని వచనమ్ము లొక్కరును తత్సుతులందు దలంచకుండినన్.

ఉ.
అపుడు రాజరాజనుజు నాకసి తమ్ముఁడ! యిద్ది దాసిరా!
త్రోపుపడెన్ జుమీ మనకు ద్యూతమునందిక దీని వస్త్రమున్
జోపగ బ్రాతిగామి నొకఁడో నియమింపు మటన్న భీతిచే
నోపఁడ యయ్యె వాఁడు మఱి యూకొనెఁ దానుగ దుస్ససేనుఁడున్.

దుస్ససేను డాతఁడు మహాదుష్టమూర్తి నిండుసభలోన బెళుకు లేకుండ పోయి
ద్రౌపదీదేవి కట్టువస్త్రంబు లొలువ నొక్క యించుకలో సముద్యోగియయ్యె.

అతిపరిఖిన్నమైన కనులందున దైన్యపు బ్రోవు ద్రౌపదీ
సతి పరికంపితాంగి యయి సత్సభలో గలవారి నందఱన్
జతనుగ జూచి యీ కృతియు సాధువె మీరలు పెద్దలిట్టులీ
వితముగ జూచి యూరకయ వేషుకులై కనుగొంచు నుందురే ?

నా తండ్రి ద్రుపద భూనాథుండు వింటిలో నారి తేరిన దిట్టమైన జోదు
నా తమ్ముఁ డొక్కఁడున్నాఁడు కోరెనయేని తనవింట సురల నధఃకరించు
సకల జగత్సుశిక్షారక్షణ ధురంధరుండు తానొక సోదరుండు కలడు.
సభలోన నిచట వాచస్పతి సములు కౌరవ వృద్ధులుండి ఊరక మహాత్ము

లింద రుండి యీ దుష్టుఁడో పృథ్వీరాజు సభను నొకసతి విగత వస్త్రగఁ బొనర్ప!
బడెడు సమయాన లేనట్టి వారెమైరి యెన్నినోములు నోచితి నేను మునుపు

అది యుండాక చనంగ నేమిటికి బాహాగర్వ దుర్వారులై
త్రిదివంబైనను గుత్తగాగొను భుజాధీశక్తులీ భర్తలీ
యెదురన్ లేరటొ? కట్ట! యే మనుము లేరే త్రాత లెచ్చోట నే
వెమకంగా దగు వారలెవ్వరు మహోర్వీశ నాల్గువార్మధ్యలో.

అని బాష్పప్లుత లోచన వినమ్ర ముఖ దేహ ద్రుపద పృథ్వీపతి పు

క్రి నితాంతముగ పరిదేవనముం బొనరించె రాతి వలె నిలబడుచున్

ఆసమయంబునన్ విచలితాత్మ ఫణాగ్రవమద్విషచ్ఛటా
భాసిత దందశూక మన బాహు విలగ్న గదామహోగ్రుడై
రోసమునన్ వృకోదరుడు రూక్షదృగంచలుడై ముహుఃక్రుధా
వేశముచేఁ గురుప్రతతి బీనుగు పెంటలు చేయునో యనన్.

ఒనర దుశ్శాసనుని మీది కురుక బోవ సమయభంగమ్ము చూపి విషణ్ణవదను
ధర్మసుతు చూపి వాడి చందంబుచూపి శాంతుగావించె డగ సవ్యసాచియంత

ప్రళయాగ్నిచ్ఛట భంగి భీముడు చలద్రౌద్రాత్ముడై యెవ్వడీ
ఖలు డస్మత్కుల గేహినిన్ వసనమున్ గాసిల్లగా నూడ్చెగా
దలచెన్ వానిని దత్క్రియా పరిణతాంధ క్రూరచేతస్కునిన్
కలనన్ ఘోర గదాభిఘాతముల సంఘట్టించి నుగ్గాడెదన్

తద్రుధిరమ్ము కాల్వలుగ తత్కలుషోగ్ర శరీర సంస్థముల్
క్షుద్రపు ప్రేవు లెంతయును జూడ్కికి నాచగ దద్వసా మిళ
న్మద్రిత మూర్తినై రుధిరపుం బెను కాల్వలఁ దానమాడెదన్.
కద్రువ సంతతిన్ గరుడుడైవడి కౌరవులం గలంచెదన్.

అని లోకాతిభయంకరంబుగ మహాహంకార నిర్ణిద్రుడై
కనుదమ్ముల్ రుధిరచ్ఛటన్ దొలుక వేగం దా బ్రతిజ్ఞోక్తి యి
ట్లనె కావించినఁ దత్సభాసదులు గాఢాశ్చర్యవైశాల్యలో
చనని రేజుల దైరి వాయుప్రలసంచారంబు కుంభించగా.

ఈ మహాపాప మెట్లు దర్శింతు మనుచు నవనతాననులైరి సభార్యజనము
ఈ కలుష మెట్టులఁ బరిణమించునో యని సకల జనములు మిన్నుల నిస్తబ్ధులైరి.

పడమూడీ యొకండె నిర్భయ పఱచె సభిని చీర తొలగుటయే తటస్థించె నేని
ఆత లేమైన సరి గదాహతి ధరిత్రి దుస్ససేనుని తలపడి దొరలెనంచు.

అట్టికష్టంబులో ద్రుపదాత్మజాత విశ్వనాథుని నాత్మ భావింపఁజొచ్చె
దిక్కులకు దిక్కెవండు శోధించి చూడ నే పరబ్రహ్మ సర్వేశ్వరేశు డతడు.

నీ చిప్పురాకు మెత్తసి కసీసికలన్ మెలపారె మేఘముల్
ని చెలుమేన మేఘములు నెక్కొనె నిక్కృపలోన మేఘముల్
తో చెరు నీవు నిలమ్మదు తోయదమూర్తివి దేవ ! వర్షధా

రాచణద్రుష్టులం బరపురా! యదువంశ శిరోవిభూషణా.

తీరని యీ దురంత జలధిం బడి దిక్కును లేక నే నిరా
ధారను వేడ వచ్చితిని దామరసాయదళాక్ష నిన్ను నె
వ్వారలు లేని వారలకు వారక నీ వొకరుండవే నటే
తీరని రక్ష నన్ను గని దేర్చుము నేటి మహాపదంబుల్

నీ యడుగుదమ్ములు తండ్రీ! యల వేదము చిగుర్పు విభ్రుతార్థమరం
దాయత ధునీ మృదుల శోభాయిత వీచికల నూగునట కాదె ప్రభూ!

అంతలో దుశ్శాసనాపశదుని చీరలాల్పుటకు కర మది యొలుచుచున్న
కరణిని యుండెను కడగి ద్రౌపది కట్టు చీరలు కొండలై తీరరాని
మేటులై యుండె నమ్మినవారి నీరీతి రక్షించు యదువంశరాజమౌళి
అని జనమ్ములు విలాసాశ్చర్య పరిదీప్త లోచనాంచలులు లోలోననెంచి
రల డస్సిపోయి తా నా మన్ననేనుండు కనులెత్తరాక క్రమ్మినత్రపాగ్ని
మగ్గిపోయెను
పాండవ మనుజనాథ వదన బింబంబు లోకయింత
వాడుదేరె
నాడు మొదలయ్యె నా యదునాథమౌళి
మహిత ద్రౌపదీ మాన సంరక్షణుండు.

## లీలాకమల

### ప్రభల రామబ్రహ్మానందంగారు

అతిథివైవచ్చి నాయింటనారగించి
శిశిరమిట్లని పలికె 'నోచిన్నవాడ!
అమృత భాగ్యోపములు నీకుకందజేతు
వేచి యుండుము మధువేళ హరియు దరుక
'తల్లి! నీప్రసాద'మని హృదంతరాళ
వీధు లానందవార్ధుల నెల్లి మెరిసి
'కోకొను మెట్టిదైన నాకుంగలదాన
నిచ్చినైచెద'నంచు వచించినాను
యత్నమున సేకరించిన యమృతమునువుం
గోరకొనె ... ...
నాపెకిచ్చితి గొంకకింత
'వాకిపలువిచ్చి నీకయి బ్రతికి యుంటి
అమృతమూర్తి! నన్నుకించుకయరసిచూడు
అలినిక్వణరాగ ముద్రావలోక
మాల మాటల్లుదును! క్షణమాత్రము!
అరసిచూతు
నా మనోంతరమున నీక్షణామధురిమ
నిలుపుచు దాచినాదేమొ...

# దారిద్ర్యము

కాకాని నరసింహ్వరావుగారు

మ॥ అరరే, యింతటి చంచలాత్మవని నేభావింపలేనైతి శ్రీ
హరిరాణీ, భవదీయ దాసునినను న్నమ్మించినట్టేటిలో
కరుణావేశములేక ముంపదగునే; గంభీరదారిద్ర్యమే
కరణిన్ దాటగలాడ త్రోవయొకడున్ గాన్పింపదిప్పట్టునన్

మ॥ తలిదండ్రుల్ ననుదెప్పసాగిరిక భ్రాతల్ యిండ్లకున్ నన్నురా
వలదంచున్ గొణుగందొడంగిరి, హితుల్ మాట్లాడుటేలేదు నా
యలినీబాలక లెక్కసేయదునను న్భాషింపరే బంధులున్
పలుకుల్ వేయివచింపనేల తలమేనర్జింప దారిద్ర్యమున్

ఉ॥ పైదలిలెక్కసేయదని పందుర, బీదతనంబు నందవో
నాదు శరీరమందుగల నల్లని రక్తమె నన్నువీడ, దా
రాది, సుహృజ్జనంబులు మదాజ్ఞల గైకొనకుంట వింతయే
పేదరికుండు ధాత్రి మను పీనుగుగాదె తలంప నక్కటా ॥

చ॥ అనిలము చేతనే తెలియనౌ కనకంబు విశుద్ధ మానసంబుల్
మనుజుని సద్గుణంబు లిలవార్తకు నెక్క దరిద్రుడైన నే
అనఘులు ధర్మరాజ నలరాజులె తొల్లి దరిద్రులైరి నే
ననొక లెక్కయే ? దశరథాత్మజుడున్ మునులేమి స్రుక్కడే ॥

గీ॥ పొట్టకూటికి నేనింత పొగులనేల
పిడికెడన్నము దొరకదే పృథివియందు
నారుపోసిన దేవుడే నీరుపోయు
అన్యచింతలు నాకేల హరి, దలంతు






# మహాలక్ష్మమ్మ

ఆండ్ర శేషగిరిరావుగారు (సారస్వతసమాజము)

---

మహాలక్ష్మమ్మ మొల్లవలెకవయిత్రి కాదు. రుద్రమ్మవలె మహారాణికాదు. నాచీవలె మహావిద్వాంసురాలు కాదు. నాగమ్మవలె మంత్రాంగమున చతురకాదు. అయినను ఆమె ఆంధ్రరమణీమణులలో నొకతెగా పరిగణింపవలసియున్నది. కానయితే ఆమె సామాన్య సంసారస్త్రీయే కాని ఆమె త్యాగబుద్ధి, స్వార్థరాహిత్యము, స్వామిభక్తి లక్ష్మమ్మ చరిత్ర ఆంధ్రులకు చిరస్మరణీయముగా నొనర్చి ఆమె యశస్సౌరభము ఆంధ్రదేశోద్యానవనమును పరిప్లుతముకావించునట్లు చేసినవి.

పురుషఘాతియైన రుస్తుంఖానుని క్రూరకర్మమునకు రాగమ్మాదేవి నెనరైనచుట్టాలతోడను కొడుకులతోడను బలివోయినప్పుడు వత్సవాయివంశము నిర్వంశము గాకుండ నిలుపుటకు తిమ్మరాజు సుతుడు ఏడుమాసముల కసుగందు మిగిలియుండెను. ఆతని పేరు రాయజగపతి. పాలుత్రాగు పసితనముననే "నాఅన్న" వారినెల్ల పోగొట్టుకొని చెట్టులేని పక్షివలె దిక్కుమాలియున్న ఈ రాజకుమారుని దగ్గఱతీసి రుస్తుంఖాను రాక్షసునిబారినుండి రక్షించు భారము తలపైనిడికొనినదియొక అబల.

ఆ అబలయే మన ప్రస్తుత కథకు నాయకయైన మహాలక్ష్మమ్మ. ఆమెపూర్తి నామము కొంపెల్ల మహాలక్ష్మి సోదెమ్మ. కొంపెల్లవారు పెద్దాపురసంస్థానము చిరకాలము పౌరోహిత్యము నెఱపిన వెలనాటి వైదిక బ్రాహ్మణులు

చిచ్చుఱుకుటకు ముందు రాగమ్మాదేవి యొకసారి మనుమని ఎత్తుకొనిముద్దులాడి ముప్పదికోట్ల దేవతలాతని నరసి రక్షించునట్లుగా దీవించెను. పిమ్మట రాగమ్మ బాలుని లక్ష్మమ్మచేతి కందించి ఇట్లు చెప్పెను.

తల్లీ! ఈపేగునుతీసి మీమెడలో వైచుచున్నాము. యాదవకులమునకు ముసలము పుట్టినట్లు రెండువందల సంవత్సరముల నుండి ఏకాధ్వరముగ పెద్దాపురసంస్థానము పరిపాలించుచుండిన వత్సవాయివంశమునకు కానిదినములు వచ్చినవి. ఈ సుప్రసిద్ధక్షత్రియ వంశమింతటితో నిర్వంశముగాకుండ నీవంశాంకురమొకటైన నిలిచి యుండవలయునని మాకోరిక. కావున ఈబిడ్డనిప్పుడే మీచేతులలో పెట్టుచున్నాము. ఈపాపని నవమాసములుమోసి కనుపారకనుటకేగాని చేతులార పెంచుకొనుటకు మాకోడలికి ఋణములేకపోయినది. ఇక ఈముద్దుబిడ్డకు తల్లి అయినా తోడు అయినా మీరే. మాకోడలు ఈపాపని కడుపునగన్నది. మీరు కళ్ళను కన్నారు. అంతే భేదము. కావున ఈతనిని మీబిడ్డగా భావించుకొని ఎన్నికష్టములైనపడి విజయనగరమునకు తీసికొనిపోయి

మహారాణిపాదములమీదవైచి మీరుకూడ నక్కడనేయుండి రక్షించుచుండ వలసినది. విజయనగరాధీశ్వరుడైన పూసపాటి సీతారామచంద్రరాజును మాతిమ్మరాజును తోడి అల్లుల్లు సీతారామచంద్రరాజు ధర్మపత్ని ఈపసిబాలునకు పినతల్లి. ఈచుట్టఱికపు సంగతుల మీరెఱిగినవే. మీకు విజయనగరమున తప్పక ఆశ్రయము దొరుకును కావున తురకల కంటబడకుండ విజయనగరముచేరి ఈసుగంధుని కాపాడవలసినది. ఇది మాకోరిక ఇహలోకజన్మమున మీఋడుపున మీఋణము తీర్చుకొందును.

ఇదులకు లక్ష్మమ్మ త్రికరణశుద్ధిగ ఒప్పుకొని లిచ్చినది. 'ప్రభుకార్యము అవశ్యము నెరవేర్తును, నాకంఠమున ఊపిరాడుచుండగా రాయ జగపతికేమియు కీడురానీయను అనులక్ష్మమ్మ విశ్వాసవచనములు విని రాగమ్మయు రాజపత్నులును నిశ్చింతతతో అగ్నిప్రవేశమొనర్చిరి.

శిశువునెత్తికొని పారాచౌకీల చెంతకువచ్చుసరికి తురకలు ఎదురై లక్ష్మమ్మను అటకాయించి "అక్కడాగుము. ఇతడు రాజపుత్రుడు. ఎచ్చటకు తీసికొనిపోయెదవు?" అని గద్దించిరి. తోడనే ఆమె "అయ్యో! ఇదియేమిపాపము? నవమాసములుమోసి కనిపెంచిన నాపిల్లవానిని రాజపుత్రుడనెదరేమి?" అని నిర్భయముగ మారుపలికెను. "ఈపిల్లవాడు నీకొడుకేని వీనిఎంగిలితిని మా సందేహము తీర్పుము అని ఒక తురకభటుడు జామపండొకటి లక్ష్మమ్మకిచ్చెను. తక్షణమే లక్ష్మమ్మ ఆపండు బాలునినోట నిడి పిదప తాను తినివేసెను. అందుపై తురకభటులు బాలునితోకూడ నామెను విడిచిపుచ్చిరి.

పరోపకారార్థము ప్రాణత్యాగమొనర్చుటకంటె కులత్యాగమొనర్చుటయే మిక్కిలి కష్టపుబలి ప్రాణత్యాగమొనర్చిన వ్యక్తికి నంతటితో ఇహలోకసంబంధము వీడిపోవును కాని కులత్యాగమొనర్చిన వ్యక్తికి నంతటితో ఇహలోకసంబంధము వీడిపోవును. కాని కులత్యాగమొనర్చిన వ్యక్తిని బ్రతికియున్నంతకాలమును ఇదికులభ్రష్టమైనవ్యక్తి అని అయినవారును కానివారును వేలెత్తి చూపుచుందురు. ఇట్టిదుర్భర జీవితముకంటె మరణమే సుఖాంచితముకదా! అందును వర్ణాశ్రమ ధర్మములకుత్తమ సీమయగు హిందూదేశమున మూడుశతాబ్దములకు పూర్వముకుల బ్రష్టత్వమునకు ఒప్పుకొనుట సర్వబ్రష్టగుటయే. పరోపకార చింతతోనీపట్టున వర్ణాశ్రమ ధర్మవ్యతిరేకము జరిగినదని అట్టి వ్యక్తిని ప్రశంసించు విశాలహృదయులు కోటికొకరుందురేమో? అయితే అందులకు లక్ష్మమ్మ చింతింపలేదు. గాలిపాటువంటి ఆవేశమునకు దాసోహముచేయు జనుల నింద ప్రశంసల నామె సరకుచేయలేదు. పాంచభౌతికమును నాశనమునైన దేహముకేగాని నిత్యమైన ఆత్మకుజెందని కులమర్యాదల నామె పరిగణింపలేదు. కులమునకేమి! రాజపుత్రుని రక్షించిన చాలును అని ఆమె నిశ్చర్ష చేసికొనియెను. స్వామిభక్తి పరార్థచింత లక్ష్మమ్మను ఇంతలకు పురికొల్పినది.

తురకలను మోసపుచ్చి కోటదాటి లక్ష్మమ్మ పెద్దాపురములోని తన ఇంటికి బాలుని తీసికొనివచ్చెను. ఆమెభర్త నడచిన వృత్తాంతమువిని మిన్నందెను. ఆబ్రాహ్మణదంపతులు రాజకుమారునితో విజయనగ

శమునకు పయనమైరి.

రుస్తుంఖానునితో రాజమహేంద్రవరమున తలపడి ఓడి తోటపల్లి మన్యములకు పారిపోయిన రామరాజు, సుబ్బన్న, రావు వెంకటకృష్ణారావు కొండవాళ్ళ సాయమున పితూరీకి ప్రయత్నపడుచుండిరి. కాని ఇంతలో మరణము తోసికొనవచ్చుటచే మన్యజ్వరములు తగిలి వారు మరణించిరి. అంతట రావు వెంకటకృష్ణరావు సన్నిహిత జ్ఞాతియైన రావుబుచ్చన్న పితూరీనాయకుడై దేశముపైకి వచ్చెను. రుస్తుంఖానుడు రావుబుచ్చన్నను పిఠాపురముకడ దాకి అతని తల తీయించెను. పిమ్మట ఖానుడు కళింగదేశముపై ఎత్తిపోవ తలపుగొనెను.

ఇంతలో పెద్దాపురమున తన భటులు యదార్థమెఱుంగలేక రాజకుమారుని నిరపాయముగ వదలిపెట్టిన సంగతి అతనికి తెలియవచ్చినది. అందులకాతడు మండిపడి బాలుని తిరిగి పట్టుకొనుటకు విశ్వప్రయత్నము లొనర్చెను. బ్రాహ్మణదంపతులు బాలునితో చేబోలుకడ దొరికిపోయిరి. అతడు తమ బిడ్డయేకాని రాజపుత్రుడు కాడని సోదెమ్మ ఎంత గోలపెట్టినను ఖానుడు వినిపించుకొనలేదు. పరీక్షించిచూచెదనని రుస్తుంఖానుడు కత్తులను పుస్తకములను బాలుని యెదుట నుంచెను. అసలింటి రాచబిడ్డ కావున ఆఱుమాసముల కసుగందు కత్తిమీద చేయివేసెను. అదికని క్రోధుడగు ఖానుడు సాభిప్రాయముగ తలపంకించి ఇది పులిపిల్లగాని మేకపిల్లకాదు అనుచు రాయజగపతిని ఖైదుచేసెను. లక్ష్మమ్మకూడ కారాగారముననుండి చిన్నవానిని పెంచుటకు కడుపు కాళ్ళు కట్టుకొని బ్రతిమాలినమీదట ఖానుడొప్పుకొనెను.

కారాగారమున రాయజగపతి జీవనస్థితి ఒరుగాలిలో దీపమువలెనున్నది. నిత్యము తానుముద్ద కడుగుకొనువేళ శిశువును తీసికొనివచ్చి ఎదుట పెట్టుచుండవలయునని ఖానుని సుగ్రీవాజ్ఞ. ఆరాచబిడ్డపీర శైశవమునకు ఖానుడు కళ్ళగోకారము చల్లుకొనుచుండెను. ఆరాక్షసుడా బాలుని కెప్పటికెట్టి ఘాతతలపెట్టునో? సోదెమ్మ ఆత్మసుఖమును మరచి శిశుసంరక్షణార్థము తపస్సుధారపోయుచుండెను. రాయజగపతి బాలారిష్టముల తప్పించుకొని పెద్దవాడై నూటిమీద నూరేళ్ళు బ్రతికి పెద్దాపురసంస్థానపాలకుడై కిలకిల్లనలయునని లక్ష్మమ్మ వేయిదేవుళ్ళకు మ్రొక్కని ఘడియలేదు. వీలు చిక్కినపుడెల్ల ఆమె ఖానుని భార్యకడకుపోయి తనకళ్ళనీళ్ళతో నామెకాళ్లు కడిగి తనకు పుత్రభిక్షపెట్టుమని పరిపరివిధముల ప్రార్థించుచుండెను. ఆడపేగు కావున ఖానుని ఇల్లాలు ప్రాకారమూని పెనిమిటి శిశుహత్య చేయకుండ కథనడపుకొని వచ్చినది. సోదెమ్మ భర్తద్వారా ఎప్పటివర్తమానము మహ్వాసు విజయనగరమునకందజేసెడిది.

విజయనగరమునుండి సాహాయ్యము అనుకొన్నంత త్వరలో రాలేదు. అక్కడకూడ విషమపరిస్థితులేర్పడుటచేత సీతారామచంద్రరాజు పితృవ్యపుత్రుడైన విజయరామరాజుతో సంస్థానము పంచికొని వేరుగా రాజ్యపాలనము చేయుచుండెను. విశేషప్రజ్ఞావివేకి అగుటచే సీతారామచంద్రరాజు ప్రతిభయేను మిగిలినది. అందులకు విజయరామరాజు ఈసుబూని విమ

ప్రయోగము చేయించి సీతారామచంద్ర రాజును తుదముట్టించెను. అందుపై రామచంద్రరాజు సహధర్మచారిణి భర్తతో సాగుమానము చేసెను. ఇట్లు రాయజగపతి తన తల్లియు, పినతల్లి భర్తయు మరణించుటతో విజయనగరమునుండి రావలసిన సాహాయ్యమునకు నీళ్ళువదలుకొని లక్ష్మమ్మ నిస్సహాయమై నిలబడెను. ఇక వారికి దిక్కెవ్వరు.

ఆత్మప్రభ హెచ్చుటకై అన్నను చంపినను విజయరామరాజు అన్నపుత్రుడైన ఆనందగజపతి యెడలను, వత్సవాయి రాయజగపతియెడలను ప్రేమకలిగియుండెను వాడు. విజయరామరాజు ధర్మపత్ని చంద్రయ్యామ్మాదేవికూడ నీపసిపిల్లలయెడ ఎనలేని ప్రేమ కలిగి యుండెడిది. అట్లగుట రాయజగపతిని చెఱవిడిపించి విజయనగరమునకు గొనిపోవ రామరాజు సకల ప్రయత్నములు కావించుచుండెను. ఈప్రయత్నములలో కొన్ని సంవత్సరములు సాగిపోయినవి. ఇన్ని సంవత్సరములును లక్ష్మమ్మ తన ఆశలన్నియు విజయరామరాజుచేయు సాహాయ్యముపై చోటొగ్గి రోజు నీడ్చుకొనుచు వచ్చినది.

నమ్మించి ద్రోహముచేసిన తనతండ్రిని నూరుద్దీను హుస్సేను డేరాకొయ్యలతో పొడిచి చంపి తాను పరిపాలనము ప్రారంభించెను. నూరుద్దీను రాయజగపతిని చెఱ విడిపించునని జనులు సంతోషించిరి. కాని అతడును తండ్రికి తగినకొడుకై రాజ్యలోభమునజగపతిరాజు కారాబంధనముల మఱింత బిగలాగెను.

నూరుద్దీనుఖానుడు బాలుని వదలిపెట్టుననను ఆశ అడుగారుటయేగాక, దినదినము ఎనరేగుచున్న ఖానుని రాజ్యకాంక్ష రాయజగపతిని మట్టుపెట్ట పురికొల్పు నేమోయను భీతి ప్రేమ భరాలసమైన సోదెమ్మ నవనీత హృదయమును ఆరని అగ్నిహోత్రమువలె ఉడికి పోవుచుండెను. ఈవిషయము సోదెమ్మ పెనిమిటి ఎప్పటికప్పుడే విజయనగరమునకు జేరవేయుచుండెను. విజయరామరాజున కేమి చేయుటకును పాలిపోవుట లేదు. త్వరపడి దండెత్తి పోయినచో ఖానుడు కోపించి బాలుని చంపునేమో, శిశువును గొనితెచ్చుటకు దండోపాయము తప్ప ఉపాయాంతరము పొడగట్టుట లేదు. బాలుడున్నగదికిని కోట సింహద్వారమునకును నడుమ నేడు పహరాలు కలవు. లక్ష్మమ్మకు తప్ప లాతివారికి రాజపుత్రుని దర్శనమే దుర్లభమైయున్నది. చౌఅసాల చెంత మెఱుపులవంటి పచ్చితురకలు విచ్చుకత్తులతో మస్తీపుడియలు పహరానిచ్చుచుందురు. అట్టిచో ఈపులినోటి కండను విడిపించుకొను టెట్లు?

ఇంతలో నూరుద్దీనుఖానుడు కళింగదేశమును లోగొనుటకు పెద్దాపురమునకు దివిజయయాత్ర వెడలెను. ఇట్టిసమయమునకై ఎదురు తెన్నులు చూచుచుండిన విజయరామరాజు తన సిబ్బందిని వెంటబెట్టుకొని రెండవ కంటివానికి తెలియకుండా పెద్దాపురము వచ్చిచేరెను. అప్పుడు మహాలక్ష్మి సోదెమ్మ కనకముతో కావలివాండ్ర కళ్ళుగప్పి బాలుని చెఱనుండి తీసికొనివచ్చి విజయరామరాజు చేతులబెట్టెను. వారలతో రామరాజు విజయనగరమునకు తిరలెను. రాయజగపతి కారాగారా వినిర్గమన వార్త జలతైలబిందువై అంతటను ప్రాకినది. ఖానుడదివిని మండిపడి విజయరామరాజును వెనుదగిలెను. లడాయికి పూనుకొని వచ్చె

చున్న ఖానుని రామరాజు చేబ్రోలుకడ నెదిరించెను

అప్పుడు దారుణయుద్ధము జరిగినది. విజయనగరపు వారి సేనలలో అనకాపల్లి బోయలనబడు ఫౌజు రెండువేలమంది యుండిరి. వారందఱును పిఱికికండ లేని పోటుమగలు. వారు పరాక్రమించి నూరుద్దీను ఎక్కియున్న ఏనుగును చుట్టుముట్టి అంబారిత్రాళ్లను తెగగోసి ఖానునిపట్టుకొని ఆతని తలను సొరకాయ ముచ్చికవలె తఱిగి వేసిరి. తమ ప్రభుని కలని పాటుతిలకించి తురుష్కసైనికులు ఈగలవలె నెగిరిపోయిరి. విజయలక్ష్మినొంది విజయరామరాజు బాలుని సురక్షితముగా విజయనగరమునకు తీసికొనిపోయెను. కొంపెల్లమహాలక్ష్మి సోదెమ్మ చేతి చలవ వలన రాయజగపతి పెరిగి పెద్దవాడై తరతరములనుండి తన పెద్దలు పాలించిన పెద్దాపుర సంస్థానమునకు పాలకుడయ్యెను

లక్ష్మమ్మ ఉన్నతచరిత. ఆమెస్వామిభక్తి ఎనలేనిది. అడుగడుగునకు ఆపదలు హిమాలయ పర్వతమువలె విఱిగి మీదపడు చుండినను బెంబేలుపడక ఆమె రాజపుత్రుని కాపాడినది. తానుఅబల, పూనినది కొండంతకార్యము, ఏడుమాసముల కసుగందుసంరక్షణము, గొప్పకసాయివాడైన పస్తుంఖానునితో విద్వేషము. మార్గమధ్యమున ఖైదు బాలునికి దినదినగండము, విజయనగరమునుండి రావలసిన సాహాయ్యమునకు ఎప్పటికప్పుడే వెన్నుబాటు, సాటిలేని స్వామిభక్తి, ఈడులేని పరోపకారచింత ఆమెను ప్రేరేచి ఈ ఇక్కట్ల నతిక్రమింపజేసినవి. తుదకామె కృతకృత్యురాలై పెద్దాపుర సంస్థానమునకు ప్రభుభిక్ష పెట్టినది

రాయజగపతివలెనే చిత్తూరురాణా ఉదయసింగు కూడ చిన్నతనమున తల్లిదండ్రుల పోగొట్టుకొనెను. ఏప్రవరతి లక్ష్మమ్మ రాయజగపతికి సంరక్షకురాలైనట్లే పున్నాఅను దాసి ఉదయసింగునకు పెంపుడు తల్లియయ్యెను. రాయజగపతి సంరక్షణార్థము లక్ష్మమ్మ స్వశరీర సుఖత్యాగమనకులత్యాగము నొనర్చి కడగండ్ల నతిక్రమించినది. ఉదయసింగు క్షేమమునకు పున్నకడుపారకన్న తనతనయునే బలిపెట్టినది. రాయజగపతి ఉదయసింగు లిరువురును దిక్కులేని అనాథలయ్యు పసితనమున ఇట్టిస్వామిభక్తి కలిగిన స్త్రీరత్నముల ప్రాపునొందిరి. కాబట్టి పెద్దలై ప్రభుత నెఱపిరి. పున్న లక్ష్మమ్మవంటి పుణ్యచరితలు స్వార్థపరత్వముగల ఈ మానవలోకమునకు గోవింద ద్వాదశులవలె మిక్కిలి అరుదుగ లభ్యమగుచుందురు.

స్వార్థరహితమైన లక్ష్మమ్మ రాజసేవానిరతికి మెచ్చి విజయనగరాధీశులు ఆమెపేరిట లక్ష్మీపురమను అగ్రహారమును కట్టించి ఇచ్చిరి.

..........

# శ్రీకృష్ణదేవరాయలు—విజయనగరము

---

పండిత పెనుమచ్చ సత్యనారాయణరాజుగారు.

---

శా॥ ఓయీ యాంధ్రకవీంద్ర! నిద్రవిడి యత్యుత్సాహివై పద్యముల్
వ్రాయం బూనక యేటికీగతి విహారా వ్యాలోలతం జెందగా?
గేయుఁడౌ నలకృష్ణ భూపకృతముల్ కేళీగృహారామముల్
మాయం జొచ్చినటన్న దుఃఖమునఁగా మజ్ఝూరె భ్రాంతాత్మకా.

గీ॥ ఈవు నేనును గవులకై యెసగియుంట ననఘ శ్రీకృష్ణరాయల ఘనతగూర్చి
విస్మితింబొంది యాహంపి విజయనగరమందు నొక కొన్ని దివసంబు లుండమన్న

కం॥ ఏమనెదు? కృష్ణరాయల సామ్రాజ్య గరిమముగూర్చి చాలఁగవింతల్
నే మును వింటినివానిని స్వామీ! నీవ్ మును చనికను పఱుపుమటందే॥

గీ॥ బాగుశహబాసు గారవమ్ము బాంధవుండ! చూడఁగలనిదె యాయాయి చోద్యములను
బైని మనమిర్వురము గూడి బాష్పవారి తర్పణ మిడుద మాంధ్రభోజార్పణముగ॥

ఉ॥ కంటివె తుంగభద్రనదె గాడలిపోదరు బాసిఁయొంటిమై
నంటినటన్న భావమున నూర్మికరంబులుసాఁచి వానిపై
డంటి కవుంగిలించి తని వారమి నెట్టుల శుష్కజీవనం
బుంటకుఁ దిప్పలుఁబడుచు నున్నదొ చుట్టునుజుట్టి సత్కవీ!

సీ॥ చక్కెరవిలుకాని నిక్కంపుచొక్కంబు కిక్కయనాన్వోటి బుక్కరాజు
సాకల్యమగు కీర్తి నాకాపగనుగేరి ప్రకటస్థితి మీఱు నొకువారు
కాలాహి నిభశత్రు జాలంబుఁ దునుమాడి లీలచేఁ దనరునందేలవారు
ధాటీ నిరాఘాట ఘోటీహత విరోధి కోటులై వెల్గు వెల్గోటివారు

గీ॥ మానసీయయోధులు కురాసానివారు బూదహారివారు మున్నగు పుడమిఱేండ్లు
గొలువరాయలు కట్టంబు గొనినయట్టి సత్సభాస్థలి యదిగొనా చాయఁగనుము

చ॥ హరిహర రెంతపాపమిది యాంగులమంగులమన్ని తాళులున్
విఱుగంగఁ గొట్టఁగాబడియు విస్మయమున్గనుఁగాల్చుచుండెఁదా
నరయఁగ రాయలీ భవనమర్మిలిఁగట్టిన యప్పుడెంతగా
నిరవు రహించెనో కనఁగనెట్టులనుండెనో చూడుమిత్రమా

సీ॥ ఇదిస్వీయఘనతర శృంగాళిజితమేరు కుధరంబుఘనహేమ కూటశిఖరి
యదివిరోచనవాజి హారితప్రభాభాసి మరకతశిఖరము మాల్యవంత
మిదియ్యదిమాతుంగ బృంహితప్రతిరవ ప్రవికంధర మతంగపర్వతంబు
అల్లది సూర్యసుతావాస మంచిత భూమిజయుత ఋష్యమూక శైల

గీ॥ మించుచెలికాఁడ కిష్కింధయిదియ చుమ్ము ఇమ్మహాపుణ్యభూమినీ యెసఁగువీటి
రహినిఁగట్టినతఁడు విద్యారణ్యమౌని యయ్యతిరూ యెట్టిగతివట్టినయ్య నేఁడు

కం॥ విద్యారణ్య మునీంద్రులు హృద్యమతిఁ దీనిఁగట్ట నెల్లరుదానన్
విద్యానగరమటందురు హృద్యంబగు దీనిగాథయుంచుకు వినుమా

గీ॥ పురమునొక్కఁడు నిర్మింపఁబూనిస్వామి తగినతలమును నెమకుచుఁదరలు వేళ
దఱుము చుండెను గుండేలు దానుగుక్కదాన వీరులక్షేత్రమై దనరెనద్ది

గీ॥ అట్టిక్షేత్రంబె యీకీర్తియగుటకేమి హేతువంచును దలపోసి యేడ్వఁబోకు
మఱువఁజేఁడులు దీనికి నాయువంచు స్వామియానాఁడె వచియించె బాంధవుండ

కం॥ అన్యగుల భాగ్యవశమున విధ్వంసము చేయకుండవిడిచిరి యవనుల్
మధ్వాచార్యుల ప్రతిమంబన్వగ [illegible] దగాంచుమో [illegible] యంజలియిడు చుట

చం॥ కటకటగాంచుమా దెసను గాదిలి [illegible] రాజితాఁ
బటుతరధాత్రిమైనిటకు వచ్చినయప్పుడు దూరదూరము
దెటువలెనుండెనో యరసివే యఁగఁ గట్టినబుజ్జలెట్లుగా
నిటులు నాలఁ బాడుపడియేవము దుఃఖముఁగొల్పుచున్నవో

గీ॥ కృష్ణరాయలు రాజ్యంబు నేలునపుడు, తాంబ [illegible] రాజ్యముల్ తోరము
లగు, మణివిభూషలు నాలుగుదవరఁగోట, లడరి వెలిఁగిన ధండారమది. గాఁ గనుము

చ॥ వరసఖ రమ్యము రమ్మిటక వారణభక్తిని కృష్ణభూవరుఁ
డురుతర వైభవం బెసగనుంచిన విట్ఠలనాథుకో వెలన్
గలిగిన యట్టికంబముల గానము విందము గొట్టువానిపై
సరిగమయంచుఁ బాడెడిని సారెకుఁగోకిల కాకలీధ్వనిన్

సీ॥ తుంగభద్రాభంగ తుంగతరంగముల్ రాలోనికిని జలనాళికలును
గవిగాయకామాత్యకాంతా జనావళి వసియింప హాళిమై భవనములును
బ్రతివీర భటప్రాణవాతూల నాగముల్ కళలీను నాయుధాగారములును
భారతామ్నా యాదిబహుపురాణార్థముల్ ప్రకటించు బహువర్ణ బహుళచిత్ర
గీ॥ ములును, మొగసాల సాహిణము నెకరాలు నాంధ్రభోజుఁడు ధనమెంత వ్యయముఁ జేసి
కట్టెనోగను సత్కవీకనుల కలుపుదీటు గాఱుబాష్పములింక డగ్గమిగ్రింగి

సీ॥ జొన్నయుఁ బొగయాకు సన్నయీక్షేత్రంబు *సూలీబజారోయి సుకవి గనుము
కాలుసేతులు విఱుగఁబడి యున్నయదియె యుగ్రనృసింహుని విగ్రహంబు
తొండంబుసాఁబాలు ఖండమై యున్నది శ్రీశశివికల్ విఘ్నేశు చారుప్రతిమ
సప్తస్థలంబుల స్థాపింపఁబడియున్న బాళులే సప్తప్రాకారము లయ

గీ॥ కృష్ణ రాడ్దర్శనాగత నృపకదంబ వాహములు నీరుద్రావెడు పానపాత్ర
మిద్దె యవెతులాస్తంభము లెట్టుల సొబగెసినవో చూడు రాయల యశముఁజాటి

సీ॥ పరిసరాంచిత మహాపర్వత శ్రేణికా యాతవాత కిశోరజాతములును
సముపలాల నజాతసంతోష కూజిత పంజరస్థ భరతపక్షికులము
నిబిడీకృతాశాంత నీరంధ్రవాస సంవాసిత మల్లికావల్లికలును
సంచారిజన పటుచరణ ధ్వనిభీతి రంగదపాంగ కురంగ గణము

గీ॥ మందిర ప్రాంగణంబున సందడింపఁదలఁపు లిగురొత్త మేనెల్లఁ బులకలెత్తఁ
దిరుమలయు నన్నపూర్ణయున్ దేవులెలమిఁ గొలువ శ్రీకృష్ణరాయలు నిలుచునట్టి
యంతిపురమదె కవిరాజ యటుఁ గనుము.

గీ॥ ఊటసీలు మోటు నాయనా యూఁజడిలును ఉదయ మాదిగ నింద్రాణి నొక్క
మొగినెకంటికెసిమంటికోక థాంగాఁగ నేడ్వ నేమిఫలమగుఁ బోధవమింక సఖుడ

*సూలీబజారు భోగమువారివీధి॥ శ్రీశశివికల విఘ్నేశుఁడు అవగింజలంత కనులు గలగణపతి.

గీ॥ కఱకు తురకలు సూపిన మొఱకుఁదనము గుఱిచి తలఁపోసి మదిలోన వెరియు కంటెఁ
గేలుదోయిని నొసటను గీలుకొలిపి కృష్ణరాయలఁ బ్రార్థించి తృప్తిఁగనుము.

సీ॥ జగనొబ్బ గండాంక చారుచరిత్రాయ బహుకావ్యకర్త్రే తుభ్యంనమోస్తు
మూరురాయర గండ వీరాహితారాతి భంగ కృతాయ తుభ్యంనమోస్తు
ఆంధ్రకవీంద్ర మహాభాగధేయాయ భామాత్మజాయ తుభ్యంనమోస్తు
పారసీక తురుష్క ధారుణీభృద్దావ పావకాయ సదాతుభ్యంనమోస్తు

గీ॥ తిరుమలాంబాన్న పూర్ణాసతీవరాయ క్షత్రివంశ సుధాంభోధిజలజజాత
శాత్రివాయ కృష్ణనృపాయ జననుతాయ భారతీ బాంధవాయ తుభ్యంనమోస్తు

# కాలజీమూతము

చిరువోలు కోటేశ్వరరావుగారు

కటికచీకటి రాత్రియీ కాలమేఘ
మిటుల గగనంబు గప్పుట కేమిహేతు
వకట గర్జించుచుండె నాపైవిసరునో
భీకరంబగు నశనియర్ణ భీతివాడమె

ప్రేమసుఖహర్షబీజముల్ పృథివిఁబుట్టి
పెంపునొందించు సలిలముల్ బిట్టుగురియ
కేలగర్జింతు మేఘమా? విలయకాల
పూరుషుని యాజ్ఞయయ్యెనేమో వచింపు

కనులు మిరుమిట్లు గొలిపెడు కాంతిబుట్ట
నవ్వుచున్నావె ననుజూచి? నవ్వినంత
మాత్రమున నాకు హర్షంబు మదిగలుగునె?
శుష్కహాసంబునందునఁ సొంపుగలదె?

ఐననీ శుష్కహాసత నైనదేమి?
బాడబానలముండె గర్భమున నీకు
గుప్తముగ దాని ధరియించి కులికెదంత
మోసపడి నిన్ను మెచ్చగా మూఢమతినె?

సంతసంబేల నాశంబు సలుపవచ్చి
ఎఱుగవో నాశనము సృష్టిహేతువనుట
రూపఱుపు మీజరా మృతిరోతదేహ
మవల లలిత దేహిని నేనె యవతరింతు

తొలుతనినుఁగాంచి భీతిచే తొట్రువడితి.
మెచ్చి నిను జేరనంటిని మృత్యుభీతి.
తెలివి గలిగెను భీతియు దొలగపోయె
నీవలెనె నేను నవ్వుచు నిలిచియుందు.

# పిచ్చుకకట్టలు—డాక్టరుడిగ్రీలు

సిరుగూరి జయరావు గారు బి. యస్ సి.

ప్రొటాన్ అమ్మాయిని గురించి జరిగిన విచిత్రసభ ముగియుటతోడనే యింటికి వచ్చి యారాత్రికేదో పుస్తకములను పత్రికలను జదివితిని. ఆంధ్రపత్రికలోఁ దమ మీఁదఁ దెచ్చిన యాక్షేపణను ఖండించుచు నాంధ్రవిశ్వవిద్యాలయ సెనేటుసభలో నాంధ్రభాషలో వ్యవహరించుటను గురించి జయంతి రామయ్యపంతులుగారు వ్రాసిన శీర్షికఁ జదివితిని. అప్పుడీ విషయములను గురించి కొంతయాలోచించితిని; ఎంత యాలోచించినను మన విశ్వవిద్యాలయములోఁ దప్పకుండ మాతృభాషలోనే విద్య గఱపింపఁబడవలెనని నిశ్చయించితిని. విషయములోఁ జాల మాటలు రామన్నపంతులు నాతో గంభీరముగాఁ బలికినాడు; స్వభాషలలో విద్య గఱుపఁబడకుండుటకంటె నీచమైన విద్యావిధానము ప్రపంచములో లేదన్నాడు; ఇందులకై ప్రాచ్యపాశ్చాత్య విమర్శకులను బెక్కండ్రను బేర్కొన్నాడు.

పండుకొనఁబోవునప్పుడు రామన్నపంతులిచ్చిన గ్రామఫోను ఉపన్యాసము జ్ఞాపకమునకువచ్చి మిక్కిలి నవ్వుపుట్టించెను. నిజమైన యాధునిక విద్యావిధానమునకు గ్రామఫోను, సినిమాయంత్రము, తప్పకుండ కావలెనని యతఁడొకమాట చెప్పెను; గాని యిట్లు హఠాత్తుగాఁ దెలుఁగుపట్టణములలో సభచేసి, యందులో నిట్టివింత యుపన్యాసమునిచ్చునని యెఱుఁగలేదు. ఇంకొక విషయమేమనఁగా నీపద్యము నెవరువ్రాసిరి? తానే వ్రాసియుండనోపును, అతనికి శాస్త్రపాండిత్యముతోఁ బాటు కవితాధోరణియుఁగలదు. అసలు మా కిద్దఱకుఁ జిన్నతనమునుండియు నేస్తము కుదురుటకు మొట్టమొదటి కారణమిదియే. మా చిన్నతనపుఁ జర్యలను గురించి యింకొకమాటు వ్రాసెదను; ఇప్పుడవి యన్నియు వ్రాయుటకు వేళలేదు. రామన్నపంతులు క్రియావిజృంభణలోనికి దిగుకాలము నేఁటికి వచ్చినది కనుక, ఈనడుమ నితఁడు రీములకొలది కాగితములను వ్రాఁతతో నింపివేయుచున్నాడు కనుక ఆంధ్రవిశ్వవిద్యాలయ స్థాపనతోఁ బాటు మన యాంధ్రోద్యమ వల్లికలు పైకెగయుచున్న నేటి నాటికి నితని సహాయ్యము మిక్కిలి యావశ్యకమై యున్నది. కనుక, ఇతని ప్రస్తుత వైఖరులను నిరూపించుటయే ప్రథమ కర్తవ్యమని యుద్దేశించి యీ చరిత్రను— ఈ నవలను— ఈ పురాణమును— ఈ ప్రబంధమును— ఈ శాస్త్రమును — ప్రస్తుత తారీఖుతోడనే ప్రారంభించితిని, అనగా నప్పుడప్పుడు, అవసరమునుబట్టి, మా చిన్న

తెనపు, చరిత్రకూడ వ్రాయుచుండును లెండు; కాని సాధ్యమైనంతవరకు బ్రకృతమునే లక్ష్యము నందుంచుకొనెదను.

గ్రామఫోను ప్లేటునకై ఫ్రోటాన్ అమ్మాయి పద్యమును తాను వ్రాసినను, దాని నెవరు పాడిరి. రామన్న పంతులునకు శాస్త్రీయమైన సంగీత ధోరణి లేదు, మఱి, ఈ పాటను ప్లేటుపై కేయాలో నెక్కించెను? ఇట్టి ప్లేటుల నెన్నింటిఁ దయారుజేసి నాతోఁ జెప్పకుండ దాచెను?

రాత్రియంతయు వింతవింత కలలువచ్చెను. ఒక చిన్న దొరసానివచ్చి నాట్యమాడుచున్నదట; కలకల నవ్వుచున్నదఁట; ముద్దులొలుకు నెమ్మొగమఁట; కంటికిగాటుక తీర్చినదట; మోకాలు దాఁక నించుమించుగ గౌనుకలదఁట; ఆగౌనునిండ జిగిజిగనాఁట నుదుటిపై గుంకుమబొట్టు కొంతసేపు కనుపించినది; తలవెంట్రుక లెఱ్ఱగా రక్తాశోకము వలె నున్నవి; దానినిండఁ జేమంతిపువ్వులు; దానికి మల్లెపూవులవాసన; ఆమె వయసుపదునారేండ్లు కాఁబోలు; పచ్చని శరీరచ్ఛాయ! నాట్యమాడుచున్నంతసేపు తిన్నని సన్నని మేను బాణాకారమై మిలమిల్లు కొలిపెను. "నను పానఁబట్టిన యనంగుని మోహనబాణమో యనన్", జకచకలాడెను. ఆమె యాడిన నాట్యము పాశ్చాత్యశాస్త్రములోనిది. ఆమె పాడిన గీతము తెలుగు జావళీ!

ఇంతలో నామె చుట్టును గొందఱు లేఁబ్రాయపుఁ జిన్నికన్నెలు చేరిరి; చేతులలో బాకులనుబూని యామెను రక్షించుచున్నట్లుండిరి. వారందఱు నామెచుట్టును నాట్యమాడిరి. ఇంతలో నొకబాణ మెచ్చటనుండియో వచ్చెను; ఒక చిన్ని బాలిక కూలఁబడెను. దీనితోఁ దత్తమ్మావారి కొకవిధమైన యావేగము, ఉత్తేజము, విద్యుదున్మేషము, కలిగెను. అచ్చటకొక పెద్దమనుష్యుఁడు వచ్చి నిలఁబడెను. "అయ్యో" యని గట్టిగాఁ బ్రోటాన్ అమ్మాయి యెలుగెత్తెను; తటాలున నులికిపడి లేచితిని ఏమియు లేదు! గది చీఁకటిగా నుండెను; ఒకపిల్లికూన మాత్రము "మ్యావో" యనుచు బల్లమీఁదనుండి యుఱికి, తెరచియున్న కిటికీనుండి దుమికి, పాఱిపోయెను. ఇదంతయుఁ బ్రోటాన్ అమ్మాయి యుపన్యాసము వినుటవలనఁ గలిగిన చేతఃకల్లోలమని గ్రహించితిని; రామన్న పంతులును దలఁచుకొంటిని. తిఱిగి నిద్రించితిని గాని రేయెల్ల నిట్టులే వింతవింత కలలు వచ్చెను; కట్టకడకుఁ దెల్లవాఱిన చాలసేపటికి మేల్కాంచితిని.

ఆనాఁడు సాయంత్రము బయలుదేరి రామన్నపంతులింటికి వెళ్ళితిని. రామన్న పంతులుతో నాకుఁ జాలకాలమునుండి పరిచయము కలదు; స్నేహము కుదిరి చాలసంవత్సరములైనది. ఇతని విషయమై చాలసంగతులు నాకుఁ దెలిసినప్పటికి నింకను గ్రొత్త క్రొత్త సంగతులు బయల్పడుచునే యున్నవి. ఇతని వ్రాతలు చాలవిస్తారముగ నున్నవి కాని, దేనిని గుఱించి వ్రాయుచున్నాడో నాకు బాగుగాఁ దెలియదు.

అతనిగది కిటికీ తెఱచి యుండెనే గాని యతఁడు మాత్రమచ్చటఁ గనుపింపలేదు. గదివద్దకు నేను చేరుసరికిఁ దలుపు కొంచెమోరగాఁ దెఱచియుండుటఁజూచి లోనికిఁ బ్రవేశించి, కుర్చీఁగూర్చొంటిని. రామన్న పంతులు లోపలనున్నాడనుకొని యచ్చటనే వేచియుంటిని.

అట్లు కూర్చొని యిటునటు చూచుచుండగా మంచముపైని యొకకాకితము తత్ణమే నన్నాకర్షించెను. దానినిఁ దీసితిని; అది మిక్కిలి నలిగిపోయియుండెను. దానిని సరిగా విప్పిచూడగాఁ "ప్రియమిత్రమా" యని ప్రారంభింపఁబడిన లేఖవలెనుండెను. పరులలేఖలు చూచుట దోషమని దానిని మరల మంచముపైనుంచి వేసితిని; కాని మరలమరల నాలేఖ నన్నాకర్షింపఁజొచ్చెను. నాయాతురత నణచుకో లేకపోయితిని. ఎట్టకేలకు దానినిఁదీసి చదువవలెనని యే బుద్ధి పుట్టినది. రామన్నపంతులు వ్రాయులేఖలలో రహస్యమేమియు నుండదు; అవి యన్నియుఁ బ్రచురణార్హములేయని నేనెఱుఁగుదును. కనుక నీసమాధానముతో మనస్సుఁ దృప్తిపఱచుకొని లేఖను జదివితిని.

"ప్రియమిత్రమా,

ఆంధ్రవిశ్వవిద్యాలయమును గుఱించి నీవింతయుత్సాహవంతుఁడవై యుండుటచే నాకుమిక్కిలి సంతోషము కలుగుచున్నది. రసాయనికశాస్త్రము నాంధ్రములో వ్రాయుమంటివి కాని నాకిప్పుడు తీఱికలేదు. భౌతికశాస్త్రములో క్వాంటం జంత్రికలలో (Quantum Mechanics) నొకవిషయమును బరిశోధించుచున్నాను. ఈసంగతి నేనెవరికిని జెప్పుటలేదు కనుక నూఱకయే కూర్చొంటినని నీవట్లువ్రాసితివి. నాపరిశోధన విషయము పూర్తిగ విజయమునొంది, మాక్సుప్లాంకు Max Planc నంగీకరింపఁబడుదాఁక నెవ్వరితోను జెప్పఁదలఁచుకొనలేదు. నీకోరికను నిరాకరించితినని యనుమానము పడెదవేమో యను శంకచేతనీకు మాత్రము తెలియఁజేయుచున్నాను.

ఈక్వాంటం విషయమును నేనెత్తుకొనుట యాశ్చర్యముగ నే తటస్థించినది; నను మొట్టమొదట, మూఁడు సంవత్సరములక్రిందట, ఎత్తుకొన్నవిషయము:—"వర్ణము— దానికి రాసాయనిక-అంగరీతికినిగల సంబంధము" — Colour in Relation to Chemical Constitution. ఈవిషయము నెన్నివిధములఁ బరిశోధించినను ఫలితము తేలకుండెను. తర్వాత క్వాంటం జంత్రికలను బరిష్కరించుచు నీవిషయమునే శోధించితిని; అప్పుడు కొంతజయము చేకుఱునట్లు చిన్నెలు తోఁచినవి కొంతమట్టునకు "వర్ణము" యొక్క కారణములకుఁ దగినసిద్ధాంతమును (Theory) గనిపెట్టితిని. కాని భాసభరత్వము (Phosphorescence) చలనకాంతి (Fluorescence) మొదలైన సంగతులతో నాసిద్ధాంతము మేళవింపలేదు. ఇంతలో నకస్మాత్తుగాఁ గలకత్తాకు వెళ్ళుట తటస్థింపగా నచట భౌతికశాస్త్ర పండితరామనుగారితోఁ గొన్ని విషయములు చర్చించితిని- వారు కొన్ని క్రొత్తమాసపత్రికలను (జర్మనీభాష లోనివి) నాకుఁజూపి యందులో ఐన్‌స్టైనుకూడ నీసంగతులనే పరిష్కరించెననియు, క్వాంటం జంత్రికలను ఆధారముగఁ జేసికొనెననియుఁ జెప్పిరి. నాకు ఐన్‌స్టైను విషయమునఁగల యత్యంతభక్తి నీకుఁదెలిసియే యున్నది; వెంటనే యావ్యాసముల నన్నింటి నామూలాముగఁ జదివితిని. అప్పుడు నాకొక యూహ తట్టినది. కేవలము క్వాంటం జంత్రికలతో నే పరిశోధించిన ఐన్‌స్టైను పద్ధతికి రెలటివిటీ థియరీ (తారతమ్యసిద్ధాంతము) కూడ నంటించి.

నచో నాకుఁగావలసిన ఫలితము చేకుఱునని యూహించితిని.

తారతమ్యసిద్ధాంతములోని రీతులతో బనిచేయుట సులభమైనదికాదు. కడచిన రెండుసంవత్సరములనుండి యీవిషయమును శోధించుటలోనే కాలముగడపుచున్నాను. ఇప్పటికిఁ గొన్ని ఫలితములు చేకుఱినట్లేయను కొనవచ్చును.

నేను కవిత్వమును మానలేదు. పూనుటకును, మానుటకును, అలవియగునది యెన్నటికిని కవిత్వము కానేఱదు. నాశాస్త్ర పరిశోధనముగూడ కవిత్వమనియే నాసిద్ధాంతము. ప్రపంచమును దెలిసికొని, యందులోని వింతలచేత నాకర్షింపఁబడి నూతన సత్యములనన్వేషించు నాతురతకల పరిశోధకుఁడే నిజమైనకవి. ఈసత్యములను సూత్రములరూపముగఁ బ్రకటించినను, పద్యములలో నల్లినను, ఒకటేయని నాయభిప్రాయము. సూక్ష్మమైన యంతరము లేకపోలేదు; మొదటిది భాషాకాంతకుఁబువ్వుమాలికలనిచ్చి బహూకరించిన రీతి; రెండవది యీమెకు ముంగురులు సవరించి, తుఱుములోఁ బువ్వుల నలంకరించి, శృంగారరసమునకు దోహదముచేసిన రీతి. కాని, మొదటిది చేతకానివారు రెండవదానికిఁదగరనియే నానమ్మకము.

"రసాయన శాస్త్రమును ఆంధ్ర భాషలో వ్రాయఁదగునా" యని విమర్శించి యాంధ్రపత్రికకుఁ బంపుమంటివి కాని నాకు దీక్షలేదు. కాని, యాంధ్రభాషకున్న చమత్కారములు తక్కిన భాషలకు లేవని చూపించుటకు, ఆంధ్రభాషలోఁ బ్రకృతి శాస్త్రములను జెప్పినచో సుళువుగా నర్థమగునను విషయము నిరూపించుటకు, ఈ క్రిందిపద్యములను నీకుఁబంపించుచున్నాను. నీకిష్టమైనచోఁ బ్రకటింపవచ్చును:-

## రసాయన పరిశీలనము
## (Chemical Analysis.)

మ॥ తొలుతన్ నీటను గల్పివేసి, మఱి "హైడ్రోక్లోరికేసిడ్డు" సుం
తలు దానిన్ గలుపంగ, White Precipitate, తథ్యంబు రానున్నచోఁ,
దెలియున్, "పాదరసంబునున్, రజతమున్, దీరైనసీసంబు," ని
శ్చలతన్ దానిని దీసివేయవలయున్, శాభాసన్ జూపరుల్.

మ॥ వెనుకన్ దక్కినద్రావకంబుఁగొని, రూపింపంగ "సల్ఫైడుగా
సును" దానిన్ గలుపంగఁ, Thick Precipitate, చోద్యంబుగావచ్చినన్,
గనుగోవచ్చు," ద్విపారదంబు, తగరం, కాడ్మ్యంబు, బిస్మత్తు, నా
ర్సెనికున్, ఆంటిమనీ, ద్విసీసమును, తామ్రంబున్" సుహృద్రత్నమా.

ఉ॥ అమ్మోనియ హైడ్రాక్సైడమ్మోనియ క్లోరిదంబు నవల కలుఁ గా

నిమ్ముగ “నైరను, నలిమినియమ్మును, క్రోమియముఁ” దెలియునా రా! సుమతీ!

చ॥ భళిభళి! యంచుఁ జూపరులు బాగుగ మెచ్చుకొనంగ హైడ్రజన్
సలఫయిడంతటన్ గలుపఁ జక్కఁగఁ జిక్కఁగఁ బేరుకొన్నచోఁ
దెలియును “మాంగనీసు,” సరితేలును “జింకు, కోబాల్టు, నిక్కెలున్,”
గలఁత యిఁకేల పూనెదవు? గర్వము చెందుమి, యాంధ్రబాలకా!

కం॥ అమ్మోనియ హైడ్రాక్సైడమ్మోనియ కార్బనేటు నంతఁ గలుపఁ “బా
రియమ్మును, జేరియమును, స్ట్రాంషియమ్మును,” విశదంబులగును క్షణకాలమునన్

మత్త॥ “సోడియమ్ము ఫాసుఫేటు” చోద్యముగను గల్పగాఁ
దోడఁ “ప్రెసిపిటేటు” పైకిఁ దోచినంతఁ దెలియురా,
ఈడ “మెగ్నిసీయమ్ము” హెచ్చుకేదటంచు, మా
టాడకింక, ఆంధ్రభావ యంత భాష లేదుగా.

వ॥ ఇఁక మిగిలినవి, సోడియము-పొటాషియము. వీనిని వేర్వేఱ తెలిసికోవచ్చును.

మిత్రమా! ఈపద్యములు కేవలముదాహరణములు. మచ్చునకై వ్రాసితిని; ఈ రీతినే “పరిశీలన” మంతయుఁ బూర్తిగా వ్రాసినచో జ్ఞాపకముంచుకొనుట సులభమగును.
నేస్తమా! ఈక్రింది రెండు పద్యములకును నీవర్థఁ జెప్పవేయని యెంచెదరు.-

ఉ॥ కంటక సంవృతంబయిన గాఢపు శాస్త్రమహాటవీపథం
బొంటరినై చరింప గతినోపలపంక్తుల గాలు నొవ్వ, వె
న్వెంటనె సాయపుం జలువవెన్నెలలన్ వెదజల్లి, నెయ్యపున్
మింట దశక్కరించు మిహిమించిన మిత్రకుమారప్రియా!

మ॥ తరళాంచల్లహరీ ముహుర్ముహురుపాంతప్రాప్తి జద్రక్తిసం
భరమున్ జూపి, తదైక్యతాగతి యలభ్యంబౌట వాపోవు సా
గరముం గాంచి, విశాలసైకత మయత్నోమండలంబల్లనన్
దరహాసామృత వీచికాపునరుదాత్త స్వాంతరంగప్రియో
త్తరమున్ దెల్పెడు కైవశిన్, నవనవోదారాత్మ భావోర్మికల్
కర ముప్పొంగుచుఁ ద్వత్సమీపమున కేఁగన్, ద్వద్ఘనజ్ఞాన
బంధుర వైశాల్యవిలీనతా సుఖసహానూనత్వదుర్లబ్ధి వం

ముకుటల్ గాంచి, నిగారపుం జిలుత కన్నుల్ నిండులే నవ్వులు
త్తర వార్తావిధ మెప్పుఁబాపెదవొ? మిత్రశ్రేయోమణీ! సద్గుణీ!!

ఇట్లు నీ మిత్రుఁడు
రామన్నపంతులు

ఈ యుత్తరము వంతయుఁ బూర్తిగాఁ జదువునప్పటికి నాకు నవ్వువచ్చినది; కాళిదాసు వాక్యము నిజమైనది:—

"సతాంహి సందేహపదేషు వస్తుషు
ప్రమాణమంతః కరణప్రవృత్తయః"

నేననుకొన్నట్లే యీయుత్తరములో నేమియు రహస్యములేదు. రామన్నపంతులుత్తరములన్నియు ఎవరికి వ్రాసినను ఈ మొాస్తరే. పద్యములు, చర్చలు, వ్యాసములు, శాస్త్రపరిశోధనలు తప్పమఱేమియు నతనిలేఖలలోఁ గానరావు. ఉత్తుత్తిమాటలతో కేవలలౌక్యవిషయములను విపులముగావ్రాయుట యతనికిష్టములేదు.

ఇంకొక చమత్కారము; నలిగిపోయిన యీలేఖను జూచిననో దీనింతఁడు చాలకాలము క్రిందటనే వ్రాసినట్లు తెలియుచున్నది కాని, యింతను టపాలో వేయలేదు. అతఁడు లేఖలను వ్రాయులే యరుసు: పర్యము జాలక వ్రాసెనా, యతనిగుమ్మము దాటిపోవుటకు వానికిష్టముండదు.

ఈలేఖవలన నాకొక్క నూతనసంగతి తెలిసినది; ఇతఁడు భౌతికశాస్త్రములోను, రాసాయనికశాస్త్రములోను, పరిశోధనఁ గావించుచునేయున్నాడని యింతకుముందే యెఱిఁగియుంటినిగాని, యింత శ్రద్ధను వహించి, దానినే మనస్సులో నుంచుకొని, శ్రమపడుచున్నా డనుకొలేదు. ఏవేవో కాగితములను గుప్పలు గుప్పలుగా వ్రాయుటచే, నవలలు, నాటకములు, గ్రంథములు మున్నగునవి వ్రాయుచున్నాడనుకొంటినిగాని, దీనితోఁబాటు కేంద్రీకృతశ్రద్ధతో నుద్ధతశాస్త్రవిషయమును బరిష్కరించుచున్నాడని యీలేఖవలనఁ దెలిసికొంటిని.

"యదేవ విద్యయా కరోతి
శ్రద్ధయా
ఉపనిషదా
తదేవ వీర్యవత్తరం భవతి"

అను నాదర్శమునే రామన్నపంతులు మాటిమాటికిని వర్ణించుచు నాచరణలోనికిఁ దెచ్చుచుండును. ఇట్టి యున్నతాదర్శముగలవాఁడగుటచేతనే కొద్దికాలములో విశేషవిజ్ఞానము సంపాదించఁ గలిగినాఁడు.

మున్సోలినీచర్చలో దిగినప్పుడు దేశభక్త్యుద్రేకములో నావేశమును బొందిన రామన్న పంతులు, పోలిటాన్ అమ్మాయ్" యుపన్యాసము నిచ్చినప్పుడు కవితారసములో, గానకళ, శాస్త్రజ్ఞానము, హాస్యరసము, కలిపిన రామన్నపంతులు, విశేషాలోచనా నిదానమైనటువంటి. బహుప్రయాసలకు నిలయమైనటువంటి, అతిశ్రద్ధావశ్యకమైనటువంటి, ప్రకృతిశాస్త్రపరిశోధనకుఁ గూడ కడంగి, యంత సావధానముతోఁ బని చేయుచున్నాడనుట యెంతేయుఁ బ్రశంసనీయము.

నాకుఁగూడ గ్రంథములను వ్రాయుటలోను, పరిశోధన చేయుటలోను ఆసక్తి

కలదు కాని,- చరిత్రపండితునకుఁ బరిశోధనమేమిటి? లేకపోలేదు; నామకార్థము పరిశోధనకలదు. "డాక్టరేటు డిగ్రీలు" పొందుటకు చరిత్రములోను, వాఙ్మయములోను, కూడ పరిశోధన కలదు. ఈ నడుమనే యొకఁడు- మాకళాశాలలో వాఙ్మయపండితుఁడు- "డాక్టరు డిగ్రీ" పొందెనఁట! మేమందఱము నాశ్చర్యపోయితిమి; అతనికి సన్మానపత్రము లిచ్చితిమి, అతని పేరు మారుమూలల మ్రోయించితిమి. కాని యీ స్తోత్రాభిషేకము యైన తర్వాత మెల్ల మెల్లగా సంగతియంతయు దెలిసినది. ఈ "డిగ్రీ" మద్రాసు విశ్వవిద్యాలయ మియ్య లేదుకదా. కట్టకడకు పాశ్చాత్య విశ్వవిద్యాలయములలో మఱకుఁ దెలిసినదైన గాదు. "యెకాతెరినోస్లావ్" విశ్వవిద్యాలయఁమట! ఎక్కడనున్నదిరా బాబూ యని మేమీ "యెకాతెరినోస్లావ్" పట్టణమునకై "యట్లాస్" అంతయు ద్రిప్పిచూడగా నిది మొట్టమొదట మాకెక్కడను గనుపించలేదు. "కుజగ్రహములో నున్నదేమో చూడరయ్యా" యని వెక్కిరింతగాఁ బల్కినాడు శంకరనారాయణ; శంకరనారాయణకూడ వాఙ్మయపండితుఁడే కాని యతనికి డాక్టరు డిగ్రీలేదు కనుక, "యాచకో యాచకశ్శత్రు" అను విధముగఁ దన సహాధ్యాపకునిఁ జూచినపుడెల్ల నతనిని దినివేయవలెనని చూచుచుండును.

కట్టకడకుఁ గన్పించినది. "యెకాతెరినోస్లావ్" పట్టణము. ఇది రష్యా దేశములో నున్నది. చిన్న పట్టణము. ఇంతటితో గుట్టు నిలచినచో బాగుగనే యుండును కాని శంకర నారాయణ యూరకుండు స్వభావము కలవాడు కాదు. యూనివర్సిటీ పేర్ల నన్నిటిని జదువమొదలిడినాడు కాని, "యెకాతెరినోస్లావ్" యూనివర్సిటీ యతనికెచ్చటను గన్పింపలేదు. అందుచేత నతడు శోధించి శోధించి చూడగా "యెకాతెరినోస్లావ్" లో యూనివర్సిటీ యను పేరే లేకపోయినట్లు రూఢిగా దేలినది. అయినచో "డాక్టరు డిగ్రీ" నెవరిచ్చిరి?

1913 వ సంవత్సరములో, రష్యాలోని పెట్రోగ్రాడు పట్టణములో, ఒక స్కూలు హెడ్మాస్టరుండెను. ఇతని వైఖరి కొంచెము వెఱ్ఱిదారిలో నుండెను కాని యితని విషయము నెవ్వరును గమనింపకుండిరి. తరువాత రెండు మూడు సంవత్సరములకు, రష్యాలో రాజ్యవిప్లవము తటస్థించి, రాజహత్య సామంతనాశనము కావింప బడి, ప్రజాబాహుళ్యప్రభుత్వము స్థాపింప బడెను. దానికి యజమాని లెనిన్ కనుక, పెట్రోగ్రాడు పట్టణమునకు లెనిన్ గ్రాడు అని పేరు పెట్టిరి. ఈ నామకరణము బాగులేదని హెడ్మాస్టరు పలికెను అప్పుడతనిని ఖూనీచేయవలెనని కొందఱు సోవియటు లతని యింటిని ముట్టడించిరి అతడీసంగతి పసికట్టి, తప్పించుకొని, పారిపోయి "యెకాతెరినోస్లావ్" పట్టణములోఁ గ్రొత్త కాపురము పెట్టుకొనెను. అప్పటినుండియు ధనార్జనకై యితడు "యెకాతెరినోస్లావ్ యూనివర్సిటీ" యను బూటకపు పేరు పెట్టి "డిగ్రీల నిచ్చుచున్నాడు కాని, యితనిని ఖూనీచేయుటకు సోవియటు లెంచినట్లు తెలిసిన నాటనుండియు నితని మతి భ్రమించినది. అందుచేత దనకు దోచినట్లు "డిగ్రీల" నిచ్చివేయుచున్నాడు.

పిచ్చివాఁడు కదాయని చెప్పి పోలీసువారీ తనితో జోక్యము చేసికొనుట లేదు. ఆయూరివారితని "డాక్టరేటులను" "Dog-trait" అని పిలచి, హేళనసేయుచున్నారు. ఇతనికి Mad dog (పిచ్చకుక్క) యని పేరుపెట్టిరి.

ఇదంతయుఁ దెలియుసరికి మాకందఱకుఁ గడుపు చెక్కలగునట్లు నవ్వువచ్చినది. శంకరనారాయణ యానందమునకు మేరయే లేదు. ఈ సంగతినంతయు నతఁడు దశదిశలఁ జాటించెను. ఇంతేకాక, "పిచ్చికుక్కలు-డాక్టరుడిగ్రీలు," అను శీర్షికక్రింద నొక పెద్దవ్యాసము వ్రాసినాఁడు. దానితో నాఁగినచో బాగుగనే యుండును. కాని, యతఁడు "గొంటెమనిషి" అందుచేత నీవ్యాసమును "యెకాతెరినోస్లావ్" పట్టణమునకుఁ బంపించెను; వెంటనే పిచ్చివాఁడితనికిఁ గూడ "డాక్టరు" డిగ్రినిచ్చెను!

"డిగ్రీల" మోజుచేత నేఁటికిఁ గొందఱు వెఱ్ఱివెఱ్ఱి పద్ధతుల నవలంబించుట చాల నింద్యము. కర్మ నిష్కామ్యమై యుండవలెననుట యెందులోఁ బొసగినను, పొసగకున్నను, విద్యావిషయములో మాత్రము బహురూఢమైనది. కాని "పొట్టకూటికై పుట్టెను విద్యలు" అన్నట్లు, ఈ డిగ్రీల నంటించుకొన్ననేగాని ధనార్జన వీలుకాకుండనున్నది. కనుక నీ "డిగ్రీలమోజు" గలవారిని గర్హించుటకన్నఁ బ్రస్తుత దేశదశలను నిందించుటే మేలు.

ప్రకృతి శాస్త్రములతోఁ దులతూఁగునట్టి పరిశోధనలు చరిత్రమునందును, వాఙ్మయమునందును, లేకపోయినను ప్రకృతి శాస్త్రజ్ఞులను మించిన కర్తవ్యములు చరిత్ర-వాఙ్మయ-శాస్త్రజ్ఞులకు విధేయమైయున్నవి. దేశాభ్యుదయమునకుఁ గావలసినది ప్రజావిద్యావిధానము; ప్రస్తుతనాగరికతా విశేషములను ప్రజలకుఁ దెలియఁజేయుట, నూతన బుద్ధి వికాసమును మనదేశస్థులకుఁ గల్పించుట, అజ్ఞానజనితములైన నీచవైషమ్యములను నలగఁ ద్రొక్కి విద్యాసంస్కారములను పెంచుట— ఇవియన్నియుఁ జరిత్ర-వాఙ్మయ-శాస్త్రజ్ఞులకు విధాయకములు. శాసనములలోనుండి, రాతికట్టడములలోనుండి, సంగతులను గనుగొని చరిత్రలను వ్రాయుట మంచిదే; కాని ప్రస్తుతదేశాభ్యుదయమునకై మనము యత్నించు కాలమున నింతకంటె నవసరమైన పనులను జేయవలసియున్నది. ప్రకృతిశాస్త్రములలోని పరిశోధనల వలన నూతన సత్యములు తెలియుచున్నవి; లేదా, యాంత్రికములైన యుపయుక్తవిశేషములు తేలుచున్నవి. కాని చరిత్రపరిశోధనలోను, వాఙ్మయపరిశోధనలోను, తేలుసంగతులు మిక్కిలి యుపయోగింపవు; ఉపయోగమునకుఁ గావలసిన సంగతులన్నియు నిప్పటికిఁ దెలిసియేయున్నవి; ఇప్పటి పరిశోధనలన్నియు మారుమూలలలోనివే, కనుక వీనినాపివేసి యింతకన్న నుపయోగకరమైన పనిచేయవలసియున్నది. కార్లైలు చెప్పినట్లుగా— అతఁడు స్వయముగా వ్రాసినట్లుగా మహనీయుల జీవితములను మృదుమధురభాషలో వ్రాసినప్పుడే నిజమైన చరిత్రయగుచున్నది. ఈసంగతుల నన్నింటిని సవిమర్శనముగనే చెప్పుచున్నాను. నేను స్వయముగాఁ జరిత్ర పండితుఁడను కనుక నాయభిప్రాయములన్నియు ననుభవ పరీక్షితములు. నిన్ననే నాకొక గ్రంథము వచ్చినది; దాని పేరు

"బొబ్బిలి రాజుల చరిత్ర" ఏవేవో తారీఖులు, వంశావళి సంగతులు, యుద్ధములు, మొదలైనవన్నియు నున్నవి; చదువుటకు నాకే తలనొప్పి పెట్టినది. దీనికి బదులు "పాపారాయ చరిత్ర" యని వ్రాసి. పాపారాయని వ్యక్తికి ప్రాముఖ్యతనిచ్చి, తదితర చారిత్రక విషయములను అక్కడక్కడ దొరలించిన చో నెంత బాగుండెడిది! ఇటువంటి పుస్తకములు మన తెలుగులో లేక పోవుట మిక్కిలి శోచనీయము. భాషాజ్ఞానము, కవితాధోరణి, కలిగిన చారిత్రకులు ఇట్టిపనికిఁ బూనుకొని చక్కని గ్రంథములను వ్రాసెదరుగాక.

ఈవిషయములో నేను ప్రిమత్తుఁడను కాలేదు. "అల్లసాని పెద్దన్న అందల మెక్కినరోజులు" అని పేరుపెట్టి యొక పుస్తకమును వ్రాయుచున్నాను. కొలఁదికాలములోనే ప్రచురింపఁ దలఁచినాను. ఇందులోనివిషయములు సాధారణులకు నచ్చునట్లు చమత్కారముగా వ్రాయుచున్నాను; దీనితోఁబాటు శ్రీకృష్ణదేవరాయల ప్రభుత్వము, విజయనగర సామ్రాజ్యనిర్మాణము, మొదలైన చారిత్రిక విషయములన్నియు దొరలి వచ్చుచుండును. రామన్న పంతులు దీనిని జూచి చాల మెచ్చుకొనుచున్నాడు. ఇట్టి గ్రంథములను వ్రాసినయెడల పలువురు చదువుట తటస్థించును; చారిత్రిక విషయములన్నియు నేదో యొక విధమున బ్రవహించుచు నచ్చుచుండును, ప్రజలకు బుద్ధి వికాసము కలుగక మానదు.

నేనక్కడ చాలసేపు కూర్చుంటిని గాని రామన్న పంతులు కనుపడ లేదు. "బోయీ" యని నౌకరను బిలచితిని వాఁడువచ్చి, "ఏమి? దొరా!" యని యడిగెను. "మీదొర ఎడపోయినాడురా?" అంటిని. వాఁడు చేతితోఁ జేపల వలయల్లుచునేయుండెను. ఏపని లేకపోయినను ఈ వల యల్లుటమాత్రము వాఁడు మానడు. ఇక్కడ బోయీల కందఱకు నిది యొక యలవాటు. "ఎడనోపోయినాడు, దొరా! మాపటికి వచ్చేదానికి చాల దేరౌతాది దొరా!"

అచ్చటనుండి లేచి వెళ్లిపోయితిని—



# ఇది వెఱ్ఱియేమొ

కాఖారి వెంకటనరసింగరావుగారు (కవితాసమితి)

అది మనోజ్ఞ ప్రాతస్సమయావసరము
నిర్మల పయః ప్రసార ధునీ ప్రతీర
మతిప్రశాంత వనాంతకుంజాంచలప్ర
సన్నమంజుల శాద్వల సాధుసీమ
తరళతర బాలభాస్కర కిరణకాంతి
విరళిత కిసాలయచ్ఛాయ తరుణవాయు
పోతసల్లాపపులకిత నూతనోర్మి
ఖేలనోద్భూత పూత సంగీతచకిత
నిరుపహత పూర్ణనిశ్శబ్ద నిలయగర్భ
మంగనా! తిలకించెదే! అందుమమ్ము

* * *

ఏమి వీక్షించుచున్నదదేమొ కంటె?
ఏమి తలపోయుచుంటిమో ఎరుగవలతి?
మరచి పోవుదునని మాకు వరమొసగుదె?
కనగ వినగ నొప్పెదము నిక్కమ్ము పొలతి!

* * *

ఈవు నాపజ్జ లేకపోయినను నేమి?
అదె త్వదీయ ఛాయాపట మచట లేమ!
ఇదె త్వదీయాత్మ ఇచట నీ హృదయసీమ
ఈ వికృతహాసిపై ప్రచరించినీవు
సువిమలాపాంగ వీక్షణ భవ్యలహరి
పంకిలంబయి పోవుట పాపముగద!
పవలురేయియు నెమ్మోమ్మిక బ్రతుకుదీను
కెప్పుడును నీదు సాంగత్యమే యగుగద!
ఇంకనిను వేరెజూడ గాంక్షించుటేల?
ఏ ముహూర్తాన నీచిత్రమే నరసితో
అప్పుడే ప్రభవించి పొంగారి పొరలి
పూర్ణముగ మానసము నిండిపోయినట్టి
అపరిమితమైన, అనుపమమైన ప్రేమ
అధికమగుటెట్లు నీదర్శనాప్తినయిన?
ఇర్వురము జూచుకొను టబ్బనేని నాకు
హృదయమధు మాధురీ సవ్యకథలవినని
యట్టినీవు సామాన్య కాంతాళివోలె
ధనములేని, శరీర సౌందర్యగరిమ
మేని లేనినన్ గర్హింతు వేమొలలన!
అపుడు నాయనురాగ మావంతయేని
తగ్గవడియేనొ క్రొత్త వేదన జనించు
ఉడికిపోవ దవార్యతాపోష్మశిఖల
నిజముగానట్టి హేయమానసిచ బుద్ధి
గలుగుదాన వీవైన, నిర్మలవిశిష్ట
సద్గుణలతాంత కల్పితస్వచ్ఛగంధ
మావిరగ మదిగీలించి, మలయుతావు
లెంతొ! యపురూపముగ గ్రోలిసంతసించు
నాసుఖంబున దోషమున్నదియె? చెలియ!
ఏగతిని బాకించిన నేను నీవు
గలసికొనకుంటయే సుఖకరము నాకు.
ఈయనంత నిర్జనసీమలోయు హారహా
మొదతెగని మానసికదీక్ష నేనుమునిగి
నీదు అమృతప్రణయ దర్శనీయమూర్తి
కాత్మరాగాభిషేచన మాచరించు
పూజవేళలలో పుణ్యపురుషునన్ను
ఏరుచూడగలారు? నాకేమి భయము?
ఒంటినానంద వాహినిలో స్రవింతు
కొమ్మ! ఈగతి బ్రతుకగానిమ్ము నన్ను

* * *

సోగలౌ సూర్యకిరణాల సోయగంపు
టంచు తాకుల నీమనోహర పటమ్ము
నవయునో యేమోయని నవనవమ్ములైన
చివురు నీడల దాతు ఏచెమచలువల
తాకి యారాలదూరి పత్రాలెడని
చిరుత ప్రాయంపు మొగ్గల జెనకి చెనకి,
ఫుల్లకుసుమాంగనల తావిపొత్తులందు
విడిన రేకులలోన దావతుల మడిగి,
తేటతేనియ యూటలదేలి తడియు
వాలిగాలి సోకుడలలలో మైలయగును
యను భయాసనే వేళ యురానహత్తి
అప్పకప్పురముగ జూతునతివ! పటము.
అపుడపుడు నీదుచిత్రమ్ము ఆసుఖంపు
నెయ్యపుఁ శయ్య బవళింప, తియ్యనయిన
భావసంగీతరాగాల బాడిపాడి
నిదురపుచ్చి, కలలను నీవదనముకుర
తలమునఁ బ్రతిబింబించు, అవకీన
సదమలానంద చిహ్నాలకెదురుసూతు
నాయలంతి నవ్వులను స్నానమ్మొనరిచి,
నాదుముద్దుల తీపిపానమ్మొనరిచి,
ఘోరనిద్రాసుఖాదులయాశమాని
నియమమూల్య చిత్రము మానీయనియతి
భక్తినాతోడ ప్రణయ తపమ్మొనరుప
సకియ! సన్యాసమైన సంసారమాయె
ఇర్వురము కొన్నివేళల నేటినేటి
తుంపురల సేవకనునైన త్రోవ యుంప
సాగలెగయు తాపముడిగింపబోయి యల్ల
చలువ టిసుకతిన్నియ జ్యోత్స్నాజాలవారు
నీటి పాయలగలయు వెన్నెలలకల్వ
నీకులాడుచు నెయ్యంపు వాదులాడు
సుందర చకోరయుగము చూచుటయుగ
అప్పుడేమేమి మంతన మాడినానొ!
అప్పుడేమేమి వేడిముద్దాడినానో!
అమగు నీచిత్రపటము నేకాంతమందు
లేత యెండల తళుకులల్లెడు బెడంగు
రంగురంగుల తోరణ రాజితోడ
రమ్యమానికడుంగమలంకరించి
క్రొత్త పచ్చికపరపు బాగుగనమరచి
తేనెసోనల పుష్పాళి దిమ్మరించె
నవ్యవల్లరీ మృదులాసనంబమర్చి
లలిత సుమదళ శయ్యాకల్పనము సేసి
ప్రకృతి సహకారియై పయిపనులుచేయ
నందు నీచిత్రమున్ నిల్పి, అతిశుభముగ
నస్మదీయ హృద్రాజ్య మూర్ధాభిషేక
మాచరించితి నాదు ప్రేమామృతమున
ఈవు నాప్రేమలక్ష్మివే! ఇంతసజము
ఈయభాగ్యుని వ్రాతవీక్షించి నీవు
నేడుగాకపోయిన నొండునాడయినను
జాలిపడి, యిదె మరియొక్కసారి జదివి
అనుకొనక పోవు రాలు బాష్పాలతోన
గట్టకేలకు "ఇదివెఱ్ఱియేమొ!" అనుచు



# విద్య—అధ్యాపకునిధర్మము

పాశ్చాత్య విద్యావ్యామోహము వలన మనవిద్య చెడినది. దానితోబాటు మననాగరకత ఆచారవిచారములు; ఆహారవిహారములు, అంతరించినవి; వీనితోగూడ మన మత మతలజలమున మునుగుచున్నది, మననాలుక లాంగ్లభాషామధువు నాస్వాదించుచున్నది. మన కనులహర్నిశము పాశ్చాత్యఖండముల వైపునకు జూచుచున్నవి. పాశ్చాత్యాచారములు, పాశ్చాత్యపద్ధతులు, పాశ్చాత్యనడవడికలు మన ఆస్తులలోని మూలుగులయందు మూలుగులగుటకు ప్రయత్నించుచున్నవి; మనము ఋషిసంతతి వారమనుట మరపునందినట్లున్నది; మనమే ఋషిసంతతివారమని ప్రవరయందు వాకొనుచున్నామో అట్టిఋషుల దేహమానసిక శక్తులందు సహస్రాంశమైనను తుదకు కోట్యంశమైనను మనయందున్నచో, మనమా ఆర్యఋషిసంతతివారమని జెప్పుకొనుటకు సిగ్గుపడవలసిన పనిలేదు, కాని నేడాశక్తులు మనయందంత హీనత్వమైపోయినవా? పోయినట్లనే గోచరించుచున్నది. లేనిచో నెవరైన మిమ్ము ప్రశ్నించినపుడు మేము ఆర్యసంతతివారము ఋషిసంతతివారమని గర్వముతో జెప్పుకొనుటకు సిగ్గేల పడవలసియున్నది? నిజమునకు ఋషిసంతతివారమనుటకన్న ఆంగ్లమానసపుత్రులమనిపించుకొనుటయే విద్యార్థులకు గౌరవముగ నెక్కుడానందముగనున్న కాలమహాత్మ్యమిట్టిది, ఇందొరుల ననవలసినదంతగాలేదు. కాని ప్రాజ్ఞజనపుల ఒకించిన భావనయ్య ఆంగ్లభాషయందు డిగ్రీలనందిన యేమహాశయునిచేతనో బరీక్షింపబడుచున్నపుడు మీ యొడలు చెచ్చినట్లగుటలేదా? మీనాగరికత ఆంగ్లనాగరికతకు దాసానుదాసురాలైనట్లు గోచరించుటలేదా? మీవిద్య ఆంగ్లవిద్యకు బానిసీడైనట్లు దోచుటలేదా? మీమతము లాంగ్లమతస్తులకన్న సహస్రాంశము లోపించినట్లు తెలియుటలేదా? ఈవిపరీత స్థితికనులారగాంచుచున్న మీశరీరమందలి చిక్కపి వేడి నెల్లనీరై పోవుటలేదా? మీకనుగొలకులనుండి యుష్ణాశ్రుబిందువులు జాలువారుటలేదా? మీహృదయములు పరితప్తములగుటలేదా? ఈపరిస్థితుల డిలకించినపుడు ఈమహాత్రి మావేదన నుండినచో మీయందింకనూ ఆర్యరక్తమున్నదని చెప్పవచ్చును. మీరు ఋషిసంతతివారని యొప్పింపవచ్చును మీయందింకనూ ఆర్యనాగరికత గర్భితమైయున్నదని చెప్పనొప్పును. మిమ్ములమీరుద్ధరించుకొనుచుట కవకాశమున్నదని పలుకవచ్చును.

మీరు నిజముగ నార్యసంతతివారలు మీ రార్యభూమిని జన్మించితిరి. మీ రార్యజలములను గ్రోలితిరి; మీ రార్యవాయువుల నాఘ్రాణించితిరి; మీయందార్యరక్తమున్నది; మీరార్యబాలుర కధ్యయన మొనర్చుచున్నారు; మీరు కర్మక్షేత్రమున గురుపీఠము

లంకరించినను మీరు మీ బాలకులకు బోధించునది ఆర్యులచే పవిత్రమైన సనాతనమైన ఆధ్యాత్మికతచే పన్నిద్దీర్చిన విద్యయేనా? కాదు మీరు బోధించునది నానాగరికతను మీ ఆచారవిచారములను మీ కీర్తిని మీ ధర్మములను మీ మతమును పొందించునవిద్య కాదు. మీ బాలురను మీరు బానిసవిద్యయందు పరిపూర్ణుల నొనర్చుచున్నారు; మీ బోధనాపద్ధతుల వలన బాలకులు పాశ్చాత్యవిద్యాసాగరమున కళాశాలలను నౌకలపై ప్రయాణమొనర్చి గాంచునాకాశయమెద్ది? ఇంజనీరు తహాశీల్దార్లు మున్నగునవియే గదా? ఇట్టి అల్పాశయములకై ఇంతటి భయంకరమగు మహోదధియందు ప్రయాణమా? ఎంత సిగ్గులచేటు! ఇదియేనా మీ ఆర్యకులీనుల గమ్యస్థానము? ఇదియేనా మీరు మీ పిల్లలకు బోధింపవలసినవిద్య? విరమించుడు విరమించుడు. ఈవిద్యమాయతో కూడ కొనియున్నది; మోసముతో మిశ్రితమైయున్నది; కల్లలతో గలసియున్నది ప్రకృతిపై ప్రబలమగు వజ్రాఘాతి నొనర్చుచున్నది నాయనలారా! ప్రకృతిని తిరస్కరించిన జాతి ప్రకృతిలో నిలువనేరదు; తన్ను తిరస్కరించిన వారిని తాను మ్రింగివైచుచున్నది; అట్టిజాతి కథఃపతనమే గతి. ఇందులకు మొన్నమొన్న గావింపబడిన జర్మనీయుద్ధమే నిదర్శనము; దాని ఫలితమే గదా నేటికిని యూరోపును దహించుచు మరల నొక ప్రపంచయుద్ధమున కెరనైచుచున్నది. ఇట్టి ఫలితములు అవిద్యనుండి పుట్టుకొందినవి గావా? ఇప్పటికి దయా సత్య శౌచ, ధర్మము లెఱుంగని విద్య విద్యగాదని చెప్పుట జాలును. ఇక మీ విద్య యేది? ఇట్టిదని నిరూపించుట పండిత జనదుర్లభము, అట్టిచో పామరులగు నేనందులకు తగనుగాని విననూ రెండుమూడు కలావిషయమున న్యాయకుండ మాన జాలను.

మీ విద్య సత్యమును బోధించునది. జ్ఞానమును ప్రకాశింపజేయునది; అసత్యములనణచి యుంచునది; చంద్రునివలె చల్లనిది; సూర్యునివలె వెలుంగునది, భూమివలె క్షమాప్రధానమైనది; నిత్యయుక్తమై మాయాతీత రాగ శూన్యతలు గలిగినది, ఇట్టిది మీ పవిత్ర స్వచ్ఛతరమగు మీ విద్యను బోధమునను ప్రక్క ఓమ్ కారము. ఓమ్ కారమన ప్రణవము ప్రణవమే పరబ్రహ్మ స్వరూపమని ఆర్యుల వాక్యము. దానినుండియే పృథివ్యాపస్తేజోవాయురాకాశములు బుట్టినవి ప్రకృతికి మూలకారణమగు ఓమ్ కారమునకు, ఆద్యంతములు, నామరూపములు, రజస్సత్వతమోగుణములు లేవు. కావుననే దానిని అనిర్వాచ్యమనియు, అలేఖ్యమనియు, అనంతమనియు, అఖండమనియు పెద్దలు వ్రాయుచున్నారు. ఇదియే విశుద్ధతేజము. దీనిని వెలుగునకు వెలుగు చర్మచక్షువులకు సాక్షాత్కరించునది గాదు దీనినాత్మ చక్షువే గాంచవలయును ఆయానందమిట్టిదని నిర్ణయింపలేము. అది ఆత్మానుభవవేద్యము. ఈ ఓమ్ కారమునకు తర్వాత "శివాయ" యని చెప్పబడినది; దీనికర్థమేమి? శివుడు శ్వేతవర్ణుడు, అతడారోహించు వృషభము తెల్లనిది; అతడు వసించు కొండ తెల్లనిది; అతని మకుటస్థమగు గంగ నిర్మలమైనది; అతడు ధరించు పునుకపాత్ర శుభ్రమైనది. ఇవి యన్నియును మీకేమి తెల్పుచున్నవి? ఓమ్ కారము యొక్క నిజప్రకాశమును బోధించుటలేదా?

యాచనలవలన మనకు లభించులబ్ధియు, ఆనందమునూ దేశవినాశనమునకు దోడ్పడి నట్లు దేశాభివృద్ధికి దోడ్పడజాలవు, ఏలనన మనశాస్త్రము మనకేమని బోధించు చున్నది? "యాదృసిభావ నాయస్యసిద్ధర్భవ తితాదృసి" అనగా సంకల్పమెట్లుండునో ఫలసిద్ధియట్లుండునని — మహాకవి రవీంద్ర డాకచోనిట్లు వాకృచ్చుచున్నాడు, "ఎచ్చట జీవిత ముఖ్యావసరములపట్లనైతము యితరులనుండి భిక్షగైకొన్న దానిపై నాధారపడి యుండుట పోసగునో యచ్చట నరుడు తన నిజస్వరూపమును గుర్తెరుగజాలడు" ధన్య ధన్య రవీంద్రా ధన్య! నీవాక్యామృతవాక్కు నీవు నీఋషుల పూర్వ సంప్రదాయముల మరచియుండలేదు. నిను బోలు యువకులు, ఉపాధ్యాయులు, ప్రవక్తలు, కవులు ఈకర్మ భూమి నింకనూ కోటానుకోట్లు జన్మింపవల శియున్నది అట్లుదయించిననాడే మాకు విముక్తి మోక్షము.

సోదరులారా?

మీరు లోకము నుద్ధరించుటకు జన్మించినారలు, మీభుజములపై యనంత భారమున్నది; మీరేమాత్రమైన యెదురుదుముకగ బ్రవర్తించినచో యావ్యావర్తనమునకు గొప్ప ముప్పు వాటిల్లగలదు. మీరు మాంసమాత్ర శరీరులుగారనియు, ఆత్మమయులనియు అశ్లీలమును శ్రేయముగను మృత్యువు నమృతముగను రూపాంతరముల గలిగించుశక్తి మీయందిమిడియున్న దనియును, నమ్మి న్యాయమార్గమున ప్రవర్తించి శాలునుద్ధరించి మాతృభూమి కజరామయమగు కీర్తినార్జింపగోరుచున్నాను. ఇట్లెం దులకువ చింపవలచివచ్చినదన బాలురకొం చెనుగడతేరిన నాటనుండి మాకువిజ్ఞానార్జనమువసరము లేదు పరీక్షలందు గడతేరిన చాలుననిపట్టుబట్టుచున్నారు ఇదియే ట్రైనింగ్ పాఠశాలలో గూడ పొడగట్టుచున్నది అనగా సాధ్యమైనంత తక్కువజ్ఞానముతో నెక్కువమార్కులు సంపాదింపవలయునన్నమాటదీనినిబట్టి బాలుర తొలుత నుండియు వారిని వారిని మోసగించుకొనుట బోధనా పద్ధతులవలన నేర్పబడుచున్నమాట. సత్యము చెంతిజేర్పవలసిన బుద్ధిని సరళత్వమును ప్రారంభమునందే వక్రమార్గమున బ్రవేశింప జేయుచున్నారనుట - ఇంతవ కర్మక్షేత్రము శాపాహతమగుటలేదా? ల్ల ఉద్యోగాభిలాషియగు యువ్వనుడు బిచ్చగానివలె నుచ్ఛిష్టవిజ్ఞానలేశములకై శ్రీమంతులు విదులారగించు భవనముల పొంతి పడగాపులు వడియుండుటెందువల్లనేగదా! ఈహీనదశ పెద్దపెద్దపదవులు లభించుటచే తొలగగలదా? ఇప్పటి బోధనాపద్ధతుల మార్పువలన తొలగగలదా? యోజింపుము అట్లయినచో ఆధ్యాత్మిక క్రమశిక్షణచే బొందగల విజ్ఞానమహాసముద్రమున నౌకాశయము మెచ్చుటయని మీరనుగనచ్చును. దీనికి సమాధానము నిన్ను నీవు తెలుసుకొనుము; మహాత్మునన్వేషింపుము. యనువాక్యములు సార్థకమగుచోటున నేయుని తథ్యమగు జ్ఞానమును నకేమని బోధించుచున్నది? "ఆత్మానంవిద్ధి" నిన్ను నీవు తెలిసికొనుము; "భూమైవసుఖం భూమత్వేవ విజిజ్ఞాసితవ్యం" కించిత్వమున సుఖములేదుగాన మహాత్మునన్వేషింపుము, అనగా నెచ్చట నరుడు తన్నుదా తెలిసికొను చున్నాడో యక్కడనే మహాత్ముని జూడ జూడగలడని తాత్పర్యము, ఎక్కడనరుడు

తననూతన సృష్టికి తోడ్పడు త్యాగశక్తిని పొందియుండెనో యచ్చటతాను త్యాగము వలననే యభ్యున్నతి గాంచుచున్నటుల తెలిసికొనుచున్నాడు;

ఇట్టిభావములను విశాలహృదయమం దుంచుకొని బాలురకు బోధించితినేని సత్యము విద్యను మీరు బోధించినవారెవ్వరు కాదేని మీవలన చైతన్యుడు, లీలాశుకుడు, కబీర్, నానక్, రామదాసు, త్యాగరాజు మున్నగు మహాభక్తులు తమభక్తి వెల్లువలచే నేదేవిని, ఏభూమిని యూర్జితమొనర్చిరో చంద్రగుప్త, అశోక, ప్రతాపరుద్ర, కృష్ణదేవరాయాది మహారాజులు తమ పరిపాలనా పద్ధతులను సుమములనేదేవి పాదరాజీవములకడ సమర్పించిరో, తిక్కన, యుగంధర, తిమ్మరుసాది మహామంత్రులేదేవిచరణ సామీప్యమున తమ రాచకీయ విజ్ఞానాక్షతల నుంచిరో, కాళిదాస, నన్నయ, పోతన, పెద్దనాది మహాకవులే దేవి పాదపద్మముల సమక్షమున తమ మహాగ్రంథములనంజలి బద్ధులై సమర్పించిరో, సీత, సావిత్రి, దమయంతి, శకుంతల, ద్రౌపది మున్నగు పతివ్రతామతల్లులే దేవిచరణ తలమున దమ పతిభక్తి కుంకుమ నర్పించిరో అరవింద, రవీంద్ర, మహాత్మాది దేశభక్తులే దేవి సర్వాంగకృతార్థులో అట్టిభారతమాత కనుగొలకులనుండి యశ్రుజలము కారిగ బ్రవహింపగలదు. ఇంతకన్న దుఃఖదాయకమగునంశమును సిగ్గుగొనదగిన కార్యమును యింకొకటిలేదు.

—

# ప్రణయవిమానము

గరికిపాటి రామమూర్తిగారు బి. ఎ.

ప్రణయ విమానమ్ము । బయలు దేరెడిని
ఎక్కడోడీ త్వరలోన । నీగాలి మోడ
మేఘాల పైపోవు । మెఱుపులనంటి
సంద్రమ్ములను దాటి । సాగిపోవంగ
సంతససౌఖ్యశ్రీ । సాధితమును
సంఘంబుగానరా । జాతీయులముందు
వారినేనియు వీడి । వాయువేగమున
పోవంగ బోవంగ । బువిమింటి నెపుడు
కనరట్టి వినరట్టి । కమనీయమణులు
అనుభవింపగరాని । యఖిలసంపదలు
అన్నింటిమించిన । యట్టిప్రణయము
కాంతివంతంబౌచు । గానంగనగును
ప్రణయమంత్రంబెజ । పాఠము సేయుచును
సంతతానందాబ్ధి । సౌఖ్యవీచికల,
దేలియాడుచునుండి । దివ్యతేజమున
వెలుగొందు వారని । వీక్షింపనగును
ప్రణయవిమానమ్ము । బయలుదేరెడిని
ఎక్కడోడీత్వరలోన । నీగాలి మోడ



# కవితా ప్రసంగము

(కోట భాస్కరరావుగారు)

---

కలరల రామకృష్ణులనంగాఁ దగు యాదవవంశ బాలురా
చలిమలప్రాంత కొక్కదివసంబున సాగిరి మొండఁ గ్రాగుచున్
గోలముల యాలమందలను బ్రూన్చుచునంతట నీదినమ్ము నె
ట్టుల గడపంగ నౌనని కడుంగడు బుచ్చిరి యాటపాటలన్॥

రాముఁడు. ఓయి! విచారమేల? వినుమోయి! యదెట్లుదినమ్ముఁబుచ్చలే
మోయి! సతంబు సంతసమునొందుచు; మున్నటిదాఁక నీవు నా
నాయదువంశ బాలుర సనాతన మూర్చితి వాఁడి; నేఁడు "గో
ల్లోయమ గొల్లచల్ల" యనులోనఁగు నాటలవేడఁ బోయెనో?

కృష్ణుఁడు. మున్నటిదాఁక రామ! వినుమోయి? కవిత్వము సెప్పుచుంటి వి
ద్వన్నుత! వేణువూదుచును, వాయుడగంగను గొల్లసుద్దులన్
సన్నగ బాడుచున్ జనఁగ సాల్పడెడున్ గవనంబు; లాభమున్
సున్నయయెన్; గవీశ్వరుల న్యూనతయే కనిపించుచుండెఁగా॥

రా. పేసవిఁ బాటపాడుచును వేడుకఁగూర్చెదు "గొల్లభామ" సం
తోసము లేక కష్టములతోఁ జనురీతిని నీవు, కృష్ణ! ఆ
యాసము లేక యావనమునందున వారినివీరిఁ దేల్పఁగా
నీసమయంబునందునని నీవి! కవిత్వమసహ్యమాయెనే?॥

కృ. దానను లాభమింతకలదా? యనుచింతయులేక లాభమున్
గానఁగ నెంతు గ్రొంద అవకాశము కల్గిన లేకపోయినన్,
గాన, కవిత్వమందు ఫలకాంక్షయు నూతయు లేకటంచనన్
ఆనరుఁడాతడేయగును నాతని గౌరవముల్లై యుండుఁగా॥
ఒకఁడు పొదం జరించు పికయూథములన్ బెదరింపగానె, యుం
శొకఁడు వధించురీతినిట, నొంటకవిత్వము సేయలాభమిం

కోకఁడనుగాంచినంత, నోహోహోయని లోకపువారు మెచ్చినన్
అకట ! యతండంతఁడెసును; యాతనిగౌరవమట్లే యుండుగా॥

రా. స్తవమేవాస్తవ మేర్పడంగమనిఁ బ్రస్తావింపమూల్యంబు కం
టెవరం బౌచు దనర్చు; లాభమునకంటెన్ గీర్తియాహ్లాదదం
బు; వయారే ! పలుమాట లేల వలుకన్ హోఁబోహితంబేయగున్
అవహైత్యంబును మాన్పుచుండిన మహాత్మా ! గౌరవంబంమటల్ ॥

దేహముగన్గరింప, వనదేవతలందఱు బిక్కసావ, నో
హోహోహోయటంచు లోకులనుకోఁగను, నీమధురాలపమ్మును
మ్మూహల సన్నిటఁగిడు సముద్వహులం బొనరించునంతఁ దా
హోహమటంచు మొక్కులిడ, నాతనిగౌరవమట్లె యుండుఁగా ॥

గీతంబైతనరారెఁగాభువి భగద్గీతామృతంబుజూడను।
ఖ్యాతన్ జానపదాళులున్నఁను వసీరున్ గట్టులన్ దాటి, య।
జ్ఞాతాత్మున్ గుణియించి పాడముతులున్నాబఱంగ, ఆలుంగరం।
గాతారందఱుపాడినంతసనయా కాంతింతంపుఁ జిత్తంబులన్ ॥

శ్లో. సమలికనుల్ గనన్గడఁగి నెమ్మది సంతసమందుఱి బాలకుల్।
విమల మదీయ లేఖ్యాసు కవిత్వముఖండ సుధాసుభాతిగా।
నమకుటఁజేసి యుండ్కనుల దలి యందముఁగాంత్రె? యాపత
త్సుమమయమట్లుఁగాగ కడుశోభిలు నీసరసంపు వాగ్ఝరిన్ ॥

రా. నాట్యయఁగవిత్వ వాగ్ఝరితరంగములన్ దనరారు పద్యమై
వేయక భావవాసనలు వీరరణాంగణమందునందు శో
భాయుతరీతిఁ జల్లవలె భావములన్ జివురింపఁజేసి నీ
నాట్యయసమృద్ధి వర్ధిలఁగవారును వీరును మెచ్చఁగావలెన్ ॥



# సుధాకరుడు

తంగిరాల వెంకటకృష్ణయ్యగారు,

---

సుధాకరుడు సోదరసోదరీ జనము నందందఱకంటెను యనుజుడు. కొంచెము దుడుకువాడు. ఎవరిభయభక్తులును లేక సంచరించువాడు. అతని పరిచయము లేనివారు విజయవాడలో నరుదుగ గాన్పింతురు.

రేవతీ సుధాకరులు సుఖముగనున్న దినములు గతించి యొకవత్సరమాయెను. రేవతి మరణించినప్పటినుండియు సుధాకరుని చిత్తవృత్తి బొత్తుగామాఱిపోయెను. ఇంతలో నాతడు బి. ఏ. పరీక్షతప్పినట్లు తెలిసెను. గోరుచుట్టుపై రోకటిపోటువలె నీదుర్వార్త యాతని మనఃపంజరము నొక్కసారిగ నూపివైచెను. తనవంటి యభాగ్యుడు లేడని తలంచెను, దైవోపహతుడగు నాతని బంధుమిత్రులుగూడ చిన్నచూపు చూడ జొచ్చిరి.

*　　　*　　　*

పరీక్షలు సమీపించుచుండెను, అనుకున్నంత ఎక్కువగ చదువుసాగలేదు. ఒకవారము రోజులు వ్యవధిగా స్నేహితులతో నాతడు రాజమండ్రి చేరెను. పరీక్షలు ప్రారంభమాయెను. చేతనైనంత వట్టువ్రాసెను. అందరును కృతార్థులమగుదుమనియే యెంచుచుండిరి. తిరిగివచ్చినపుడు సుధాకరుడు బెజవాడకు రాలేదు. లూరులోని యత్తవారింటదిగెను.

వెంకటరామయ్యగారు సుధాకరుని తల్లికి పినతల్లి కొడుకు. ఈయనకు రైలుజిల్లాకా 50 రు. ఉద్యోగము లేదు. వెంకటరామయ్య గారికి పుత్రికా సంతానమే గాని పుత్రసంతానము లేదు. ఆయనకున్న [illegible] పుత్రికలలోను రోహిణి [illegible] రేవతి మరణించెను. వెంకటరామయ్యగారి హృదయమునందు చింతకు తప్పనితరమునకు స్థానము లేదు. కూతురు పోయి కొండంత దుఃఖములో నున్నను సుధాకరుని బాగుగనే యాదరించిరి. కేవలము భార్యతోవచ్చిన చుట్టరికము గాక పోవుటచేత సుధాకరునకాయింట, సాధారణముగ నల్లునకత్తవారింటనుండు స్వాతంత్ర్యముకంటె నెన్నోమడుంగులు గలదు.

సుధాకరుడు మధ్యాహ్నము చదువుకొనుటతోడను, సాయంత్రము షికారుపోవుటతోను పవలంతయు గడపుకొనెను. కానిరాత్రి యాతనికి నిదురలేదు. ఒకవేళ పట్టినను కొంతరాత్రి వేళ మేలుకొనవచ్చును. వెంటనే యేవోయాలోచనంబు లంతస్సిద్ధ్యక్ష ధమునం బొడసూపి నిదురనుండి యాతని యాలోచనంబుల నుపరోధించును.

ఇప్పుడాతనికి నిరంతరమును రోహిణిని గురించిన యాలోచనయే— పలకన, రోహిణి— రూపవతి— విద్యావతి— పదారు వత్సరముల జవ్వని— సుధాకరుడనలేచపలుకు పడతులంజూచిన నొడలు కంపమెత్తును.

ఆవ్యామోహంబున ధర్మాధర్మంబులును యుక్తాయుక్తంబులును విచారించుశక్తి యాతనికి బొత్తుగా శూన్యమగును. ఇటీవల కొంతవైరాగ్యమవలంభింపనెంచినను సాధ్యముకాకపోయెను. భార్యావియోగంబును, యావనమదంబును బేరేచగల యెట్టి యకార్యమైనను చేయుటకుసుధాకరుడు సిద్ధముగనుండెను. రోహిణికంటబడుటయె తడవుగ నోరచూపులు నాలుగావంకకు విసరుచు. ఎవరేని చూతురేమోయను భయముకాని, మనము చేయుచున్నది ధర్మాతిరిక్తమగునని యనిగాని యాతని కెప్పుడును తోచలేదు.

రోహిణి మనోభావము లెట్లున్నవి? ఆమెకుకూడ చిత్తముచలించుచుండెనా? సుధాకరుని మోహమునామె బహూకరించుచుండెనా?- బహూకరించుచుండెను. తానాతనియెడ ననురక్తయైయుండెను. కాని ఒకరితో నొకరు మాటలాడుటలేదు. ఒకరి మనోభావంబు లొకరికి గోచరమగుచుండెను. సుధాకరుడామెను వివాహమాడి సంఘసంస్కర్తలలో నొకడు కావలెనని తలంచెను. నిజముననా వివాహము తనమనస్సంతృప్తికేయైనను నాబాలికను దుస్సహవైధవ్యదుఃఖమునుండి విడిపించి తాను వివాహమాడుట యామెకు చేయుచున్న మహోపకారమనియు, తానుసంఘమున కాదర్శప్రాయుడయి యెంతోగౌరవము బొందగలడనియు సుధాకరుడు తలంచెను. మరునాడు తనయుద్దేశ్యమామె కెఱింగించి యామె యంగీకారమును గొననిశ్చయించెను.

ఆమెతో సంభాషణ కవకాశమెట్లు కలుగునదియు నామె కేమేని సంకోచంబు కలిగిననెట్లు నివారింప వలసినదియు నాలోచింప దొడంగెను ఇంతలో నాతనికి కునికిపాట్లువచ్చెను

ఉదయముననే లేచి కాలకృత్యంబులు దీర్చుకొని కాలువకేగి స్నానముచేసివచ్చెను. అనంతరము కాఫీ పుచ్చుకొని పడకకుర్చీపై బండుకొని చదువుకొనుచుండెను. కొంతతడవైనపిమ్మట రోహిణి యాగదిలోనికివచ్చెను అద్దము కొఱకటునిటువెదకి సుధాకరుని "నిక్కడ నద్దముచూచినారా?" యని యడిగెను. అతడు చెప్పకమునే కిటికీతలుపు సందుననున్న యద్దము గొని తిలకము దిద్దుకొనెను సుధాకరుడు తనకు గూడ కొంచెము నుంచుమని యడిగెను. రోహిణి "నేను పెట్టుదునా? అనియడిగెను. సుధాకరుడు చేతిలోని పుస్తకము నాబల్లపైనుంచి లేచి నిలువబడెను. రోహిణి తన వక్షము నాతని వక్షస్థలంబునకు సోక, మునివ్రేళ్ళపై నిలిచి యాతని నొసట బొట్టుపెట్టెను.

రోహిణిచపల దృష్టులింతలో బల్లపైని పుస్తకమున బ్రాలెను. ఆమెయది యేమి గ్రంథమని యడిగెను.

సుధా-- అది వితంతువివాహములు శాస్త్రసమ్మతములని నిర్ధారించుటకు ప్రమాణములతోగూడ వ్రాయబడిన యొకగ్రంథము. రోహిణి కనుదమ్ముల నాశ్చర్యాంకురములు పొడసూపెను. ఆమె "ఏమి? వితంతువివాహం చేసుకుంటారా? అని ప్రశ్నించెను.

సుధా — ఏమో అదియిప్పుడేలాగు చెప్పడం.

రో — పోనీ చేసుకోవాలనేనా వున్నదా?

సుధా — ఆ

రో-- మరిమీతల్లిదండ్రులు ఒప్పుకుంటారా?

సుధా... నాకిష్టముంటే నేనే సర్వస్వతంత్రుడ నాకొకరి యనుమతి [illegible]ంది?

రో - చిన్నప్పటినుంచి పెంచి పెద్దజేసిన తలిదండ్రుల సమ్మతియక్కఱలేదా? బి. ఏ. ప్యాసయ్యేవారిని సంతోషపెడతారని అనుకుని యావజ్జీవము కొడుకులయభివృద్ధికి చింతించు తలిదండ్రులను వదలివేయుటధర్మమైనా? పోనీలోకమైనా సంతోషిస్తుందా?

సుధా - లోకంసంతోషించడానికీ నాకూ సంబంధంలేదు అందరను సంతోషపెట్టాలని ప్రయత్నిస్తే "ముసలివాడీ గాడిదపని" అవుతుంది. లోకమంతా ఏపనిచేసినా ఒక్కమారుగా సంతోషించదు. కొందరు బాగుందంటారు, లేదంటారు, నేను లోకంకోసం ధర్మం అనే ఉరితాడు నా మెడదూసుస్తానన్న మాట పెట్టేది వాళ్ళే. వాళ్ళు కాటికి కాళ్ళు చాచుకు కూర్చున్నారు. వాళ్ళకోసం నాజీవితం వ్యర్థంచేయటం నాకిష్టము లేదు.

రో - తామూ బాధ్యతలేనిమాటచెప్తే ఎట్లాగు? వాళ్ళుబ్రతికి ఉన్నాళ్ళు బతుకనుకదా కష్టాలుపడి ఎముకలు చిల్లులు పడ్డాయి వాళ్ళకీని. "ఉన్నదుండగా ఉపాకర్మ" న్నట్లిదికూడా ఒకటి తెచ్చి పెడతానంటారు?

సుధా - ఇదేమిటి? యీమధ్యచాలా ఆలోచించాను. మతాంతరుణ్ణి చేసుకుందామనుకున్నాను. కాని-

రో - (నవ్వుచు) కాని మానేశారేం?

సు - కాని మానేశారేం? ఆప్రశ్నకు నీవే జవాబు చెప్పాలి

రో - నేనెందుకు చెప్పాలి? నేనే మిమ్మల్ని యివన్నీ మానెయ్యమన్నానా?

సు - పోనీకాని ఎందుకు మానేశానో తెలుసునా? వితంతువివాహం చేసుకోవాలనని

రో - ఎప్పుడేమిటి? పెళ్ళి

సు - ఏమో? యింకా తేలలేదు

పిల్లదేవూరు ఎన్నేళ్ళుంటాయి?

సు - ఉయ్యూరే పదహారేళ్ళుంటాయి

రో - (ఆతురముతో) ఎవరమ్మాయేమిటి? తరువాత జెపుతాగాని అసలు నీకు వితంతు వివాహం యిష్టమేనా?

రో - శాస్త్రదూష్యంకాదు?

సు - ఎవడంటాడామాట? గొప్పగొప్పచదువులున్న వాళ్ళంతా అది శాస్త్రసమ్మతమని ప్రమాణాలు చూపుతున్నారు. పెద్దపెద్ద ఎమ్. ఏ లతో నాకు స్నేహంవున్నది. వాళ్ళంతా యీసిద్ధాంతాన్ని ఏకగ్రీవంగా ఆమోదించేవాళ్ళే

రో - పెద్దవాళ్ళకయిష్టమైన పనిచెయ్యడం తప్పుకాదూ?

సు - ధర్మాధర్మములు విచారించి అన్యోన్యానురాగమును జూచి చేసుకునే వివాహములు పెద్దవాళ్ళకయిష్టమైనంత మాత్రాన మానివేయుటయా? అయితే నేను పెళ్ళిచేసుకోవటం నీకూ అయిష్టమన్నమాట.

రో - అదేంమాట? ఎక్కడో కన్యను తెచ్చి పెళ్ళిచేసుకోరాదా?

సు - నీమాటప్రకారం కన్యనే తెచ్చిపెళ్ళి చేసుకుంటాననుకో రెండవ పెళ్ళియయినను బాగా కట్నములు యిచ్చే సంబంధము తేకపోతే తల్లిదండ్రులు నలుగురి భయమునకో, ధనాశచేతనో, సంఘబహిష్కారమునకు వెఱచియో నేను కన్యను వివాహమాడిన

యెడల దానికి నా పయినననురాగము లేనిచో నాకు సౌఖ్యము కలుగునని తలంచితివా? రోహిణీ! అట్టిచో సౌఖ్యదూరమగు నాజీవిత మంతయు వ్యర్థమగును గదా. నాజీవితమును వ్యర్థమొనరించుకొని నేనెన్నాళ్ళకు జీవింపవలయును.

రో — మీరు చెప్పినమాట లన్నియు నిజమే. అయినా "పెలి, గిలి" అవి నానాగందరగోళము పడవలసి వచ్చును.

సు - యిటువంటి పిచ్చిపిచ్చి సందేహాలు పెట్టుకుని యెంతోమంది బాలవితంతువులు పాడయిపోతున్నారు. ఎవరైనా ధైర్యంచేసి అట్టివారిని వివాహమాడితే నలుగురూ ఆక్షేపిస్తే "నానాసేలక్ష్మి" యన్నాడు.

నీవటువంటి నీవు మళ్లీ పెళ్లిఎందుకు చేసుకోరాదు? నీభర్తతో సంసారం చేశావనా? ఏ సుకీర్తియు, సౌందర్యాం, అంతా అడవిగాచిన వెన్నెలచేయడం,

రో — ఎందుకేమిటి? విధివ్రాలు.

సు: — విధివ్రాలేమిటి? నీవుమళ్ళీ పెళ్ళిచేసుకుంటే విధివ్రాలేమవుతుందో ఆలోచించు.

రో నిజమేగాని అల్లరిపడటం నెట్టడము

సుధా అల్లరేమిటి? అసలునీకు పెళ్ళిచేసుకోవడం యిష్టమేనా?

రో - ఇష్టమైనంత మాత్రాన సాగుతుందా

సుధా - చక్కగా సాగుతుంది. సాగితే యిష్టమేనా?

రో - ఆ.

సుధా ఎవరిని చేసుకుంటావు!

రో - నన్ను ప్రేమించేవాళ్ళని.

యింతలోకే రోహిణిని తల్లిపిలిచింది ఆపిలుపుతో రోహిణి పకిలాలె యెగిరిపోయింది. సుధాకరుడు చూస్తూనేవున్నాడు.

* * *

నాటిరాత్రి యేసుధాకరుడు బెజవాడకు ప్రయాణమయ్యెను. వెళ్ళునప్పుడు రోహిణితో ఒకవారముదినములలో వత్తునని చెప్పెను. బెజవాడలో సుధాకరుని కాపురపు స్నేహితుడు సోమసుందరము. బెజవాడ చేరిన మరునాడుదయముననే సుందరమును కలిసికొనెను. జరిగిన సంగతినంతయు చెప్పెను. సోమసుందరము బాగానేవున్న దన్నాడు. కాని ఆతనికి కొన్ని సందేహములు కలవు. వానిని చెప్పినయెడల సునాకరునకు కోపమువచ్చును. చెప్పకుండిన తన ధర్మమును నిర్వర్తింపనివాడగును. ఎట్టకేలకు తన సందేహముల నాతనికి చెప్ప నుద్యమించెను.

సుందరం - వితంతువును పెళ్లిచేసుకుంటావుటరా?

సుధా అయితేనేం? కన్య భర్తతో సంసారం చేయలేదు అట్టిదానిని చేసుకోవడానికి సందేహమెందుకు?

సు అభ్యంతరములైతే చాలా ఉన్నాయి. నీవు యీవివాహం చేసుకుంటే సంఘబహిష్కారము తప్పదు. అంతే కాక ప్రస్తుతం నీవుతల్లిదండ్రులపైన నాధారపడియున్నావు. నీవీవివాహముతో ఎక్కడో వాలుగుడబ్బులు సంపాదించుకోవలసిందే. పోనీ బి. ఏ పరీక్షకు వెళ్ళానుగదా. ఒకభాగం అన్నాప్యాసయితే ఎక్కడో నాలుగుడబ్బులు కొస్తానంటావా?

నీవు చదువుకుని తేరి వార్ధక్యంలో వాళ్ళకింత సంపాదించి పెడుతావని ఆశతో

వున్న తల్లిదండ్రులేమైపోవలెనో ఆలోచించు చుండుటంతు లేదు. సంఘసంస్కారం చెయ్యటమంటే సాహసమైనపనేగాని నీవు మాత్రం ప్రస్తుతం అందులో దిగటం బొత్తుగా పనికిరాదు.

సు- ఆమాటే పనికిరాదు సంఘసంస్కారం చెయ్యటం మంచిదైతే అందరూ ఆపనిని చెయ్యడానికి ఏమీ అభ్యంతరం వుండనూడదు. తానుతప్ప జగమంతయు చేసినచాలు ననుకొనువాడు కేవలమును పిరికిపంద.

నాకు బహిష్కారమన్న భయము లేనేలేదు. తల్లిదండ్రుల విషయములో వారునన్ను వదులుకోవలసినదేగాని నేనిపెళ్ళిచేసుకున్న మాత్రానవాళ్ళను వదలివేయను. చదువు సాగదంటావా? దానికి మనప్రయత్నం లేనేలేదు. ప్రాప్తంవుంటే అదేవస్తుంది రవ్వాగివ్వా మనంలెక్కచేసే విషయాలు కావు

అటు అన్యోన్యానురాగం వున్నది అనుకూలప్రియము అనుకూలదాంపత్యము ఇది కేవలము విషయేచ్ఛ చేతనేకాక అసహాయగు నొకయనాథ బాలికజీవితము నానందమయముగా నొనరించుటకు నిశ్చయించుకొన్నాను.

ఇందుల కభ్యంతరమేమిటన్న వివాహమునకును నాజీవిత ప్రారంభోద్యమమును చేసుకొనుటకును 300 రు కావలయును. నీవు కావలసినడబ్బు జాగ్రత్తపెట్టవలయును

సు- చెప్పటానికేం? ఎన్నైనా చెప్పవచ్చు మూడువందల రూపాయ లనుకునేటప్పటికి కల్లా మన చేతులో ఎవడు పోస్తాడని?

సుధా- ఎవడు పోసేదేమిటి? మాపాపు— నీపేరు ఖర్చువ్రాసి తీసుకొను మీనాన్నడిగితే నోటువ్రాసియిద్దాం

సు- నేను మానాన్నతో చెప్పకుండా అప్పుతెచ్చే అలవాటులేదు. పోనీ చెప్పిచేదామా అంటే దానికి కొన్ని చిక్కులున్నాయి.

సుధా- ఏదో ఒకటి ఆలోచించు భారంఅంతా నీమీదపెట్టాను.

సు- ఆలోచించేదేమిటి? అన్నాన్నము.

ఇంతలోనే సుధాకరుడు పూర్తిగా ప్యాసయినట్లు చెన్నపట్నమునుంచి తంతి వచ్చింది. దైవముచాలా అనుకూలంగానే వున్నాడనుకొన్నాడు. సుధాకరుడు తండ్రిని చిల్లరఖర్చులకు 200 రూపాయలు కావాలని అడిగినాడు. తండ్రికింత ఖర్చుబొత్తుగగిట్టదు. కారణం దుబారాచేస్తాడనే పీడించగా పీడించగా ఆఖరుకు 100 రూపాయలు యివ్వడానికి ఒప్పుకొన్నాడు. సోమసుందరముతో యింకొక 100 రూపాయలు చూడుమని చెప్పాడు. కాని సందర్భపడలేదు. ఓవరకు ప్రయాణంరోజు వచ్చింది సుందరునకు తండ్రి 1 వ తారీఖునకుగాని డబ్బురాదన్నాడు. ఎవడైనా అప్పిస్తాడేమోఅని ప్రయత్నించాడు. లాభం లేకపోయింది సుందరముతో తానుపడ్డ పాట్లన్నీ చెప్పుకున్నాడు. సుందరమునకు జాలివేసింది. అతడెరిగిన ఒక షాపుకారు దగ్గరకు తీసుకువెళ్ళి సుధాకరునికి అప్పిప్పుటకు రికమెండు చేసినాడు. అతడు తనవద్ద డబ్బులేదనియు, తన కూతురుతాలూకు 100 రు వున్నాయనియు వడ్డీ 100 కి 1-9-0 తక్కువ వల్లపడదనియు, నోటు సుధాకరుడు సోమసుందరమును కలిసి వ్రాయవలసినదనియు చెప్పెను. అతడు పెట్టిన

పరతులనన్నింటికిని సమ్మతించి వారు వానియొద్ద బదులు తీసుకొనిరి. ఒక సంవత్సరములోపుగా నీబాకీసంగతి ఎవరికిని తెలియచేయకుండ నట్లాతనివద్ద మాటపుచ్చుకొనిరి.

నాటిరాత్రియే ప్రయాణమై సుధాకరుడేలూరు వెళ్ళెను. రోహిణితో మరునాడు బయలుదేరి రాజమహేంద్రవరము రమ్మనమని తాను నాడే బయలుదేరి వెళ్ళి సత్రమున బసచేసెను. రాజమహేంద్రవరమాతనికి క్రొత్తయూరు కాదు. కళాశాలలోని యుపాధ్యాయు లందరాతనికి పరిచితులే. సుధాకరుడు రాజమహేంద్రవరము చేరిన నాటి సాయంత్రము గోదావరి స్టేషనుకుపోయెను. యథాప్రకారము రైలువచ్చెను. గాని రోహిణి రాలేదు. ఆతడటునిటు రైలుపొడవునను నాలుగు సారులు తిరిగెను. స్త్రీలబండిలో చూచెను. కాని రోహిణి జాడలేదు. ఇంతలో రైలు కదిలెను. హతాశుడై సుధాకరుడు మరలిపోయెను. నాటి రాత్రి యాతనికి భోజనము రుచింపలేదు. రోహిణి రాకుండుటకు తగినబలమైన కారణమాతనికిగోచరింపకుండెను. ఒకవేళ పగటి ప్రయాణము క్షేమకరముకాదని రాత్రి రానెంచెనేమోయని తలంచెను. నాటిరాత్రి కొట్లోనిద్రించెను. తెల్లవారుజామున నే లేచి మరల స్టేషనుకుపోయెను. బండి స్టేషను సమీపించుచుండెను. ఆస్థిరహృదయముతో నాతడుప్లాటుఫారముమీద ముందుగా నిలుచుండెను. నాటిరైలులో రోహిణి వచ్చియుండెను. రోహిణివెంట సామానులేమియును లేదు. సుధాకరుడు వచ్చినప్పుడామె చీరలు మున్నగునవి కూడ తానే తీసుకొని వచ్చెను. ఇరువురును సత్రమునకుపోయిరి.

నాటియుదయముననే భుజించి మధ్యాహ్నము వీరేశలింగము పంతులుగారి యధీనమునసున్న వితంతు శరణాలయమునకు బోయిరి. మఱిరెండురోజులకు రోహిణీసుధాకరుల కతివైభవముగ వివాహము జరిగెను. వీరేశలింగం పంతులుగారి సలహాప్రకారము సుధాకరుడు భార్యాసహితముగ విశాఖపట్నంవెళ్ళి యచ్చట హైస్కూలులో సుపాధ్యాయ పదవికై ప్రయత్నించెను. పంతులుగారి రికమెండేషన్ వల్లనో తన యదృష్టమువల్లనో సుధాకరుడు సఫలమనోరథుడాయెను.

అప్పుడు సుధాకరుడు విశాఖపట్నంలో పాఠశాలోపాధ్యాయ పదవి యందు నెలకు 50 రు సంపాదించుచుండెను. రోహిణి బాలికపాఠశాలలో 4 వ ఫారము చదువుచుండెను. ఒక చిన్నగృహము నద్దెకు తీసుకొని వలయుసామాను జాగ్రత్తపెట్టుకొనిరి. వచనకార్యములో సుధాకరుడు రోహిణికి నిత్యమును తోడుపడెను. వారు ఆనందమయములుగ దినంబుల వారు క్షణికములట్లు గడుపుచుండిరి. అనిర్వచనీయానందము ననుభవించునప్పుడు, ఆప్రేమ తరంగముల దేలియాడునప్పుడు ఆరోహిణీకపోలపాళికల జుంబించునప్పుడు సుధాకరుని చిత్తవృత్తి వర్ణించుట కష్టము.

సుధాకరుడు కాపురమున్న యింటికి రెండిండ్లవతల నొక పెద్దమనుష్యుడు కాపురముండెను ఆతనికి శకుంతల యను నొక కొమరితగలదు. శకుంతల యాతనికి పెంపుడుకూతురు. పౌరాణికమగు శకుంతలాత్మ జన్మవృత్తాంతమునకును, నీపె జన్మవృత్తాంతమునకును కొంచెము పోలిక కలదు.

వ్యత్యాసము జననీ జనకులందును భర్తృపరిత్యాగమునందును మాత్రమే కలదు. భర్తృపరిత్యక్తయగు నీమె సతీసంఘమున దనకగుచున్న పరాభవంబు సైతము లెక్కింపక కాలము గడపుకొనుచుండెడిది. ఈమె యేకపుత్రుడగు మూడేండ్ల శిశుప్రకూడ మొన్నమొన్ననే గతించెను. ఇది శకుంతల వృత్తాంతము.

* * *

శకుంతలకును రోహిణికిని సఖ్యమాయెను. ఆసఖ్యములో శకుంతల తన కొడుకు మరణించిన విచారమును మఱచిపోదొడగెను. రోహిణీ సుధాకరులు విశాఖపట్నమునకు వచ్చి రెండేండ్లు గతించినవి. సుధాకరుడా రెండు సంవత్సరములలో ననుభవించిన యానందము, సౌఖ్యము తన జీవితములో మరియెన్నడు ననుభవింపలేదు.

ఇంతలో రోహిణి గర్భవతియాయెను. ఇక నామె పాఠశాలకేగి చదువుకొనుటకు లజ్జించెను. శకుంతల మాత్రమామెకు పలయు పరిచర్యలెప్పటికప్పుడు చేయుచుండును. ఏముప్పు ముచ్చటయును లేకయే యామెకు నెలలునిండెను. అట్లని సుధాకరుడామె కోరికల దీర్పకుండెనని భావింప జనదు. ఎప్పుడేది కావలయునని కోరునో యయ్యది వెంటనే తెచ్చి యీయక సుధాకరుడు నిలువజాలడు.

ఒక సుభోదయంబున నామె యొక బాలికను ప్రసవించెను. ఆబాలికకు వారు కామేశ్వరి యని నామకరణ మొనర్చిరి. కామేశ్వరి చక్కనిచుక్క. తల్లిదండ్రుల ప్రేమ నిధానము. ఆబాలికకేలోపమును ఘటిల్లకుండ వారు నాలుగు కన్నులను కనుపెట్టి చూచుచుండిరి. సుధాకరునకు సంసారభారమెక్కువ యయ్యెను. రోహిణి దుర్బలశరీరయగుటచే బిడ్డకు పోతపాలు పోయవలసివచ్చెను. రేపనుమాటలేక ధనమును వెచ్చించు సుధాకరుని కితరవ్యయము తగ్గించవలసివచ్చెను. అలంకారములు లేకున్నను కామేశ్వరియందమునకు కొఱతలేదు. కాని తల్లి కావిషయమొక లోపముగనే కన్పించుచుండెను.

అది కార్తికమాసము. వర్షములు మిక్కుటముగా కురియుచుండెను. సముద్రము భయంకరముగ ఘోషించుచుండెను. విశాఖపట్నమంతయు కలరాలతోను విషజ్వరములతోను నిండియుండెను. వీటికితోడు వర్షాపాతము ఊరంతయు ముజ్జిడ్డుగా నుండెను. కార్తికబహుళత్రయోదశి. కామేశ్వరి పుట్టిన దినము రోహిణికూతునకు తలంటి నీళ్ళుపోసింది. తలకువ్వి క్రొత్త గౌనలు చొక్కా తొడిగి "మీనాన్నకు చూపించి రమ్మని" పంపింది. గౌనలు చొక్కామీద రంగురంగు చారలుచూచి కామేశ్వరి మురిసిపోయింది. ఇంతలోనే సుధాకరుడు వచ్చాడక్కడకు. గింపంత ముఖంచేసుకుని చొక్కానూపించింది తండ్రికి "బాగావుందమ్మా" అని యెత్తిముద్దు పెట్టుకున్నాడు. సుధాకరుడు రోహిణితో చూశావా? యెంతఅల్పసంతోషో? అన్నాడు.

అన్నాళ్లి సాయంత్రము పేరంటాండ్రనందరిని పిలుచుకువచ్చి రోహిణి శనగలు పప్పుపంచిపెట్టింది. శకుంతల కూడా రోహిణికి తోడుపడ్డది. నాడుపడిన హైరానుచేతనో యేమోకాని రోహిణికి తలనొప్పివచ్చినది; కొంచెము కాక కూడాతగిలింది.

తెల్లవారేసరికి నాలుగువిరోచనములైనాయి. మనిషి తేలిపోయింది. సుధాకరుడు వెళ్ళిడాక్టరును తీసుకువచ్చాడు. డాక్టరువుండగానే ఒకపెద్ద వాంతికూడా అయింది. కలరా తగిలిందని చెప్పాడు డాక్టరు. మందు తీసుకువచ్చి యిచ్చాడుగాని లోపల యిమడటంలేదు. నాటి రాత్రి రోహిణి యీలోకంనుంచి సెలవు తీసికొన్నది.

* * *

కామేశ్వరి పోషణభారం శకుంతల వహించింది. సుధాకరుడికంతా అంధకారంగా వున్నది. అతనికేడుపులేదు విచారంలేదు— కన్నీరులేదు బొత్తుగా పిచ్చియెత్తినట్లూహార హితమైన శాంతములో మునిగి తేలుచున్నాడు.

* * *



# నా చింత

విశ్వనాథ నరసింహముగారు (సరస్వతీసంఘము)

---

చ॥ నిరుపమరీతిఁ బోవుచు వినీల నభోంతరమందుఁ బోయిసు
స్థిరతరసంతసంబుగనఁ జేయుచు నొక్కొకసారి లేఁజిగు
ళ్ళరయుచు సృష్టినింగని విలాసయుతంబుగ మూర్ఛనింపుసి
సరణినిగాంచ పక్కిగ జన్మము నెత్తనటంచు గుందెదన్ ॥

చ॥ విమలసరోవరంపు టరవిందములంగని యూఁదు తావిలీని
నమలజలంబునోలనిడి హాయిగ విప్పునఁ బ్రాకుచుండఁగా
ప్రమదముతోడ గీచక రవంబున వచ్చెడి పిల్లఁగాంచ నా
కమరునె యెన్నఁడేని యిఁక నండజజన్మమటంచు గుందెదన్ ॥

చ॥ ఇనుఁడపరాశ వ్రాలుతఱి నీవు తటాకజలంబులందు నె
మ్మనమున హర్షమొప్ప ఖగమాఁ కృతగానవయ్యు సంజకెం
పున కెదురేగి నీడములనుండునకున్ వడిఁబారునంత నీ
వెనుకనె నేనువచ్చుటకు పేర్మిడి రెక్కలు లేమి గుందెదన్ ॥

---

# రాధ ప్రార్థన.

పా. వి. రాఘవరావుగారు (సారస్వతమిత్రమండలి)

ధవళలోచనములఁ దగుకాటుకను బెట్ట ననుఁజూచి లేనవ్వు నవ్వినావు,
కమ్మతావులసీను కస్తూరి మేనద్ద ననుజూచి లేనవ్వు నవ్వినావు,
జాళువాపుట్టముల్ సరిగఁ గట్టించగ ననుజూచి లేనవ్వు నవ్వినావు,
శారదనిశలందు "సరసుఁడరమ్మన" ననుజూచి లేనవ్వు నవ్వినావు,

సైపజాలక నా యురస్థలమునందు మలయజము మించు నీదు చేతులనునుంచ
"ఎవ్వతె"వటంచు కెవ్వున నవ్వినావు అట్టినవ్వుల మఱచితే అకటనాథ?

చిత్తజరూప ముగ్ధనయి చిక్కితి నీదృఢమోహవల్లికన్
ఎత్తుకుపెంచినట్టినను నెట్టులనైనను బ్రోతువంచు నా
చిత్తములోన జింతలకుఁ జేరగ తావొసగంగలేద యో
జిత్తులమారి నన్నిటుల జేసెదవంచుఁ దలంపనైతిరా

గంధమింతయొసగి కామించుకుబ్జను మోహవివశుడవయి బ్రోచినావు
వెన్నపాలఁబెంచి నిన్నింతఁజేసిన అత్తనీదుకరుణ కర్హకాదె?

రంగారు సరిగంచు చెంగావులధికమే ముద్దుగుల్కెడు నీదుమోముకన్న
ఘనసారమిళితమౌ గంధంబు ఘనమోనె ముద్దుగుల్కెడు నీదుమోముకన్న
మంచుముత్తియముల మాలలు వెలయౌనె ముద్దుగుల్కెడు నీదుమోముకన్న
వీనులవనియించు గానంబుమేటియో ముద్దుగుల్కెడు నీదుమోముకన్న

అనుపమానము నద్వితీయంబునైన మోముఁజూపించి నన్గావు కామజనక!
అధరబింబాన వెలువడు సుధనుద్రావి నిన్నుజూడగఁ బ్రాణముల్ నిలుపుకొందు.

సర్వమును నీవటంచు నీయుర్విమఱచి ప్రేమవార్థిని బడియున్న లేమ రాధ
ఆత్మతనువుల రెంటి నైక్యంబొనర్చి అర్పణము నీకుజేసె "కృష్ణార్పణ"మని
కాంత బ్రోవర ప్రేమసాగరుడ వరుడ.

# గంగాధరము

రాయసం వెంకటశివుడుగారు యమ్. ఎ. యల్ టి.

౧

ముప్పదియేండ్ల వయస్సుగల యొక పౌరుఁడు కొంతకాలముక్రిందట మాపట్టణము నుండి "పరారి" యయ్యెను! ఏకారణముచేత నెచటికిఁబోయెనో, ఎవరికిని దెలియదు. ప్రమాదవశమున వానిప్రాణముపోయియుండునేమోయని గోతులు కాలువలు వెదకించిరి. బంధువులకు స్నేహితులకు నుత్తరములు వ్రాసిరి. ఎవరును వానిజాడలు తెలియఁబఱుపలేకపోయిరి.

పయనపుజాడ లింటనేమియుఁ గానరావు. కొలఁదిపాటి యుద్యోగమునను(ం)డిన యతనికి భార్య ఇద్దఱుపిల్లలు సోదరియు గలరు. సతీపతుల కన్యోన్య వైరము లుండి నట్టుతోఁపదు. తనపిల్లలందు సామాన్య జనకులవలెనే అనురాగము గలిగియుండెడివాఁడు. ఉద్యోగపుఁబనులు క్రమముగ నెఱవేర్చుచుండెడివాఁడు. అతని యభిరుచులందును విశేషములు గానిపింపవు. మతాభినివేశము గలవాఁడు. పుస్తకములబల్లమీద భగవద్గీత, స్వామిరామచంద్రుని సందేహావళియునుండెను. గార్హస్థ్యధర్మములను హఠాత్తుగ త్యజింపుమని బోధించు గ్రంథములాయివి?

చిన్ననాఁడు మేమిరువురమును ఒక పాఠశాలలోనే విద్యగఱచితిమి. మనసుగలసిన మిత్రులముగాకున్నను, పరిచయము గలిగి యొకరి సేమమొకరము తెలిసికొనుచుండువారము. గంగాధరము గృహము విడనాడిపోయెనని తెలిసి విషాదమునొంది, ఉదంతములు సవిస్తరముగఁ దెలిసికొనుటకు వారియింటికి బోయితిని. ఇదివఱకు దెలిసినదానికంటె నింటివారైన నెక్కుడుగఁ జెప్పలేకుండిరి. అతఁడిటీవల తీయించుకొనిన ఛాయాపటము గదిలోఁ జూచితిని. శాంతమందహాసములు వెదచల్లెడి యావదనమున నింతత్వరలో నతనిని స్థానభ్రష్టునిజేయు హృదయకల్లోలముల సూచనలేవియుఁ గన్పట్టుటలేదు! మిత్రుని యకాలవైరాగ్యమునకుఁ దగినకారణములు తోఁపక, మఱింత చీకాకుపడిన మనసుతో మరలివచ్చితిని.

గంగాధరమును గుఱించి గ్రామమున ననేకరీతుల జనులు చెప్పుకొనిరి. కొన్ని దినములవరకును బజారులను పఠనమందిరములను వానిపయనమును గుఱించిన ప్రస్తావనలు వినవచ్చుచుండెను. అతఁడు అద్వైతపక్షపాతియని కొందఱును, దివ్యజ్ఞానసమాజాభిమానియని కొందఱును దలంచిరి. కాఁపురమునకువచ్చి యింతకాలమైనను, భార్య బంగారమ్మకు కాసుబంగారమైన నొంటిమీఁదవా గాఁబడకుండుటకు ప్రబల గృహకలహమ

కారణమని యమ్మలక్క లనుమానపడిరి. "ఇదిగో పులియనిన నదిగో తోక!" యని యచ్చెరువందు సుదతులు, ఈమిథ్యాగృహకలహ వృక్షమునకుం బలువలు చిలువలు గల్పించి వినోదించిరి! కాపురమిట్లు కచ్చి కలుగుటకుం గారణము భర్త భార్యను గాసి పెట్టెనని కొందఱును, సతియే పతిని మూల నాడెనని మఱికొందఱును చెప్పుకొని మనస్సంతుష్టి నందిరి!

ఆదారిని పోవునప్పుడెల్ల పూర్వపు పరిచయము ననుసరించి నే నాయింటివారి సేమము కనుగొనుచుందును. హాయిగ భార్యాపుత్రులతోఁ గాపురము చేయు నామిత్రుఁడే కారణమున పరదేశములపాలయ్యెనా యని నేవెతనొందుచుందును. అతఁడు తన సేమము మెఱిఁగింపకున్నను, కొంతకాలమునకైన మెత్తపడి, పిలల సేమమైన వినఁగోరఁడా?

౨

ఈమధ్య నేను ఉత్తర హిందూస్థానమేగి, యచటి పుణ్యక్షేత్రములు దర్శించితిని. ప్రయాగములో జరిగిన మొన్నటి మాఘమేళమును కన్నుల కఱవుదీఱ వీక్షించితిని. త్రివేణీసంగమ ప్రాంతమందలి పులిన ప్రదేశమంతయు యాత్రికులగు సన్న్యాసులతో నిండిపోయెను. సాధువులు సన్న్యాసులు హిమాలయమునుండి తండోపతండములుగ వచ్చి యచట విడిసియుండిరి. వీరిలో పెక్కుతరగతులవారు నాకు గోచరించిరి. దిగంబరులు కౌపీనధారులు, వృద్ధులు యువకులు, స్త్రీలు పురుషులు నందు గానిపించిరి. యాత్రికుల దానములమీఁదఁ గన్నువేసి, పండ్లు ఫలములకును కాసుపైసలకును వారిని పీడించు మాయసన్న్యాసులు మొదలు వేకువనుండి యపరాహ్ణము వఱకును యోగనిష్ఠలుండు తాపసశ్రేష్ఠుల వఱకును, నాకచట ప్రత్యక్షమైన లక్షలకొలఁది భక్తులనందఱి నాకర్షించిన యాపుణ్యక్షేత్ర మహాత్మ్యమును బ్రస్తుతించితిని.

ఒకనాఁడు స్నానాంతరము; కాళిందీ నీరములనూఁతగాఁగొని వేగగామియైన సురగంగాజల ప్రవాహమును వీక్షించి, సంతుష్టాంతరంగుఁడనై యొక నింటి దెసకు నేమరలుచుండగా భస్మధారణుఁడై, పెద్దపూసల పేరులు మెడలో వైచుకొని, జపముసలుపు నొక సన్న్యాసి కానఁబడెను. వాని ముఖమున మందహాసముగాన వచ్చి, సమీపించి శోధించిచూచితిని. అతఁడు నావైపునకు నగుమొగమున జూచెను. పరిచితునివలె నతని మోమున్నను, గుబురుగడ్డము మీసము సన్న్యాసివేషమును వానిని సులువుగ గుఱుతుపట్టుటకు వీలులేకుండఁ జేసెను. "దేఖోమహారాజ్!" అను హిందూస్తానీ మాటలతని పెదవులనుండి వెడలి తన సంగతి మఱుఁగుపఱచుటకతఁడు వేఱుభాషలో పలుకుచున్నను, అతఁడు తెలుగువాఁడని వానికంఠస్వరము తేట పఱిచెను. సందియమున జెరలాడు నామానస వీథినంత తీగమెఱుపువలె "గంగాధరము"ను నూహతట్టెను!

౩

ఇతఁడు నిజముగ నామిత్రుఁడు గంగాధరమే! పేరుపెట్టి పిలువగ నతఁడు పలికి, సద్దుచేయక రమ్మని సైగచేసెను. ఇంతకాలమునకు నేస్తగానిని మరలఁజూచిన నాకనులు

ఆనందబాష్పములతో నిండి పోయెను అపుడు రెండుజాములైనను, మిత్రదర్శనము వలన నాకా కలిదప్పికలు తోపలేదు. ఎపుడు వాని సమాచార మామూలాగ్రమున విందునాయని యుఱ్ఱూతలూగుచుంటిని. బంధువులకు తంతివార్త నంపి, వారల కీటులాతని నొప్పగింతునాయని యోజించితిని. కాని, నాపదిమాటల కతని యొక పలుకైనను వినఁబడకుండెను. భావోద్రేక చిహ్నము లేవియు నతని ముఖకమలమున గానరావు. ఈపుష్కలడిటీవల యోగాభ్యాసము వలన చిత్తవృత్తి నిరోధ మలవఱచుకొనిన సాధుపుంగవుడని నేనూహించి, ఏకవచన ప్రయోగ మనుచితమని గ్రహించి, స్వామీ మీసమాచారము కొంతచెప్పి, నన్నుతృప్తి పఱుపవలయును! అని వేడితిని.

గంగాధరము నన్నిప్రశ్నలో యడుగ నెంచితిని. ఐన నాలోచించిన కొలఁదిని అసహాయులగు నాలు శిశువులను దిగనాడి, తానొకడును తరింప నుద్దేశమున తాపస వృత్తికి దిగిన యాతని జూచినాకమితాగ్రహము జనించెను. అగ్నిసాక్షిగాఁ బెండ్లియాడిన యంగనను విడనాడుటయు, కన్నపిల్లలను గాసిపెట్టుటయు, ఈతఁడు నియమములుగఁజేసికొనెగదాయని మనమున వానినీసడించితిని. "ఏలయెపుడైన నతని హృదయమున పరితాపానలము రగుల్కొనెనిదే? తనవారలమీఁద దయపుట్టదే!" యని మిగుల విచారమందితిని. తనవారల సేమమారయక, ముక్తిమార్గావలంబులై మఠక్కులు బిగియించి కూర్చొను నిట్టి వేషధారుల గురించి నాహృదయము కళవళపడెను. గృహస్థధర్మములు నెరవేర్చుటయందే కృతార్థతఁగనఁజాలు నాకోటివానిని జూచియైన సిగ్గుతెచ్చుకొని మనుమని యాముని ముచ్చున నుపదేశింపఁగోరితిని!

౮

అంతట తావళములు సరిచేసికొని, శ్వాసము మెల్లగ విడుచుచు అతఁడిట్లు పలికెను— "స్నేహితుఁడా! నీయూహలు కనిపెట్టితిని. అలజడిని అణఁచుకొని, శాంతము వహింపుము. పరుగిడిపాలు ద్రావుటకంటె, నిలిచి నీరుత్రావుట మేలనుకొను వారికి గృహస్థాశ్రమము శ్రేష్ఠమె. పెద్దపాప ప్రమాదములలోఁబడక, మెల్లఁగఁ దమదారిని తాము పోవువారికది తిన్ననిత్రోవయె. ఐనను, ఎగిరిపోవనెంచువారలకు పాదములే ప్రతిబంధములుకదా! కొండలు కబళించు నాఁకలికి గచ్చకాయలు గొంతుకఁబడునా! గార్హస్థ్యమును పరికించి చూచితిని. మునిఁగిన గుంటనే మునుఁగుచు, తెంపులేని యాత్రోవను బడిపోవుటకు నాకిచ్చలేదు! ఉన్నత హిమాద్రుల వాయువునోవు ఘ్రాణమునకు, బురదనేలల మురుఁగుగాలి సరిపడునా? నాముందుని త్రోవనేను జూచుకొనుట కర్తవ్యమనియె నేనిల్లు వదలివేసితిని."

ఇట్లు వెడలినపిమ్మట నేమిజరిగెనో చెప్పుమనఁగా, నాకు స్వామియిట్లు వినుపించెను— "ఉత్కృష్టజీవితాపేక్షచే సంసారత్యాగముచేసిన సాధకులకు వారణాసియె ప్రథమమున పరమావధియైదోఁచెను. గంగానదీ పవిత్రతోయములఁదోఁగి మణికర్ణికాది ఘట్టముల జపములసలిపి, అనల్పజ్ఞానసంపన్నుల శుశ్రూషచేసి, జీవితసాఫల్యమునుగాంచ

నెంచితిని. కాని కాశీలోనే స్వీకరించిన వేదాంత శాస్త్రజ్ఞానము, కళాశాలయందు ముక్కున బట్టించుకొని పరీక్షాభవమున విద్యార్థులిపి వైచివచ్చు పురాణవిద్యవలెనే దోcచెను! దీనికై నే నాలుబిడ్డల విడిచి యింత దూరము రావలయునా? ఆత్మసంతృప్తి నొసంగcజాలని చదువు సాముల సార్థక్యమేమి?

"కేదారఘట్టమున నొక సాయంకాలము నీరెండలోc గూర్చుండి, అస్తమయ భానుని కిరణజాలము వలెనే యస్తమించెడి నాజీవితాశయములను దలపోసి పరితపించితిని. భావోద్రేకమువలన నామేనపుడు పులకాంకితమయ్యెను. అంత గంగానదిలో నుండి కమండలువున నీరుముంచుకొని సోపానము నెక్కి యొకసాధువు, 'గంగాధరా! కాదా భాయీ?' యని పలికి, శ్రమదీర్చుకొనుటకై నాచెంతcజతికిలcబడెను. నాపేరుచ్చరించిన యాసన్న్యాసినిజూచి యాశ్చర్యపడితిని. అంతమాయిరువురి సంభాషణమును, సంధ్యారుణ కిరణములc దళుకొత్తు నదీజల సౌందర్యసమాలోకనమున నారంభమై, ఈశ్వరానుగ్రహ కటాక్ష వీక్షణముల వెలుగొందు కమనీయమానస విలాసవిమర్శనము వఱకును వ్యాపించెను! భావోద్రేకమునందిన నేనంత నన్నుచరితార్థునిc జేయ గలదీ దైవనీలోకమున గలదాయని యంగలార్చితిని. భాయీ! నీవిట్లు దైన్యమంద నేల? నీకొఱకేగదా నేను హిమాచలపర్వతపంక్తులనెల్ల దిగబ్రాకుకొనుచు వచ్చితిని! లేలెమ్ము నీకంతయు నెఱిగించెదను! అని యూఱడించెను.

౫

"అంత నాకు హితబోధచేయునిచ్చటకు వచ్చిన యాసాధువు వెనువెంటనే హరిద్వార ప్రయాణముగట్టితిని. సుందర హిమాచలప్రాంతప్రదేశమున వెండియద్దము వలె మెరయు హరిద్వారము చూడగనే నాప్రాణములు లేచివచ్చెను. అచటి కుత్తరమునను న్న పుణ్యక్షేత్రములకు నన్నాయన కొనిపోయి యందలి గుహాలలో తాపసవృత్తినున్న సాధుపుంగవులను జూపించెను. అందలి రమ్యతరనదీ పర్వతములు, జంతుసంతానములు నాకనుల పండువుజేసెను. తాపసోత్తముల జపతపములు నాహృదయమును తన్మయింపజేసెను. నాగురూత్తములగు నిశ్చలదాసు నాప్రశ్నములకెల్ల నోపికతో సమాధానములిచ్చి భాయీ! నీహృదయావేగమును శాంతింప శాస్త్రచర్చలు సమర్థములు గావు. అనుభవైకవేద్యముగాని విద్యలు చిలుకపలుకులె! తాపము లన్నిటిని ఉపశమింపగలిగినది తపస్సొకటియె! తపస్వి యన్నిప్రశ్నములకు నుత్తరమిచ్చును, నీయాకలి దప్పులుమాన్పును, ఈశ్వరసాక్షాత్కారము నొసంగును! సన్న్యాసులము మేము శుష్కవాదములతోను, శాస్త్రచర్చలతోను పండితులవలె ఆత్మను ఎండింపజూడము! మాకు తపమెమార్గము, తపమెదానము, తపమెదైవము! నిశ్చలదాసు గురూజీవాక్కులు వేదవాక్కులని నాయనుభవమువలన గుర్తుపెట్టితిని." ఈమాటలనుచుండగనే నాపూర్వపుస్నేహితునికన్నీరు సెలయేటివలె స్రవించెను. నాలుక తడబడి యతడింక బలుకనేరకుండెను!

గృహస్థాశ్రమమున మనుచునె, రాజ

యోగమున వర్తిలి, ధ్యాననిష్ఠతో జరుపుకొనగూడదాయని నేనడుగగా, ఆయన యిట్లుపలికెను. "గృహస్థాశ్రమము బాధ్యతానిర్బంధములకు బుట్టినిల్లు స్వేచ్ఛయు స్వాతంత్రితయు సాధువువిద్యకు ఓనమాలు. మాసాధువులకెట్టి విఘ్నములులేవు. ఏప్రమాణ ప్రతిబంధములును అడ్డంకులుగానేరవు. అన్ని సందియములు సంకటములును తపోగ్నిచే దగ్ధమైపోవును. చెడుగుల బారద్రోలి శ్రేయము నొడగూర్చుటకు తపస్సె మాకేకైక సాధనము ఆత్మానుభవమెమాకు పరమప్రమాణము. సాధువు సర్వస్వతంత్రుడు శాఖాభేదములు, భిన్నాభిప్రాయములును మామనస్సులను గలంచుచుండవు ఎవనిస్థానమునవాడు యథేచ్ఛముగనుండుచు ధ్యాననిష్ఠ జరుపుకొనును. ఎవనికృషికెంతగనట్లుగ వానికీశ్వర సాక్షాత్కారము ప్రసాదితమగుచుండును!"

ఇపుడు ప్రొద్దువ్రాలుచుండెను. నేనిక నిలుచేరవలయును. ఎన్నివిషయములో నే నింకను దెలిసికొనఁగోరితిని. "మీరు తపస్సుచేసికొనుటకు సదుపాయములు నిర్జన ప్రదేశము లంతేవిగలవు. మీకాహార పానీయములెట్లు?" అని నేప్రశ్నించితిని. దీనికి సాధువిట్లుత్తరమిచ్చెను. హరిద్వారమునకుత్తరమున హిమాలయపర్వత పంక్తినసేక వన కందరములు గలవు. అవితరతరముల నుండి ఋషిపుత్రుల తాపసాశ్రమములు. నిర్జన ప్రదేశములయ్యును, అందు సాధులకు వలయుసౌకర్యములు గలవు. చెలువలు నెలయేఱ్ఱును సర్వదాజల సమృద్ధములుగా నుండును. పర్వతప్రాంతములందు కందజాతమనేకములు చిక్కును. సాధువెపుడును మితాహారి. తనకు వలసిన పండ్లు దుంపలు సతము తెచ్చుకొనును. ధర్మాత్ములగు యాత్రికులిచ్చిన గోధుమపిండి రొట్టె గాల్చితిని కొందఱు జీవింతురు. ఫలాహారమె పలువుర కాదరువు. కొందఱకీ ఫలహారము కూడననవసరము. ఇట్టివారు కొలఁదిమంది మాత్రమె"

ఈవిధమున నామిత్రుఁడు హిమాచలమందలి తాపసాశ్రమ వర్ణనము చేయుచుండగనె ప్రొద్దుగ్రుంకు చుండెను. దూరమున నల్లత పెద్దగుంపొకటి వచ్చుచుండెను. అదిమూచి నాస్నేహితుఁడు "అదుగో, మా సాధువులు హిమాచలమునకు బయలుదేరుచున్నారు. నేను వారిని గలసికొనవలయును. ఆముందు నడచివచ్చువారె నిశ్చలదాసుగురూజీ!" అని పలికి, తొందరగ తన వస్తువులు మూటగట్టుకొనెను. స్థూలకాయుఁడగు నొకసన్యాసి మెరయుచుండు మోమున చిఱునగవు వెలయచుండఁగా "మాధవరావుగారు కుశలమా!" అని నన్నుబలుకరించెను. "ఎవరతడు? నాపేరితనికెట్లు తెలిసెను?" అనినేనాశ్చర్యపడుచుండగనే, గంగాధరము సాధువుల బారులోఁజేరెను. అందఱును సాగిపోయిరి. "మాధవరావునకు" జై!" "రేపువచ్చు కుంభమేళమునకు హరిద్వారము రావలయునుజుమీ!"అనుసందేశపు బలుకులు ఆబిడారమునుండి వచ్చి నావీనులకుసోకెను. కంఠధ్వనినిబట్టి యిట్లుపలికిన వారు గురుశిష్యులని నేగుఱుతుపట్టితిని. ఇది యంతయు సన్యాసుల మాయయా, మాహాత్మ్యమా యని యచ్చెరువందుచు, కనుచీకటినిఁ యింటికిబోవుచు రానున్న హరిద్వారప్రయాణమును గుఱించియాలోచనలు సల్పితిని!

# అతిబాల్యవివాహము

తెలిదేవర నాగేశ్వరరావు గారు

బిడ్డపుట్టక పూర్వమె పెండ్లిమాట ।
పలుకఁగా వలదువలదో ప్రాజ్ఞులార ।
శిశువు పుట్టిన వెంటనే జేయరాదు ।
పెండ్లి జేయరాదిది మీకు ప్రీతిగాదు ।
పాలువిడక పూర్వమె పరిణయముల ।
మాటపలుకరాదో యాంధ్రమనుజులార ।
పచ్చికాయలఁ దెమ్మని చిచ్చుపెట్టు ।
చిఱుతవయసున బెండ్లిండ్లు జేయరాదు
చిన్నచిఱుతిండ్లకై యేడ్చు చిన్నవయసు ।
నందు బెండ్లిసేయుంగరాదాంధ్రులార ।
చిన్నపిల్లలతో నాడ జేయుప్రాయ ।
మునుపు బెండ్లిండ్లు సేయరాదాంధ్రులార ।
చదువునపు బొమ్మతో నాడ జనెడువయసు ।
నందు జోడు కూర్పవలదో యాంధ్రులార ।
గుడ్డగిట్టంగ లేనట్టి బిడ్డలకును ।
బెండ్లిసేయుంగ మీకును ప్రీతిగాదు ।
పెండ్లియనగనేమొ యెఱుగని పిన్నబిడ్డ ।
కాతురత బెండ్లి సేయరాదాంధ్రులార ।
వేడుకకొఱకు బెండ్లిండ్లు పెద్దవారు ।
చేయరాదు ముమ్మాటికి చేయరాదు ।
జవ్వనులను కళ్యాణముల్ జరిపిరేని ।
దంపతులనురాగంబున దగిలియుంద్రు ।
కానవోధీరులార ! సుజ్ఞానులార !
పుణ్యజనులార । ఓయాంధ్ర పురుషులార ।
ఆంధ్రదేశీయులార ! ఆర్యవరులార ।
దేశసేవకులార ! ఓధీరులార ।

బిడ్డలకు పిన్నవయసున బెండ్లిజేయ ।
మానుఁడీ వేగమో యాంధ్రమనుజులార ॥
నోటనెన్నడైన సరిగ మాటరాని ।
పిల్లవాండ్రకేటికి నకు పెండ్లి వేడ్క ।
అల్లరిని జేయుచుండెడి పిల్లవాండ్ర !
కాతురత. బెండ్లిసేయరాదాంధ్రులార ।
ఆడుకొనెడి వయసునందు జోడుగూర్చ ।
చదువవేసినపుడె బెండ్లిజరుపరాదు ।
వీరులార ! పెండ్లిజరుగ విద్యసున్న
అనెడు నార్యోక్తిఁ దలచుఁడీ మనమునందు ।
శ్రీమహాజనులార ! ఓ శ్రేష్ఠులార ।
కానజనులార ! దేశాభిమానులార ।
బిడ్డలకు పిన్నవయసున బెండ్లిచేయ ।
మానుడీ వేగమో యాంధ్రమనుజులార
కానులిచ్చెద రంచును గౌతుహలమొ
గాని కన్నబిడ్డలమేలు కాంచబోరు
తగినసంబంధమని మది దలచుచుంద్రు
భావిసౌఖ్యమును గుఱించి పలుకబోరు
పెండ్లి "పెండ్లి" యంటయేచాల ప్రీతిగాని
ఈడుజోడుల నెంచియు జూడబోరు
విందులారగింపనుజాల వేడ్కగాని
చిఱుతపెండ్లి కూడదనుచు జింతగొనరు
అమ్మలక్కలుకూడి బాల్యమున బెండ్లి
జేయ మంచి ముచ్చటయని జెప్పుచుంద్రు
ధనమునకు బావలకు వేరు దారిలేక
కూనబెండ్లిండ్లకును పురిగొల్పుచుంద్రు

పెద్దలునుగూడ పెండ్లిండ్ల వేడ్కకొఱకు
పగులు కూనపెండ్లిండ్లని దలచుచుండ్రి
తాతలవ్వలు జావను భీతిజెంది
పెండ్లివేడుక జూడంగ బ్రీతినుండ్రి
బంధుమిత్రులు సుహృత్తు బరులుగూడ
షేరగావింపులను గోరువారుగూడ
బాల్యదాంపత్యసుఖముగూర్చి బల్కుచుండ్రి
యికనెటు చిఱుత పెండ్లిండ్ల యిచ్చలడగ
చిఱుత ప్రాయమునందునే జేయుపెండ్లి
వలన చేకూరునష్టముల్ బల్కవశమె
చిన్న ప్రాయమునందున బిడ్డగనుట
వలన వచ్చెడు దుర్బలత్వమునుగూడ
బలము పోయిన వారింటి పనులు జేయ
వయసులో ముసలితనము వచ్చుచుండు
బాల్యమందునె సమకూరు పాలుగలుప
బిడ్డలనువారు సరిగాను బెంచలేరు
పిల్లలే తల్లులగుటచే పిదపవారు
రోగపీడితులగుచు కురూపులగుచు
సారసంసార సౌఖ్యవిదూరులగుచు
పాడు మృత్యుదేవతకోట బడుచునుండ్రి
చిఱుతప్రాయపు పెండ్లిండ్లు జేయుగూడ
దన్నముసలన్న కోపించు ననుచుబల్కు
చిట్టిబిడ్డకు పెండిలి జేయుగూడ
దన్న బెండ్లాము విడదయ్యెయనుచుబల్కు
చంటిపాపకు పెండిలి జరుపగూడ
దన్న బంధువుల్ కోపింతురంచుబల్కు
ముద్దుబిడ్డకు పెండిలి ముచ్చటేల
మానుడీ వేగ మోహాంధమనుజులార
చదువుకొను వారలేయిట్లు సంశయించి
మూఢులకు వెరచి తమదుముఖ్యమైన
విధిని నెరవేర్చలేకున్న విద్యయొక్క
గౌరవంబెద్ది జనులలో గణ్యులార
మంచిపనుల మేళము మంచగోరు

పురుషుడతి సంతసంబున బ్రోత్సహించు
ఐదురోజుల విందుల హాయివండి
గొప్పపేరు సంపాదింప గోరునొకడు
బాప సంభావనము లీయ పాటుపడుచు
హెచ్చరించుచునుండెడి హితుడొకండు
ధనము లేకున్నచో గొంతఋణము జేసి
చేయుమని జెప్పుతనవారు స్నేహితులును
గాని పాపలకుం బెండ్లిమానుడంచు
పలుకువారొక్కరైనను గలరెయరయ
పెండ్లిపెద్దలమంచును బేసవడసి
కట్నముల్ గైకొని మఱియు గదలువారు
బంధువులు మేమయంచును విందుజేసి
గొత్తబట్ట లన్నియునందు కొనెడివారు
చుట్టపక్కాలమంచును సూరిజనుల
బహుమతులు సంతసంబున బడయువారు
తమదు లాభములను గూర్చితలపెగాని
బాలికల సౌఖ్యమును గూర్చి పాటుబడరు
చిన్నబిడ్డల పెండిండ్లు చేయుచుండ్రి
కటకటా! యేమనవలెని కాలమహిమ
ఎవరు సుఖదుఃఖములయందు నెలమిగాను
అనుభవించుచు నుండురో యట్టివాని
సమ్మతము లేక పెండ్లిండ్లు సౌఖ్యకరమె
గాన నెమ్ముండొరులభిమతి గాంచనగును
ధర్మమెయ్యదో యూహించి ధన్యులార
చెడుగువిడనాడి సత్యముల్ స్వీకరించి
పనుల మేల్గోరి సాయము వడగవలయు
పుణ్యజనులార! యోయాంధ్రపుత్రులార
దేశపాత్రావసరములు తెలిసి విధుల
మార్పు జేయుటవసరంబు మాన్యులార
ఆడుకొను బిడ్డలకు మీరు జోడుగూర్ప
దైవమెటులొచ్చు మిమ్ములదలపరయ్య
మన దురాచారములజూచి మాన్పదలచి
అన్యమతముల వారును ననుదినంబు

యత్నములు జేయుచుండగా నాంధ్రజనులు
మిన్నకుండిన సంఘంబు వన్నెగనునె?
ఆత్మసంబంధమనియెడు నాసబట్టి
మేనరికమను మటియొక మిష నుబట్టి
గొప్పవియ్యాలవారన్న గోర్కెబట్టి
చిఱుతపెండిండ్లు మనసార జేయుచుంద్రు
ప్రాజ్ఞులే మిన్నకుండిన ప్రజలయొక్క
బహుదురాచారముల్ బాపువారలెవరు
కాన ధీరులై సంఘసంస్కర్తలార
పాటుపడరయ్య మెచ్చు దైవంబుమిమ్ము
సంఘసంస్కార మింకెటు సాగునకట
భోగపుం వృత్తివదలించి పోలతులకును
పరిణయంబులు గావించి పతినిజూప
వలయు దానదేశము బాగుపడునుగాదె
కాన నోశ్రీయులార! సుజ్ఞానులార
సంఘ సంస్కారులార ఓసదయులార
దైవసములార ఓతల్లిదండ్రులార
ఆంధ్రగీర్వాణ కవులార ఆర్యులార
వేద వేదాంత మతబోధకాదులార
బిడ్డలకు చిన్నవయస్సున పెండ్లిజేయ
మానుడీవేగ మోయాంధ్ర మనుజులార
మహావిశ్వాసములు నీటమునుగగాత
నాగరకులొచ్చు జనమెల్ల నడచుగాత
భరతఖండంబు సుఖలీల బరగుగాత
సకలశుభములు దేవుడొసంగుగాత

## "అమర కవి శేఖరుని స్వార్జితార్థమిదియె

దుగ్గిరాల పళ్ళంరాజు గారు

( సారస్వత మిత్రమండలి, )

తలఁపులజలధిలోఁ దరగలఁ దూగాడు నరుణ భాస్వరు దివ్య కిరణములన
తలఁపుల కడవలో ధగధగ మెఱసెడు పాలవెల్లువలిత ప్రభలనంగ
తలపుల మబ్బుమధ్యమునందుఁ దళుకొత్తు మెఱపు దీవియ మేలి మెఱపులనగ
తలపుల చదలలోఁ దమమెల్లభేదించు నెలమాని కంపువెన్నెల లనంగ
పలుకులు దయించి వికసించు, బ్రీతిభనించు, నమృత సంజీవనమ్ములై యవసిమించు,
జగతినలరించు, బోధించు బరమనియతి, యమరకవి శేఖరుని స్వార్జితార్థమిదియె
సూక్ష్మము, దయార్ద్రమును నగుమోపులోన సదమలము కోమలమునగు హృదయ
మందు

బ్రకృతియందలి భావంబుబట్టినిల్పి తెలుపు గవిశేఖరుండు తాదృశ్యములను
కావ్యమమరము, కవియు దత్కావ్యకల్ప నాతిశయమున నమరత్వ మందుభువిని
ఏమిసారము కవిబోధ కేలిహాస మెంత యాదర్శనీయ సహేతుకంబు

# పాటకచేరి

గుడిపాటి వెంకటాచలంగారు బి. ఎ. బి. ఎల్.

ఒకరోజు మధ్యాన్నం అమలాపురం సత్రంలోంచి నలుగురు మనుషులు బయలుదేరారు. అందులో ముందరనడిచే ఆయన గురువులాగుకనపడుతున్నారు. బంగారంచుట్టిన రుద్రాక్షకాయ మెళ్ళోనూ, యెండాకాలమైనాభుజంమీద శాలువా, అధికారం సూచించేమొహంముడతలూ, ఆయనకి అధ్యక్షత నిస్తున్నాయి. యింకొకడు తాంబూరా ఫిడేలూ పట్టుకున్నాడు. వాడేశిష్యుడు. అయిదేళ్ళనించి సంగీతంనేర్చుకోగా, నేర్చుకోగా, పాటకచేరీలలో తాళం వెయ్యగా వెయ్యగా గురువుగారు స్రుతిపెట్టియిస్తే, తాంబూరా మీటడం వొచ్చిందియిప్పటికి. యీజన్మంలోగాని, యింక వొచ్చే అయిదారు జన్మాలకుగాని, వాడినిగాని వాడితో రక్తసంబంధమున్న యింకెవరికిగాని, సంగీతం రాదని, గురువుకీతెలుసు, శిష్యుడికీతెలుసు కాని రోజూ గురువు అతను సంగీతం నేర్పుతున్నట్టూ నేర్చుకుంటున్నట్టూ ఒకగంట నాటకమాడి సంతోషిస్తోవుంటారు. అదిగాక యీశిష్యుడు తెల్లారకట్ట నాలిగింటికే లేచి సాధనముచేస్తోవుంటే, చుట్టుపక్కలు కుక్కలు కుయ్యోమొర్రోఅని స్రుతికలిపి అరిచి అందరి నిద్రనిచెడకొట్టేవి. వూళ్ళో పెద్దమనుషులు కొందరుచేరి, అతనికి సిఫారసుచేసి, పొరుగూరులో కరణీకం యిప్పిస్తామన్నారుగాని, అతను సంగీతం వొదలిపెట్టడానికి వొప్పుకోలేదు. మూడోఅయన చంకలో మద్దెలుపెట్టుకున్నాడు. నాలుగో ఆయన వూరికే చేతులు జోడించుకుని వెంట నడుస్తున్నాడు. అతనికి మాత్రం ఒకకోటు దానికి మూడుజేబూలు యున్నాయి. ఆయనకీ సంగీతానికీ సంబంధము యేమిలేదు. అయినా వీళ్ళవెంబడి అప్పులవాడి మల్లేతిరుగుతో వుంటాడు. పాటకచేరీల్లో తల వొకటే వూయిస్తాడు. అప్పుడప్పుడు పరవశత్వం యెక్కువై చుట్టు పక్కలవాళ్ళమీద దొర్లడం, ఉన్నటుండి తెలియనివాళ్ళ వీపుమీద తటాలున చర్చడం, యెవరన్నా, సంగీతం వినకుండా మాట్లాడుకుంటోవుంటే, వాళ్ళకేసి బిగ్గిరిగా అరవడం, యీయన దుర్గుణాల్లో ముఖ్యమైనవి. ఒకసభలో, డిప్టీకలక్టరుగారి వీపుమీద చురుక్కున కొట్టి, "బలే. బలే" అనేప్పటికి, ఆయన అదిరిపడి "పోలీసులు, పోలీసులు" అని కేకలేశాడు. యీ పనిలేనిఆయన యెక్కడివాడో, యెందుకిట్లా వీళ్ళతో తిరుగుతాడో, యెవరికీ తెలియదు.

వీళ్ళ మెల్లిగా నడుచుకొంటో వెళ్ళి టవునుహాలు చేరుకున్నారు ఒకరూపాయీ రెండురూపాయలూ టిక్కెట్లుపెట్టి, వీళ్ళ పాటకచేరి ఆవాళ అయిదున్నరకి మొదలు.. అప్పుడు నాలుగున్నరయింది. యీనలుగురూ ప్లాటుఫారమెక్కి, స్రుతిచేసుకుంటు

న్నారు. అయిదున్నరయింది. వెనక బెంచి మీద ఒకరూ, ముందు కుర్చీల్లో యిద్దరూ కూచునివున్నారు. శిష్యుడు వెళ్లి బయట చూశాడు. ఒకరూ కనపడలేదు. ఆరున్నరదాకా, ఆఫిడేలూ, పెట్టెలా ముందు పెట్టుకు కూచున్నారు. యింకా ఆరుగురు వొచ్చారు, పావుగంటకొకరు వొప్పున యీ లోపల యిదివరకు వొచ్చినవాళ్ళల్లో వొకరు విసుగెత్తి తీసుకొంటూ వెళ్లిపోయినారు. గాసు లైట్లు నాలుగు వొచ్చాయి. పేరిశకుట్లో వొకరు "పాడుతోవుంటే విని చాలామంది వొస్తారు. ప్రారంభించండి" అన్నారు. మొదట భైరవి వర్ణం యెత్తుకుని, అయిదారు నిమిషాలు పాడగా, యిద్దరు ముందు కుర్చీల మీద వాళ్లు వెళ్లిపోయినారు. పావుగంటలో యిద్దరు గాఢనిద్రపోయినారు, ఒకరిమీదికి ఒకరు వొరిగి, యింకొకడు ఆవలిస్తున్నాడు. యింకొకమనిషి విసుక్కుంటూ గోరు కొరుక్కుంటూ కూచున్నాడు. యింకో నల్లకోటు వేసుకున్న పెద్దమనిషి తనభార్య పోయిన రాత్రి జ్ఞాపకం తెచ్చుకొని, తన వొంటరితనానికి తనే దిగులుపడుతో కళ్ళనీళ్లు పెట్టుకుంటున్నాడు. యింకా యిద్దరు ఒకరి మొహాలు ఒకరు చూసుకుని, నవ్వుతో బైటికి పరుగెత్తారు. గురువుగారు సంగీతం ఆపి, ఫిడేలు ముందు పెట్టారు. నలుగురిలో పనిలేని ఆయన లేచి.

"యీ వూళ్లో యెవరికీ సంగీతంమీద అభిమానం లేనట్టుంది. యిటువంటి అద్వితీయులైన విద్వాంసులు వొస్తే వినడానికి యే నలుగురో వొచ్చారు. యిట్లాంటి సంగీతం వినే అదృష్టం యీ జన్మంలో మళ్లీ తటస్థిస్తుందా. వచ్చినవాళ్ళుకూడా సంగీతం అర్థమయ్యే వాళ్ళలాగు లేరు. మీ ఖర్మం" అన్నాడు.

నల్లకోటాయన లేచి చాలా విచారంతో, యేడుస్తున్న కంఠంతో, కన్నీళ్లు తుడుచుకొంటూ "కచేరి అయిపోయిందా?" అని అడిగాడు. "అయితే మా టిక్కెట్ల డబ్బు యిచ్చెయ్యండి పోతామని" ఆనలించే ఆయన అన్నాడు.

"యిచ్చిన డబ్బు తిరిగి యిస్తారా?" అన్నాడు పనిలేని ఆయన.

"అయితే పాడండి" అన్నాడు పుష్యరాగాల అంటుకోళ్ళ కోమటి వ్యాపారి. నారద కూడా వొస్తారని, తన సంగీతాభిలాష, రసికత్వమూ చూస్తాగని, రెండు రూపాయలు పెట్టి టిక్కెట్టు కొనివచ్చాడు. లెఖ వేసి చూస్తే, అప్పటికి అణాన్నర సంగీతమున్నా కాలేదు. అతని తమ్ముడు పెళ్ళికి పదిహేను రూపాయలిచ్చి, నాలుగు గంటలసేపు పాడించాడు, ఒక దురదృష్టవంతుడి చేత.

పనిలేని ఆయన గురువుగారివంక భక్తితో చూశాడు.

"చెవిటివాళ్లకి, దున్నపోతుకి నా సంగీతం పాడతాగాని, యిక్కడ నా ముందు వీళ్లున్నంతసేపు ఫిడేలుమీద చెయ్యి వెయ్యను" అన్నాడు.

శిష్యుడు మాత్రం, ఆ పాలో తేడా తెలియక, తంబూరామీటుతూనే వున్నాడు. దాంతో వాళ్లకి కోపమొచ్చి, "మా డబ్బు మాకియ్యండి" అని నలుగురూ అరిచారు. నిద్రపోయిన వాళ్ళల్లో ఒకరు యీ అరుపులు విని లేచి, తలవూయించడం మొదలుపెట్టారు. పనిలేని ఆయన గురువుగారి అనుజ్ఞ తీసుకుని, యెవరిడబ్బు వాళ్ళకి యిచ్చేసి యింకపొండి.

అన్నాడు. వాళ్లు అనిద్రాపూర్వ్యా ఆయన్ని వూయించి వూయించి లేపుకుని తీసుకుపోతున్నారు. ఆయన "నాకు వాకిటే పీడకలలు వొచ్చాయి. యింటిదగ్గిరికి వెళ్ళడమంటే భయమేస్తోంది" అంటున్నాడు. తలతిప్పే ఆయన నడుస్తున్నా సగం నిద్దట్లో, "వెంకీ, యెందుకే అట్లా తిడతావు?" అంటున్నాడు.

* * *

టిక్కెట్లడబ్బు వాపసు చేస్తున్నారని తెలిసి సగంలో వెళ్లిపోయినవాళ్ళు కొంత సేపట్లో తిరిగివొచ్చారు. పాట జోరుగా వినపడుతోంది. హాలుతలుపులూ కిటికీలూ బార్లాతీసివున్నాయి. లోపల నాయుడుమూలగా నాలుగు గాసులైట్లూ తెల్లగా వెలుగుతున్నాయి. స్టేజిపైకంమీద గురువుగారు పాడుతూ, ఫిడేలు గిరగిర తాయిం చేస్తున్నాడు. శిష్యుడు కునికిపాట్లు పడుతున్నాడుగా, వేళ్లు తాంబూరతీగెలమీద కదులుతూ నేవున్నాయి. అయినా యెప్పుడు గురువుగారి వెనకాలే తాంబూరా తనమీద పడతాడో అని చూసేవాళ్ళకి భయంగా వుంది. మద్దెలాయన చేతులూ, కనపడకుండా బాదేస్తున్నాడు. కొంచెం వేగంతగ్గినప్పుడు మాత్రం, అట్టునుండి చేతి, మొహం చుట్టూ కనపడతాయి, నాటకంలో హిరణ్యకశిపుడిలాగు కనపడతాడు. పనిలేనిఆయన తల అతివేగంగా వూయించాడు. తలలేని మొండెంవలె చూసేవాళ్ళకి యెదురుకలుగుతోంది. వాళ్ళముందు కుర్చీల్లోనున్నా, బెంచీలమీద వొక్కరూ లేరు. ఒక పిచ్చిక మాత్రం దూలం తొర్రలోంచి తలపైకెత్తి బెదురుతో చూస్తోంది. ఒక గబ్బిలం గుండెలూ రెక్కలూ కొట్టుకుంటూ అశబ్దంనించీ, వెలుతురునించీ తప్పించుకోలేక తడుములాడుతోంది. యిూకొచ్చిన వాళ్ళు యేంచెయ్యడానికీ తోచకనుంచున్నారు. ఒకడు ధైర్యం చేసి దగ్గరికి, కాళ్ళుచరిచాడు, "మామండోయ్" అని అరిచాడు. వాడిగొంతుక శబ్దం వాడికేవినపడలేదు. దానితో వాడికి భయం పుట్టి, పక్కనున్నవాడి నడుము కావిలించుకున్నాడు. వెనకనున్న జట్కాలకుర్రవాడు ముందరికివొచ్చి, తలలేని ఆయన జబ్బపట్టుకుని వూయించాడు. రెండో చెయ్యి, కుర్రాడిచెయ్యిని లాగేసిందికాని, తలమాత్రం కనపడనేలేదు. తలఆపైన యెక్కడో వుండాలని వూహించి చేతులడ్డంపెట్టి పట్టుకున్నాడు. అప్పుడా పనిలేనిఆయన కళ్ళు తెరిచి, కలలోంచి మేలుకున్నవాడి మల్లే నిదానించి ఆయన నిమిషాలుచూసి,

"ఏమిటన్నాడు?" మెల్లిగా

"మా టిక్కెట్లడబ్బు" అన్నారు

ఒక్క సమయమైనా మాట్లాడ్డానికి జీవితంలో వ్యవధిలేనట్టు, తనరొంటినవున్న రూపాయలసంచి వాళ్ళమీద పారేసి, మళ్లీ కనపడకుండా తలతిప్పేస్తున్నాడు. యెవరిడబ్బు వాళ్ళు తీసుకుని, మిగిలిందికూడా సమానంగా పంచుకుని, ఒక రూపాయి మిగిలితే దాన్ని మాళ్ళీకు వొదిలి, వుత్త సంచీ అక్కడపారేసి వాళ్ళు వెళ్లిపోయినారు

ఫిడేలుకమాను మొగిలిపోతోంది మద్దెలమోగిపోతోంది తలుపగిలిపోతోంది గ్లాసులయిట్లు వెలిగిపోతున్నాయి సంగీతమాధుర్యంతోను హాలుచుట్టూవున్న ఇటికపుర్రలోయింకిపోతోంది. ప్రాణవిశ్రాంతిగానిద్రపోతోంది శిష్యుడు నిద్రపోతున్నా వేళ్లుకదులుతూనేవున్నాయి కబ్బుడమానుతోలుపు ముయ్యటానికివొచ్చి యేమితోచక, నుంచునినుంచుని, అట్లా గేతలుపుపక్కన నిద్రపోయినాడు

*　　　*　　　*

తెల్లారకట్ట మూడున్నరకి ధన్యాసి రాగం మొదలుపెట్టారు. కోళ్లూ కాకులూ భయపడుతో కూశాయి. చల్లగాలి చెమట పట్టినవారి వొళ్లకితగిలింది. వెలుతురు సందేహిస్తో లోపలికి గ్యాసులైట్లమీదికి పాకింది. తలుపుముందు ఒక గొల్లపిల్లవాడు వొచ్చి నుంచుని తదేకధ్యానంగావింటున్నాడు. ఒక నల్లమచ్చలఆవూ దూడా అతనివెనక నుంచున్నాయి. చెవులు నిక్కపొడుచుకొని వింటో "నిన్నుచూచి ధన్యుడైతి" అనేకీర్తన యెత్తుకుని గురువుగారు ప్లాటుఫారంమీదనుంచి లేచారు. తక్కిన యిద్దరు వెనక లేచారు. శిష్యుడికి మెళుకువరాలేదు. పాటతో వెళ్లి ఆవుకీ, పిల్లవాడికీ, ప్రదక్షిణంచేస్తో తిరిగారు. నిద్రపొయ్యే లైట్ల మనిషి యీగోలకి లేచి ఆశ్చర్యంతో క్లబ్బు జవానువంక బెదిరి బెదిరి చూస్తున్నాడు. యెదన్నా ఆపద తటస్థిస్తే దాక్కునేందుకు మంచిచోటేదా అని చూస్తున్నట్టున్నాడు. గాసులైట్లవాడు పనిలేనిఆయన్ని డబ్బడిగాడు. ఆయన తన స్వంతం యెనిమిది రూపాయలు యిచ్చేశాడు. క్లబ్బు బంట్రోతు అద్దె అడిగాడు. పనిలేని ఆయన జేబులుతడుముకుని తెల్లబోయినాడు. పాడుతోనే గురువుగారు కోపంతో మెళ్లో బంగారు రుద్రాక్ష తెంపచూశారు, కాని అదిరాలేదు. మద్దెలాయన ఆయన చెయ్యి ఆపి, తన వేలిబంగారువుంగరం తీసి క్లబ్బువాడి చేతులో పెట్టాడు. అందరూ పాడుతో వూళ్లోకి బయలుదేరారు. క్లబ్బు జవాను తెల్లబోయి వాళ్ళవంక చూస్తోనుంచున్నాడు.

పాటకచేరివాళ్ళు మార్కెట్టుదగ్గిరకి వెళ్ళి, మధ్యనుంచుని పాడడం ఆరంభించారు. పెద్దగుంపు పోగయింది. గురువుగారు,

"సంగీత జ్ఞానవిహీనులకు, మోక్షము కలదా?" అని యెత్తుకుని, ఆవేశంతో వూగిపోతున్నారు. పిచ్చివాడని అందరూ జాలితో తలలువూపించారు. యెండ యెక్కింది. అయిదేసి నిమిషాలు విని పాతవారు వెళుతోవుంటే కొత్తవారువొస్తున్నారు. పదకొండింటికి వినడానికి వొక్కరూ లేరు. దగ్గిరవున్న గంపలవాండ్రు కూడా చాలాదూరంగా జరిగిపోయినారు. పాడుతోనే సత్రం దోవపట్టారు. సత్రానికివెళ్లి పాటఆపి, దేహాలు గోడకి జారేశారు. అలిసిపోయినారు. నిద్రలేదు. నిన్నమధ్యాహ్నంచేసిన భోజనం, కడుపులు మాడుతున్నాయి. ఒకరిమొహాలు ఒకరు చూసుకున్నారు. అందరూ పనిలేనిఆయనమొహంకేసి చూశారు. ఆయన కన్నీరుతో తలవొంచుకున్నాడు. యింతవరకు ఆపూటకి వుడకేసుకోడానికి బియ్యం లేనిగతి పట్టలేదు, ఆవాళదాకా. అతనిదిగులుచూసి గురువుగారు చిరునవ్వునవ్వి, "స్నానంచేస్తే మనకియీ మత్తువొదులుతుంది" రండి అనిలేచారు.

దోవలో పనిలేనిఆయన

"మరియీవాళ భోజనం "అంటున్నాడు. గురువుగారు అతన్ని చూసినవ్వి

"నీదుచరణము లేగతియని"

అనిమెల్లిగా పాడారు

పనిలేనిఆయన

"అన్నవస్త్రములకేమిగతియని యెన్నడైన నిన్నడిగినానా?" అని గాద్గదస్వరంతో పాటలాగుఅన్నాడు

"పాలముంచినా, నీటముంచినా, పాదములేగతి" అని పాడారు గురువుగారు.

అతన్ని వీపుమీద తట్టి యిప్పుడు ముందునీట గేది నిజం ,, అన్నాడతను

“ తరవాత పాలమునిగేదీ నిజమేఅని గురువుగారు అంటూవుండగానే, వెనకయెవరో పిలుస్తున్నట్టు వినపడ్డది. ఆగారు ఒక భాగ్యవంతురాలు, వేశ్యముసలిది, ఆమెనొక దూరోజుకుంటూ వొచ్చాడు ఆమెగురువుగారి పాదాలకి అరోడ్డుమీదనే నమస్కారం చేసి,

“తమపాదధూళిచేత నాయిల్లు ఒక్కసారి పవిత్రం చెయ్యాలి” అనిప్రాధేయపడ్డది అందరూ తెల్లబోయి యిదేదో వేళాకోళమనుకుని సందేహంతో చూస్తున్నారు.

“ సంగతంతా తరవాత మనవిచేసుకుంటా పొద్దెక్కింది అలిసిపోయివున్నారు రండి” అంది.

భక్తితో పొంగే ఆమె కంఠంవిని, కళ్లుచూసేటప్పటికి వాళ్ళ మొహాలు విప్పారాయి

“ మధ్యాహ్నంనించి తప్పకుండా వాస్తాము మరియిప్పుడు స్నానంకాలేదు భోజనం అనేటప్పటికి డొక్కలోతుకు పీక్కుపోయిన శిష్యుడికి కళ్ళనీళ్ళు తిరిగాయి. గురువుగారు అప్పుడేమల్లె వెళ్లి ఆమెయింటిలోకిచేరి మొదలు పెడతారుగావునని అతని గుండెలు గబగబలాడాయి

“ స్నానానికి వేన్నీళ్లు సిద్ధంగావున్నాయి యీలోపున వంటలవుతాయి యింకమీరు మాటాడకండి రండి. మీకంటేదాసులు, అర్చకులు, యెక్కడంటే అక్కడే వుంటారు. పూజచేసి ధన్యతను పొందడానికి మీవంటి మహాత్ములు నాకెక్కడ దొరుకుతారండి”

నలుగురిలో యిద్దరు బ్రాహ్మలు, ఒకడునాయుడూ... సందేహించారు. ఆకలి మాత్రం పీకుతోంది. “ సందేహించకండి బ్రాహ్మలే చేస్తారు రండి ” అంది

శిష్యుడిమొహంలో నురుగులాగు పొంగబయలు దేరింది. దమడమాకొట్టడానికి మద్దెలయ్య, మద్దెల వెతుక్కున్నాడు. గురువుగారు.

“ సీనామహాపదములకు నిత్యాజయమంగళం” అనుకుంటూనడిచారు ఆమె వాళ్లనో పెద్దమేడలోకి తీసికెళ్లింది నలుగురికీ నలతుణాగా తలంట్లుపోయించి, పెద్దపెద్ద బనారసుబట్టలు కట్టుకోడానికి యిచ్చారు అందమైననావిట్లో, వెండిచెంబులు పెట్టి అరిటాకులు, పీటలముందువేసి సిద్ధంగావున్నాయి పిండివంటలతోకూడా, బహుమర్యాదగా, బ్రాహ్మలు వడ్డించారు భోజనాలయ్యేప్పటికి నాలుగు గంటలయింది వెంటనే అందరికీ నిద్రొచ్చాయి. మద్దెలయ్య పెరుగు అన్నం సగంతింటూ పీటమీద పడిపోయినాడు మేడమీద పువ్వులతోట్లమధ్య, చల్లగాలిలో మడతమంచాలమీద, తెల్లనిపక్కలు పరిచి, వాటిమీద వాళ్ళనిపడుకో మన్నారు. గురువుగారికి [illegible], మద్దెలయ్యకి పిసుకుతూ, నొక్కుతున్నారు. నామనసాయి సంగతి యెవరికితెలీదా అనుకున్నాడు పని లేని ఆయన. తాంబూలాలేసుకొంటూ కళ్లుమూశారు.

లేచేటప్పటికి రాత్రి తొమ్మిదయింది వెంటనే కాళ్ళు కడుక్కోడానికి నీళ్లిచ్చి భోజనాలకి లెమ్మన్నారు తివాసీమీద గాసులైట్ల ముందు తాంబూలాలు వేసుకుంటూకూర్చుని యీ అదృష్టమంతా నిజమా, కలాఅని ఆశ్చర్యపడుతూవుండగా, మళ్లీ ఆముసలామె కనపడ్డది. ఆమెవెంట ఆమె కూతుళ్ళని యిద్ద

అంగవిహీనులున్మ్రువుల నాఁటవెట్టఁగ నాయితాంగులే
యంగున భంగపుత్తురా ? శతాత్ములనే గతిఁబైకిఁబుత్తురో ?
సంగతి యీవెఱింగియును జాలముసల్పెదె తాళజాలనీ
రంగదపూర్వ ప్రేమమపురా యిప్రురందెన ? అద్దైనచ్చెలీ !

ఇందఱునైన నొక్కవడియే పడఁగింపమె యేకమైన ? నీ
దందడిబోనడంపమె వృథావృథసేయమె కాళయత్నముల్
పందెమువైచి కొన్నపరిపంథులెదో తమలోనఁ బోరిటుల్
కుందఁగ జేయనిన్ననను గోల్తునొనర్చెడివారు నెచ్చెలీ !

ఎలమిని జెల్మినట్ల నటియించుచు నుండెడివారు నమ్మదా
కులితుల జేయుచున్నటులె కూడిచరించెదు వారలక్కటా !
బలమఱినీ వియోగమునఁ బల్మఱుమూలుగు వేళఁ జూచి ని
చ్చలుఁ దపియించువారలది సాజమెకాళలఁ జాల నెచ్చెలీ

ఒక్కఁడఁగానఁ జూపఁబడుఁ నుగ్రితగాక మఱొక్కఁడెట్టుకా ?
నొక్కఁడెనున్న యప్పువినయోన్నతిఁ జన్నవిధం బెఱుంగమే ?
అక్కట నిన్నదేగతి నలంచెదనో కట ! క్రించులంచు నేఁ
బొక్కెద నిక్కమైన నది పోలునె జాలమునీకు నెచ్చెలీ !

ఆటలఁ బాటలందు, మఱియన్నమునందును, బాసమందు, నీ
రాటనమందు, సాంధ్య సువిహారమునందు పహారమందు, మే
ల్తోఁటలకూట ముందున, నెటుల్పరికించిన నీదులీలలే
నాటిమదిం గలంచెడు గనంబెఱఁగూడదరు వేది? నెచ్చెలీ !

ఇసుకబయళ్ళ నిర్భరము నిచ్చెమెయిన్ విహరించునాటి యా
యసము కవిత్వతత్త్వవిశద ప్రతిభాయుత భాషణంబులా
కుసుమ సమానచారుపద గుంఫితసత్కవితా ప్రసంగముల్
రసిక జనానుమోదసుకరంబుల నెన్నటికేని యెట్టులే
నిసి మఱవందలంచినను నేమఱనాతరమౌన ? నెచ్చెలీ !

కంటికినిద్రరాదు తమకంబున బత్రికఁదీయఁబూనవే
యింటికి నొక్కయక్కరము నీక్షణసేయఁగ బ్రాంతి లేదు, చే
నంటిన యాశులేఖినియు నాడదెడందకు శాంతిగూడదా
కంటికెగాక యన్నిటికిగా కనెకారుల జెందుచుంటినీ
కంటికిదూరమైన గడెకాలమునుండియు సోలినెచ్చెలీ !

ఏటికి నిఁతగాథవచియించెదఁ గొంచకయున్నదేదో, మో
మోటముదక్కి యిందనుకఁ బుచ్చితినెట్టెటో ఎల్లియైనని
పాటికినీవు పైనమయి వ్రాలిసుదర్శన మీయకున్న నా
రాటము సాక్షి మస్మృతి కరారు ! కరారు!! కరాదు !!! నెచ్చెలీ!




## తూలికోత్కర్షము

శ్రీయుతులు శంకరనారాయణకవులు
(వెనుకటిసంచికతరువాయి)

నూతనమగు నవకముతో నాతతవిద్యాధురీణు లాధునిక కవుల్
ఖ్యాతి వహింపగ జిలికెను నీ తేజోత్సేకము, నవనీతముఁ చెప్పుమా!
సరస పదార్థసంగతము సంశ్రిత సద్గుణ భావసౌరభో
త్కరదరహాస భాసురత తన్మయ సత్కృతి కల్పనాదురం
ధర మహిమా విశేషములు దామరతంపరలై వెలుంగన
క్షరమణులొల్కు నృత్యమును సల్పగనేర్చితె? లేఖినీమణీ!
తలమా విలువకునైనను కలమా నీనవ్యభావ కవితారససం
కలితాద్భుత వృత్తగతుల లలిత పదార్థగరిమా విలాసములెన్నన్?
పాపౌఘవనధిలో వరపావనోర్మికల్ బుట్టించి పొంగించు నట్టిశక్తి !
కష్టవారాశిలో ఘనసౌఖ్య డోలికల్ గల్పించి మురిపంబు గొల్పుశక్తి !
అతిదుఃఖవార్ధిలో నానందవీచికల్ గలయించి తేలింపగలుగుశక్తి
అజ్ఞాన జలధిలో విజ్ఞానవేణికల్ సృజియించి విధియింప జేయుశక్తి
నిత్యనూతన భావనా నిర్మలాబ్ధి నక్షరశ్రీల వెలయించి యడరుశక్తి
తొలకరింపగ నృత్యంబు సలుపుజాణ తూలికామణిగాను మా కేలు మొగ్గ

# ప్రేమఋణము

—— * ——

చిరుమాళ్ల శివరామ కృష్ణప్రసాద్ గారు

మనోహరి చక్కనిచుక్క. సుగుణనిధి. బీదల పాలిటి కల్పవృక్షము. సుదతీ లోకమున సౌందర్యము నందగ్రస్థానమాక్రమించిన యాప్రవాళాధర చుట్టునూ, వికసించిన పుష్పమునందిమిడియుండు మకరందమును గ్రోలమూగెడి భృంగంబుల పగిది నవయవ్వనులైన పురుషులు మూగకుందురా! అట్లు మూగినవారిలో మకరందు డొకడు. అతని హృదయమునందు, మనోహరియొక్క వింత, విన్యాసములకు దప్ప, వేరొండు సంగతుల కేమాత్రము తావులేదు. పగలైనను, రాత్రియైనను, యామె యాతని దృక్పథమున గోచరించుచుండును. మనోహరి వాలుచూపుల నెడి ప్రేమబీజములు, మకరందుని హృదయమున నాటికొని, చక్కగా పెరిగి పుష్పించినవి.

మనోహరి ముకుందచంద్రుని వివాహమాడినదని మకరందునకు తెలియక పోలేదు. కాని పూవిలుకాని బాణపరంపరలకు తాళజాలక మనోహరిని మరువలేకుండెను. మనోహరి మకరందుని ప్రేమించెనా? అది యర్థగ్రాహ్యము; "ఆమెసుగుణనిధి" యనువాక్యమే చదువరులకు నర్థము జెప్పగలదు.

౨

నాడుపూర్ణిమ. ఉబుసు పోకకై మనోహరి వనమున విహరించుచుండెను. ఆమె యొక శిలావేదికపై గూర్చుండి, తన కోకిలారవముతో కొన్ని గీతముల బాడుచు శ్రోతల మనంబుల కుత్సాహమునెలకొల్పుచుండెను. పాడుచు పాడుచు నాకీరవాణి, యులికిపడి లేచెను:- మకరందుని హస్తమామెపై బడెను: ఆపాదమస్తకము భయకంపముచే తొట్రుపడు మాటలతో, "మకరందా! యేల యీ యాగడము"ని; యాభీత హరిణేక్షణ ప్రశ్నించెను.

మకరందుడు- నేనొక్క యనుమానమును దీర్చుకొనవచ్చితిని.

మనో- ఏమది?

మక- యదార్థముగా నడుగమనెదవా?

మనో- అట్లులేగానిమ్ము

మక- నాహృదయము, నీయందులగ్నమయి నది. నన్ను నీవు ప్రేమించితివో, లేవో, యను ననుమానము, నన్ను వేధించుచున్నది.

మనో- నాహృదయమున నీకు చోటులేదే

మక- నాప్రయత్నము లన్నియు, నడవి గాసిన వెన్నెలలే!

మనో- నిశ్చయముగ

మక- అటులయిన, నీమోహనచూపుల బాణ పరంపరల నిక నేల బంపెదవు? ఆ వింతవిన్యాసముల కర్థమేమి?

మనో- అవన్నియు నెండమావులలోని జలమువంటివే?

మక- అయిన నొక్కమనవి

మనో- ఏమది?

మక- నేను నిన్ను బాగుగా ప్రేమించితిని; అట్టి ప్రేమ కేవలము నిరుపయోగ మని నేడు తెలిసినది. వత్సరముల కొలది పెరిగి, పెనవైచుకొనిన ప్రేమలత, నీవిపుడాడిన పలుకులనెడి గొడ్డళ్ళచే తెగకున్నది నేను, ఆ జీవితము, నిన్ను ప్రేమింతును. తుదకు నాప్రేమ సూచకముగా నీకయినను, నీవిభునికయినను; నేదయిన యాపద సంఘటిల్లి నప్రడ్డుపడి రక్షింతును; నాఋణమట్లు తీర్చుకొందును. సమయమునకు వేచియుండెద

మనో- నీవు కీర్తికన్యాకరగ్రహణమొనర్పుము, కీర్తి శాశ్వతముగాని, తనువుగాదు

మకరందుడు వెడలిపోయెను.

3

"ఆహా! భగవంతుడొక పెద్ద న్యాయాధికారి గదా! ఈ శైలాంబోధి జంతు సంయుత ధరాచక్రము నంతయు నాతడనిర్వచనీయమైన మేధాశక్తిచే నేలుచున్నాడు. అట్లు లేగాకున్న, ముకుందచంద్రుని కుట్ర లిప్పుడు బయటపడునా? యేసమయమున నెవరి నేవిధముగా శిక్షింపవలయునో, సర్వోపగతుడయిన యా న్యాయాధికారికి తెలియక పోలేదు. క్రూర భుజగమును, పూలదండయని భ్రమసి, కంఠమున ధరించిన భంగి; సమస్తదుర్గుణముల గాకరమై వెలయుచున్న ముకుందచంద్రుని, సుగుణాఢ్యుని గదా, రాజు జేరదీసినది. తనకు మంత్రిత్వము నొసగి పోషించుచున్న భూనాథునే, జంపనుంకించెనుగదా! ముకుంద చంద్రుడు. తాను మంత్రిగానుండి, బీదలను లేనిపోని సుంకముల నిమ్మని బాధించి, రచ్చలకెక్కించి, హింసించిన పాపమిప్పు డాతనికట్టి కుడుపదా! పాపము పండదా! ఆర్తరక్షణ పరాయణుడగునా, యాదినారాయణుడెన్ని దినము లోపిక పట్టగలడు! రాజుగారి విరోధియగు, కుముద సింహునితో స్నేహము జేసి రాజుగారిని జంపించి తానర్ధరాజ్యమును బొందవలెననెడి యాశాపిశాచము గదా యాతనిని కష్టముల పాల్జేసినది. శత్రుశేషముంచరాదను లోకోక్తినెరిగిన నృపాల చంద్రుడాతనికి రేపటిదినమే గాబోలు మరణదండన విధించినాడు. ముకుందచంద్రుడీ లోకమును వదలినవెంటనే ఆనంద దేవత యీపురి ప్రవేశించునని యనుకొనుచు ఆవేశ పూరితుడయిన నొక బ్రాహ్మణుడు వీసనరుగుమండెను

ఆ భావగర్భితములగు పలుకులువిని యొక యువకుడాతని సమీపించి "ఉరిదీయుటకింక నెంతగడవు గల"దని ప్రశ్నించెను.

బ్రా. రేపొక్క దినమే

యువ. ఇంకెవ్వరైన యురిదీయబడుదురా?

బ్రా. ఆకుట్రయందు బాల్గొనినవారందరు యమసదనమున కరుగవలసినవారే

ఈవార్తవిని యువకుని ముఖమెఱ్ఱబారెను. ఆతడాతురతతో చనెను

౪

రాజద్రోహపు నేరము క్రింద, ముకుందచంద్రుడు బంధీకృతుడు గాబడెను తెల్లవారిన పిదప మూడు గంటల కాతని యురిదీయవలసినదని రాజాజ్ఞాపించెను

ఆరాత్రి చనిన పిదప, ముకుంద చంద్రుడు మేల్కాంచి, తన తుది దివసమిదియే గాబోలునని, కంటతడి పెట్టుకొనెను. తన

ముద్దుల మనోహరిగతి యేమగునోయని చింతించెను. చేతులను వెనుకకు ముడిచి కొని యాతడాగదిలో యిటునిటు తిరుగజొ చ్చెను. ఇంతలో తొమ్మిదవగంట గడి యారముపై మ్రోగెను. పది దాటినది. పదునొకట్టియు నట్టులేగడచినది. పం డ్రెండవ గంటకింకను కొద్దికాలమున్నది. మదగజము లీలలాడిన కొలనువలె, యాతని మనో సరోవరమంతయు నల్లకల్లోలముగా నుండెను అపారమై, యవిదితమై, యొప్పు చున్న మృత్యుసాగరముపై తన జీవనావను వదలుటకింకను, కొద్దికాలమున్నదని యాత డనుకొనెను.

ఇట్టి సందిగ్ధసమయమున నెవరో నత గదిపైపునకు వెడలుచున్నట్లాతడు గనిపెట్టె ను. తాళము చప్పుడయ్యెను. ద్వారము తెరువపడెను. లోనికొకవ్యక్తి ప్రవేశించెను ఆవ్యక్తి మకరందుడేయని ముకుందచంద్రుడు తెలిసికొనెను ఆశ్చర్యానుమానములొక్క సారి ముప్పిరి గొన్న మానసంబుతో, "నీవే రీతియిచ్చటికి రాగలిగితి" వని ప్రశ్నించెను

మక- కారాగారాధి కారికి కొంతలంచ మిచ్చిరా, సాహసించితిని

ముకుంద- నన్ను రక్షించుటకేనా?

మక- అట్టి యుద్దేశ్యముతో నే నిచ్చటకు వచ్చుట నీకిష్టమేనా?

ముకు- నేను తప్పుజేసితిని, అనుభవించితీర వలయును గదా!

మక (గ్రహించి) నిన్ను నేరక్షింపరాలేదు, ఒక యత్యవసరమైన పనియుండి వచ్చితిని.

ముకు- ఏమది?

మక- నీకు సంఘటిల్లిన యాపదవిని, నీము ద్దులబొమ్మ, నీనోములపంట, నీపాలిటిరంభ, నీయర్ధాంగియగు, మనోహరి, క్రిందటికి దుర్భర దుఃఖము ననుభవించు చున్నది. ఆమె నాదుఃఖమునుండి రక్షింప వలయునని, నీచే లిఖింపబడిన నొక లేఖ గావలయును: గాన, నాల్గుయుపశమన వాక్యముల నీకాగి తముపై వ్రాసి యిమ్ము, నేదీసికొనిపోయె దను కాలము ధూమశకటము కన్న వడిగా పర్వెత్తుచున్నది. వ్రాయుటకు పరికరము లిగో.

ముకు- నామది సరిగాలేదు, నీవే నాల్గు మాటల జెప్పుము, నేనువ్రాయుదును

మక- చెప్పెదను వ్రాయుము

ముకుందచంద్రు డొక కుర్చీలో గూర్చుండెను వానిప్రక్కన, మకరందుడు తన జేబునందు చేయినిడికొని నిలుచబడి యిట్లుజెప్ప దొడగెను "నావాగ్దానమునిప్ప టికినెరవేర్పగలిగి నందుకు మిక్కిలి సంతో షము" వ్రాయుచున్న ముకుందచంద్రున కీప్రథమవాక్యమర్ధము గాలేదు; కాని, మక రందునిహస్తము జేబునుండి తన వైపునకు నిమ్మళముగా వచ్చుచున్నట్లాతడు గనిపెట్టి, వెంటనే "మకరందా! నీహస్తమున నున్న దేమి" యని ప్రశ్నించెను. "ఏమియులేదు, వట్టిహస్తమే" యనుచు మకరందుడు మరల తన హస్తమును జేబునందిడుకొని, వుత్తరము నిట్లు చెప్పదొడగెను- "నీవు నన్ను ప్రేమింప చకున్నను, నేను నిన్ను ప్రేమించితిని"-- మరల మకరందుని హస్తము తనవైపునకు వచ్చుచున్నట్లు కనుగొని "మకరందా! నీవ హస్తమున నున్న దాయుధమా?యని, ము కుందచంద్రుడు ప్రశ్నించెను "ఆయుధము గాదు భయపడకుము- కాలము పర్వెత్తు చున్నది. జాబును త్వరగా జెప్పుమ్మని

యనుచు, మకరందుడు తిరిగి తన హస్తము ను జేబునందుంచుకొని యిట్లుత్తరము జెప్ప సాగెను. "మదిలో నీకు నాయందు ప్రేమ లేకున్నను, నాబలవంతము వలన కొన్నిదిన ములవరకు నీవు కొంతప్రేమ నాకు కను బరచినావు అట్టి ప్రేమకు నేనిపుడు కొంత ఋణపడియున్నాను ఈరుడ నగుటచే యీ ప్రేమఋణమును వేరొకవిధముగా తీర్పవల సివచ్చినది"- పైవాక్యములను వ్రాయుచు న్నాడే కాని, ముకుందచంద్రునకవి యర్థము గాలేదు ఇంతలో మకరందుని హస్తము, ముకుందచంద్రుని నాసికకడ కేగెను వ్రా యుచున్నవాడల్ల, యులికిపడి "మకరందా! నాముక్కువద్దకేదియో ఘాటముగువస్తువు పెట్టినావు కారణమే"మని ప్రశ్నించెను మక రందుడు మాటాడక జాబునిట్లు దొడంగెను "నాఋణము నిట్లు తీర్పదలచితిని"- తల వంచుకొని చెప్పనది వ్రాయుచున్న, ము కుందచంద్రుని నాసికకడకు మరల మకరం దుని హస్తమేగెను. ఈసారితో, ముకుంద చంద్రుడు స్మృహదప్పి క్రిందబడెను.

తత్క్షణము మకరందుడు తన దుస్తుల ను విడచి ముకుంద చంద్రునకు దొడగి, వాని దుస్తులను తాను ధరించెను. ఆతని పాదరక్షలు తాను దొడగికొని తన వ్రాతని నాతనికి దొడగెను ఆతని వలె తన శిరో జముల విరియబోసికొనెను. తన కిదివర కున్న రీతిగా యీతని శిరోజములముడచెను. తాను జెప్పుచుండగా ముకుంద చంద్రుడు వ్రాసిన కాగితమును మడచి, ముకుంద చంద్రుని జేబు నందుంచెను ఆ కాగిత మెప్పటికయిన మనోహరి కంటబడగా యని యాతడనుకొనెను ఆతనికిని తనకును కొంత పోలిక యున్నట్లిదివరకే విన్నవాడు గావున మరింత సంతసింప దొడగెను. అంత యు ముగిసినపిదప "గోపాలా!" యనిబిలచెను

ద్వారమావలనుండి యొక నల్లని విగ్రహములోన ప్రవేశించెను. మకరందు డా విగ్రహమున కభిముఖుడై యిట్లనెను. "ఈతని వద్దజాగ్రత్తగా నప్పగింపుము; బం డిలో పోవునపుడెవరేని యడిగిన పాముకా టుచే బాధపడుచున్న మకరందుడని జవా బిమ్ము ముఖమును జూపింపుమని ప్రశ్నించిన ప్రాణములు హీనములనిదలచికాపాడుము."

గో:—చిత్తము.

స్మృహ లేక పడియున్న ముకుంద చంద్రుడు గోపాలునిచే గొంపోబడెను.

౫

ముకుంద చంద్రుని వేషముతో మకరందుడు కారాగారమున గూర్చుండియుండె ను. గోపాలు నెవరైన కట్టుకుందురేమో యని యాతడు భయపడెను, కాని వారు సురక్షితముగా వెడలిపోయి నట్లాతడు కొంత సేపునకు దెలిసికొనెను.

ఇంతలో గడియారము మూడుకొట్టె ను. తన జీవితకాలము సంపూర్తియయి నట్లాతడు దెలిసికొనెను.

చేత నొక కాగితము బట్టుకొని మరి యొక చేతిలో నొక యాయుధమును ధరించి యొక రాజభటుడు లోనప్రవేసించి "నావెం టరమ్ము నీవొక్క క్షణమైనను యిచ్చట నుండుటకు వీలు లేదని యాజ్ఞాపించెను.

మృగరాజు వెంటజను హరిణంబు మాడ్కి ముకుందచంద్రుని వేషధారియయి న మకరందుడు వాని వెంటజనెను. వారిరువురు పెక్కు ద్వారములదాటి, యొక

బయలున కేగిరి. అచ్చట నొక శకటము వేచి యుండెను. ఆశకటములో ముకుంద చంద్రునితో గలసి కుట్రబన్నిన వారందరు గలరు. రాజభటుని యాజ్ఞప్రకారము, మకరందుడా బండినెక్కెను. పెక్కు సందులదాటి యాశకటము రాజవీథిలోని కేగెను.

ప్రజలు వేనకు వేలుగా మూగియా శకటమును జూచు చుండిరి. తమ్మనేక కష్టముల బెట్టిన, ముకుంద చంద్రుడీల్గ నున్నాడని యందరూ సంతసించిరి. ఆతని ముఖకమలము నేడెట్లుండెనో చూతమనియందరు నువ్విళ్ళూరు చుండిరి

"ఆకూర్చున్నవారిలో మధ్యవాడేముకుంద చంద్రు"డని కొందరునూ "ఆ కడేలకో తల నెత్తడని" మరికొందరునూ "ఇన్నివత్సరములు రాజ్యము నుద్యల్లీల బాలించి నేడీకటికి చావుపాలబడి నాడుగదా!" యని మరికొందరునూ యనజొచ్చిరి.

మకరందుడీ మాటలవిని తనలోదాను నవ్వుకొనెను.

భీకరమై, క్రూరమై, చూచినంతమాత్రముననే, గగుర్పాటు గలిగించుచున్న యాశిరచ్ఛేదన యంత్రముకడకీ శకటము జేరెను. వేనకు వేలు ప్రజలచ్చట మూగి యుండిరి.

ఎటుజూచినను ప్రజలే! యేదిక్కు విలోకించినను యిష్టసిద్ధికి త్వరపడుచున్న మానవులే; యేకేవగన్ననూ యానంద చంద్రికలతో విలసిల్లుచున్న యాననములే; యేవైపు దృష్టిసారించిననూ, కొంతవిశేషమును వ్యక్తీకరింపుచున్న ముఖములే! ఆహా యేమి యీవింత, సుజ్ఞానులైన మానవులు, తమవంటివానిజీవముదీయుటకెంత, కుతూహలాయత్తచిత్తులై యున్నారు! ఆమహాగాత్రమైనప్రజాసమూహమునందొక్కడైనను జాలిగుండె వాడైన లేడా? ఆయాననములందా దరహాస చంద్రికలెందుకో? ఆయాతురతకర్థమేమో? దీనినే క్రూరనిర్మితమైన యానందమందురు.

ఖండితములైన శిరముల నప్పుడే లెక్కించుచున్నారు. బ్రహ్మాండమైన యాయంత్రము, వెనుకకునూ, ముందుకునూ, యాడుచున్నది. టాప్-ఒకటి-టాప్- రెండు ... ... టాప్- తొమ్మిది, యని లెక్కించుచున్నారు,

ఇంకనూ చూచెదవేల? ముఖ్యుడవగు నిన్నే చివరకుంచినాము. ఇంకనూ, శత్రువాసవలె విలోకించెదవేల? ముకుంద చంద్రా! దిగుము! కాలమాసన్నమైనది, దిగుము! మృత్యుదేవత నిన్నాహ్వానించుచున్నది, దిగుము! దిగుము!

ముకుందచంద్రుని వేషమునన్న మకరందుడు దిగుచున్నాడు- చిరునగవు పెదవులపై చిందులాడ; దరహాసిత వదనారవిందుడై యంత్రముకడ కేగుచున్నాడు- వొక్క నిముసము దాటినది టాప్ పది యని లెక్కించినారు.

ఖండింపబడిన శిరమును తలారిపైకెత్తి చూపుచున్నాడు పెదవులపై చిరునగవింకనూ యంతరింపలేదు! కనులనెంట యానందభాష్పము లింకనూ రాలుచుండెను. తన ప్రేమఋణమును తీర్చుకొన్నందుకు గాబోలు, యాచిరునగవు! సమస్తదుఃఖముల కాకరమై వెలయుచున్న యాభూతలమును వదలి, వీరస్వర్గము జేరగొని నందులకు గాబోలు, యాలేనగవు. ఆహా! ఏమి

యీపప్రియాశాధరమింకనూ వాడక, స్వార్థపర త్యాగమును చిప్పిలుచున్నదే!

ప్రేక్షకులందరూ వేడి నిట్టూర్పుల విడచిరి ముకుందచంద్రిక తమకు, లోచనగోచరులుకాదు గదాయని వారుసంతసించిరి.

అన్నిసంగతులనూ పొట్ట నిడుకొని భానుడస్తమించెను; కటిక చీకటి జగమెల్ల గ్రమ్ముకొనెను.

ప్రేమ యెంతవానినైననూ గుడ్డివానిని జేయును. అలవిగానికార్యములనైనను జేయ ప్రోత్సహించును. ఈ భూమండలము నంతయు "ప్రేమ" యను నూలుపోగుతో పరాత్పరుడు బంధించియున్నాడు.

# హితోపదేశము

—*—

అవధానుల కామేశ్వరశర్మగారు

కలకలలాడు నెమ్మొగము కాంతిదొఱంగెను గాయమెంతయున్
సలసల క్రాగుచుండె బలుచంబడె జెక్కులు తెల్లవాఱెక
న్నులు, తడబాటు జెందెమది నోటవచింపవు మాటయేమియున్
వెలవెల బోయెదేల యిటుబేల వచింపుమటన్న మిత్రుడు
వలవల యేడ్చియిట్లనియె– వారవిలాసినితోడ గూడినే
గులికితి గండ్లుమూతవడి కొన్నిదినాలటువంటి సౌఖ్యముల్
గలుగునె యేరికేని వెలకాంతల గూడుట దోసమంచు నీ
యిల బలుకాడువారు కడుహీనులు మూర్ఖులు తుచ్ఛులంచు నే
దలచితి నింతయేల నిజదారయు దక్కిన బంధుజాలమున్
బలువురు మిత్రులున్ దగదు వారవెలందుల జిక్కియొందఱో
నిలువ గృహంబులేక తిననెంచిన బొట్టకు గూడు గట్టగా
సలువయు గేని లేక యవమానపు వృత్తుల నాచరించుచున్
ఇలదిరుగాడుచుండుటది యీప్రగనుంగొను చుంటలేదె మా
పలుకుల నాలకించి ధనభామనువీడి సుఖంబులందుమా
కులసతి కంటినీరొలుక గొల్లనికాంత గృహంబునందు తా
నిలువదటంచు నింక నివాసితుల శ్రేయముగోరి చెప్పినన్
ఖలులని నిందజేసితిని గన్నుల నిప్పుల గుమ్మరించితిన్

వెలచెలిశాశ్వతంబనుచు వేనగవేలఁగ నోట్లువ్రాసినా
కులసతిమేని సొమ్ములును గొంపయుగోడియు యీవదాస్తియుల్
విలువగలట్టి సర్వమును వేశ్యకు నర్పణఁ జేసినాఁడ నా
కలధనమెల్లలాగి వెలకాంత మఱొక్కని కౌఁగలింతలన్
గులుకుచునుండెఁ గారణముగు దుట కద్దియ- మిత్రమా; యికన్
బలుకకు చాలుఁ జాలు నిటువంటికరాత్ముఁడ వీవటంచు నేఁ
దలఁ పన యొంతచేసితి వెదన్ గృశియించెదవేల యికనా
వెలచెలికోసమా యవివేకి మరల్పుము నీదుబుద్ధినీ
కలధనమెల్లఁ బోయినను గష్టపరంపరలావహించినన్
గులసతి తోడునీడవలెఁ గూడఁ జరించుచు నీకు సౌఖ్యముల్
గలుగఁగఁ జేయుఁ గొల్చుచును గష్టసుఖంబులఁ బాలుగొంచునీ
కులమది వెన్నెకెక్కు నటు గోరుచునుండున యెల్లవేళలన్
వెలిచెలియన్ననో యనుభవించితి వీవగుశ్రేల చెప్పని
కలిమదిపోవు నెన్నఁడ మకాలను దన్ను నుగాన నింతనో
చెలువుఁడబుద్ధిగల్గి దగ ఉత్తమునందును జింతఁ దక్కిచి
కులసతి దుఃఖమార్చి నెలకొమ్మలిపై మనమూడ్చి హాయిగాఁ
గలిగినదేదియో కలిమొ గంజియొ ద్రావుచుఁ బెద్దకానకన్
ఇలుఁ నిలఁ బెట్టుకోఁగ మదినెంచుము యిప్పటికైన మిత్రమా.



# వింధ్యాద్రిలో రావణునిలంక

(పింగళి నాగేంద్రరావుగారు)

ఇప్పటికి షుమారు రెండువేల సంవత్సరములనుండియు రావణుని లంక సముద్ర మధ్యమున నున్నదని లోకము విశ్వసించుచున్నది. ప్రస్తుతము సింహళద్వీపమని వ్యవహరింపబడునదియే పూర్వము లంకయై యుండెడిదని బహుజనాభిప్రాయము. కాని పూర్వలంక సముద్రగర్భమున నంతరించిపోయెనని కొందరిమతము. కాని మహారాష్ట్రపండితుడొకడు, రెండువత్సరముల క్రింద, లంక సింహళద్వీపమై యుండనేరదని రూపించుచు నొక వాదమును చేసెను. అప్పటినుంచియు పల్వురు మహారాష్ట్రపండితులును కాశీవిద్వాంసులు నీవిషయమును తీవ్రముగ నాలోచింపదొరకొనిరి. ఆపండితుల వాదముననుసరించి రావణునిలంక పూర్వము వింధ్యపర్వతములలో నుండెడిదని తేలుచున్నది ఇది యెంతయు నాశ్చర్యమును గొల్పకపోదు. అందుచే పురాతత్వచర్చయందభిమానులగు మన ఆంధ్రపండితులు నీవిషయమును గూర్చి పరిశోధింపగలరని ఆవాదసారాంశము నిట నిచ్చుచున్నాను.

కిష్కింధయొక్క యునికినాధారముగ జేసికొని వారీ పరిశోధనకు గడంగిరి. ప్రస్తుత జనవిశ్వాసము ననుసరించి కిష్కింధ, (నైజాంరాజ్య దక్షిణదిశను) ప్రాచీన "విజయనగరము" లేక ప్రస్తుత "ఆనగొంది"కి సమీపముగ నెచ్చటనో యుండి యుండెడిదని తెలియవచ్చుచున్నది. అది నర్మదానదికి షుమారు 500 మైళ్లు దక్షిణముగానుండును. వాల్మీకి రామాయణము వలన కిష్కింధనర్మదానది కుత్తరముగ నుండెనని మనముస్పష్టముగ దెలిసికొనగలము. సీతాన్వేషణము జరిగినప్పుడు కిష్కింధాధిపతియగు సుగ్రీవుడు తన వానరులకు సీతకొఱకై వెదుక వలసిన స్థలములను నిర్దేశించుచు దక్షిణదిక్కునకేగు హనుమదాదులతో వారికి త్రోవలో పరిశోధింప వలసినస్థలములను చెప్పుచున్నాడు.

శ్లో॥ సహస్రశిరసాం వింధ్యం నానాద్రుమలతాయుతం
నర్మదాంచనదీం రమ్యాం మహోరగనిషేవితాం॥
తతోగోదావరీం రమ్యాం కృష్ణవేణీం మహానదీం
మేఖలానుత్కలాం శ్చైవ దశార్ణా నగరాణ్యపి।
ఆబ్రవన్తీమవన్తీంచ సర్వమేవానుపశ్యత
విదర్భానృష్టికాంశ్చైవరమ్యాన్మాహిష కానపి।
తథామత్స్య కలింగాంశ్చ కౌశికాంశ్చ సమంతతః
అన్వీక్ష్య దండకారణ్యం సపర్వతనదీగుహాం।
నదీంగోదావరీం చైవసర్వ మేవానుపశ్యత।
తథైవాంధ్రాంశ్చ పుండ్రాంశ్చచోలాన్ పాండ్యాంశ్చ కేరలాన్

అయోముఖశ్చగన్తవ్యః పర్వతోధాతు మండితః
తతస్తామాపగాందివ్యాం ప్రసన్న సలిలాశయాం॥
తత్రద్రక్ష్యథ కావేరీం విహృతామప్సరోగణైః
తస్యాసీనం నగస్యాగ్రే మలయస్యమహౌజసః॥

దృష్ట్వాథాదిత్య సంకాశమగస్త్య మృషిసత్తమం
తతస్తేనాభ్యనుజ్ఞాతః ప్రసన్నేనమహాత్మనా।
తామ్రపర్ణీం గ్రాహజుష్టాం తరిష్యథమహానదం
సా చందన వనైశ్చిత్రైః ప్రచ్ఛన్నద్వీపవారిణీ।
కాన్తేవయువతీ కాన్తంసముద్రమవగాహతే
తతో హేమమయం దివ్యంముక్తామణివిభూషితం।
యుక్తం కవాటం పాండ్యానాంగతాద్రక్ష్యథవానరాః
తతః సముద్రమాసాద్య సంప్రధార్యార్థ నిశ్చయం।
అగస్త్యేనాన్తరేతత్రసాగరే వినివేశితః
చిత్రసానునగః శ్రీమాన్మహేంద్రః పర్వతోత్తమః।

సుగ్రీవుడు నర్మదానది దక్షిణమున నున్నట్లు చెప్పుటచే నప్పుడు సుగ్రీవుడున్న స్థానము నర్మద కుత్తరదిశ నున్నట్లు రూఢియగుచున్నది.

ఈవిధముగనే ప్రాగ్దిశకేగు వానరుల "మీకు, గంగా యమునా, సరయూ, కౌశకీ, సరస్వతీ, సింధు, సోన, మహీ, కాలమహీ మొదలగు నదులను మహాగిరిపర్వతము మఱియు బ్రహ్మమాల, విదేహ, మాలన, కాశీ, కౌశల, మగధ, మహాగ్రామ, పుండ్ర, అంగ, కోశకారభూమి (అస్సాము) మఱియు రజతాకర (బర్మా) దేశములు త్రోవలో రాగలవు. అని చెప్పినాడు. పశ్చిమదిక్కునకేగువారలతో సౌరాష్ట్రబాహ్లీకచంద్రచిత్ర, మొదలగుదేశములలో సీత నన్వేషింపవలసినదని చెప్పినాడు

శ్లో॥ గిరిజాలవృతాందుర్గాం మార్గిత్వాపశ్చిమాందిశంధ
తతః పశ్చిమమాగమ్య సముద్రంద్రష్టు మర్హథ"

ఉత్తరదిశ కేగువారికి మ్లేచ్ఛ, పుళింద, శూరసేన, ప్రస్థల, భరత, కురు, మద్ర, కాంభోజ, యవన, శకనగర, వరద, హిమాలయాది స్థలములగూర్చి చెప్పినారు.

సుగ్రీవుని వాక్యముల ననుసరించి కిష్కింధ వింధ్యపర్వతమున కుత్తరముగ నున్నట్లు ("భరహుత్ ") ప్రాంతము మఱియు రావణునిరాజధాని, లంక, అపర్వతమునకు దక్షిణముగ నమరకంటకమునకు సమీపముగనున్నట్లు నూహించుటకు వీలు కల్గుచున్నది అమరకంటకము వింధ్యపర్వతములలో నొకశిఖరము నర్మదాస్వర్ణనదులచ్చటినుండియే పుట్టినవి దానికి కొంచెము సమీపముగనే "గుల్ బకావలి"వాసస్థలమని చెప్పబడు పుష్పలతాశోభితమగు నొకచిన్నిగిరియుకలదు అచ్చటనొక దుర్గమమగు కొండకోటగలదు. దానికి అడుగుభాగమున నొక పెద్దయగాధము గలదు. దానిదరించుట కెవరికిని సాధ్యము కాదు. ఇదియే రావణునిలంకయైయుండి యుండవలెను. ఆకాలమున ఈఅగాధము కొన్ని (నాలుగైదు) మైళ్ళవఱకుజలమయమై యుండెడిది. పెద్దపెద్ద జలాశయములను సాగరములని వ్యవహరించుట పూర్వకాలము నందుండెడిది. అందుచే దీనిని సాగరమని పిల్చినను అనుచితమని చెప్పవీలులేదు చూడుడు ! వానరులు వింధ్యపర్వతమున సీతనన్వేషించుచు నొకగుహలోదారి మా[illegible] ముచు గోల్పోయినపుడొక తపస్విని వారిని వింధ్యవఱకును పూర్ణమయియున్న ఒకసాగర తీరమునకు దీసికొనిపోయి వారితో

శ్లో॥ ఏషవిన్ధ్యోగిరిః శ్రీమాన్నానాద్రుమలతాయుతః
ఏషప్రస్రవణశ్శైలః సాగరోఽయం మహోదధిః

(ఇది వింధ్యాచలము ఇది ప్రస్రవణపర్వతము, ఇది సముద్రము) అని చెప్పినది. తరువాత కొంతసేపటికి జటాయుసోదరుడగు సంపాతి యచ్చటికి వచ్చి

ఇతఃస్థోఽహం ప్రపశ్యామిరావణం జానకీం తథా

(ఇప్పటినుంచి నేను రావణుని సీతను చూచుచున్నాను) అనిచెప్పెను. దీనినిబట్టి వానరులున్నచో సంపాతితో మాట్లాడుచున్న స్థానమునకు సమీపముననేయెచ్చటనో రావణుని నివాసస్థలముండి యుండవలెను. వందలకొలది మైళ్లదూరమున లేదు.

ఇక ద్వీపశబ్దమున కర్థమేమని విచారింపవలసియున్నది.

శ్లో॥ ఇతోద్వీపే సముద్రస్య సంపూర్ణే శతయోజనే
తస్మిన్ లంకాపురీరమ్యా నిర్మితా విశ్వకర్మణా

అని వాల్మీకి రామాయణములో నున్నది. రావణునిలంక యని స్థిరపరుప ప్రయత్నించుచున్న అమరకంటకమునకు నాలుగుప్రక్కలను నీరు (సముద్రము) లేదు. మూడుప్రక్కల మాత్రము విశాలమునగాధమునగు జలాశయముకలదు. కాని "జంబూద్వీప" మునందలి ద్వీపశబ్దమునకు వలెనే దీనికిగూడ అర్థము చెప్పికొనరాదా? మఱియు ఏవైపునకు లంక (రావణునిది) కానవచ్చుచున్నదో ఆవైపున కేవలము జలము. ఎదురుగ లంకకు వెనుక మహాపర్వత శ్రేణి. దాని వెనుక నేమున్నదో ఎవరికిని గోచరించదు కావున జలమున్నదనుకొని ఆభావముతో అమరకంటకమును ద్వీపమని యప్పటివారు వ్యవహరించి యుండుటలో నస్వాభావిక మేమియు నుండదు. వాస్తవమునకు లంకాశబ్దమునకు గూడ ద్వీపమనియే యర్థము. కాని "లంక" సంస్కృతభాషేతరమైన శబ్దము. అందుచేతనే దానికిపర్యాయవాచకమైన ద్వీపశబ్దముగూడ జేర్పబడి "లంకాద్వీప"మని ప్రయోగింపబడుటగూడ కల్గిన దనుకొనవచ్చును. సరళతకొఱకై అక్కడక్కడ రెండు సమానార్థకములగు శబ్దములు కలుపబడుట ఆచారముగనే యున్నది. "వింధ్యాచలము" మొదలగు ప్రయోగములుకలవు. "లంక" శబ్దము తెలుగులేక ఓఢ్రభాషకు చెందినది. కావున అర్థమును స్పష్టీకరించుట కొఱకై సంస్కృతశబ్దముగూడ జతచేర్పబడి యుండును.

లంక అమరకంటకమునకు సమీపముననే యున్నదనుటకు ప్రమాణములు—

సీతను వెదకుచు రామలక్ష్మణులు బయలుదేరి ఏయేస్థలముల కేగిరో ఆయాస్థలములకు మధ్యగలదూర మెంతెంతయో యావివరణము రామాయణములో నేకలదు. దానినిబట్టి రామలక్ష్మణులు మధ్యభారతమున భ్రమణమొనర్చినట్లూహించుకొనుటకు వీలున్నది. సీతాహరణము పర్ణశాల (భద్రాద్రివద్ద) నుండియనిగాని లేక నాసికకు సమీపముగ నెచ్చటనుండియేనియని గాని యనుకొనినచో రామలక్ష్మణులు ఆనగొందివద్దనుండు కిష్కింధకు అంతస్వల్పకాలములో నడిచిపోజాలరు. మఱియొక సంగతి అమరకంటకమునకు చుట్టుప్రక్కల నివసించు "గోండు" జాతివారు తాము రావణవంశీకులమని యిప్పటికిని చెప్పుకొనుచుందురు. మఱియు రావణుని పరివారికుల పేర్గసాల కంటకయమరకంటకాది శబ్దములచేధ్వనించుచుండుటచే ఏమాత్రమైన సాదృశ్యముండకపోదు. రాక్షసులు తాపసులబాధపెట్టినది దండకారణ్యమునందే

శ్లో॥ పంపానదీ నివాసానామను మందాకినీ చతే
చిత్రకూటాలయానాం చక్రియతేకదనం మహత్

ఈశ్లోకమననుసరించి "పంపానది, మందాకిని, మరియు చిత్రకూటము వీనిమధ్యప్రదేశము తపోయోగ్య"మని తెలియుచున్నది.

రాక్షసుల యక్రమము లచ్చటనే జరిగినవి. ఈస్థలము మధ్యభారతములో నున్నది.

పంపా నదియెచ్చటనున్నది? మందాకినీ చిత్రకూటము లెచ్చట? వానరులెవరు? ఈవిషయములుకూడ విచార్యములు శరచ్చంద్రరాయిగారు "ఉరాంవ్" అనునొక ఆరణ్యక జాతినిగురించి వ్రాసిన గ్రంథములో "వానరశబ్దముయొక్క అపభ్రంశరూపమైన "వనరాండు" అనుశబ్దమునుండి "ఉరాంవ్" శబ్దమువచ్చిన దని వ్రాసియున్నారు. ఈవానరులు అమరకంటకమునకు కొంచెము దూరములో బిలాస్పూరునకు తూర్పుగా అర్పానది కవతలియొడ్డున చోటానాగపూర్ ప్రాంతముల విశేషముగానున్నారు. వీరిసంఖ్య 9 లక్షలుండును. వానరులనివాసము పంపానదికి సమీపముననని రామాయణమువలన మనకు తెలియగలదు. ఈఅర్పానదియె పూర్వము పంపానదియై యుండవలెను. రాముని వానరులును రావణుని వంశీకులమని చెప్పికొను గోండుజాతివారును ఇరుగు పొరుగువారని తేలుచున్నది. ఇంతియకాక బిలాస్పూర్ జిల్లాలోనే "శబరి" యాశ్రమము(ప్రస్తుతము శబరీనారాయణ్) ఉండెనని చెప్పబడుచున్నది. అచ్చటికి రెండు మైళ్ళదూరములో "ఖరైదా" యని యొక స్థలమున్నది. అచ్చటిజనులు ఖరదూషణులు సంహరింపబడిన స్థలమదియేయని నేటికిని చెప్పుచుందురు. శబరీనారాయణ్ (ఇప్పటిది) అమరకంటకమునకు తొంబ్బది మైళ్ళ దూరములోనున్నది. అందుచేశబరీ వానరులతోటి పరిచయనమసంగతమైనదికాదా. శబరి అంగుళీనిర్దేశముచేయుచు "ఏషవిన్ధ్యో గిరిః ఏషప్రస్రవణః సాగరోZయంమహోదధిః" అని చెప్పుటలో ఆశ్చర్యమేమియులేదు. రతన్ పూరునందు 1,400 తటాకములుండెడివని కింవదంతి. ఇప్పటికిని షుమారు 300 తటాకములుకలవు "కలచురి" శిలాశాసనములయందు తటాకములు సాగరనామమున ప్రసిద్ధిజెందినట్లు ప్రమాణములు లభించుచున్నవి. మధ్యప్రదేశముల యందొకపట్టణము తటాకకారణముననే సాగరమని యిప్పటికిని పిలువబడుచున్నది. అట్టిచో అమరకంటకము క్రిందనున్న తటాకము మిగిలిన తటాకములన్నింటికంటెను మిక్కిలి పెద్దదయి యుండినచో మహోదధయనిగాని లోకులచే వ్యవహరింపబడుటలో నన్యాయమేమియు లేదు.

మందాకినీనది చిత్రకూటమునందలి పయోష్ణీనదికి ఒక ఉపనది. కాని యిదియే పూర్వపు మందాకిని యనుటకు కొంచెము సందేహింపవలసి వచ్చుచున్నది. అయినను, ఛింద్వాడ్ జిల్లాయందలి జున్నర్ దేవ్ స్టేషన్ కు సమీపముగ మందాకినీ నదియుండెడిదని ఒకయూహపుట్టుచున్నది. ఏలనన "మందాకిని"కి గోండుభాషలో "జున్నరదేవ్" అనిపేరు. ఇప్పటికిని జున్నర్ దేవు తీర్థస్థానముగ నున్నది. ఇప్పుడచ్చట నదిమాత్రము లేదు. కాని పూర్వమొకప్పుడు నదియచ్చట ప్రవహించిన చిహ్నములు మాత్రము స్పష్టముగ కలవు. మందాకిని (ప్రాచీనము) అప్పుడులేదు. అది అంతర్వాహిని యైపోయినది.

సీతాహరణము గోదావరీతీరమునుండి యైనది. గోదావరి అమరకంటకమునకు దక్షిణముగా కొన్ని వందలమైళ్ళ దూరముననున్నది. కాని, ఈగోదావరి చిత్రకూటపర్వతమునుండియె బయల్వెడలినది యని

శేషముండును. అందుచేత మన బాలురెప్పటికైన నుత్కృష్ట భావ వికాస శోభితులుగాఁ గోరినచో నందులకు సాధిరూపమగు నుత్కృష్ట భాష యందే మొట్ట మొదటి నుండియు వారని శిక్షింప వలయును. మఱియొక మాట. బాలునకు వాని సొంతభాషలో బోధించిననే గాని వాడు చదువునది సులభముగా తెలిసి కొనలేడను చున్నారు. ఇట్లనుట దోషము. బాలునకు సొంతభాష యేది? వాని ముద్దు మాటలు. ఎవరి సొంత భాషలో వారికి విద్యాభ్యాసము చేయింప వలసి వచ్చుచో బాలురకు ముద్దుమాటలు గల్గిన యొక యపూర్వ భాషయందును నీచజాతుల కుఱ్ఱవాండ్రకు వారి "యాస" గల్గిన మఱియొక యపూర్వ భాష యందును బోధింప వలసి యుండునుగాదా? ఇట్టి నియమరహిత కర్మకు పాల్పడినచో పర్యవసాన మేమగునో యూహింప బనిలేదు.

అదియును గాక భాష యనునది సాధన చేసిన గాని లభించుట లేదు. శిశువునకు పుట్టినతోడనే యేమి భాష వచ్చును. తరువాత మనమింటిలో మాటలాడుకొను శబ్దజాలమును, శ్రవణ పూర్వకమగు సాధన చేతనే యనుకరించి నేర్వగలుగు చున్నాడు. అట్టుపైన పాఠశాలలో నుపాధ్యాయు డొక శబ్దమును స్పష్టముగ నుచ్చరించి చూపదోడనే ప్రయత్నించి యనగలుగు చున్నాడు. క్రమక్రమముగా నతని వాగింద్రియ మిట్టి సాధనకు లోబడి శిక్షితమై పాటవము గలిగి సకల సుస్వరోచ్చారణకును నానుకూల్యము వహించుచున్నది. మనము సాధారణముగ నింటి యొద్ద మాటలాడు కొను రీతినిగాని, శిష్టులైనను సభలలో భావమున కెక్కుడు ప్రాధాన్య మొసంగి యెక్కుడు సులభమగు విధమున నుపన్యసించు రీతినిగాని పుస్తకములను వ్రాసి యాతనిచే చదివించినచో నతని వాగింద్రియమునకు దగిన శిక్షణ మలవడదు

మన వాగింద్రియ పాటవమున కతీతమైన భాష పరభాష యన్న మాటయే. అందు విద్దెలు గఱపు టేల యందురేమో! ఒక పరమలక్ష్యమును దృక్పథమున నుంచుకొని తదనుగుణముగ నింద్రియప్రవృత్తి ననువర్తింపజేయుట సజ్జనుల త్రోవ. ఇంద్రియములను శాసించక స్వేచ్ఛగ సంచరింప నిచ్చినచో వాటి యిష్టము వచ్చినట్లెల్ల నవి సంచరింపగలవు. అట్లే వాగింద్రియమును. ఇందుల కొక యుదాహరణము గనుడు! ఒక యూరనే జన్మించిన యిరువురు బాలకులలో నొకడు నిరంతరాభ్యాస పాటనముచే తన వాగింద్రియమును సుప్రయుక్తముగ త్రిప్పగలుగుచున్నాడు. మఱియొకడంత విద్యాభ్యాస మొనర్పమిచే పుట్టి పెరిగిన తరువాత శ్రవణ పాండిత్యము వలన జనించిన 'యాస' మాటలనే యనుచున్నాడు. కనుక భాషాభ్యాసమున కంతను, ముఖ్యముగా బాలుర భాషాభ్యాసమునకు నియమరాహిత్యము గూడదు

మేము నియమములన్నిటిని పరిత్యజింపుమనుటలేదు. శిష్ట వ్యవహారములలో నున్న భాషనే పాఠ్యగ్రంథము లందును వ్రాయఁ జేయుడని ప్రతివాదు లనఁబోదురేమో? శిష్ట వ్యవహారములోనున్న భాష యేమాత్రము నియమములను పాటించుచున్నది? శిష్టులు మాటలాడు నట్లుగదా వ్రాయవలసినది. వారు సంభాషించుచో

"మేమప్పుడు చెప్పామ్" అని యన్నారనుకొనుడు. ఈవాక్యమును వ్రాయుటయుళ్ళనా లేక పూర్ణానుస్వారమును వ్రాయవలెనా? ఎట్లు? పూర్ణానుస్వారమని మీ రన్నచో మకారపుం బొల్లునే వ్రాయవలయునని నే నందును. ఇది యెట్లు పొసగును? కావునయ్యా మేము రెండు విధములుగను వ్రాయుడనుట లేదు. "చెప్పాము" అని వ్రాయుమనుచున్నామందురా? ఈ శబ్దమున మధ్యస్థమగు పవర్గద్విత్వము నట్లే వ్రాయుట దోషరహితమా? దాని నెట్లుచ్చరించుచున్నాము. ఇప్పుడు కొందరు రాజమహేంద్రవర ప్రాంతముల వారు వాడుక భాషలో వ్యాసాదికములు వ్రాయుచు 'చెప్పేము" అని వ్రాయుచున్నారు. ఇది యొప్పునా, అది యొప్పునా? ఈ రూపద్వితయము నందేది గ్రాహ్యము? ఇ తకును వైయాకరణు లెంత వరకు తంటాలు పడినను నోటితో నొనర్చు నుచ్చారణమునకును, లేఖినితో గావించు లేఖనమునకును నైక్యము సమకూర్ప బాటువడిరి. ఇందు చేతనే పైనుదహరించిన శబ్దములకు "చెప్పితిమి,, "చెప్పినాము,, అను రూపాంతరములు వెలసినవి. ఈ శబ్దముల నెట్లుచ్చరించుచున్నామో, యట్లే వాటిని గ్రంథములలో వ్రాయుచున్నాము. గ్రంథము లందెట్లు వ్రాయుచున్నామో యట్లే యుచ్చరించుచున్నాము.

ఇక శిష్ట వ్యవహారమును గూర్చి విచారింతము. శిష్టులన నెవరు? స్వాధ్యాయపరులా, నిత్యాగ్ని హోత్రులా; వీరేయైనచో "విస్సావఝుల వారి బుజ్జినమ మా విస్సాయయ క్స్వారుపే,, యని దాసు శ్రీరాములు గారు వ్రాసిన పద్యమున కుబాహారణముగా భాషించుచుందురు. వారిని శిష్టులనక తప్పదు. వారి భాషనే సంపూర్ణముగ గ్రంథముల కెక్కించినచో నది యే నవర భాష వలెనో యుండునుగాని తెనుగు వలె నుండదేమో యని చెప్పుటకు సాహసించుచున్నాడను. సాధారణముగ నీ ప్రాంతములలోని బ్రాహ్మణులు కొందరు అందాము అందురు. దీని కంటె అంటారు, అనెదరు, నన్నరూపములే యెక్కువ శిష్టజన పేయములై యున్నవని నా యభిప్రాయము

ఎంత వితర్కించినను శిష్టవ్యవహారమును పాఠ్యగ్రంథములలోని కెక్కించుట కవకాశము లేదు. ఒకవేళ నట్లొనర్చినను దారి తెన్ను లేక బాలురకు భాషా స్వరూపమావంతయు గోచరించక యుండును. అదియును గాక మఱియొక విషయమున్నది. కృష్ణాగోదావరి తీరవాసులగు నాంధ్రులలో శిష్టులు వ్యవహరించు భాషయే సరిగా గ్రాహ్యమని రామమూర్తి పంతులుగారు చెప్పుచున్నారు. బరంపురము మొదలుగా మైసూరు ప్రాంత ప్రాంతముల వఱకును విస్తరించి యున్న యాంధ్రదేశీయులందరును కృష్ణాగోదావరి జిల్లాల వారి పద్ధతినే స్వీకరింపవలయునట. పంతులుగారు తామొక తఱి తిరువాన్కూరు ప్రాంతముల కేగితినని యచ్చటి యాంధ్రులు తిక్కనగారి నాటి భాషనే యిప్పుడును మాటలాడు చుందురని యొకరు సభలో వాక్రుచ్చి యున్నట్లు జ్ఞాపకము. అయినచో వారిని గూడ కృష్ణాగోదావరీ తీరవాసుల ననుకరింపుడనుట న్యాయమా? ఈ జిల్లాలలోని యాంధ్రభాష యనేక విదేశ పద సంకరమై కొంతవరకు గోత్ర రూపము దాల్చిన దనవచ్చును రోడ్డు, మున్న గు

శబ్దము లాంధ్రశబ్దరత్నాకరము లోనికి గూడ నెక్కినవి. అట్టిచో స్వచ్ఛమై, యితర సంపర్క దోషము లేక తిక్కన కాలమునాటి తేటతెనుగును మాటలాడు వారి నకలుష భాష నాశ్రయింపుడనుట యే మంతభావ్యము? కాదు వారి కరవభాషా సంపర్క మున్నదందురు కాబోలు. తెనుగు గూడ ద్రావిడ భాషావర్గము లోనిదే యని కొందరు నవీన భాషాభిజ్ఞులు తెల్పుచున్నారు. అరవముతో గలసినచో తెనుగునకు స్వస్వరూపము వచ్చునేమో. ఈచిక్కు సాధించినచో సమాధానమేమి? తిరువాన్కూరులోనున్న యాంధ్రులు మాయదియే యచ్ఛాంధ్రమందురు. హైదరాబాదులో నున్న యాంధ్రులు మాయదియే యచ్ఛతరాంధ్రమందురు. కడప మండలము లోని వారు తమదే యచ్ఛతమాంధ్రమందురు. ఇట్టివారిభాష స్వీకరణయోగ్యమో నిర్ణయించుట కష్టమైపోవును. ఈవాక్యము లిప్పటి కప్రస్తుతములైనను చెప్పక తప్పినదికాదు.

అన్నిటికన్న బాలుర విద్యాబోధన విషయములో మున్ను పల్లెటూళ్ళ వీధిబడులలో నవలంబింపబడుచుండిన పద్ధతి సర్వోత్కృష్టమైనది. పెద్ద బాలశిక్ష చదువగనే రెండు మూడు శతకములు చెప్పి యాపైన నేసప్తమ స్కంధమునో ప్రారంభించెడివారు. దానితో బాలురు చక్కగా పద్యములు చూచి చదువ గలిగెడివారు. ఇప్పుడా పద్ధతి పోయినది. స్కూలుఫైనలు దాటినను యయ్యలు తెలుగు పద్యమును చక్కగా చదువనైన లేకుండుట చూచుచునే యున్నాము.

ఇంతకును మునుపటి విద్యాపద్ధతికి సంస్కృత వాఙ్మయపఠనము పరమ లక్ష్యమైయుండెడిది. మన భాషయెప్పుడును మారుచుండెడిదే. ప్రపంచములోని సర్వపదార్థములును నిరంతరమును మారుచుండెడివే. అయినను సర్వపదార్థాంతర్గతమై యచంచలమగు నొక శక్తియున్నది. దానివలెనే నిరంతరము పరివర్తించుచుండు నీ భాషారూపముల కన్నిటిని నేకముచేసి, సర్వవిధ స్వరూపముల సారము గ్రహించి, యొక నిశ్చలమగు రసవద్రూపమును గల్పించుకొనినారు. సర్వదేశ భాషలకును మాతృమూర్తియై యాసేతు హిమాచల పర్యంతము బ్రవర్తిల్లు ననేక భాషా సౌధములకు మూలకంబమై యలరారు సంస్కృత భాషామతల్లికిని మన యాంధ్రభాషారసవద్రూపమునకును సాధ్యమైనంత సామరస్యము గుదుర్పజూచినారు. పూర్వవైయాకరణులు గావించిన ప్రయత్నము సంపూర్ణము గాకపోవచ్చును. దానిని పూర్తిచేసికొనుటకు బ్రయత్నింపవలయును గాని మూలచ్ఛేదముసేయుట యంత వాంఛనీయము గాదు. ఈరీతిగా పరమలక్ష్యమగు సంస్కృత భాషాసంపత్తిని సులభముగాసంపాదించుట కానుకూల్యము గలుగజేయుటకే దేశభాషకు గొంచెముగట్టిగా కళ్ళెమును బిగించి యుండవచ్చును.

ఇదియును గాక పైన వేదము లున్నవి సర్వసంధులను విడుచుకొని మహాప్రయత్నము చేసిన గాని శబ్దబ్రహ్మ సాక్షాత్కారము గలుగదు. పూర్వకాలమున నైదేండ్లకే వేదపఠనము ప్రారంభించెడి వారలు. అట్టిచో నిప్పటి బాలురు నాల్గు నియమములున్న యాంధ్రభాషా పదములనే సరిగా చదువలే

రని దానిని త్రోసిపుచ్చుట విచారకరము. ఇది యొక దౌర్బల్య లక్షణముగావలె.

"అటులు చెప్పఁజెల్లదు. నేటియాధునిక గ్రంథకర్తలు భాషాసంప్రదాయము నెఱుంగక యపశబ్ద ప్రయోగములం గావించి గ్రంథములను పాడుజేయుచున్నారు" వాటిని పఠనీయ గ్రంథములుగా బెట్టినచో బాలురు చెడిపోవుదురందురా? తప్పులున్నచో దిద్దించుడు. నవీన భారతగ్రంథకర్తలు "వసియాడు" అని యపశబ్దప్రయోగము చేసినచో దానిని దిద్దవలయునుగాని గ్రంథకభాష యంతయు నశరిగ్రాహ్య మనదగునా? ఇట్లే పంతులుగారనేక గ్రంథములనుండి యపప్రయోగముల జూపిరి. వాటినన్నిటిని బ్రకటించి ముందు కవులెవ్వరినట్టి యవకతవకలు చేయకుండునట్లు కట్టుదిట్టము గావింపజేసెదరు గాక. ఒకవేళ పఠనీయగ్రంథము లందట్టి తప్పులు ప్రమాదవశమున బడినను వాటి సత్యస్వరూప నిర్ణయము విద్యార్థులకు విశదపఱచి వారిని దోషజ్ఞుల గావించుట కవకాశముండును. ఆధునిక గ్రంథములలో తప్పులున్నవన్నంత మాత్రముచే బాలురకు సలక్షణభాష నేర్పగూడదను సిద్ధాంత మెట్లు సాధింపనగును?

ఇక పైతరగతుల విద్యార్థులనుగూర్చి కొంతవర కాలోచింతము. వీరిచే నాంధ్రభాషలోని యుద్గ్రంథముల నెట్లును చదివించక తీరదు. ఆంగ్లేయభాషా స్వరూపము నెఱుంగగోరు నట్టిడు షేక్సుపియరు గ్రంథముల నెట్లు చదువక తీరదో, యట్లే యాంధ్రభాషాస్వరూపము నెఱుంగ గోరువాడు తిక్కనాది మహాకవుల గ్రంథములు చదువక తప్పదు. కాని యాగ్రంథములను బోధించు నప్పుడు వ్యావహారికభాష నుపయోగించుటలేదా, అట్లే పరీక్షా ప్రశ్నములను వ్రాయించెదము. తిక్కనకు వేఱుగానొక వ్యాకరణము వ్రాసి షేక్సుపియరు గ్రంథములవలెనే చదివింతుమందురా? దీనికి సమాధానమిది. ఇప్పటికిని, నింక గొన్ని యుగముల వఱకును నచ్చముగా తెలుగులోనే భావమునకైనను సంపూర్ణవ్యక్తీకరణము గావింతుమన్నచో మనకు తిక్కనయే దిక్కు. ఆతడు లేనిచో మనకు గతిగడవదు. అట్టిచో నాయన కొక వ్యాకరణము, మనకు తోడు మనకొక ప్రత్యేక వ్యాకరణము నెందులకు? కాని యాపదమూడు పర్వములలోని భాషతోడనే సర్వవ్యవహారములను నిర్వర్తించుట సాధ్యమాయని పంతులుగారు ప్రశ్నించినారు. సాధ్యమేయని సమాధానము చెప్పుచున్నాను. అది మహాఖని. అందు త్రవ్వినకొలదియు గ్రొత్తక్రొత్త రత్నములు వెలువడుచుండును.

ఏభాషాగ్రంథము చెప్పినను ఉపాధ్యాయులు వ్యావహారికభాషలో వివరించి చెప్పుటలేదా? అట్టియెడ విద్యార్థులు మాత్రము వ్యావహారిక భాషలోననే వారి పరీక్షాపత్రములనేల వ్రాయగూడదని శంకచేయవచ్చును. వివరణమనునది యావిషయము విద్యార్థుల తలకెక్కునటుల జేయుటకు గావింపబడుచున్నది. ఇదికాక యుపాధ్యాయుడు తన సౌలభ్యమును జూచుకొనుచున్నాడు. ఒకవిధమగు ప్రయత్నముచేసినగాని సలక్షణమగు భాషవచ్చుటలేదు. ఆపాఠవివరణ సమయములో భావబోధనమునందు నిమగ్నుడై యతడు భాషానియమముల వంకఁబోక మామూలు పద్ధతిని చెప్ప

వేయుచున్నాడు. పరీక్షాపత్రములు వ్రాయునప్పుడు విద్యార్థి భాషా భావముల నైక్యమొందఁజేసి రెంటికిని సమానమగు విశుద్ధిని గల్పింప వలసి యుండును. ఇట్టి రెండు విధములగు జాగ్రదవస్థలకు లోనైయాతని మనస్సును, చేయియు నేకకాలమున వన్నెదేఱుట కవకాశము గలుగుచున్నది. నియమమేకదా యెందును సాధకులను సన్మార్గములఁ బెట్టునది. మఱియొక విషయము. లక్ష్యము వేఱు సాధన వేఱు. ఎట్టిలక్ష్యమునకైనను బాహ్యాంతరంగికములను ప్రవృత్తిద్వయమొక్కటైన రూపమువొందిన సాధనయవశ్యము నవలంబనీయము. పరమాత్మసారూప్యము మొదలాంగ్లేయ భాషాభిజ్ఞత వఱకును గలయనేకోత్తమమధ్యమాధమలక్ష్యము లన్నింటికిని నిట్టి సాధనముగావలసి యున్నది. అదెట్టి మార్గముగలదైనను చింత లేదు. లక్ష్యము ప్రధానము. ఇందునకు సలక్షణభాష్యలక్ష్యము ఏలయన సమస్త మహాగ్రంథములకు, సమస్తోత్కృష్టభావములకు నదియుపాధిరూపము. సలక్షణభాషలో పొదువబడియున్న మహార్థములను సువ్యక్తము సేయుటకై యుపాధ్యాయుఁడు సాధనారూపమగు వాడుకభాష నే యుపయోగించుచున్నాడు. అట్టిచో విద్యార్థి తనకేలక్ష్యము గలదో యాలక్ష్యమగు సలక్షణభాషయందే తనసాధనా ఫలితములను వివరించినచో త్వరలో నభీష్టము నొందఁగలఁడు. ఇట విద్యార్థులకు భావము లక్ష్యము గాని సలక్షణభాష కాదని ప్రతివాదు లనవచ్చును. భాషాభావములు పరస్పరాశ్రయములుగాన నాయర్థమునందే యిచ్చట వాడినాను. చదువరు లవ్యథాభావన చేయకుందురుగాక! భావమే లక్ష్యమైనను సలక్షణభాషయే యుత్తమమగు సాధన కాఁగలదు ఉత్తమమగుటచే నయ్యదియే గ్రాహ్యమగుచున్నది.

ఇక పాఠ్యగ్రంథముల రచనను గూర్చి యొకించుక నుడివెదను. ఈపాఠ్యగ్రంథములను, వనగా, ఫిజిక్సు, కెమిస్ట్రీ, ఫిజియాలజీ, మున్నగు శాస్త్రముల నిప్పుడు పాశ్చాత్యపద్ధతులలో నున్నరీతిని తెనిగించి వ్రాయుటకెట్టి భాష వ్రాయవలసియుండునని ప్రశ్నించుచున్నారు. సలక్షణమగు భాషాలోననేయని ఖండితముగ సమాధానము చెప్పుచున్నాను. మచ్చునకొక ముక్క చూడుడు. మాగ్నిశయము అని యున్నదనుకొనుడు. మీరు మీ వ్యావహారిక భాషలోననే యీశబ్దమును వ్రాయదలచుకొన్నచో మాగ్నిషియమ్ అని వ్రాయవలసియుండును లేదా తెనుగు ప్రత్యయముచేర్చి మాగ్నిషియము అని వ్రాయవలయును. ఏలయన నిప్పటిలో నాశాస్త్రమున శిష్టులనందగినవారు దానిం గూర్చి సంభాషించు తఱిని శబ్దమునట్లే పలుకుచున్నారు. గనుక వీరి సిద్ధాంతము నొప్పుకొన్నచో నది శిష్టజన వ్యవహారములోనిదై గ్రాహ్యమగుచున్నది. మఱియట్లే యీ శాస్త్రములను రచించినచో, నవి పండిత మాన్యములైనచో క్రమక్రమముగ సాహిత్య గ్రంథములలోనికి నిరంతర జనవ్యవహారములోనికి వచ్చి, యిప్పుడు సహజముగా "ఒరే! కారం రాచినట్లు మాట్లాడుతున్నావురా" యనట్లుగానే "ఒరే పొటాషియమ్ రాచినట్లు మాట్లాడుతున్నావురా" యనుసామెతలోనికి గూడదిగి భాషాస్వరూపమంతయు తారుమారై యీ రూపము

లేకుండఁబోవును. అంతదాక యెందులకు? యిట్టిశబ్దములే వాడవలసి వచ్చినచో నిక నాంధ్రీకరణ మెందులకు? వెనుకటికొక దొరగారు మీ భాషయంతయు నాంగ్ల లిపితో వ్రాసికొన గూడదా యనినాడట దానికి బదులిప్పు డాంగ్లభాష నంతయు తెనుగు లిపిలో వ్రాయుచున్నట్టులు కాగలదు. అట్లుకాదు. తెనుగు స్వరూపమునే నిలుప దలచినచో సాధ్యమైనంత వఱకు మన పూర్వశాస్త్ర గ్రంథములను బరిశోధించి బయటకు దీసి యుందున్న పారిభాషిక పదములు నేరుకొనవలయును అందును దొరకనిచో గొన్నిటిని పండిత వర్యులు సమావేశముచేసి యాయా శాస్త్రవేత్తల సహాయముతో నూతన శబ్దసృష్టిని గావింపవలయును ఇప్పుడిప్పుడే కొన్ని శబ్దములను సృష్టింప గలిగినారు. "పదార్థ విజ్ఞానము" మొన్నగు పదములు గ్రాహ్యములే యగును. ఆగుచో నూతన శబ్దసృష్టికై యే భాష నాశ్రయింప వలయును? సంస్కృతమని ప్రతి భారతీయుడును జెప్పదగిన సమాధానము. ఏలయన ననేక రాష్ట్రము లందు గావింపబడు నిట్టి శాస్త్ర పరిశోధనములను నొకరి నొకరు తెలిసికొన వలయు నన్నచో సంస్కృత భాషయే యాధారము. ఆసేతు హిమాచల పర్యంతము నేక భారత దేశమని చేయెత్తి చెప్పుట కాధార శక్తియైనది. ముప్పది మూడు కోట్ల భారతీయుల హృదయాంత రాళమున నిత్యమధ్యనించుచు మృతభాష యని ధిక్కరింపబడియు నిత్యజీవనమై యుండునది సంస్కృతము. సంస్కృత శబ్దమును, ద్రావిడులు, వంగీయులు నెఱుంగ గల్గుదురు. కనుకనే యిట్టి పారిభాషిక పదము లన్నిటిని సంస్కృతము నందే గావింపవలసి యున్నను. సంస్కృతము గన్న ముద్దుబిడ్డ నలకుణాంధ్ర భాష తల్లికూతుండ్రకు భేదమేమి? ఈరీతిగా నిందును నలకుణాంధ్ర భాషయే గ్రాహ్యముగు చున్నది.

గ్రంథ విస్తర భీతిచే దీని నింతతో ముగించు చున్నాను. చదువరులు నాయభిప్రాయముల యందలి యాదార్థ్యము నెఱుంగుదురు గాక!

---

# సాభిప్రాయ విశేషములు



బెంగాల్ నాగపూరు రైల్వేయందు పనిచేయువారు అనేకవేలమంది షుమారు 15 దినములనుండి సమ్మెకట్టియున్నారు. వారు జంతువులకుకూడ తిండికి సరిపోని తక్కువ జీతములతో ప్రాణముల నిలుపుకొనలేక, యజమానులదృష్టి నాకర్షించుటకై పనిచేయుచున్నారు. కాని యజమానులు, తమ పనివాండ్రకష్టములను దయార్ద్రదృష్టితో విలోకించి, జాలి, ప్రేమ చిహ్నములను జూపుటకుమారు, గవర్నమెంటువారి సిబ్బందులను, తుపాకులను, సహాయ్యముకేసికొని తమ దురభిమాన గౌరవమును కాపాడుకొనుచున్నారు. నేటికాలపు ప్రపంచదుస్థితికి కారణము, దయ, మానవసోదరభావము పూర్తిగ నశించుటయే. ఇంగ్లాండునందు కొన్ని నెలలక్రిందగనే జరిగిన బొగ్గుసమ్మెకిదియే కారణము. లక్షాధికారులగు కంపెని, యజమానులు, చలిచే తిండికి సరిపోక మలమలమాడుచున్న కుటుంబములను పోషించుకొనలేని పనివాండ్రమొఱలు లక్ష్యపెట్టరైరి. బీదవాండ్రకు, అబాధలకు, యిట్టి విషమస్థితియందు యజమానులను లొంగదీయుటకు, అందరు ఏకమై సమ్మెకట్టుటయే. ఈసమ్మెజ్వరము ప్రతిదేశమునందును వ్యాపించియున్నది. నవీననాగరికత, యంత్రకర్మాగారము యెంత గొప్పవైనను భాగ్యవంతులకు నాస్తిక్యత నిచ్చుచున్నవిగాని, పేదమానవ సంఘమునకు క్షేమదాయకములుగా లేవు. మానవసౌఖ్యమునకు కావలసినది ధనము ముఖ్యముకాదు. దయ, సోదరభావము త్యాగము యివియే ముఖ్యసాధనములు. అమెరికాలో నద్భుతభాగ్యవంతుడగు ఫోర్డుగారు తనకర్మాగారములందు లక్షలకొలది పనివాండ్రచే పనిచేయుచున్నారు. కాని కన్నతండ్రివలె వారిపిల్లలకు స్కూళ్ళను వైద్యశాలలను, మంచియారోగ్యమైన వసతులను మొదలగువాటిని స్వతంత్రఖర్చుపై నిర్మించి ప్రపంచకములో నితరయజమానులకు మార్గదర్శకులైయున్నారు. ఈమహాత్రాంశమును ప్రతియజమానియు గమనించి త్వరలో మానవసంఘమునందలి యిట్టి వ్యాధులను నిర్మూలించి దేశక్షేమమునకు దోడ్పడుదురుగాక.

చీనాయుద్ధము

ఐరోపామహా సంగ్రామమంతమైనప్పటికి ప్రపంచమునందు విశ్రాంతి లేదు. యూరపులో నణగిపోయినదనుకొన్నను అమెరికాయందును చైనాయందును మరల అశాంతి మూర్తీభవించినది. అందులో చైనాయందు వికృతరూపమును బొందుచున్నది. బ్రిటిషువారు అమెరికావారు, ఇటలీవారు, తమతమ యుద్ధనావలను, సేనలను యాత్మసంరక్షణార్థము షాంగైరేవునకు చేర్చియున్నారు. చైనాదేశస్థులు, ఇంగ్లీషువారు తమ రాజ్యపరిపాలనమునందనవసరమైన జోక్య

ము కలుగ జేసికొని యుండుటకు పట్టుదలతో నున్నారు. జపాను కూడ తెల్లవారితో నేకీభవించు సూచనలు కలవు. ఇట్టిస్థితిలో చైనాలో నంతః కలహ మెక్కువగ నున్నది ఇది చైనాదేశీయుల గొప్ప పొరబాటు. ఏ దేశమైనను ఒకే కాలమున రెండు పనులు చేయలేదు. అట్టిస్థితిలో స్వదేశమును జక్కపెట్టుకొనుట, పరదేశీయులతో హక్కులకై పోరాడుట మిక్కిలి కష్టము. ఇప్పుడు స్వతంత్రాభిలాషనల ప్రతిదేశస్థులును, చైనాయొక్క యాశయములయందు స్వానుభూతిని జూపుచున్నారు

ఇండియా గవర్నమెంటు వారు ప్రజల సమ్మతిలేకయే, ఇచ్చట సేనలను చైనాకు పంపియున్నారు కారణమే మన ఇండియా చైనాకు దగ్గరగానున్నది చైనాలో కూడ యిండియనులుగలరు వారి ప్రాణములను గాపాడుటకు కూడ మన సేనల పంపబడినవియని చెప్పుట న్యాయముగాదు. ఆ సేనల ఖర్చువరు భరింపవలయునని ఎసంబ్లీలో ప్రశ్నింపగా, ఇండియా పనిమీద కాదు గనుక బ్రిటీషువారే భరింతురని సమాధానము చెప్పియున్నారు. భత్యపుఖర్చులిచ్చి నంతమాత్రాన, భారతసేనలు, యంత్రములవలె వ్యక్తిత్వము లేక, బ్రిటిషువారు చెప్పినట్లు పరదేశములకు బోయి న్యాయాన్యాయ వివక్షతలేక యుద్ధము చేయవలసినదేనా? ఇంక భారతదేశమునకు స్వాతంత్ర్యమెక్కడ? రాజ్యాంగ విషయములందు భారతీయుల యభిప్రాయమునకు తావేది? "భారతీయులు అస్వతంత్రులు, చట్ట నిర్మాణ సభలు బూటకములు" అని చెప్పువారి మాటలయందబద్ధ మేమున్నది?

సక్లత్వాలాగారు పార్శీకులస్థులు. పార్లమెంటుమెంబరు ఈయన "కమ్యూనిస్టు అనగా మానవసంఘ సేవకులు "కమ్యూనిస్టు"ల ముఖ్యయాదర్శము. జాతి మతభేదములు లేక, బీద, భాగ్యవంతుడు అనుభేదము లేక, తెలివిగలవారు, తెలివిహీనులు అను భేదములేక, సర్వప్రజలు ప్రాపించిన సౌఖ్యమున కర్హులు అని వీరుచెప్పుదురు, సక్లత్వాలాగారు యిప్పుడు మనదేశమునకు వచ్చియున్నారు. వీరు వచ్చినకారణము మనపరిస్థితులను గ్రహించుట కొరకే, వీరు రాకపూర్వము "కమ్యూనిస్టు, అనగా నొక విప్లవకారుడు యనెడి యభిప్రాయము చాలామందికి కలదు వీరుప్రచారము సం చేసిన యుపన్యాసములను బట్టిచూడగా, వీరికి మానవులన్న యెంతగౌరవమో, బీదలన్న ఎంత విశాలహృదయము జాలిగలదో మనకు విశదమగును. వారి పూర్వజన్మకృతమనెడి దుర్భరదుస్థితినుండి బీదలను ప్రోత్సహించుటయే వీరి జీవితపని. బెంగాల్ - నాగపూర్ సమ్మె గురించి మాట్లాడుచు సక్లత్వాలాగారుచాలావిచారముసుబొందిరి

సంపూర్ణము,

పుష్పమాల.



Lakshmi Art, Bombay 8. తాకేసరీ మాయు పుష్పసంతతులఁ దెచ్చి ప్రియయనూతాన నలపుకపోంచుటుండ
లక్ష్మీటు పటంబెట్టి కట్టిన యలరుదండ యేల గొనియుంటివమ్ము గోపాలకృష్ణ !
కసుబాటయాల " కవిత " ను

# భావకవి

— విశ్వనాథ సత్యనారాయణ

ఊహాదిగంతభూములను నేమిపనో తిరుగాడుచుంటి నా
యూహలుగూడ మందపవనోర్మ్ములతో విచరద్విహంగసం
దోహముతో మొగిళ్ళగమితో మెలమెల్లన పొంకులాడు నా
శాహతి ఱెక్కలార్చ గగనాగ్రతలంబున కంటపోయెడున్

నాయెద మందమందగమనంబుల చూపెడు నొక్కమాఱు మా
లాయిత మల్లికాసురభిళత్వము చూపెడు నొక్కమాఱు క
న్దోయితుదన్ ప్రశీతల మనోధృతి చూపెడు నొక్కమాఱు నా
పై యిది యేమొ గాలిపొరమాదిరిగా నవునట్లు తోచెడున్

ఈగగవంపుటెల్లల చరించెడు బాలవిహంగకోటి కం
టే గిలుబొప్పు కాంతులు గణించెడు లేతమొగిళ్ళ చాలు కం
టే గొనయంబులాగి బిగియించిన వింటవిదల్చినట్లు నా
శాగతి పోయెడున్ బరవసంబున నాయెదలోని భావముల్

కొండల నడుమ భగ్గున సుళ్ళుతిరుగు చాకసము ముట్టెడు కొండగాలినౌదు
కొండలంచులరాళ్లు ఘూర్ణిలంబడి పోయి పడఁబోసికొను సెలవాగునౌదు
వేనికిఁగనిపించరాని యేకొండ గుంపులనో యొకడవిలో పూవునౌదు
పెనుగాలి విరుగదోసిన గుమ్ముల వెదుళ్ళ లోయలలో వింతచాయనౌదు.

# విషయసూచిక

## పటములు








సంపుటము 1 } ఏప్రియల్ { సంచిక 4

# కుక్కపిల్ల

వేలూరి శివరామశాస్త్రిగారు (శతావధాని.)

ఆ. ఇండ్లు దొడ్లు లోని వెల్లను గాలించి కుక్క యొకటి దాలిగుంట తనకుఁ
దగిన దంచు లోన తలఁపోసినదియ కాఁబోలు నందుఁ బురుడు పోసికొనియె.

ఉ. శ్రీరమణీయమౌ తనువు సింగపు మోమును నూర్ధ్వపుండ్రమే
పారెడు చంద్రనిశ్వాకల యట్టి కనుల్ పులి చార లేపులా
గోరులు కల్గు దాని చిరుకూనను గాంచుచుఁ బెద్ద లెల్లరున్
"భైరవమూర్తి" యంచు నొక నామము పెట్టిరి మంచిరోజునన్

క. అల కుక్క కూన వచ్చుటఁ దిలకించిన యంతనంత దేవా! నీ విం
దుల నెలకొంటి పటంచును గలయుగ ననుకొంటి హృదయకమలమునందు!

ఆ. పది దినాలలోనె బలిసి యొల్ల కబోది జ్ఞాననేత్ర మార కరఁగి కరఁగి
కరఁగి రెండు కనులుగాఁ బరిణామంబు చెందె నొక్క వెలుచేవ తోడ.

ఉ. కన్నులు లేనివాఁడు తనుఁ గాంచిన తల్లి సుధాఘటంబుగాఁ
గ్రన్నన జ్ఞాననేత్ర మది కన్నులు కాఁ దవకన్నఁ బెద్దదై
యున్నటు వంటి జంతువనియున్ శునకార్భక మెంచె జ్ఞాన నీ
కన్నులుగాఁగ మీరినను గల్గగఁ బోలును సృష్టి భేదముల్

ఉ. వాచవి పొంటెఁ గానఁబడు వస్తువు లన్నియు నాకు నేలమా
చూచును గోఖు లుండుటకుఁ జొప్పని త్రిప్పును దల్లి పొట్టలో
డాఁచిన యిల్ల దున్నదని తాఁ గనఁబోలును దూఱుఁ దల్లి పో
తేచినఁ జంటి నంటికొని లీన మగున్ శునకార్భకంబహో

సీ. ఆఁకలియైనప్పు డాకాశమును మ్రింగ నెంచఁ బోలును మోర నెత్తుఁ బైకి
ఎవరేని దాపుగా నేతేరఁగా మీఁదు దాసుఁడ ననఁగఁ బాదంబు పట్టు
మహిని గారాకులు మరమర లాడంగ సింగంబు వోలె గర్జించు నెగసి
ఆది వరాహంబు సాపోసనముఁ గొనఁ దలఁపఁ బోలును నేఁ దవ్వు గోళ్ల

గీ. ఆఱఁగట్టిన వలువలయందుఁ గఱచి క్రిందఁ బడి మీఁదఁ బడి దలక్రిందులగుచు
మాటి మాటికినిం జెఱ లాటలాడు నక్కజము పిక్కటిల్ల నాకుక్కపిల్ల

ఉ. దానిని గాంచి చాల సరదాపడి ప్రీతుడి తోడఁ బెంచఁగాఁ
బూని గళంబున న్నిగళముం దగిలింపఁగఁ గోరి బస్తికిన్
నేనొగిఁ బోవునప్పుడు గణించుమనుం గొని తెచ్చి మెల్లనా
కూనమెడం దగుల్పఁగను గోరి యొకించుక దాని డాసితిన్

మ. తన స్వాతంత్ర్యము పాడుచేయు ననుచుం దాసుంత యేగిన్ మనం
బున యందా శునకార్భకం బెఱుఁగఁగాఁ బో కల్లనన్ శృంఖలన్
దినుబండాలమునాఁగ భావననో జాతిస్వస్వభావాననో
కొను, నాకున్, విడిలించు, గీఱు, నములుం గొంపోవు నట్టిట్టుగన్

చ. "అసలు శరీరమే యొక మహానిగళంబగు దానిపైని నా
యసనిగళంబు కొండొకటియా మన భైరవమూర్తి కంచు మా
నసమునను దలంచి యయినన్ మెడయందు దగుల్త మొట్టులన్
మసలునో చూతమంచు మది మూఢుడు గట్టితి దాని నెమ్మెడన్

# కుక్కపిల్ల.

ఉ. కట్టిన యుత్తరక్షణ మెగాదిగ జూచి నఖాళి శృంఖలా
పట్టికబట్టి లాగిన ఖపాలిక దానను జుట్టుకోగన
ట్టిటగు చుం గుదియో మొఱ్ఱో కయియా కుయి మంచును నేడ్చెనక్కటా
కట్టినవాని చేతులకె కట్టి కనుంగొనబోలు దద్వ్యథల్.

సీ. ఆది కిరాతుండు వేదకుర్కురములఁ గట్టినాఁడా యొక్క గడ్డిపోఁచ?
నటుకనాథుండాత్మ వాహనంబే యగుగాక! యెన్నండేని కట్టినాఁడె?
కట్టఁగా లేదొకో గళనిగళము లేక యల్ల దత్తాత్రేయుఁడను మునుల్!
గొలుసును గట్టెనొక్కొ మహాప్రస్థాన దశయందుఁ గుక్కకు ధర్మరాజు!

గీ. కట్టఁగావలెఁగాక త్రికాల శాశ్వతానురాగంబు చేతను గానినాఁడు
అఁగఁగాఁగలవాళ్ళ యొక్క హాయ యేని బధ్యమానంబులుగ్ మఱి బంధనములు!

వ. అని తలఁచి

ఉ. దాని స్వరాజ్యముగ్ మఱల దానికి సర్వము ధారవోయు నా
కూన లేటాలునన్ విసిరి కొట్టిన చెండను బోలె దూరభా
గానకుబోయి నిల్చి యపకారిని గాంచి మొఱుంగు రీతిగాఁ
దాను మొఱింగె, నాసుకొని దల్లి వెసం జనుదెంచి యంతటన్

ఉ. పూనినకూర్మిఁ బిల్లలకుఁ బ్రొద్దున లేచినతోఁ దలంటగా
నూఁచియు రాచి మేనునికి నన్నగ నొక్కఁగ వానిఁ ద్రిప్పనాఁ
గా నొక కందినూతనముగాఁ బ్రసవించిన సంతుతో డనా
కూనన ఖిన్నవముందులను గుర్తుర దంట మకంను జాటగన్

ఉ. అల్లన రాహాయూధమున యందుల నడదము లీనుచున్న యా
పిల్లలగాంచి చాపలము పెక్కువకానల కుక్కపిల్ల తా
నల్లన ముందుకాలొకటి యోగాలకు నాలకుఁ జాఁపి చాఁపి యా
పిల్లలలోన తాను నొకపిల్లగ నై చనియెం దటాలునన్

మ॥ మన పెద్దల్ తొలినుండి వైరములతో మన్నారుగా కీశయున్
మన మావైరము మాటరున్ మఱచుచున్ మైత్రిన్ విడంబించి యి
మ్మును జేకొందము నావరాహశిశువుల్ మున్ముంద యాకుక్కపి
ల్లను మూచూచుచు దీర్ఘ ఘర్ఘర సమాలాపంబు చేసెన్ వెసన్

ఆ॥ అల్లకుక్కపిల్ల యాపందిపిల్లల కూడి కపుకు చాలఁజూడనాయె
అలలు లోనెలోన యణగిపోయినయట్టి యంతరాత్మవిభవ మట్టువోలె

ఉ॥ నిన్ననుగాక మొన్న నెజనించినవీపసికూన లేకుఱుం
గున్ ? నిజమాంససారభము గ్రోలినచో శునకార్భకం బొగిన్
పున్నినిగూడఁ గ్రోలకయమానునొకో యని పందితల్లి తా
వెన్నను ద్రిప్పిముట్టె జడిపించుచుఁ బిల్లలఁ బాయఁజేయుచున్

క॥ ఆతఱిఁజాతురి జాతవ్రాతము మూచూచుచున్న భైరవమూర్తిన్
భీతిలఁగాఁ బొడిచిన తలజాతివిరోధంబు తాను సామాన్యంబే ?

క॥ సూకరి పొడిచినయంతట సూకరముం బొడిచె నల్లశునకార్భకమా
తాఁకులచే దేహగృహ ప్రాకారం బప్పుడెదాఁటి పఱచెంగట్టా

చ॥ పొడిచిన తావునం దలఁతిపుండునుగాని మఱేమి చిహ్నముం
బడగను లేదు పట్టుమని బాధయు లేదు వికారరూపమె
క్కడయును లేదు మేనుకసుగందదు నిద్దపునిద్రఁ జెందున
ప్పుడునునఁ గుక్కపిల్ల యిలపానుపునంగనుపట్టె నామెడన్

ఉ॥ అక్కరణిన్ జయంబు తనకబ్బిన మోదము పెల్లు చేతనో
యెక్కడఁ కుక్కతల్లి కడునేడ్తెఱవచ్చునొ యన్న భీతినో
యక్కడ నొక్కఁడో నిముసమైనను నిల్వక యల్లపందినల్
దిక్కులు చూచుచుం జనియెఁ దిన్నగఁ బిల్లలు వెంబడింపఁగన్

శా॥ కాకింబోలెను ధర్మపిండమును వాఁగైకోఁగ నాడాడకున్
రాకల్ పోకలు చేయుచుండి నడుమన్ స్వాంతం బోగింగూన పై
దూఁకం దోడనె చేఁపురా ముగమునందుం బ్రేమపుష్పింపఁగా
వీక్షన్ వచ్చెను దల్లి నాకనుల నుండిన్ వచ్చె నీరత్తఱిన్

శా॥ ఏకాలంబును బెంగబెట్టుకొని తన్నీక్షించినంతం బయిం
దూఁకన్ వచ్చెడి కూన కానిపట్టిలో దొంగుండెనేలా ? యటం
చే కాలోచనతో బెనంగొను ముఖం బిట్టట్టులన్ వంచుచుం
దోఁ కాడించుచు నిల్చె నాహృదయముం దోడ్తోడ నిల్చెన్ రహిన్

ఉ॥ ఆమెయుఁ గొంతసేపరిగినంతట నయ్యడిపిల్చురీతి గా
బామ నె మేలుగోల్పఁ దనపాదము జాపుచుఁ గూనకాలిపైఁ
బ్రామెను నంతకున్ మెలకువం గయికోమిని నేటవాలుగా
మోమును వంచెఁ జూచెనటుమోమిటు మోమయి కొంతసేపొగిన్

శా॥ ఆ కల్లోలత నేక రీతిఁగను నే నాకూన వృత్తాంతముల్
సాకల్యంబుగఁ జెప్పి దాని వెతలో సంగోరు పాలొందఁగా
నాకాంక్షించితి గాని యక్కటకటా హా దైవమా ! దుర్విధీ
నాకా కుక్కల భావ కొంచెమయినన్ రాదేమి నే జేయుదున్

శా॥ మోర్విల్ నిచ్చినతల్లి దాపరిగియున్ మూచూచి మూచూచితాఁ
గాలుంగాలును ముక్కుముక్కు నికనింకంగన్నుగన్నక్కటా
కీలుంగీలు పరీక్ష చేసి మిన్నుల్ ఖేదంబు నాదంబునం
దోలాడంగను వేగమింటి మొగమై యుద్రిక్తమై యేడిచెన్

కం॥ అలకుక్క యేడ్పు సృష్టి ప్రళయంబుల నట్టనడిమి భాగమునందున్
గెలువఁబడి మృత్యుదేవత సలయంబుగఁ బాడు పాటచాడ్పున నొప్పెన్ ॥

కం॥ తెచ్చినవాఁడను దేనే తెచ్చితిఁ దొలుదొల్తఁ గొంత తిరికానది గా
వచ్చును మెడలో గొలుసుల్ గ్రుచ్చక పోయితిని మృతిని గూర్చితి నకటా॥

ఉ॥ 'ఇంకను నాకు నీ గొలుసి దేలకొ దీనిని జూచుచుండఁగా
జంకగు" నంచు నెంచిపయిఁ "జాలును జాలును లేనిపోని దుః
ఖాంకము తెచ్చికొంటిఁ గటయంతయు లెంతటి నాకి కేనియున్
బొంకగునే? యటంచు నొకబోధను నొందితి నంతలోపలన్ ॥

ఉ॥ కుక్కకు నట్టిబోధ యొనగూడక పోయెను బాష్పపద్ధ యా
చక్కని యింటి నెట్లు నెనఁజూఁడి నిటారుగ నిల్వఁ బెట్టఁగా
నక్కిలిఁ బట్టివైత్తు; బంతట గుండెలు క్రుళ్ళిపోవఁగా
నక్కటయేడ్పు నాపుకొననౌనొకొ ! యేరికి బుత్రశోకముల్ ॥

ఉ॥ ఈనినకొత్తరోజులను నేయితరంబగు జంతువేనియుం
గూనకుఁ గీడు చేయఁగను కొంకును నాఁకటఁ బాధ సైతముల్
లోననె మ్రింగి రక్షణము నం బచరించెడు తల్లియక్కటా !
యానిమిషాననే శుకమహాముని యమ్మోడినే తలంపఁగన్॥

కం॥ అలకుక్క యేడుపుల విని పులుఁగులును బంధువులను బోలిక వెతచే
నెలుగుపడ నేడ్చనోయన నలబలముగ గూసె సంజపక్షులనంతన్ ॥

సీ॥ సూర్యుఁడపరాబ్ధియందుమునుఁగ జొచ్చినంత గొడ్లగాచెడు పైలాడు కుక్కకూన
కాలిఁ గైకొని దూరభాగంబులందుఁ బారవైచెను దల్లితాఁ బనవుచున్న॥

ఉ॥ కూన యదేడనిన్నదియొకో పసిపట్టఁగఁబోలుఁ దల్లి య
ద్దాని నలుంగకుండఁగను దానటొ కైకొనివచ్చి కొంతదూ
రాన బరుండఁబెట్టుకొని ప్రాణముపోసెను చూపుచూచు నే
మానవుడేని దానికినిమానుగ వ్యాఖ్యయొనర్ప లేఁడెటుల్॥

గీ॥ నేనుగూడను నప్పుడద్దానికనులుచీల్చికొని వచ్చుచున్న యాశ్రితములకును
నన్నులో తమ్ములోకాని యగు కటాక్షములను బరఁగించి కనుఁగొంటిమోమువంచి

సీ॥ దానిచూపునను నిద్దంపుసంజీవనౌషధి రసంబదియుండఁజాలునహహ ।
పడియున్న యలకుక్కపసికూన వెంపుకొల్ జేవకొలందిగా లేచినట్లు
ఊర్పుపిట్టార్పుల యునికిచే నిరువంకలలవోకఁ గ్రిమ్మరనాడినట్లు
అరమోడ్పుకందోయి యుల్లనల్లనవిచ్చి కనునట్లు నాకును గానిపించె॥

గీ॥ వెనుకకాళ్లనువిదిలించి వెన్నువిఱిచి లేచి యిఁకఁదల్లిమూతి మూచూచునంచుఁ
దలఁచి సంతోషమెంతయుఁ దల్లడింపఁబలికితిని గూనబ్రతికెరా బ్రతికెనంచు ॥

శా॥ నా సంభావణమాలకించుచును జెంతంబొల్చువా రౌర! నీకీ
సంభ్రాంతియిదేల? చచ్చినది తానెందేని జీవించునే?
యీ సంపత్తియుగూడ నిల్వదిఁకఁజుమ్మీ! కుళ్లి కాకాళికిన్
గ్రాసంబౌమరి పూతిగంధియయి వీఁకన్ ముక్కుమూయించెడున్ ॥

కం॥ అనిపల్కిరంత నాకున్ మనమునఁదజ్జీవితాశ మాయంబాయెన్
గనుపట్టినదియుఁ దత్క్షణముననే యొకప్రాతఁశవముపోలిక నకటా?

కం॥ మేమాడుమాటలర్ధము కామి నెయ్యుంయయున్ నిజంబుకాఁబోదనియో
యామాతమాత్రిమరయుట తా మానఁగలేదు నిశ్చితంబగు ప్రేమన్

ఉ॥ విచ్చినకన్ను లెంతయును విచ్చినయట్టులె చూచిచూచి మే
మెచ్చటివారమచ్చటికి నేఁగఁగగొడ్లనుగాచువాఁడటుల్
వచ్చియుఁగూనకాలుగొని లాగుచురక్కసుప్పలోనికిం
బుచ్చెను సారమేయి మినుమోరయి బిట్టుమొఱింగె నత్తరిన్

గీ॥ నాఁటినుండియు నెంతయునేఁటివరకు రక్కసులరుప్పలందులఁగుక్కమొరుగుఁ
లోకులందరకును మఱికాకపోవుఁగాక నాకును వినఁబట్టగా దొడంగె

శా॥ ఏకాంతంబునఁగుక్కమ్రోడ్పువిను నాకీరీతిఁ దోఁచెన్: కటా
లోకుల్ పల్కిన మాటపట్టుకొని నేలోలుండనై చచ్చెనం
చాక్రందించితిఁగాని తల్లివలె నేనత్యంతవిశ్వాసముం
జేకోఁగల్గితి నేని యాకుణమతా జీవించి నన్ నాకదే?

# రూపము.

కొలచలమ కృష్ణసోమరాజులుగారు M. A. L. T

ద్వితీయసంచిక తరువాయి

స్థితికి తేజము రూపము; బుద్ధికిప్రజ్ఞ; వర్ణములకు శ్యామము; దినమునకుషస్సు; జన్మకు బాల్యము. చీనులకు ముద్దయడుగు లొక యందము. ఆచారవిషయము లనాచారము చేతనే రమ్యములు. పాపమును బట్టి పుణ్యము రూపము. ఈ యన్యోన్యము లేక రూపమే లేదు. ఇట్లు కురూపము గూడ నొక రూపము. సర్వ వస్తువులకు గుణమె రూపము. ప్రార్థనకు ఫలము రూపము. రూపము గలవాని రూపమె రూపముగాదు. విరూపముల వైరూప్యము గూడ రూపమే. స్వభావము సర్వత్ర రూపము.

స్వభావము సౌభాగ్యము. సామాన్యులు చీరికలు కట్టుటతప్పు. తెలిసి గట్టినను దెలియకయైనను దప్పేయగు కాని నీచదశ కివి సహజమై, యుచ్ఛ్రయందు గూడ నొక యందమగుచున్నవి. ఇట్లు సహజము బలె సంగతము గూడ రూపము. శుష్కదరిద్రునికి జీరికలు సౌభాగ్యము గద! ధన్యులగు తాపసులకో యందె విరాగము. ఉభయతః యవి రూపమే, మహితులు స్వతంత్రులగుటం బలె మహాత్మ్య కరతంత్రులు గానుంటయు సొగసు. ఈశ్వరునిసొగసిట్టిద.

ధర్మమునకు రూపము సత్యము. సత్యమున కనుష్ఠానము. సర్వమునకు నిచ్ఛ, ప్రేమ యొక మహారూపము. కాకి బిడ్డ కాకికి యందము. తల్లికి బిడ్డయందము.

తల్లికి పెద్దవానికన్న బాలు డాగు బసిపాప యెక్కువ. పారతంత్ర్యమున కిట దైన్యమే రూపము.

బాలునికి వికృతములు నొక చిత్రము. ఇట చిత్తమే రూపము.

జీవము రూపము. మృతి నిరూపము మన యిచ్ఛయే దీనికి హేతువు. కనుక మన చిత్తమే నిజమైన రూపము. సృష్టి యందాత్మకన్న నెక్కుడు రూపము లేదు. స్త్రీ గాని పురుషుడు గాని ఎవరికి వారతి సుందరులు. వానరమునకు వానరము, కాకమునకు గాకము రూపము.

ప్రేమ రూపము విచిత్రము. గృహాగతుడైనవానికి దల్లి కడుపుచూచును. అన్నమేమైన దినెనో లేదో! భార్య వీపు నిమురును. మూటలు ముల్లె లేమి దెచ్చెనో?

వక్రములకు వృత్తము రూపము. కష్టాత్ములకు సుఖము. ఇట వ్యత్యయ మొక యందము. కాని యిట్లనిన మన ప్రేమ గౌర

నము లెన్నో భాసములు. నవప్రియత్వ మొక వ్యసనము; రుచి యొక జాడ్య మనవలె.

ఆకృతులకు నృత్తము రూపమంటిమి. చూడ ముచ్చటగ నుండును. మూర్తికి రేఖలె రూపము; దిక్కులకు బుజువు; నియమములకు నీతి. తా వలచినదె రూపము అన్యముగాదు. మన రుచులు, జాడలు మన వంటివె. ఫలమునకు గష్టము రూపము; సంపాదనకు స్వేదము; జన్మకుబుణ్యము; విచారములకు ధర్మము. చిత్రము! కంటకము లేని కేతకి లేదు. ఉండినచో గ్రియక [illegible] సాధువు.

సృష్టికి రూపమే జీవము. రూప మానందము. దానికై ప్రాణము [illegible]ము. మృత్యు భయము కన్న రూపానుభ[illegible]కుడు. లేకున్న బ్రాణము [illegible]మగిదె! రసికునికే రూప మానందము. రసహీనునికి రూపము లేదు; రక్తియు లేదు.

## నమస్సు

నేలటూరి అనంతాచార్యులుగారు (యువకవిమండలి)

---

పోఁడిఁ భూరి హార్దకందళముఁ బూన్చెదు నీ దర వీక్షణక్రియ
బారసిన వేళ- నైహిక రసాహా విధురమ్మగు నామనమ్ము ని
స్ఫురితసుధాకర ప్రభలవాల్చఁ బ్రియుగ్గుఁడ నైతి దానికొం
దరఁగల దాఁగుటుయ్యెల జదల్చినయించు సుమాలనేరుచున్.

అవిలోకనసరణి నన్నావరించి ప్రణయ సౌరభమును ముంచివైచె! దేవి!
అసుఖాతిశయంబ నిరంతరంబుగాగ భీతిలుచుంటి మాంగళ్యమ్ముకొలఁదు!!

క్షణకాలమున భవద్వీక్షణములు స్పర్శనము సేత! చంచలము [illegible]
ప్రణయశిఖి వెలుఁగు తేటలు ఘృణానిదాన విధినన్ను గిలించుటలున్ ॥

అవిస్పందించు హృదంతమంజిమము సందాకృష్టమైనట్టి నీ
నవలావణ్య వపుర్విలాసము- తదన్యంబేది. యుష్మన్మనో
భవదామోద కషాయితంబగు నన జీవస్వామ్యమున్ గూర్చు నీ
యనలోకంపు టొయ్యారమందె యనుభావ్యత్వంబు దక్కుంచుదిక్

తెనాలిరామకృష్ణ కవిచంద్రుని

# పాండురంగ మాహాత్మ్యము

కవిత

అవ్వారి సుబ్రహ్మణ్యశాస్త్రిగారు (శతావధాని)

ఈకవి తన యనుభవములో గన్పట్టు వానినే ఉత్ప్రేక్షలయందును ఉపమలయందును ఆరోపములు మున్నగువానియందు సొంపుగా నుపయోగించుచుండును.

ఉ॥ ప్రాసంగు విత్తువంటి నెఱపాలు
కాలంబునఁ బుట్టి

ఇందు బ్రాసంగు వన్ను వడ్లరకముల లో శ్రేష్ఠములైనవని తన దేశమందలి జనుల లోని వాడుకను దన కవితలో జేర్చినాడు.

"తరుణీఫాలంబు చవితిచందురుఁడు వేశ్యానుచర్యావాక్ఛ్రీ భ్రాంతి పదిద్రుమునయ్యె."

చవితినాడు చంద్రునిఁ జూడఁగూడదని లోక ప్రసిద్ధి.

సీ॥ కనుగట్టి గాంగేయగర్భు డాగురుమూత
లాడించి వత్సాపహరణవేళ
అల మండలలోన శైలమెత్తెడి పూన్కఁ
గేలిమై కందుకక్రీడసల్పి
పాటించెఁ గంబాలయాట రాసక్రీడ
నాభీరభీరు మధ్యాంకపాళి
వెలయించె యుష్ఠెపు విహరణంబుల
గాధిఁ రాజకింకర శిరోరత్నరాజిఁ

గీ॥ దన్ను బిల్లాడె నంగుష్ఠ దళితసర్ప
తను సుదర్శననామ విద్యాధరేంద్రి
కఠిన జఠరస్థలమున నగ్రజుడుదాను
నందసూనుండు బృందావనంబునందు

ఇందు— బ్రహ్మదేవుడు గొల్లపిల్లల తోగూడ నాల మందల నపహరించినప్పుడు తానే గోగోపబాలకాకృతియై శ్రీకృష్ణుడుండ బ్రహ్మ యాశ్చర్యమున జూచినపుడు తిని డాఁగురు మూతలాడటతోఁ బోల్చె

౨ గోవర్ధన శైలమెత్తి పట్టుకొనుట బంతియాటగా భావించె

౩ రాసకేళిని నాలుగు స్తంభాలయాటయనె.

౪ మద్దిచెట్లనందున తోసిపుచ్చుకొని పోయి నలకూబరమణి గ్రీవులకు శాపవిమోచనము చేయుట యుయ్యాలయాటగాఁ జెప్పె.

౫ సర్పరూపుడైన విద్యాధరునొకని నొక్కి తన్నిన నెగరగొట్టుట తన్ను బిళ్లాటగా రూపించెను

ఇవియన్నియు స్వయముగ దన యనుభవములో జూచి తీసుకొనిన యంశములే

కాని గ్రంథములు చదివి పూర్వకవి కపోల కల్పితములలో నుండి తీసికొనబడినవి కావు. కావున నివి కవియొక్క ప్రకృతి పరిశీలన స్వాతంత్ర్యములనుఁ బ్రతిభా విశేషముతో గూడఁ దెల్పుచున్నవి.

"నిగమ శర్మాభిధానంబు నేతిబీఱ
కాయయును బోలెనయథార్థగాథఁదాల్చ"

వేదములలోఁ జెప్పినట్లు ధర్మమార్గమున నడువని నిగమశర్మ పేరర్థము లేనిదయ్యె. ఇట్లవయవార్థము సరిపోకున్నను రూఢిమాత్రముఁ గలిగియుండెడి రూఢపదములు సంస్కృతాంధ్రములలో బెక్కుగలవు. ఐన నవియెల్ల శబ్దప్రయోగౌచిత్య కోవిదుఁడైన మనరామకృష్ణ కవికోకిలమునకు రుచించలేదు. ఆబాలగోపాలముగ ఆంధ్రదేశమున వాడుకలో నుండిన "నేతిబీఱకాయ" యాతని కుశాగ్రీయ ప్రతిభకు యుక్తముగ దోచినది.

"అంతం జుక్కతెగిపడిన వడువున
నెక్కడనుండియో యాకస్మికంబుగ నింటి
కింజలిదివాటకంబు గుహవంజనుదెంచి"

ఇందుఁ "చుక్కతెగిపడుట" యుత్ప్రేక్షలోనికిఁ దీసికొనఁబడినది. జగమున బుట్టిన వారికందఱకు నాకసంబున నక్షత్రములు రాలుట యనుభవగోచరమే. అది యద్భుతముగను సొంపుగను అతర్కితోపతనముగను చమత్కారమొసగెడిది. దానినిక్కడ నిగమశర్మ రాకరాక యింటికివచ్చుటను త్ప్రేక్షతోఁ దెల్పుటకై చేర్చినాడు. ఇదియు స్వతంత్రదృష్టిలేని గ్రంథకర్త కబ్బదు.

గడుసువడి విప్రతనయుఁడు
నడికొరిచి వంకపరక చాటుఁ మానక

ఇచ్చట "వంకపరకచాటు" అనుపదము చమత్కారమొసఁగునది. చాటుచాటుగా దుష్కార్యములు చేయుచుండు నిగమశర్మ పెద్దలు శిక్షించినకొలది తెగించి బహిరంగమున దుష్కార్యములు చేయనారంభించినాడు అనిచెప్పుటకు ఈలోకోక్తి వాడఁబడినది. వంకరపుల్ల నడ్డముపెట్టికొనినంత మాత్రమునఁ దనకు మఱుఁగు కలిగినదనుకొనువానివలె దనదుశ్చరితము దాగకున్నను లోకమునకు వెలిచి రహస్యముగ దుష్ప్రవర్తియగు విప్రసుతుఁడా వెఱపునుగూడ మానెననెడి యింతయర్థమును లక్షణామూల ధ్వని మర్యాదతో నీమాట దెలిపెడి.

"తాత ముత్తాతతండ్రులు తరతరంబ
చీమవలెఁగూడఁబెట్టి యార్జితముసేయు
విత్తముడిపోయె, దత్కారాయత్తమగుచు
నురగదష్టుని మేని నెత్తురునుఁబోలె"

ఇందుఁజీమ కూడబెట్టెడి పద్ధతి సర్వలోకవిదితము. దానిఁ జేకొనుటచే వివక్షితమైన ప్రకృతార్థవిశేషము సవిశేషముగఁ దెలియవచ్చెడిని. సర్పదష్టుని యుపమానము స్వీయముగఁ బ్రకృతి పరిశీలన ప్రాప్తిచే సంగ్రహింపఁబడినది.

"దినవెచ్చమునకునై తనమేనఁగల
సొమ్ము, కొడుకబద్నింటఁ గుదువవైచు."

దినవెచ్చము, బద్నింట్ అను రెండుపదములును వ్యాకరణ నియమము నుల్లంఘించినవయ్యును, సిద్ధిర్లోకాచ్ఛాస్త్రాచ్చ, అనునభియుక్తోక్తియందు దత్తదృష్టియైన యీయగ్రశాఖా కోకిలముచే రూఢిపక్షపాతమున స్వీకరింపఁబడినవి.

"గుడ్డవృత్తులు వృత్తులు గొలుచుగుత్త
చేలు గ్రామాంశములు నాథి నేలలెల్ల
జనవరులకమ్మఁజూపు నిచ్చావిహార
వర్తి వాఁడేమిగానున్న వాఁడొ మీఁద"

ఇందు సంజ్ఞలన్నియు నప్పటివాడుక లోనివి తీసికొనఁబడినవి. మఱియునొకయాపుఁడు చెడిపోవుచుండ వానినిఁగూర్చివిచారపడు వాని నోట యేమాటలు విషాదాతిశయమునవచ్చునో, అవియే యిచ్చట రామకృష్ణ కవి శేఖరునినోట బయలుదేరినవి. కవి, యెవనిమాట చెప్పచున్నాఁడో, వాఁడుగా మాఱవలెనని కవితాసంప్రదాయ శిక్షల్ గన్పెడిని. అట్టిభావ పరిపాకమిదియే యనఁదగు.

క॥ వలువకుఁ గూటికినై నీ
చులవేడంబోడ చోరవఁజొచ్చునతఁడు పూ
వులు ముడిచిన యంగళ్ల నె
కలకలవీడ్లల్ల నవ్వఁగట్టెలు మోసెన్

పూవులు ముడిచినచోటనే కట్టెలు మోసినాఁడు అనెడి సామెతనిచ్చట నార్థ్యాగ్ర వృత్తి నిదర్శనాలంకారముగాఁ బ్రయోగించెను. ఎవ్వరునెఱుఁగక గ్రంథమూలప్రసిద్ధములగు నర్థముల నలంకారములుగా సింగారించుటకన్న నిట్టి యాబాలగోపాలప్రసిద్ధ విషయముల నలంకారములుగఁ జేయుట గడుంగడు రమణీయము.

దుష్టుఁడగు నిగమశర్మకు బుద్ధిచెప్ప దవని వచ్చినయాతనియక్క పుట్టినింటికి వచ్చుటయు పుట్టినింటనుండుటయుఁ దమ్మునితో మాటాడుటయు వర్ణించునపుడు నిగమశర్మయొక్కయు నతని సోదరియొక్కయు ప్రకృతి జరిగినదిజరిగినట్లు ప్రతికృతి (ఫొటో) వేసి చూపఁబడినది. భాషయు వారినోటి నుండి వచ్చినట్లే వ్రాయఁబడినది. ఆడవాండ్రభాష ఆడవాండ్రకును మగవాండ్రభాష మగవాండ్రకును వారివారి యవస్థలనుబట్టి సరిగాఁజూపుట యీకవి కుస్తుబాలతో నేర్చినదిగా నున్నది.

"ఎక్కడనుండియో యాకస్మికంబుగ
నింటికింజలిది వంటకంబుఁగుడువం జనుదెంచి
తన్నుంగాంచి డెందంబునంగొంచియుం
బోరాకచేరి నమస్కరించి తలవంచుకొని
యున్న తమ్మునింగని కదిసి".

చూడుఁడు దుర్మార్గుఁడైన తమ్ముఁడక్క వచ్చినప్పుడుండెడి తెఱఁగింతకంటె మఱొకతీరున నెచ్చటనైన నుండఁగలఁడా?

"అతండు తమకంబు గమకంబునం బోవనూకించిన వానిసోకోర్వమి నెఱింగి, మాటల తేటలంబాదిరివెట్టి యిందుబింబంబునుంబోని నిజన[illegible] జఱుతవాని మేనల్లుని నిందమని చంకకిచ్చి యెచ్చటికేగదవు మీబావబంతి నారగింతువుగాక శాకపాకంబులు నిమిషంబులోనంగావింతునని, వెనుక వెననడఁగలిగియున్న తత్కళత్రంబునకు నేత్రసంజ్ఞ యొసఁగుటయు"

క॥ ఆవైదలి ప్రాణేశ్వరు,
శ్రీపాదద్వయము గడిగ శీతలవారిన్
వ్యాపృత నిజనిశ్వాసజ
తాపంబునఁ గొంతకొంత తప్తముగాఁగన్

ఇందు మాటలతేటలఁ బందిరివెట్టుటయుఁ దనతనయుని జేతికిచ్చుటయు నాపాబిడ్డకు నేత్రసంజ్ఞసేయుటయు, భావనాప

పాకబలమునం బాత్రలతో నేకీభావమందఁ జాలని సాధారణకవికిఁ గల్పనాగోచరములు గానేరవు. మఱియుఁ బ్రకృతి ప్రతిబింబ గ్రహణ మీకవి కెంతసుఘప్రగ నున్నదో కన్గొనుఁడు.

“ఉ॥ ఇష్టములైన వంటకము లిట్లు భుజించి
యతండు వార్చి సంతుష్టమనస్కుఁడై తనదు
తొయ్యలి వీడ్యముచుట్టి యీయ, మహాశిష్టుఁడు
బోలెఁ దిన్నెపయిఁ జిర్నగవొప్పఁగఁ గూరు
చున్నచోఁ బుష్టిసమస్తముం గడపిపుచ్చి తద
గ్రజ పూర్ణచిత్తయై

క॥ ఇంతలు నాతలునగు తన
సంతానము వెంటవెంట సందడిసేయన్
బ్రాంతమున నిలిచి తమ్ముని
కుంతల బంధంబువిడిచి కుశలాశయయై

గీ॥ ఎల్లయు సీత్కారములతోడ నీళ్ళుగ్రుక్కి
యుట్టుసంటులు పరికించి యంట్లఁ బోసిచె
గోడముక్కల దిగనువ్వితూరు పెం
నెఱులఁ గలిగిన కేల నెన్నుఁదిఁ బదిగిచె

క॥ మొసమన్నునలఁచి యలకలు
ముడిగొని నిజపాణిపద్మములు గరగరగా
గడిగికొని తనకు మఱఁదలు
విడెమొసఁగుచు బసిమిపసిఁడి వీవనవీవన్

గీ॥ చేటికానీత పీఠికాసీనయగుచుఁ
బద్మకర్ణికఁ గొలువున్న పద్మవోలెఁ
గుడివలన నింతయొరగా గొమరుమెఱపి
బిడ్డ చనుదాఁవ నిట్లను బిసరుహాక్షి”

ఆసుష్టుఁడు గూర్చుండు కవియు, ఆమె యతనిని దాసికేలుచూచి జొట్టుమువ్వి నుడ మాన్ను నలఁచుటమున్నగు పనులు వరుసగా భ్రాతృప్రేమానుభావ పరంపరలో నిపుణముగఁ జేర్చుటయు, సంతానవతియగు నాయిల్లాలి యునికియు వాస్తవావస్థ కించుకయేని మార్పు గల్గకుండఁ జూపుటే. యిచ్చటికవి ప్రౌఢి.

---

# ప్రేమలత

డాక్టరు, పి. వి. రమణయ్యగారు.

హృదయమున బాదుకొల్పి నిర్మించెమనిచి
దృష్టివృతి నెందునెడ మీకవెప్పగట్టి
ప్రేమరసమున దడుపుచు బెంచినట్టి
కుసుమవల్లిక వాడివ్యాకులతఁగొలిపె ॥

ఆణిముత్యపుతళుకునీ హారవారి
శాశ్వతానంద తనులతా జాతమర్మ
బిందువ్రలుగాగ మురియుచు బేలనైతి!
కాలగతి ప్రేమ శృంఖల గట్టువడునె?

కూర్మివల్లిక పెనగొని కుట్మలములు
వికసితానంద ఫలరసామృతముగ్రోల
నదను గలిగించునను వాసమొదనుడుపు
ఆసలన్నిటినార్పి కొట్టుకొనిపోయె!

ప్రణయపూర్ణతములయు పవిత్రసలను
నమ్రతనుజూపు వ్రీడితనంపు బెంపు
హృదయమున నచ్చుపడినట్లు వీడిపోదు!
ప్రకృతివైచిత్ర్యములను నెవ్వడు తెలియఁగల్గు!




కవిసోదరులు పువ్వాడ శేషగిరిరావు, చోడవరపు జానకిరామయ్య గార్లు

ఏటికి మమ్ముఁజూచి విలపించెదు? వెచ్చని బాష్ప పూరముల్
కాటుక కంట్లఁ గాలువలు కట్టి స్రవింపఁగ నేల? కేమి యు
చ్చాటన మాచరించెదు? విషాదసుపిక్కృత లేపనంబు నీ
కేటికి? గోవ! సుంత వచియింపుము! ఖేదము సందడించెదే!

మురువు నెఱపుచు చిన్నయూపు రమూఁగ
చెవ్రుల నిక్కించి పాదంబు లవని నైన
మోపకుండగ తోక వంపుగను నా
పరువు లిడు వత్స మేది? కన్పడ దేము?

కాదుమే? నీ మేను గాసిలి వసివాఁడ
నైగనిగ్యంబు దైన్యంబునొంద
వింటిమే? లేల "నం భే" యన హృదయ భే
దనముగ నీదు రోదనము మ్రోఁత
నైరింతుమే? నీకు నైపకాహారంబు
దొరలాడుచుండ నిద్దరఁ దొఱంగి
వచియింతుమే? నీవు పడు నవస్థకు మమున్
కలఁగి నీరయి కాలువలు స్రవింప

ఉదయ సాంధ్యావసరములఁ బొదుగు చేప
చేపు బాలును (గన్నరుఁ జెలమగట్టి
నేల బ్రవహింప నీవు పొందెడి విచార
మెట్లు చూతుము హృదయమ్ము లెట్టులోర్చు

“ముక్కుపచ్చలే నారని ముద్దుకూన
బ్రహ్మదేవుని వ్రాతకప్పనముఁ జేసి
తినిగదా” యని నవసి చింతించి ఫలము
కలదె? కాసంతయేని విధిబలముకాని

ఆననిడెం గుమారుఁడన యుంకెకు రమ్మని దేవదేవుఁడో
మానిని! దీనికేలవగ? — నూను మనారత మేలి తండ్రి చం
దానఁగనుంగదా! యతఁడు — తల్లియుఁ, దండ్రియుఁ, దాత, దాతయున్
దానగదా! మనందఱకు — తాపము వాపుకొనంగఁ జూడుమా!

తాపము వాపుకొమ్మనియెదన్ ధృతిగల్గిన వానిపోలికన్
దేవకిఁ దేవకున్ గడుపు తీపులు రేగి విచారగీతికా
ధ్యాపనమాచరించి “తనయా! తనయా” యన నాకె గుండె య
య్యో! పలుబీటికల్ వడె — నిటో, మఱి చుమ్మలెఱుంగు తల్లికిన్

బలితంపు కాడి సల్లు వాచి రాపాడి
కాయలు కాయు సంకటముఁ బాసి
ములుగఱ్ఱ పోడ నాగలిఁ బట్టి “చొచ్చో”య
టంచుఁ దోలెడి నికృష్టతను వీడి
స్వేచ్ఛతో వర్తింప నిచ్ఛకోఁ దగిలించు
ముకుదాడ్లతో బిగింపుఁ దొలంగి
పసిపచ్చపైరు చాపలమూని మూమూక
బడియత్తో బడెడి కట్టడలఁ దప్పి

“క్రూరచిత్తులు రైతులు సేంకేసరు
దాస్యమునుఁ జేయనోప వందన మటంచు
సౌఖ్యకరమైన స్వర్గరాజ్యంబుఁ జేరె
తలకకేలకొ? నీకు నంతసము గనక॥

‘కవిత’ నుండి



# బకరీదు

### జంధ్యాల శివన్న శాస్త్రి గారు

మనదేశమున మహమ్మదీయు లాచరించు పండుగలలో ఇదియొకటి. బకరా = మేక, ఈద్ = పండుగ ఈ రెండు శబ్దములచే నియ్యది యేర్పడెనని పెక్కుమంది యభిప్రాయము. అట్లయినచో మేకలను చంపు పండుగయని దీని యర్థమగును. కాని వాస్తవమునకు ఇది బకర్ ఈద్ అను శబ్దములచే నేర్పడినది. అరబీ భాషలో బకర్ అనగా ఎద్దు లేక ఆవు. ఎద్దులనుగాని ఆవులనుగాని బలియొసంగు పండుగ యని దీని యర్థము. భారతదేశమున ఈపండుగనాడు గోవులను బలియిచ్చెదరు. కాన దీనికీపేరు కలిగెను. ఈపండుగకీపేరు హిందూదేశమునందక్క మరియెచ్చటను లేదు. అరబ్బీ పార్సీ సాహిత్యములందు ఈశబ్దమెచ్చటను ప్రయోగింపబడకపోవుటచే బహుశః ఈశబ్దార్థమును ఆదేశస్థులు తెలియజాలకపోవచ్చును.

అరబ్బువాసులు ఈపండుగను ఈదుల్ అజుహా యని వ్యవహరింతురు. ఈద్ = పండుగ, అజుహా = బలి అని యర్థము. పార్సీ భాషలో నీశబ్దము మాత్రమే ప్రయోగింపబడును. పార్సీభాషలో దీనికి బదులుగ ఇట్టి యర్థమే గల 'ఈద్ కుర్బాన్' అను శబ్దమును వ్యవహరింతురు.

మహమ్మదీయులలో నీయుత్సవము అనాదినుండియు లేదు. తొలుదొల్త ఈపండుగను యూదులు ఆచరించెడువారు. వారివద్దనుండి మహమ్మదీయులు దీనిని గ్రహించిరి. చరిత్రవలన ఈవిషయమున మనకు కొన్ని సంగతులు తెలియుచున్నవి. కొన్ని సంవత్సరములకు పూర్వము హాజరత్ ఇబ్రాహిం అనునొక గొప్ప పైగంబరునకు ఈశ్వరుడు 'నీపుత్రుని నాకు బలియీయుము' అని యాజ్ఞాపించెనట. దీనిని పురస్కరించియే నేడు బకరీదులో ప్రాణి బలియీయబడుచున్నది.

పైగంబరగు హాజరత్ ఇబ్రాహీమును మహమ్మదీయులే గాక క్రైస్తవులు గూడ పూజ్యునిగ గ్రహించుచున్నారు. ఇబ్రాహీమునకు ఈశ్వరుడు స్వప్నములో యితని పుత్రుని యడిగెనట. ఇబ్రాహిము అందులకియ్యకొని తన ప్రియపుత్రుని మక్కాసమీపమునకుఁగొనిపోయి యచట బలియిచ్చెనట. ఆ ప్రదేశమును మహమ్మదీయులు ఇపుడు పవిత్రమగు బలిస్థానముగ గ్రహించుచున్నారు. హాజరతు తన పుత్రుని అచటకుఁగొనిపోయి తన యుద్దేశమును దెలిపెనట. పుత్రుడును అందుల కభ్యంతరము చెప్పక సిద్ధపడెనట. హాజరతు కత్తినిపుచ్చుకొని వధింపనున్నపుడు పుత్రుఁడిట్లనెనట "నాయనా! నన్ను అధోముఖునిగఁ జేసి నీ కనులకు గంతకట్టుకొని వధింపుము. లేనిచో నాముఖముపై దృష్టిపడినపుడు ప్రేమ పరవశుండవై కర్తవ్యమును పాలింపజాలక పోదువు" హాజరతు అతనిమాటలకు సంతసించి అతడు చెప్పిన చొప్పున వధింపబోయెనట. కాని

ఈశ్వరాజ్ఞచే జబ్రీలు ఫరిశ్తా (ఒక దేవదూత) కత్తినితిప్పివేసెనట. ఇంతలోనొక ఆడుంబా అచట ప్రత్యక్ష మయ్యెనట. ఆపశువును ఈశ్వరునకు బలియిచ్చెనట. ఆ పశువు యీఘటనకు పూర్వము 40 సంవత్సరముల నుండియు స్వర్గములో మేయుచుండెనట.

హజరతు యిబ్రాహీమునకు యిద్దరు పుత్రులుకలరు. అందు ఒకడు .అతని యింపుడుగత్తెకు పుట్టినవాడు. అతని పేరు ఇస్హాకు. ఇతడు పుట్టినప్పటికి హజరతు నూరు సంవత్సరముల వయస్సు. అతని సారాకు 90కి మించిన వయస్సు. రెండవపుత్రుని పేరు ఇస్మాయీలు, ఇతడు హజరతు ధర్మపత్నియగు హాజరాగర్భమున బుట్టెను. హజరతు బలికి నుద్దేశించినది ఈఇద్దఱ పుత్రులలో నొకరు. వీనిమూలముననే బకరీదు పండుగప్రచారములోనికి వచ్చెను. ప్రతి మహమ్మదీయుడును ఈపండుగచేయవలసిన యావశ్యకత లేదని మహమ్మదీయ మతగ్రంథములవలన తెలియుచున్నది. శక్తిగలవారే దీనిని చేయుటయుచితము. ఋణముచేసియు ఈయుత్సవము చేయవచ్చును. కాని వడ్డికి తెచ్చినసొమ్ముతో గాని లడాయికిగాని దానిని చేయ గూడదు అట్లుచేయుటచే ఈశ్వరుడు సంతసింపడు మహమ్మదీయ మతము వడ్డివ్యాపారమును ద్వేషించుచున్నది.

జిల్ హిజామాసమున 10 11, 12, తేదీలయందు ఈయుత్సవము చేయబడును. మూడుసంవత్సరముల ప్రాయముగల మేక, ఆవు, యెద్దు, బలికిఉపయుక్తమగు పశువులు. 6 సంవత్సరముల ఒంటెయు, రెండుసంవత్సరముల గొఱ్ఱెయు పనికిరావచ్చును. బలిపశువు బలిసినదిగాను, నిర్దోషముగను, రోగరహితముగను ఉండవలయును. కుంటివి, చెవులు తెగినవి, బక్కవి బలికి పనికిరావు.

ఆత్మత్యాగమును బురస్కరించుకొని పుట్టినయీ పండుగ మేషబలిగా మారి తుదకు హిందూదేశమున గోబలియను నస్త్రముగల బకరీదుగ పరిణమించినది. వాస్తవమునకు ఈ గో బలి ని మాని మఱియొక పద్ధము గా నీయుత్సవమును చేసికొనినచో మహమ్మదీయ మతమునకు వచ్చిన ప్రత్యవాయ మేమియు లేదు. పైగాతమ దేశీయ సోదరులకు మనస్తుష్టి నొనర్చినవారు కూడ కాగలరు



# భవభూతి "మాలతీమాధవము" విమర్శన

విద్వన్మణి శిష్టా నరసింహశాస్త్రి గారు

ఈ నాటకమును మహాకవి భవభూతి రచించెను. ఈనాటకమునేగాక "మహావీర చరిత్ర" "ఉత్తరరామచరిత్ర"యను నాటకములను కవియే వ్రాసెను. ఈకవి నాటక పటిమ కాళిదాసును మించును. మొదట కాళిదాస గ్రథితనాటకము లనేకపర్యాయములు చదివియారితేరి యీ నాటకత్రయమును భవభూతివ్రాసెను. "ఉత్తరరామచరితే, భవభూతే విశిష్యతే" అని యుత్తరరామచరిత్రయందుగల కరుణారసము సమస్తనాటకములకన్న నెక్కుడని ప్రసిద్ధిగలదు. మరియు నీకవికీనామము "సాంబాపునాతు భవభూతి పవిత్రమూర్తిః" అని యీకవిచెప్పిన పద్యమును బట్టికలిగెను. చరణార్థమేమన—శివుని యొక్క శరీరభసితముచే పవిత్రమగు శరీరముగల పార్వతిమిమ్ము రక్షించుగాత అని. మరియు కవికృత నాటకత్రియములో మొదటిది మహావీరచరిత్ర. అదిచివర రెండంకములు ఖిలమాయెను. అందంత ప్రౌఢతగాని యీ నాటకమునందంత నిపుణతగాని కనుపరుపక పోయినను తదితర నాటకద్వయమునం దీకవి యనన్య సామాన్య ప్రతిభావిశేషములం గనబరచెను. అందు తననాటకమునుగూర్చి యిట్లు చెప్పుకొనెను.

"యే నామ కేచిదిహనః ప్రథయంత్యవజ్ఞాం
జానంతి తే కిమపి తాన్ ప్రతినైష యత్నః
ఉత్పత్స్యతేస్తి మమ కోపి సమానధర్మా
కాలోహ్యయం నిరవధిః విపులాచ పృథ్వీ॥"

ఈ పద్యతాత్పర్యమేమన యీ నాటకము సందవజ్ఞచేసెనేని వానికేమి తెలియును. అట్టి యవజ్ఞచేయువానికై నేనీనాటకమును వ్రాయలేదు. ఇకనేమన నాతోసరియగు కవియెప్పటికైనపుట్టకపోవునా? ఈపృథ్వీమండలము పెద్దదికదా! కాలమున కంతులేదుగదా! అట్టివాడీ నాటకసారస్యముం దెలియనగు. పైశ్లోకమున వేదపఠనము, ఉపనిషత్పఠనము, సాంఖ్యయోగజ్ఞానమును గురించి చెప్పిన ప్రయోజనమేమి! దానిచే గలుగు గుణాతిశయము నాటకమున కుపయుక్తము గాదు. నాటకమున కుండదగిన గుణము లేవన ప్రౌఢ[illegible]సందర్భము నుదారపదఘటన అర్థగౌరవమునను [illegible] నాటకమునందున్నచో కవియొక్క పాండిత్యవైదగ్ధ్యములను నాటకమే వక్కాణించునని కవిచెప్పుకొన్నాడు. దీనిచే భవభూతినాటక వైదగ్ధ్యమును గీర్వాణనాటకకవులలో, భాస, కాళిదాసులకు దప్ప మరియొకరియందు గానరావు.

ఇతడు కాళిదాస సమకాలికుడని కొందఱు, మరికొందఱు దండిసమకాలికుడనియు, మరికొందఱు దండి, కాళిదాస, భవభూతి, శంకరకవులు సమకాలికులనియు, వాడుటంబట్టి కాళిదాసులలో మొదటి కాళిదాసు విక్రమార్కుని కాలమందుజ్జయిని నలంకరించినట్లు ఆయనచేతనే కావ్యనాటకములు రచియింపబడెనని, రెండవ కాళిదాసు భోజునికాలములో ధారాపట్టణము నలంకరిం

చెనని స్పష్టమగుచున్నది. అందీభవభూతి కాళిదాసునకు తరువాతయని కాళిదాస కృత నాటక చమత్కృత చౌర్యముచేతను, తదభిహిత నాటక గుణానుకరణము చేతను, స్పష్టమగుచున్నది. కానియితడు కాలప్రియానాథుడను మహాదేవునియొక్క యుత్సవమందీ నాటకమును మొదట ప్రదర్శించినట్లు కనబడుచున్నది. అదిమహాకాలక్షేత్రము. ఇదియుజ్జయిని సమీపమందున్నది. అందుచే నితను యుజ్జయినీ ప్రాంతమందున్న కవియని పొడగట్టుచున్నది. ఇతడు చెప్పుకున్న దేమన దక్షిణదేశమందు పద్మపురమను గ్రామమున కాశ్యపులు, తైత్తిరీయులునునగు పంచాదులు గొందరు విప్రులు గలరని వారిలో భట్టగోపాలుని పౌత్రుడు, నీలకంఠుని పుత్రుడగునీకవి భట్ట శ్రీపదలాంఛనుడని నీ, వెనుక నుడివిన శ్లోకమునుబట్టి భవభూతియను నామాంతరముకలిగి, యీతనితల్లిపేరు జాతుకర్ణి, యనిచెప్పుకొనెను. ఇతను భరతప్రియుడుగాన నితనిజన్మము దాక్షిణాత్యమైనను యుజ్జయినినేలు విక్రమార్కుని యొక్కసభనే యలంకరించి యుండెనేమో యని తోచుచున్నది. కాని రాజతరంగిణిని పట్టి చూచినచో 'కనూజి' రాజగు 'యశోవర్మ' యొక్క యాస్థానకవియని తెలుచున్నది. అతనీనాటకమును క్రీ. శ. 693_695 మధ్య వ్రాసినట్టులున్నది.

ఇది ప్రకరణమగుటచే నిందలి కథ కల్పితమై యుండవలెను ఈ కథానాయకుడగ్రజన్ముడై యుండవలెను. తాత్కాలిక బ్రాహ్మణ మర్యాదల ననుసరించి కవికథను కల్పించెనని చెప్పదగియున్నది. ఈమాధవుడు బ్రాహ్మణుడు. ధీరోదాత్తుడు. మరియు సౌగత పరివ్రాజిక, కామందకి యనునది. భూరివసువు, దేవరాతుడు కామందకి సహాధ్యాయులు. మాలతి భూరివసుపుత్రిక. మాధవుడు దేవరాతుని పుత్రుడు. కామందకి సన్యాసినియైనను తనకు సబ్రాహ్మణులగు భూరివసు దేవరాతుల యెడగల ప్రీతిని బురస్కరించుకొని వారికి విద్యాభ్యసన కాలమున భూరి వసుదేవరాతులు పరస్పరము చేసికొనిన స్వపుత్రపుత్రీ పరిణయ నిబంధనమగుసంబంధమును గడతేర్చవలెనని యత్నించెను. దేవరాతుడు విదర్భరాజమంత్రి. కుండినపుర వాస్తవ్యుడు భూరివసువు పద్మపురరాజమంత్రి. భూరివసువు సౌదామినియను నొక దివ్యస్త్రీ సమక్షమున దేవరాతుని పుత్రుడును, గుణనిధియునగు మాధవునకు తనపుత్రికను సకలకల్యాణ సమృద్ధయగు మాలతి నిచ్చి పరిణయము చేసెదనని చెప్పిన వాక్యములనుతిరిగి జ్ఞప్తికి తెచ్చుటకై కామందకిపద్మపురము ప్రవేశించెను. ఈ యుదంతమును దెలిసికొని కుండినపురమునుండి దేవరాతుడు తన పుత్రుడగు మాధవుని నన్వీక్షకే విద్యాభ్యసనమను నెపమున పద్మావతీ పట్టణమును చేర్చెను. ఇందు దేవరాతుని యభిప్రాయమేమన భూరి వసువునకు విస్మృతమైనను కామందకీ ప్రబోధచే నీవివాహసంగతిని భూరివసువు జ్ఞప్తికి తెచ్చుకొనునని యు, నైశ్వర్యమదముచే నతడట్లు నర్చించో కామందకీ ప్రబోధితయై గుణవతీ శిరోమణియగు మాలతి సుగుణమాలి మాలాలంకృతుడగు మాధవుని తప్పక వివాహమాడుననియు యభిప్రాయము. ఇందుపాయశాలియగు కామందకిట్లాలోచించెను. "తటస్థః స్వానర్థం ఘటయతిచమౌనంచభజతే". అనగా

నేర్పరి తనకార్యములను నిపుణతతో నిర్వర్తించుకొనుచు నెఱుగనివానివలె నటించును.

మాలతి తననగరీ సమీపసౌధప్రాంగణమున ప్రతిదినము తనవిద్యాభ్యసనగృహంబునకు వెళ్లుచున్న మాధవుని మేడయొక్క సప్తభూమికాభవనగత గవాక్షాంతరవర్తినియై రతీదేవి మన్మథునిజూచినట్లుగా గాఢోత్కంఠగలదియై చూచి లలితలావణ్య కలితములగు తనయవయవములచే ప్రతిదినము విరహబాధ నొందుచుండెను.

మాధవునకు మకరందుడు చెలికాడు. అతనిచే మాధవుని హృదయము యొకప్రియతమయందు లగ్నమైనట్లూహించి ప్రశ్నింపగా మకరందునితో మాధవుడిట్లు చెప్పెను. అవలోకితయను దాసిచే ప్రేరేపింపబడి నేను కామదేవోద్యానమునుగూర్చి వెళ్ళితిని అందు నేనటు నిటుతిరుగుచు నతిరుచిరములగు పుష్పస్తబకములచే నిండి యళిమాలాముఖరితములగు లేత వకుళ వృక్షము యొక్క మూలమునఁగూర్చుండి రాలుచున్న యావకుళపుష్పములను మాలనుగా కూర్చుచుంటిని. మన్మథుని జగద్విజయవైజయంతియనఁ నొప్పెడు మాలతి యంతఃపురమునుంచి యలంకరణములచే ప్రకాశించుచున్న విదగ్ధలగు ముగ్ధాంగనలు రచించిన కుమారీవేషంబుతో మహానుభావ ప్రకృతియైనచ్చోటికి విచ్చేసెను. అదిరమణీయతకు కడపటి స్థానము. అధిదేవత సౌందర్యసారమునకు పుట్టినిల్లు. ఆమె శరీరమును రచించుటలో బ్రహ్మనియతముగ చంద్రికిరణామృతజ్యోత్స్నల కలిపిచేసెనని చెప్పదగు. పిదప నను చెలులతోఁగలసి పుష్పాపచయంబు సేయుచునే యున్నవకుళ వృక్షప్రాంతమున కేగుదెంచెను. ఆమె లోకమహానుభావుని యందుఁగల ప్రేమానుబంధంబుచే బహుదినములనుండి సమృద్ధినిపొందిన మన్మథవ్యథావికారములంగాంచితి, అటు పిమ్మట నేను వకుళమహీరుహ మూలంబున కూర్చుండుట సఖులెఱింగి యుత్తాలంబగు కరకమలంబుల చప్పట్లుగొట్టుటచే కరకంకణధ్వనులు మెరయ రాజహంసలన నటనలవలె తమచరణకమలంబుల ఝణఝణత్కారంబు భాసురంబులగు మంజీరధ్వను లెసంగతోడచే సంజనితరమణీయంబగు మేఖలాకింకిణీ రణరణత్కారంబు భాసిల్లమోములందిప్పి సఖి! నీయదృష్టముచే నభివృద్ధిని చెందితివి. ఏమన నిచ్చటనే యొకానొక మహానుభావప్రభృతియగు మానినీ నీభర్తయై నివసించియుండెనని ప్రేలియగ్రముచే నన్నుచూపించిరని చెప్పెను. అటుపిమ్మట మాలతి లజ్జావనత వదనయై యామె నేత్రవిలాసంబులచే నాహృదయమును సమూలముగ నున్మూలించి కటాక్షంబులచే పానంబుచేసి గజవధువు నెక్కి తనయంతఃపురంబున కేగె. నేనది మొదలు చెప్పఁజాలని మన్మథవ్యథాపరవశుడనైతి పిమ్మట కామందకిచే మాలతీమాధవుల పరస్పరానురాగమభివృద్ధి చెందెను. ఇటులుండ మకరందుడు మదయంతికను నపేక్షించుచుండెను. ఈమె భూరివసువు నర్మసచివుడగు నందనునికి చెల్లెలు. భూరివసువు మాలతిని కురూపియు, జరాజర్జరితాంగుడునగు నందనునకిచ్చి వివాహము సేయ నిశ్చయించుకొనెను. ఇది విని మాలతి మాధవసమాగమము దొరకదని విషణ్ణయై దుఃఖించెను. ఏమియుచేయునది లేక కామందకి యుదాసీనయై యున్నను బహువిధోపాయ

ములచే మాలతిని మాధవునకు సమకూర్చవలెనని ప్రయత్నించుచుండెను. ఇట్లుండ నొకనాడు వివాహమహోత్సవ సమయంబున పరివృతాలంకారయగు మాలతి మాధవునే మదినెంచుచు సౌధాంగణ కుట్టిమంబున సంప్రాప్తనిద్రయై యుండ, కపాలకుండలయను నొక కాపాలిని యాపురియందున్న కాళికాశక్తికి త్రిలోకసుందరియగు మాలతిని బలియిచ్చినచో మహాదైశ్వర్య రాజ్య భోగములు సమకూరునని తదర్థమై మాలతి నపహరించుటకు సౌధాగ్రమును చేరెను. అందు నిద్రించుచున్న మాలతిని గొంపోయి యాఘోరగంటుడగు కాపాలికున కర్పించెను. అట్టిసమయముననే మాధవుడు మాలతీ పరిణయమును లభించదని కృష్ణచతుర్దశి మహా మాంసవిక్రయమును జేసినచో స్వేప్సితము సిద్ధించునని దలంచి నిస్త్రింశాలంకృతకరుండై ప్రేతభూమికిం జనుదెంచి నరమాంసవిక్రయమును సేయుచుండ భూతప్రేత పిశాచ నివహంబు లేతెంచుచుండెను. మాధవుడు మాలతీబద్ధ చేతస్కుండై నరమాంసము విక్రయించు చుండ స్మశానగతమగు దేవతాలయమునుండి యొకయార్తారవము వినవచ్చెను. ఇట్లు రెండుపర్యాయములా ధ్వనివిని మాలతీకంఠ స్వరముగా గుర్తించి యచటికేగెను. అచట నామాలతి రక్త వస్త్రమాల్యాలంకృతయై దేవతాబలికి సన్నద్ధయై యుండెను అప్పుడు మాధవుడాశ్చర్య వీర రససమేతుడై యిట్లు నుడివె. [వనం।

"అసారం సంసారం పరిముషితరత్నం త్రిభు
నిరాలోకం లోకం మరణశరణం బాంధవజనం
అదర్పం కందర్పం జననయన నిర్మాణమఫలం
గజజీర్ణారణ్యం కథమసివిధాతుం వ్యవసితః॥

మాధవుడు పాఖండ చండాలునితో చెప్పినవాక్యమిది:— మాలతిని చంపదలచిన నీవిట్లేలచేసెదవు. ఈ ప్రపంచసంసారమును నిస్సారముగ చేయబూనితివా? ఈమూడు లోకముల కేకరత్నమగు నీమె నపహరింప గోరితివా? ఈ భువనమందు వెలుతురును తీసివేయగోరితివా? మాలతీబాంధవ గుణమునకు మరణమే శరణమనుకుంటివా? కందర్పు దర్పము తీసివేయదలచితివా? జనులకు నిర్మించినసీనయనానందఫలమును విఫలమును గావింపదలచితివా? ఈజగత్తును దగ్ధారణ్యమును చేయదల చితివా? ఈమాలతీరత్నము నిట్లేల హింసింపదలచితి వని చెప్పుననసరమున, హామాధవా! యని మాలతి మాధవునింగౌగిలించుకొనెను. వెంటనే చేనున్న ఖడ్గముచే మాధవుడు పాఖండల నందరిని నిర్మూలముగావించెను. ఇంతలో మాలతిని వెదకుచున్న రాజభటుల కదంబము మాధవునిచే జోరంబసి మాలతిని రాజభవనంబు ప్రవేశింపజేసెను. పిమ్మట మకరందుడు మాలతీవేషమును ధరించి దేవతాపూజార్థమేతెంచునని నగరదేవతా గర్భగృహమును ప్రవేశించెను. మాలతి యాదేవతనర్చించుటకై నిజపరివారముతో నచ్చటకేగెను. అట్టియెడ మాలతీమకరందు లొకరివేషము లొకరు ధరించిరి. ఇది రహస్యము. మాలతీవేషమునుధరించిన మకరందుడుమాధవునితో గలసి మాటలాడి పరిహసింపబడి చమత్కారచేష్టలచే మాలతిని బోలియుండి మాలతి వచ్చిన చతురంత యానమునెక్కి పురమును బ్రవేశించెను మకరంద వేషధారియగు మాలతి మాధవునితో కామందకి గృహమును బ్రవేశించెను. పిమ్మట మాలతీ

వేషముధరించిన మకరందుడు నందనున కివ్వబడి వివాహముచేయబడెను. నందను డేకాంతమున మిథ్యామాలతీ పరాభూతుడై విసుగుచెంది మాలతి మాధవబద్ధ చేతస్కయని ప్రవాదముగలదు. నన్నీ మెయెట్లు ప్రేమించునని విసర్జింప నచటయున్న దయంతికకు తన వృత్తాంతమునుదెలిపెను, మకరందుడని చెప్పి తనయం దనురాగముగల నామెను వెంటనిడుకొని మాధవసమక్షమును ప్రవేశించెను.

పిదప భూరివసువు మాలతిమాధవుని చేతను, మకరందునిచే నుదయంతికయు కృత్రిమముగ నపహరింపబడెనని వీరలను బంధించుటకు సేనలను నియమించి శరత్కాల జ్యోత్స్నయందు సౌధో పరిభాగ మెక్కి చూచుచుండెను. వచ్చిన సేనలను మాధవు డుపాయశూరుడై ప్రవేశించి రూపుమాపుచుండ నేకాకినియై యుద్యానవన గహనమందున్న మాలతి తిరిగి కపాలకుండలచే నపహరింపబడి యఘోరఘంటుని మాధవుడు పూర్వము హింసించిన వైరమును మనసునందిడుకొని శ్రీపర్వతమునకు తోడ్కొనిపోయి మాలతిని వధింపనుంకించుచుండ సౌదామిని యనుయోగిని తన సమక్షమున పూర్వవిద్యాభ్యసన కాలమున భూరివసుదేవరాతుల పరస్పరాపత్య సంబంధమును తెలిసికొనినది గాన కామందకి ప్రియశిష్యురాలగు నామె కపాలకుండలను మాలతీ హరణోద్యోగమునుంచి మరల్చి సేనను జయించిన పిదప మాలతింగానక బహుప్రకారముల మకరంద సహితుడై విలపించుచున్న మాధవుని చేరి మాలతి సజీవితయని చెప్పెను. భూరివసువు సుగుణవంతులును, శూరులునునగు మాధవ మకరందుల శ్లాఘించి గృహము ప్రవేశించెను. పిదప మాలతిగనబడనందున భూరివసువు యగ్నిప్రవేశమునేయ సమకట్టెను. మాధవుని మరణనిశ్చయమును సాహసమని వారించి మాలతిని కపాలకుండలవల్ల రక్షించి కామందకి సమక్షమున మాధవునకు సమర్పించెను. దానిచే పునర్జీవితయైనదని మాలతిని లవంగిక ప్రభృతు లభినందించిరి. ఈ వృత్తాంతమును విని భూరివసువు మాలతిని మాధవునకిచ్చుటలో నిశ్చితాభిప్రాయుడైనను ప్రకృతి జనఛందోనుసారముగా నందనున కర్పించినట్లు నటించిమాలతిని మాధవునకు ప్రథమునసే సమర్పింప బడినదని యథావిధి వివాహ మొనరించెను. మకరంద మదయంతికలు గూడ వివాహ హితులై సుఖించిరి.

## మాధవుడు

ఇతడు ధీరోదాత్తుడు. "మహాసత్త్వో దిగంభీరః కృపావా నవికత్థనః శ్రీరామచంద్రవద్ధీరః ధీరోదాత్త సమస్మృతః॥" అనగా గొప్ప బలముగలిగి మహాగంభీరుడై, కృపగలిగి, తన్ను తాను పొగడుకొనక, మహాధీరుడగు వాడు ధీరోదాత్తుడు. మాధవునకు నీ లక్షణము లున్నందుకు మహాసత్త్వమున్నూ, సకల సేనా విజయము చేయుటచే నితనియందు స్థాపింపబడ్డది. అదెట్లన మాధవుడు మాలతిని తన యనుమతి లేనిది గ్రహించెనని విని పంపించిన సేనలను జయించెను. మార్గమధ్యమున నగరపరిరక్షకులు మకరందుని నడ్డగింప మాధవుడిట్లు విజృంభించెను

" హా శేరతుల విక్రమ ప్రణయలాలసస్యాహూ లే
సయేన భవతి క్వణత్క రసు హాస్ప్రచండసభా

జృరత్కరట కోట రస్కలితదాన సిక్తాన లద్విపే
శ్వర శిరస్థితాస్థి దలనైక సీరకరః॥

అనగా సింహమునకు యుద్ధమందు నిరుపమానమైన పరాక్రమ ప్రీతియందా సక్తి గలప్పుడు ధ్వనిసేయుచున్న దీర్ఘమై, వక్రమై, వాడిగల గోళ్ళతో నొప్పుచున్న హస్తమే గొప్పవియగు గండస్థలముల నుండి ప్రవహించుచున్న మద ధారలచే తడపబడిన ద్విపేంద్రముల యొక్క శిరస్థితాస్థులను బ్రద్దలు చేయుటయందు సహాయము — అని చెప్పిన హైసాదృశ్యముచే నేక వీరుడనగు నేని సేనను జయింపశక్తుండనని స్పష్టము.

గంభీరత్వముం జెప్పుటలో మాలతి తన్ను పెండ్లాడవలెనను కోరికలో నెవ్వరికిని తెలియ బడకుండగ ఒంటిగ స్మశానమున నరమాంసమును విక్రయింప నందుగల భూత ప్రేత పిశాచములను భయము చెందకుండుట నీతని ధైర్యసాహసములను చెప్పుచున్నది.

"సంయుక్తాకుల కేలయః కిలకిల కోలాహలైః సమ్మదాః
ఉత్తాలాః కటపూట నాసభృతయః సాంద్రామాణివం కుర్వతే॥"

ఇచ్చట యాటలయందు కూడుకున్న టువంటివన్ని కిలకిలా రవముచే కోలాహలము సేయుచు చప్పట్లు వాయించుచున్న భయంకరములైన కటపూతనా నామధారులగు పిశాచములు ధ్వనిసేయుచున్నవి — అని వాటికమ్మిన మాంసమునుగూర్చి

'అశస్త్రపూతమవ్యాజంపురుషాం గోప కల్పితం
విక్రియతే మహామాంసం గృహ్యతాం గృహ్యతామిదం॥

అనగా పురుషునియొక్క శస్త్రము లేక తియ్యబడునటువంటి యీ మహామాంసమమ్మబడుచున్నది. ఓ పిశాచములారా దీనిని మీరు గ్రహింతురుగాక.

మరియు నీతడనుకంపాయుతుండని చెప్పుటలో మాలతి యఘోరకంటునిచే చంపబడుచున్న కాలమున

హా! తాత! నిష్కరుణ వ్యాజదానీం తేనరేంద్ర చిత్తారాధనోపకరణం జనోలి పద్యతే!! అని అనగా ఓ! దయలేని తండ్రి రాజ హృదయమునకు సంతోషము చేయుటకు నీ కుపకరణమై యీ మాలతి జంపబడుచున్నది. ఆ స్మశానంమడే యీ యార్తధ్వనివిని కృపాన్వితుండై

'నాదస్తావత్ వికలశరీర కూజితస్నిగ్ధతార చిత్తా
కర్షీ పరిచిత యిపశ్రోత్ర సంవాదమేతి
అంతర్భిన్నంభవతి హృదయం విహ్వలా స్యాంగమంగం
దేహస్తంభం స్ఖలయతిగతిం కింప్రకార మితేతత్

అనగా ఆర్తారవము జడిసిన కురంగి మృగము యొక్క కూజితము వలనే దట్టమైన మంద్రధ్వని కలదియై నాచిత్తము నాకర్షించుచున్నది. ధ్వని జెవి కిదివరకు పరిచితమైనదిగా నున్నది. నా హృదయము లోపల బ్రద్దలగుచున్నది. నేను విహ్వలుడనై ప్రత్యవయవమునందు శరీరము కదలక నాగమనమును భంగపరుచుచున్నది. ఏమి? ఈప్రకారము, ఏమిచేతును — అని ఇట్లితని

ధీరోదాత్త గుణములు స్పష్టపరుచబడినవి. ఇతనుచేసిన కృత్యములలో మాలతిని బలి యిచుచ్చున్నయ ఘోరకంటుని చంపుట, రిపు సేనను జయించుట, మాలతిని రక్షించుట.

" సేయంభూరివసోః రివసుతా మృత్యుర్ముఖేర్వర్తతే "

భూరివసువుయొక్క పుత్రికయగు మాలతి మృత్యుముఖమందుపడుచున్నది— అని సమీపించి తన్ను గౌరవించుకొనిన మాలతిని రక్షించిన యీయన కరుణ శ్లాఘ్యము.

మాలతి

ఈమె తనభర్తను నెట్టి సౌహార్ద హృద్యవిచేష్టలచేత తనిపి సంతోషపెట్టుటలో నతిచతుర. ఇందుకు కామందికి చెప్పిన దేమన

" వరీయానోన్యస్య ప్రగుణగుణ నిర్మాణ నిపుణో
నిధాతుర్వ్యాపారః ఫలతుచమ మనోజ్ఞశ్చ భవతు ॥

అనగా అన్యోన్య ప్రగుణప్రేమానుబంధ మీమాలతీమాధవుల నిద్దరిని సృజించిన ధాతయొక్క వ్యాపారమును సఫలమగుగాకయని— మరియు మాలతికి మాధవ దర్శనానంతరము కలిగిన పలాసచేష్టలను శృంగార విలాసభావములను " ఆచార్యకం విజయమన్మథ మావిరాసీత్ " అని మన్మధ వికారములయొక్క చమత్కృతిని వర్ణించెను మాధవుడుకూడ నిట్లు మాలతీ విలాసము నెన్నకొనెను.

" స్తిమిత వికసితానాముల్లసత్ భ్రూలతానాం
మసృణ కువితానాం ప్రాప్తవిస్తారితానాం
ప్రతినయన నిపాతేకించి దాకుంచితానాం
వివిధమహామ భావంపాత్రమాలోకితానాం

శాంతతతోనుండి బహువికాసయుక్తమైనట్టియు, నాట్యమాడుచున్న లతలవంటి కనుబొమ్మలు కలిగినటువంటియు నొకానొకప్పుడు సాంద్రముగ మూసుకొనబడ్డట్టియు, మరికొంతతడవు నేత్రప్రాంతములయందు కటాక్షవిక్షేపములచే విస్తారములైనట్టియు, నేను తిరిగి యామెవంక చూచినచో కొంచెముగా నాకుంచితములైనట్టి వివిధములైన మాలతీ నేత్రావలోకనములకు నేనా యవసరమున మకరందాపాత్రుడనైతినని చెప్పెను ఇందుచే నామె భావవైదగ్ధ్యతవర్ణనాతీతము. మరియు మాధవునియొక్క హృదయమును నిట్లు హరించెనని చెప్పెను.

అలసవలితి ముగ్ధస్నిగ్ధ నిష్పందమందైః
అధికవికసితదంత స్సోయస్మేర తారైః
హృదయమ శరణం మే పక్ష్మలాక్ష్యాః కటాక్షైః

అపహృతమప విధంసీత మున్మూలితంచ॥

అనగా మాంద్యములగు వాలుకన్నులచే సుందరమైనట్టియు దట్టమైనట్టియు చూచెడుకాలమున కదలనట్టియు, మందములైనట్టియు, నెక్కువగా వికసించిన నేత్రకమలముల మధ్యనున్న కనీనికలు గలిగినట్టి విస్మయము చిరునవ్వుతో, నొప్పిదమగు దీర్ఘములైన పక్ష్మలములుగల మాలతీకటాక్షములచే నన్యరక్షకములేని నాహృదయము నెత్తుకొని పోబడినది. కొట్టబడినది. త్రెగబడ్డది. మూలము కంటపెల్లగింపబడ్డటసుమా

మకరంద! యనిచెప్పెను— ఇట్టి పాండిత్య వైదగ్ధ్యచాతుర్య ముద్రాశాలీనులగు యువతులు భర్తృహృదయా కర్షణకుశలులగుటకు సందియమేమి? ఆమె సౌందర్యమును విచారించినచో.

ఇదమిహామదనస్య జైత్రమస్త్రం
సహజవిలాస నిబంధనం శరీరం

ఇదిమన్మథునియొక్క జైత్రాస్త్రమనియు స్వభావసిద్ధములైన చాతుర్య విలాసములకీమె శరీరముపుట్టి నిల్లనియు కామందకి ప్రస్తుతించెను. మరియు నీమెయొక్క పాతివ్రత్యమెన్నినచో నఘోరఘంటుని చే దేవతా బలికొరకు చంపనుంకించుతఱి నీయిష్టదేవతను ప్రార్థింపుమన్న ప్రాణత్యాగ సమయమని హా! మాధవా, యని, భర్తనే స్మరించెను. మరియుతనకుతగని నందనుడను వానికి తండ్రితన్ను నియ్యనున్నాడని వినినతోడనే.

వరేన్యస్మిన్ ద్వేమః పితరివిచికిత్సాహిజనితా
ఆని కామందకి చేసిన కుటిల నీతిలోగూడ తండ్రియందు విచికిత్సకలిగెగాని ద్వేషముకలుగలేదు. కామందకి
"కుతోపత్నే స్నేహః కుటిలనయన నిష్ణాత మనసాం"

అనగా కులటనీతియందు దృఢమైన మనస్సుగలవారికి పుత్రికాప్రేమ యెక్కడిది యని నిందించెనుగాని మాలతి "ఆ, హాతా స్మినమృద్ధి వానర్థవజ్రపతనా మందభాగినీ" అనగా బయలువెడలిన అనర్థగమను వజ్రపాతముచేత నీమందభాగ్యనగు నేను హితనైతిని గదా యనుకొనెను. కానితండ్రిని నిందింపలేదు.

మరియు నీమెకు సఖీజనానురాగము కడుమెండు. అచెట్లన లవంగిక మాలతికి బాల్యసఖి. ఈమెకు సుమాకరోద్యానమున మెలంగుతఱి "సఖీ! ఏమఖిలు మధురమధుర సాన్ద్రార్ద్ర మంజరీకవలన కేళీకలకోకిల కోలాహలాకులిత సహకార శిఖరోడ్డీన చటుల చంచరీక నికరవ్యాప్తి కరోద్భవిత దళకరాళ చంపకాధ వాస మమీ హేమమరాళమూల సలః కుసుమాకరోద్యాన మాదతః తత్ ప్రవిశావః"

మాలతి వియోగంబున— "సఖీ! కింకరోమి? దృఢవజ్రలేప ప్రతిబద్ధనిశ్చలమివ జలితంనమాంపరిత్యద్యతి" అనిదృఢమైవజ్రలేపముచేత బంధింపబడ్డ నాజీవితముీన వియోగమునందు నన్నుపరిత్యజింపదు కదాయని లవంగిక దుఃఖించెను. కామందకి మహాయోగిని. మాలతి యీమెకు మహాప్రీతిపాత్రురాలు. ఆమె మాలతి యుపహరించునపుడామె బాల్యచేష్టల నిట్లు వక్కాణించెను.

"స్తన్యత్యాగాత్ప్రభృతిసు ముఖీదంతిపాంచాలికేవ
క్రీడాయోగం తదనువినయం ప్రాపితా వర్ధితాచ
లోకశ్రేష్టేగుణవరే స్థాపితాత్వంమయైవ।
స్నేహోమాతుకిమయి సమధకస్తేన యుక్తః వవాభి"।

అనగా చనుబాలు విడిచినది మొదలు దంతముతో చేయబడినచిత్రపుబొమ్మవలె నాటలకేర్పి పిదప వినయమును గరపి వృద్ధినొందించి గుణములచే లోకోత్తరుడు వరకును నాచే నర్పింపబడితివి. కాన తల్లి కన్న నాయందు నీకుగల స్నేహ మధికమగుట

క్తము. అని మాతృభక్తి కన్న నీమె యందుగల గురుభక్తిని శ్లాఘించెను.

## కామందకి

ఈమె బౌద్ధసన్యాసిని. మహాప్రభావవతి. సౌదామిని యీమె శిష్యురాలు. ఉభయు లంతర్ధానతిరోధాన భూచరఖేచరాదిసిద్ధుల యందారితేరినవారు. అంకు కామందకి తన భూరివసు దేవరాతులకు సహాధ్యాయిని యగుటచే మాధవుడు బహుగుణశాలి యగుటచే మాలతీసౌందర్యాదిగుణములకు నితడు తగిన వరుడని బహుప్రకారముల మాయోపాయముల ఘటించి భూరివసువునకు తెలియనీయక మాలతీమాధవుల పరిణయమును జరిపెను. ఈమె యందుగల గౌరవముచేతనే సౌదామిని, కపాలకుండలచే నపహృతయై వధింప బద్ధ మాలతిని పునర్జీవిత జేసి మాధవునకిచ్చెను. ఈమె యందుండు నైపుణిని గ్రహించియే భూరివసువు "గుణానురాగో నరేంద్రస్యయదిదానీం సౌధశిఖరాంతరితావతీర్ణ ప్రతీహారకథితయోపన్యాస ప్రతిజ్ఞానిత విరోధసంకటః, ఉపనీతమాధవ మకరందముఖచంద్రావారం వారం సంచరిత స్నిగ్ధలోచనః రాజాముఖరోపన్యాసేన కిమిదానీం యువయోః భువనాభోగ భూషణాభ్యాం జామాతృభ్యాం పరితోషయతి ప్రతిబోధ్యతాం భ్యాంతరం" అనగా గుణానురక్తుడగు భూరివసువు సౌధశిఖరమువల్ల దిగి మాధవమకరందుల నభినందించి వారియొక్క ముఖచంద్రుల ననేక పర్యాయములను చూచి చూచి మధురోపన్యాసముచే వీరిరువురు మాకు జామాతలగుటచే మాకు పరమానందము సంఘటించెను.— అని సంతసించెను. ఇది కామందకిచేసిన నీతికి ఫలము.

## మకరందుడు

ఇతడు మాధవునివంటి శూరుడు. మాధవునకు తగిన మంత్రి, ప్రియుడు, నర్మసచివుడు. మాలతీవేషమును ధరించి నందనుని తిరస్కరించి మదయంతికను తనశౌర్యసౌందర్యాదిగుణములచే తనయందుగాఢానురక్తయైనదానిని పెండ్లాడెను. ఇతని కథాసందర్భమున నొక బాలశార్దూలమును నవయౌవన మదగర్వితను వీరభటవిలోకనజనిత శౌర్యోత్సాహ విదారితనిజపంజర వినిర్గతను, తత్సమయ సమీపస్థ సర్వజనసముపిదారణ విత్రస్తీకృత పౌరజనను, కార్యాంతర సమాగత మదయంతికా భయసంభ్రమ హేతువగు దానిని, యీ మకరందుడు చంపి మదయంతికా సంతాపమును హరించియామె కృతజ్ఞతకు నాపెప్రేమకు పాత్రుడాయెను. ఇందుచే శూరుడని సుందరుడని కార్యపర్యావాక పటుడని తోచుచున్నది.

## కవిత

కవి రసభావములను ప్రదర్శించుటలో సమర్థుడు. శృంగారవీర రసముల నైక్యమును సప్రీకరణమున నిరూపించెను. అనర్గళ ప్రౌఢోదార ధారాశుద్ధి యీ కవియందు గానంబడుచున్నవి. ఇందుకు "పక్ష్మలతాకటాక్షైః, అపహృత మదవిద్ధం, పీతమున్మీలితంచ" ఇత్యాదిశ్లోక ముదాహరణమివ్వబడినది. మరియు ధారాశుద్ధిశయ్యాను ప్రౌఢోదారత్వములకు,

"యాంత్యార్ముహుః వలిత కంధర

మాననం తదావృత వృంతశతపత్రనిభం,
వహాంత్యాదిగ్ధో మృతేనచ విషేనచ పక్ష్మ
లక్ష్యో గాఢం నిఖాతైవ మే హృదయే
కటాక్షః”

అని గజవధువు నధిష్ఠించి శృంగారో ద్యానమున మాధవుని విడిచి మరలిపోవు మాలతీచేష్టను కాళీదాసాదుల కన్న మిన్నగ వర్ణించెను. శ్లోకతాత్పర్యము- మాలతి వెళ్లుచు తిరిగితిరిగి చూచుటచే తిప్పబడిన మెడకల మొగమును, చేతులతో త్రిప్ప బడిన నూరురేకులు కల కమలమువలె గిర గిరం డ్రిప్పుచు నమృతము చేత, విషముచేత పూయబడిన క్రీగంటిప్రసారము నాహృద యమందు గట్టిగ కొట్టబడినది.— ఈపద్యము సంగల పదముల విలువ సాహిత్యసాధోనిధి యందు గల యనర్ఘ జీవరత్నములన లేతీసిన కొలది ప్రౌఢోదారార్థములను కామధేనువు వలెనే యిచ్చుచున్నది. కాన యీనాట కము నిరుపమాన సర్వరసాంకుర భాసుర మని నిర్దుష్టము.



## నా ఊహలు

(పా. వి. రాఘవరావుగారు. సారస్వతమిత్రమండలి)

---

కన్నులనువిప్పి, దిశలందుఁ గళలనింపి
గాలిలో సౌరభంబునుఁ గలిపి, యావ
నంబున విలసిల్లెడు కుసుమంబు అకట
పాడు చిఱునవ్వుతోఁగూడ వాడిపోవు

* * *

ఏది మము వీడరాదంచు నెంతొ మొ అది
ఉండెదననుచు మనలను నూరఁ జేసి
సారదూరమౌ సంతోషసాగరమున
ముంచి, తేల్పక, చటుకున డించిపోవు

* * *

ధరణి సంతస మెంత తత్వంబుకలదొ
అంధకారంబు వెక్కిరింపంగనవ్వు
మెఱుపు దీధితులు మనల కెఱుకపఱచు.

* * *

తనువులోనుండు రక్తమదంబుచేత
ఆశలనిరోడు లేఁజిగురాకులెన్నొ
నేడుమనుజుఁడు తొడిగి, మఱునాఁడు పూచి
సాటిసోదరసమితిలో మేటియగుచు
కీర్తికాంతను చేఁబట్టి కెరలియాడుః-
అంత కర్మవశంబున వింతయైన
పాడు తేనెమబ్బులు మఱునాఁడువచ్చి
వేళ్లతోఁడుత నాతని బెఱికివైచి
నహుషురీతిగఁ గ్రిందికి నట్టి త్రోయు
భూతలమున ప్రతిప్రాణి రీతి ఇదియె.



# విరజ

భారతుల మార్కండేయశర్మగారు. (యువకవిమండలి)

---

గునియు కుటపాగముల క్రొన్ననలు పైకిఁ
ప్రాకి బిగియారఁ గౌఁగిళ్ల వలచుచుండ,
నచ్చటచ్చటఁ బచ్చికగప్పు నెఱయు
వెండికొండ ననుకరించు నొండు చంద్ర
శాల వాతాయనాంతికస్థలిని విరజ
పగ లపరవేళ నేకాంతముగ నిలఁబడి
కుసుమ వల్లరు లెనయుంచి కొప్పుఁదురిమి
మునుకు నుడి నేదియో తలపోయుచుండె.

అపుడు సురపొన్న నొక్క నాదవతరిల్లి
విరజ దృక్కును వశము గావించు కొనియెఁ
గడఁగి యాగడెలోన సుత్కలిక గుబులు
కొను విలోకన సుమములు మునుముదీరి
తెమలు పరిచయ సికతాతలమున జాఱు
వారెను దనంత నటకే భావస్రవంతి।

పండి దుప్రులనె చిఱిఁగిపో నుండు ప్రసవ
సమితిమెక్క చొక్కిన కీరి సరణి రేగి
"కుంకుమాంకిత వర్ణాయ కుందకుట్మ
లేందు ధవళాయ భక్తావళీడితాయ
పక్షి రాజాయ తే నమో వైనతేయ"
యంచు ముకుళిత కరకంజయై నుతించె.

జలుఁగు తుంగదళ ప్రతిసీరఁ దొలఁగి
ప్రతి పదంబునా మంద నిస్వనము వెడల
వల్లరుల ముచ్చు చాత్మ ధమ్మిల్లమందు
నుండి బిసకాండములఁ గేరుచుండు కరము
లపు డయత్నముగ ముడింగె వపువు తొలక
రించెఁ జిరుచెమ్మటులు నాక్రమించె హృదయ
కువలయాదభ్రి సామ్రాజ్యశివము లోక
ముల కధిష్ఠాన దేవతఁబోని వలపు.

ముకుపుటమ్ము లబ్బులుఁ గటమ్ములు జలింప
బెను జిలువయొగ్గు నచలచాలనచణమ్ము
లగు గరుత్తులతోడ నీ వవనికి డిగ
నేటి నాభాగ్యగరిమ వర్ణింపనేరి
తరము ఖగవంశ జలధి సుధాంశు! గరుడ!
మూరుకొంటి ప్రమోదను శాంతమూర్తివగుచు.

ద్వారకావాసుఁ బోగడు సూక్తములు వినమి
దృష్ణ బంధము లెడలి వర్తించుచున్న
జీవితము మోడువడె నుదాసీనవృత్తి
యేల? చిల్కముని నచో వ్యాతము దవిలి
డాలువఘళించు పట్టుఁ బుట్టముల చెల్వ
మంగళకములకుఁ గొత్త బెడంగొసంగ
మొయిలనుండి నివాళించు మించుబోండ్ల
తొదల గాడెమునొకొ కృష్ణనీక్షణములు ?

మినమిన రహించు కొదమ తుమ్మెదలగుంపు
సారుకాదనునూగు మీసములతోడఁ
దనరు కృష్ణు సతంబు వెన్నొనుచు ద్వార
వతిని మారుఁ డధిజ్యధన్వుఁడె చెపుమ ?

వనభూమీజములండఁ జేసికొని యబ్జద్వేష్ట దూఁబూచులా
డును కంటే! విరజా! యతండు ములుగుట్టుంజుట్టి కోనేటినీ
టివిఁ దేఁబూనెను తజ్జలంపుఁ బరిపాటిన్నీకుఁ జూపింతుర
మ్మని హేలాగతి లాలసుండగు మహావ్యాఘ్రోపుఁ గీర్తించెదన్

## ముసలి తాత

అడివి బాపిరాజు గారు

పోతావటోయ్ పోలీసుఖైదూవొదలి
పోతా ॥

ఇరవైయేళ్ళ కితమొస్తివీ
యింటీకెడితె యెనకున్నారు
కంటీకి నేలా కొక్కాదారై కనిసేమట్టినీముసలిదీ
పోతా ॥

తాటీయాకుల కొంపంతాను
జారిముచ్చె వేడివాడికి
పాములు తేళ్లూ పందికొక్కులు పలకాలంటే చుట్టాలంటా
పోతా ॥

నువ్వూనాటిన చిన్న మొక్కలు
సువ్వూనయెదిగి మానులుకట్టాయి
ఖైదూపిండి విసిరీవిసిరీ ఖండలుఁకట్టింది నీవొళ్లంతా
పోతా ॥

ఖైదూవోర్డర్లు నేస్తూలంటావు
ఖైదూపెబులె మంచోరంటార్
ఖైదు గుమ్మందాటి యెళ్లానంటావ్ కళ్ళనీళ్ళు తుడుచూకుంటావ్
పోతా ॥

మానావ్రాడి జల్మంఅంతా
మఃగిపోసిన యనుమాంటావు
కటకటాలట్టుకు వొదిలిరావు ఖైదూలోనె వుంటానంటావు
పోతావటోయ్ ముసలీతాత
పోలీసు ఖైదూవొదిలి

పోతా ॥

# * రామన్న పంతులు—తిక్కన సోమయాజి

సిరుగూరి జయరావు గారు. బి. యస్. సి.

రామన్న పంతులింటిలో లేఁడని బోయి చెప్పగానే మఱలి నా యిల్లు చేరు కొంటిని. రామన్న పంతులు "వింతమనిషి." ఒక్కొక్కప్పుడు సాయంత్రము మెచ్చటకును బోకుండ నింటిలోనే కూర్చొనును. ఒక్కొక్కప్పుడున్నట్లే యుండి పదేసి మైళ్ళు షికారు నడచిపోవును. నేఁ డెచ్చటికిఁ బోయెనో?

ఇల్లు చేరుకొను సరికిఁ జీఁకటి పడి నది. గదిలోఁ గూర్చొని కొన్ని పత్రికలను జదువుచుంటిని. ఏపత్రికచూచినా, ఏపేజీ చూచినా, భావగీతికలే! గదినిండా దోమలు! గోడపైనున్న షెల్ఫులో నుండి పది పాత పత్రికలు దీసితిని; గుయి మనుచు నొక్కమారు పాతికదోమలు పైకి వచ్చినవి. ఈ దోమల వలన మలేరియా జబ్బు వచ్చునఁట! భావగీతికల వలన నేమి జబ్బు వచ్చునో?

ఎచ్చటఁ జూచిన కవిసోదరులే; కవి భ్రాతలే; సారస్యము తగ్గిపోవుచున్నది. ఇద్దఱిద్దరు కలసి వ్రాయవచ్చునుగాని యెప్పుడూ భ్రాతృత్వమేనా? మఱింత సొగసు పుట్టింప వలెనన్నచో భ్రాతృత్వమును మించిన సంబంధముండి తీఱవలెను. దాంపత్యమున్నచో భేషుక్కుగా నుండును. కనుక నింక మీఁదటఁ గవి దంపతులు, కవిజంటలు కవి వధూవరులు, తయారైనచో నాంధ్ర వాఙ్మయము మఱింత వన్నె మీఱునని నా మనవి.

కాని, ఒక్కచిక్కు పట్టుకొన్నది. బాల్యవివాహములకుఁ జోటైన మనదేశములో, బాలశిక్ష పూర్తిచేయని పెండ్లికొడుకును, అక్షరాభ్యాసమే లేని పెండ్లికూఁతురును, పెత్తనము వచ్చినప్పటికిఁ దుల్యబుద్ధులశోఁదూఁగఁ గలరనుటకేమి నిదర్శనము కలదు? ఇరువురకును కవిత్వమెచ్చటనుండి వచ్చును? కవిసోదర్యమునకుఁ గావలసినప్పుడు తగుమైన సోదరుని దెచ్చుకో వచ్చును; కాని, కవిదాంపత్యమునకుఁ దగిన స్వయంవరమెట్లు సంభవించును? ఇదియొక గొప్పచిక్కే!

"లోకమంతా ఒక్కటే రీతి" అని యీమధ్యనే మాదగ్గఱ చుట్టమొకఁడు, జయరావన్నవాఁడు, ఒకవ్యాసము వ్రాసి నాఁడు. చాలవిషయములలోనిది సత్యమే యని నేనుకూడ నమ్ముచున్నాను. పెద్ద పెద్దవిషయముల సంగతి యిప్పుడెందుకు, గాని, నిర్మాణవిషయములలో సోదర్యము కాదు, కాదు— దాంపత్యముకూడ కల్పించుకొన్నవారు పాశ్చాత్యులలోఁ గలరు. రసాయన శాస్త్రములో, పరాసుదేశములో క్యూరీయను వతఁడు తనభార్యయైన 'మేడం క్యూరీతోఁ గలిసి పరిశోధనలు గావించుచున్నాఁడు. "రేడియం" అను నద్భుత

మహిమలుగల పదార్థము నీమేడం క్యూరీ దొరసాని స్వయముగాఁ గనిపెట్టి జగత్ప్రసిద్ధిఁగాంచినది.

ఇదియిట్లున్నను పాశ్చాత్యులలోఁ గవిత్వమునందు సౌదర్యము, దాంపత్యము మొదలైనవి. పెట్టుకొన్నవారు విశేషించి నాకెక్కడను గనుపింపలేదు. ఉత్తమ కవిత్వమనఁగా హృదయనిర్గతమైన భావపరంపర. ఇది కవియొక్క ప్రత్యేకమనోగతులను బట్టి ప్రవహించుచుండును. ఇట్టికవిత్వమునకు నిద్దఱు, ముగ్గురు, కలసి దొరకొనుట హేళనపాత్రమని నాయుద్దేశము.

ఇదిగో యొక భావగీతిక

" దొరసాని వెడువఁటె ;
సరసాల నెఱుఁగవఁటె ;
చెఱసాల బంధంతువో ?
నాకు
సురసాల సుఖమిత్తువో ?"

దీనిని వ్రాసిన వారు కవి భ్రాతలిద్దఱు, ఈ దొరసాని యెవరో? ఈమె సురసాల సుఖమియ్యవలెనట! ఈ యిసపురిలో నెవరికో? "మాకు" అంటె సంధిగత మాయమై పోవును. కాని "నాకు" అని యేకవచనము. నారాయణ! నారాయణ! ఈ "లిరిక్కు" కవిత్వము యొక్క యుద్దేశము భావ ప్రకటనము, ఆత్మహృదయాశయ ప్రకటనము నైయుండగా నిట్లిద్దఱిద్దఱు కలసి "లిరిక్కు"లను వ్రాయుట మిక్కిలి హాస్యాస్పదము. కేవల నిర్మాణ కౌశలము చూపింపఁ దలచిన వారలిద్దఱు కాదు పదిమంది యైనను గలసి వ్రాయవచ్చును గాని యాత్మస్తోమ భావ ప్రకటన నొనర్పఁదలఁచిన యవసరమున నిట్టి వెట్టివెట్టి పద్ధతుల నవలంబించుట తగదు.

అన్నట్లు, దాంపత్యము మాట మఱతిని; గనుక దానిని గురించి సూచింపక ముచ్చటింప వలసియున్నది. శాస్త్రపరిశోధనలోఁ బాశ్చాత్యులేమి, ప్రాచ్యులేమి, సాధారణముగా నిద్దఱిద్దఱు కలసి పనిచేయుచుందురు. మొట్టమొదట నేదేశములోని కవిత్వములో వలెనే పాశ్చాత్యులు కూడ పరిశోధక-సోదరులు కలసి పని చేయుచుండిరి. కాని నేను ముందు సూచించునట్లు సౌదర్యములో సరసత గనుపింపలేదు. అందుచేతఁ బరిశోధక-దంపతులు బయలైనారు.

ఐనను పాశ్చాత్యులకు దాంపత్యముతో సాంగత్యము చాలినది కాదు. Marriage is the funeral of love— "వివాహము ప్రణయమునకు నంత్యక్రియ" అని వీరి యభిప్రాయము. వివాహము కాకుంతసేపే తమాషాగా నుండునట. అందుకే జర్మనీలోని "గేటె" కవిశ్రేష్ఠుఁడు తాను వలచిన కాంతతోఁ గాపురము చేసెనేగాని యామెను వివాహమాడలేదు. కొడుకులు, కూతుళ్ళు, పుట్టిన తర్వాత— వారుకూడ పెద్దవారైన తర్వాత— ఆస్తివిషయమైన యవసరము వచ్చుటచే నత్యవసరము లేక వివాహమాడెనట!

అందుచేత సిద్ధాంత పరిశోధనలలో సౌదర్యము పోయినది. దాంపత్యము పోయినది. దీనికి బదులు కన్యా బ్రహ్మచారి సంబంధమొకటి క్రొత్తగా వచ్చినది. ఒక వంకఁ బరమాణువులు, విద్యుదణువులు, రంజన కిరణములు, అఖండశాస్త్రములు! ఇంకొకవంక నా

ప్రకృతియెన్నటికిని ప్రకృతియే కదా? మానవ స్వభావమెన్నటికిని మానవ స్వభావమే కదా!

ఆంధ్రికపులారా! మీ సౌందర్యము వలన ప్రయోజనము లేదు; దాంపత్యము దుర్లభ్యము. ఇకఁ గన్యాబ్రహ్మచారి భాంధవ్యము నవలంబింతురా, శ్రీనాథుని విలాసములోని కవిత్వములోనికి దిగ జారెద రేమో:—

"ఏమను బ్రహ్మచారిఁ; దరశేషుని! కన్యవునీవు!"

నేనీ ధోరణిలో నాలోచించుచుండగాఁ దలుపు వద్దఁ జప్పుడైనది; తిరిగి చూచితిని.

"ఏమోయ్! రామన్నపంతులూ ఇప్పుడు వచ్చినావు. మీయింటి కిప్పుడే వెళ్ళి వచ్చితినోయ్. నీ వెక్కడకు వెళ్ళితివి?"

రామన్నపంతులొకకొంత చిఱునవ్వు నవ్వుచు లోనికిఁ బ్రవేశించుచుఁ జేతిలో నేదో పట్టుకొని దానిని ముంగిసనకుఁ జూపుచుండెను. చీకటిలో నది నాకు బాగుగాఁ గనుపింపలేదు. దీపము వత్తి పెద్దది చేసితిని. తటాలున హడలిపోయితిని.

"ఏమిటోయ్ రామన్నపంతులూ, పుఱ్ఱె తీసుకవచ్చితివి! నీకేమి పిచ్చిపట్టుచున్నదా?"

రామన్నపంతులు పక్కున నవ్వెను.

ఏమిటోయ్ నరసింహం ఈ పాటి దానికే భయపడినచో నీవెందుకు పనికివచ్చెదవోయ్!"

"భయము కాదు; మాయింట్లో డిప్టీకలెక్టరుగారు చాల యాచారవంతులు. ఈ సంగతి తెలిసినచో నిన్ను నన్ను కూడ గెంటివేసెదరు. దానికేమిలే, గాని, వీని నిప్పుడెందులకుఁ దెచ్చితివి? వైద్యశాస్త్రము మొదలు పెట్టినావా, యేమిటి?"

"లేదు. నేనొక యువభట సంఘము నేర్పఱచితిని. ధైర్యసాహస సౌద్ధత్యముల నభివృద్ధి పఱచుకొనుట యీ సంఘ నియమములలో నొకటి. ఈసంఘములోఁ బదునెకండు వత్సరముల బాలకుఁడొకఁడు దీనిని దెచ్చి నాకిచ్చినాడు. నీకుఁ జూపింపవలెనని తెచ్చితిని. నిష్పౌరుషమైన మానసికతత్త్వము ప్రవహించుచున్న మనరక్తనాళములలో నూతనసంస్కారము, నూతన పవిత్రత, కావలసియున్నది. ఉత్సాహములో సాహసములో, ఔద్ధత్యములో, భారతీయులు పురాతనకాలమున నెట్టిప్రసిద్ధిని జెందియుండిరో యిప్పుడంత యధోగతిలోఁ గ్రుంగి యున్నారు. విద్యాసంస్కారములేని తల్లులు "బూచి బూచి"యని భయపెట్టగాఁ బెంపఁబడిన బాలకులు దేశాభ్యుదయమున కెంత మాత్రమును బనికిరారు. బాలభటసంఘమువంటిదే నాసంఘముకూడ; కాని యిందులోఁ గ్రియాప్రాముఖ్యతకున్న గౌరవము కేవల వేషనటనాదులకు లేదు."

రామన్నపంతులును జూచుచున్న కొలఁది ఇతనిచర్యలను దెలిసికొనుచున్న కొలఁది మనస్తత్త్వశాస్త్రము చదువవలెనని పించుచున్నది "డాక్టరు జెకిల్: మిస్టరు హైడ్" అను కథలో నొక్కమనుష్యుని యందే రెండువ్యక్తులున్నట్లు చూపింపఁబడినది. ఇంతే కాక యొక్కనియందే బహువ్యక్తి సమష్టికలిగియుండవచ్చునని స్టీవెన్సనభిప్రాయమిచ్చియున్నాఁడు బహువ్యక్తిత్వము. రామన్న పంతులులో స్ఫురీకరింపఁబడినట్లు నాకుమతె

చ్చుటను గన్పింపలేదు. ఇప్పుడిప్పుడు యతని యుత్తరమును జూచితిని. శాస్త్రపరిశోధనకై కేంద్రీకృత మానసముతోఁ గడుంగినాడు. ఇతనికి యువభట సంఘముతో జోక్యము చేసికొనవలెనని యేల బుద్ధిపుట్టినదో దీనికిఁదోడిట్టి పిచ్చిచేష్టలుగూడనా! పదునొకండు వత్సరముల బాలునిఁ బాపించి పుత్త్రయొక్కటి తెప్పించుకొనుటా?

నేనిట్లంటిని:— "పరిష్కారణముగ నీ శక్తి నిన్నిభంగుల వ్యర్థపరచుకొనుట బాగులేదు. ఏదోయొక వ్యాపకము పెట్టుకొని, అందులోనే కృషి చేసి, పేరుపొందవలెనేగాని యొకవంక శాస్త్రశోధన, ఒకవంక యువభట సంఘము, పెట్టుకొన్నచో లాభము లేదు." ఇట్లు పూర్వపక్షము చెప్పి ప్రశ్నించితినేగాని నిజముగా నాకు రామన్న పంతులుయొక్క సర్వజ్ఞతయందే యెక్కువప్రీతిగలదు. విషయమునకును విషయమునకును అవినాభావము కలదు; అందులకే మన పెద్దలు సర్వశాస్త్రములను వేదముల కంగోపాంగములుగా చేర్కొనిరి. కేవల పారమార్థికదృష్టి తీక్ష్ణమగుటకైనను, కేవల వ్యావహారికాభివృద్ధి కలుగవలెనన్నను లేక ఆధ్యాత్మిక-ఆధిభౌతికములకు సంబంధము కలుగవలెనన్నను, మన చదువులో, మన యాలోచనలో, మనక్రియలలో అన్నిటిలోను సర్వవ్యాపకత్వము కలుగుటే శ్రేయస్కరము. అప్పుడే మనకు మానసిక వైశాల్యత కలుగఁగలదు; అప్పుడే మనకుఁ జిన్నచిన్న వైషమ్యములు, పూర్వపక్ష సిద్ధాంతములు, మున్నగునవి నశింపఁజేయు శక్తి కలుగును.

రామన్న పంతులు ముఖ్యోద్దేశములు చాలమట్టునకు నాకుఁ దెలియును. ఈయుద్దేశములలో మేమిద్దరము కలసి పనిచేయవలెననియే మేము నియమించుకొంటిమి. ఇతనియుద్దేశములు తెలిసినప్పటికి నితని కార్యలు మిక్కిలి చమత్కారముగ నుండును. అవి యప్పటికప్పుడే తెలిసికొనవలసినవేగాని యెన్నటికిట్లు పరిణమించునో యూహించుట కష్టము. ఇతని సంభాషణలు మనోహరములైనవి. ఆగంభీర్యము, ఆహాస్యము, అప్రతిపద ఘట్టనోచ్చారణము, మొదలైనవి ఆయూహాలు, అనన్యయు నతనినోట వెల్వడుచో వినుట మిక్కిలి యానందదాయకములు.

ఇతనికి స్వప్రతిభా ప్రకటనలో నెంతమాత్రమును జోక్యములేదుకదా; మిగుల మిక్కిలి స్వప్రతిభాక్షప్తియందుకూడ మిక్కిలి యాతురత లేదు. సంఘము, సంఘము, సంఘము ఎన్నిమాటలాడినను, ఎన్నిపాటలు పాడినను, ఎన్ని పనుల నొనర్చినను సంఘాభ్యుదయమునే లక్ష్యముగా నుంచుకొన్నాడు. ప్రత్యేక వ్యక్తికే సకలశ్రమలను ధారవోయుట నిరర్థకమని యితనియూహ. మానవుఁడు జీవించు కాలమత్యల్పము సంఘము జీవించు కాలము అనంతము. కనుక సాంఘికాభివృద్ధియే ప్రత్యక్షలక్ష్యముగా నుంచుకొన్నాడు. కొందరపార పాండిత్యము, ప్రతిభ, గలవారున్నారు. కాని, వీరు స్వప్రతిభాభివృద్ధియే చూచుకొన్నారు. కాని సంఘమున కేమియు, జేయక చచ్చిపోవుచున్నారు. ఇట్టివారినిగొందరు మెచ్చుకొందురు. బాహ్యప్రపంచముతో సంబంధము లేక సంతరంగాభివృద్ధికై కృషి చేసినందులకై వీరిని బొగడువారు కలరు. కాని వీరన్నచో రామన్నపంతులసహ్యభావముతోఁ జూచును. ప్రాపంచిక సంఘపురోవృద్ధి తప్ప మరేదియుఁ బ్రత్యక్షలక్ష్యముగ నుండరాదని యితనియూహ.

ఈ సంఘాభ్యుదయమునకై పన్నిన పన్నుగడలలో నొక్కటి ప్రతిపట్టణము లోను యువజనసంఘముల నేర్పరచుట. సారస్వతవిషయికములైన సమాజములుకొన్ని మన దేశములో నున్నవి. కాని సంఘము లోని ప్రతివ్యక్తికిని కేవలసారస్వత పటిమ యుండకపోవచ్చును. కనుక యువజనసంఘమును నిర్మించిఅందులోఁ బ్రతివ్యక్తికిని తత్తత్ప్రత్యేక ప్రతిభాబీజము ప్రకారము పనుల నేర్పరుప వలెను. నాయకుఁడై దారి తీయఁగల వాఁడున్నచో సంఘములో నెటు వంటి వాఁడైనను ఏదోయొక కృత్యమునకు సంసిద్ధుఁడై రాకపోఁడు.

ఈ యభిప్రాయమునకు మంచి నిదర్శనము మాకోదండ పాణియే. కోదండ పాణికి సారస్వత పటిమ లేదు. వాగ్ధోరణితో మాటలాడలేఁడు. సారస్వత ప్రక్రియలలోఁ జేయి చేసికొనలేఁడు. ఇతఁడు భౌతిక శాస్త్రములోఁ బ్రవేశము కలవాఁడు. చిన్నప్పటినుంచియు శాస్త్రశోధనా కౌతూహలము చూపించినవాఁడు, కొన్ని పరిస్థితుల చేత నిప్పుడితఁడు తన యుద్దేశములను నెఱవేర్చుకొన లేక పోయినాడు. కాని బాల వాణీనిలయమునకుఁ గార్యదర్శియై రేయుం బవళ్లు దానికై చందాలు వసూలు చేయు చున్నాడు. అధమ పక్షము పదివేలరూప్యముల నాలు నెలలలో సంపాదించి బాలవాణీ నిలయమున కీయవలెనని పట్టుపట్టినాడు. ఇతని ప్రచారకశక్తి, ఇతని ధనసంపాదన నైపుణి, ఇతని ప్రజా వశీకరణ పాటవము నద్వితీయములు. ఇట్లే ప్రతివాఁడును దన తన శక్తికొలఁది సంఘమునకు సేవచేయఁ గలఁడని రామన్నపంతులు నమ్ముచున్నాడు.

ఇంతలో మాధవరావు ప్రవేశించెను ఈ బాలకుఁడు చాల తెలివైనవాఁడు నన్నే వేవో ప్రశ్నల నడుగుచు జాగ్రత్తగ వినుచుఁ దన బుద్ధిని వృద్ధి చేసుకొనుచుండును.

"మా నాన్నగారికిఁ బుష్పమాల కావలెనఁట," అని యడిగెను.

"పుష్పమాల" తీసి యతనికిచ్చితిని; దానిని దీసుకపోవుచుండగా నతని బట్టు కొని రామన్నపంతులు, "దీనిని గూడ తీసి కొని వెళ్లవోయ్," అని చేతిలోని పుస్తకమునతని కందిచ్చెను. తటాలునఁ గుర్చీలోనుండి లేచి, యతని చేయి పట్టుకొని, దానిని లాగి కొంటిని. "ఇదెక్కడిది సరసమోయ్. సుబ్బారావుగారు చూచినచో మనల నందఱను గూడ గెంటివేసెదర"ని కోపముతో నంటిని. రామన్నపంతులు పక పక పక నవ్వెను. ఇదేమిటిరా యని నివ్వెఱపడి కుర్చీలోఁ గూర్చొని పుస్తకమును పరీక్షించితిని. అది కేవలము కట్టెలోఁ జెక్కిన పుస్తకము!

"ఇంతే నటోయీ, నీ "స్థైర్యసాహసాదత్య" మంతా? కట్టెపుస్తకముతోనా నీ గాంభీర్యము," అంటిని.

"దాని నెక్కడ కొంటినో చెప్పుకోఁగలవా." అని రామన్నపంతు లడిగెను.

"ఏ వడ్రంగి చేతనో చెక్కించితివి కాఁబోలు," అంటిని.

"దానిని జెక్కిన వడ్రంగిని నేనే!" అనెను రామన్నపంతులు

"నీవా!" అని యాశ్చర్యముతో నంటిని 'అవును, నేనే, నీవు వచ్చునప్పటికి మేడ మీఁదఁ గూర్చొని దీనిని జెక్కుచుంటిని ఇది పూర్తియగు వఱకు నెవ్వరికిని తెలియ రాదని నిశ్చయించి, నాకొఱకై నవసరము వచ్చి [illegible]

జెప్పియుంటిని. నీవు మాయింటికివచ్చుట నేనెఱుంగుదును. మేడమీఁదనుండిచూచి తిని. నిజముగా మాసంఘములోని బాలుఁడు నాకొక పుత్రి తెచ్చియిచ్చెను. నేను చిన్నప్పుడు ప్రియునింగు కాలేజిలో వడ్రంగి పని నేర్చుకొంటినని నీకు జెప్పి యుంటిని గదా. ఇప్పుడు కూడ తోఁచినప్పుడెల్ల యేదైనను జెక్కుచునే యున్నాను. మాసంఘములోని యువకులచేతఁ జేతి పనులుకూడ చేయింపవలెనని కొంటిని. బాలుఁడు తెచ్చిన పుత్రను జూచి దాని వలెనే దీనిని గట్టితోఁ జెక్కితిని,"

అద్భుతముగాఁ జెక్కినాడు; కొంచెము దూరమునుండి చూచినచో నిజమైన కపాలము వలెనే కనుబడుచున్నది.

"ఇక్కడ మహాభారతమున్నదా?" అని రామన్నపంతు లడిగెను.

"లేదు. సుబ్బారావుగారివద్ద నుండవచ్చును. మాధవరావూ, మహాభారతము తీసుకొని రావోయ్" అని మాధవరావును బంపితిని.

అతఁడు పోయి, 'పుష్పమాల' నిచ్చి పైచి, మహాభారతము తీసుకొనివచ్చెను. రామన్నపంతులు దాని నందుకొని, యిట్లనెను:—

"ప్రస్తుతము మన యధోగతిని దెలిసికొనవలెనన్నచో మన ప్రాక్తన వైభవముల నరసి కొనవలెను. ప్రస్తుతము మన తెలివితక్కువ తెలిసికోఁ దలంచినచో మన పురాతన మేధావిశేషము నెఱుఁగవలెను. అప్పటి యాచారములు, అప్పటి సాంప్రదాయికములు, అప్పటి పద్ధతులు, శిథిలములై పోయి, నాశనములైపోయి, నేటికిఁ బ్రాఁతై పోయి మన నెత్తిమీఁద నిలచియున్నవి. కటకటా! ఈశిథిల సాంప్రదాయములచే కౌఁగిలించుకొని మనము స్వజాతీయుల నిబ్బుకొనుచున్నామను కొనుట యెంత తెలివిమాలినపని! వీని నన్నింటిని ద్రోసి పారవేయవలెను; మన పూర్వ సాంప్రదాయములను మరల పునఃప్రతిష్ఠింపవలెను. నాఁటికిఁ గాని మన దేశమెంత మాత్రమును భ్యుదయముఁ బొందఁ జాలదు.

ఏశాప మహిమచేతనో, ఏ తిరస్కృతిమచేతనో, ఏపాపమునకుఁ బ్రతిఫలంబుగనో నేఁటికి శిథిలకుదశలలోఁ గ్రుంగిపోయిన భారత దేశమునకుఁ బూర్వవైభవములను సమకూర్పఁదలంచినచో, పూర్వౌన్నత్యము గల్పింపఁ దలంచినచో, పూర్వమహానుభావుల చర్యలను బూనింపకతప్పదు. ఆ నాఁటి కిప్పటి తెలివిమాలిన తనము లేదు; ఇప్పటి శిథిల సాంప్రదాయములు లేవు; ఇప్పటి అన్యోన్య వైమనస్యములు లేవు; ఇప్పటి తప్పుటూహలు లేవు. ఆహా! అప్పటి సర్వశక్తిత్వము, అప్పటి సర్వకార్యదక్షత, అప్పటి సర్వసమయ సంసిద్ధత, ఇప్పటికి ముచ్చునకైనను మిగుల లేదుకదా! ఇదిగో, మహాభారతముఁ జూడుము; ఆతిక్కన కవిబ్రహ్మ సృజించిన యీ యాంధ్రభారతప్రపంచములో సంచరించినప్పుడెన్నియాశలు పుట్టును! ఎన్నియుత్సాహములు పొంగి వచ్చును! ఎంత విజ్ఞానము పొడకరించును! ఒక్కతిక్కన పేరు చెప్పినంతనే చాలునుగదా యాంధ్రుల ప్రతిభాప్రభావము నెల్ల కాలమునకును. ఎల్ల దేశములకును. చాటింటకు ఒక్క తిక్కన సోమయాజినే యాదర్శముగ నుంచుకొన్నచో నొక్కపెట్టున

నాథ్రి యేవతమునుండి మూర్తీభవించిప్రచండశక్తి ప్రవహింపఁ గలడు గదా. ఘంటముతోఁ దాటాఁకులు పొడిచినాడు; ఖడ్గముతోఁ శాత్రవులఁ జీల్చినాడు! ఒకవంక రసప్రవాహము; ఇంకొకవంక రక్తప్రవాహము! బ్రహ్మతేజస్సు ప్రకాశించుచున్న ముఖమండలము; క్షాత్త్రవర్చస్సు తళ తళ లాడుచున్న నేత్రవికాసము! ఆవిజ్ఞాన విస్తీర్ణత; ఆజాతీయ ప్రచండత; ఆకవితారస వాహిని; ఆరాజకీయ ధౌరంధర్యము; ఆభాషాపోషక రాజసము; ఆ బ్రహ్మప్రజ్ఞాసత్వము; ఆ శత్రునిర్దళన తామసము! మూల మూలలఁ గూర్చొని పద్యములు వర్ణించుట కాదు; యుద్ధరంగమున నిలచొని శత్రువుల బుఱ్ఱలు దొర్లించుట కూడ! వేదమంత్రములు చెప్పుకొనుచుఁ, జచ్చిపోయినతర్వాత సమకూరు లోకమునకై విలవిలలాడుటకాదు; రాజ్యాంగ సూత్రములు పరిశోధించుచు భౌతిక ప్రపంచాభ్యుదయమునకై కంకణము కట్టుకొనుట కూడ!

ఆర్షతేజః ప్రభ నాహ్వానించినాడు; భార్గవ వష్ణుసుల నాస్వాదించినాడు! తాఁ జదువలేనిది లేదు; తాఁ జదువనిది లేదు. తాఁ జేయలేనిది లేదు. తాఁ జేయనిది లేదు. ఆహా! తిక్కనామాత్యా! తిరిగియవతరింపవా? తిరిగి యాంధ్రదేశమునకు నుత్తేజము కల్పింపవా?

రామన్న పంతులు ముఖమునిండఁ జెమటలు గ్రమ్మినవి; వానిని తుడుచుకొనుటకైనను యత్నింపడు. ఒకశేధోరణిలో గ్రుక్క పడవ కుండ నుపన్యాసమునిచ్చినాడు. అతని యావేశములో నొడలంతయు వేఁడెక్కెను; గుండెలు దడదడ కొట్టుకొనును. ఈపైమాటలు చెప్పునంతసేపు నిలుచొని చెప్పినాడు. ఇప్పుడు మాఱుమాటాడక గదిలోనుండి వెళ్లిపోయినాను.

రామన్న పంతులు సాంప్రదాయములు పరిగణింపడు. తనకిష్టము వచ్చినప్పుడు గదిలోనికిఁ బ్రవేశించును. మరల నెవ్వరును అనుకోని క్షణమున లేచి వెడలిపోవును. ఇతని యుద్దేశములు ఇతని యుత్సాహము ఇతని బుద్ధి వైభవము ఏ రూపమున వ్యక్తీకరింపగలవో?

ఈ వ్యాసము "రామన్నపంతులు" అను నవలలో నాల్గవ యధ్యాయముగా గణింపవలెను. మొదటి మూఁడు యధ్యాయములును, "క్రొత్తకబురులు," "ప్రొటా౯ అమ్మాయ్," "పిచ్చికుక్కలు-డాక్టరుడిగ్రీలు," అనుశీర్షికలతో వరుసగాఁ బుష్పమాల మొదటి మూఁడు సంచికలలోఁ బ్రచురింపఁబడినది.



తే॥ గీ॥ పూర్వవిఖ్యాతి మఱచెను పురుషజాతి
సడలె స్వాతంత్ర్యవాంఛ దేశంబునందు
పొలఁతి ? నీవేల యిటుల వాపోవు చుంటి
వెఱుఁగఁ జెప్పుమి నేనును బరితపింతు ॥

ఉ॥ భారతమొక్క నీశిరము వ్రక్క గసంబడు పుస్తకంబు త,
ల్లీ, రుచులొల్కునట్లు వచియింపవె కృష్ణునిరాయబారమో
దారుణ వాక్కుఠారమున ద్రౌపది భర్తల చిత్తపద్మమున్
దారణ మాచరించెడి కథావిధమో విని సంతసించెదన్ ॥

ఉ॥ రాములు తొల్లిటన్ మన పురాణయుగంబున వేదకాలమం
దేమొయి సంచరించి తనియించిరొ జాతిని, తత్కథావిధుల్
ప్రేమమెయిన్ వచించి యలరింపుమి కబ్బము లేల చింతతోఁ
సామయి కుందె దీవు నెఱజవ్వనపున్ సిరి తూలిపోవఁగన్ ॥

సీ॥ ఆయువైన నొసంగి యాత్మీయదేశంబు
ననువొంద జేయు భర్తను వరించి
భరతఖండమునకై బలికాఁదలంచెడి
సుగుణ రాజితులైన సుతులఁ గాంచి
నిజభావముల నెల్ల నెఱకబ్బముల నుందు
మృదుమధురంబుగాఁ బదిలపఱచి
సోదరీజనమును శుద్ధాంతమున నుండి
ముందున కుఱుకఁగాఁ బ్రోత్సహించి
తే॥ గీ॥ వార్ధకంబున నేకాంతవాసమందుఁ
దలఁచనలసిన యాశ్రమధర్మములను
బహుచుఁదనమున నెరపఁ బాల్పడగ నేమి
హేతువో వచియింపరాదే కృశాంగి ॥

ఉ॥ సోదరి యెంత పిల్చినను జూడవదేటికి నన్ను భావనా
హ్లాదపుఁ బారవశ్యమున మాఱెడ లేవొ జగంబు నీమనో
వ్యాధికి మూలహేతు వయినంతవ జంకఁగ నేల జ్ఞానసం
పాదనచేత దిద్దుమి ప్రమాదములన్ గొనుమమ్మ ధైర్యమున్ ॥




## శ్రీ శేషాద్రి రమణకవులు.

చం॥ వడికిన నూలువల్వ పలెవాటొనరించి విలోకనద్వయిం
దడిసెడి యశ్రుబిందువుల తాకునఁ జెక్కులు చన్నమాయఁగాఁ
బడతుక యోర్తు లేఁదలిరుపాన్పున జేరి పరుండి కేలు త
ల్గడ యొనరించె నెంత నొకకావ్యము లేఖిని యుండెఁ జాటుగన్ ॥

తే॥ గీ॥ పదిపదారేడ్లు నిండని ప్రాయమందె
ఉవిద! భూషణసంచయం బుజ్జగించి
బౌద్ధ భిక్షుకురాలి కైవడి జరింతు
వేల? దయచేసి చెపుమ నీ వెవతె వమ్మ ॥

ఉ॥ భారత వీర విక్రమము పాడరె నంచు విషాద మొందెదో
భారత మస్వతంత్రపరిపాకములోఁబడె నంచుఁ గుందెదో
పారసనేత్ర తెల్పదగు స్వాంతనికృంతన మాచరించుచున్
ఘోర విచారభారమునఁ గొందు నగంబును విశ్వసింతువా ॥

సీ॥ చాలిచాలని బానిసతనంపుఁ గూటికే
మురిసెను యువకసమూహ మెల్ల
ఆంగ్లేయకాంక్షల ననుకరింపఁగ నాంధ్ర
కాంతల మదులలోఁ గాంక్ష మించె
పారతంత్ర్యశ్రీమ పరిపాటియై పోయె
పరగ నాబాలగోపాలమునకు
ఐశ్వర్యవైముఖ్య మైహికాదివిరక్తి
ప్రజల మానంబులఁ బలుచఁబడియె ॥

చం॥ జగమును ధర్మమార్గమున జాతిని శాంతపథంబునందు (ద్రి)
ప్పగ ననువైన కాల మిది ప్రాయపుఁ జీకటి బోవనాడి మే
ల్తెగువను జూపి సన్న్యసనదీక్ష ధరింపఁగ నెంచితేని మా
తృగణమునీ కతంబునఁ దరించును కాంచెద వీవు ధన్యతన్

ఉ॥ కామవికారభావములఁ గాంచని నీ ముఖపద్మమం దొగిన్
ప్రేమసుధారసం బొగి స్రవించుచు నున్నది లేచి శాంతిసం
గ్రామము నందు నాయికవు గమ్మ శుభోదయవేళ యిద్ది నీ
ప్రేముడి నీకు మాతృపదవిన్ గయిసేయఁగనుండె నన్నిటన్ ।

కం॥ వందేమాతర మను నుడి
ముందు వినంబడియె లెమ్మి భువనక్షేమా
నందంబు గూర్ప నద నిదె !
యుందును నీయుద్యమమున కూఁతగ నేనున్ ॥



# రాయబారి

పెనుమర్తి వెంకటరత్నంగారు యువకవిమండలి

---

చిలుకకు చెప్పినట్టుల వచించిన మీమన మంధకారమున్
దలమిగ గ్రహింప నేర దడియాసఁ జెనంగునగాని, ధర్మసూ
తి లవమునే భయంపడదు దీర్ఘభవద్భుజ విక్రమప్రథన్
బలుకకుమోయి! వెగ్గలపు పల్కులు నాలొక్కని దండించుచున్.

ఆజినిమార్కొనంగ తఱిమైనపుడే గ్రహియింతు లెమ్ము! తే
జోజితభానుఁ డర్జును! డనుగ్రసన ప్రళయాంత రుద్రుఁడై
రాజిన యగ్నిలో ఘృతపరామృశతన్ పడిపెల్లురేగి బా
హాజనిత ప్రతాప సముదగ్రమహాకృతియైన రోజునన్,

ఇంతటి వంగశంబున జనింపఁగ జేసితివోయి! సీవ్రకా
లాంతమహాగ్నిఁ దీని కపుడారదు తుత్తు, మహాజివీధికా
కాంతర ధాశ్వికావృతులు కౌరవపుత్రులు మాడిపోవ రే
రంతులఁ దీరు నీహృదయ రౌద్రమ నీకులయాంతరుద్రమే!



శ్రీకృష్ణుని యమునా విహారము.

# చంద్రికాంతము



రాయసం వెంకట శివుడు గారు ఎం. ఏ., యల్. టి.

---

౧

మనుష్యజీవిత మొక పెద్దనాటకము. ఇందు వచ్చుపాత్రలు, ఎవరో నియమిత పురుషులు న్స్త్రీలును గాక లోకమునఁగానవచ్చెడి యన్ని మానవవ్యక్తులును. సామాన్యనాటకములవలె నీజగన్నాటకము విషాదాంతముగనో, హర్షాంతముగనో ఒకవిధముగనే యుండక, అన్ని తెఱఁగుల నాటకముల పోకడలను దాల్చియుండును. ఇది సర్వరస భూయిష్ఠముగను, సమస్తాలంకారసమ్మిళితముగనొప్పుచుండును. శృంగార కరుణములు, హాస్యవైరాగ్యములు, భక్తి భయానకములు, నియమబంధములు లేక, అడవి తీగలవలె, అల్లిబిల్లిగ నింకొక దానితో నొకటి యల్లుకొని యుండును. సాధారణ నాటకములందు వలె నీ లోకనాటకమధ్యమున దంచి తెన్నులు గానఁబడవు. గమ్యస్థానము చేరినను, ప్రథమరంగమునందు వలెనే నాటకోద్దేశ్యము సామాన్యుల చక్షువులకు విస్పష్టముగఁ గానిపింప కుండును. ఈకథ యర్థమేమి? యిందలి సార మేమి?— అని పండితులు పామరులు నొకవిధముగనే యాశ్చర్య మగ్నమానసు లగుచుందురు. ఇదియె జగన్నాటక స్వరూప లక్షణము

౨

ఎంత కాలమునుండి నాకన్నులు రామలింగముఁ బొడగాంచుచుండెనో నే జెప్పలేను. మాగ్రామమున మాయింటికెదురుగనుండు గృహమే యతని నివాసస్థానము. ప్రొద్దునమొదలు రాత్రి యగువఱకును వీథి యరుఁగుమీఁదనే రామలింగము కూర్చుండి యుండును. చిన్ననాఁడె యీసంగతి కనిపెట్టిన నేను, రామలింగమునకును ఆతిన్నెకును అభేదము గల్పించుకొని రెండు వస్తువులు నొకసారియె యుద్భవమై, యొకసారియె యంతరించు నట్టి సజాతీయ పదార్థములని భ్రమియించుచుందును. అరుఁగువలెనే యతఁడును చలనములేక సదా మౌనముద్ర దాల్చి యుండును. అతని కంఠస్వరము నాకు కర్ణగోచర మగుట మిక్కిలి యరుదు. సామాన్యులకుండు సుఖ దుఃఖములును, స్నేహ వైరములును, ఆ పురుషునందుఁ గానిపింప కుండును! ఇంతేల? అతడు నవ్వుచుండుటనే నెఱుఁగను! కాలిమీఁద కాలునైచుకొని, దృష్టినొకవైపునకే యుంచి, యామానవుఁడు కాలము గడుపుచుండును. ఈలోకపు సమాచారములు—పరలోక సమాచారములును—ఆపురుషుని మనసు నావంతయైనఁ గలంపకుండును!

చిన్నతనమున నేనును పొరుగున నున్న చెలికాండ్రును, పూవులకొరకై వారి వాకిట కేగుచుందుము. వాకిట నొకప్రక్క వివిధ వర్ణముల పూవులతో నొప్పు

చంద్రకాంతపు మొలకలుండును. బాల్య చాపల్యమున మాయెవరిచేయి యైన రేకులు విసువని మొగ్గలమీదికిగాని లేతయాకుల మీఁదికిఁగాని పోయినయెడల "వద్దు వద్దు!" అనుమాటలాయన వదనగహ్వరము నుండి వెడలి వచ్చును. ఆశబ్దములందు మనుష్యకంఠస్వరమున నుండు మృదుత్వ సరళత్వములు గానరాకుండును! ఏ కొండసారంగము నుండియో వెడలు పరుషవాయునాదము వలె నవి వినవచ్చును! అవి విని మేము, సింహగర్జనమునకులికిపడి విపినమునఁబడి పరుగెత్తికొనిపోవు లేడి కొదమల వలె చెల్లాచెదరై బయటికిఁ బారిపోవు చుందుము!

రామలింగము స్వభావమేమి? అతనికి మానవునకుండు గుణములు గలవా? కష్టసుఖము లాతని యనుభవమునఁ గానవచ్చెనా? అతని పూర్వోత్తరము లేమిటి? ఇట్టిప్రశ్నములునా మనసున నప్పుడప్పుడు స్ఫురించుచుండెను కాని, వానికిఁ దగు సమాధానములు మాత్రము తోఁపకుండెను. ఆతడెవ్వరిని గాని పలుకరింపడు. దీనికి ప్రతి ఫలముగఁ దన్నెవ్వరును బలుకరించి, బాధింపకుందురని యతఁడు రూఢిపఱచుకొని నటులుండును! కావున మౌన ముద్ర నుండి యతనిని మేలుకొల్పి, యతని నిర్వికల్పయోగమునకు విఘాతముగల్పించు పాపమునకెవ్వ రొడిగట్టుదురు? ఆకారణముచేతనే నేనాయన వృత్తాంతమును, ఆయన యూహాపోహములును గ్రహింపఁ గోరియు నెన్నఁడును ఆయన మౌననిష్ఠను భంగపఱచుటకియ్యకొనకుందును!

3

ఇటీవల కొన్ని సంవత్సరములకు వెనుక నేను స్వగ్రామమున కరిగితిని. మా గ్రామమున నచ్చట చూచినను నాకన్నులకు మార్పులు గన్పట్టెను. కాని, మార్పేమియు లేకుండినవి నాకచట రెండు పదార్థములే కానవచ్చెను. అవి, రామలింగము, రామలింగము కూర్చుండు తిన్నెయును! రామలింగ మిపుడును దినమంతయు తిన్నెమీఁదనే కాలము గడుపును. వాకిట నింకను చంద్రకాంతపు మొలకలు పెరుఁగుచునేయున్నవి. బాలురు బాలికలును, చక్కెర నాసించిన చీమలవలె అందలి రంగుపూలచే నాకృష్టులై, వారివాకిటఁ జేరుచున్నారు. పూలుగోయుట మితిమీఱినపుడెల్ల నిపుడును రామలింగము బొంగుగొంతు వినవచ్చుచునే యుండును. తోడనే బాలుర గుబగుబలు కర్ణగోచర మగుచుండును! ఆహా! కాలచక్ర మెవ్విధమునఁ దిరుగుచున్నది! ప్రాతలో నెంత క్రొత్తయిమిడి యున్నది! క్రొత్తలో నెంత ప్రాత ప్రస్ఫుటమగుచున్నది!

రామలింగము నందు బొత్తుగ మార్పు లేదని చెప్పవలను పడదు. వెనుకటి దేహపటుత్వము తగ్గి యిపుడాతని శరీరమున వార్ధక్య చిహ్నములు పొడచూపుచున్నవి. నల్లని యాతని కురులిపుడు తెల్లనయ్యెను. బాలుర హృదయములను భయముచేఁ గలంచెడి యాకనుల చూపు లిపుడు మాంద్యము గొనియున్నవి. అతఁడు దృష్టినింకను ఒకవైపునకే నిగిడించుండినను నరముల పటిమ సడలుట వలన తల యాఁగుచున్నది. అతని యాకారమెంతయు జాలి గొలుపుచున్నది. అయ్యో! యిపుడైనను ఈ మానవుని జేరి, అతని కష్టసుఖములు

విచారించి, నాకుతూహలము శాంతింపఁ జేసి కొనవలయునని తలపోసి, నేనొకనాడు వానిని సమీపించితిని.

వాకిటకేగి, రామలింగమునకు నమస్కరించితిని. నమస్కార మందుకొని యాతఁడు నన్నుఁ గూర్చుండుమని సైగ చేసెను. నామొగ మాయన యానవాలు పట్టకుండుట గ్రహించి, నన్ను నేఁ దెలిపికొంటిని. అంత నతఁడు చిఱునవ్వునవ్వి, నా యోగక్షేమము లడిగెను. ఏమి, చిఱునవ్వు నవ్వెనా? ఔను, చదువరులారా! మొదలంటి మోడువడిన యొక జీర్ణవృక్షము మీ కన్నుల యెదుటనే లేఁ జివురుతోఁ గప్పబడినచో మీ కెటులుండును? గ్రీష్మ దివసమున మట్టమధ్యాహ్నపు టెండలో నడచు మీ మీద నెదురు చూడని చల్లని వాన చినుకులు గురిసిన నెటులుండును? సంతోషాశ్చర్యములు నామనస్సున ముప్పిరిగొనఁగా నిపు డతనికిఁ గొంత చెప్పుచు వచ్చియుండినను వానితోఁ బ్రసంగము నాకు మిక్కిలి సంతోషకరముగ నుండెను. "జన్మమునకెల్ల శివరాత్రి యొకటియె యనునట్లు, ఈ సంభాషణమె రామలింగమునకు నాకును— నాకె యననేల, లోకమునకును— ఈ జన్మమున జరుగు ప్రథమ ప్రసంగము గదా!" యని నేను మెల్లగ నంటిని. అపుడె యాదారిని బోవు పరిచితులొకరు, నాయెదుట నిలిచి, అట్లు కాదనియు, ఇటీవల రామలింగము మిగుల వ్యాధిగ్రస్తుఁడయ్యెననియు, అప్పటి నుండియు చోద్యముగ నాతఁడు వెనుకటి మౌనమును వదలి ప్రజలతో ధారాళముగ మాటాడుచున్నాఁడనియు నాకు జెప్పి, వెడలిపోయెను. ఇదివిని, నాయాశ్చర్యమతిశయిల్లి, రామలింగముతోడి సల్లాపమునకు మఱింత యుత్సాహమునఁ బూనుకొంటిని.

౪

రామలింగము తోడి సంభాషణము నాకమితాశ్చర్యము గొలిపెను. పేరుకుఁ బ్రసంగమంటిని గాని, ప్రవక్తయాతఁడొక్కడే! దీర్ఘకాలము చెఱసాలలో నుండివిముక్తి నొందిన వానితో సామాన్యుఁడు నడువఁ గలఁడా? చిరకాలము కారాగృహము చేసినవాఁడు గావున, వానికిసూర్యచంద్రులు వాయువర్షములును, వర్ణనాతీతమగు సంతోషము నొసంగును. కాలు గుడుసు తీరునట్టుగ వాఁడు నడచిపోవును. మనసు వచ్చినట్టుగఁ బరుగెత్తి, తనకు నూతనస్వాతంత్రిత లభ్యమగుట తథ్యమని తన్ను రానొప్పింపఁజూచునటులఁబ్రవర్తించును. అట్టివానితో సామాన్యులెట్లు సాగిపోఁగలరు. రామలింగము నటులె, జీవితకాల మంతయు మితభాషిగ మెలంగెను. కారాగృహవాసమనుభవించి విసిగియున్న యాతని నాలుక, ఇపుడు వ్యాధిమిషగాఁగొని, స్వేచ్ఛనంది, విచ్చల విడిగా విహరింప నారంభించెను! కావున నతఁడిపుడు ఎదుటి వానిని మాటాడనీయక, ఎంత సేపును తానే ప్రసంగింపఁ జూచును. పెరుఁగుట విఱుగుట కొరకే! మితభాషి మాటలమారిగ మాఱిపోయెను!

౫

తన వృత్తాంతము చెప్పుమనుటయె తడవుగా రామలింగమిట్లు పూస గ్రుచ్చినట్టుగ బలికెను:—

"మాకుమారుని నాలుగవయేట మా పుత్రిక జనన మొందెను. అట్టి

రూపవతి భూలోకమున నిదివఱకుద్భవింప లేదని మేము నమ్మియుంటిమి. ఇంతేకాదు. కవులు వర్ణనములందు పేర్కొను సుందర కుసుమములైనను, మా బాలమేని సొబగునకుఁ దీసిపోవును! చెలువమున సరిగా పోలిన పూవుపేరు దానికిడ వలయునని తలంచి, దానిమేని సౌకుమార్యముతోను, చిఱునగవు సొంపుతోను గొంత సాదృశ్యము గాంచిన చంద్రికాంతమును మెచ్చుకొని, బాలిక కా పేరు పెట్టితిమి.

"చంద్రికాంతము చక్కఁదనము వయస్సు వచ్చిన కొలఁదిని శుక్లపక్షపు చందురుని కళలవలె దినదినాభివృద్ధి నొందుచుండెను. దాని బుద్ధిసూక్ష్మత నయసంపదయును లావణ్యమునకుఁ దీసి పోవకుండెను. విద్య నేర్పించినచో నీబాల వివేకాదులు మఱింత వికసింపఁ గలవనియెంచి, దాని నా గ్రామమందలి బాలికా పాఠశాలలోఁ జేర్పించితిని. తీఱిక సమయములందు నేనును రమ్యములగు పద్యములు నేర్పుచుందును. అది నేటిది శ్రావ్యముగఁ బాడని పాటలులేవు. ఈకిన్నర స్వరమునకుఁ దోడు సంగీత విద్యా కౌశలమున్నచో, సువర్ణమునకు సువాసన యబ్బినటులుండునని నలుగురును చెప్పగా చంద్రికాంతమునకు సంగీతము చెప్పింప నారంభించితిని. ఆహా! సంగీతమునందును అచిరకాలముననే మా బాలమిన్నయయ్యెను. మా చిన్నిబాల వీణ చేతనుంచుకొని త్యాగరాయ కృతియందు కొనినపుడు, మేము నివసించునది భూలోకమని మఱచి పోవుచుందుము! పరవశులమై పోయిన మామదిందు, ఏగంధర్వకాంతయో, ఏయప్సరస్తరుణియో వీణ మీటుచుండునటుల మేము భ్రమించుచుందుము!

౬.

'ఈపాపపు లోకమున వెన్నెల రాత్రులతివేగముగ తొలగిపోవును. చిమ్మచీకటులు గ్రమ్ము నిశాసమయములు దీర్ఘములై, కనులంజీకాకుపఱచి, ఎవ్వరికిని తుదిలేని తమ స్వేచ్ఛావిహారములు సాగించుచుండును. చంద్రికాంతము బాల్యపు దినములతోనే మా గృహమున శాంతి సౌఖ్యములును అస్తమించెను. సాధారణ స్థితిగతులలో నుండిన విద్యావంతుఁడును బుద్ధిమంతుఁడును నగు నొక యువకున కీబాలిక నీయుఁడని చెప్పు పుత్రిక హితవాక్యములు పెడచెవిని బెట్టి, సద్వంశమును బాటించి విఖ్యాపరుఁడగు నాపూర్వపు సహాధ్యాయుఁడు విశ్వనాథయ్యగారి ప్రథమ పుత్రునికి నాకొమరితను బరిణయము చేసితిని. వయసలు సజ్జనుఁడే కాని సాధునగు నాస్నేహితునికి గయ్యాళియగు భార్య దాపరించెను! నేనిచ్చిన వేయి రూప్యముల కట్నమును, జరిపిన లాంఛనములును, ఆయమ కేమియు గొఱగాకుండెను! ఆపుణ్యవతి కాంత సేపును, మాయింటినుండి తన గృహమునకు, ఆకాశగంగవలె సంతత ధారగ ధన మూదారలుచుండవలెననియే కోరిక! మాకట్నములు కానుకలును గానవచ్చునంత సేపును ఆమె ముఖము వికసించును. లేని యపుడు, మామీఁద చెలరేగుచుండును! ఎన్నాళ్ళు మేమీ దేవతను ధనశాంతి చేత సంతృప్తి పఱుపఁగలము?

"కాఁపురమునకుఁ బోయిన మఱు

నటిదినము నుండియె మాకొమార్తెకు అత్తవారింట ఘోరారంభమయ్యెను. చంద్రికాంతము శరీర సౌందర్యము ఆడుబిడ్డల కన్నులకుఁ గంటక మయ్యెను! కులాంగనలకీ సౌకుమార్య మెందులకని యత్త యారండించుచుండును. అత్తకొదిగి యుండు మామయు, అక్కచెలియండ్రు దుర్మంత్రములకు జెవియొగ్గు సోదరుఁడును, కోడలిని చదువు చాలింపుమని నిర్బంధించిరి. పాపమాపసిబాల యేమిచేయఁగలదు? సరస్వతివలె నహర్నిశము పుస్తకములు ముందువేసికొని యుండు మాపుత్రికయత్తవారింట నిఁక పుస్తకము తాఁకఁగూడదు! ఇంటి పనిలోనె యెపుడును మునుఁగుచుఁ దేలుచు నుండవలయును! పరధ్యానమున నెపుడైన నేకీర్తన యేని చంద్రికాంతము నోటినుండి వెడలిన యెడల, వెంటనే యత్త కోపాగ్ని కామె యింధనము కావలసినదే! ఆహా! చంద్రికాంతము దేహమున సౌందర్యమ లకెట్టి దశ వాటిల్లెను! వగలాడి, వన్నెలాడి యని నిరంతరముదాని నాఁడుబిడ్డలాడిపోయుచుందురు! కులపాలికలకీ మాయసంగీతమేలయని యత్త చిందులు ద్రొక్కుచుండును.

"కొంతకాలమునకుఁ బిమ్మట మా యింటికి వచ్చిన చంద్రికాంతమును మేము గుర్తింపలేకపోతిమి. ఈపట నెలలలోను పదియేండ్లు పైఁబడినదానివలె నయ్యెను! కనుబొమలుక్రింద ముడతలు పడియుండెను. సువర్ణకాంతితో తేజరిల్లవలసిన దాని ముఖము అనారోగ్య సూచనమగు ధవళిమను దాల్చియుండెను. లేత తమలపాకులవలెఁ గోమలములుగనుండు పాణి తలములు కాయలు గాచియుండెను. చేయి త్రిప్పి చూడఁగా వ్రేళ్ళ కణుపులు పుండ్లతో వాచియుండెను. ఇది యేమియని యడుగఁగా, దుఃఖము నాపుకొనలేక యాబాల, వెక్కి వెక్కి యేడ్చి, అంట్లు తోమలేనని చెప్పిన తన వ్రేళ్ళమీఁద నొకనాఁడు గరిటె కాల్చి యత్త వాతలు వేసెనని ప్రత్యుత్తర మిచ్చెను! మాకంత మతి సంచలించి పోయెను!

౨

"పరులు పెట్టుబాధల కెంత యోపికతో నూరకుందమన్నను, లోకము మన మనస్సులను గలియఁద్రిప్పి మన యాగ్రహము నితరుల మీఁద కుపి కొలుపుచుండును! మా యమ్మాయి పుట్టినింటికి వచ్చిన మూఁడుమాసములకు నాకొక జాబువచ్చెను. అది యల్లుని యొద్దనుండి వచ్చినది. అల్లుని మంచితనమునఁగ నాకిపు డనుభవ పూర్వకముగఁ దెలిసెను! సత్కులసంజాతుఁడనియు సువిద్యాసంపన్నుఁడనియుఁ గాఁబోలు గడిగి నేనన్నియు నిచ్చినకారణమున నన్నాతఁడు చులుకనగఁ జూచుచుండుట నాకు విదితమయ్యెను. పరుల లోపములు తెలువరించు విషయమున మాకొమార్తె మిక్కిలి మితభాషిణి యైనను మాకది చెప్పు మాటల సందర్భమున నా మీఁద నల్లునికిఁ గల ప్రేమ గౌరవము లిట్టివిగదా యని నేను గ్రహింపఁ గలిగితిని. ఆయుత్తరము విప్పి చూచుకొనఁగా నాకు వాని యనుభావ మన్నుతెను గొల్పెను. కర్ణకఠోరములుగ నున్న నా యుత్తరములోని విషయములు మీకుఁ జెప్పి, మిమ్ము వ్యాకులత పాలు చేయను. వైశ్యదేవపరుఁడను శాస్త్రాధ్యయన నిరతుఁడను నగు నన్ను, ఈపసిబాలుఁడు "ఏమోయి"!

యని సంబోధింప మొదలిడెను! "వయస్సు వచ్చిన పిల్లను ఇంత కాలము పుట్టినింటఁ బెట్టుకొనుట అనుచితమని పెద్దవాఁడవగు నీకుఁ గాకపోయినను, ఆఁడుదానికైన తెలియవలదా?" అని యతఁడు వ్రాయుఁజొచ్చె! ఈ యేకవచన ప్రయోగ గౌరవ మందుకొనిన వాఁడను, తనకుఁ గన్యనిచ్చిన బుద్ధి మాలిన నేను! "ఆఁడుది" నా సహధర్మచారిణియగు భార్య! ఆహా! ఈ సమ్మానములు తరతరములకును జాలును! ఈ జాబు సాంతముగఁ జదువకయె చింపి పొయిలో వేయవలెనని నేను మొదటఁ దలంచితిని కాని యాగ్రహమణఁచుకొని, ఇట్టి యల్లు నింటికిఁకఁ గూఁతు నంపరాదని నిశ్చయించుకొంటిని! నామాట కడ్డుచెప్ప వచ్చువారిని దిరస్కరించుచుందును కాని, నాకోఁపము చల్లారిన వెనుక, కొన్ని దినములకు నేను శాంతముగా నాలోచించితిని నా సతియు సుతయుఁ జేసికొనిన నిశ్చయమే నాకును శ్రేయమని తోఁచెను. ప్రప్రథమునఁ గోడలి యెడల నింటివారలుక వహించినను నిలుకడమీఁద వారె శాంతించెదరనియును, ముఖ్యముగ భార్యాభర్తల వైరములు చిరకాలము నిలుచునవి కావు కావున క్రమక్రమముగ వారి కాఁపురము కుదుటఁబడుననియు, నాకు హితులు చెప్పిరి. అంత నొక మంచి దినమున కుమారునితోడిచ్చి, కుఁతు నత్తవారింటికిఁ బంపివేసితిని.

౮

"తన బావమఱఁది యిపుడు పట్టణమున నుద్యోగము చేయుచున్నాఁడనియు, శీఘ్రకాలములోనే యతనికిని తన చెలియలికిని సౌమనస్య మేర్పడఁగలదనియు మా పుత్త్రిని వలన విని మేమెంతయు ముదమందితిమి. అపుడపుడు తన జాబులలో, భర్త తన్ను హింసించుచున్నాఁడను సర్ధము సూచించి మాటలు చంద్రికాంతము ఉదాహరించుచున్నను, ఇట్టి గృహచ్ఛిద్రములలో పరులంతగ సంబంధము గలుగఁ జేసికొనకున్న వానియంతనవియె చక్కఁబడునని నే నూరకుంటిని. ఎట్టి ప్రయోజకుఁడైనను మా అల్లుఁడు తన భార్యయందనుమానము గలిగియుండెనని చూచి వచ్చినవారు చెప్పుచుందురు. ఉద్యోగస్థానమునకుఁ బోవునపుడు, భార్య నింటఁబెట్టి తలుపు తాళము వైచి మఱియతఁడు పోవుచుండు ననియు, పత్నియెడ నతనికి లేనిపోని యనుమానము లున్నవనియు, 'నాకింగను వినవచ్చుచుండినను, అవి విననట్టుననె నేభావించుచుందును ఇంతియెగాక పలుమారు మేము కొమరితనుఁ జూచి వచ్చుచుండుటయే సతీపతుల యన్యోన్యమున కాటంకమేమో యని, మేమూహించి, యింటనే నిలిచియుందుము.

౯

"ఇటులుండఁగ నొకానొక దినము నాకు తంతివచ్చెను. మా కొమార్తె కేదో యుపద్రవము వాటిల్లెనను వార్తయందు సూచింపఁబడెను. కాళ్లాడక మేమందరము బయలుదేఱి పోతిమి. ఇంకఁ జెప్పుటకేమి గలదు! నీరుబోడు చుండఁగా, చేఁదత్రాఁడు మెడకుఁ జుట్టుకొని రాత్రిసమయమున మా కొమార్తె బావిలోఁబడి పోయెననియు తెల్లవాఱునదాఁకను దమకది తెలియదనియు, అల్లుఁడు వాని తల్లియుఁ జెప్పివేసిరి! ఆయాఁడు కూఁతురు అడుగడుగునకును కంటతడి పెట్టుచునే యుండెను. పుత్త్రికాశోకమున

వనరు మమ్మితరు లోదార్పుటకంటె ఆ యిల్లాలి నూరడించుటయే మాకందఱికిఁగష్ట మయ్యెను! మాకూఁతు చావు విషయమున అనుమానమున్న దాని చెప్పఁడనియు పిల్ల మరణమునకు అత్తయు పెనిమిటియు కారకు లనియు నలుగురును హెచ్చరించుచున్నను మాకీసంగతులేమియుఁ దెలియవని మేము చెప్పితిమి. మాబిడ్డప్రాణములె పోయిన పిమ్మట ఇతరుల ప్రాణముల జోలి మాకేల?

౧౦

"కొమరిత చనిపోయినప్పటి నుండియు జీవితము నాకు నిస్సారమయ్యెను. లోకమునందలి దృశ్యములు చూచుటకుఁ గన్నులును, శబ్దములు వినుటకు వీనులును ఇచ్ఛగింపక, తమతమపనులు నిర్వర్తింప మానుకొనినటులున్నవి. లోకధర్మమునియే చేదుమ్రింగునట్లు నేను జీవయాత్ర నడపు కొనుచున్నాను. అన్నివస్తువులును జిహ్వకు బెండువలె రసహీనములైయున్నవి. అంత కూఁతునుగోలుపోయిన వానికింక నేవస్తువు మీఁద వాంఛయుండును? ఏమిచేయుటకుఁ దోఁచదు. మౌననిష్ఠతో దినములు గడుపు చున్నాను. తుదిపయనము గట్టవలసిన తరుణమున తాపసతాపము లెవ్వియులేక నిర్వాంఛాచిత్తుడనై నిష్క్రమింప నున్నాఁడను!

"ఇంకొక సంగతి చెప్పి ముగించె దను. కొమార్తెను జూడ నోచుకొనని కన్నులతో నింకొక వస్తువును నేగాంచనొల్ల కొన్నను నాచక్షువులకు చంద్రకాంతపుఁ బూవుల సౌరొకింత శాంతినొసంగుచున్నది! మా చంద్రికాంతమువలెనే చంద్రికాంత మును సుకుమార కిసలయచలమున నామ్రోల లాస్యము చేయనటులుండును! ఆపూవును గాంచినాకన్నులు కొంతతనియుచుండును. ఇది భ్రమయె యైనను, అభ్రమను మఱిఁగియొ యంతరంగము శాంతినొందు చున్నది!

ఈ మధ్య నేను వ్యాధి గ్రస్తుఁడనై, మర్త్యలోకము విడిచిపోవనున్న సమయమున పుత్త్రిక స్వప్నమున నాకంటఁబడి, "నాయనా! ఏల నీవింకను విచారతోయమున మునిఁగి యున్నావు? నన్నుఁగూర్చియైన నలుగురితో నీవుమాటాడుచుండుము! నీబంధమో చనంపుఁగాలము సమీపించుచున్నది!" అని నాకుపదేశించి మఱిచనెను. నాకింకేమి కావలయును?"

ఈ వృత్తాంతము చెప్పి రామలింగ మును, విని నేనును ఎంతయు నూరడిల్లితిమి!



# సమాజలాభములు.

శ్రీమతి వి. కె. శారదాంబగారు (ఇంటర్ విద్యార్థిని.)

కం॥ సామాజికలాభంబులు సామాన్యముగాపుగాన సంగ్రహముగనన్
కామినులారా దెలిపెద నేమారక వినుడుకీని నెంతయుప్రీతిన్ ॥

సీ॥ స్త్రీవిద్య నభివృద్ధి జెందింప వలెనన్న సామాజమే తగు సాధనంబు
ఐకమత్యముగల్గి యలరారవలెనన్న సామాజమే తగు సాధనంబు
సత్కార్యమిలలోన సలుపంగవలెనన్న సామాజమే తగు సాధనంబు
చెలులతో గూడి చెలిమిచేయుదమన్న సామాజమే తగు సాధనంబు

కం॥ ఇంత వివరింపగా నేల యింతులార। సకలధర్మ బులను దెల్పి సతులకిం
నైహికాముష్మిక సుఖంబు లమరజేయ। సాధనము సమాజములెగా సఖియలార ॥

సీ॥ పోరాటములుమాన్పి కూరిమి నొసగును సంఘముల్సతులకు సఖియలార
కపట భావముమాన్పి ఘనబుద్ధిబోధించు సంఘముల్సతులకు సఖియలార
ద్వేషబుద్ధినిమాన్పి దోషరహితులజేయు సంఘముల్సతులకు సఖియలార
అవివేకమును బాపి సువివేకమును గూర్చు సంఘముల్సతులకు సఖియలార

తే॥ యింత వివరింపగానేల యింతులార సకలధర్మార్థములదెల్పి సత్వరంబె
సంఘసంస్కార ప్రియులగా సలుపుమనల సంఘముల్సర్వదా భువిసఖియలార ॥

తే॥ కాన మనమెల్లరము ఏకమానసుండ నెన్నివిఘ్నంబు లిలమనకున్నగాని
సరకుజేయక దాసిని సత్వరంబె సంఘమభివృద్ధి నొందెడి సాధనంబు
సలుపబూనుదమెంతయు సఖియలార ॥

సీ॥ ఎవతెరో పసిలేని యువతిపోవలెగాని మనకేల సభలనుమానసుడ
సభకేగిమనమేమి సాధింపగలమను చులకనగామీరు చూడకుండ ॥
పూర్వంబు మనస్త్రీలుపోయిరే సభలకు మనకేలపోనను చుపవకుండ
మగవారివలెస్త్రీలు తగదు సభాస్థానములకుపోవుటయని దలచకుండ।
యెన్నినిర్బంధములుమీకు నున్నగాని వీలుకలిగినయపుడెల్ల వేడ్కమీర
సభలకేగుచు పలువిధసంగతులను దెలిసికొని భరతమాతకు కీర్తి ॥

క॥ ఏమని పొగడగనోపుదు సామాజిక లాభములను సఖులారయికన్
సామాన్యము గావవి గావున స్వామినియీరీతిగాగ స్మరియింతమిటన్ ॥

క॥ హిందూ మహిళాసంఘం బెందునులోపంబులేక యీభూస్థలి నా
నందముతోడుత ప్రబలుటకుం దయచేయుమీశ కూరిమితోడన్ ॥

క॥ లోకేశయీ సమాజము నీకరుణాకటాక్షమునను నిరుపమఖ్యాతిన్
లోకమున బొందివర్ధిల చేకొనకరుణింపుమయ్య చిన్మయమూర్తీ ॥

సీ॥ శ్రీమీరగాను హిందూమహిళాసభ వార్షికోత్సవమాట వాంఛదీర
మేము సంప్రీతితోమీకు పంపినయట్టి యాహ్వానముల ప్రీతినాదరించి
పనులలోనిదియొక్క పనియంచుదలపోసి వలనొప్ప నిచటికివచ్చి నేడు
సమసూ మాకెంతో సంతోషమునుగూర్చి నందుకెంతయు మోదమందియిదిగో॥

వందనంబుల నర్పింతు మందికొనుడు సాధుసంస్కార ప్రియులైన సఖియలార
భరతమాతకు కడుగూర్చు వత్సలార భాగ్యనగరనివాసులౌ భామలార ॥

సీ॥ సఖులారమిముగూడి సద్విషయంబుల భాషించునటువంటి భాగ్యమొదవె
సతులారమీతోటి సత్సహవాసంబు పరమప్రీతి జేయు భాగ్యమొదవె
చెలులారమిముగూడి శ్రీపరమేశ్వరుభక్తితో కీర్తించుభాగ్యమొదవె
లలనలారా మిమ్ములనుగూడి యానందవార్ధిదేలెడు మహాభాగ్యమొదవె ॥

యిట్టిభాగ్యంబుమనలకు నెలమిగూర్చి నట్టిపరమేశ్వరునిమది నభినుతింప
తగినయదనిది కావున తరుణులార సాధుజనవంద్యు నిటువలె సంస్తుతింతు ॥

సర్వేశ సర్వజ్ఞ సర్వలోకాధార శాంతస్వరూపయో సాధువంద్య
సర్వసద్గుణభూష సకలలోకారాధ్య యాపదోద్ధారకా యమలచరిత
అఖిలాండకోటి బ్రహ్మాండనాయక దేవ కరుణామయానిర్వికార యీశ
ఆత్మప్రకాశకా యానందనిలయుడో పక్షపాతవిహీన భవ్యనామ ॥

భక్తవత్సల యీ సభాభవనమునకు నేడు విచ్చేసినటువంటి నెలతలకును ॥
పరమప్రీతిని యాధ్యక్షపదముబూని వచ్చిమనలను సంతోషవార్ధిదేల్చి
నట్టి శ్రీసుమిత్రాదేవి యమలమతికి సర్వశుభములనొసగుమో సదయహృదయ.





# కథకుఁడు.

కోడూరు రామచంద్రరావు బి. ఎ. బి. యల్.

---

ఒకప్పు డొక పత్రికాధిపతి యుండెను. ఆతఁడే సంపాదకుఁడు గూడ. అతనికి చిన్న కథలను గూర్చి కొన్ని యాదర్శములు నభిప్రాయములునుగలవు పత్రికాధిపతులకట్టివి యుండుట వింతకాదు. వారు వారియుద్దేశములకు సరిపడిన వ్యాసములు, పద్యములు, కథలను స్వీకరింతురు. తక్కినవి మణిమాణిక్యములైనను గైకొనరు. చూడనైనచూడరు. ఇఁక ప్రచురణగూర్చి చెప్పవలసినదే లేదు. వారికి నచ్చినవానిని ద్రవ్యముగూడ నొసంగి ప్రచురింతురు. లేనిచో లేదు. ఇఁక కొందరికి మోమోటమి యుండును వారు బిరుదులు వాచస్పతి, విద్యావిశారద, బి, యే, బి, యల్, బాలకవి, మొదలగునవి కాని, అథమము ఆయుర్వేద భూషణమో, శానిటరీ యింజనీరు బిరుదమో, రావుబహద్దరు బిరుదమోయుండినఁగాని ప్రచురింపరు. ఆయుర్వేదభూషణులకు, నింజనీయర్లకును సారస్వతమునకుఁ గల సంబంధమేమియనినైనవారు విచారింపరు. ఇదివారి వారి చిత్తవృత్తుల ననుసరించియు, తెలివితేటల ననుసరించియు నుండును. పుత్రశోకబుద్ధి జిహ్వకొకరుచి "

ప్రస్తుతము మనము ముచ్చటించుచున్న పత్రికా సంపాదకునకుఁ జిన్నకథల గూర్చి కొన్నియభిప్రాయము లుండెనని తెలిపి యుంటిమి. ఆయన యభిమతము కథలు భావోదయములుగాక (Imaginative) ఆదర్శప్రాయములుగాక యదార్థ్యములు (Realitic) ను సహజములునై యుండవలెనని స్వాభావికములగు కథలే కథలని వాని యుద్దేశము "ఉన్నవి యున్నట్లుగనుండనిమ్ము" అనియాతఁడు తనమిత్రులతో ననుచుండును జీవితమే గభీరము. అది యాద్యంత రహితము. మరియు వర్ణనాతీతము. తఱచినకొలఁది దానియందు విశేషములు బయలువడు చుండును. అద్దానిని సరిగ వర్ణించిన చాలును. అదియే పదివేలు. ఈ వెఱ్ఱిమొఱ్ఱికవుల యసంభావనములతోను, వారివారి యనవసరాభిప్రాయములతోను పనిలేదు. సహజస్థితులను, యథారూపముగ, నౌచిత్యమునకు భంగమువాటిల్లకుండునట్లు చక్కనితేట తెనుఁగులో వర్ణించి చూపినదియే రసవంతమగు కథయగును, దానికే చిన్నకథ యను పేరుతగును " మరియు నొక్కొకప్పుడాతఁడు తనలోతానిట్లు గొణుగుకొనుటయువాడుక " సహజములగు అవస్థలు, నిజములగు స్థలములు, స్వాభావసిద్ధములగు సంగతులు, యదార్థములగు సంఘజీవనమునందలి వింతలు, నిజ

ములగు పాత్రలు, వారివారి జీవితక్రమమును, వర్ణింపనిమ్ము అవియే మితిలేని యానందము నీయఁగలవు. అందలి నీతులను గ్రహించుటకుఁ జాలిన తెలివితేటలను గొంచెమో గొప్పయో భగవంతుఁడు మనుజులకుఁ బ్రసాదించియే యున్నాడు - వారివారి యూహామంత్రములకు గొంచెము పని గల్పింపక, సమస్తమును తామే తెలుపుట "కళ" యొక్కయు, "రచన" యొక్కయు లక్షణము కాదు. "మరియు మనకు నీతుల బోధించు నీకవిశ్రేష్ఠులు తమతమ వ్యర్థవాగ్జాలములతో మనలను పీడించుటకన్న తాము వానిని ఆచరణలో పెట్టి వానికనువుగ వర్తించిన నధిక లాభకరము ప్రశంసనీయమును, అంతియేకాని యెల్లరకుఁ దెలిసినవానిని వీరు బోధింపనేల? కాగితములు సిరాయు కాలమును వ్యయపఱుపనేల?"

ఈ పత్రికాధిపతి పేరు పూర్ణయ్య. మిత్రులు పున్నయ్య యనియు వ్యవహరింతురు. పత్రికా సంపాదకుఁడు మాత్రమే కావున బిరుదులు లోపించెఁగాని లేనియెడ నాతఁడథమపక్షమొక కవిసింహమో, కావ్యవిశారదయో అయియుండెడువాఁడే. పున్నయ్యకు పెద్దపెద్దపదములు, వ్యర్థవాదములు యమకగమకములు, వాక్యాడంబరము, అలంకారములుననిన తలనొప్పి. ఆయనకుఁ జిన్నచిన్న వాక్యములు కావలెను. పదముల పొందిక కావలెను. భాషామార్దవము కావలెను. అవసరములగు పట్ల మాత్రమే కాని యనవసరములగు వర్ణనలు గిట్టవు. ఉపన్యాసములు సహింపవు. నీతిబోధనయన్న రుచింపదు. సాభిప్రాయములన్న హితవుకావు. ఇఁక దీర్ఘసమాసముల పేరు చెప్పవలను పడదు.

ఒకనాఁటి యుదయమునఁ బున్నయ్య దగ్గర కొక యువకుఁడు వ్రాత ప్రతినొక దానిని గొనివచ్చుట తటస్థించెను. ఆతఁడు ద్వారపాలకునిఁ దాఁటి లోనికెట్లు రాఁగలిగెనో తెలియదు. అతని హస్తమున గుండ్రముగ చుట్టఁబడి యున్న తెల్లకాగితముల కట్టయొకటి కలదు. అట్టిప్రతులు చూచుట పూర్ణయ్యకు కంటగింపు. పాపమా యువకున కీసంగతి తెలియదు కాఁబోలు. కాని యాతఁడు పున్నయ్యగారి యాప్తమిత్రుని దగ్గరనుండి యొక లేఖ గొనివచ్చెను. తనకడ ప్రచురణార్థమొక చిన్నకథ యున్నదని చెప్పెను. ఆ చెప్పునప్పుడాతఁడు వినయవిధేయతలతోను, బిడియముతోను చెప్పుటచే నాతని కేయుద్యమము నందిది యే ప్రథమమని పూర్ణయ్య గ్రహింపఁజాలెను. పున్నయ్య లోలోన విసివికొనినను, పయికి మందహాసము గావించెను. ఆసీనుఁడవు కమ్మని చెప్పెను. కాని, అచటనున్న యాసనములన్నియు వ్రాత ప్రతులతోను, కాగితములతో నిండియుండుటఁ జేసి, యయ్యువకుఁడు నిలబడియుండుటయే తనకు సమ్మతమని మెల్లగ చెప్పెను

పున్నయ్య వాని ననేకములగు ప్రశ్నలు వైచెను. వాని యోగక్షేమము లరయవలెనని కాకున్నను తనమిత్రుని యెడల గల గౌరవము చేతను, మరియాదగ నుండదని యెంచి యట్లొనరించెను. ఆ నూత్న యువకుని నామధేయము శ్రవణుఁడని తేలెను. కళాశాలను వీడి కథారచనకుఁ గడఁగిన వారిలో నీతఁడు చాలమితభాషిగ కనఁబడెను. ఆతఁడాశయములఁ గూర్చి

ముచ్చటించెను. వాని మాటల ధోరణిని బట్టి యాతఁడు వ్రాసిన కథయే పదునాఱవ శతాబ్దమునకో సంబంధించి యుండనోపు ననియు, వాని శైలియు వర్ణనాదులును వేంకట కృష్ణప్పనాయకుని శైలివలెనో, చిన్నయసూరి రచనలఁబోలియో యుండ వలెనని పున్నయ్య యూహించెను. దానితో వాని కాకథయందు విముఖతయు, దురభిప్రాయమును జనించెను. ఆకారణమున నాతఁడు కథను చదివి ముగింపవలెనని విసుపు దలతోఁ బైకిఁదీసెను.

ప్రథమమున పత్రికాధిపతి పుటలను నిర్లక్ష్యభావముతో దిరుగవైచెను. అచ్చటచ్చట కొన్ని భాగములను చూచెను. తరువాత జాగ్రత్తతో కథనంతయుఁ జదివెను. చదువుచుండగా ముడివడిన యాతని కనుబొమలు విడెను. మందహాసము మొగమ్మునఁ జిందులాడఁజొచ్చెను. పిమ్మటతనముందున్న వ్రాతబల్ల చలించునట్లు గ్రుద్దుగ్రుద్ది, ఆశ్చర్యసూచకముఁ గావించెను. ఆకథయందలి వాక్యములు చిన్నవి. చక్కగనున్నవి. ఇతివృత్తము మంచిది. వర్తమాన కాలమునకు సంబంధించినది. జరిగినకథ. పదములు తూఁచినట్లుపయోగింపఁబడినవి యమకగమకములు మందునకైనఁగానరావు. అందు జీవితసరణి సహజముగ వర్ణింపఁబడియున్నది.

పున్నయ్య, పత్రికాధిపతి, యీకథ నాదినముననే యంతకుమున్నేరి యున్నకథ నావలికిఁ ద్రోచివైచి, ప్రచురించెను. శ్రీవణునకుఁ దానికిఁ గొంతమూల్యముఁ గూడ నొసఁగెను. శ్రీవణుడట్లు చాలకథలు వ్రాసెను. పున్నయ్యయుఁ దప్పకుండ దానిని పూవులతావివలె దినదిన ప్రవృద్ధిగాంచెను. శ్రీవణుఁడు పున్నయ్యగారి యాదర్శములను విని తన యభిప్రాయములతోఁ దులదూఁగుచుండుట నెఱింగి సంతసించెను.

ఇటులే జరుగుచుండిన నంతయు బాగుండెడిదే. తక్కిన పత్రికాధిపతుల కియ్యది యాదర్శకముగకూడ నుండియుండెడిదే కాని శ్రీవణుఁడు దృష్టదోషముగలవాఁడగుటయే చిక్కుదెచ్చిపెట్టెను. దానికితోడు శ్రవణునియందు హాస్యరసము లోపించుటయొకటి. హాస్యరసము మానవునికి ప్రకృతి పాటు సహజముగ నలవడవలసినదే కాని తెచ్చి పెట్టుకొందమనినరాదు. ఒకవేళ తెచ్చి పెట్టుకొన్నను భామవేషగాఁడు ధరించు గాజుముక్కలతో జేసిన కృత్రిమాభరణములవలె వెలవెలబోవునుగాని సహజముగ నుండ నేరదు. తక్కిన కళలవలె హాస్యరసమును దైవదత్తమగు నొక విభూషణము అట్టి సహజసౌందర్యముగల రసమే ప్రాణింపను. లేనిచో నదికట్టువై, కర్ణకఠోరమై దురుసమై యుండును. శ్రీవణుఁడించుక వివేకముగల వాఁడగుటఁజేసి చేతకాని హాస్యములకుఁ బ్రయత్నింపక తనమనసుకుఁదట్టినట్లు యదార్థవాదనానుకూలములగు కథలు, చిన్న చిన్నవి, మృదుపద విశోభితములగునట్టివి, యత్యల్పకాలములో నానందమిచ్చెడి నవి "గిప్పచిప్ప మిఠాయిల"వలె వ్రాసి, త్వరలో చక్కని కథలవ్రాయుటలో నగ్రగణ్యుఁడని పేర్వడసెను. కాని యీసమయములో నొకవిషమావస్థ సంఘటిల్లెను.

శ్రీవణునకొక ప్రేలువిడచిన మేనమామగలడు. ఆయనకొక కుమార్తెయున్నది. ఆమె యించుక విద్యావతి. తండ్రి

సాంప్రదాయముల ననుకరించువాఁడగుటచే కుమార్తెకు బాల్యవివాహముసేయక విద్య చెప్పించెను. సరళయు ప్రవేశపరీక్షయందు త్తీర్ణయయ్యెను.

ఆమె నవలలనిన చెవికోసికొనును. నిద్రాహారములనైన సరకుగొనక సరళనిరంతర నవలాపఠనయందు తనకాలమును వినియోగించుచుండును. ఆమె తెనుగుఁభాషయందుఁ జదువనినవలలు లేవనియేచెప్పవచ్చును. అంతతో తనివిఁజెందక సరళ యాంగ్లభాషయందు వానిని చదువసాగెను. సహజముగ నాంగ్లభాష కష్టసాధ్యమైనది. కాని లేనిచో నామెకుఁగల దీక్షకు సరళ యీపాటికనర్గళముగ నాంగ్లేయ నవలలు చదివియుండెడిదే. శ్రవణుఁడామెను వివాహమాడఁ దలఁచియుండెను. ఆమెయు నాతనియందు సుముఖియైయుండెను. వారిరువురును సాయంకాలపుటీరెండలో వారి యింటి సామీప్యమునఁగల పూఁదోఁటకేగి యందున్న బాలరసాల శాఖకాచ్ఛాదితంబగు చలువరాయి తిన్నెపయిఁగూర్చుండి సరససల్లాపములాడుకొనుచుందురు. ఆయా సమయములందు సరళశ్రవణు నుద్దేశించి "భావకవులే కవులు. వారివ్రాతలే వ్రాతలు ఊరక-చొప్పదంట్లవలెనేవో యొకటి వ్రాసిన సరియా? ఉదయమునుండి సాయంత్రము వఱకు జరుగు సంగతుల నన్నియు నేకరువు పెట్టి యేదోవ్రాసి, యదార్థవాదుల మని పేరు పెట్టుకొందురేగాని వారివ్రాతలలోఁ గల యాధిక్యమెద్ది? ఊహలేనివారిని ఊరి నుండి వెడలనడుపవలెను. ఆదర్శ కవిత్వము కన్న భావకవిత్వము చాల శ్రేష్టము అట్లు భావకవిత్వము వ్రాయలేని వాఁడు వ్రాయుటకంటె వ్రాయకున్న మంచిది. చదివినవారి నానందనౌకలలోఁ దేలించునాతఁడేసుకవి తక్కినవారెల్లరు కుకవులు అనును. అంతశ్రవణుఁడు "సరళా! యదార్థకవులనిన నీకంతయీసడింపేల? వారుమాత్రము కవులు కారా? పాశ్చాత్త దేశమునను తదితర దేశములయందును వారికిమాత్రము మన్ననలేదా? యని ప్రశ్నించును. "ఉండి ననుంతుగాక కాని నాకవిగిట్టవు. అందులకే నీవ్రాతయనిన నాకు ఒడలుమండును. నేను వానినిచూడ నైనచూడను. ఆ పున్నయ్యగారి పత్రిక పేరైన గిట్టదు. చూడుము ఆరంగనాథముగారి "పుష్పలత" ఎంత చక్కనిపత్రికయో? ఎట్టికథలు ప్రచురించునో? నీవెన్నటికైననాకు సదభిప్రాయము గలిగింపవలెనని యంటివేని, వారిపత్రికకొక్కకథ వ్రాసిపంపి, దానిని ప్రకటనార్హమనిపించుకొనుము. అప్పుడే నీవ్రాతలను గౌరవింతును. మనకిట్లు అభిప్రాయభేదము లున్నంతవఱకు మనకీ కుటుంబకలహములు తప్పవు. మనకు పొందుకలుగదు అనును. అంతశ్రవణుఁడు మోము చిన్నబుచ్చుకొని "సరళా! నావ్యక్తిత్వమును నేను విడువఁజాలను, అభిప్రాయములు మార్చుకొనిన గాని యనురాగమలవడదా? కావున మన యభిప్రాయములను మనమేయుంచుకొని, పరిణయము గావించుకొనుట కభ్యంతరమేమి?" యనియడుగును.

"అట్లు కాదు. అట్లు వివిధాభిప్రాయములుగలిగి వివాహమాడిన వారికెట్టిపాట్లు గలుగుచున్నవో మనము చూచుటలేదా మనసుకలువనిచోట మమత యుండదు." అని సరళచివాలున లేచిపోవును. చిడి

వానిమిత్రు లాతని యుపదేశానుసారము, తుపాకులను గాల్చుచు, బయలుదేరిరి. కపటనాటకము ప్రారంభమయ్యెను. కొంత దూరము పోవునప్పటికి దైవవశమున నా యూరి రక్షకభటులలో నలుగురా కార్యాంతరమున నాసమీప గ్రామమునకేగి తిరిగి వచ్చుచు నీదృశ్యమును గాంచి నిజమగు చోరుఁడని శంకించి వానిని వెంటాడించిరి. వారి తుపాకులయందు, కృత్రిమ నాటకమునకనుకూలమగునవి కాకుండుటచే గుండ్లుండుట తటస్థించెను. శ్రీవణుని కాలికొకగుండు తాకెను. కాని యాతఁడెక్కిన హయము పంచకళ్యాణి యగుటచే నాతనిని తన యదుపుల నైన లెక్కింపక, మనోజవమ్మునఁ గొని పోయి, ప్రాణరక్షణ గావించి, దానికిఁ గూడగ తనజీవితములను గోల్పోయెను. "కాపు దప్పి కన్నులొట్టపోయె" నన్నట్లు శ్రీవణుఁడీ నాటకమునందు ప్రాణములతో బయటపడెను. వానికి పరిపూర్ణానుభవము కలిగెను. రక్షకభటులును కొంతసంరంభముతోఁగిన పిదప నిజస్థితి నెఱిఁగి నవ్వుకొని పురము మార్గముఁ బట్టిరి. శ్రీవణునకు గుఱ్ఱమునకు విలువగా నేమనంధలరూప్యములు పదలుటయేకాక, తనప్రాణములను గాచుట కైయాత్మార్పణము గావించిన యానిక్కపు నెచ్చెలియగు తురంగమును గూర్చి కలిగిన విచారమునకు మేర లేకుండెను.

ఏది యెట్లైనను శ్రీవణుఁడనుభవసిద్ధమగు తనకుఁ గలిగిన యవస్థనే, యథారూపముగ వ్రాసి ప్రచురించెను. దానినాతఁడు రంగనాథముకుఁ బంపఁదలంచియు పూర్ణయ్య తన్ను నియోగించిన కారణమున నాతని కంపెను పూర్ణయ్య యిదికల్పితమనియు, యాదార్థ్యము కాదనియు నభిప్రాయపడి శ్రీవణుని మందలించి యా కథను త్రిప్పిపైచెను. అంతశ్రీవణుఁ డేమి చేయుటకును దోఁపక "పుష్పలతా" కార్యాలయమున కంపెను. రంగనాథముద్దానిని వందనములతో నందుకొని ప్రచురించుచు, నుపోద్ఘాతముగ, కల్పితములగు కథలలో తానంత రసవంతమగు కథ నింతవఱకును చదివియుండలేదని వ్రాయుచు నాకథారచన యొనరించిన శ్రీవణుని లేఖినినుండి యిట్టి యద్భుతకథావల్లులు వెలువడి యామోదముఁ గూర్పుఁగాక! యని వ్రాసి ముగించెను.

అప్పటినుండియు శ్రీవణుఁడు పుష్పలతా కార్యాలయమున నెలకెనుబదిరూప్యముల వేతనముపై, నుపాధ్యక్షుఁడుగా నియమింపబడెను. కొంతకాలమునకు వృద్ధుఁడు నపుత్రకుఁడు నగు రంగనాథముగారతనిని యుద్యోగమునొసరించి తాను విశ్రాంతిగైకొని స్వగ్రామమున గ్రంథరచనమునను హరినామస్మరణయందును [illegible] బుచ్చుచుండెను. పూర్ణయ్యగారి క[illegible]కను శ్రీవణుని చిరాకెంచి నప్పటినుండియు సిరితొలఁగినట్లయ్యెను. ప్రచారము తగ్గుచుండెను. చివరకు పూర్ణయ్యగారు శ్రీవణునకు పూర్వస్నేహమును, ప్రథమమున తానిచ్చిన ప్రోత్సాహమును గూర్చియుఁ దెలిపి, తమ పత్రికకుఁగూడ సహాయపడ వలసినదని కోరెను. శ్రీవణుఁడును రంగనాథముగారి యనుమతిపై పత్రికాధికారము వహించి నడుపఁజొచ్చెను.

ఈయత్యద్భుతము, ననుకూలమునగు వారి యందలి మార్పునకు సంతసించి సరళ వానిఁ జేపట్టెను. వారికార్యాలయమునుండి వెలువడిన పత్రికలెల్లరకు రుచించుచుండు

టచే, ననతి కాలమున చందాదారులసంఖ్యయు వృద్ధియయ్యెను. అతఁడు భాషా సేవకుఁడను బిరుదువడసెను. పున్నయ్యగారు నాతనికా బిరుదమును పత్రికాముఖమున నొసంగుచు గావించిన సభలో నీయువంతి మునుగూర్చి ప్రస్తావించి, శ్రీవణు నుగ్గడించిరి దొరతనమువారు నావత్సరము నానాదేశ వార్తాపత్రికాధిపతుల సభకాతనిని గౌరవ ప్రతినిధిగా నంపి, గౌరవించిరి.

అల్లదే ! చదువరీ ! ఆయూరిబయట నున్న యాచిన్నయింటిని జూడుము ! దాని ముందు సొబగులీను నామాలతీ నికుంజము క్రింద నాసనముపై కూర్చుండిన యాచిన్న బాలికనెత్తి ముద్దులాడుచున్న యాపురుషు నిపరికించితివా ! ఆతని నానుపార్శ్వమున నధివసించి మందహాస మొనరించుచున్న యానాతి నాలోకించితివా ! వారే సరళా శ్రీవణులు ! ఆవిద్వన్నారీ యనురాగంపు ఫలంబయిన చిన్నికూన ! ఆచిన్నితనయ దరహాస చంద్రికలో పూర్ణిమాశశాంకుని ధిక్కరించుటలేదా ?

## విప్రలబ్ధ

చిరువోలు కోటేశ్వరరావుగారు

మధుర మధుమాస పూర్ణిమ మధ్య రాత్రి
తనువునిండను మంచిగందంబలంది
తురుమునందున మల్లెపూసరులు దుఱిమి
ధౌతచేలంబుఁ ధరియించి తరలివచ్చి
పూబొదలనీడఁ నడచుచు బొంచిబొంచి
చూచు చీమల్లె పందిరిచుట్టు దిరిగి
నిలువునీరైన యట్టుల నిలిచి తేల ?
దిశలు పరికింతువిట్టుల జేని కొఱకు?
విన్నదనమింత మోమున వెలసెనేమి?
పులకలీరీతి దనువున బొడమెనేమి ?
కంపమందెదు కేమి నీ గాత్రవల్లి!
చెమ్మగిలె నేమినీనును జెక్కులబల ?
తురుమునందిడ్డ మల్లెపూసరము జార
దిద్దుకొనవేమి ? ఇంతలో దీనదృష్టు
లిటుల బఱగింతువేమి ? యోచింతువేమి ?
ధ్యానమన్యత్రి నిలుప గాంతా ! పనేమి?
వేడినిట్టూర్పు లీరీతి వెడలుచుండ
వాడువారెడి నధర బింబంబు మొగుడ!
వాదెఱచి పల్కు హృదయ భావంబదేమొ
కవి కుమారుఁడ భావ తన్మయుఁడనేను
పిక కుహూరవమున కింతభీతినొందె
దతివ! దొంగలొంటిగా నిటుకరుదెంచి
తీ నిశీథాగ్రమున? తగువింత తగునె?
ఔర! జవ్వన మెంతటికైన దగును—
కనుల బాష్పాంబు కణములు గ్రమ్ముచుండ
తనులత నడంక పాదముల్ తడబడంగ
పుట్టువందిన యోచనల్ గిట్టుచుండ
వెనుదిరిగిపోవ నేటికో వెఱ్ఱిదాన!
విషమ శరుఁడెవ్వ త్రైలోక్యవిజయుఁడేని
ప్రియుడు కాలజ్ఞుడానేని భీతియేల?
కామ్య సఫలత జెందు నీకోర్కెలిపుడె
కవి కుమారుని వాక్క మోఘంబుగాదె

# మోహనచందు

వెంపటి నాగభూషణంగారు

(కల్పనాకథ)

అమావాస్య, చంద్రునికి శెలవుదినం. మరిచంద్రుడు లేకపోవడంవల్ల అంతాచీకటిగావుంది. నక్షత్రాల వెలుతురు కొద్ది. ముఖాలుగుర్తించడానికి వీల్లేదు. అర్ధరాత్రి చీకట్లో యెవ్వరు సంచారం చేస్తారు? పక్షులు గూళ్లలో హాయిగా విశ్రమించినాయి. పశువులు శ్రమదీర్చుకోడానికి కళ్లుమూసుకొన్నాయి. మనుష్యులందరు సుఖంగా నిద్రిస్తున్నారు. ప్రపంచమంతా నిశ్శబ్దంగావుంది. అటువంటి ప్రశాంత వేళ, ఘోర పిశాచ, చోర, విద్రోహ విహారవేళ, యెవ్వరు ధైర్యంచేసి బయటకు రాగలరు? వచ్చిరిపో వీధులవెంట విహారము చేయసాగిస్తారా?

కాని ఆసమయంలో మోహనచందు పైనుంచి క్రిందవరకు నల్లని దుస్తులను ధరించి గబగబ నడుస్తూవెళ్లి ఒకయింటి ముందరఆగి, తలుపు పిల్చాడు. రెండు మూడుమార్లు పిల్చాడు. అప్పటికి తలుపుతెరచి ఒకవృద్ధుడు తొంగిచూస్తూ "ఎవరునాయనా?" అన్నాడు. అందుకుబదులు లేదు. "ఎవరునీవు, ఏంకావాలి?" అన్నాడు మళ్లీ. అట్లాగే శిలాప్రతిమ మోస్తరు నిల్చున్నాడు మోహనచందు. "ఎవరు నువ్వు. చెప్తావా లేదా?" అనిగద్దించాడు వృద్ధుడు. అంతమాత్రానికే మోహనచందు జడుస్తాడా. వణకనైనా లేదు. ఇంతలో దీపం తీసుకురావడానికి వెనక్కి తిరిగాడు వృద్ధుడు. క్షణంలో చందు దుడ్డుకర్రతో వానిని దృఢంగామోది పాశబద్ధుని జేశాడు. అతనిచేతులు, కాళ్లూ, నోరు, అన్నీ కట్టుపడినాయి. ఆశరీరాన్ని భుజం మీదవేసుకుని పూర్వంశివుడు సతీదేవి శవాన్ని భుజంమీద వేసుకుని ప్రళయ తాండవమాడినట్లుగా మోహనచందు గంతులేస్తూ వెళ్ళిపోయాడు

౨

అర్ధరాత్రి అవడంచేత శ్మశానం దగ్గరవున్న గస్తీ [illegible] ద్రాదేవి లాలిస్తోంది. ప్రేతాలకోసం ప్రీతమై విహరిస్తున్నాయి నక్కలు. వృక్షాలన్నీ, జుట్టువిరియబోసుకున్న పెద్ద పిశాచాలవలె, ప్రభంజనుడి వికటచేష్టలకు లోనై భయంకరంగా నృత్యం జేస్తున్నాయి. చిన్నచిన్న ముళ్ళపొదలన్నీ చిన్నచిన్న రాక్షసుల్లే వున్నాయి. అమ్మో ఆసంగతులు తలుస్తే భయమేస్తుంది. కావలివాడు ఉలికిపడి లేచాడు. దూరానవాని కేదో గోచరించింది. దగ్గరున్న దీపం హెచ్చు చేశాడు. ఒకపురుషుడు, యేదోభుజాన మోసుకుని ప్రళయకాల సముద్రునిలాగుగంతు లేస్తూ వస్తున్నాడు. గస్తీవాడు ఆవైపుకు నడిచాడు. వీడు రావడంచూచి ఆపురుషుడు

ఆబరువును ప్రక్కనున్న పొదలో పడ వైచాడు. అది కావలివాడు గమనించ లేదు......ఇద్దరు కలసికొన్నారు. "ఎక్కడికి మోహానచందూ" అన్నాడు కావలివాడు. "ఇక్కడికే ప్రక్క ఊరికి" అన్నాడు మోహానచందు. "అయితే భుజానయేమిటో మోసుకొస్తున్నట్లు కనబడ్డావే?"

"నాభుజాన నాతలకాయవుంది!"

"కాదు, ఏదో బరువు వున్నట్లుకన్పించింది."

"కాదన్నమా, నీకన్నీ అట్లాగే కనబడతాయి. ముసలాడవు చత్వారంతో యేడుస్తున్నావు."అనెను ఇంకేమైనా ప్రశ్నిస్తే తనకు యేమైనా అపాయంకల్గుతుందేమో అని కావలివాడు వూరుకున్నాడు. మోహానుచందు మరలిపోయాడు.

3

తూర్పుదిశ తెల్లవారింది. సూర్యుడు ప్రపంచాన్నంతా మేల్కొలిపాడు. జనులంతా యెవరిపనులు వారు చేసుకుంటున్నారు.

ఇట్లావుండగా, శివరెండు పీటరు కనబడలేదనేవార్త వూరంతా పాక్కింది. నౌకరులు తమకేమీ తెలియదన్నారు. ఎవరినడిగినా లాభంలేకపోయింది. ప్రజలంతా పీటరు దొరయింటిచుట్టూ మూగారు. ఎవరియిష్టంవచ్చినట్లు వారుకబుర్లు చెప్పున్నారు. కారణాలు వూహిస్తున్నారు. కాని నిజంమాత్రం యెవ్వరికీ తెలియదు.

*  *

శివరెండుపీటరు ఆవూరిలో క్రైస్తవపాదరీ. అక్కడికివచ్చి సుమారు రెండేండ్లయింది. అతనువచ్చినప్పటినుంచి తనయొక్క మతాభివృద్ధికి పాటుపడుతున్నాడు. ప్రతి ఆదివారం సాయంత్రమూ చర్చిలో సభలు జేసి ప్రజలకు క్రీస్తుచేసిన ఘనకార్యాలన్నీ చెప్పి, ఆమతంలో ప్రవేశిస్తే మోక్షం వస్తుందనేవాడు. తక్కినమతాలన్నీ పట్టిబూటకమని చెప్పేవాడు అవన్నిమంచివికావు, క్రైస్తవ మతమొక్కటే శ్రేయస్కరమని చెప్తూ ప్రజలనామతంలో కలవమని చెప్పసాహసించేవాడు చర్చిలో జరిగే సభలకు ప్రేక్షకులు రావాలనే అభిప్రాయంతో యేవో బొమ్మలు, పుస్తకాలూ, యింకా అవి, యివి పంచిపెట్టేవాడు. ఆవస్తువులైనా వూరకేవస్తాయి గదా అని కొంతమంది పోయేవారు. ఇట్లా అతను రెండేడ్లనుండి తన మతబోధ చేస్తూంటే, చాలామంది వింటూ వూరుకుండేవారు...కాని యిప్పుడు అలజడియెందుకంటే యెవరో యిద్దరు యువకులకి ఆమతాన్ని స్వీకరిస్తామనే అభిప్రాయం కల్గినట్లు ఊరంతా తెలిసింది. ప్రజలలో ఆందోళన ప్రారంభించింది. అసలే, అవూళ్ళో పూర్వాచార పరాయణులైన పెద్దలు అధికసంఖ్యాకులు. నాగరికతా సాంప్రదాయాలు అవూళ్ళోకి ప్రాకలేదు. పిన్నలింకా పెద్దల కట్టుదిట్టాలలోనే నిలుగుతున్నారు. కాని యెప్పుడైనా చర్చికిపోయి, బొమ్మలు, పుస్తకాలు బహుమతులు తెచ్చుకొనేవారు. పెద్దలంతా యీపాదరీని అసూయతోనే చూస్తున్నారు తమ హిందూమతానికిముప్పు వాటిల్లుతుందేమో అనివారు భయపడ్డారు. ఏగోల, ఏఅల్లరీ లేకుండా, పూర్వాచారాల ననుసరించి స్వేచ్ఛాజీవనంచేస్తున్న హిందూవులకీ నూతనమతము, యీనీతిబోధనలు, యీపాదరీలు, కష్టంగావుంది.

ఎవరో పాశ్చాత్యుడువచ్చి తనయొక్క బావుటా నెగురవేసి, హిందూమతాన్ని పారద్రోలి క్రైస్తవమతాన్ని స్థాపించబోతుంటే వారుచూచిసహించలేదు. కాని అధికారవర్గం వారి భయం కొద్దిగావుంది. పైకియేమంటేయేమి అపకారం వస్తుందో అని జంకినారు. ప్రభువులమతాన్నిగూర్చి దూషించారని తెలుస్తే యిళ్లేపీకుతారో, పొలాలేలాగుతారో, ప్రాణమే తీస్తారో, అని భయం. అందుచేత వారి ఉద్రేకాలు వారిలోనే వుండిపోయినాయి.

౪

సాయంకాలము ఆకాశం కొంచెం మబ్బుగావుండి వర్షంవచ్చే చిహ్నాలు కనబడుతున్నాయి. పశుపక్ష్యాదులు తమతమ నెలవులను చేరుకుంటున్నాయి .........జానీ ఆత్రోవను వస్తున్నాడు. దూర ప్రయాణం చేత డస్సినట్లుగా ముఖంలోనే తెలుస్తున్నది. పైగా దుస్తులన్ని దుమ్ముకొట్టుకుపోయినాయి. అప్పుడతనకి చిన్నకేక వినిపించింది. అనుమానంతో ఆగాడు. ఆకేక తిరిగి వినబడ్డది. అదివచ్చిన వైపుకు వెళ్లాడు. వెళ్ళి చూసేసరికి, ఒకమనిషి, కాళ్లూ, చేతులూ కట్టబడి పొదలమధ్య వున్నాడు, జానీ ఆశ్చర్యంతో వెనుకకుపోయి, ధైర్యంతో ముందుకువచ్చి తొంగిచూచి 'దేవుడా' అని పెద్దకేకపెట్టాడు. బంధితుడైనవాడు తనయజమానియగు పీటరుదొర. మెల్లగా జానీ దొరగారిని బయటకులాగి, గుచ్చుకొన్న ముళ్ళనుతీసిఉపచారం చేశాడు. కొంచెంకాలానికి పీటరుకు స్పృహవచ్చింది. జానీ సహాయముతో నెమ్మదిగా గృహానికి చేరుకున్నాడు. ఊరిజనులంతా ఆయనచుట్టూకూడారు. ఆయనకి గల్గిన గొప్ప ప్రమాదమునకు వారు చింతించారు. ఆపదవస్థలో ఆతనికి వారి సానుభూతిని తెలిపినారు. అంతటి సాహసమునకు వడికట్టినది యెవ్వరాయని ప్రశ్నించుకొనినారు. పీటరు దొరకు యింతటి అపాయమును కలుగజేసిన దెవ్వరాయని యోచన జేసినారు. కాని వారి ఆలోచనలన్నియు నిష్ఫలములయ్యెను. తనను మోది బంధించి, లాగుకొనిపోయిన వ్యక్తిని పీటరుదొరయే గుర్తింపలేకపోయెను.

* * *

పీటరుదొర యీసంగతిని పోలీసువారికి రిపోర్టుచేసినారు. నేరస్థునికొరకై వారు వెదుకనారంభించినారు.

౫

మోహనుచందు. కారాగృహములో బంధితుడైనాడు. బోనులోని సింగమువలె అతడు యుద్రేకముగా వున్నాడు. అతని హృదయమందు రగుల్కొనుచున్న మతావేశమే అందులకు కారణము. అతనిశరీరమును బంధించారు, కాని అతనిమానసమును ఊహలను కట్టివేయగలరా ?

* * *

ఆదినం న్యాయస్థానంలో కేసువిచారణ. న్యాయస్థాన మందిరమేగాకుండా, దాని ఆవరణఅంతా, గోడలనిండా, చెట్లనిండా, యింటికప్పులనిండా, యిసుకవేస్తే రాలకుండా, జేరారుప్రజలు. సరిగా పదిగంటలకు జడ్జిగారు వచ్చారు. ముద్దాయి మోహనచందుకూడా వచ్చాడు. ప్రేక్షకులలో గల్లంతుయెక్కువైంది కష్టంమీద శాంతిచేకూర్చారు. విచారణప్రారంభమై

నది. తుదకు నేరస్తుని వాఙ్మూలం యిమ్మ
న్నారు. అంతా నిశ్శబ్దమైంది. ప్రారంభిం
చాడు మోహనచంద్రు ఉపన్యాసం

జడ్జిగారు!

నా మతమునకై ప్రాణమునైనా అర్పించడానికి సిద్ధముగా నున్నవాడను నేను ! కాబట్టి నిజం చెప్పుచున్నాను నిర్భయంగా, వినండి: —నాది హిందూమతం. జీవముకన్న, మానముకన్న, తల్లిదండ్రులకన్న, అన్నిటికన్నను, మనిషి తనమతాన్ని యెక్కువ ప్రేమతో, అభిమానంతో చూడవలసియుంది. మతమే ముఖ్యజీవము. అందును, మాహిందూమతము యెక్కువ పవిత్రవంతమైనది- తక్కిన మతము లపవిత్రములని నేను చెప్పను. కాని అనేక పరరాజుల, యొక్కయు పాశ్చాత్య సైనికుల యొక్కయు, యితరజాతి మతస్థుల యొక్కయు పిడికిటయందు జిక్కినను, హిందూమతము తనయొక్క ప్రాతివ్రత్యమును, పవిత్రతను, ప్రతిభనుకోల్పోలేదు. హిందూమతమును చక్కగ ననుసరించి తన్మూలమున మోక్షముబడసి కీర్తిగాంచి లోకమునంతకును ఆదర్శవీరులైన మహానుభావులెందరోగలరు. అట్టి తేజోవంతమగు హిందూమతము నేడు అనేకయాతిభాధలకు లోనై రాహుదంష్ట్రల జిక్కినట్లు నశింపుచున్నది. అట్టిదానిని, పాశ్చాత్యులు అడుగంటా నశింపజూచుట ఘోరము. క్రైస్తవులు తమమతమును బోధించిన బోధించుకొనెదరుగాక. కాని మామతమును ద్వేషించి దూషించి మనుష్యులను వారిమతమును స్వీకరింపజేసి ప్రోద్బలముచేయుచు హిందూమతమును నాశనముచేయ జూచునంతకాలము వారికి మంచి చేకూరదు. అన్నిమతములు చాటున దొక్కటియే. అన్నిమతములు మాపు త్రోవయొక్కటియే. అందరికిని దైవమొక్కడే అట్టి సందర్భములో యీపోరాటము లెందులకు ? పీటరుగారి బోధలు వక్రముగాకుండ సమంజసముగనున్నచో భయములేదు. కాని మామతమును నిర్మూలము జేయుటయే వారి ముఖ్యోద్దేశముగ నాకు కన్పట్టినది. అట్టిది చూచి నేనస్సలు సహించను. నేను హిందువును. హిందూమత ధర్మము నిర్వహించు భారము నాది. నారక్తనాళములందింకను హైందవవీరుల శౌర్యసాహసము ప్రవహించుచున్నది. మాయూరియందలి పెద్దలందరును నాతో నేకీభవింతురు. కాని బయటకువచ్చి నిర్భయముగ మాటలాడు శక్తి వారియొద్ద లేదు. వారివలె నేను మూలయుండను. నేనింకను యువకుడను. నాకర్తవ్యమును చేయవలసిన భారము నాది నేను ప్రస్తుతము చేసినపని తప్పయని నాకు తెలియును. అహింసయే మామతముయొక్కయు తక్కిన అన్ని మతములయొక్కయు ముఖ్యసందేశము కాని ఆసంగతి తెలిసియు నేనిట్టి ఘోరకార్యమునకేల సంసిద్ధుడనైతి ననెదరా ? నామూలముననైనను మాయూరియందు కొంతయలజడి జరిగిన, ఉత్సాహపూరితమైన పిన్నలు, పెద్దలు, యెవ్వరైన, బయటకువచ్చి సంఘమును, మతమును కాపాడుటకు ప్రయత్నము చేయుదురేమో అను యభిప్రాయముతో నిట్టి పాపకార్యము నొకదాని గావించితిని. పీటరుగారిని హింసించినందులకు నేను పాపినే కాని, యిందుమూలముననైనను నాప్రజలు తెలివిమంతులై ప్రవర్తించెదరుగాక !

జడ్జిగారు మీరు నాకేశిక్ష వేస్తారో వెయ్యండి నిరాటంకంగా. నాకు భయం లేదు. అన్నిటికీ తెగించాను. దారుణశిక్ష విధి



[కళ్లుమూసుకొని దేవుని ప్రార్థిస్తూ "ధర్మ సంస్థాపనార్థాయ..." అన్నాడు.]

స్తారు. అంతియేగా ? యేమిభయం నేనిక్కడను మరణించినను, నావంటివారు వేనకువేలుద్భవించి మా మతమును కాపాడెదరు !

సోదరులారా, అట్లు వినుచూ నిలుచబడెదరేల ? మీ మతమునకై మీరక్తమును ధారపోయరా ? పఠాణీవీరులు పౌరుషమెక్కడ రజపుత్రుల శౌర్యమేదీ? పాంచాలకులు పట్టుదలయేదీ ? వంగీయుల ఉద్రేకమెక్కడ ? ఆంధ్రుల ఆవేశమేమయ్యె ? ఎక్కడ, మీ ధైర్యసాహసములెక్కడ ? మీ శక్తిసామర్థ్యములెక్కడ ? మీ ఆత్మగౌరవమెక్కడ ? అని మోహనచంద్రు గంభీరముగ పలుకనంతనే జనులందరు చేతులనెత్తి " ఇదే వచ్చుచున్నాము. నీయాజ్ఞయెయ్యది " అని ఒక్కమారుగా అనినారు.

* * *

ప్రేక్షకులెల్లరు స్తంభీభూతులైనారు. న్యాయాధికారియు, తక్కిన ప్రభుత్వోద్యోగియులును ఒకరిమొగముల నొకరు చూచుకొనినారు. తుదకు జడ్జి నిలువబడి తీర్పు చెప్పినారు. " మోహనచంద్రూ, నీయొక్క ధైర్యమునకు ఎంతయు సంతసించినాను. నీయొక్క మతమును కాపాడుటకు నీకెంతయు ఆసక్తియున్నది. అయినను నావిధి నేను నెరవేర్పక తప్పదు. నీ ఆవేశములో నీవొక మనుష్యుని జీవితమపహరింపగోరితివి. అందులకు నీకు మరణశిక్ష "

అనుచుండగనే కోలాహలము చెలరేగినది. చిరునవ్వు నవ్వినాడు మోహనచంద్రు !

* * *

అధికారి ఆజ్ఞప్రకారము మోహనచంద్రు మరణశిక్ష ననుభవింపవలసియున్నది. అందుల కతడు సిద్ధుడే ! మతాన్ని వుద్ధరించడము కోసం అతను మృత్యురథాన్ని యెక్కడానికి సిద్ధంగానే వున్నాడు. బయట యెక్కడైనా చంపుతే ప్రజలు ఆందోళన చేస్తారేమో అనే భయంతోను చవదని, జైలులో పలకే సంహరింపడానికి తీర్మానించారు. సరిగా పదిగంటలకు ముహూర్తము, ఇద్దరు తలారులు. యమభటులు, కఠినహృదయులు ముసుగులు వైచుకొని తయారై సంగు దయా, దాక్షిణ్యాలు అంటేవారికి తెలియునా తెలిస్తే అట్లావస్తారా ?

మోహానచంద్రు నిర్భయముగా ధిక్కరిస్తూ నిలబడ్డాడు, మతావేశంపొంగి పొరలుతోంది అతని దేహంలోంచి నేత్రాల లోంచి పౌరుషము, శౌర్యము, ప్రజ్వరిల్లుతున్నాయి, కళ్ళుమూసుకొని దేవుని ధ్యానిస్తూ "ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే" అన్నాడు పాపిష్టితలారులు ఖడ్గములనుపై కెత్తారు. మరొక్కత్రుటిలో మోహానచంద్రు జీవయాత్ర అంతమొంద బోవుచున్నది!

"ఒకటి, రెండు, మూ" అన్నారు తలారులు. మోహానుడు కండ్లు తెరువలేదు. చలించలేదు.

"ఒకటి, రెండు, మూ" అన్నారు మళ్ళీ "హరీ!" అని బిగ్గరగా, చెరసాల గోడలు బద్దలయ్యేట్లు కేక వేశాడు చంద్రు. భటులు భయమొందారు

ఇంతలో "ఆగు, ఆగు" అని కేకలు వినబడ్డాయి, పీటరు పరుగెత్తుకుంటూవచ్చి జైయిలు తలుపుపిల్చాడు.

తలారులు కత్తులను ఒరలో పెట్టారు. పీటరుదొరలోపల ప్రవేశించాడు మోహానచంద్రు నేత్రములు విప్పలేదు.

పీటరు మోహానుని కట్లనువిప్పి యాతనిపాదములమీద బడినాడు. చంద్రుచలించినాడు. దొరని లేవదీశాడు.

పాదరీపీటరు, "మోహానచంద్రూ, నీవెంతయు గొప్పవాడవు. నీవుగావించిన కార్యము మంచిదియే. నీమతమును రక్షించుట కొరకైనీవు స్థిరపడినావు. బూటకపు బోధనలచేసినందులకు పాపినేను. నాతప్పునేనెరింగి న్యాయాధికారి యొద్దకు పోయి. తీర్పును మార్పించినాను. నీవు సుఖమైజీవింపుము" అని పశ్చాత్తాపముతో పల్కినాడు.

మతశ్రేయోభిలాషి, ఉత్సాహపూరిత యువకుడు, శాశ్వతయశస్సంపన్న మూర్తి, వీరుడు, మోహానచంద్రు చిరస్మరణీయుడు!

## ఎఱుగరా

బాలకవి కోగంటి దుర్గామల్లికార్జునరావుగారు

కళల క్రిమ్మగు
చలివెలుంగుని
ముద్దులాడెడ
మోదమెత్తగనే
ఎఱుఁగరా
భావమేదో॥ఎఱు॥
జాలకుండగ
త్సౌధరంబుల
నణఁచి యుంచెడ
హస్తయుగ్మములో
ఎఱుఁగరా॥భావ॥
మధువుగాంచెను
మధురమౌసుధఁ
దనివి తీరగఁ
ద్రాగెదర సతము
ఎఱుఁగరా॥భావ॥

# ప్రతిజ్ఞాపాలనము

(శ్రీమతి ఆకిరిపల్లి సరస్వతీదేవిగారు)

సాయం సమయపుటెండలో కొదమ తుమ్మెదపిండును తిరస్కరించు ముంగురులు సవరించుకొనుచు ముక్త తాను నివసించు పటకుటీరము ప్రాంత మొక పాలరాతిపై కూర్చుండి యేమేమొ యోచించుచుండెను. భావతరంగము లామెపైకి పొరలుటచే బట్టరాని హృదయావేశముచే నామె కన్గొనుల నుండి మాణిముత్తెములట్లు రెండుగూడ శ్రుకణములు వెలువడెను. విషాదముదయించుటచే కాబోలు రాకాశశాంకుని బురడించు ముద్దుమొగము మలినీకృతమయ్యెను. హృదయమున నంకురించిన సంక్షోభమట్లు శరీరమున క్షణికములో నూతనమైన మార్పులు కలుగజొచ్చెను.

ముక్తాంబ నారాయణరావుగారి కుమార్తె. నారాయణరావు ప్రప్రథమమున సామాన్య స్థితిగలవాడేకాని. యాంగ్లేయ విద్యావ్యామోహము మెండుగా గలవాడగుటచే నాతని యిరువురు కుమారులకు బి. ఏ. క్లాసువరకు విద్య గరపించెను. సర్వస్వము పోయిన మాన తనకుమారులు పట్టభద్రులైన చాలునని యాతని యాశయమగుటచే బెద్దలార్జించిన మడిమాన్యములు విక్రయించి విద్యాపరిశ్రమకు వెచ్చించెను. ఆతని హృదయమునందలి కోరిక తీరిక లెత్తు సమయమునకుదెంచుసరికి పెద్దకుమారుడు మృతినొందెను. అంతతో నాతనికి సత్తువ యుడిగిపోయెను. [illegible] కుమారు నితో గాలము గడుపుకొన నాతడు కొంతవరకు పరితృప్తి నొందుచుండ ద్వితీయపుత్త్రుడొకనాడు హృద్రోగముచే నంతరించెను. ఇంక నారాయణరావుగారి హృదయావేశమునకు మేర లేదు. పుత్త్రశోకముచే నాతడు మంచముపట్టెను. క్రమముగా నారాయణరావుకు రోగము ప్రబలమయ్యెను. నాడాతడు మతిహీనుడై పిచ్చిమాటలనాడ జొచ్చెను. నేడు ముక్త విషాదమున కదియే కారణము. ప్రఖ్యాతి వహించిన డాక్టరులచే మందువేయించి తన తండ్రిని బ్రతికించుకొనుటకైన నింటనొక కానియైన లేదు. దారిద్ర్యదేవత విచ్చలవిడిగ వారియింట తాండవించుచుండ నిట్టి విషమస్థితిలో నెవ్వరి మానసము చలింపదు.

ముక్త సంతాపము జూపికునెంచియో యేమో భగవానుడొక యువకుని నాతావునకు గొనివచ్చెను. అతనిపేరు మాధవరావు. మాధవరావు సవినయముగా ముక్త దుఃఖకారణ మడిగి తెలుసుకొనెను. మసిపాతకట్టిన మాణిక్యమువలె సంపూర్ణ దారిద్ర్యావస్థనున్న ముక్త స్థితిని గాంచి యాతడు జాలినొందెను. నలయు నుపకృతి చేయ నెంచెనుగాని యింతలో నింటిలో గొల్లుమనిరి. ముక్తయు మాధవరావును నింటిలోనికి చనిరి. నారాయణరావు మరణావస్థలోనున్నాడు. అంతలో నాతనికి తెలివి

యనెను. ముక్త కనుగొనలనుండి భాష్పకణము లేకధారగ ప్రవహింప తండ్రికడకేగి వెక్కి వెక్కి యేడ్వసాగెను. అమ్మా... వెళ్ళి......అని మాట్లాడలేక పోయెను. మాధవరావు ఆతనికడ కరిగి ధైర్యముతో అయ్యా! ముక్త వివాహ విషయమై విచారింపకుడు. ఆమెను నేనుతప్పక వివాహమాడెదనని ప్రతిజ్ఞాపూర్వకముగ విన్నవించెను. నారాయణరావు పరితృప్తినొందినట్లు మందహాసము చేసెను. క్షణికములో నాతని యాత్మ భగవంతునిలో లీనమైపోయినది.

ముక్తకు పదునాలుగు సంవత్సరములు. ఆమె అయిదవ ఫారము చదువుచుండెను. ఆవిద్యాసంపద తప్ప తదితరమైన యాస్తి యామెకేమియు లేదు. మాధవరావు మాత్ర మప్పుడప్పుడీ దిక్కులేని పక్షులకాపాడుచునే యుండెను. ముక్త తల్లి, మాధవరావు తన ప్రతిజ్ఞ పాలించునాయని యప్పుడపుడు తలచుచుండెను. ఆతడు కులీనుడు. తాము నిరుపేదలు. ముక్తకావత్సరము వివాహము చేయక తప్పదు. ఇట్టిసంబంధము పొసగుట్లు. ఇట్టి మనోవ్యాకులతచే నామెచిత్తము పరిపరి విధముల పరితపించుచుండెను.

నాడు సంవత్సరాది పండుగదినము. ముక్త మజ్జన మాచరించి యుతికిన యుడుపుల ధరించి తాననుదినంబును నధివసించు పాలరాతిపై గూర్చుండి యేమేమో చదువుకొనుచుండెను కాని విద్యాభ్యాసమునందా సమయమున నంతయాసక్తి కలిగినట్లు కనుపట్టదు.

ఆమెహృదయమున చిన్న చిన్న భావతరంగము లుద్భవించుచుండెను. ఇంచుక తడవు విశ్వాసము, మరికొంతతడవునకు విషాదము. అదియంతయు మాధవరావుని గూర్చిన యోచనయే. "ఆసుకుమారుడు తన ప్రతిజ్ఞ పాలించునా? యని యామెమనసులో స్మరించుచుండెను.

పాలరాతిపై గూర్చుండిన ముక్తను మాధవుడు తనమేడపై గవాక్షమునుండి చూచెను. అదీర్ఘములైన వికీర్ణకుంతలములు, పరిపూర్ణ చంద్రమండలమగు నామోమును, ఆ చిరునవ్వులయందలి మందహాస చంద్రికలు, ఆ నిమీలితమాణిక్యలు సుధావిభాగ సమయమున భగవంతుడగు నారాయణుడు వహించిన మోహినీస్వరూపముగా స్ఫురించెను. ఆ యుత్తరక్షణమునుండి నాతని మానసమునకు మదనవికారము నుదయించెను. ఆమెను వివాహమాడుటకు నిశ్చయించుకొనెను. కాని జరుగుటెట్లు. తాను గొప్పయింటిబిడ్డ. తల్లిదండ్రుల కాలవలెనా. తండ్రి వేలకువేలు కట్నము నాశించుకొని యుండెను. మాధవుడు తండ్రితో తగినమాటలాడి దీనరక్షణోద్యమమున కృతకృత్యుడయ్యెను. ఒకనాడు మాధవుడు ముక్తకడకేగి ముక్తా ఇదిగో జనకుని ఆజ్ఞాపత్రము అనెను. సంతోషమున వారిరువురు నొండొరుల బాహుబంధములలో నంటుకొనిపోయిరి. ముక్తామాధవులకు వివాహమయ్యెను. వారికిజనించిన ముద్దుబిడ్డడు తాతగారి బట్టతలపై మోది తనతండ్రిపగ నెట్లుదీర్చుకొనుచున్నాడో చూడుము.

పుష్పమాల



అంతఁ బయోనిధానమున యందుదయించె సరోజవాసినీ
కాంతకుఁ దోడబుట్టువనగాగరపద్మమునీ జటాకికా
సంతతియున్ హారీతకియుసాధన సంగ్రహమై తలిర్పధ
న్వంతరి యెట్టిరోగములవారికి నామయ సౌఖ్యకారియై

హారవిలాసము -అ-2

# జీర్ణ విజయనగర చక్రవర్తులు

(హంపూరి రాయలు.)

పాలకోడేటి వెంకటరామశర్మగారు బి. ఏ.

ద్వాదశ శతాబ్దమున దక్కను హిందూదేశము వరంగలు రాజులచేతను దక్షిణ హిందూదేశము యానగొందిరాజులచేతను పాలింపబడెను. ఉత్తరహిందూదేశము మహమ్మదీయ చక్రవర్తుల వశమాయెను. హిందూరాజులు సర్వస్వాతంత్ర్యమును గోల్పోయి మహమ్మదీయ రాజులకులోబడి పోయిరి. అందుచే దక్షిణహిందూరాజులు హిందూ సాంప్రదాయములను, హిందూవాఙ్మయమును కళలను పోషించుచుండిరి. వరంగలు రాజులు మహమ్మదీయ దండయాత్రల నరిగట్టజాలక క్రుంగిపోవుచుండిరి. మహమ్మదీయులను జూచి యానగొందిరాజులుగూడ భయపడజొచ్చిరి. విజయధ్వజుడను యానగొందిరాజు తన నగరము మహమ్మదీయ దండయాత్రలకు సులభముగ గురియగునని యూహించి తుంగభద్రానదికి దక్షిణపు టొడ్డున యెత్తైన పర్వత గుట్టల మధ్య నొక గొప్ప కోటను నిర్మించెను. దానికి యతడు విజయనగరమని పేరిడెను. మఱియు నతడు యానగొందికోటనుగూడ బలపఱచెను కాని యతనివంశజులు విజయనగర కోటయందు స్థిర నివాసమేర్పఱుచు కొనక యానగొంది యందే యుండువారు.

ఇట్లుండగా క్రీ. శ. 1336 సం।లో విద్యారణ్యులవారి ప్రోత్సాహమున యాదవ వంశజుడగు హరిహరరాయలు విజయనగర కోటను మఱింతబలపఱచి, తనరాజ్యమునకు ముఖ్యపట్టణముగ జేసెను. రాసురాను యందు వెలలేని విలువగల సౌధములు, దేవాలయములు, తోటలు, యుద్యాన వనములు, చెరువులు, భావులు, మొదలగు నవి నిర్మించెను. ఇట్లు శత్రువులకు దుర్భేద్యమగు దుర్గముగాగట్టి, పర దేశీయులు వింత పడునట్లు పురమును రామణీయకముగాగావించి, విద్యారణ్యుల వారియందు గురుభక్తి గలిగి మెలగుచు యితడు నెమ్మదిగ నాచుట్టుపక్కలందుండిన దేశమును స్వాధీనపఱచు కొనెను. ఇట్లు హరిహర రాయలు యేసుదినమున ప్రవేశించెనో కాని స్వరలోనే విజయనగరము హిందూదేశములోని పట్టణములలోనికెల్ల సౌందర్యమైనదియు, బలమైనదియు గాపించుటయేగాక విజయనగరరాజులు దక్షిణ హిందూదేశము నంతను వశపఱచుకొని యేకచ్ఛత్రాధిపత్యముగా రెండువందలయేండ్లు బహు నేర్పుతోను, సామర్థ్యము తోను పరిపాలించి హిందూ సాంప్రదాయములను కళలను బోషించిరి.

సంపసంశమునకు జెందిన యానగొందిరాజులలో జంబుకేశ్వరరాయలు యాఖరివాడు. ఇతడు క్రీ. శ. 1297 సం। మొదలు 1334 సం। వరకు రాజ్యము చేసెను. ఇతడు సమర్థుడును, జాగరూకుడును. అందుచే జంబుకేశ్వరరాయలు మహమ్మదీయ దండయాత్రలను వీలగనపుడు యెదుర్కొని పోరుచును, వీలులేనపుడు యర్థాంతర పెట్టుచుండ దొంగిరి యుండుచు తన రాజ్యమున కేయపాయము రానీయకుండ గాపాడగలిగెను.

వరంగలు రాజులలోనీతని సమకాలీనుడు ప్రతాపరుద్రదేవుడు. మహమ్మదీయులు వరంగలుపై ననేక సారులు దండెత్తిరి. జంబుకేశ్వరు డాతని కేవిధమగు సహాయముచేయు స్థితిలోలేనట్లు చరిత్రవలన గన్పట్టుచున్నది. క్రీ. శ. 1310సం। లో తుదకు ప్రతాపరుద్రుడు మల్లిఖాఫరునితో సమాధానపడి ఢిల్లీ చక్రవర్తికి కప్పముగట్టుట కంగీకరించెను. కానితద నంతరము ఢిల్లీరాజునకు కప్పముగట్టుట నిరాకరించుటచే మరలమహమ్మదీయులతో నోటరిని ననేకసార్లు యుద్ధము చేసి కోటద్వారముల వద్దనుండి తరిమెను. తుదకు మహమ్మదుటోగ్లకు స్వయముగ వరంగలుకోట పైదండెత్తి ముట్టడించి స్వాధీనపఱచుకొని ప్రతాప

మనీరాజ్యమూలస్థాపనాచార్యుడు. ఇతడు హిందువులను మహమ్మదీయులను సమాన గౌరవముతో జూచుటచే నితని నుభయులును గౌరవించిరి. ఇంతటి నుంచి బాహమనీవంశజులకు గుల్బర్గా రాజధానియై వెలసెను. ఇతనికిద్దఱు కుమారులు. మరణకాలమందు వారిద్దఱిని రావించి యుభయులు నన్యోన్య మైత్రిగలిగి మెలగవలసినదని యాజ్ఞాపించెను.

ఇట్లు గుల్బర్గాయందు హసన్సుగంగూయున్న వరంగలునందు కృష్ణనాయకుడున్న తమదేశమును శత్రువులనుండి కాపాడుకొనుటకు యత్నములు చేయుచుండగా, హరిహర దండనాయకుడు హరిహరరాయలను బిరుదముతో విజయనగరరాజ్యమును, తుంగభద్రానదికి దక్షిణముననున్న దేశములను జయించి వృద్ధి పఱచుచుండెను. విజయనగర యాదవరాజులు బహుపరాక్రమశూరులు, రాజకీయవేత్తలు. శ్రీవిద్యారణ్యులవారు, హరిహరరాయలే మహమ్మదీయ దండయాత్రలను దక్షిణదేశముపై బడకుండ నరికట్టగల సామర్థ్యముగల వాడని సత్యముగ నిశ్చయించుటకు ప్రబలకారణములుండ వలయును. దేవగిరి యాదవ వంశము నశించినదిమొదలు నావంశజులు వేర్వేర హిందూరాజులవద్ద దండనాథులైయుండిరి. ఈహరిహరాదులు వరంగలు ప్రతాపరుద్రుని కడసేవజేసి ప్రఖ్యాతినొంది యుండవలెను. వీరిలో గొందఱు యానగొంది ప్రభువులక్రిందకూడ దండనాథులైయుండి యుందురు. అందుచే నాకాలమున నీయాదవ వంశము బహుబల పరాక్రమము గలిగి యుండవలె.

యాదవవంశమున సంగముడను యొకదండనాయకుడుండెను. అతనికి అయిదుగురుపుత్రులు. వీరందఱు శౌర్యవంతులు. దండనాథులు. రాజకీయ వేత్తలు. విజయనగరకోటలో శరణుజొచ్చిన యోధవరులలో నీకుటుంబమునకు ప్రధానస్థానము వారిప్రభావముచే గలిగినది. అట్టిధీమంతులగు సోదరులు గల హరిహర రాయలకు పట్టముగట్టక విద్యాన్వితుడగు విద్యాధరుడు వేఱొకనికి పట్టముగట్టినచో తనయుద్దేశములను నెరవేర్చగలుగునా. పంచపాండవుల వలె మైత్రియు, విద్యాబుద్ధులును, శౌర్యాతిశయమును రాజనీతి పరిజ్ఞానమునుగల యీసంగకుమారులువిద్యారణ్యులవారి సేవజేయుచు గురుభక్తిగలిగి వారియాజ్ఞలను శిరసావహించుచు రాజ్యపాలనము గావించిరి. జ్యేష్ఠుడగు హరిహరరాయలు ధర్మరాజువలె న్యాయముగ దేశమును శాంతిపరచి తమ్ములను కుమారులుగ జూచుకొని రాజ్యము చేసెను. సంగముని ద్వితీయ పుత్రుడగు కంపారాయలు రాజప్రతినిధిగ నుండి నెల్లూరు కడప మండలములను స్వాధీనపఱచుకొని మండలేశ్వర బిరుదముతో సర్వస్వాతంత్ర్యములు గలిగి రాజ్యము జేసెను. అతనిపాలనయందు నెల్లూరు కడపమండల ప్రజలు సంతుష్టిజెందియుండిరి. ఇట్లుయాదవ వంశమునకు జెందిన కంపారాయల మూలమున నాంధ్రులు విజయనగర సామ్రాజ్యమందు సౌఖ్యము ననుభవించిరి.

సంగముని తృతీయపుత్రుడగు బుక్కరాయలు, హరిహరునకు పెంపుడు కుమారునివలె బహుగారాబముతో బెరిగెను. ఇతడు అర్జునునివలె సకలశాస్త్రములందు ప్రవీణ్యముగలిగి యుండెను. సోదరులందఱిలో బహుబుద్ధిమంతుడును, శౌర్యవంతుడును, రాజనీతికోవిదుడునై యుండెను. అందుచేతను, హరిహరునకు పుత్రులులేనందునను బుక్కరాయలే యువరాజుగా నేర్పఱుప బడెను. ఇతడు హరిహరునకు మంత్రియు, దండపాణియునై విజయనగర సామ్రాజ్య వ్యవహారములను బహునేర్పుతో సమర్థించి యుండెను. మిగిలినయిద్దరు సోదరులు మారప్ప, ముదప్ప రాయలను వారలు వేర్వేరమండలముల కధిపతులై వాటిని స్వాధీనపఱచుకొని తిరుగబాటొనర్చిన వారిని శిక్షించి దేశములను శాంతి పఱచియా దేశములందు సర్వస్వాతంత్రియము వహించి రాజ్యపాలనము గావించిరి. వీరందఱు స్వతంత్రులైనను విజయనగర మంత్రులయాజ్ఞలకు బద్ధులై యవసరమగునపుడు చక్రవర్తికి సైన్యములతోను ధనముతోను సహాయపడియుండిరి.

నెల్లూరు కడపమండలము లిట్లు కంపారాయలక్రిందను, చంద్రగుత్తి రాజధానిగాగల కాదంబ రాజ్యము మారప్పరాయల క్రిందను, ఆరగ పరగణా ముదప్పరాయల యాధీనమున నుశాంతిగలిగి దిన దినాభివృద్ధిగాంచెను. ప్రారంభమున క్రీ. శ, 1336సం।లో విజయనగరకోట విద్యారణ్యుల సహాయమున పున్నిర్మాణము గావింపబడి నపుడు హరిహర రాయలు సామాన్య మండలాధీశుడు మాత్రమే. కాని క్రీ. శ. 1350సం।లో నతడు స్వర్గస్థుడగు నప్పటికి యతని రాజ్యము తుంగభద్రకు దక్షిణమున కావేరినదివరకుగల దేశమంతయు జయింపబడెను. అందుచే హరిహరరాయలు విజయనగర సామ్రాజ్యస్థాపకులలో మూలపురుషుడగు హిందూచక్రవర్తి. ఇతడుమహామండల బిరుదాంకితుడై పదునాలుగు సంవత్సరములు దివ్యముగా

రాజ్యమును పాలించెను. కన్నడ, ఆంధ్రరాజులు సామంతులైరి. [illegible] రాయలు క్రీ. శ. 1346సం॥లో [illegible] [illegible] [illegible] భక్తియు, [illegible] దానమును [illegible] [illegible] అగు [illegible] [illegible] ములు దానముజేసి, శాసనములు [illegible] స్వస్థానమునకు మరలెను. మఱియు శృంగేరికి దగ్గరలోనున్న [illegible] గ్రామమును హరిహరపురమని పేరిడి బ్రాహ్మణులకు దానము జేసెను.

ఇట్టి గురుభక్తియు బ్రాహ్మణభక్తియు గలహరి హరరాయలు పౌరుషశాలియేగాక దాన పరుడును, రాజనీతి విశారదుడనుటలో సందేహములేదు. అతనికి [illegible] కుమారుడున్నట్లు శాసనములు చెప్పుచున్నవి. అయిన నక్కాలమున రాజ్యమున కర్హుడగువాడు ధీశాలిగా యుండకపోయెనని యు[illegible] శించిరో లేక నక్కుమారుడు బాల్యముననే చని పోవుటచేతనో చక్రవర్తి బుక్కరాయలను యువ రాజుగ నొనర్చెను. మఱియు క్రీ. శ. 1346సం॥లో విజయనగర యుద్ధములో ప్రాణముల గోల్పోయి వీరమరణము నొందిన గౌడుల యాత్మశాంతికై వీరకళస్తంభమొకటి నిలబెట్టి గౌడులమన్ననలకు బాత్రుడాయెను. ఈసంగతి హరిహర రాయలు నిగర్వచూడామణియనియు, రాజనీతి కోవిదుడనియు దృఢపఱచుచున్నది.

ఇదిగాక మంత్రులు, సామంతులు, ప్రజలు మిగులరాజభక్తిగలిగి హరిహరరాయల నెప్పుడును శ్లాఘించియుండిరి. క్రీ. శ. 1347సం॥న వీరకాయ మంత్రి, యొకశాసనమందు రాయలను శ్లాఘించి యుండెను. మఱియు క్రీ. శ. 1343సం॥ తేదిగల యొకశాసన మందిట్లుండెను. "మహారాజాధి రాజ రాజ పరమేశ్వరహరిహర మహారాయలవారి పాద సేవకుడు సూర్యవంశజుడగు ఛాయన తన తల్లిజ్ఞాప కార్థమునొకచెరువును నగ్రహారమును గట్టించి బ్రాహ్మణులకు దానముజేసెను,,

ఇట్లుప్రజలచేతను, యుద్యోగులచేతను, పర దేశీయులచేతను పూజింపబడిన హరిహరరాయలు 14సంవత్సరములలో విజయనగర పురమును యిందర్ నగరముగ మార్చివేసెను. శత్రువులకు దుర్భేద్యముగ జేసెను. రాజ్యము సముద్రతీరములవరకు వ్యాపింప [illegible]ను. [illegible] గాను ధనముతోను [illegible]ములతో నింపెను. [illegible] [illegible] [illegible] [illegible]

[illegible] రాజ్యముగా జేసి [illegible] నైకమత్యమునను మాలపురుష [illegible] సామర్థ్యముతో [illegible] పాలించి [illegible] ననుధనముతో నింపి, సైన్యము [illegible] కుమా రునకు [illegible]ల యొక్క ప్రేమను [illegible] నటుల నెట్లాయుత్సించెనో, హరిహరరాయలును నట్లే సామర్థ్యముతో రాజ్యముచేసి బుక్కరాయలు దాదాపు నంతను నా[illegible]ము క్రిందకు వచ్చుటకు పునాది లేర్పఱిచెను.

హరిహరరాయల పాలనకాలమునుగూర్చి కొంత ద్వివాదముగలదు. సూవెల్ చరిత్రకారుడు యీచక్ర వర్తి 7సంవత్సరములు మాత్రమే రాజ్యముజేసెనని తెలిపియుండెను. అట్లయినచో క్రీ. శ. 1343సం॥లో యితడు చనిపోయియుండవలెను. సివెలు చరిత్ర కారుడు ఈయభిప్రాయమును బలపఱచి యుండెను. రైస్ మొదలగు వారిచక్రవర్తి క్రీ. శ. 1350సం॥ వరకు రాజ్యపాలనగావించి యుండెనని శాసనముల బరీక్షించి నిర్ధారించియుండిరి. మఱియు క్రీ. శ. 1354సం॥పు సరియగు తేదీగల సొరబాలైను శాసన మందు మహామండలేశ్వర హరిహరరాయలు రాజ్య పాలనము గావించుచుండగా మాలగౌడయను శూరుడు చనిపోనగా నతనిభార్య చెన్నక్క సహగమనము గావించిస్వర్గము జేరెనని వ్రాయబడెను. అందుచే కొందరు హరిహరరాయలు క్రీ. శ. 1354సం॥వరకు రాజ్యపాలనము గావించి యుండినటుల యభిప్రాయ మిచ్చిరి. మీరియు దేశమునకు బలమిచ్చు క్రీ. శ. 1354సం॥ తేదీన హరిహరరాయల నామమును గల మఱియొకశాసనము లభించినది. కానిపిదపనంతే యాధా రము లభించువరకు రైసు మొదలగు వారితో నేకీభవిం చుచు హరిహరరాయలు క్రీ. శ. 1850సం॥ వఱకు రాజ్యపాలన గావించి యుండినటుల నమ్మదగినది.

———:o:———

# స్త్రీల యభివృద్ధి

(శ్రీమతి పండిటి సత్యవతిగారు, ఇంటర్ మీడియెట్ విద్యార్థిని)

స్త్రీలకొరకు మహిళాసమితి, ఆంధ్రసోదరీ సమాజము మున్నగు స్త్రీ సమాజముల ముఖ్యోద్దేశము స్త్రీల యభివృద్ధికే. దేశోన్నతికై పునాదులు వైచుచున్న నేటి మనసోదరుల కార్యక్రమమునందలి ముఖ్యవిషయము స్త్రీలయభివృద్ధి. జాతియు, నర్ధభాగినులమగు మనము సరిగా నుండక ప్రతివిషయములోను వెనుకబడి యుండుటవలననే గదా స్త్రీలయభివృద్ధియను ప్రత్యేకపదము నుపయోగింపవలసి వచ్చుచున్నది. సంఘమును నిండించుచూ సగము సంఖ్యగల స్త్రీలు విజ్ఞానముగలవారుగా నుండకపోవుటంబట్టి యీ సంఘము నాగరికులగు యితరదేశీయులకు ఒకకాలును ఒకచెయియు పడిపోయిన పక్షపాతపు రోగి వలె గన్పట్టుచున్న దన్నమాట.

కాలచక్రము తిరిగి పోవుచున్నది. దానితోబాటు యనేక మార్పులు ప్రతివిషయములోను గలుగుచున్నవి. కొన్నివత్సరముల క్రితము, యేపనులుచేసిన సమంజసములుగా గన్పట్టుటలేదో యవియే నేడుచేయ వర్హములుగను, యత్యంతావశ్యకములుగను గన్పట్టుచున్నవి. నేడు మనదేశపరిస్థితులు చూడ, జాతీయోత్కృష్టతకై నిరంతరము పాటుబడుచున్న మన సోదరుల గలసికొని దేశహితమునకై పాటుపడవలసిన రోజులు వచ్చినవని గానబడుచున్నవి.

కొన్నిపదుల సంవత్సరముల క్రితము మనపురుషులు దేశకాలపరిస్థితులంబట్టియో, మరియే కారణమునవలననో స్త్రీవిద్యను నిరసించిరి. దానివలన యింతకుపూర్వము కూడ విద్యావిహీనలై మన స్త్రీలుండిరని యను కొనబోకుడు. దానికి రామాయణమును రచించిన మొల్ల, వేదసూత్రములనై కొని వాదించుచుండినగార్గి, మైత్రేయి మున్నగు విదుషీమణులేసాక్షి. మనమగవారు స్త్రీవిద్యనేల నిరసించిరో దానికిగలకారణములరసిచూడ మనకిప్పుడు వ్యవధిలేదు. ప్రస్తుతపు మనస్థితిగతులజూచుకొని, మనచే నిర్వహింపబడవలసిన కార్యభారముల పరికించి, మన మొకప్పు డెట్టులుంటిమో, యిప్పు డెట్టులున్నారమో, మన కెట్టులుండవలెనో మున్నగు విషయముల మాత్రము దెలిసికొని తగురీతిని వర్తింపవలసిన రోజులివి.

మనభారతీయు లొకప్పుడు గొప్ప మేధాసంపన్నులని, విజ్ఞానపూరితులనియు యత్యుత్తమమైన జాతిగానుండిరనియు దెలిసికొని యిప్పుడెట్లున్నారో చూడుము. నాగరికులమని చెప్పుకొనుజాతి, దనయొక్క స్త్రీల కెట్టి స్థలమును నియమించినదో, యెట్టిహక్కులనిచ్చినదో, యిచ్చుటనే దానినాగరికతగానబడును. యొకజాతి తప్పొప్పులు,

తన స్త్రీల నట్టివారినిగా తయారుచేసికొనినదో యిచ్చటనే గానబడగలదు.

ఇంతియేల సోదరీమణులారా! మన పురుషుల వివేకము స్త్రీల పరిజ్ఞానముపైన నాధారపడియున్నది. బాల్యమున వారి తల్లిదండ్రు లెట్టిశిక్షణమునిచ్చిరో దానిపైననే నాధారపడియున్నది. సాధారణముగా పసిబిడ్డలు తమసమయమునంతను తల్లివద్దనే గడపుచుందురు. బాల్యమున వారు, పెద్దలేమి చేసిన, దాని ననుసరింపజూతురు. ఊహలు మొదలుపెట్టి యీపసిప్రాయమున కనబడు వస్తువుల విషయము తమతల్లి నడుగుచుందురు. యీకోమల వయస్సున వారిసున్నిత హృదయములలో పెద్దలేది చెప్పిన యదినాటుకొనును.

చంద్రగ్రహణముచూచి యీనలు పేలగలిగెనని కుమారుడడుగ తనకే తెలియని విద్యావిహీనతయగు తల్లియేమి చెప్పగలదు? పాము కొరుకుచున్నదని మరియేమొ చెప్పును. అప్పుడామాట యీపసిపాప నిజమనినమ్మక మరియేమిచేయును? మనబాలుర యనంత శక్తుల నణగద్రొక్కుటకుమీరు వారికనేక మంచివిషయముల నేర్పి బుద్ధివికాసముగలవారినిగా జేయగల్గునది విద్యగలతల్లియె.

స్త్రీల యభివృద్ధికి స్త్రీవిద్యయె ముఖ్యకారణము, మనవేదములలో స్త్రీవిద్యయొకటి. సోదరీమణులార! మనస్త్రీలకు విద్యలేకుండుటవలన యనేకకీడులు మూడుచున్నవి. అట్టివాటిని మనము కన్నులారజూచుచు గత్యంతర మాలోచింపక యూరకొనుచున్నాము. జ్ఞానవిహీనలైన స్త్రీలు తాము సుఖపడుమార్గమునుగాని, తమభర్తలను సుఖపెట్టుమార్గమునుగాని తమబిడ్డలను చక్కగా పెంచు మార్గములనుగాని యెఱుంగక దురాచారములందు మునిగియున్నారు. అట్టిస్త్రీలను గల్గిన మనభారతదేశమునందలి యనేకకుటుంబములు క్షీణదశకు వచ్చినవి.

విద్యగల గృహిణిగల్గిన కుటుంబమును జూడుడు. అట్టి భార్యగల భర్తయెంతయో సుఖపడును. కష్టసుఖములన్నిటియందును, భర్తకుతోడ్పడి, యవి తాను సమభాగముగా పంచుకొని, ఆపత్కాలమునందు తగుయాలోచనచెప్పి తోడునీడయై చరించునది భార్యయేగదా. భర్త వ్యవహారముల నరసి తెలిసికొనుచు యాతని మెప్పునుతాను సంతోషపడుచు ముప్పుగలినపుడు ధైర్యముగల్గి నాతనికి బోధించి విచారమును బోనాడునది విద్యాజ్ఞానములుగల భార్యయేగదా! ఇంటివ్యవహారములన్నియుచక్కబెట్టుకొని భర్తయింటికి వచ్చువేళకు సర్వమును సంతోషముగానుంచి దినమంతయుకష్టపడి పనిచే నలసి విసుగు గలుగునట్టి సమయమున నాతనిమనస్సున కించుకేనియు నేదియు నాయాసము తోషింపజేయనీక అన్నిపనులను సరిచేయునది విద్యగలభార్యయేగదా! తననాథుడెట్టి ధనవంతుడైనను విద్యగలవాడైనను గర్వపడక యితరులను తనకంటె బీదవారని తీసివేయక, అందరితోడను సమభావముతో మెలంగుచు నిగర్వశిరోమణియై యుండునది విదుషీమణియెగదా!

సోదరీమణులారా! విద్యావంతురాండ్రకు, విద్యావిహీనులకును నెంతయో భేదము గలదు. స్త్రీవిద్య యనవసరమని కొందరు పురుషులతలంపు. విద్యగల స్త్రీ మగనిలక్ష్య

ము చేయదనియు, స్వేచ్ఛగలిగి తిరుగునదియు కోరగాని పనులకు చొరపడునని కొందరి తలంపు. ఎచ్చటనో, కొద్దివిద్యగలిగి, భర్తను లక్ష్యపెట్టక స్వేచ్ఛగాదిరుగుచు హేయముగ ప్రవర్తించు ఒకరిద్దరు స్త్రీల నుదహరణగా గైకొనుటవదలిపెట్టవలెను. చదువేలయుద్యోగమునకా? యని కొందరడుగుదురు.

స్త్రీలకుగృహమునందెంత యుద్యోగమున్నదో వారికేమి తెలియును. రాచకార్యముల చక్కపెట్టు మంత్రివలె యింటిలోనెన్నిపనులయినను తానుసరిచూడవలెను. భర్తకుయనేక సదుపాయములచేసమస్తసౌఖ్యములనుగల్గించి తానుసుఖపడుచు తనకన్నబిడ్డల చిన్నగాపెంచి వారికి విద్యాబుద్ధుల సత్ప్రవర్తనను నేర్ప వలసినది విద్యగల గృహిణేగదా. ఈసందర్భమునజక్కగాకొడుకుల విద్యకొరకుపాటుపడి యాడపిల్లల విద్యావిషయమున కఠినముగా నుండుటతప్పని విద్యావిహీనయగుతల్లి యెటుల తెలిసికొనగలదు?

సోదరీ రత్నములార, బాలుడు చదువుకొనినఒకవంశమునకే కీర్తి తేగలడు. బాలిక చదువుకొనిన రెండువంశములకు కీర్తి తేగలదు. ఏకుటుంబమునకైనను మంచిపేరుగాని చెడ్డపేరుగాని సాధారణముగా స్త్రీ వలననే వచ్చును. స్త్రీ చదువుకొన్నదయిన పుట్టిన యింటికిని మెట్టినయింటికిని రెండువంశములకు కీర్తి తేగలదు. ఇన్నిపనులు చేయుటకన్న వేరుద్యోగము స్త్రీకేదికావలయును?

స్త్రీయభివృద్ధికి రావలెనన్న స్త్రీవిద్య యత్యావశ్యకమని యెరుగుడు. అట్టిప్రబోధములుయిట్టి......ఎవ్విధమునైనను తీరికచేసుకొని సత్సభలకేగి సోదరీమణులుజ్ఞానమును సంపాదించుకొని దేశమునకై పాటుపడెదరుగాక! మనసదుద్యమమును పరమేశ్వరుడు చేయూతనొసంగి కాపాడుగాక! సంఘసమావేశకారకులకు పరాత్పరుడు నిష్కపటంబును నిర్మలంబునగు ప్రవర్తననిచ్చి ఉదారభావములగొల్పు హృదయముల ప్రసాదించుగాక!

# ఆహ్వానము

ఊటుకూరు సత్యనారాయణరావు బహద్దర్ గారు

సీ॥ భయదసైరంధ్రీభ్రపటలి విద్యుల్లతాలీలతో చేయూపుదేలస్వామి
తళతళత్కాంతులఁ దయసేయుతారకామణుల కన్నైగగమ్మనెదవేల ?
గందపుమారుతులఁ గలసి కమ్మగవీచు మలయానిలునిబ్రతిమాలుమనెదు
కటికచీకటిని ఏకాంతవాసునినన్ను కీచురాయిరవళిఁ గెరలిపిలుతు
ఇంచుకయు వీనితలపు గ్రహింపకుందువనుచు కన్నెఱ్ఱజేతువు అప్పుడప్పుడు
సాంధ్యరాగ నెపంబున ; స్వామి ! నీకు ఏటిసంబంధమిది తెల్పవే శుభాంగ॥

("చంద్రిక"నుండి)

# నాంపల్లి మహిళా సభా వార్షికోత్సవము

శ్రీమతి నెమలికంటి లక్ష్మీనరసమ్మగారు. యల్. యమ్. పి.

పైసమాజపు వార్షికోత్సవము 9-3-27 బుధవారము సాయంత్రము అత్యుత్సాహము తోడను వైభవముగాను జరుపబడెను. సభాసమావేశము కొరకై ప్రత్యేకముగా నిర్మింపబడిన డేరా కడురమణీయముగా నలంకరింపబడి సామాజికులచే యింతవరకును తయారుజేయబడిన కుట్టుపనులును కత్తిరింపు పనులు, చిత్రపటములు ప్రదర్శనార్థమై అచట నుంచబడెను. సుప్రసిద్ధ వైద్యరత్నమగు డాక్టరు సుమిత్రాబాయి యం. బి. బియస్ గారాసభకధ్యక్షత వహించిరి. విద్యాభిమానులగు విదుషీమణులు సుమారు రెండు వందలకు మించి మాయాహ్వానమును దయతో నంగీకరించి వచ్చి సభ నలంకరించిరి. డాక్టరు సుమిత్రాబాయిగారిని శ్రీ ఆక్కెనపల్లి జానికిరామరావు దేశముఖుగారి బగ్గీతో తీసుకొనివచ్చి ఆమెకు సభామంటపమున ఘనమగు స్వాగతమీయబడెను. శ్రీమతి లక్ష్మీనరసమ్మగారు జనానా ఆస్పత్రిలో బనిచేయుచున్న డాక్టరుగారి వైదుష్యమును ఆంధ్రభాషాభిమానమును, ఉన్నతాశయములను గురించి క్లుప్తముగా నుపన్యసించుచు అధ్యక్షురాలినెన్నుకొన డాక్టరు సుమిత్రాబాయిగారు సభాసదురాండ్ర కరతాళధ్వనులు చెలరేగ, తమస్థానము గైకొనిరి.

దైవప్రార్థనమైన పిదప శ్రీమతి శారదాంబగారు తమస్వాగతోపన్యాసములో ఈ సమాజమును గూర్చి కొంత ప్రసంగించుచు అందలి ముఖ్యోద్దేశ్యములు "భారత సోదరీమణుల పరస్పర స్నేహభావము పెంపొందింప జేయుట" యనియు వ్యాసరచనలు ఉపన్యాసములు, పలువిధములగు కుట్టుపనులు, చిత్రలేఖనముల ద్వారా వారి విజ్ఞానాభివృద్ధికి సాయపడుటయనియు దెల్పిరి.

తరువాత శ్రీమతి పండిటి సత్యవతీబాయిగారు స్త్రీలయొక్క యభివృద్ధి యను విషయమునుగూర్చియు శ్రీమతికోకిలాబాయిగారు స్త్రీస్వాతంత్ర్యమును గూర్చియుముచ్చటించిరి. శ్రీమతి కోకిలాబాయిగారు తాను మదాసుప్రాంతము నారయినప్పటికిని ఆంధ్రాభిమానముగలదానినని, ఆంధ్రస్త్రీలకై పాటుబడుచు, ఆంధ్ర స్త్రీవ్యక్తిత్వమును, స్వాతంత్ర్యము అత్యవసరమనియు. ప్రకృతిలోని సకలభూత కోటియును దైవికముగ స్త్రీపురుష భేదముండియు ఒక్కటే స్వాతంత్ర్యమనుభవించుచుండ మానవ స్త్రీలపాలిటి శృంఖలము తెలకోయని యక్కజమును దెల్పిరి.

శ్రీమతి సౌభాగ్యవతి, భక్తినిగూర్చి విపులముగ చర్చించి అయ్యది జాతిమత భేదములేక బ్రహ్మైక్య సంధానమునే కోరుచుం

డు సకలశిష్యులయూశయములనెరవేర్పక కలియుగములో సులభమార్గమనియు, భక్తులకు భగవంతుడెప్పుడు తోడునీడయనియు దెల్పుచు అందులకు తార్కాణముగా ప్రహ్లాద, తుకారాం, రామదాసు మొదలగు యుత్కృష్టచారిత్రముల నెత్తిచూపెను.

తుదపరి శ్రీమతి వేలూరి శారదాంబగారు

"సకలధర్మార్థముల దెల్పునత్వరంబు
సంఘసంస్కార ప్రియులుగానలుపు"

సంఘలాభముల గూర్చి తమచే రచియింపబడి మృదుమధుర శైలితో నొప్పు పద్యముల జదివి అందర నానందపారవశ్యుల జేసిరి.

డాక్టరు సుమిత్రాబాయిగారు తమ ఉపసంహారోపన్యాసములో స్త్రీ విద్యా ప్రాశస్త్యమును గూర్చియు, సంఘాభివృద్ధికి మార్గములు, జాత్యోన్నత్యము, ఆంధ్రాభ్యుదయము అందుల స్త్రీభాగము అను విషయములగూర్చి ఎక్కుడు విమర్శతోను యథార్థముతోను నుడివి తమ అసమాన్య ఆంధ్రదేశాభిమానమును భాషాభిమానమును వెల్లడించిరి.

వందనములతో సభముగిసినపిదప ఛాయాపటము గైకొనబడెను.



# ప్రణయలేఖ

చిరువోలు శేషగిరిరావుగారు

అరుణరుచి పశ్చిమాశాంతమందుమెఱయు
వేళ గైసేసి నీరాక వేచియుండ
పూర్వదిశ వేగుజుక్కదా బొటకరించు
వెల్లనగు మోము, గుండె గుభిల్లుమనును ॥

ఎల్లిరుజువిత్తు? నీమాట జెప్పుమనిన
నెపుడువత్తురో యన్ననిరీక్షసేత
నిదుర నెరుగని కన్నుల ముదుగు సెప్పు
వాడివత్తైన యీతనూవల్లిజెప్పు ॥

కప్పురపునంటిదొప్పలో గ్రాలుచున్న
కందిపోయినసుమమాల, కంటినీట
వాటు వడినట్టి విరిసెజ్జవాసిచెడ్డ
చందనము, మాటినడిగిన సాక్ష్యమిచ్చు ॥

సహజరక్తినివిడనాడి సౌరుదొరగి
పాండురద్యుతిధరియించి పాలిజాలి
గూర్చుచును జెక్కుటద్దముల్ గోడుబడ్డ
ప్రాణసఖిదెస సాక్ష్యమైబరగునాథ ॥

ఇంతవరకీల వచియింప నింతిపాటు
నెరిగికొనుమీద మీచిత్తమేమి సెప్ప
గలదో బ్రశ్నించియటుకేయ గర్జమనఘ
ధర్మమారసి యీమెను దనుపరండు ॥

ఔరా

గజ పాదఘట్టన బడినకూడ చెక్కుచెదరలేదు. సర్వావయముల చూర్ణములు చేయజాలు కొండత్రోపులాతనికి లక్ష్యములేకపోయెను. సకలభూత ప్రపంచకమును ఒక్క త్రుటిలో నాశనము చేసే విషముగూడ శీతలోదకమును త్రాగినభంగి యేమియు జేయలేక పోయెగదా! చివరకేమాయె? భగవంతుడు నారసింహరూపమున నాతనిని అనుగ్రహింపలేదా! ప్రహ్లాదుడు బాలుడే! ఇంతటి మహాభారమైన పరీక్షలగూడ దాటగల్గినది భక్తి మహిమ వల్లనేగాని, గారడీకాదు, మాయకాదు.

తుకారాం, రామదాసు మొదలగు మహాభక్తులుకూడ యీ భక్తిమార్గమువల్లనే కష్టముల నెదిర్చి మోక్షమును సాధించిరి గదా!

ఇక తుకారాం పండరిపురియందు, పండరీనాథునే మనసున గొల్చి, మహారాష్ట్ర... భార్యసేయు దుర్భాషల వంతకైన జూడక, మహారాజు శివాజి బంపు రత్నములు చీనిచీనాంబరములు మొదలగు కానుకలనైన త్రోసి, ఇంటిలో ఆహారమునకు గంజిలేక పిల్లలు నకనకలాడుచున్నను సరకుగొనక, అంతయు ఆ పాండురంగని లీలయేయని నమ్మి సేవించి స్వర్గమును జేరగల్గె ప్రఖ్యాతిపురుషుడు. రామదాసు భద్రాచలరాముని నమ్మి తనసర్వము ఆయనకే నైవేద్యము చేసి, అందులకై తనకెన్ని బాధలువచ్చినా రాముని దయయని తలంచుచు రామనామామృతపానము చేసి ముక్తిగాంచిన సంభావితుడు.

ఈ భక్తిమార్గ ప్రాశస్త్యమునకు గజరాజకథకూడ ప్రాముఖ్యముగు తా...

ఇక ఈభక్తియనగా నేమి? దీనిని సాధించు త్రోవయేది? యని ముచ్చటించవలయును,

భక్తికి సామాన్యార్థము హృదయమును కదలపరచిన సేవయని ప్రస్తుతయుగపు శాస్త్రవేత్తలు చిత్తమును బంధించి ఆధ్యాత్మికశక్తి నభివృద్ధి పరచినఅసాధ్య కార్యముల సాధ్యములుగా చేయవచ్చునని చెప్పుచున్నారు. కాని ఆమనసునే అధిభౌతిక వ్యాపారముల జైకొనకనీక భగవంతుని లయముత్తము చేయుటే భక్తిమార్గమునకు సరియైన నిర్వచనము. ఈభక్తి భగవంతుని కథలనువినుట, హరిభజనలతో కాలముగడుపుట, హరినామస్మరణము, నారాయణుని పాదసేవ, వందనము, దాస్యము, సఖ్యము, ఆత్మనివేదనము, అని తొమ్మిదివిధములుగా విభజింపబడియున్నది. ఇందేమార్గమునవలంబించినను ఒకటే [illegible]. సర్వకర్మపరిత్యాగము చేసికొని [illegible] పరీక్షిన్మహారాజు [illegible] కథలు వినిగడా ముక్తిగాంచినది. ఆకథా సంగ్రహమే నేడిప్పుడు భాగవతమనుపేర మోక్షసాధకముగా యున్నది. ఇట్టివియె తక్కిన విభాగములుకూడ యని నా మనవి. "మీరు నన్ను పిలచిన తక్షణమున మిమ్ముల సంసారసాగరమునుండి లేవనెత్తుదు"నని శ్రీకృష్ణ పరమాత్ముడే చెప్పుచున్నాడు. కావున ఈసులభమార్గమువల్ల మనకు యితరత్రా అందని ఫలములు దొరుకుచున్నవి.

ప్రతియొక్కరును తమవిశ్రాంతి సమయము [illegible] భాగ్యమును [illegible] భక్తి [illegible] యెంతటి లాభము [illegible] చూడండి. ఎంతలేసపనులు సాధ్యములు చేసికొనవచ్చునో ఆలోచించండి.

గ్రంథమును ఆరామభద్రుడే వ్రాసెనని చెప్పుచున్నాడు. భాగవతము సామాన్యులకర్థముగాని వేదాంత తత్వములలో నిండుకున్నను భక్తిరస ప్రాధాన్యము గనుకనే మనకు సులభగ్రాహ్యముగ గానుపించుచున్నది.

ఇక భగవదారాధనకెల్ల మంత్రమే ప్రధానమని మహాముని బిరుదాంకితులగు గణపతి శాస్త్రిగారు నుడివి యున్నారు. మంత్రములు తర్జుమాలో వాటికున్న ప్రాశస్త్యమును, శక్తిని గోల్పోవుచున్నవని వారి యాశయము. కాన వేదోక్తమంత్రములే మనదారిని సులభతమముగా జేయనోపును.

భక్తి మానవునకుండు యుత్తమగుణములలోనికెల్ల గొప్పదై, సన్మార్గమునకు ద్రిప్పజాలినది. స్వాపేక్ష లేక జేసిన త్యాగములు యీ భక్తివల్లనే. భక్తి బ్రహ్మైక్యమునకదోడు. ఇహమునగూడ ఐకమత్యమునకు సాయమగును.

పరలోక ప్రాప్తికి భగవంతునిమీద భక్తి యావశ్యకము. ఇహలోక కల్యాణమునకు, రాజభక్తి, మాతాపితరులపైభక్తి గురుభక్తి, స్త్రీలమగు మనకు పతిభక్తి, యున్నిటికిని మించిన దేశభక్తి, అవసరము. వీనిలో ఒకదానిపైన మరొకటి యాధారపడి యున్నవి. ఇహపరలోక సౌఖ్యములకు నివియన్నియు కారణములే. వీనిలో ఏది లోపించినను తక్కినవి అసంపూర్తియనిభా నానవశ్యకము. దానివల్ల కలుగు లాభము కూడ అంతంతమాత్రమే. దేశభక్తిలోను పైదగు దైవభక్తిలోను ఇవియన్నియు ఇమిడి యున్నవి.

భక్తికి ముఖ్యముగా మనోనిశ్చలత్వమావశ్యకము. ఈనిశ్చలత్వము సామాన్యముగా చిత్తశుద్ధ్యముమీద ఆధారపడి యుండును. హృదయనైర్మల్యమునకు [illegible] కాశములు నుంచి సత్సహవాసము, ఆహార నియమములు [illegible] స్మరణమే.

భక్తులు సర్వానుయుదినం [illegible] సత్ప్రవర్తనులై [illegible] యోగము చేతనె భజించి ముక్తిగాంచినది.

కొందరుపాసకులు రాధాకృష్ణుల సంబంధ బాంధవ్యములు వికారదృష్టితో సమన్వయింతురు గాని, ఆమెహృదయమందలి భక్తి, మురళీగాన వినోదియు నెమలి పింఛధారియు నగు బాలకృష్ణునే మనసున ధ్యానించుచు కాలముగడపి, కృష్ణుడు రుక్మిణీ సమేతుడై తనసన్నిధి సాక్షాత్కరించి తాను కృష్ణుడని చెప్పిన ఆమె నిరాకరించి తనకు బాలకృష్ణ స్వరూపమే కావలయునని భక్తి యుట్టిపడ నుడివినమాటలు విన్న అమెహృదయమును గానజాలకుందురా !

ప్రస్తుతము పాశ్చాత్యానుసరణము చేత రూపములుమారి కలుగుచున్నది కర్మవిపాకముచే నీచదశలో గుంగి గంధాంధులై శిలావస్థలో నున్న సంఘాభ్యుదయమునకును, స్వాతంత్ర్యము లేక, దాస్యబంధనంబున పరులమోచేతులక్రింద నీళ్లద్రావుచు, వ్యక్తిత్వమును గోల్పోయి ఆత్మాభివృద్ధికి సావుపదలేని జాత్యౌన్నత్యమునకును, స్వారాజ్య ప్రాప్తికిని, సర్వమయుడు, సర్వాంతర్యామి, సర్వేశ్వరుడు, నగు ఆ పరబ్రహ్మానుసంధానమునకును ఆభక్తియే ముఖ్యము.



# ఉపమాన తరంగిణి

## శ్రీరాజా మంత్రిప్రగడ భుజంగరాయకవిప్రణీతము.

---

మ॥ అరయఁగ బీజము లేక వృక్షము శాఖాముల్ మహింగల్గ వాం
తర సంకల్పము లేక కార్యములు నుత్పాదిల్ల వచ్చుంగి; న
వ్వర సంకల్పము పూచు పువ్వములుగావా? కార్యవర్గం బనం
తరసిద్ధ్యత్సుఖ దుఃఖముల్ ఫలములన్నం జెల్లవా? యెంతయున్

చ॥ శకటములాఁగు నెద్దునకుఁ జక్రము వెంబడి వచ్చునట్లుగా
సకలుష వృత్తులన్ శ్రమలు జయ్యన వెంబడి వచ్చుచుండుఁ; ద
క్కక ప్రతి మర్త్యునీడ వెనుకంజను దెంచుచు నుండు పోల్కిగా
నకలుష వృత్తులందుఁ దరచై యరుదెంచుఁ బ్రమోదమయ్యెడన్

చ॥ నరుని మనంబుతో నుపవనంబును బోల్పఁగవచ్చు; వోహాదం
బగుదుగఁ జెప్ప నేనియును భయంబును సత్ఫల మిచ్చుచుండు, ను
ర్వ్యరవర బీజముల్ నిలిపి ప్రాజ్ఞుఁడు సత్ఫలవృక్ష సంతతుల్
వెలుఁగఁగఁ జేయు రీతి వరవృత్తుల సత్ఫలముల్గనందగున్॥

గీ॥ పరమ నిర్దోషమైన సువర్ణమునకుఁ
గరగి శోధింపఁబని లేని కరణి, శుద్ధ
చిత్తుఁడగు మానవుని బాగుచేయ పొంచు
నాపదల ముంచి శోధింపఁ దవ్విభుండు.

ఉ॥ జారులు స్త్రీసుశీలమును సమ్మతి నమ్మరు, స్వార్థలంపటుల్
ధారుణి నెన్నఁడుం బ్రతిఫలంబులు లేని పరోపకారముల్
చేరిక విశ్వసింప,రటులే కలికండ్రు లోనర్పు ప్రేమ సం
పూరిత నీతి శోధనలఁ బుత్త్రుఁడు దీనులఁ బెట్టఁడటంచు రయున్॥

---

# ముద్దు

కాకాని నరసింహారావుగారు

ఉ॥ ఎట్టెటు సంభవించె, హృదయేశ్వరి నీతలిదండ్రి, కన్నుచే
పట్టుట కెట్టు లొప్పిరి? అభాగ్యపు దైవతపూని యుంటినా?
పుట్టిన నాటనుండి కడుమోహముతో నినుఁ బెంచియుండియు
పట్టున దూరమిచ్చుటకు మానస మొప్పునియా? సచింపుమా॥

మ॥ అని నాప్రేయసి ప్రచ్ఛసేసితి నిజాంకంబందు కూర్చుండియుం
డిన వేళన్ "బహుబాగిదే సరసమండీ చాలు చాలిట్లనన్
జనునే మీక"ని పొంగివచ్చు నగవున్ సాంతంబు రానీక మో
మును హస్తంబులఁ గప్పిపుచ్చుకఁ జనెన్ బూబోడి దూరంబుగన్

తే.గీ॥ తోడ, నేలేచి, నాచెలిఁ దోడితెచ్చి ప్రేమనొడిలోనఁ గూర్చుండఁబెట్టి - చేత
మోమునెత్తగ; గన్నులు మూసికొనియె సిగ్గుచనకుండ సతిపేడి, సిగ్గుమాలి"

చ॥ పలుకుల తేనెలుట్టిపడఁ బల్కవు నీవిది యేమి? వాలుగ
న్నుల నును సిగునూల్కనఁ గనుంగొనవేల? మదాంకపీఠిపై
గులుకుచు నుండకేటి కటుకోమలి దూరము లేచిపోతివా
పలుకులు విశ్వసింపు పగవాడనె నేను సరోజలోచనా॥

ఉ॥ మానిని వేపచింపు మను మానము వీడి, యకారణంబుగా
మానము నూననేలె? బ్రతిమాలుచు నున్నను మారుబల్కవే
లే? నినుబోలు పెంకిసతు లెక్కడ లేరని ముట్టవల్కినన్
ఆనలినాయ తాక్షికనులల్లన విచ్చివచించె ముద్దుగన్॥

తే.గీ॥ విస్తరించి చెప్పగనేల వినుము నాథ నిజము వచియింతు "మిమ్ముల నెమ్మనంబు
నందు చిత్రించి యొరులెల్ల నందుచేత అభవు కోరిక లిట్టులున్నందుచేత"

ఉ॥ పిన్నవయస్సునందు నినుఁ జెప్పెపె మెమ్మెమెయంచు వాగుచో
అన్నుల మిన్న చూచితి సహాయపు డెంతటి మాటనంటివి

వెన్నెట జాణవైతి, యిపుడెవ్వని నైనను బుట్టఁబెట్టవే
నిన్నుఁడఁగూర్చు కారణము నీమది కోరికలేఁ? నిజంబలేఁ?"

ఉ! అనపుడు వేఁటువడ్డ యురగాంగనయున్ బలె నేలవ్రాలినె,
మ్మానమున కోప దుఃఖములు మానిని నొక్కటఁ జుట్టుముట్టగా
కనుల వినూత్న కెంపురుచి గన్పడ "హా నుత సత్యమేయగున్
వనిత తనంత తావలచి వచ్చినఁ జుల్కనగాదె యేరికిన్.

సీ॥ ఎవ్వారలడుగని యీపిచ్చి ప్రశ్న నా నాథు డెందులకు నన్నడుగవలయు?
అడుగు లెదోసమా? అడిగినంతనె నేను తెలియరాదన కేల తెలుపవలయు?
తెలిపిన నేమాయె? తెలిపినంతనె తాను నామాట లేటికి నమ్మలేదు?
నమ్మకుండిన నేమి? నమ్మకుండినమానె తానేల నన్ను జుల్కనగ బలికె?

గీ! ప్రథమ దర్శనమందె నాప్రాణనాథు డిట్లు చుల్కన సేనె నింకెట్లు నమ్మ
ననుచుఁ గన్నీరు ధారలై చనుల జార పట్టజాలని పొలయుల్క బిట్టువగచె॥

ఉ॥ అకమలాయతాక్షి మనసెనంటిన కోపభరంబు దీర్పగా
నాకపుడే యుపాయము మనంబున గోచరించె రుమాలునున్
గైకొని యశ్రువుల్ దుడిచి "కాంత యిదేమిటి? నవ్వులాటలా?
లేక నిజంబు నాయెడఁ జెలీ! దోసమేమయినన్ ఘటిల్లెనా?"

తే.గీ॥ మారుబలకవదేమె? యో మాయలాడి! చేరిమాటాడవేమె? యో చిగురుబోడి!
మోము నెత్తవదేమె? యో పూవుబోడి! అల్కవిడనాడవేమె? యో కులుకులాడి!

తే.గీ॥ కొమ్మనంతటఁ గౌగిటఁ గ్రుచ్చియెత్తి అంక పీఠమ్మునన్ జేర్చియట్టె జూడ
మోమువాంచె— లేమనగవు మురువుసూపు పెదవు లంటంటఁ బిగియంగ
నదిమికొనియె"

చ॥ మనమరయుం దలంచియొక మార్గము వన్నితి నిక్కవంబు నీ
మనమున గిన్క మానుమని మానిని నాదట నెంత వేడినన్
చనవు వహింపకున్న బిగిచన్నవ నంటి ముఖాబ్జమున్ గరం
బున బుజుకెత్తి ముద్దిడితి పోసతి కివ్వన నవ్వె నవ్వుచున్.

తే.గీ॥ పలుకు పలుకున తేనియ లొలుకుచుండ చూపుచూపున వెన్నెల లేపుసూప
అల్క తెరవీడి చూపట్టె నలుకుబోడి సానబట్టిన మకరాంకు శస్త్రిమనగ॥

తే.గీ॥ అబల లలుకలు మాపు దివ్యౌషధంబు మగల సౌఖ్యాబ్ధి దేలించు మంచినావ
ముద్దుమాహాత్మ్యమింతని పొగడదరమె? ధాతకైనను ఆఫణి నేతకైన॥

# తేటి!

—: జగతి నీవంటి యుత్తమ సఖులు గలరె :—

స: దూరు శోభనాద్రిచార్యులుగారు

పద్మినీకాంత పత్రమ్ము పైనివ్రాలి
చుంబనముఁ జేసి తియ్యని సుధనుగ్రోలి
భావగీతమ్ము హాయిగాఁ బాడునట్టి
పాటనాకును నేర్పు షట్పదమ! కొంత
సుమపరాగ పీతాంబర సోయగంబు
నీకు నల్లమేనిపై నిండికొనుట
వంశమనులత పూవులవలనఁ గ్రోలుచు
లవని గోపాల కృష్ణుఁ డనటులఁదోచె
నిదియ బృందావనంబ హో భృంగరాయ!
నీదు చెక్కులు, నీపాట, నీవియద్ద
మనమునాకిమ్ము నాదు కవనము నాదు
పాట నీకొసఁగెద. నాదు వాఙ్మయప్రి
పంచ సౌకర్య మిసుమంత గాంచియున్న
నంబరారణ్య పూఁబోండ్ల యధరసుధను
ద్రావి దివ్యుల నర్తింపఁ దలఁచుకొన్న
విశ్వవ్యామోహన మొనర్చు విపుల మృదుల
గాన కవితామృతమ్ముచే మేనుమఱచి
ప్రేమ రసమున ముంచి సంప్రీతి నొసఁగు
కవిత — హర్షవిషాదము లలుగఁ జేసి,
దశవిధావస్థలొందించి నిక్కదగులఁ జేయు.
మఱియు - కవిలోకమున నుండు మనుజులేమి
సేయుఁ శ్రోతృకులదియుగా! సేయు! — నిట్టి
కవితకును నీదు పాటకుఁ గలదులంకె.
నాదు కవనమ్ము జ్ఞానమ్ము నాదుపాట
నీకొసంగెద. రా రమ్ము! నీదుపాట
నాకు నేర్పవె? షట్పద! నేర్చుకొనెద.

ఏమి — ? 'ఊఁ — అను' — ఊఁ - అనవేమి? 
ఓయి!
రమ్ము! దేవునిఁ జూపెదు భ్రమర! ఇదిగొ
మునుగ గేందుకొని రక్షించి మోహిమిచిన
శోకనడఁబాయ భక్తుల జన్మమునపు
సిరుపాడచిన మత్స్యమ్ము తీరు — కృష్ణుఁ
డతఁడుగా! 'అతఁడుగా!' — కృష్ణుఁడతఁడుగా —
అదియ యమున —
నీదు వేణువు నాకిమ్ము! నేనుఁ గృష్ణుఁ —
గాదు — నేరాధ — ఊఁ — హుఁ, నే కాదు
గాని,
నీదు పాటలు నాకింక నేర్పు — ఇదిగో!
ఈ శరీరంబు ప్రాణ మీ యింద్రియములు
ఆత్మసహితంబుగా నీకు నర్పితంబు.
రావె సర్వేశ్వరా! రమానాథ! మాధవ — !
నీదు మురళిని నాకిమ్ము నేనుఁగూడఁ
బాడుకొని నీదుమోవిలో వసతి గాంతు —
నీదు — సౌందర్యమధుల నిలుపుకొందు —
నీదు — సంగీతము చెవుల నింపుకొందు
నాదు తలఁపున వలపును నాటుకొందు.
నీదు పాటలు నాకింక నేర్పవలదు
నీదు చెక్కులును వలదు నీవియద్ద
మనము నాకేల — ? నాదు కవనము నాదు
పాట నీకుఁ గావలసెనా — ? పాడుకొనుము!
కవన మల్లుము ప్రకృతిని గనుము తేటి!
జగతి నీవంటి యుత్తము సఖులు గలరె?

# పురుషార్థములు

తాళ్ళూరి నారాయణరావు గారు

శరీరధారియగు ప్రతిమనుజుండు దనయందు శారీరధర్మంబులు గొన్నియు నాత్మసంబంధమగు లక్షణంబులు గొన్నియుఁ గలవని విశ్వసించుచున్నాడు. శరీరమును ధరించి వ్యవహరించువ దాత్మయనియు శరీర మాత్మకుఁ గార్యాచరణము నందొక పనిముట్టువలె నుపకరించుచున్నదనియు భావించుచున్నాఁడు. శరీరము జడమనియు నస్థిరమనియు, నాత్మసంయోగరహితమైనచో నే కార్యమును నిర్వహింపఁ జాలదనియుఁ బ్రపంచానుభవంబుగల యెల్లరకుఁ దెల్లంబె. నిర్గుణుండు, నిరాకారుండును, నిరంజనుండును నవ్యయుండునునగు నాత్మస్వరూపుఁడు నిజ మాయాసంజనితంబులగు, స్థూలసూక్ష్మ, కారణంబులను శరీర త్రయంబులఁ జిక్కి, వికారసహితుఁడై సగుణుండై, సర్వజ్ఞత్వాది లక్షణంబులఁ గోల్పడి, ధనేషణ, పుత్త్రేషణ, దారేషణ యను నీషణత్రయంబులకు వశుఁడై, నిజస్వరూపంబును మఱచి, శరీరమే తానను భ్రాంతి దగిలి, యింద్రియ కింకరుండై, పుడమి జరించుచున్నాఁడు. ఐహిక జీవితంబునందాతఁ డొనర్చు పుణ్యపాప ఫలంబులనుభవింపఁ జన్మపరంపరలఁ దగిలి, సుఖదుఃఖముల ననుభవించుచు, మరణవేదనలఁ బొందుచు, వివిధగర్భంబులఁ బరిభ్రమించుచున్నాఁడు. మాయాపరివృతుండై, నిజస్వరూపంబును మఱచి, యైహికవిషయ వాంఛాపరత్వంబునఁ గామ్యకర్మలొనర్చుచు వాని ఫలితంబు లనుభవింప జన్మపరంపరల మునిఁగి వేసరిలుచుఁ దరణోపాయంబుఁ గానక పరితపించు జీవునకు స్వస్వరూప సాక్షాత్కారంబు గల్గింప, నీ పురుషార్థము లుపకరించుచున్నవి.

పురుషునిచేఁ గోరఁబడునవియే పురుషార్థంబులు. రూపనామక్రియారహితుండగు నాత్మస్వరూపుఁడు, దన యఖండత్వాది గుణగణంబులఁ గోల్పడి, నిజమాయ శరీరత్రయంబులఁ దాల్చి, యింద్రియ కింకరుడై పుడమిఁ జరించుచు జీవుఁడను పేర వ్యవహరింపఁ బడుచున్నాఁడు. అట్టి జీవుండే పురుష నామంబునఁ బిలువఁ బడుచున్నాడు. కావున జీవుఁడర్థించునవియే పురుషార్థంబులు. ఈ జీవుఁ డర్థించు కోర్కెలు, శారీరకములు, మానసికములు ఆధ్యాత్మికములని త్రివిధములు. కర్మక్షేత్రమగు నీభూమండలమున జనించిన ప్రతిమనుజుండును, దొలుత శరీర పోషణమై కృషి సలుపవలసి యున్నాఁడు. పురుషుఁడొనర్చు కార్యము లన్నియుఁ దొలుత మనమునందు సంకల్పరూపముగ నుండి, క్రమక్రమముగ శరీర సంబంధమగు కార్యరూపముగఁ బరిణమించుచున్నవి. కావున శరీర మొనర్చు కర్మలన్నియు సక్రమరీతి జరుపఁబడవలయుననిన, శరీరమును నడపించు మనసుకూడఁ గ్రమమార్గంబున దినదినాభివృద్ధిఁ గాంచవలయును. మానసికముగ నెంతయభివృద్ధిఁ గాంచినను, కర్మాచ

రణమున కుపకరించు శరీర మెంత సౌష్ఠవంబుగ నుండినను, మనుజుని మేధాశక్తి యెంత గొప్పదిగనున్నను, నొకా నొకప్పు డతఁడొనర్చు కార్యంబులు నిష్ఫలంబులగు చున్నవి. ఎంతటి శక్తి సంపన్నుఁడైనను నతఁడు సర్వజ్ఞుండు కాఁడు. పురుషుఁడీ లోకమునఁ బురుష ప్రయత్నమంతయు నొనర్చి, కార్యాచరణమునందు విఫల మనోరథుండైన, విసిగి వేసటఁ జెంది, విరాగియై తన యల్పజ్ఞత్వాదిగుణ గణంబులఁ గుర్తెరుగుచున్నాఁడు. అప్పు డాతఁడు దన ప్రస్తుత స్థితి కంటె నున్నతస్థితి యొండుగలదనియుఁ దాని నెవ్విధి నైన దాఁ బొందవలయుననియు భావించి కృషిసలుపఁ గడంగుచున్నాఁడు. పురుషుఁడొనర్చు నిట్టి కృషియే యాధ్యాత్మిక కృషియనుపేరఁ బిలువఁ బడుచున్నది. త్రివిధములుగ నుండు నీకోరికలే పురుషార్థములు.

అనుభవజ్ఞులును మహనీయులును నగు ఋషిపుంగవులీ త్రివిధంబులగు పురుష వాంఛితంబులను ధర్మార్థకామ మోక్షంబులని చతుర్విధంబులుగ విభజించి యుండిరి. ఏయది స్థూలసూక్ష్మరూపముగ నుండు నీసృష్టికంతయు నాధారంబై యుండి, విచ్ఛిన్నముగాకుండ నిలిపి పోషించి, భరించుచున్నదో యదియే ధర్మంబు. సృష్టిస్థితిలయంబులకీధర్మంబె మూలము. ధర్మమనగా ధరించునదని భావము. శారీర, మానసికాభి వృద్ధికై చేయఁబడు వస్తుసంపాదనమే యర్థము. కామ మనగాఁ గోరిక. మాయాపరి వృతుండగు జీవుండజ్ఞుండై, శరీర బంధనంబునఁ జిక్కి, స్వాతంత్ర్యమును గోల్పడి, విషయ వాసనాపరుండై, నిజస్వరూప విజ్ఞాన రహితుండై, సుఖదుఃఖము లనుభవించుచు, జన్మపరంపరలఁ దిరుగాడుచు, వేసరిలి, ఐహిక విషయంబులరోసి, యింద్రియ నిగ్రహపరుండుగాక విరాగియై, చిత్త సంస్కారంబును బొంది, యాధ్యాత్మికచింతఁదగిలి, స్వయంకృషి మహాత్మ్యంబునను, జగదీశ్వరోపాసనా ప్రభావంబునను. విషయేంద్రియంబులజయించి, నిర్వికల్పుండై, సమాధినిష్ఠుండై స్వస్వరూప సాక్షాత్కారంబగు బ్రహ్మానందం బనుభవించుటయే, మోక్షంబను పేరఁ బరగుచున్నది, కర్మక్షేత్రంబగు నీభూమండలమున జనియించిన ప్రతి జీవుండును దనయైహికజీవితము సార్థకముగఁ బరిణమించ వలయుననిన, మోక్షమును సంపాదింపఁ బ్రయత్నింపవలయును పురుషుని యైహిక జీవితము ధర్మబద్ధమై యుండినగానిఁ సార్థకతఁ జెందదు. ధర్మమే తక్కిన మూడు పురుషార్థములకును మూలము. తక్కిన పురుషార్థ స్వరూపంబుల నిర్ణయించునది ధర్మంబె. ధర్మవిరుద్ధంబుగ నుండు పురుషుని జీవితము దుఃఖభాజనమై, నిష్ప్రయోజనంబై, యైహికాముష్మిక సుఖ రహితంబై, కృశించి నశించును.

ధర్మము శాశ్వతంబు. పరిణామరహితంబు ఆద్యంతరహితంబు. కావుననది సనాతనంబని వ్యవహరింపఁ బడుచున్నది. ఇట్టి సనాతనంబగు ధర్మంబునే తమ తమ మార్గంబుగ నిడుకొని, యార్యావర్తము నందలి తొల్లింటి ఋషిపుంగవు లందఱును నుపాసించుచు చుండెడివారు, సనాతన ధర్మంబె వారి మతము. ధర్మమునకు మించిన దైవము వారికిఁ గోచరించ లేదు. వారి మతంబున నీశ్వరుఁడు ధర్మస్వరూపుఁడే. భరత ఖండంబునఁ జరించిన తొల్లింటి మునిపుంగవు లందఱు సనాతన ధర్మము నుపాసించుటచే

తనే. భరత ఖండమునందలి మతము సనాతన ధర్మమను పేర వ్యవహరింపఁ బడుచున్నది. ఋషుల మతము క్రైస్తవ, బుద్ధ, మహమ్మదీయాది యన్యమతంబుల మాడ్కి- ప్రత్యేక వ్యక్తులపై నిలచి యుండలేదు. వ్యక్తిబోధనలపై నాధారపడియుండు మతంబులు స్థిరతరంబుగ నీభూలోకమున నుండఁజాలవు. వానికి వృద్ధి క్షీణతలు గలవు. ఆ యామతంబులు వానిఁ గనిపెట్టిన మహనీయుల నామంబుల చేతనే వ్యవహరింపఁబడుచున్నవి. భరత ఖండమునందలి మతమున కొక వ్యక్తితో సంబంధములేదు. అయ్యది సమస్త వ్యక్తుల కాధారమై, సమస్తలోకంబుల నడపించుచు, మూలధర్మమును నాధారముగఁ గల్గియున్నది. కావుననే సనాతన ధర్మంబునకు వృద్ధి క్షీణతలు లేవు. ప్రత్యేక వ్యక్తులపై నాధారపడియుండి తాత్కాలికాభివృద్ధిఁ గాంచిన మతము లెన్నియో, యీ భరతఖండమునఁ బ్రవేశించి, సామదాన భేద దండోపాయంబుల సనాతన ధర్మంబును రూపుమాప యత్నించెను. కాని యవి యెల్లను శిలాసంఘర్షణంబునఁ దుత్తునియలగు గాజుముక్కలవలె విచ్ఛిన్నంబులై, నిజస్వరూపంబును గోల్పడుచుండ సనాతన ధర్మమొకే విధమున స్థిరతరంబుగ నిలచి యున్నది.

ఈధర్మమే సృష్టియందలి ప్రతిపదార్థమును, శక్తిని శాసించి, నియమబద్ధముగఁ జేసి సృష్టివిధానంబును సక్రమ మార్గంబున నడపుచున్నది. సృష్టికర్తయను పేరఁ బిలువఁబడు నావిధాతకూడ ధర్మబద్ధుఁడె. ధర్మబద్ధుండగు విధాతచే విధింపఁబడిన శాసనంబులె సృష్టియందలి వివిధవస్తు స్వభావ లక్షణంబులుగ నేర్పడుచున్నవి. నానావిధవస్తు స్వభావ లక్షణంబు లావిధాత యాజ్ఞననుసరించి యే క్రమక్రమముఁబుగఁ బరిణామ భేదమును జెందుచున్నవి. సృష్టిస్వభావము. చరాచర పదార్థంబు లన్నియు నియమ బద్ధములై కాలము గడచిన కొలదియు తరుల తాదులు కాలమునందలి మార్పులంబట్టి చిగిర్చి పుష్పించి ఫల ప్రదంబులగు చున్నవి. నియమబద్ధంబులై చంద్ర సూర్యతారకాగణంబులు దివారాత్రములఁ గలుగఁజేసి లోకమును బ్రకాశింపఁజేయుచున్నవి. ఋతువులయందలి మార్పుల ననుసరించి, భూమ్యా పరిభాగంబున నుండు జలాశయంబులలోని నీరావిరి రూపంబుగమారిన భోభాగంబున కెగసి, నీరదరూపమును దాల్చి, శీతలవాయు సంస్పర్శనంబున వర్షరూపమున మరలఁ బుడమి కవతరించుచున్నది. నిర్మలంబై, మాధుర్య సహితంబై పశుపక్ష్యాది జంతుకోటికిని, భూగు హసంచయంబునకును నుపకరించుచున్నది. నియమబద్ధంబులై జరించు శుకపిక శారికాది శకుంత సంతాన మద్వితీయుండగు వసంతాగమన ప్రభావంబున నుత్సాహపూరితంబై కడుపారమేసి మదించి, లోకుల కానంద మొదవఁజేయఁ గర్ణము శ్రావ్యంబుగ మధురరుతం బొనర్చుచున్నది. లోకంబులెల్లఁ దృటిలో ముంచివేయు సామర్థ్యంబున నొప్పారు భీకర స్వరూపుఁడగు సముద్రుఁడు నియమబద్ధుడగుటచేతనే చెలియలి కట్ట నతిక్రమింపకున్నాఁడు. కాఁబట్టి యీ ప్రాపంచక వ్యవహారములన్నియు నొండొంటితో సంబంధము గల్గియుండి, జ్ఞాన స్వరూపుండగు నొక మహత్తరశక్తి సంపన్ను నిచే నడుపఁ బడుచున్న

వనియును, నిరాధారములై నియమ రహితములై, కార్యకారణ సంబంధ శూన్యములై తమంతట తాము గల్గి యంతరించుచుండ లేదనియును స్పష్టపడుచున్నది.

కర్షకుని ప్రయత్నంబున దరుబీజంబునందమరియుండు శక్తులన్నియు దినక్రమంబునఁ బరిణామ భేదంబు జెంది చెంది తుదకు శాఖాఫల పుష్పకిసలయ సమన్వితంబగు తరురాజంబుగ నలరారుచున్నవి. వటబీజమునందలి మహత్తర శక్తులబోలె, పుడమి జనించిన ప్రతి జంతువును సహజములగు కొన్ని శక్తులను గలిగియున్నది. ఆయా శక్తులును, గుణంబును, దొలుత సూక్ష్మరూపంబున నంతర్గర్భితంబులై యుండుటచే బాహాటంబుగ నెల్లరకుఁ దెలియరావు. కాని కాలముగడచినకొలదియు జంతువులు శారీరకాభివృద్ధిఁ గాంచుచుండును వాని యందుండు సహజగుణంబులును శక్తులును వయసుతోఁబాటు క్రమక్రమంబుగ వికసించి స్థూలరూపమును దాల్చును. అప్పుడవి యెల్లరకును గోచరంబగును మనుజుండును జంతుకోటిలోని వాఁడేయగుటఁ గాలక్రమంబున నట్టి మార్పునే చెందుచున్నాఁడు. పశుపక్ష్యాది జంతుకోటియందు గానవగు పరిణామ భేదంబునకును, జంతుకోటి కంతకును శిరోభూషణంబుగఁ బరిగణింపఁబడుచుండు మనుజునియందుఁ గానవగు పరిణామ భేదంబునకును విశేష తారతమ్యముండును. ఆహార విహార నిద్రాశయ్యాసన భోగంబులెల్ల జంతువులకును సామాన్య ధర్మంబులు కొట్టెదనన్న వెఱపును బెట్టెదనన్న నాసయు నెల్లజంతువులయందుఁ గానవగును. స్థూల శరీర వాంఛితంబులన్నియుఁ బసు ధర్మంబులగుటచే నెల్ల జంతువులకు సామాన్య లక్షణంబులై యున్నవి. క్రిమికీటకాది నానావిధ జంతుసంతానమేవిధంబుగ నాహార పానీయాదులందపేక్ష నిల్పి వాని బొందఁ గృషిసలుపుచున్నవో, నరుండును నదేవిధంబుగ వానిఁబొందఁ గృషిసలుపుచున్నాఁడు. తమను, దమకుటుంబమును నాప్తకోటిని బోషించుకొనఁ జేయఁబడు ప్రయత్నంబులెల్ల జంతువులయందును గానవగును.

పశుపక్ష్యాది జంతుకోటికుండు లక్షణంబులకంటెఁ బురుషునందుఁ గొన్నివిశేష లక్షణంబులు బొడసూపుచున్నవి. పశువులును, పక్షులును, క్రిమికీటకాదులును, స్వాతంత్ర్యమును గలిగియుండక, జగదీశ్వర దత్తంబులగు సహజగుణగణ ప్రేరితంబులై పుడమి జరించుచున్నవి. వానివాని క్షుత్పిపాసాదులఁ దత్తత్కాలానుగుణంబులగు నుద్రేకంబులఁజెంది, నియమబద్ధములై పొందఁగల్గుచున్నవి. పూర్వాపర సందర్భముల విచారించి, తమ క్షేమమునకనువగువిధంబున, దమకార్యవిధానంబును వర్తనంబును జక్కఁజేసుకొను సామర్థ్యంబు వానియందుఁ గన్పట్టదు. వానివానిఁ గాపాడు భారము సృష్టికర్తయగు విధాతయే వహించుచున్నాఁడు. కాని జంతువులయందుత్తముండగు నరునందా సామర్థ్యంబు మిక్కుటంబుగఁ గనుపడుచున్నది. అతఁడు దనప్రస్తుతస్థితిగతులఁ బట్టి భావపరిణామ మెట్లుండునో యూహించుకొనఁగలఁడు. తనజననమాదిగాఁ దనయందుఁగల్గుచుండు మార్పు నరయఁగలఁడు. కామార్థసిద్ధిఁబొందఁ దనవర్తనమును వలయుచో మార్చుకొనఁగలఁడు. యుక్తా

యుక్తములరయఁగలఁడు. కావున, పశుపక్ష్యాది జంతుకోటి యందుఁ గానరాని మహోత్తర లక్షణంబొండు పురుషునియందుండ వలయునని విశదమగుచున్నది.

అయ్యది జ్ఞానంబే. జ్ఞానరహితుండగు పురుషుఁడు పశుతుల్యుండు. జ్ఞానరహితంబులై పుడమి జరించు పశుపక్ష్యాదులు, దమతమ రక్షణకా సృష్టికర్తయగు పరమేష్ఠి నేనమ్మి, సహజగుణ ప్రేరితంబులై సృష్టిధర్మము ననుసరించవలసి యున్నది. జ్ఞానాధిక్యంబునఁ బ్రకాశించు మనుజుండట్లుగాక విధాతచేఁ గొంతవఱకు స్వాతంత్ర్యముగూడఁ బ్రసాదింపఁబడి యున్నాఁడు. ఇట్టిస్వాతంత్ర్యముండుటచేతనే మనుజుఁడు దనపరిస్థితపరిస్థితులఁబట్టి తనభావి పరిణామ మెట్టులుండునో యూహించి యనుసరమగుచోఁ దనకార్యవిధానంబును మార్గంబును మార్చుకొనఁగలుఁగుచున్నాఁడు. తనయొక్కయుఁ దన యాప్తులయొక్కయు శ్రేయస్సునుఁ గోరి నిరంతరకృషి సల్పఁగల్గుచున్నాఁడు. పురుషుఁడిట్లొనర్పఁగల్గుటకు జగదీశ్వరదత్తంబగు జ్ఞానంబె కారణంబు. తక్కిన జంతుసంతానమునకంటెఁ బరమేశ్వరప్రసాదితంబగు జ్ఞానంబతిశయంబుగఁ గల్గియుండుటచేఁ బురుషుఁడీ పుడమి నొనర్చవలసిన కర్తవ్యంబును కార్యభారంబును మిక్కుటంబగుచున్నది.

ఈశ్వర దత్తంబులగు జ్ఞానంబును, స్వాతంత్ర్యంబును, బురుషున కుపకారదాయకంబులుగఁగాని యపకారదాయకంబులుగఁగాని పరిణమించవచ్చును. దృష్టియందే పదార్థమును కేవలశుభ ప్రదంబుగ నుండఁజాలదు. అట్లనే యేపదార్థమును కేవలమశుభ ప్రదంబుగ నుండఁజాలదు. ప్రతిపదార్థంబునందును శుభాశుభ లక్షణంబులుగలవు. ఆయావస్తువుల ననుపయోగించు విధానముపై నాయావస్తువులిచ్చు ఫలస్వభావంబు నిలిచియున్నది. ఖడ్గము సత్పురుషుని చేతి నలంకరించిన దుష్టశిక్షణంబును శిష్టరక్షణంబును నొనర్చి లోకోపకారసంధాయకంబగుచున్నది. దుర్మార్గ వర్తనుని చేతి కెక్కిన సజ్జనుల నేధించి లోకకంటకంబగుచున్నది. కాంతివంతముగఁ బ్రకాశించు జ్యోతి యంధకారమును బాపి, వలయునుష్ణత నిచ్చి లోకోపకారియగుచున్నది. అదియే కరస్పర్శమొనర్చిన గరంబునుఁగాల్చి పీడాకరంబై వేధించుచున్నది. అట్లనే మధురంబుగనుండు శర్కరకొలఁదిగ గుడిచిన, రుచికరమై యాహ్లాదనంబుగనుండి శరీర పుష్టికినుపకరించుచున్నది, అదియే యమితముగ సేవించిన రోగకారణమై, విషతుల్యమై, వేదనాకరమగుచున్నది. మంచిచెడుగుల వచ్చు స్వభావము ప్రతివస్తువునందును గలదు. అందుచే నావస్తువు ప్రసక్తి కళంకమును నాపాదించరాదు. పురుషుఁ డేవస్తువునైనను దనమంచికొఱకుపయోగించుకొనవచ్చును. లేదా దానిని దనచెఱుపున కుపయోగించుకొనవచ్చును. దానిని సక్రమరీతి నుపయోగించుకొను భారము పురుషునిదే. కావున మనుజుఁడు దనకా పరమేశ్వరునిచేఁ బ్రసాదింపఁబడిన జ్ఞానంబును, స్వాతంత్ర్యంబును దనమంచికిఁగాని, చెడుగునకుఁగాని యుపయోగించుకొనవచ్చును. వానిని సద్వినియోగ మొనర్చిన నరుఁడు శారీరమానసికాధ్యాత్మికాభివృద్ధిఁగాంచి తన జీవితకాలమును సఫలపఱచుకొనును. దుర్వినియోగ మొన

ప్పిన నతఁడు బశుతుల్యుండై, కామాంధుం డై, విచక్షణా రహితుండై, పుడమిఁ జరించి. శారీర మానసిక దౌర్బల్యంబును జెంది, పతితుఁడై క్రమక్రమంబుగ క్షీణగతికి వచ్చు చున్నాఁడు.

జీవులకు దరుణోపాయంబగు నిష్కా మ్య కర్మంబొనర్ప నీభూలోకంబె తగిన స్థలంబు. కావున గర్మక్షేత్రంబగు నీభూ మండలంబున కవతరించిన ప్రతిజీవుండును, తనకర్తవ్యంబును గార్యభారంబును సక్ర మంబుగ గ్రహించి, యాత్మాభివృద్ధినిఁ గోరి, సత్కర్మాచరణం బొనర్చుచు, జీవయాత్రఁ గడపుటయే ప్రథమకర్తవ్యంబు. జ్ఞానంబును స్వాతంత్ర్యంబును బ్రసాదింపఁ బడినవాఁడు దనమంచిచెడుగులకుఁ దానే కారకుఁడగు చున్నాఁడు. స్వాతంత్ర్యముగాని, జ్ఞానము గాని లేని పశుపక్ష్యాది జంతువులు సృష్టి ధర్మముల నతిక్రమింపకుండ జీవయాత్రఁ గడుపఁగల్గుచున్నవి. కాని స్వతంత్రుఁడగు మనుజుండో శానేకప్పుడు దన యవివేకము చే సృష్టిధర్మములగూడ నతిక్రమించి, బుడ మిఁ జరించుచుఁ గాలక్రమంబునఁ దనసహజ లక్షణంబులఁ గొన్నిటిఁ గోల్పడి, విఫలమనో రథుండై, పశుపక్ష్యాది జంతుసంతానము కంటె నధమాధముఁడగుచున్నాఁడు. జ్ఞానం బును సక్రమరీతి నుపయోగింపక, సృష్టి నియమిత ధర్మముల నతిక్రమించి సత్తువ్యస నంబులఁ దగుల్కొని, క్షీణదశకు వచ్చుచుండు వ్యక్తులను మనమెందఱినిఁ జూచుచుండ లేదు. వారి శరీరములును, మనములును దుర్బ లయుతములై యవివేకమొనర్పవలసిన సామా న్యకార్యములకూడ నిర్వర్తింపఁ జాలకుండుట మన మనుదినమును గాంచుచుండ లేదా?

కావునఁ బ్రతిమానవుఁడును, నాత్మాభివృ ద్ధినిఁ గోరి, జాగరూకతగలవాఁడై జీవయాత్ర గడపుచు సక్రమమార్గంబున, స్వశరీరాభి వృద్ధికిని, మానసికాభివృద్ధికిని, నాధ్యాత్మి కాభివృద్ధికినిఁ గృషిసలుపఁగడంగవలయును.

ఆత్మాభివృద్ధికైఁ గృషిసలుపుట సుక రముగాదు. స్వకీయాభివృద్ధికై కృషిసలు పు నరున కనేక జన్మపరంపరలచేఁ గల్గుచు వచ్చిన పలువిధంబులగు వాసనలు ప్రతి యాటంకములఁ దలుగఁ జేయుచుండును. ఈవాసనలను నందమూలముగఁ గల్గు నాటంకములను బురుషుఁడు స్వయంకృషి బలంబునను, బరాత్పరోపాసనాప్రభావం బునను, నతిక్రమించి యాత్మాభివృద్ధిఁబొంద గల్గుచున్నాఁడు. పురుషుఁడు బద్ధకంకణుఁడై యాత్మాభివృద్ధికిఁ గృషిసలుపుచుండు సమ యమున నాతని కాటంకములఁ గలుగఁ జేయు వాసనాపరంపరల జయించు నొన ర్పుటకే. జితేంద్రియులును, నిశ్చలధ్యాన తత్పరులును, సమభవజ్ఞులును, పరోపకార సంధాయకులును నగు ఋషిపుంగవులు కొం దఱు ధర్మశాస్త్రములు రచించియున్నా రు. ఆత్మాభివృద్ధికై కృషిసలుపునప్పుడు తొలుత వారును మనవలెనే పలువిధంబులగు నాటంకముల ననుభవింపవలసి వచ్చెను. శాస్త్రచోదిత విధంబున మెలఁగి, నియమిత వర్తనులై, స్వయంకృషిచేతను, నీశ్వరాను గ్రహముచేతను, వానినుండి తప్పించుకొని, విమలజ్ఞాన సంపన్నులై, త్రికాలవేదులై, లోకులనుద్ధరింపఁ దమతమ యనుభవంబులఁ బట్టి వివిధశాస్త్రంబుల లిఖించియున్నారు. ఋషిపుంగవు లెల్లరు సృష్టిస్థితిలయంబుల కాధారమగు నా సనాతనధర్మస్వరూపమును

యుపాసించుచుండిరి. ప్రతిమునీంద్రుఁడును తన స్వానుభవంబునుబట్టి యాసనాతనధర్మ స్వరూపంబును దాని నుపాసించు విధానంబును నభివర్ణించియున్నాఁడు. అందువలననే మనదేశమున బాహ్యమునకు వేఱు వేఱుగఁ దోఁచు మతము లనేకములుగాన వచ్చుచున్నవి. కాని వాని నిజస్వరూపం బెఱుంగఁగోరి, నిష్కల్మష హృదయముతో విమర్శించిన వానికన్నిటికిని నాధారంబులగు ప్రధానమూల సూత్రంబులన్నియు నొక్క విధంబుగనుండి, సనాతన ధర్మస్వరూపం బెఱుంగ నవియన్నియు లోకులకుఁ దోడ్పడు చున్నవని మనము గ్రహింపఁగలుగు చున్నారము. ద్వైతాద్వైత విశిష్టాద్వైతాది షడ్మతములును, బాహ్యంబునకు చిన్న చిన్న రూపంబులతోఁ గాన్పించుచుండినను, ప్రధానసూత్రములం దిసుమంతయు భేదములేక, పురుషుని మానసికాధ్యాత్మిక శక్తుల వికసింపఁజేసి, విశ్వరూపుండగు నాసనాతన పురుషుని నెఱుంగుటకే తోడ్పడుచున్నది.

ప్రతిమనుజునియందుఁను బుట్టుకచే నొన్ని గుణంబులును, శక్తులును నంతర్గర్భితంబులైయున్నవనియును, వానినిఁ క్రమక్రమంబుగ వికసింపఁజేయుటయే, యైహిక జీవితోద్దేశ్యమనియును మనమిదివఱలోఁ గమనించి యున్నారము. సహజంబులును పురుషుని యందిమిడియుంచినవియునగు గుణగణంబుల వికసింపఁజేయుటయే యభివృద్ధియను పేరున వ్యవహరింపఁబడుచున్నది. ప్రపంచమునందలి విద్యలన్నియు నిందులకే యుద్దేశింపఁబడినవి. అందులకే యుపకరించు చున్నవి. ఐహికవిద్యలన్నియును శరీరపోషణంబునకును, నింద్రియసౌఖ్యంబులఁ దనుఁ జెందుటకును వందులకువలయు పదార్థసంపాదనమునకును, ధనార్జనంబునకును నుపకరించుచున్నవి. అట్టివిద్యలే లోకులమనంబుల మిక్కుటంబుగ నాకర్షించి, శారీర కాంక్షితంబుల దీర్చుకొనుటకు వలయువస్తు సంపాదనా సామర్థ్యంబును బ్రసాదించుచున్నవి. శరీరపటుత్వ ముండునంతవరకును నింద్రియ వాంఛలఁ దృప్తిపఱుపఁగల వస్తు సంచయము సమకూడుచుండు నంతవరకును బురుషుని మనమాధ్యాత్మికవిద్యకై మరలదు. ఇంద్రియలోలుఁడై చరించు మనుజున కాధ్యాత్మికవిద్య నభ్యసించుట గడుంగడు కష్టసాధ్యము. ఆధ్యాత్మికవిద్య యింద్రియలోలత్వంబును నిరసించెను. ఇంద్రియ కింకరుఁడై చరించి పలువిధవాసనలచేఁ బీడింపఁబడు మనుజుండు దనమనంబును సులభంబుగ నాధ్యాత్మిక విషయంబులకు మరల్పఁజాలఁడు. కాని పురుషుని యభివృద్ధి కైహిక విద్య లెట్లగత్యములో యాధ్యాత్మిక విద్యలును నట్లే యనుసరములై యున్నవి. ఏలయనఁ బురుషునియభివృద్ధి సర్వతోముఖమైయుండవలయును. కాని పాక్షికముగ నుండరాదు. అభివృద్ధిపాక్షికముగ నుండిన నది పురుషునిజీవితమును సార్థకమొనర్పను. కేవల శారీరాభివృద్ధిగాని, కేవల మానసికాభివృద్ధిగాని, కేవలాధ్యాత్మికాభివృద్ధిగాని, పురుషున కుపకారదాయకముగాదు.

పురుషుని యైహికాధ్యాత్మిక జీవితంబుల కుపకరించు విద్యలును, దజ్జనితంబులగు నభివృద్ధులును, వతఁను స్వేచ్ఛాపూరితంబు [illegible]డమున లభింపఁజాలవు. సమగ్రముగా నభివృద్ధిఁ గాంచవలయు ననిన బురుషుని స్వాతంత్ర్యము గొంతవఱకు [illegible] బడవల

యును. ఆతని జీవితవర్తనము నియమబద్ధమై యుండవలయును. కానిచో నతఁడొనర్చు ప్రయత్నంబులన్నియు వివిధవిషయవ్యాసంగమును జెంది తుదకు నిరర్థకంబులుగఁ బరిణమింపవచ్చును. భయాభయంబులెఱుంగక జ్ఞానరహితుండగు బాలకుని స్వేచ్ఛనరికట్టి తల్లిదండ్రులు జాగరూకతతో గాపాడ కిచ్చవచ్చిన తెఱంగునఁ బోనిచ్చినచో, నాతఁడే నూతియందో, గోతియందో పడి మిడియుటగల్గుచున్నది. పర్వతాగ్రముల బడు వర్షజలము దొలుత సెలయేరులుగఁ బాఱిపాఱి, నిర్మల మధుర జలపూరితంబగు మహానదియై, తగు ప్రదేశంబున నరికట్టఁ బడనిచో, నతిరయంబున సాగరంబునుజేరి, పసుపక్ష్యాది జంతుకోటికిని, భూమానసమూహంబునకును నుపకరించక నిరర్థకంబగుచున్నది. ఆమహానదీ ప్రవాహంబే, సక్రమమాగు ప్రదేశమున నరికట్టఁబడి [illegible] షఁ బడుటచే, నిరర్థకంబుగ సాగరముఁ బ్రవేశింపక, కాలువలమూలమున దేశముసందలి వివిధభాగంబులకుఁ గొనిపోఁబడి, విశేషకాలముండి, పైరు పంటలకును [illegible] సంతానమునకును, మనుష్యకోటికిని, ను[illegible] కార సాధనమగుచున్నది. [illegible] భ [illegible] ము వాని స్వేచ్ఛ నరికట్టి [illegible] ట్టములో [illegible] మహాత్మ [illegible] వంబును [illegible] మాగుచున్నది. [illegible] చి [illegible] ఘ [illegible] బడి, కాలక్రమంబున [illegible] లోబడి, తన శరీరబలంబు నిరర్థకము [illegible] లోకోపకారార్థమై వినియోగింపఁ [illegible] న్నది. (సశేషము)

---

# ఆరామగేయము

తిపిర్నేని వెంకటసుబ్బయ్యగారు (వనకసిమంపలి)

కుసుమనికురంబహాసితంపుగొనబుహాయల
మించు సుమనోరజంబు నిమ్మేన నలది
బంభరశ్రేణి వేణిగా బాదుకొలిపి
శ్యామ సామ్రాజ్య కళ్యాణ కాంతిగనెదు
శాఖ పల్లవ స్ఫురలయ సామ్య మొదవ
నీలకంఠ మహోత్సవ నృత్యసరణి
కోకిలా రావగాన సుఖోన్నతంపు
పుష్పరస సుధావృష్టిమై బొందిగనెదు
ఆత్మభవ రహస్యధ్యానము ననుసరింప
శుభగ శుకవాక్సుధఘూతి సొంపుదనరి
రాజహంసోపదిష్ట రహస్యముగతి
యోగులు భోగులు సూహించి [illegible]
తావకప్రేమ సంభృతి ధన్యజీవని
మలయ పవనుని నీతుల నలయఁ జేసి
యుల్లములర నాసనల్ వెల్లిగొలిపి
పుష్పమాలలఁ గ్రీడలు [illegible] సేయు
ప్రకృతి విద్యాప్రసాద సౌభాగ్యభాసివగుచు
నీ మనోహర ఫలసు మనోమరంద
చవిని గ్రోలెడి సరసాళి కవుల కెలమి
జగతి నారామ సీమవిశ్రాంతి నరపు.

పుష్పమాల.



Lakshmi Art Bombay, 8.



# పూజాప్రబంధము.



( మేడేపల్లి వెంకటరమణాచార్యులుగారు )

---

ఉ॥ శ్రీయురమందునన్ దమదరత్రి దయారసమందు నీళయున్
జేయు సపర్య దోహదతఁ జెంది కడింది యొనర్పఁ బోలు లే
కీయుర మీక్షమాగుణము నీదయయు న్వడఁగొట్ట నెట్టులం
జేయ కలంకు శేషశిఖరీశ్వరు నెంతయు గొల్చెదన్॥

ఉ॥ శ్రీయొద భూమినీళలిరుజెంపల గేల్గవ శంఖచక్రముల్
బాయక వెల్గభక్తుల కపాయము బాపెడు హస్తముద్రితో
గాయజుఁ గన్న సోయగపు కాయముతో బడసూపి వేడ్కఁ జే
సేయు సపర్యఁ జెంద దయసేయఁగదే వృషశైలనాయకా॥

చ॥ బలిశిరమెక్కె నెయ్యది సభన్నలికేగిన దెద్ది యీ మహా
స్థలి వసిఁ గొల్చె నెయ్యది పదత్రితయంబది గాంచి వేడ్కఁ త
మ్ములనుచు గ్రమ్ము తుమ్మెదల ముమ్మరిమాన్పగ జాలచంపక
మ్ముల నాలపాద్య పీఠియది మోదిల్లఁ గేలుపకంబులుంచనే॥

ఉ॥ తీరని ప్రేమ సూరులనుతించిన సాలెనమున్ శ్రీమూర్తులుం
జేరి సమష్టినీదగు విశిష్ట శుభాశ్రియమందమంగి యు
న్నారిది సేనెఱుంగుదు ననాది భవాంబుధి నీదులాడి వే
సారితి జాలు నీదుపద సారసముల్ శరణంతు నిల్వవే॥

ఉ॥ గంటగణాంగణ మ్మొరయ గావిపి భీతిలి భూతజాతి వె
న్వెంటన దిక్కులం బడవ వేలకొలంది విమానపంక్తులన్
మింట సురాప్సరల్ నిలిచి మెల్లన పుష్పములన్ జల్లఁ జొచ్చి దిం
డొంటిగ నిన్నుపీఠ మదినోర్వక వచ్చిరి సర్వపార్షదుల్॥

చ॥ పడగలువిప్పి ఛత్రముగబట్టె ననంతుఁడు వైనతేయుఁడీ
యడుగుల వీపునందిడి రయంబున దెచ్చె గదాసిచక్రముల్
సడలని ప్రేమ పాదుకలు సైన్యవిభుండును వెంటవచ్చె ర
క్కడ మణిమంటపంబునకు కానవరింక నెఱుంగ రాదుగా॥

ఉ॥ స్వాగతమే సరోరుహకరా వనినీళల తోడనీకు సు
స్వాగతమిందు దేవ రిపుచక్రిని రమ్మున వెల్గి నిల్వుమా
స్వాగతమాయనంత వినతాత్మజ పాదుకదులారరంము సు
స్వాగతమాసనంబులివి సమ్మతినిల్వుడు పూజలిచ్చెదన్॥

ఉ॥ సుస్వరమొప్ప వేదములు సూరులు నల్గడలం బఠింప స
త్స్వరమాధురీ నాగతుల తాళలయశ్రుతి మేళనాప్తిను
ద్వ్యస్వన యుక్తితూర్యములు సందడి మ్రోయగ నేను సేయు స
ర్వస్వ సరస్వతీ ప్రియ సపర్యను గైకొనవయ్య వేడ్కదన్॥

ఉ॥ బంగరుబట్టతో పసుపుపట్టిన గన్నడదంముగట్టితో
మంగితమే నీకుం గడు సహీనతఁ జూచ భవద్ప్రియాంగనా
లింగనసంగ దాసితము లెమ్మిక బొంకులవేల బైసిదీ
యంగలడంచు సుగ్గకు భయంపడితైనను బీరనిల్వమా॥

ఉ॥ రంగగు గాంగపద్మ మకరందమున స్పవదంఘ్రి నుండి
రంగనజుండు భక్తి దనరంగగ మండలు వొగ్గిపట్టె సా
రంగధరుండు నిమ్నకుహార స్ఫురదగ్రికకుదన్ వాసిగా
రంగముబట్టె వేధకుధరా మును పాద్యమొసంగు నర్యోదన్॥

చ॥ గొడుగుపలాశదండమును గోచియు జాత్రియుగూడ కట్టుగు
జోడలు మృగాజినంబు శిఖలొప్పగ మౌంజిమొలం జెలంగదం
డుపుకుతనంబు సన్నడయు దోబ్రిపడన్వడి యజ్ఞవాటిరా
నడరిననిన్నుగాంచి వటుడంచు జలింద్రుడు మోసపోయెగా

క॥ వడుగువయివచ్చి బలిగని కడుసొగసున నతని మనసు గరగించి యతం
డడుగుమనిన నడిగినది మూడడుగుల ధరయాక్రమించినది ముజ్జగముల్

క॥ బలితలను పదజలజమిడి యలయతలంబతనికిచ్చి తటమున్నిపుడీ
బలితలను పదజలజమిడి యలయతలంబిమ్ము వామనాంగుడ విభుడున్॥

చ॥ తరళ విభాతరంగముల దత్తరమొందెడు జూడుమయ్య నీ
చరణము లెందొ బాడలచె సాగనీకటు సేయు వేని నా
పరుసపునోరు దూరిడక పాయదపాయము సుమ్ము నమ్ముమీ
తిరిగెడు కాలు దాదిరుగ దిట్టము నోరెటు లూరకుండెడిన్

చ॥ జలియుడు దానధారమును బట్టిన కేలలకాళి యస్ఫుటా
నళిని నటించుచో నోడిసి వాలను బట్టిన కేలు నంతిమూం
గుళినలవమన్ వారణకు గొండను నిల్పిన కేలు సర్కజా
జలముల వేరిత చుస్తనల జల్లిన కేలిను మొక్కుబిచ్చెదన్॥

ఉ॥ పంటులనున్న వెన్న వెగ బ్రాకిదివంగని నక్కన గొల్లవా
లంటులు వెంటబెట్ట జెలికాండ్రను నీవును వేగరి బాలతో
నంటకయొందొ డాగి పయినంటిన వెన్నను వాకిలొన్న నీ
తుంటతిచైది తెల్లముగ గోడను కెల్లవనుంచు మిచ్చెదన్

ఉ॥ ఆచమనమ్ము గొమ్ము నిఖిలామరవందిత పాదపద్మ నీ
లాచల సింహభూధర వనాచల విష్ణురథాచలాదినా
నాచల కేళి కౌతుకములన్నియు నొక్కెడ జూపగోరి శే
షాచలమందు నవ్వలసినట్టి పరాత్మ దురాత్మ భంజనా

చ॥ రవిగల దీప్తి చందురుని రమ్యతరక్కల లెక్కలేమియు
దివిగలమేర లేమి జలధింగల పూర్తియు నీకు నివిలో
లవములుగాగ యోగులు దలంతురగాధమనోజ్ఞ నీవు క
స్తనకిటు విందు సేయుటను గంటి నదెల్లను నిక్కవంబుగన్।

ఉ॥ కృష్ణుడవై జనించి పటికీర్ణ వనావళి వత్సధేను వ
ర్ధిష్ణుడవై చరించు శ్రీమతీరసుమీ జడియుంగ బోకు హా
ర్త్రష్ణముగాచి పైపడి యదర్చితి నావిరివచ్చుగాని మం
దోష్ణములీ సరస్వతి శుభోదకముల్ కృపగొమ్ము పాద్యమున్॥

మఱికొందఱు:- ఈపైవారి వాదనకు కేవలము సోమరితనమే కారణము, ప్రాచీన కవులు పాలించిన నియమముల గౌరవించి కవిత్వము వ్రాయుట కష్టతరమా?- అగునని తలంచువార లీదోషభూయిష్టమగు రచనను- కవిత్వమును- విరుపుసొమ్ముల తెలుఁగునకుఁ దెచ్చిపెట్టుకొని/ఎట్టులో వ్రాయకున్న జగము తలక్రిందగునా? అనియందురు.

మొదటివారిలో నొకరు- మత్తేభమును వ్రాయుచు, మధ్యనొక శార్దూల పాదమును వ్రాసినా దొకక్రొత్త పద్ధతి యందురు. ఇంకొకరు గీతపద్యమును వ్రాయుచు నందులోని యింద్రగణములకు బ్రత్యామ్నాయంబుగ- మ, య, సగ, జ, గణములు వేసి "నాదొక క్రొత్త పద్ధతి నేనీ నియమములకు దాస్యము చేయఁజాలను" అందరు. మఱియొకరు-అన్య భాషా పదంబులకు మనభాషలో సరియైన పదములు లేవు కనుక నేనా భాషా పదంబులనే యుపయోగింతును ఇందుకు నేనే ఒకమార్గదర్శకుడ నయ్యెదను. అందురు. కారణమడిగిన "The english is my medium of thinking" అందురు పైగా "Tere is an age coming" to appreciate our Poetry అని [illegible]లాడుదురు. మొదటి పెద్దమనుష్యుని "పద్ధతి"కి కారణము శుద్ధమగు నశ్రద్ధయే.

రెండవ పెద్దమనుష్యుని "ఫక్కి"కి కారణము లక్షణజ్ఞాన శూన్యత్వమే.

ఇఁక మూడవ పెద్దమనుష్యుని దారి కేవలము గోదావరిలోనికే.

ఏపాటలను గురించి ఏయవాచ్యము లగు నియమ భంగములఁగుఱించి మనవారు- అనగా నియమభంగవాదులు- "There is an age coming to appreciate our poetry" అనుచున్నారో అట్టివానికి మనపూర్వుల వాఙ్మయమున స్థానమీయక వదలివేయుటకును, నేఁడుమాత్రము బలమైన ప్రచారము కలుగుటకును బలమైన కారణము కలదా? పూర్వము లేని ముద్రణాయంత్రములు నేడు విచ్చలవిడిగ వ్రాయుట చే[illegible]నైన నచ్చువేయించుకొనుట కవకాశము కలుగుటయే యను కారణమొక్కటియే నా?

పోనీ-యున్నింటిని మనము "త్రోసిరాజ"ని క్రొత్తపద్ధతు లేర్పాటుచేసిన మన తరువాత వారుమాత్రము మనపద్ధతులను మన్నింతురా? వారుమఱల క్రొత్తనియమము లేర్పరింతురు. ఇట్లే ఎవరికివారే యైన రెండు మూడు శతాబ్దములలో భారత కవిత్వము తెలుగుకాదనియు అయ్యది "ప్రాచీన" మనియు ననువు కొందరు ఇట్టి "ప్రాచీనముల"ను వారివారి క్రొత్తపద్ధతుల మార్పులనుబట్టి అర్థము చేసికొనుటకూడ దుర్ఘటముగనుండును. అప్పుడిట్టి "ప్రాచీనముల" కేమిగతి పట్టునో యోజింపుడు. ఈ నియమోల్లంఘనమును, ఈఅన్యభాషా దాస్యమును, చేయకయే యుండవలెఁగాని చేసినచో అది- నొకరొకత్రోవ- యింకొకరొక త్రోవ. చెట్టునకొక పిట్టయై పోవుట తప్పక సంభవించును. అప్పుడు ఒకసంఘము ఒక భాష- ఒక కవిత్వము అన్న విషయములు పూర్తిగా విస్మరింపబడును.

ఇది రాబోవున్న ప్రళయము. యా-దవ కులమునకు ముసలము పుట్టనున్నది.

